# మహాప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం మహితోక్తులు - 1

[ తెలుగు ]

# لو لو ول مرجان - 1

[اللغة التلغو]


రబువ జాలియాత్

الجاليات بالربوة

ముహమ్మద్ ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ

محمد فواد عبدالباقي

అనువాదం : - అబుల్ ఇర్ఫాన్

ترجمة: - عبل إرفان

పునర్వ్యమర్శ : ముహమ్మద్ కరీముల్లాహ్

مراجعة: محمد كريم الله



రబువ జాలియాత్ - రియాద్

المكتب التعاوني للدعوة وتوعية الجاليات بالربوة بمدينة الرياض

2009 –1430

islamhouse.com

# మహాప్రవక్త
(సల్లల్లాహు అలైహి వ సల్లం)
# మహితోక్తులు

సంకలనం

**ముహమ్మద్ ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ**

తెలుగు అనువాదం

**అబుల్ ఇర్ఫాన్**




**అల్ హఖ్ తెలుగు పబ్లికేషన్స్**

**హైదరాబాద్**

# AL-LOOLU WAL MARJAN
(Mahapravakta(s) Mahitoktulu)

First Edition 1998
Copies 2000
**Price Rs. 120/-**



*Compiled by :*
**Muhammed Favvad Abdul Baaqui**

*Urdu Translator :*
**Syed Shabbir Ahmed**

*Telugu Translator:*
**Abul Irfan**

*Printed by :*
**OM SAI GRAPHICS**
3-4-709, Narayanguda,
HYDERABAD-27.
Phone: 7560543

*Published by :*
**AL HUQ TELUGU PUBLICATIONS**
Inside Eidgah Ujalesha
Akbar bagh, Sayeedabad,
HYDERABAD-500 059 A.P.
**Phone: 4521582**

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# తొలి పలుకులు

"దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) మీకు ఏది ఇచ్చినా దాన్ని (సంతోషంతో) పుచ్చుకోండి. మరే విషయం నుండి ఆయన వారించినా దానికి దూరంగా ఉండండి."

[దివ్యఖుర్ఆన్ - 59:7]

ఇస్లాం ధర్మానికి ఖుర్ఆన్, హదీసులు మూలాధారాలు, ఖుర్ఆన్ దైవ గ్రంథమయితే, అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) నోట వెలువడిన అమూల్యమైన ప్రవచనాలు, ఆయన ద్వారా నెలకొల్పబడిన ఆదర్శాలే హదీసులు. ఖుర్ఆన్ సిద్ధాంతమైతే హదీసు దానికి క్రియాత్మక వ్యాఖ్యానం లాంటింది.

అంతిమ దైవప్రవక్త (సల్లం) ఏదేని విషయమై మానవతకు మార్గదర్శకత్వం వహించేటప్పుడు తన మనోవాంఛల కనుగుణంగా మసలుకోరు. ఆయన ఏది చెప్పినా, ఏది చేసినా అది దైవ సంకేతానికి లోబడి ఉంటుంది. కనుక సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను, ఉచితానుచితాలను పరికించే సమయంలో మనం ఖుర్ఆన్ మరియు హదీసులనే ప్రమాణంగా తీసుకోవాలి. ఇదే ముమ్మాటికీ సరైన విధానం. ఖుర్ఆన్‌లోని విషయాల లోతుల్లోకి పోవడానికి వ్యాఖ్యాతలు, విద్వాంసులు హదీసులను శోధిస్తారు. ప్రవక్త మహనీయుని (స అసం) సమగ్ర జీవితంలోని కోణాలన్నింటినీ తరచి చూస్తారు.

అటువంటి అమూల్యమైన హదీసుల సంకలనమే మీ ముందున్న ఈ గ్రంథం. ప్రఖ్యాత విద్వాంసులు ముహమ్మద్ ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ (రహ్మలై) అరబీలో సంకలనం చేసిన ఈ గ్రంథం "అల్ లూలూ వల్ మర్జాన్" పేరుతో ఇస్లామిక్ బుక్ పబ్లిషర్స్ (కువైట్) తరఫున ప్రచురితమయ్యింది. అనంతరం 1983లో లాహోర్ (పాకిస్తాన్)కు చెందిన అల్ బదర్ పబ్లికేషన్స్ వారు దీని ఉర్దూ అనువాదాన్ని ప్రచురించారు. ఈ ఉర్దూ అనువాదం ఆధారంగానే మిత్రులు అబ్దుల్ ఇర్ఫాన్‌గారు 'మహాప్రవక్త(స) మహితోక్తులు" అన్న పేరుతో దీని మొదటి భాగాన్ని తెనుగీకరించారు. అనువాదం వ్యవహారశైలిలో, హృదయాన్ని ఆకట్టుకునేలా సాగిందన్న విషయాన్ని మీరే గ్రహిస్తారు.

ఎంతో విలువైన ఈ కృతిని తెలుగు పాఠకలోకానికి అందజేస్తున్నందుకు మాకెంతో ఆనందంగా ఉంది. కారుణ్య ప్రభువు ఈ కృషిని స్వీకరించుగాక! తెలుగు ప్రచురణకు సంతోషంతో అనుమతించిన ఇస్లామిక్ బుక్ పబ్లిషర్స్ (కువైట్) వారికి, ఈ మహత్తర కార్యానికి తోడ్పాటు నందించిన కరీం ఇర్ఫాన్ మిత్రవర్గానికి, ఉర్దూ అనువాదకులు సయ్యిద్ షబ్బీర్ అహ్మద్ గార్కి, తెలుగు అనువాదకులు అబుల్ ఇర్ఫాన్ గార్కి నిండు హృదయంతో కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

ఇంత గొప్ప హదీసు గ్రంథాన్ని ప్రచురించే అవకాశం 'అల్ హఖ్ తెలుగు పబ్లికేషన్స్'కు లభించటం కేవలం దైవకృప మాత్రమే. దైవచిత్తమయితే వీలయినంత త్వరలో దీని రెండవ భాగాన్ని కూడా మీకు అందించగలము.

**-ముహమ్మద్ తఖీయుద్దీన్**

ప్రెసిడెంట్ , అల్‌హఖ్ తెలుగు పబ్లికేషన్స్

హైదరాబాదు

# శుభాకాంక్షలు

అల్ హఖ్ తెలుగు పబ్లికేషన్స్ (హైదరాబాదు) వారు నేను ఉర్దూలో అనువదించిన 'అల్ లూలూ వల్ మర్జాన్' (ముత్యాలు, పగడాలు) ఉద్గ్రంథాన్ని తెలుగులో ప్రచురించాలని సంకల్పించుకున్నారనీ, ఈ సంకల్పానికి నా స్నేహితులు ఎం.ఎ. కరీం ఇర్ఫాన్ ప్రేరణగా నిలిచారనీ తెలుసుకున్నప్పుడు నాకు కలిగిన సంతోషానికి అంతులేదు. ఈ సత్కార్యానికి అండగా నిలిచిన కరీం ఇర్ఫాన్ గార్కి, వారి మిత్ర బృందానికి శుభాకాంక్షలు అందజేస్తున్నాను. వారి ఈ కృషిని పరమ ప్రభువైన అల్లాహ్ సమ్మతించి ఆమోదించాలని ప్రార్థిస్తున్నాను.

తెలుగునాట ఇదొక విశిష్టమైన గ్రంథంగా గుర్తింపు పొందగలదనీ, దీని ద్వారా తెలుగు పాఠకులు అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వారి ప్రబోధనలలోని మధురిమను ఆస్వాదించి తాదాత్మ్యం చెందగలరన్న గట్టి నమ్మకం నాకుంది. మహాప్రవక్త (స) సంప్రదాయాన్ని ప్రజా బాహుళ్యంలో ప్రవేశపెట్టే గురుతర బాధ్యతను గుర్తెరిగి తెలుగు భాషలో ఈ పుస్తక ప్రచురణకు ఉపక్రమించిన 'అల్ హఖ్ తెలుగు పబ్లికేషన్స్' సంస్థ వారికి శుభాభివందనలు! అల్లాహ్ ఈ ప్రయత్నంలో సమృద్ధిని ప్రసాదించుగాక!! (ఆమీన్)

**- సయ్యద్ షబ్బీర్ అహ్మద్**

# విషయ సూచిక

కరుణామయుడు, కృపాసాగరుడయిన అల్లాహ్ పేరుతో

# గ్రంథ పరిచయం

అల్‌హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్, వస్సలాతు వస్సలాము అలా సయ్యిదుల్ ముర్సలీన్, వ అలా ఆలిహీ వ అస్‌హాబిహీ అజ్మయీన్. ఈ గ్రంథం అసలు పేరు అరబీ భాషలో "అల్లూలూ వల్ మర్జాన్". ఇందులోని పదావళి దివ్యఖుర్‌ఆన్‌లో ఈ విధంగా ప్రస్తావించబడింది:

"ఆయన రెండు సముద్రాలను పరస్పరం కలిసిపోయేలా వదలి పెట్టాడు. అయినా వాటి మధ్య ఒక అడ్డుతెర ఉంది. దానివల్ల అవి ఒకదానిలోకొకటి చొచ్చుకుపోలేవు. కనుక (మానవులారా! జిన్నులారా!!) మీ ప్రభువు శక్తి పరిధిలోని ఏ మహిమను మీరు నిరాకరించగలరు? ఈ సముద్రాలలో ముత్యాలు, పగడాలు కూడా లభిస్తాయి. కనుక (మానవులారా! జిన్నులారా!!) మీ ప్రభువులోని ఏ ఔన్నత్యాన్ని మీరు కాదనగలరు?"
(55:19-23)

ఈ గ్రంథంలో మహాప్రవక్త ముహమ్మద్ (స) సంప్రదాయాల (హదీసుల)కు సంబంధించిన సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లిం అనే రెండు హదీసు గ్రంథాలను రెండు సముద్రాలతో పోల్చడం జరిగింది. అయితే ప్రస్తుత సంకలన కర్త అల్లామా ముహమ్మద్ ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ హదీసుల మూలం (Text) ని బుఖారీ గ్రంథం నుండి గ్రహించి స్కంధాలు, అధ్యాయాల క్రమాన్ని, శీర్షికల పేర్లను మాత్రం ముస్లిం గ్రంథం నుండి స్వీకరించారు. అదీగాక పై రెండు గ్రంథాలలోనూ ఒకే ఉల్లేఖకుడు తెలిపిన ఉమ్మడి హదీసుల్ని మాత్రమే ఈ గ్రంథం కోసం ఎంచుకున్నారు. వీటిని "ముత్తఫఖున్ అలైహి" (ఉభయోకీభవిత) హదీసులని అంటారు. వీటినే ఈ సంకలనకర్త ముత్యాలు, పగడాలుగా అభివర్ణించి, దాన్నే తన గ్రంథానికి నామకరణం చేశారు.

అంతిమ దైవప్రవక్త (స)గారి ప్రవచనాలు, ఆచార వ్యవహారాలు, ఆజ్ఞలు, అనుజ్ఞలు, అలవాట్లు, అభిరుచులు, కదలికలు, కథనాలు, సలహాలు, సూచనలు, స్వరూప స్వభావాలు - ఒక్కటేమిటి, ఆ మహనీయుని జీవితంలోని ప్రతి అంశానికి, ప్రతి కోణానికి సంబంధించిన హదీసుల్ని సేకరించి, సంకలనం చేసి పకడ్బందీగా భద్రపరిచారు హదీసువేత్తలు. ఈ మహాకార్యం వెనుక వారి అవిరళ కృషి, అవిశ్రాంత శ్రమ, అసామాన్య సాహసం మనకు స్పష్టంగా గోచరిస్తాయి.

హదీసువేత్తలు ఉల్లేఖకుల నుండి హదీసుల్ని సేకరిస్తున్నప్పుడు మహాప్రవక్త (స) గౌరవోన్నతులపై అణుమాత్రం కూడా మచ్చరాని విధంగా ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నారు. ఆ మహానాయకుని పట్ల విశ్వాసం, ప్రేమాభిమానాలు ఇసుమంత సడలినట్లనిపించినాసరే అలాంటి హదీసుల్ని వారసలు స్వీకరించనే లేదు. హదీసుల సేకరణ తరువాత వారా హదీసుల్ని పరి పరి విధాల పరిశీలించి, శల్యపరీక్ష చేసి, క్షుణ్ణంగా వడపోసి వాటి నుండి పూర్తిగా నమ్మకమయినవని, నిజమయినవని ధృవీకరించుకున్న హదీసుల్ని మాత్రమే ఎంచుకొని సంకలనం చేశారు. హదీసుల ప్రామాణికత విషయంలో వారి దైవభీతి పరాయణత, నిజాయితీ, విశ్వసనీయలతో పాటు, హదీసుల ప్రామాణికతను

పరిశీలించడానికి వారు నిర్దేశించిన కొలమానాలు యావత్తు ముస్లిం జగత్తులో ఎంతో గుర్తింపు పొందాయి. ఇలా సంకలనం చేసిన గ్రంథాలలో సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లిం, తిర్మిజి, అబూదావూద్, నసాయి. ఇబ్ను మాజా, ఇమాం మాలిక్ గారి మూతా, ఇమాం ముహమ్మద్ గారి మూతా, ముస్నద్ అహ్మద్, దార్మి, దారెఖుత్ని, బైహఖీ మొదలైనవెన్నో ఉన్నాయి. వీటిలో హదీసుల ఆరోగ్యస్థితి, ప్రామాణికతలరీత్యా మొదటి ఆరు గ్రంథాలు అత్యున్నత స్థాయికి చెందిన గ్రంథాలుగా ఖ్యాతి చెందాయి. ఈ ఆరు గ్రంథాలను "సిహాసిత్తా" (షడ్రిజాలు) అంటారు.

వీటిలో మన సంకలనకర్త తన గ్రంథం కోసం ఎంచుకున్న రెండు గ్రంథాలు సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలను గురించి, వాటిని సంకలనం చేసిన ప్రముఖ హదీసువేత్తలు ఇమాం బుఖారీ (రహ్మాలై), ఇమాం ముస్లిం (రహ్మాలై) గార్ల జీవిత చరిత్రలను గురించి ఇక్కడ సంక్షిప్తంగానయినా తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## ఇమాం బుఖారీ (రహ్మాలై) :-

సహీహ్ బుఖారీ గ్రంథాన్ని సంకలనం చేసిన ఇమామ్ అబూ అబ్దుల్లా ముహమ్మద్ బిన్ ఇస్మాయిల్ బిన్ ఇబ్రాహీమ్ అల్ బుఖారీ (రహ్మాలై) హిజ్రీ శకం 194, షవ్వాల్ మాసం 13వ తేదీ శుక్రవారం నాడు బుఖారాలో ఒక పేద కుటుంబంలో జన్మించారు. ఆయన పదేళ్ళప్రాయంలో విద్యాభ్యాసం ప్రారంభించారు. స్వగ్రామంలో ప్రాథమిక విద్యనభ్యసించిన తరువాత ఉన్నత విద్య కోసం ముస్లిం జగత్తులోని యావత్తు ప్రధాన విద్యా కేంద్రాలన్నీ పర్యటించారు. ఈ సుదీర్ఘ పర్యటనలో ఆయన 1080 మంది ధర్మవేత్తల నుండి హదీసు విద్య నేర్చుకున్నారు. పదేళ్ళ ప్రాయంలోనే ఆయన బుఖారాలో ఆనాటి హదీసు విద్యాపారంగతులు ఇమామ్ దాఖలీ (రహ్మాలై) గారి పాఠశాలలో చేరారు.

ఒక రోజు ఇమామ్ దాఖలీ (రహ్మాలై) ఒక హదీసు ప్రమాణాన్ని పేర్కొంటూ "సుఫ్యాన్ అన్ అబీజుబైర్ అన్ ఇబ్రాహీం" అని అన్నారు. అప్పుడు ఇమాం బుఖారీ (రహ్మాలై) కల్పించుకొని "ఈ హదీసు ప్రమాణం ఈ విధంగా లేదండీ! అబూజుబైర్ ఈ హదీసుని ఇబ్రాహీం నుండి ఉల్లేఖించ లేదు' 'అని అన్నారు.

అతి పిన్న వయస్సులో ఉన్న ఒక శిష్యుడు తనను ఇలా తప్పుబట్టడంతో గురువు గారు ఉలిక్కిపడ్డారు. ఆయన కోపంతో కొర కొర చూశారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గురువు గారి పట్ల ఎంతో వినయ విధేయతలతో వ్యవహరిస్తూ "మీ దగ్గర అసలు గ్రంథం ఉంటే అందులో ఓసారి చూసుకోండి" అని ప్రశాంతంగా అన్నారు.

ఇమామ్ దాఖలీ (రహ్మాలై) ఇంటికి వెళ్ళి అసలు గ్రంథాన్ని పరిశీలించి ఇమామ్ బుఖారీ (రహ్మాలై) చేసిన విమర్శ సహేతుకమయినదేనని గ్రహించారు. ఆయన తిరిగి వచ్చి "అయితే సరయిన ప్రమాణం ఏమంటావు?" అని అడిగారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) తక్షణమే సమాధానమిస్తూ "సుఫ్యాన్ అనిజ్జుబైరి వహు వన్‌బు అదియ్యి అన్ ఇబ్రాహీం (ఇబ్రాహీం నుండి జుబైర్ బిన్ అదీ రహ్మాలై-ఉల్లేఖించారు; అబూజుబైర్ అనడం సరికాదు)" అని అన్నారు.

అప్పటికి ఇమామ్ బుఖారీ వయస్సు పదకొండేండ్లు కూడా నిండలేదు. పదహారు సంవత్సరాల వయస్సులో ఆయన హజ్రత్ అబ్దుల్లా బిన్ ముబారక్ (రహ్మాలై), ఇమామ్ వకీ (రహ్మాలై)లు సేకరించిన

హదీసులన్నీ కంఠస్థం చేశారు. 18వ యేట చరిత్ర గ్రంథాన్ని రచించ నారంభించారు. ఇందులో సహాబీలు (ప్రవక్త ప్రత్యక్ష అనుచరులు), తాబయీాల (ఆ తరువాతి అనుచరుల) జీవిత చరిత్ర, వారు చెప్పిన మాటలు, చేసిన నిర్ణయాలన్నీ సమీకరించబడ్డాయి. ఈ గ్రంథాన్ని ఆయన దైవప్రవక్త (స) సమాధి దగ్గర కూర్చొని వెన్నెల రాత్రులలో రాశారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) అసామాన్య జ్ఞాపకశక్తి గల మేధా సంపన్నులు. ఎంత పెద్ద హదీసయినాసరే ఒక్కసారి చదివితే లేక వింటే చాలు కంఠస్థమయిపోయేది.

ఇమాం బుఖారీ (రహ్మాలై) గారి సమకాలిక హదీసువేత్త హామిద్ బిన్ ఇస్మాయిల్ ఇలా తెలియజేస్తున్నారు: "ఇమామ్ బుఖారీ బస్రాలో మాతో పాటు హదీసు తరగతులకు హాజరవుతూ ఉండేవారు. అయితే ఆయన కేవలం వినేవారు. ఒక్క అక్షరం కూడా వ్రాసుకునేవారు కాదు. ఈ విధంగా 16 రోజులు గడచిపోయాయి. చివరికి ఓ రోజు నేను, హదీసులు వ్రాసుకోకపోవడం పట్ల ఆయన్ని విమర్శించాను. దానికాయన సమాధానమిస్తూ "ఈ పదహారు రోజుల కాలంలో నీవు వ్రాసుకున్న విషయాలన్నీ తీసుకురా. వాటన్నిటినీ నేను చూడకుండా చదువుతాను విను" అని అన్నారు. ఆ విధంగా ఆయన పదిహేను వందలకు పైగా హదీసుల్ని ఒక్క పొల్లు పోకుండా ఉన్నది ఉన్నట్లు మాకు వినిపించారు. స్వయంగా మేము అనేక చోట్ల మా రాతల్లో దొర్లిన తప్పులను ఆయన నోట విని సవరించుకోవలసి వచ్చింది".

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి జ్ఞాపకశక్తి గాథలు దశ దిశలా వ్యాపించిపోయాయి. ఆయన ఏ ప్రాంతానికి బయలుదేరినా, ఆయనకు ముందే ఆ ప్రాంతానికి ఆయన పేరు ప్రఖ్యాతులు చేరుకునేవి. ప్రజలు వివిధ రకాలుగా ఆయన జ్ఞాపకశక్తిని పరీక్షించేవారు. చివరికి వారు ఆయన అసాధారణ జ్ఞాపకశక్తికి ఆశ్చర్యచకితులయి ఎంతో అభినందించేవారు. ఆ కాలంలోనే షేఖ్ అబూ జర ఆ (రహ్మాలై), అబూ హాతిం (రహ్మాలై), ముహమ్మద్ బిన్ నస్ర్ (రహ్మాలై), ఇబ్ను ఖుజైమా (రహ్మాలై), ఇమామ్ తిర్మిజి (రహ్మాలై), ఇమామ్ ముస్లిం (రహ్మాలై)లు ఆయనకు శిష్యులయిపోయారు.

ఇమాం బుఖారీ (రహ్మాలై)ని ప్రశంసిస్తూ కొందరు ప్రముఖులు వెలిబుచ్చిన అభిప్రాయాలు వినండి:

"బుఖారీ (రహ్మాలై) హదీసు విద్యలో నాకంటే ఎక్కువ వివేకం, దూరదృష్టి కల వ్యక్తి. ఆయన దైవదాసుల్లోకెల్లా ఎక్కువ వివేచనాపరుడు. నిజం చెప్పాలంటే బుఖారీని మించిన వారే లేరు."

-ఇమామ్ దార్మి (రహ్మాలై)

"ఖురాసాన్ భూభాగంలో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) లాంటి మహోన్నత వ్యక్తి మరొకరు జన్మించ లేదు."

-ఇమామ్ అహ్మద్ (రహ్మాలై)

"స్వయంగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై) కూడా తన లాంటి వ్యక్తిని చూడలేదు."

- ఇబ్నుల్ మదీనీ (రహ్మాలై)

"ఇమామ్ ముస్లిం బిన్ అల్ హిజాజ్ (రహ్మాలై) ఓ సారి ఇమామ్ బుఖారీ (రహ్మాలై) సన్నిధికి వెళ్ళి ఆయన రెండు కళ్ళ మధ్య (నుదుటిని) ముద్దాడుతుండగా నేను కళ్ళారా చూశాను. ఆ తరువాత

ఆయన 'గురువులకు గురువూ! హదీసువేత్తల నాయకా! మీ పాదాలు చుంబించడానికి నాకు అనుమతి ఇవ్వండి' అని అన్నారు."

-అహ్మద్ బిన్ హమ్దూన్ (రహ్మాలై)

"ఆకాశం క్రింద ఈ ధరిత్రిపై ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బుఖారీ (రహ్మాలై)ని మించిన హదీసు పండితుడు, పారంగతుడు మరొకరు లేరు."

- ఇబ్నె ఖుజైమా (రహ్మాలై)

ఇమామ్ జీవిత విశేషాల్లో ముఖ్యంగా చెప్పుకోదగిన ఒక విశేషం ఉంది. ఆయన తన జీవితంలో ఏనాడూ ఎవరినీ నిందించలేదు, దూషించలేదు, బాధించనూలేదు. ఆయన స్వయంగా ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "పరలోక విచారణ దినాన పరోక్ష నిందను గురించి నన్ను ప్రశ్నించడం జరగదని నేను ఆశిస్తున్నాను" అని అప్పుడప్పుడు అంటుండేవారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఎంతో ఆత్మాభిమానం గల వ్యక్తి. దీన్ని గురించి ఉమర్ బిన్ హఫ్స్ (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు: "బస్రాలోని హదీసు పాఠశాలలో నేను, ఇమామ్ బుఖారీ సహ విద్యార్థులంగా ఉండేవాళ్ళం. ఒక రోజు ఇమామ్ పాఠశాలకు రాలేదు. విచారిస్తే ఆ రోజు ఇమామ్ బుఖారీ దగ్గర ధరించి బయటికి రావడానికి సరిపడ్డ బట్టలు కూడా లేవని తెలిసింది. ఈ విషయం ఇతరుల ముందు బహిర్గతం కావడం ఆయనకు ఏ మాత్రం ఇష్టంలేదు. అందువల్ల ఆయన ఆ రోజు ఇంటి నుంచి బయటికే రాలేదు. ఆ తరువాత మేము ఆయన కోసం బట్టలు సంపాదించి తీసికెళ్ళి ఇచ్చాము. దాంతో ఆయన మరునాటి నుంచి పాఠశాలకు రావడం ప్రారంభించారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) రాజులకు, పాలకులకు ఎల్లప్పుడూ దూరంగా ఉండేవారు. అయితే ఓ రోజు బుఖారా గవర్నర్, తన దర్బారుకు వచ్చి తనకు హదీసులు వినిపించవలసిందిగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై)కి విజ్ఞప్తి చేశాడు. దాంతో పాటు, ఇతరులెవరూ పాల్గొనకుండా ఉండే ఓ ప్రత్యేక సమావేశంలో తన పిల్లలకు హదీసు విద్య నేర్పవలసిందిగా కూడా అతను ఇమామ్‌ని కోరాడు. ఇమామ్ ఈ రెండు కోర్కెలను తిరస్కరిస్తూ "విద్యను గురువు దగ్గరకెళ్ళి నేర్చుకోవలసి ఉంటుంది. నా సమావేశంలో ధనికుడు-పేద అనే తారతమ్యం లేదు. ఇక్కడికొచ్చి హదీసు విద్య నేర్చుకోవడానికి ప్రతి ఒక్కరికీ హక్కుంది" అని సమాధానమిచ్చారు.

ఈ సమాధానం విని బుఖారా గవర్నర్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఆ తరువాత వారిద్దరి మధ్య దూరం మరింత పెరిగిపోయింది. గవర్నర్ ఇమామ్ బుఖారీ (రహ్మాలై) మీద పగబూని బుసలు కొట్టడం ప్రారంభించాడు. దాంతో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) బుఖారా పట్నం వదలి ఖర్తుంగ్ అనే ప్రాంతానికి వెళ్ళి తలదాచుకోవలసి వచ్చింది. అక్కడకు వెళ్ళిన తరువాత ఆయన వ్యాధిగ్రస్తులయ్యారు. చివరికి హిజ్రీశకం 256లో ఈదుల్‌ఫిత్ర్ నాడు 62 సంవత్సరాల వయస్సులో ఆయన తనువు చాలించారు. -రహ్మాతుల్లా అలై-

### జామె సహీహ్ బుఖారీ :-

ఇది ఇమామ్ బుఖారీ (రహ్మాలై) జీవితాంతం శ్రమించి, అనేక ప్రాంతాలు పర్యటించి

సంకలనం చేసిన హదీసు గ్రంథం. ఆయన వివిధ ప్రాంతాల నుండి మొత్తం ఆరు లక్షల హదీసులు సేకరించి, వాటిలో ఈ గ్రంథం కోసం అత్యంత ప్రామాణికమైన 7,397 హదీసుల్ని ఎంపిక చేసి సంకలనం చేశారు. ఈ 7,397 హదీసుల్లో నుండి పునరావృత్త హదీసుల్ని తీసివేస్తే 2,602 హదీసులు మాత్రమే మిగిలి ఉంటాయి. ఇవన్నీ పటిష్ఠమైన ఆధారాలు గల నిజమైన హదీసులు. వీటిని ఆయన వివిధ శీర్షికల క్రింద ప్రకరణలుగా, అధ్యాయాలుగా విభజించి ఒక క్రమ పద్ధతిలో సంకలనం చేశారు.

ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఈ మహాకార్యాన్ని నిరంతరాయంగా 16 సంవత్సరాల పాటు అహోరాత్రులు చెమట ధారపోసి పూర్తి చేశారు. ఆయన ప్రతి హదీసు గ్రంథస్తం చేయడానికి ముందుగా స్నానం చేసి, రెండు రకాతులు నఫిల్ నమాజ్ చేసేవారు. ఆ తరువాతనే ఆ హదీసు రాయడానికి ఉపక్రమించేవారు. ఈ విధంగా ఆయన మొత్తం హదీసుల్ని పూర్తి పరిశుద్ధావస్థలో, ఎంతో భక్తిభావంతో గ్రంథస్తం చేశారు.

ప్రసిద్ధి చెందిన వందలాది మంది హదీసువేత్తలు ఈ గ్రంథం ప్రామాణికతను పరీక్షించడానికి వివిధ రకాలుగా ప్రయత్నించారు. కాని ఏ ఒక్కరూ ఇందులోని ఏ ఒక్క హదీసు ప్రామాణికతతో కూడా విభేదించలేకపోయారు. కనీసం దానిపట్ల సందేహం కూడా వెలిబుచ్చలేకపోయారు. చివరికి వారంతా దివ్యఖుర్ఆన్ తరువాత పటిష్ఠమైన ప్రామాణికతతో కూడిన నిజగ్రంథం ఏదయినా ఉందంటే అది సహీహ్ బుఖారీ మాత్రమేనని తీర్మానించారు. ఈ విధంగా ఇస్లామీయ గ్రంథాలలో సహీహ్ బుఖారీ ద్వితీయ స్థానం పొందగలిగింది.

ఈ గ్రంథ ప్రాశస్త్యం, ప్రత్యేకతలను గురించి చెప్పాలంటే ఎన్నో విషయాలున్నాయి. ఇక్కడ రెండు విషయాలను మాత్రం ప్రస్తావిస్తున్నాం. ఇందులోని హదీసుల్ని స్వయంగా ఇమామ్ బుఖారీ (రహ్మాలై) నోట తొంభై వేల మంది హదీసువేత్తలు విన్నారు. ఈ గ్రంథానికి 53 వివరణ గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో కొన్ని వివరణ గ్రంథాలు పద్నాలుగేసి సంపుటాలలో వెలువడ్డాయి. దీన్ని బట్టి సహీహ్ బుఖారీ ఎంత జనాదరణ పొందిన గ్రంథమో ఊహించవచ్చు.

## ఇమామ్ ముస్లిం (రహ్మాలై) :-

సహీహ్ ముస్లిం గ్రంథాన్ని సంకలనం చేసిన ఇమామ్ అబుల్ హుసైన్ ముస్లిం బిన్ హిజాజ్ (రహ్మాలై) హిజ్రీ శకం 204లో నీషాపూర్‌లో జన్మించారు. బాల్యం నుండే హదీసు విద్యార్జనలో నిమగ్నులయిపోయారు. హదీసుల అన్వేషణ కోసం ఆయన ఇరాఖ్, హిజాజ్, ఈజిప్టు దేశాలు పర్యటించి, అక్కడి పండితుల దగ్గర హదీసులు నేర్చుకున్నారు. అలాంటి పండితులలో ఇమామ్ బుఖారీ (రహ్మాలై) గారి గురువులు కూడా ఉన్నారు. చివరికి ఆయన నీషాపూర్‌లో ఇమామ్ బుఖారీ (రహ్మాలై)ని కలుసుకొని, ఆయన దగ్గర కూడా శిష్యరికం చేశారు.

ఆ కాలంలో గొప్ప గొప్ప హదీసువేత్తలు సయితం తరచుగా ఇమామ్ ముస్లిం (రహ్మాలై) దగ్గరకొచ్చి హదీసులు వినిపోతుండేవారు. వారిలో అబూ హాతిం రాజి (రహ్మాలై), మూసాబిన్ హారూన్ (రహ్మాలై), అహ్మద్ బిన్ సల్మ (రహ్మాలై), ఇమామ్ తిర్మిజీ (రహ్మాలై) ప్రభృతులు కూడా ఉన్నారు. ఆయన బాల్యం నుండి అంతిమ శ్వాస వరకు ఎంతో దైవభీతి, ధర్మపరాయణతలతో కూడిన పవిత్ర జీవితం గడిపారు. ఆయన ఏనాడూ ఒకరిని నిందించడం గాని, బాధించడం గాని చేయలేదు.

ఇమామ్ ముస్లిం మరణ సంఘటన చాలా విచిత్రంగా జరిగింది. ఒక సారి ఓ పండిత గోష్ఠిలో ఒక వ్యక్తి ఏదో హదీసుని గురించి సమాచారం అడిగాడు. అయితే ఆ సమయంలో ఇమామ్ గారికి ఆ హదీసు గురించిన సరయిన వివరాలు తెలియకపోవడం వల్ల సమాధానం ఇవ్వలేకపోయారు. తరువాత ఆయన ఇంటికి వెళ్ళి ఆ హదీసుని అన్వేషించడం ప్రారంభించారు. గ్రంథ పుటలను తిరగేస్తూ ప్రక్కనే ఉన్న ఖర్జూరపండ్ల బుట్టలో నుంచి ఒక్కొక్క ఖర్జూరాన్ని తీసి తింటూ పోయారు. హదీసు అన్వేషణలో తానెన్ని ఖర్జూర పండ్లు తిన్నానన్న సంగతిని కూడా గమనించలేదు. చివరికి అన్వేషిస్తున్న హదీసు లభించిన తరువాత బుట్ట వైపు చూస్తే అది దాదాపు ఖాళీ అయిపోయింది. అప్పుడర్థమైంది ఆయనకు తాను బుట్టలోని పండ్లన్నీ తిన్నానని. కాని ఇక చేసేదేమీ లేదు; జరగవలసింది జరిగిపోయింది. ఎక్కువ పండ్లు తినడం వల్ల ఆయన వ్యాధిగ్రస్తులయ్యారు. ఆ వ్యాధితోనే ఆయన హిజ్రీ శకం 261, రజబ్ నెల 24వ తేదీ ఆదివారం నాడు సాయంత్రం శాశ్వతంగా ఇహలోకం వీడిపోయారు. చనిపోయేనాటికి ఆయన వయస్సు 55 సంవత్సరాలు మాత్రమే. స్వగ్రామమైన నీషాపూర్‌లోనే ఆయన్ని ఖననం చేశారు.

అబూహాతిం (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు: "ఇమామ్ ముస్లిం (రహ్మాలై) చనిపోయిన తరువాత ఓ రాత్రి నేను ఆయన్ని కలలో చూశాను. ఆయన దగ్గరికెళ్ళి మీ పరిస్థితి ఎలా ఉందని అడిగాను. దానికి ఇమామ్ ముస్లిం (రహ్మాలై) 'దేవుడు తనకు మంచి స్థితి కల్పించాడని, స్వర్గంలో తాను కోరుకున్న ప్రదేశానికి వెళ్ళే, కోరుకున్న చోట ఉండే అనుమతినిచ్చాడ'ని అన్నారు."

## జామె సహీహ్ ముస్లిం :-

ఈ గ్రంథం కూడా హదీసుల ప్రామాణికత రీత్యా, వాటి ఆరోగ్యస్థితి రీత్యా సహీహ్ బుఖారీకి ఏ మాత్రం తీసిపోదు. సహీహ్ ముస్లిం కూడా సహీహ్ బుఖారీతో సమానమైన విలువ గల గ్రంథమన్న విషయంతో ధర్మవేత్తలంతా ఏకీభవించారు.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ గ్రంథాన్ని ఎంతో నేర్పుతో, వివేకంతో సంకలనం చేశారు. అందువల్ల దీన్ని చాలా సులభంగా అధ్యయనం చేయడానికి, అర్థం చేసుకోవడానికి అవకాశం కలిగింది. ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ గ్రంథంలో ఇంచుమించు ఒకే భావం గల హదీసులన్నీ ఒక చోట చేర్చారు. దాంతో పాటు హదీసుల ప్రమాణ పద్ధతుల్ని, వాటి పదజాలాల్లోని వ్యత్యాసాలను కూడా సంక్షిప్త వాక్యాలలో కడు జాగ్రత్తగా తెలియజేశారు.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) యావత్తు ముస్లిం జగత్తులో జరిపిన తన సుదీర్ఘ పర్యటన సందర్భంగా నాలుగు లక్షల హదీసుల్ని సేకరించారు. మొదట వాటిలో ఒక లక్ష పునరావృత హదీసుల్ని ఏరివేసి మూడు లక్షల హదీసుల్ని సంకలనం చేశారు. ఆ తరువాత ఓ సుదీర్ఘ కాలం పాటు వాటిని నిశితంగా పరిశీలించి చివరికి అన్ని విధాల నమ్మకమైనవని, ప్రామాణికమైనవని, భావించిన హదీసుల్ని మాత్రమే ఆయన ఈ గ్రంథానికి ఎంచుకున్నారు. ఇలా మూడు లక్షల హదీసుల్లో 7,275 హదీసులు మాత్రమే గ్రంథస్తం చేయబడ్డాయి. అయితే వాటిలోనూ పునరావృత హదీసుల్ని తొలగిస్తే నాలుగు వేల హదీసులు మాత్రమే మిగులుతాయి.

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) స్వయంగా తన గ్రంథం గురించి ఇలా అన్నారు: "నేనీ గ్రంథంలో

ఏ హదీసుని గ్రంథస్తం చేసినా క్షుణ్ణంగా ఆలోచించిన మీదట తగిన ఆధారాలతోనే దాన్ని గ్రంథస్థం చేశాను. అలాగే ఈ గ్రంథంలో నుంచి ఏ హదీసుని తొలగించినా క్షుణ్ణంగా ఆలోచించిన తరువాత తగిన ఆధారాలతోనే దాన్ని తొలగించాను. అందువల్ల ప్రపంచంలోని జనమంతా రెండొందల యేండ్లపాటు హదీసుల్ని పరిశీలించి రాసినా, చివరికి వారి నమ్మకం ఈ గ్రంథం మీదే ఉంటుంది."

సహీహ్ ముస్లిం, సహీహ్ బుఖారీ గ్రంథాలలో ప్రామాణికత తదితర విషయాల రీత్యా ఏది గొప్ప అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. సహీహ్ బుఖారీ అన్నిటికంటే ఉన్నతమైనదని కొందరు అభిప్రాయపడితే, సహీహ్ ముస్లిం అన్నటికంటే ఉన్నతమైన గ్రంథమని, మరి కొందరు అభిప్రాయపడ్డారు. ఈ రెండు అభిప్రాయాలకు భిన్నంగా ఇంకొందరు, కొన్ని విషయాల రీత్యా సహీహ్ బుఖారీ ఉన్నతమైనది, మరికొన్ని విషయాల రీత్యా సహీహ్ ముస్లిం ఉన్నతమైనదని అభిప్రాయపడ్డారు.

ఏమయినప్పటికీ ఈ గ్రంథకర్తలిద్దరూ గొప్ప ధర్మపరాయణులు, దైవభీతిపరులు, నిజాయితీపరులన్న విషయంలో మాత్రం ఎవరి మధ్యా ఎలాంటి భేదాభిప్రాయం లేదు. అలాంటి మహనీయులు సంకలనం చేసిన బుఖారీ, ముస్లిం గ్రంథాలలోని ఏకీభవిత (ముత్తఫఖున్అలై) హదీసుల సంగతి ఇక చెప్పేదేముంది? పటిష్ఠమైన ప్రామాణిక గ్రంథాలలోని ఈ 'ఏకీభవిత' హదీసులు మరెంత ప్రామాణికమైనవో ప్రత్యేకంగా వివరించనవసరం లేదు.

సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలను రెండు సముద్రాలుగా, వాటిలో ఉన్న హదీసుల్ని ముత్యాలు, పగడాలుగా ప్రస్తుత సంకలన కర్త ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ అభివర్ణించిన సంగతి ప్రారంభంలో నేను ప్రస్తావించాను. అంటే ఒక సముద్రంలో ముత్యాలు ఉంటే, మరో సముద్రంలో పగడాలు ఉన్నాయన్నమాట. ఈ రెండు సముద్రాలలోని ముత్యాలు, పగడాలను ఏరి కూర్చిన హారం ఇంకెంత విలువైనదో ఊహించండి. ఆ అమూల్యమైన హారమే మీ ముందున్న ఈ గ్రంథం!

ఇందులో మొత్తం 1906 హదీసులున్నాయి. సహీహ్ బుఖారీలో పునరావృత హదీసులు తీసివేయగా 2602 హదీసులు ఉన్నాయి. అంటే ఈ గ్రంథంలో సహీహ్ బుఖారీలోని 696 హదీసులు తగ్గిపోయాయి. మరో మాటలో చెప్పాలంటే ఇమామ్ ముస్లిం (రహ్మలై) గారి గ్రంథంలో లేని 696 హదీసులు ఇమామ్ బుఖారీ (రహ్మలై)గారి గ్రంథంలో చోటు చేసుకున్నాయన్నమాట. వేరొక రకంగా చెప్పాలంటే ఈ 696 హదీసుల విషయంలో ఇరువురు ఇమాముల మధ్య పూర్తిగా ఏకీభావం లేదన్నమాట.

దీన్ని బట్టి మన ముందున్న ఈ గ్రంథంలో ఆ ఇరువురు ఇమాములు పూర్తిగా ఏకీభవించిన హదీసులే ఉన్నాయని అర్థమవుతుంది. ఇలాంటి హదీసులున్న గ్రంథం వెలకట్టలేని వినూత్న ఉద్గ్రంథం అనడంలో ఇక సందేహమేముంది? కనుక దీన్ని పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ ఈ గ్రంథం అనువాదంలో నాకు సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

- సయ్యిద్ షబ్బీర్ అహ్మద్

(ఉర్దూ అనువాదకుడు, లాహోర్)

# భూమిక

## కరుణామయుడు, కృపాసాగరుడయిన దేవుని పేరుతో ప్రారంభం.

- సమస్తలోకాలకు స్వామి, ప్రభువు అయిన దేవుడే సకల విధాలా ప్రశంసనీయుడు. ఆయన కరుణామయుడు, కృపాసాగరుడు. ఆయనే పరలోక విచారణ దినానికి అధిపతి కూడా.

  (దివ్యఖుర్‌ఆన్ 1:1-3)

- భూమ్యాకాశాలను, చీకటి వెలుగుల్ని సృష్టించిన దేవునికే సకల విధాల ప్రశంసలు శోభిస్తాయి. (6:1)

- స్తుతిస్తోత్రాలకు దేవుడే అర్హుడు. ఆయన ఎవరినీ కొడుకుగా చేసుకోలేదు. విశ్వసార్వభౌమత్వంలో ఆయనకు ఎవరూ భాగస్వాములు లేరు. (ఆయనే యావత్తు విశ్వ సామ్రాజ్యానికి తిరుగులేని చక్రవర్తి). ఒకరి సహాయ సహకారాలపై ఆధారపడేందుకు ఆయన ఎంత మాత్రం అశక్తుడు, అసమర్థుడు కాదు. (17:111)

- సమస్త విధాల ప్రశంసలు దేవునికే శోభిస్తాయి. ఆయనే తన దాసునిపై ఈ గ్రంథాన్ని అవతరింపజేశాడు. ఈ గ్రంథంలో ఆయన ఎలాంటి వక్ర విషయాలు ఉంచలేదు. ఇందులో అన్ని విషయాలు సవ్యంగా, సమంజసంగా, సహేతుకంగానే ఉన్నాయి. (18:1,2)

- భూమ్యాకాశాలలోని సమస్త వస్తువులకు యజమాని అయిన దేవుడే స్తుతింపదగినవాడు. పరలోకంలో కూడా ఆయనే ప్రశంసనీయుడు ఆయన ఎంతో వివేకవంతుడు, సర్వం తెలిసినవాడు. (34:1)

- భూమ్యాకాశాలను సృష్టించిన దేవుడే సకల విధాలా ప్రశంసనీయుడు. ఆయన దైవదూతలను సందేశహరులుగా నియమించాడు. ఆ దైవదూతలలో కొందరికి రెండేసి రెక్కలు, కొందరికి మూడేసి రెక్కలు, మరి కొందరికి నాల్గేసి రెక్కలు ఉన్నాయి. ఆయన తాను తలచిన విధంగా తన సృష్టితాల రూపకల్పనలో (కొన్ని అవయవాలను) అదనంగా చేర్చుతాడు. నిస్సందేహంగా దేవుడు ప్రతి పనీ చేయగల సమర్థుడు, సర్వశక్తిమంతుడు. (35:1)

- ప్రపంచంలోనూ, పరలోకంలోనూ సమస్త విధాల ప్రశంసలు ఆయనకే శోభిస్తాయి. (యావత్తు విశ్వవ్యవస్థపై) పాలనాధికారం ఆయనకే ఉంది. మీరంతా (మరణానంతరం) ఆయన దగ్గరికే మరలిపోవలసి ఉంది. (28:70)

- భూమ్యాకాశాలంతటా ఆయనే స్తుతింపదగినవాడు. ప్రొద్దువాలిన తరువాత వేళ, మధ్యాహ్నం వేళ కూడా ఆయన్ని స్మరించండి. (30:18)

- భూమ్యాకాశాల ప్రభువు, సర్వలోకాల స్వామి అయిన దేవుడే సకల విధాల ప్రశంసనీయుడు. భూమ్యాకాశాల్లో ఘనత, ఔన్నత్యాలు ఆయనకే శోభిస్తాయి. ఆయనే అపార శక్తిమంతుడు, అసామాన్య వివేక సంపన్నుడు. (45:36,37)

- విశ్వ సామ్రాజ్యం ఆయనదే. ఆయన సకల విధాలా ప్రశంసనీయుడు. ఆయనకు ప్రతి వస్తువుపై శక్తి, అధికారం ఉన్నాయి. (64:1)

- వారు (తమకు లభించిన స్వర్గవైభవాలు చూసి) "సకల స్తోత్రాలు దేవునికే శోభిస్తాయి. ఆయనే మాకీ మార్గం చూపాడు. ఆయన గనక మాకు సన్మార్గం చూపకపోయి ఉంటే, మా అంతటమేమీ మార్గాన్ని పొందగలిగే వారము కాము" అని అంటారు. (7:43)

- సత్యధర్మం యావత్తు జీవన వ్యవస్థలపై ఆధిక్యత పొందడానికి ఆ దేవుడే తన (అంతిమ) ప్రవక్తకు సత్యాన్ని, హితబోధను ఇచ్చి పంపాడు. (9:33,48:28, 61:9)

- ముహమ్మద్ (స) దేవుని సందేశహరుడు. ఆయన వెంటనున్నవారు అవిశ్వాసులకు ఏ మాత్రం లొంగని దృఢచిత్తులు. అయితే వారు పరస్పరం ఒకరిపట్ల మరొకరు మృదు స్వభావులు, దయామయులు. నీవు వారిని ఎప్పుడైనా చూస్తే, వారు రుకూ, సజ్దాలు (ప్రార్థన) చేయడంలో, దేవుని అనుగ్రహం, ఆయన ప్రసన్నతలను అర్థించడంలో నిమగ్నులయి ఉండటం కనిపిస్తుంది. వారి ముఖాలపై సజ్దా (సాష్టాంగ ప్రణామ) చిహ్నాలు ఉంటాయి. ఆ చిహ్నాలను బట్టి వారు ప్రత్యేకంగా గుర్తించబడతారు. (48:29)

- ఎవరు సత్యాన్ని విశ్వసించి, సదాచార సంపన్నులయి, ముహమ్మద్ (స)పై అవతరించిన దాన్ని కూడా విశ్వసిస్తారో - అది వారి ప్రభువు నుండి వచ్చిన సత్యవాణి - దేవుడు అలాంటి వారి నుండి చెడులేమయినా ఉంటే దూరం చేసి, వారి పరిస్థితిని చక్కబరుస్తాడు. (47:2)

- ముహమ్మద్ (స) మీ పురుషులలో ఎవరికీ తండ్రికాడు. ఆయన దేవుని సందేశహరుడు, అంతిమ దైవప్రవక్త. దేవుడు సమస్త విషయాలు ఎరిగినవాడు. (33:40)

- ప్రవక్తా! మేము నిన్ను సాక్షిగా, శుభవార్త అందజేసే వానిగా, భయపెట్టేవానిగా, దేవుని ఆజ్ఞతో ఆయన వైపున సందేశాన్ని అందజేసేవానిగా, ప్రకాశించే దీపంగా చేసి పంపాము. (33:45,46)

- (ఓ ముహమ్మద్!) మేము మిమ్మల్ని సమస్త లోకవాసుల కోసం కారుణ్యంగా పంపాము. (21:107)

- దేవుడు, ఆయన దూతలు దైవ ప్రవక్తకై 'దరూద్'ను పంపిస్తున్నారు. (కనుక) విశ్వాసులారా! మీరు కూడా అతను శాంతీసౌఖ్యాలతో వర్థిల్లాలని (దైవాన్ని) ప్రార్థించండి. (33:56)

ఈ గ్రంథంలో ఇద్దరు ప్రముఖ హదీసువేత్తలు ఏకీభవించిన హదీసుల్ని సంకలనం చేయడం జరిగింది. ఆ ఇద్దరు, సహీహ్ బుఖారీ గ్రంథకర్త ఇమామ్ అబూ అబ్దుల్లా ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బుఖారీ (రహ్మలై), సహీహ్ ముస్లిం గ్రంథకర్త ఇమామ్ అబుల్ హుసైన్ ముస్లిం బిన్ హిజాజ్ నీషాపూరి (రహ్మలై). వీరిలో ఇమామ్ బుఖారీ (రహ్మలై) జీవితకాలం హి.శ. 194 నుండి హి.శ. 256 వరకు కాగా, ఇమాం ముస్లిం (రహ్మలై) జీవితకాలం హి.శ. 204 నుండి 261 వరకు ఉండింది.

ఈ గ్రంథాన్ని నేను దారుల్ అహ్యావుల్ కుతుబుల్ అరబీ (అరబీ గ్రంథాల పునరుజ్జీవన సంస్థ) సంపాదకులు సయ్యిద్ ముహమ్మద్ హల్బీగారి ప్రేరణతో సంకలనం చేశాను. ఆయనే దీని ప్రచురణ, ముద్రణ బాధ్యతలు కూడా తీసుకున్నారు.

ఈ గ్రంథం కోసం మూలం (Text), పదజాలం రీత్యా సహీహ్ ముస్లిం హదీసులకు అతి దగ్గరగా ఉండే హదీసుల్ని మాత్రమే సహీహ్ బుఖారీ నుండి ఎన్నుకోవాలని సయ్యిద్ హల్బీగారు షరతు విధించారు. ఈ షరతు నా సహనానికి పెద్ద పరీక్షగా పరిణమించింది. ఇప్పటి వరకు ఈ లక్ష్యంతో గ్రంథరచన చేసిన వారెవరూ ఇంతటి కఠినమైన షరతు అనుభవించలేదు. ఫలానా హదీసు ముత్తఫఖున్ అలై (ఏకీభవిత) హదీసులని పేర్కొన్నవారు కూడా ఇలాంటి షరతు పెట్టలేదు.

ఒక హదీసుకు సంబంధించిన రెండు ఉల్లేఖనాలలోని మూలం, పదజాలాల్లో ఒకింత 'వ్యత్యాసం' ఉన్నప్పటికీ, హదీసును ఉల్లేఖించిన మొదటి ఉల్లేఖకుడు రెండు ఉల్లేఖనాల్లోనూ ఒక్కడే అయి ఉంటే చాలు, అది ముత్తఫఖున్ అలై (ఏకీభవిత) హదీసు అనబడుతుందని విశ్వ విఖ్యాత హదీసువేత్త హాఫిజ్ ఇబ్నుహిజ్ర్ (రహ్మలై) తెలియజేశారు. అంటే ఇప్పుడు ప్రచురణకర్త నాకు విధించిన షరతు ప్రకారం ఈ 'వ్యత్యాసం' మరింత తగ్గిపోయిన హదీసుల్ని మాత్రమే నేనీ గ్రంథం కోసం ఎన్నుకోవలసి ఉందన్న మాట. నేను వీలైనంత వరకు అలాంటి హదీసుల్నే ఈ గ్రంథంలో సంకలనం చేశాను.

దారెఖుత్ని (రహ్మలై) గారి సమకాలికుడు ముస్లిం బిన్ ఖాసిం ఖర్తబి (రహ్మలై) తను రచించిన చరిత్ర గ్రంథంలో ఇమామ్ ముస్లిం (రహ్మలై)ని గురించి ప్రస్తావిస్తూ, 'సహీహ్ ముస్లిం' శీర్షికలు, అధ్యాయాల సక్రమతలో సాటిలేని గ్రంథం అని అన్నారు. అంటే ఏ హదీసునయినా సులభంగా వెతికి తీసుకోవడానికి వీలయిన పద్ధతిలో సహీహ్ ముస్లిం కూర్పు జరిగిందన్నమాట. సహీహ్ బుఖారీ గ్రంథంలో మాత్రం కావలసిన హదీసుని వెతకడం కొంచెం కష్టంతో కూడిన వ్యవహారం. అందువల్ల నేనీ గ్రంథం కోసం సహీహ్ ముస్లింలోని అధ్యాయాల క్రమాన్ని ఎంచుకున్నాను. దాని ప్రకారమే సంకలనం చేశాను.

–ముహమ్మద్ ఫవ్వాద్ అబ్దుల్ బాఖీ

# ఉపక్రమణి

దైవప్రవక్త (స) (చెప్పని విషయాన్ని చెప్పినట్లు ఆయన)కు అబద్ధం ఆపాదించడం ఘోరమైన పాపం. దీన్ని గురించి ఆయన తీవ్రంగా హెచ్చరించారు.

1. హజ్రత్ అలీ (రజి) ఉల్లేఖనం - దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: "నా విషయంలో అబద్ధం చెప్పకండి. అంటే చెప్పని విషయాన్ని చెప్పినట్లు ప్రకటించకండి. మీరు స్వయంగా కల్పించుకొని దాన్ని నాకు ఆపాదించకండి. నా గురించి అబద్ధం కల్పించి చెప్పినవారు తప్పకుండా నరకానికి పోతారు."

(సహీహ్ బుఖారీ, ప్రకరణం 3. విద్య: అధ్యాయం 38. దైవప్రవక్తపై అబద్ధం మోపడం)

2. హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం - "మీ ముందు నేను ఎక్కువ హదీసులు ప్రస్తావించడానికి దైవప్రవక్త (స) ప్రవచించిన ఒక విషయం అడ్డు తగులుతుంది. ఆయన ఇలా ప్రవచించారు: "ఎవరయితే ఉద్దేశ్యపూర్వకంగా అసత్య విషయం కల్పించి దాన్ని నా మీద మోపుతాడో అతను తన నివాసాన్ని నరకంలో ఏర్పరచుకోవలసి ఉంటుంది."

(సహీహ్ బుఖారీ, ప్రకరణం 3, విద్య: అధ్యాయం 38. దైవప్రవక్తపై అబద్ధం మోపడం)

3. హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం - దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు. "ఎవరైతే ఉద్దేశ్యపూర్వకంగా ఒక విషయం స్వయంగా కల్పించుకొని ఆ అబద్ధాన్ని నా మీద మోపుతాడో అతను తన నివాసాన్ని నరకంలో నిర్మించుకోవలసి ఉంటుంది."

(సహీహ్ బుఖారీ, ప్రకరణం 3. విద్య: అధ్యాయం 38. దైవప్రవక్తపై అబద్ధం మోపడం)

4. హజ్రత్ ముగైరా (రజి) ఉల్లేఖనం - దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: "నా గురించి అబద్ధమాడటం ఇతరుల గురించి అబద్ధమాడటం లాంటి విషయం కాదు. ఎవరైతే ఉద్దేశ్యపూర్వకంగా అబద్ధం కల్పించుకొని దాన్ని నాకు ఆపాదిస్తాడో అతను తన నివాసాన్ని నరకంలో ఏర్పరచుకోవలసి ఉంటుంది."

(సహీహ్ బుఖారీ, ప్రకరణం 23. శవ సంస్కారం: అధ్యాయం 34. మృతిపట్ల పెడబొబ్బలు)

# విశ్వాస ప్రకరణం

## 1వ అధ్యాయం : విశ్వాసం (ఈమాన్) - దాని విశిష్ఠ లక్షణాలు

5. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- ఒక రోజు దైవప్రవక్త (స) ప్రజలతో సమావేశమయి ఉండగా, ఒక వ్యక్తి ఆయన దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! విశ్వాసం అంటే ఏమిటి?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (స) సమాధానమిస్తూ "విశ్వాసం ఉంటే నీవు దేవుణ్ణి, దైవ దూతలను, దైవప్రవక్తలను, (పరలోకంలో) దేవుని ముందు హాజరు కావలసి ఉంటుందన్న విషయాన్ని,(మరణానంతరం మానవులు) తిరిగి బ్రతికించబడతారన్న విషయాన్ని నమ్మాలి" అని అన్నారు.

"మరి ఇస్లాం అంటే ఏమిటి?" అని ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు. "ఇస్లాం అంటే (1) నీవు అల్లాహ్‌ను మాత్రమే (దేవునిగా భావించి) ఆరాధించాలి. (దైవత్వంలో) మరెవరినీ ఆయనకు సహవర్తులుగా చేయకూడదు. (2) నమాజు (ప్రార్థనా) వ్యవస్థను నెలగొల్పాలి. (3) జకాత్ (పేదల ఆర్థిక హక్కు)ను విధిగా నెరవేర్చాలి. (4) రమజాన్ నెల ఉపవాసాలు పాటించాలి" అన్నారు దైవప్రవక్త (స).

"ఇహ్సాన్ అంటే ఏమిటి?" ఆ వ్యక్తి తిరిగి ప్రశ్నించాడు. "ఇహ్సాన్ అంటే, నీవు దేవుణ్ణి ప్రత్యక్షంగా చూస్తున్నట్లు (అత్యంత భయభక్తులతో) ఆయన్ని ఆరాధించాలి. నీవు ఆయన్ని చూడలేకపోయినా ఆయన మాత్రం నిన్ను తప్పకుండా చూస్తున్నాడు. (అన్న యదార్థాన్ని గుర్తుంచుకో)" అన్నారు దైవప్రవక్త (స).

"దైవప్రవక్తా! మరి ప్రళయం ఎప్పుడొస్తుంది?" మరో ప్రశ్న అడిగాడు ఆ వ్యక్తి. ప్రళయం గురించి ప్రశ్నించేవాడికన్నా సమాధానమిచ్చేవాడికి ఎక్కువేమీ తెలియదు. కాకపోతే ప్రళయ సంభవం గురించి నేను కొన్ని సూచనలు తెలియజేస్తాను. అప్పుడు దాసి తన యజమానిని కంటుంది. (అనాగరికులుగా ఉన్న) పశువుల కాపర్లు పెద్ద పెద్ద భవంతులు కట్టడంలో ఒకర్నొకరు పోటీపడతారు. ఆ ఐదు అగోచర విషయాల్లో ప్రళయం ఒకటి. దాని సంగతి దేవునికి తప్ప మరెవ్వరికీ తెలియదు," అన్నారు దైవప్రవక్త (స). ఆ తరువాత ఆయన ఆ గడియకు సంబంధించిన జ్ఞానం అల్లాహ్ వద్ద మాత్రమే ఉన్నది. ఆయనే వర్షాన్ని కురిపిస్తాడు. తల్లుల గర్భాలలో పెరుగుతున్న దేమిటో ఆయనే ఎరుగు. తాను రేపటి రోజున ఏమి సంపాదించనున్నదో ఏ ప్రాణీ ఎరుగదు. ఏ భూభాగంపై తనకు మృత్యువు రానున్నదో ఏ వ్యక్తీ ఎరుగడు (లుక్మాన్ - 34)" అన్న ఖుర్‌ఆన్ సూక్తిని పఠించారు.

ఈ సంభాషణ తరువాత ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు. దైవప్రవక్త (స) 'ఆ వ్యక్తిని పిలవండి' అన్నారు. కాని కొందరు సహచరులు వెళ్ళి చూస్తే ఆ వ్యక్తి ఎక్కడా కన్పించలేదు. అప్పుడు దైవప్రవక్త (స) (అసలు విషయం బయటపెడ్తూ) "ఆ వ్యక్తి (ఎవరో కాదు) జిబ్రయీల్ (దైవదూత). ఈ విధంగా ఆయన ప్రజలకు వారి ధర్మం గురించి చెప్పడానికి వచ్చారు" అని అన్నారు.

(బుఖారీ; 2వ ప్రకరణం - విశ్వాసం, 37వ అధ్యాయం - జిబ్రయీల్...)

## 3వ అధ్యాయం - నమాజ్ - ఇస్లాం మౌలిక అంశం.

6. హజ్రత్ తల్హా బిన్ ఉబైదా (రజి) కథనం - ఓ రోజు దైవప్రవక్త (స) సన్నిధికి నజద్ ప్రాంతానికి చెందిన ఒక వ్యక్తి వచ్చాడు. అప్పుడు అతని శిరోజాలు చిందర వందరగా పడి ఉన్నాయి. అతని గొణుగుడు విన్పిస్తోంది గాని, అతని మాటలు మాత్రం అర్థం కావడం లేదు. దగ్గరగా వచ్చిన తరువాత అతను ఇస్లాం గురించి సమాచారం అడుగుతున్నాడని అర్థమయింది.

దైవప్రవక్త (స) అతనికి సమాధానమిస్తూ, "రాత్రింబవళ్ళు (ఇరవై నాల్గు గంటల)లో ఐదుసార్లు నమాజు చేయాలి" అని అన్నారు. "అవే కాకుండా అదనంగా మరేవయినా నమాజులు కూడా నేను చేయవలసి ఉందా?" అని అతను అడిగాడు. "(విధిగా) చేయనవసరం లేదు. అయితే నీవు సంతోషంగా చేయదలచుకుంటే (ఐచ్ఛిక నమాజులు ఎన్నయినా) చేయవచ్చు. పోతే రమజాన్ నెలలో ఉపవాసాలు (కూడా) పాటించాలి" అన్నారు దైవప్రవక్త (స). "రమజాన్ ఉపవాసాలు కాకుండా అదనంగా మరేవయినా ఉపవాసాలు కూడా నేను పాటించవలసి ఉందా?" అని ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు. "(విధిగా) పాటించనవసరం లేదు. అయితే నీవు సంతోషంగా పాటించదలచుకుంటే (ఐచ్ఛిక ఉపవాసాలు ఎన్నయినా) పాటించవచ్చు" అన్నారు దైవప్రవక్త (స). ఆయన (స) ఆ వ్యక్తికి జకాత్ (పేదల ఆర్థిక హక్కు) గురించి కూడా తెలియజేశారు. దానికి ఆ వ్యక్తి "అదే కాకుండా అదనంగా మరేదయినా విధి (దానం) నేను నెరవేర్చవలసి ఉందా?" అని అడిగాడు. "(విధిగా) నెరవేర్చనవసరం లేదు. కాకపోతే నీవు సంతోషంగా ఏదయినా ఇవ్వదలచుకుంటే (ఐచ్ఛిక దానం ఎంతయినా) ఇవ్వవచ్చు" అన్నారు దైవప్రవక్త (స).

ఆ తరువాత ఆ వ్యక్తి వెనుదిరిగి వెళ్ళిపోతూ "దైవసాక్షి! నేనిందులో అదనంగా ఎలాంటి విషయాన్ని చేర్చను. ఇందులో ఏ విషయాన్ని తగ్గించను కూడా" అని అన్నాడు. దైవప్రవక్త (స) ఈ మాటలు విని "అతనీ మాటను నిజంగా ఆచరణలో పెడ్తే అతను మోక్షం పొందినట్లే" అని అన్నారు.

(బుఖారీ: 2వ ప్రకరణం : ఈమాన్, 34వ అధ్యాయం - అజ్జకాతు మినల్ ఇస్లాం)

## 5వ అధ్యాయం - స్వర్గానికి చేర్చే విశ్వాసం

7. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం - ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరికొచ్చి "దైవప్రవక్తా! నన్ను స్వర్గానికి గొనిపోగల సత్కర్మలేమిటో కాస్త చెప్పండి" అని అన్నాడు. ప్రజలు (అతను ముందుకు వస్తూ మాట్లాడుతున్న తీరును చూసి) "ఏమయింది ఇతనికి (ఒక పద్ధతి అంటూ లేకుండా) ఇలా అడుగుతున్నాడు?" అని చెప్పుకోసాగారు. దైవప్రవక్త (స) ఈ మాటలు విని "ఏం కాలేదు. అతనికి నాతో పని పడింది, మాట్లాడనివ్వండి" అని అన్నారు. తరువాత ఆయన ఆ వ్యక్తి వైపుకు తిరిగి "పూర్తి ఏకాగ్రతతో ఒక్క దేవుడ్ని మాత్రమే ఆరాధించు. ఆయన్ని తప్ప మరెవరినీ ఆరాధించకు. ఆ దైవారాధనలో మరెవరినీ ఆయనకు సహవర్తులుగా కల్పించకు. నమాజ్ వ్యవస్థను నెలకొల్పు. జకాత్ (పేదల ఆర్థిక హక్కు) చెల్లించు. బంధువులతో కలసి మెలసి ఉంటూ మంచిగా మసలుకో. ఇక దీన్ని వదలిపెట్టు"★ అని అన్నారు.

---

★ ఇక్కడ దైవప్రవక్త (సల్లం) నోట వెలువడిన అసలు మాటేమిటో హదీసు ఉల్లేఖకునికి గుర్తులేదు.

హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) ఈ హదీసు ఉల్లేఖించిన తరువాత ఆ సమయంలో దైవప్రవక్త (స) ఒంటె ఎక్కి ఉన్నారని, ఆ వ్యక్తి దాన్ని నిరోధించి దైవప్రవక్త (స)ను ఈ ప్రశ్న అడిగినప్పుడు దానికాయన సమాధానమిచ్చి, చివర్లో ఇక దీన్ని (ఒంటె పగ్గాన్ని) వదలిపెట్టు అని చెప్పి ఉంటారని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : ప్రకరణం - 78 (అదబ్), అధ్యాయం - 10 (సలాతుర్రహం)]

8. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒక పల్లెవాసి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నన్ను స్వర్గానికి గొనిపోగల సత్కర్మలేమిటో కాస్త తెలియజేయండి" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (స) "నీవు ఒక్క దేవుడ్ని మాత్రమే ఆరాధించు. దైవత్వంలో ఆయనకు సహవర్తునిగా మరెవరినీ కల్పించకు. విధిగా చేయబడిన (ఫర్జ్) నమాజులు ఆచరించు. (పేదల ఆర్థిక హక్కయిన) జకాత్ చెల్లిస్తూ ఉండు. రమజాన్ నెల ఉపవాసాలు పాటించు" అని బోధించారు. అప్పుడా వ్యక్తి ప్రమాణం చేస్తూ "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్ష్యం! నేనీ ఆజ్ఞలను తు.చ. తప్పకుండా పాటిస్తాను" అని అన్నాడు. ఆ తరువాత అతను వెళ్ళిపోవడానికి వెనుతిరగ్గానే దైవ ప్రవక్త (స) తన అనుచరుల వైపు తిరిగి మీలో ఎవరైనా స్వర్గ నివాసిని చూడగోరితే ఈ వ్యక్తిని చూడవచ్చు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్ 1వ అధ్యాయం - వజూబుజ్జక్కాత్)

9. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: ఇస్లాం ఐదు మౌలికాంశాలపై ఆధారపడి ఉంది. (1) అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్ (స) ఆ దేవుని దాసుడు, ప్రవక్త అని సాక్ష్యమివ్వాలి. (2) నమాజ్ వ్యవస్థను నెలకొల్పాలి. (3) జకాత్ (పేదల ఆర్థిక హక్కు) ను నెరవేర్చాలి. (4) కాబా గృహాన్ని సందర్శించి, దాని ప్రదక్షిణం చేయాలి. (5) రమజాన్ నెల ఉపవాసాలు పాటించాలి."

(సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 2 వ అధ్యాయం - దు ఆవుకుం ఈమానుకుం)

## 7వ అధ్యాయం - దైవాన్ని, దైవ ప్రవక్తను, ఇస్లాం ధర్మాన్ని విశ్వసించడం, విశ్వసించమని ఆదేశించడం.

10. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం :- అబ్దుల్ ఖైస్ మనుషులు కొందరు దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చారు. అప్పుడు దైవప్రవక్త (స) "మీరెవరు, ఏ తెగకు చెందినవారు?" అని అడిగారు. దానికి వారు "మేము రబీఆ తెగకు చెందిన వాళ్ళము" అని అన్నారు. "ఓహో! మీరా! స్వాగతం! గౌరవనీయులారా!! రండి" అంటూ ఆహ్వానించారు దైవప్రవక్త (స).

దైవప్రవక్తా! మాకూ, మీకూ మధ్య సత్యతిరస్కారి అయిన ఈ 'ముజర్' తెగ అడ్డుగోడగా ఉంది. అందువల్ల మేము పవిత్రమాసంలో తప్ప ఇతర సమయాలలో మీ సన్నిధికి రాలేము. ఇప్పుడు మాకేవయినా స్వర్గప్రవేశానికి ఉపయోగపడే విషయాలు బోధించండి. వీటిని మేము మాతో పాటు మీ దగ్గరకి రానటువంటి వారికి కూడా వినిపిస్తాము" అన్నారు వారు. అంతేకాదు, పానీయాలను గురించి కూడా వారు దైవప్రవక్త (స)ను అడిగారు.

అప్పుడు దైవప్రవక్త (స) వారికి నాలుగు విషయాలను ఆచరించాలని, నాలుగు విషయాలు మానుకోవాలని బోధించారు. మిథ్యా దైవాలన్నిటినీ వదలి ఒకే దేవుడ్ని విశ్వసించాలని ఆయన చెబుతూ, "ఒకే దేవుడ్ని విశ్వసించాలంటే ఏమిటో మీకు తెలుసా?" అని ప్రశ్నించారు. దానికి వారు "దేవునికి, ఆయన ప్రవక్తకు మాత్రమే ఆ సంగతి బాగా తెలుసు; మాకు తెలియదు" అని అన్నారు.

"ఏకేశ్వర విశ్వాసం అంటే అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్ (స) ఆయన చేత నియమించబడిన ప్రవక్త అని సాక్ష్యమివ్వాలి" అని వివరించారు దైవప్రవక్త (స). ఆ తరువాత నమాజు (ప్రార్థనా) వ్యవస్థను నెలకొల్పాలి, జకాత్ (పేదల ఆర్థిక హక్కు) చెల్లించాలి. రమజాన్ నెల ఉపవాసాలు పాటించాలి. యుద్ధప్రాప్తి (మాలె గనీమత్)లో ఐదో వంతు సొమ్ము ప్రభుత్వ ధనాగారానికి ఇవ్వాలి" అని ఆదేశించారు. అలాగే ఆయన నాలుగు విషయాలను మానుకోవాలని చెప్పారు - హన్తమ్(1), దుబ్బా, నఖీర్, ముజప్ఫత్(2) అనే నాలుగు రకాల పాత్రలలో నీళ్ళు ఉంచడాన్ని, వాటిని త్రాగడాన్ని ఆయన వారించారు. (హదీసు ఉల్లేఖకుడు ఇబ్నె అబ్బాస్ (రజి), ఒక్కొక్కసారి నఖీర్ అనడానికి బదులు ముఖయ్యర్ అని పలికేవారు).

దైవప్రవక్త(స) ఈ విషయాలను బోధిస్తూ "ఈ ఆదేశాలను బాగా గుర్తుంచుకోండి. మీతో పాటు ఇక్కడకు రాని మీ ప్రాంతం వాళ్ళకు కూడా ఈ ఆదేశాలు తెలియజేయండి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 40వ అధ్యాయం - అదావుల్ ఖమ్స్ మినల్ ఈమాన్)

11. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ కథనం :- దైవప్రవక్త (స) హజ్రత్ ముఆజ్ (రజి)ని యమన్ రాష్ట్రానికి గవర్నర్‌గా నియమించి పంపుతూ ఇలా ఉపదేశించారు: "ముఆజ్! నీవిప్పుడు క్రైస్తవులుండే ప్రాంతానికి వెళ్తున్నావు. అంచేత మొట్టమొదట నీవు వారిని ఏకేశ్వరారాధన వైపుకు పిలువు. వారు గనక (నీ పిలుపు అందుకొని) ఏకేశ్వరుడయిన అల్లాహ్‌ను ధృవీకరించడం జరిగితే, ఆయన వారికి రోజుకు (24 గంటలలో) ఐదుసార్లు విధిగా నమాజు చేయాలని ఆదేశించాడని తెలియజేయి. దీనికి వారు ఒప్పుకుంటే వారు తమ సిరిసంపదల నుండి విధిగా జకాత్ (పేదల ఆర్థిక హక్కు) తీసి చెల్లించాలని ఆయన ఆజ్ఞాపించాడని తెలియజేయి. ఈ జకాత్ సొమ్ము వారిలో ధనికుల నుండి వసూలు చేసి పేదలకు పంచబడుతుంది. ఈ ఆదేశాన్ని కూడా శిరసావహించి జకాత్ చెల్లించడానికి అంగీకరిస్తే వారి దగ్గర జకాత్ వసూలు చేయాలి. అయితే ఒక విషయం బాగా గుర్తుంచుకో. ప్రజల దగ్గరుండే అత్యంత శ్రేష్ఠమైన వస్తువుల జోలికి మాత్రం పోకూడదు."

[సహీహ్ బుఖారీ: 24వ ప్రకరణం - జకాత్, 41వ అధ్యాయం - లాతూఖజుకరాయిము అమ్వాలిన్నాసి ఫిస్సదఖి]

12. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)కథనం:- దైవప్రవక్త (స) హజ్రత్ ముఆజ్ (రజి)ని యమన్ రాష్ట్రానికి

---

(1) హన్తమ్ :- పచ్చ లేక ఎర్ర రంగు మట్టికడవను హన్తమ్ అంటారు. దీనికి మూతిపైభాగాన కాకుండా పార్శ్వభాగాన ఉంటుంది. మట్టిలో రక్తం, వెంట్రుకలు కలిపి ఈ కడవను తయారుచేస్తారు. లేదా లక్క, గాజు కలిపిన ఎరుపురంగు పూయబడిన కడవను కూడా అంటారు. దుబ్బా :- పాత్రగా ఉపయోగించే బోలు సొరకాయను దుబ్బా అంటారు.

(2) ముజప్ఫత్ :- ఉమ్మినీటితో లేపనం చేసిన మట్టిపాత్రను ముజప్ఫత్ అంటారు. నఖీర్:- ఖర్జూర చెట్టు వేరులో గుంట చేసి దాన్ని మధుపాత్రగా ఉపయోగిస్తారు. ముఖయ్యర్:- చర్మాన్ని ఎండబెట్టి, కాల్చి ఒక విధమైన లేపనం తయారు చేస్తారు. దాంతో లేపనం చేయబడిన పాత్రను ముఖయ్యర్ అంటారు. ఈ లేపనాన్ని ఓడలక్కూడా ఉపయోగిస్తారు.

గవర్నర్‌గా నియమించి పంపుతూ "పీడితుని ఆర్తనాదాలకు భయపడుతూ ఉండాలి. పీడితుని ఆర్తనాదానికి, దేవునికి మధ్య ఎలాంటి అడ్డుతెర ఉండదు" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 46వ ప్రకరణం - ముజాలిమ్, 9వ అధ్యాయం - అల్ ఇత్తి ఖాయి వల్ హజారి మిన్ దావతిల్ మజ్లూమ్]

## 8వ అధ్యాయం - దేవుడ్ని, దైవప్రవక్త (స)ను విశ్వసించేవరకు అవిశ్వాసులతో పోరాటం.

13. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) దివంగతులయిన తరువాత హజ్రత్ అబూ బకర్ (రజి) ఖలీఫా అయ్యారు. ఆయన పాలనా కాలంలో కొన్ని అరబ్బు తెగలు జకాత్ ఇవ్వడానికి నిరాకరించాయి. ఆ సందర్భంలో హజ్రత్ ఉమర్ (రజి) ఖలీఫా ముందు ప్రవక్త ప్రవచనాన్ని ఉటంకిస్తూ ఇలా అన్నారు: "దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని ప్రజలు అంగీకరించనంతవరకు వారితో పోరాడాలని నాకు ఆజ్ఞ అయింది. ఇలా సద్వచనానికి అనుకూలంగా సాక్ష్యమిచ్చేవాడు తన ధనప్రాణాలను కాపాడుకున్న వాడవుతాడు. ఇక అతను నా వల్ల ఎలాంటి నష్టానికి గురయ్యే ప్రశ్న ఉండదు. కాకపోతే దైవధర్మం ప్రకారం అతను విధిగా నెరవేర్చవలసిన హక్కు ఏదైనా నెరవేర్చకపోతే అది వేరే విషయం. దాని సంగతి దేవుడు చూసుకుంటాడు - అని దైవప్రవక్త (స) ప్రవచించారు కదా! అలాంటప్పుడు మీరు ఆ తెగలతో ఎలా యుద్ధం చేస్తారు?"

అప్పుడు హజ్రత్ అబూ బకర్ (రజి) ఇలా అన్నారు: "దైవసాక్షిగా చెబుతున్నాను. నమాజ్, జకాత్‌ల మధ్య విచక్షణ చేసే ప్రతి వ్యక్తితో నేను యుద్ధం చేస్తాను. జకాత్ నిజానికి సంపద హక్కు (అంటే సంపద కలిగి ఉన్నవారు, దాని మీద పేదల ఆర్థిక హక్కు అయిన జకాత్‌ని విధిగా చెల్లించాలి). దైవసాక్షి! వారు గనక దైవప్రవక్త కాలంలో జకాత్‌గా ఇస్తూ ఉండిన సంపదలో నుంచి ఒక్క ఒంటె తాడయినా సరే ఇవ్వడానికి నిరాకరిస్తే నేను తప్పకుండా వారితో పోరాడుతాను."

ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) మాట్లాడుతూ "దైవసాక్షి! సత్యావగాహన కోసం దేవుడు అబూ బకర్ (రజి) హృదయ కవాటాన్ని తెరిచాడు. అబూ బకర్ (రజి) దృక్పథమే సరయినదని నేను ఆ తరువాత గ్రహించాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 1వ అధ్యాయం - జకాత్ విధింపు]

14. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచించారు: "దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని ప్రజలు అంగీకరించనంతవరకు వారితో యుద్ధం చేస్తూ ఉండాలని నాకు ఆజ్ఞ అయింది. కనుక దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని ఎవరైనా అంగీకరిస్తే అతను తన ధనప్రాణాలను నా నుండి కాపాడుకున్న వాడవుతాడు. కాకపోతే అతను విధిగా నెరవేర్చవలసిన చట్టపరమైన హక్కు ఏదయినా నెరవేర్చకపోతే అది వేరే విషయం. దాని సంగతి చూసుకునే బాధ్యత దేవునిపై ఉంది."

[సహీహ్ బుఖారీ: 56వ ప్రకరణం - జిహాద్, 102 వ అధ్యాయం - దుఆన్నబియ్యి(స) ఇలల్ ఇస్లామి వ నబువ్వహ్]

15. అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: "ప్రజలు దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని సాక్ష్యమిచ్చి నమాజ్, జకాత్ విధులు పాటించనంతవరకు వారితో యుద్ధం చేస్తూ ఉండాలని నాకు ఆజ్ఞ అయింది. ఇలా సాక్ష్యమిచ్చి, ఈ విధులు పాటించ నారంభిస్తే వారి ధనప్రాణాలు నా నుండి రక్షణ పొందుతాయి. అయితే వారు విధిగా నెరవేర్చవలసిన చట్టపరమైన హక్కేదయినా నెరవేర్చకపోతే అది వేరే విషయం. దాని సంగతి దేవుడు చూసుకుంటాడు".

[సహీహ్ బుఖారీ: 2వ ప్రకరణం - విశ్వాసం, 17వ అధ్యాయం - ఫ ఇన్తాబూ వ అఖా ముస్సలాత వ ఆతుజ్జకాత ఫఖల్లూ సబీలహుమ్]

## 9వ అధ్యాయం - విశ్వాసం "లా ఇలాహ ఇల్లల్లాహ్" సమ్మతితో ప్రారంభం

16. హజ్రత్ ముసయ్యబ్ (రజి) కథనం :- అబూ తాలిబ్‌కు మరణ సమయం ఆసన్నమయినప్పుడు దైవప్రవక్త (స) ఆయన్ని చూడటానికి వచ్చారు. ఆ సమయంలో అబూ తాలిబ్ దగ్గర అబూ జహల్ బిన్ హెషామ్, అబ్దుల్లా బిన్ అబీ ఉమయ్యా బిన్ ముగైరా కూర్చొని ఉన్నారు. దైవప్రవక్త (స) అబూతాలిబ్‌ని ఉద్దేశించి "పెదనాన్నా! (ఇప్పటికైనా) దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని అంగీకరించండి. దీన్ని ప్రాతిపదికగా తీసుకొని నేను దేవుని దగ్గర మీకు అనుకూలంగా సాక్ష్యమిస్తాను" అని అన్నారు.

అబూజహల్, అబ్దుల్లా బిన్ అబీ ఉమయ్యా ఈ మాటలు విని "అబూ తాలిబ్! మీరు అబ్దుల్ ముత్తలిబ్ అనుసరించిన మతాన్ని వదలిపెడ్తారా?" అని అడిగారు. ఆ తరువాత దైవ ప్రవక్త (స) దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని అంగీకరించవలసిందిగా మాటిమాటికీ అబూతాలిబ్‌కు నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. అయితే అబూజహల్, అబ్దుల్లాబిన్ అబీ ఉమయ్యాలు కూడా తమ మాటను అనేకసార్లు ఉద్ఘాటించారు. చివరికి అబూతాలిబ్ వారిద్దరితో "నేను అబ్దుల్ ముత్తలిబ్ మతాన్నే అంటిపెట్టుకొని ఉంటాను" అని చెప్పేశారు. దేవుడు తప్ప మరొక ఆరాధ్యుడు లేడని ఒప్పుకోవడానికి ఆయన నిరాకరించారు.

అయినప్పటికీ దైవప్రవక్త(స) (పెదనాన్న మీది ప్రేమను చంపుకోలేక) "దైవసాక్షి! దేవుడు నన్ను వారించనంతవరకు నేను మీ పాప క్షమాపణ కోసం ప్రార్థన చేస్తూ ఉంటాను" అని అన్నారు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది: "బహు దైవారాధకులు (సత్యాన్ని తిరస్కరించి) నరకానికి అర్హులయ్యారని స్పష్టంగా తెలిసిన తరువాత వారు దగ్గరి బంధువులయినా సరే, వారి పాప మన్నింపు కోసం దేవుణ్ణి ప్రార్థించడం దైవప్రవక్తకు, విశ్వాసులకు ఎంత మాత్రం శోభించదు. (ఖుర్ఆన్ : 9:113)

[సహీహ్ బుఖారీ: 23వ ప్రకరణం - శవ సంస్కారం, 81వ అధ్యాయం - ఇజ్‌ఖాలల్ ముష్రికు ఇన్దల్ మౌతి లా ఇలాహ ఇల్లల్లాహ్]

## 10వ అధ్యాయం - స్వచ్ఛమైన 'విశ్వాసం'తో దైవ సన్నిధికి వెళ్ళిన వారికి నేరుగా స్వర్గ ప్రవేశం

17. హజ్రత్ ఉబాదా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు: "దేవుడు తప్ప మరొక ఆరాధ్యుడు లేడని, ఆయన ఒక్కడేనని, ఆయనకు మరెవరూ సాటిలేరని; ముహమ్మద్ (స) ఆయన

దాసుడు, ప్రవక్త అని; అలాగే ఈసా (అలై) కూడా దేవుని దాసుడు, ఆయన ప్రవక్త అనీ; కాకపోతే ఆయన హజ్రత్ మర్యం (గర్భం)లో అవతరించిన దైవవాక్కు, దైవాత్మ అని; స్వర్గనరకాలు ఉన్నాయన్నది యదార్థమని ఎవరైతే సాక్ష్యమిస్తారో ఆ వ్యక్తి కర్మలు ఎలాంటివయినా సరే దేవుడు అతనికి స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు."

హదీసు ఉల్లేఖకులలో ఒక ఉల్లేఖకుడు ఇందులో మరొక విషయాన్ని చేర్చుతూ "స్వర్గానికి ఉండే ఎనిమిది ద్వారాలలో ఆ వ్యక్తి తాను కోరుకున్న ద్వారం గుండా స్వర్గంలో ప్రవేశించగలడు" అని తెలిపాడు.

[సహీహ్ బుఖారీ: 60వ ప్రకరణం - అంబియా, 47వ అధ్యాయం - ఖౌలహూ యా అహ్లల్ కితాబి లా తగ్లూ ఫీ దీనికుమ్ వలా తఖూలూ అలల్లాహి ఇల్లల్ హఖ్]

18. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (స) వెనుక ఆయన ఒంటె మీద కూర్చొని ప్రయాణం చేస్తున్నాను. నాకు, ఆయనకు మధ్య అంబారీ కర్ర మాత్రమే అడ్డుగా ఉంది. హఠాత్తుగా ఆయన "ఓ ముఆజ్!" అని పిలిచారు. నేను వెంటనే "(చెప్పండి) దైవప్రవక్తా! నేను మీ సేవ కోసం సిద్ధంగా ఉన్నాను" అన్నాను. కొంచెం దూరం నడిచిన తరువాత ఆయన మళ్ళీ "ఓ ముఆజ్!" అని పిలిచారు. "(సెలవియ్యండి) దైవప్రవక్తా! నేను మీ సేవ కోసం సిద్ధంగా ఉన్నాను" అన్నాను. ఆ తరువాత మరి కొంచెం దూరం పోయాక మూడవసారి మళ్ళీ "ముఆజ్!" అని పిలిచారు. "(ఆజ్ఞాపించండి) దైవప్రవక్తా! నేను మీ సేవ కోసం సిద్ధంగా ఉన్నాను" అన్నాను నేను.

అప్పుడాయన "దాసుల మీద దేవుని హక్కు ఏముందో నీకు తెలుసా?" అని అడిగారు. అందుకు నేను "దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు" అన్నాను. "దాసుల మీదున్న దేవుని హక్కు ఏమిటంటే, వారు దేవుణ్ణి మాత్రమే ఆరాధించాలి, మరెవరినీ ఆరాధించకూడదు. దైవత్వంలో ఆయనకు మరెవరినీ సాటి కల్పించకూడదు" అన్నారు ఆయన. ఇలా చెప్పి కాస్సేపు మౌనంగా నడిచారు. ఆ తరువాత "ఓ ముఆజ్ బిన్ జబల్!" అని పిలిచారు. నేను (వెంటనే సెలవియ్యండి) "దైవప్రవక్తా! మీ సేవ కోసం సిద్ధంగా ఉన్నాను" అని అన్నాను. "దాసులు దేవుని హక్కు నెరవేర్చిన తరువాత, దేవునిపై దాసులకు ఉండే హక్కేమిటో నీకు తెలుసా?" అని అడిగారు ఆయన. నేను "దేవునికి, దైవప్రవక్తకు మాత్రమే బాగా తెలుసు" అన్నాను. "అప్పుడు దేవుడు (తన) దాసులను శిక్షించకపోవడమే ఆయనపై వారికున్న హక్కు" అని తెలిపారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ: 77వ ప్రకరణం - లిబాస్, 101వ అధ్యాయం - ఇర్దాఫిర్రజుల ఖల్ఫిర్రజుల్]

19. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(స) వెనుక అఫీర్ పేరు గల గాడిదపై ఎక్కి ప్రయాణం చేస్తున్నాను. (దారిలో) ఆయన "ముఆజ్! దాసులపై దేవుని హక్కేమిటో, దేవునిపై దాసుల హక్కేమిటో నీకేమయినా తెలుసా?" అని అడిగారు. నేను "దేవునికి, దైవప్రవక్తకు మాత్రమే బాగా తెలుసు" అన్నాను. అప్పుడాయన "దాసులపై దేవునికున్న హక్కు - వారు దేవుణ్ణి మాత్రమే ఆరాధించాలి. ఆయనకు మరెవరినీ ఏ మాత్రం సాటి కల్పించకూడదు. దేవునిపై దాసులకున్న హక్కు - ఆయన తనకు సాటి కల్పించని వారిని శిక్షించకపోవడమే" అని అన్నారు. "అయితే దైవప్రవక్తా! నేనీ శుభవార్తను ప్రజలకు తెలియజేయనా?" అని అడిగాను. దానికి ఆయన "వద్దు. (అప్పుడే) ఈ శుభవార్తను ప్రజలకు తెలియజేయకు. అలా చెబితే వారు దీని మీదే ఆధారపడతారు (ఆచరణకు

దూరమయిపోతారు)'' అని హెచ్చరించారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 46వ అధ్యాయం - ఇస్మిల్ ఫరసి వల్ హిమార్]

20. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒకసారి ముఆజ్ (రజి) దైవప్రవక్త(స) వాహనం మీద ఆయన వెనుక ఎక్కి ప్రయాణం చేస్తున్నారు. (దారిలో) దైవప్రవక్త (స) "ఓ ముఆజ్!'' అని పిలిచారు. దానికి ముఆజ్ (రజి) "దగ్గరే ఉన్నాను దైవప్రవక్తా! మీ సేవ కోసం సిద్ధంగా ఉన్నాను'' అని అన్నారు. ఈ విధంగా దైవప్రవక్త(స) తనను మూడుసార్లు పిలిచారని, ప్రతిసారీ తాను ఇలాగే సమాధానమిచ్చానని ముఆజ్ (రజి) తెలిపారు. మూడవసారి, "దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్(స) దైవప్రవక్త అని మనస్ఫూర్తిగా సాక్ష్యమిచ్చేవారికి దేవుడు నరకాగ్ని (శిక్ష)ని నిషేధించాడు'' అని చెప్పారు దైవప్రవక్త(స).

అప్పుడు ముఆజ్(రజి) "అయితే దైవప్రవక్తా! నేనీ విషయాన్ని ప్రజలకు తెలియజేయనా, వారు విని సంతోషిస్తారు?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "వద్దు (అప్పుడే వద్దు) ఈ విషయం తెలియజేస్తే వారు దీని మీద ఆధారపడి కూర్చుండిపోతారు'' అని అన్నారు. అందువల్ల హజ్రత్ ముఆజ్ (రజి) (ఈ హదీసుని చాలా రోజుల వరకు ప్రజల ముందు వెల్లడించలేదు. అయితే) హదీసుని అసలు వెల్లడించకపోతే పాపినవుతానేమోనని భయపడి తన అంత్యఘడియలలో దాన్ని వెల్లడించారు.

[సహీహ్ బుఖారీ: 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 49వ అధ్యాయం - మన్ ఖస్సబిల్ ఇల్మి ఖౌమన్ దూనఖౌమ్]

## 12వ అధ్యాయం - 'విశ్వాసం', దాని శాఖలు

21. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "ఈమాన్ (విశ్వాసం)కు చెందిన శాఖలు అరవైకి పైగా ఉన్నాయి. బిడియం కూడా ఈమాన్‌కు చెందిన శాఖే'' అని దైవప్రవక్త (స) ప్రవచించారు.

[సహీహ్ బుఖారీ: 2వ ప్రకరణం-ఈమాన్, 3వ అధ్యాయం - ఉమూరుల్ ఈమాన్]

22. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఎక్కడికో వెళ్తూ ఉంటే దారిలో ఒక అన్సారీ ముస్లిం తారసపడ్డాడు. అతను తన సాటి (ముస్లిం) సోదరునికి హితోపదేశం చేస్తూ "మరీ అంత సిగ్గుపడతావేమిటి?'' అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) కల్పించుకుంటూ "పోనివ్వు, సిగ్గు కూడా విశ్వాసంలోని ఒక భాగమే'' అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 16వ అధ్యాయం - అల్‌హయా మినల్ ఈమాన్]

23. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం:- "బిడియం వల్ల మేలు మాత్రమే జరుగుతుంది'' అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 77వ అధ్యాయం - అల్‌హయా]

## 14వ అధ్యాయం - ఇస్లాం ప్రకారం అన్నిటికన్నా శ్రేష్ఠమైన పనులు (ఆచరణలు)

24. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి "ఇస్లాంకు సంబంధించిన ఆచరణలలో అన్నిటికన్నా శ్రేష్ఠమైన ఆచరణ ఏది?'' అని అడిగాడు. దానికి

దైవప్రవక్త(స) "నీవు బీదసాదలకు అన్నం పెట్టు. (అలాగే) పరిచయమున్నా లేకపోయినా ప్రతి వ్యక్తికీ సలాం చెయ్యి. ఇవే అన్నిటికంటే శ్రేష్ఠమైన ఆచరణలు" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 6వ అధ్యాయం - తాముల్ తఆమ్ మినల్ ఇస్లాం]

25. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- ఓ సారి ప్రవక్త అనుచరులు "దైవప్రవక్తా! అందరిలో కెల్లా ఎవరి ఇస్లాం (ధర్మం) శ్రేష్ఠమైనది?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "మాటల ద్వారా గాని, చేతల ద్వారా గాని తోటి ముస్లింలను బాధ కలిగించని వాడి (ఇస్లాం ధర్మం ఎక్కువ శ్రేష్ఠమైనది)" అని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ - 2వ ప్రకరణం - ఈమాన్, 5వ అధ్యాయం - అయ్యుల్ ఇస్లామి అఫ్జల్]

## 15వ అధ్యాయం - విశ్వాస మాధుర్యాన్ని ఆస్వాదించేవాడు.

26. హజ్రత్ అనస్ (రజి) కథనం :- "ఈ క్రింది మూడు లక్షణాలు కలిగి ఉన్నవాడు విశ్వాస మాధుర్యాన్ని ఆస్వాదిస్తాడ"ని దైవప్రవక్త(స) తెలియజేశారు.

1) అందరికంటే ఎక్కువ దేవుణ్ని, దైవప్రవక్త(స)ను అభిమానించడం,

2) ఎవరిని అభిమానించినా కేవలం దైవప్రసన్నత కోసం అభిమానించడం,

3) (నరక) అగ్నిలో పడటానికి ఎంతగా అసహ్యించుకుంటాడో అవిశ్వాస స్థితి వైపుకు మరలిపోవడానికి కూడా అంతగా అసహ్యించుకోవడం.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 9వ అధ్యాయం - హలావతిల్ ఈమాన్]

## 16వ అధ్యాయం - భార్యాపిల్లలు, తల్లిదండ్రులు, సమస్త మానవాళి కంటే ఎక్కువగా దైవప్రవక్త(స)ను అభిమానించడం.

27. హజ్రత్ అనస్ (రజి) కథనం :- "తల్లిదండ్రులు, భార్యాపిల్లలు, ప్రపంచంలోని ఇతర మానవులందరి కన్నా ఎక్కువగా నన్ను అభిమానించనంతవరకు మీలో ఏ ఒక్కడూ నిజమైన విశ్వాసి కాజాలడు" అని దైవప్రవక్త(స) ప్రవచించారు.★

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 8వ అధ్యాయం - హుబ్బుర్రసూలి మినల్ ఈమాన్]

## 17వ అధ్యాయం - తన కోసం ఇష్టపడినదే తోటి ముస్లిం కోసం ఇష్టపడటం విశ్వాస లక్షణం.

28. హజ్రత్ అనస్ (రజి) కథనం:- "తన కోసం ఇష్టపడినదే తన (ముస్లిం) సోదరుని కోసం కూడా

★ హదీసులో ప్రస్తావించబడిన ఈ అభిమానం సహజసిద్ధమైన అప్రయత్నాభిమానం కానవసరం లేదు. అంటే ఉద్దేశ్యపూర్వకమైన ప్రేమాభిమానాలన్న మాట. దీని ప్రకారం ఆజ్ఞపాలనా, వినయ విధేయతల్లో మనిషి తన తల్లిదండ్రులు, భార్యాపిల్లలు, బంధుమిత్రులకన్నా దైవప్రవక్త(సల్లం)కు అత్యధిక ప్రాధాన్యత నివ్వాలి.

ఇష్టపడనంతవరకు మీలో ఏ ఒక్కడూ నిజమైన విశ్వాసి కాజాలడు" అని దైవప్రవక్త(స) ప్రవచించారు.

[సహీహ్ బుఖారీ: 2వ ప్రకరణం - ఈమాన్, 7వ అధ్యాయం - మినల్ ఈమాని అంయ్యుహిబ్బుల్ అఖీహి]

29. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు - "దేవుణ్ణి, అంతిమ (ప్రళయ) దినాన్ని విశ్వసించేవారు ఎట్టి పరిస్థితిలోనూ తన పొరుగువాణ్ణి బాధించకూడదు. దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవాడు తన అతిథిని గౌరవించాలి. దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవాడు పలికితే మంచి మాటనే పలకాలి లేదా మౌనం వహించాలి."

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 31 వ అధ్యాయం - మన్ కాన యూమిను బిల్లాహి వల్ యౌమిల్ ఆఖిర్ ఫలా యూజి జారహ్]

30. హజ్రత్ అబూ షురై అదవి (రజి) కథనం:- నేను కళ్ళారా చూసి చెవులారా విన్నాను, దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచించారు. "దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవాడు తన పొరుగువాణ్ణి గౌరవించాలి; దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవాడు తన అతిథిని సత్కరించి ఆతిథ్యమివ్వాలి" అప్పుడు కొందరు అనుచరులు "దైవప్రవక్తా! ఈ సత్కారం ఎన్ని రోజులు జరగాలి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (స) "ఒక రోజు బాగా సత్కరించాలి. మూడు రోజులు సాధారణ ఆతిథ్యమివ్వాలి. అంతకంటే ఎక్కువ రోజులు ఆతిథ్యమిస్తే అది సదఖా (దానం)గా పరిగణించబడుతుంది. పోతే దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించినవాడు పలికితే మంచి మాటను పలకాలి లేదా మౌనం వహించాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ - 78వ ప్రకరణం - అదబ్, 31వ అధ్యాయం-మన్ కానయూమిను బిల్లాహి వల్ యౌమిల్ ఆఖిర్ ఫలా యూజిజారహ్]

## 20వ అధ్యాయం - యమన్ వాసుల విశిష్ట 'విశ్వాసం'

31. హజ్రత్ అబూ మస్వూద్ ఉఖ్బా బిన్ అమ్ర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) తన చేతిని యమన్ దేశం వైపుకు చూపుతూ "ఈమాన్ అటు (యమన్) వైపు ఉంది. గుర్తుంచుకోండి! ఒంటెల తోకలు పట్టుకొని, అరుస్తూ అదిలించే ఒంటెల కాపరులలో (ఎక్కువ) కాఠిన్యం, కర్కశత్వాలు ఉన్నాయి. అక్కడ నివసించే రబియా, ముజర్ తెగల నుంచి షైతాన్ కొమ్ములు మొలుస్తాయి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాఅల్‌ఖల్క్, 15వ అధ్యాయం - ఖైరి మాలిల్‌ముస్లిమి గనమున్ యత్ బవు బిహా షాఫల్ జిబాలి]

32. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలిపారు: "మీ దగ్గరకు యమన్ వాసులు వస్తున్నారు. వీరు మృదు మనస్కులు, దయార్ద్రహృదయులు. ధర్మావగాహనాశక్తి, వివేకాలు కూడా వారి సొత్తే."

[సహీహ్ బుఖారీ: 64వ ప్రకరణం - ముగాజి, 74వ అధ్యాయం - ఖుదూముల్ అష్ అరియ్యాన వ అహ్‌లిల్ యమన్.]

33. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త(స) ఇలా తెలిపారు, "సత్య తిరస్కారం శిరస్సు తూర్పు దిక్కున ఉంది. గర్వం, డాంబికాలు భూస్వాములలో, గుర్రాలు ఒంటెలు కల అనాగరిక ధనికులలో ఉన్నాయి. మృదుత్వం మేకలు కల పేదవారిలో ఉంది."

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్ ఖల్క్, 15వ అధ్యాయం, ఖైరుమాలిల్ ముస్లిమి గనము యత్‌బు బిహా షఅఫల్ జిబాల్]

34. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) ఇలా చెబుతుండగా విన్నాను, "గర్వం, డాంబికాలు ఒంటెలు కల అనాగరిక ధనికులలో ఉన్నాయి. మృదుత్వం మేకలు గల పేదవారిలో ఉంది. 'విశ్వాసం' యమన్ వాసులలో ఉంది. వివేకం ధర్మావగాహనా శక్తులు కూడా యమన్ వాసుల సొత్తే."

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహుత ఆలా]

## 21వ అధ్యాయం - జన శ్రేయోభిలాష కూడా ధర్మాంశమే.

35. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) చేతిలో చేయి వేసి, ఆయన బోధించే మాటలు వింటానని, ఆయన పట్ల విధేయత కలిగి ఉంటానని ప్రమాణం చేశాను. అప్పుడు దైవప్రవక్త(స) "నా శక్తి మేరకు (ఇలా చేస్తాను) అని చెప్పు" అని ఉపదేశించారు. ఆ తరువాత నేను ముస్లింలందరి పట్ల శ్రేయోభిలాష కలిగి ఉంటానని కూడా ప్రమాణం చేశాను.

[సహీహ్ బుఖారీ: 93వ ప్రకరణం - అహ్కామ్, 43వ అధ్యాయం]

## 22వ అధ్యాయం - పాపకార్యాలు విశ్వాసానికి గొడ్డలిపెట్టు

36. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "వ్యభిచారి వ్యభిచారం చేస్తున్నప్పుడు విశ్వాసిగా ఉండడు. త్రాగుబోతు మద్యం సేవిస్తున్నప్పుడు విశ్వాసిగా ఉండడు. దొంగ దొంగతనం చేస్తున్నప్పుడు విశ్వాసిగా ఉండడు.★

మరో ఉల్లేఖనంలో పై విషయాలతో పాటు ఈ విషయం కూడా అదనంగా చేర్చబడింది - ప్రజలు కళ్ళారా చూస్తుండగా దోపిడీ దొంగ పెద్ద ఎత్తున లూటీ చేస్తున్నప్పుడు అతను విశ్వాసిగా ఉండడు.

[సహీహ్ బుఖారీ: 74వ ప్రకరణం - అష్రబా, 1వ అధ్యాయం - ఖౌలల్లాహు..... ఇన్నమల్ ఖమ్రు వల్ మైసిరు....]

## 23వ అధ్యాయం - కపట విశ్వాసి లక్షణాలు

37. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఈ విధంగా తెలిపారు - "కపట విశ్వాసిలో నాలుగు దుర్లక్షణాలు ఉంటాయి. (1) భద్రపరచమని ఏదైనా వస్తువు అప్పగిస్తే దాని పట్ల అతను నమ్మక ద్రోహానికి పాల్పడతాడు. (2) నోరు విప్పితే అబద్ధమే పలుకుతాడు. (3) వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు. (4) ఎవరితోనైనా జగడం పెట్టుకుంటే దుర్భాషకు దిగుతాడు. ఈ నాలుగు లక్షణాలు ఎవరిలోనైనా ఉంటే అతను పచ్చి కపట విశ్వాసిగా పరిగణించబడతాడు. ఒకవేళ ఈ నాలుగు లక్షణాలలో ఒక లక్షణం ఉంటే, దాన్ని విడనాడనంతవరకు అతనిలో కపట విశ్వాసానికి

---

★ హజ్రత్ అబూజర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం లా ఇలాహ ఇల్లల్లాహ్ అని అంగీకరించిన ప్రతి వ్యక్తీ వ్యభిచరించినా, దొంగతనం చేసినా సరే స్వర్గంలో ప్రవేశిస్తాడని ఒక హదీసులో ఉంది. దివ్యఖుర్ఆన్‌లో "దేవుడు బహుదైవారాధన (షిర్క్) పాపాన్ని తప్ప ఇతర పాపాలను తాను తలచుకుంటే క్షమిస్తాడు" అని ఉంది. ఈ కారణాల దృష్ట్యా తత్వవేత్తలు మద్యపానం, వ్యభిచారం, దొంగతనం లాంటి పాపాలు చేస్తున్నప్పుడు మనిషిలో పరిపూర్ణ విశ్వాసం ఉండదని అభిప్రాయపడ్డారు.

సంబంధించిన ఒక లక్షణం ఉన్నట్లే లెక్క.''

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 24వ అధ్యాయం - అలామతుల్ మునాఫిఖ్]

38. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు- ''కపట విశ్వాసిని మూడు విషయాల ద్వారా గుర్తించవచ్చు. (1) అతను నోరు విప్పితే అబద్ధం పలుకుతాడు. (2) వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు. (3) భద్రపరచమని ఏదైనా వస్తువు అప్పగిస్తే దాని పట్ల అతను నమ్మక ద్రోహానికి పాల్పడతాడు.''

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 24వ అధ్యాయం - అలామతుల్ మునాఫిఖ్]

## 24వ అధ్యాయం - ముస్లిం సోదరుడ్ని అవిశ్వాసి అనడం తగదు

39. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ''ఒక ముస్లిం తన సాటి ముస్లిం సోదరుడ్ని అవిశ్వాసి (కాఫిర్) అని పిలిస్తే, వారిద్దరిలో ఒకరు తప్పకుండా అవిశ్వాసి అయిపోతాడ''ని దైవప్రవక్త (స) ప్రవచించారు.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 73వ అధ్యాయం - మన్ కప్ఫర అఖాహు బిగైరి తావీల్]

## 25వ అధ్యాయం - రక్తసంబంధాన్ని వక్రీకరించి చెప్పుకునే వాడి విశ్వాసం

40. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా చెబుతుండగా నేను విన్నాను, ''ఒక వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా కన్న తండ్రిని కాదని వదలి వేరే వ్యక్తిని తన తండ్రిగా సూచించుకుంటే అతను సత్య తిరస్కారానికి పాల్పడినవాడవుతాడు. అలాగే ఒక వ్యక్తి తనకు చెందని వేరే జాతి (సంతతి)కి చెందిన వాణ్ణని చెప్పుకుంటే, అతను తన నివాసాన్ని నరకంలో కట్టుకున్నట్లే''.

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 5వ అధ్యాయం]

41. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- ''కన్న తండ్రిని తండ్రిగా అంగీకరించకపోవడం సత్య తిరస్కారమవుతుంది. అందువల్ల మీ తాత ముత్తాతలను కాదని మిమ్మల్ని మీరు ఇతరుల సంతతికి చెందిన వారమని చెప్పుకోకండి'' అని తెలిపారు దైవప్రవక్త(స).''

[సహీహ్ బుఖారీ: 85వ ప్రకరణం - ఫరాయజ్, 29వ అధ్యాయం - మనిద్దఆ ఇలాగైరి అబీ]

42. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్కాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా బోధిస్తుండగా నేను విన్నాను, ''ఒక వ్యక్తి బుద్ధిపూర్వకంగా కన్న తండ్రిని కాదని వేరే మనిషిని తన తండ్రిగా చెప్పుకుంటే అలాంటి వ్యక్తికి స్వర్గ ప్రవేశం నిషేధించబడుతుంది.'' ఈ ప్రవచనాన్ని హజ్రత్ అబూ బక్ర్ (రజి) ముందు విన్పించినప్పుడు ఆయన దీన్ని ధృవీకరిస్తూ ''ఈ హదీసుని నేను దైవప్రవక్త(స) నోట చెవులారా విని నా మేధలో భద్రపరచుకున్నాను'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 85వ ప్రకరణం - 29వ అధ్యాయం -మనిద్దఆ ఇలాగైరి అబీ]

## 26వ అధ్యాయం - సాటి ముస్లింని దూషించడం, అతనితో పోరాడటం ఘోరమైన విషయం.

43. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- "సాటి ముస్లింని దూషించడం దుర్మార్గం★, కడు హేయమైన విషయం; అతనితో పోరాడటం సత్య తిరస్కారంతో సమానం" అని దైవప్రవక్త(స) అన్నారు.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 36వ అధ్యాయం - ఖౌఫిల్ మోమిని అఁయ్యాహ్ బత అమలుహు వహువ లాయష్వురు]

## 27వ అధ్యాయం - ఒకర్నొకరు చంపుకొని అవిశ్వాసులయిపోకండి.

44. హజ్రత్ జరీర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) 'వీడ్కోలు కాబా యాత్ర' సమయంలో ప్రజలను నిశ్శబ్దంగా ఉండమని చెప్పు అని నన్నాదేశించారు. ప్రజల మధ్య నిశ్శబ్దం ఏర్పడిన తరువాత ఆయన ఉపన్యాసమిస్తూ "ప్రజలారా! నేనీ లోకం వీడిపోయిన తరువాత మీరు పరస్పరం మెడలు నరుక్కుంటూ అవిశ్వాసులయిపోకండి" అని హితవు చేశారు.

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 43వ అధ్యాయం - అల్ ఇన్సాతిలిల్ ఉలమాయి]

45. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మాట్లాడుతూ "నా నిష్క్రమణ తరువాత మీరు ఒకర్నొకరు చంపుకుంటూ అవిశ్వాసులయిపోకండి. దైవం మిమ్మల్ని కరుణించు గాక!" అని ఉపదేశించారు.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 95వ అధ్యాయం - మాజాఅఫీ ఖౌలిర్రజులి వయ్‌లక్]

## 30వ అధ్యాయం - తారాబలాన్ని నమ్మడం సత్యతిరస్కారంతో సమానం.

46. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ జుహ్నీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మాతో కలిసి హుదైబియా ప్రాంతంలో ఉదయం నమాజు చేశారు. రాత్రి వర్షం కురిసింది. ఉదయం వరకు నేల తడిగానే ఉంది. దైవప్రవక్త(స) నమాజు ముగిసిన తరువాత అనుచరుల వైపుకు తిరిగి, "దేవుడు ఏం సెలవిచ్చాడో మీకు తెలుసా?" అని అడిగారు. "దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు. మాకు తెలియదు" అన్నారు అనుచరులు. అప్పుడు దైవప్రవక్త ఈ విధంగా తెలిపారు -

"దేవుడు ఇలా అన్నాడు - ఈ రోజు ఉదయం (విభిన్న మత విశ్వాసులు గల) నా దాసులలో కొందరు విశ్వాసులయిపోయారు, మరికొందరు అవిశ్వాసులయిపోయారు. దేవుని దయ వల్ల మనకు

---

★ ముస్లిం సమాజ ఏకాభిప్రాయం ప్రకారం సాటి ముస్లింని నిందించడం, దూషించడం నిషిద్ధం. ఇలాంటి దుశ్చర్యలకు పాల్పడినవాడు దుర్మార్గుడు (ఫాసిఖ్)గా పరిగణించబడతాడు. అయితే సాటి ముస్లింలకు వ్యతిరేకంగా యుద్ధం చేయడం అవిశ్వాసం (కుఫ్ర్) క్రిందికి రాదు. ఈ హదీసు గురించి విభిన్న వ్యాఖ్యలు ఈ విధంగా ఉన్నాయి: (1) సాటి ముస్లింలతో యుద్ధం చేయడాన్ని ధర్మసమ్మతంగా తలచి యుద్ధం చేయవచ్చు. (2) ఈ హదీసులో పేర్కొన్న కుఫ్ర్ (సత్య తిరస్కారం లేక అవిశ్వాసం) అంటే కృతఘ్నత అని అర్థం. షరీఅత్ పరమైన కుఫ్ర్ కాదు. (3) సాటి ముస్లింలతో యుద్ధం చేయడం వల్ల కలిగే పర్యవసానం కుఫ్ర్ (అవిశ్వాసం) మాత్రమే. (4) ఈ పని - అంటే ముస్లింలతో యుద్ధం చేయడం అవిశ్వాసులు చేసే పని.

వర్షం కురిసింది అన్న వారు తారాబలాన్ని నిరాకరించి, నన్ను విశ్వసించిన వారయ్యారు. దీనికి భిన్నంగా ఫలానా నక్షత్ర ప్రభావంతో వర్షం కురిసిందని అన్నవారు నక్షత్ర విశ్వాసులయి, నన్ను తిరస్కరించిన వారయ్యారు".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 156వ అధ్యాయం - యస్తఖ్ బిలుల్ ఇమాముస్నాస ఇజా సల్లమ్]

## 31వ అధ్యాయం - అన్సార్ ముస్లింలను ప్రేమించడం విశ్వాసానికి సూచన

47. హజ్రత్ అనస్ (రజి) కథనం:- "అన్సార్‌లను ప్రేమించడం విశ్వాసానికి సూచన, వారిని ద్వేషించడం కపట విశ్వాసానికి నిదర్శనం" అన్నారు దైవప్రవక్త (స).

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 10వ అధ్యాయం - అలా మతుల్ ఈమాని హుబ్బుల్ అన్సార్]

48. హజ్రత్ బరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచించారు, "అన్సార్‌లను నిజమైన విశ్వాసులు మాత్రమే అభిమానిస్తారు. వారిని కపట విశ్వాసులు మాత్రమే ద్వేషిస్తారు. అన్సార్‌లను అభిమానించే వారిని దేవుడు అభిమానిస్తాడు. వారిని ద్వేషించే వాళ్ళను దేవుడు ద్వేషిస్తాడు".

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 4వ అధ్యాయం - హుబ్బుల్ అన్సార్]

## 32వ అధ్యాయం - ఆరాధనలు, ఆజ్ఞాపాలనల్లో ఉపేక్షాభావం విశ్వాసాన్ని బలహీనపరుస్తుంది

49. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఈదుల్ అజ్హా లేక ఈదుల్ ఫిత్ర్ (పండుగ) దినాన దైవప్రవక్త (స) ఈద్గాహ్‌లో మహిళా భక్తుల ముందు నుంచి పోతూ "మహిళల్లారా! నరకంలో మీ సంఖ్య అధికంగా ఉన్నట్లు నాకు 'మేరాజ్' రాత్రిన చూపడం జరిగింది. అందువల్ల మీరు (వీలైనంత ఎక్కువగా) దానం చేస్తూ ఉండండి" అని బోధించారు. స్త్రీలు ఈ మాటలు విని "దానిక్కారణం ఏమిటి దైవప్రవక్తా?" అని అడిగారు. "మీరు తరచుగా నోరు పారేసుకుంటారు; భర్తల పట్ల కృతజ్ఞులయి ఉండరు. ధర్మం, విజ్ఞతావివేచనల దృష్ట్యా మీరు పురుషుల కన్నా తక్కువ అయినప్పటికీ పురుషుల్ని లోబరచుకుంటున్నారు" అన్నారు దైవప్రవక్త (స). "ధర్మం, విజ్ఞతావివేచనల దృష్ట్యా మేము పురుషుల కన్నా తక్కువ ఎలా అయ్యాము దైవప్రవక్తా?" అని అడిగారు స్త్రీలు. దానికి దైవప్రవక్త (స) "స్త్రీ సాక్ష్యం పురుష సాక్ష్యంలో సగానికి సమానం (అంటే ఒక పురుషుని సాక్ష్యం ఇద్దరు స్త్రీల సాక్ష్యంతో సమానం) కాదా?" అన్నారు. స్త్రీలు 'ఔను, నిజమే' అన్నారు. "స్త్రీలలో విజ్ఞతా వివేచనలు తక్కువ అనడానికి ఇదే నిదర్శనం. అలాగే స్త్రీలు రుతు సమయంలో నమాజ్ చేయలేరు కదా? ఉపవాసాలు పాటించలేరు కదా?" అన్నారు దైవప్రవక్త(స). దానికి స్త్రీలు 'ఔను, నిజమే' అన్నారు. "కనుక ధర్మం దృష్ట్యా స్త్రీలు పురుషుల కన్నా తక్కువ అనడానికి ఇదొక నిదర్శనం" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 6వ అధ్యాయం - తర్కిల్ హాయిజిస్సౌమ్]

## 34వ అధ్యాయం - దైవాన్ని విశ్వసించడం అన్నిటికన్నా గొప్ప విషయం

50. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి "అన్నిటికంటే శ్రేష్ఠమైన ఆచరణ ఏమిటి?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) "దేవుడ్ని, ఆయన ప్రవక్తను విశ్వసించడం" అని చెప్పారు. "ఆ తరువాత శ్రేష్ఠమైన ఆచరణ ఏమిటి?" అని అడిగాడతను. "దైవ మార్గంలో పోరాడటం" అని అన్నారు దైవప్రవక్త(స). "ఆ తరువాత శ్రేష్ఠమైన ఆచరణ ఏది?" అని మళ్ళీ అడిగాడతను. "చిత్తశుద్ధితో చేసే హజ్ (కాబా యాత్ర)" అని సమాధానమిచ్చారు దైవప్రవక్త(స).★

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 18వ అధ్యాయం - మన్‌ఖాల ఇన్నల్ ఈమాన హువల్ అమల్]

51. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (స)ను "అన్నిటికంటే శ్రేష్ఠమైన ఆచరణ ఏది?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(స) "దేవుడ్ని విశ్వసించి ఆయన మార్గంలో పోరాడటం"అని అన్నారు. "బానిసకు స్వేచ్ఛనివ్వడం (కూడా) శ్రేష్ఠమైన ఆచరణేనా?" అని అడిగాను నేను. "విలువను బట్టి ఎక్కువ ధరకు అమ్ముడు పోవడంతో పాటు, యజమానికి అందరికన్నా ఎక్కువ ఇష్టమైన బానిసకు (స్వేచ్ఛ ప్రసాదించాలి)" అన్నారు దైవప్రవక్త (స). "ఒకవేళ నేనీ పని చేయలేని స్థితిలో ఉంటే!?" అని అడిగాను. "అప్పుడు ఏదైనా పని చేసేవాడికి ఆ పనిలో సహాయపడు లేదా పని చేయడం రానివాడికి పని చేసిపెట్టు" అని చెప్పారు దైవప్రవక్త (స). "మరి ఈ పని కూడా చేయలేని స్థితిలో ఉంటే మరేం చేయాలి?" అని అడిగాను మళ్ళీ. "అయితే ప్రజలను ఎలాంటి కష్టనష్టాలకు గురి చేయకు. ఇది కూడా నీ పాలిట ఒక విధమైన దానమే" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 2వ అధ్యాయం - అయ్యుర్రిఖాబి అఫ్జల్]

52. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స)ను "దేవునికి అన్నిటికంటే ఎక్కువ ప్రియమైన ఆచరణ ఏది?" అని అడిగాను. "వేళకు నమాజు చేయడం" అని ఆయన సమాధానమిచ్చారు. "ఆ తరువాత ఆచరణ ఏది?" అని అడిగాను మళ్ళీ. "తల్లిదండ్రుల పట్ల సద్వర్తనతో మెలగడం" అని అన్నారు ఆయన. "ఆ తరువాత ఏది?" అని ప్రశ్నించాను నేను. "దైవమార్గంలో పోరాడటం" అని ఆయన చెప్పారు.

ఈ మాటలు స్వయంగా దైవప్రవక్త (స) నాకు తెలియజేశారు. ఒకవేళ నేను ఇంకా ఏమైనా అడిగితే వాటికి గూడా ఆయన సమాధానమిచ్చేవారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాహ్, 5వ అధ్యాయం - ఫజ్లిస్సలాతి లివఖ్తిహా]

## 35వ అధ్యాయం - షిర్క్ (బహుదైవారాధన) తరువాత వచ్చే ఘోరమైన పాపాలు

53. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- "దేవుని దృష్టిలో అన్నికంటే ఘోరమైన పాపం ఏద"ని నేను దైవప్రవక్త (స)ను అడిగాను. దానికి ఆయన "నిన్ను సృష్టించినవాడు దేవుడు అయినప్పటికీ, అలాంటి దేవునికి దైవేతర శక్తులను సహవర్తులుగా కల్పించడం (అన్నిటికంటే

★ ఎలాంటి పాపాలకు పాల్పడకుండా చిత్తశుద్ధితో చేసే హజ్‌నే 'మబ్రూర్ హజ్' అంటారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం హజ్ చేసిన తరువాత మరెన్నటికీ తప్పు చేయనని పశ్చాత్తాప హృదయంతో దైవాన్ని వేడుకొని సత్కార్యాలలో నిమగ్నమయిపోవాలి. ఇలాంటి హజ్‌నే 'హజ్జె మబ్రూర్' లేక సమ్మతించబడిన హజ్ అని అంటారు.

ఘోరమైన పాపం)'' అని అన్నారు. '' ఆ తరువాత ఘోరమైన పాపం ఏది?'' అని అడిగాను మళ్ళీ. ''ఆహారంలో నీతో పాలుపంచుకుంటారన్న ఉద్దేశ్యంతో నీవు నీ సంతానాన్ని హతమార్చివేయడం'' అని చెప్పారు ఆయన. ''ఆ తరువాత ఘోరమైన పాపం ఏది?'' అని అడిగాను నేను మళ్ళీ. ''నీవు నీ పొరుగింటి వాని భార్యతో వ్యభిచరించడం'' అని ఆయన సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం -అత్తఫ్సీర్, సూరతుల్ బఖర; 3వ అధ్యాయం - ఫలా తజ్అలూ లిల్లాహి అందాదన్]

## 36వ అధ్యాయం - ఘోరపాపాలు, ఘోరాతి ఘోరమైన పాపాలు

54. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూ బక్ర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మమ్మల్ని ఉద్దేశించి ''నేను మీకు అన్నిటికంటే ఘోరమైన పాపాలను గురించి తెలుపనా?'' అని అడిగారు. ఈ మాట ఆయన మూడుసార్లు పలికారు. దానికి మేము ''తప్పకుండా తెలుపండి దైవప్రవక్తా!'' అన్నాము. అప్పుడాయన ''దేవునికి ఇతరులను సాటి కల్పించడం, తల్లిదండ్రుల మాట వినకపోవడం'' అని తెలిపారు. ఆ తరువాత ఆయన ఆనుకుని కూర్చున్న వారల్లా ఒక్కసారిగా లేచి సరిగా కూర్చొని ''జాగ్రత్తగా వినండి! అబద్ధమాడటం (అన్నిటికంటే ఘోరమైన పాపం)'' అని అన్నారు. ఇలా మాటి మాటికి చెబుతూ పోయారు. చివరికి మేము మనస్సులో ''అయ్యో! ఈయన ఈ మాటలు ఇక చాలిస్తే బాగుండు'' అని అనుకున్నాం.

[సహీహ్ బుఖారీ: 52వ ప్రకరణం - షహాదాత్, 10వ అధ్యాయం - మాఖీల ఫీషహాదతిజ్జూర్]

55. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త(స)ను ఘోరమైన పాపాలను గురించి అడిగాడు. అప్పుడు దైవప్రవక్త(స) ''(1) దేవునికి ఇతరుల్ని సాటి కల్పించడం, (2) తల్లిదండ్రుల మాట వినకపోవడం, (3) నరహత్యకు పాల్పడటం, (4) అసత్య సాక్ష్యమివ్వడం ఘోరమైన పాపాలు'' అని తెలిపారు.

[సహీహ్ బుఖారీ :52 వ ప్రకరణం - షహాదాత్, 10వ అధ్యాయం - మాఖీల ఫీషహాదతిజ్జూర్]

56. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) అనుచరుల్ని ఉద్దేశించి, ''మిమ్మల్ని సర్వనాశనం చేసే పనులకు దూరంగా ఉండండ''ని హెచ్చరించారు. '' ఆ పనులేమిటి దైవప్రవక్తా?'' అని అడిగారు అనుచరులు. అప్పుడాయన ఇలా సెలవిచ్చారు - ''(1) దేవునికి సాటి కల్పించడం, (2) చేతబడి చేయడం, (3) ధర్మయుక్తంగా తప్ప దేవుడు హతమార్చకూడదని నిషేధించిన ప్రాణిని హతమార్చడం, (4) వడ్డీ సొమ్ము తినడం, (5) అనాథ సొమ్మును హరించి వేయడం, (6) ధర్మయుద్ధంలో వెన్నుజూపి పారిపోవడం, (7) ఏ పాపమెరుగని అమాయక ముస్లిం స్త్రీలపై అపనిందలు మోపడం''.

[సహీహ్ బుఖారీ: 55వ ప్రకరణం – అల్ వసాయా, 23వ అధ్యాయం - ఖౌలిల్లాహ్.... ఇన్నల్లజీనయాకులూన అమ్వాలల్ యతామాజుల్మా]

57. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) అనుచరుల్ని ఉద్దేశించి ''అతిఘోరమైన పాపాలలో ఒకటి తల్లిదండ్రులను దూషించడం'' అని అన్నారు. ''దైవప్రవక్తా! ఏ మనిషైనా తన సొంత తల్లిదండ్రుల్ని ఎలా దూషించగలడు?'' అని ప్రశ్నించారు అనుచరులు. దానికి దైవప్రవక్త(స) ''ఒక వ్యక్తి మరొక వ్యక్తి తల్లిదండ్రుల్ని దూషించినప్పుడు, అతను సమాధానంగా మొదటి

వ్యక్తి తల్లిదండ్రులను దూషిస్తాడు. (ఇలా ఆ వ్యక్తి తన కన్న తల్లిదండ్రుల్ని దూషించిన వాడవు తాడు)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 78వ ప్రకరణం - అదబ్, 4వ అధ్యాయం - లాయసుబ్బుర్రజులు వాలిదైహి]

## 38వ అధ్యాయం - జీవితపు చరమ ఘడియల్లో షిర్క్ చేయనివాడు స్వర్గనివాసి అవుతాడు.

58. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- "దేవునికి సాటి కల్పించే (బహుదైవారాధన చేసే) స్థితిలో చనిపోయే వ్యక్తి నరకానికి పోతాడ"ని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. నేను 'దేవునికి సాటి కల్పించని (ఏకేశ్వరాధన చేసే) స్థితిలో మరణించే వ్యక్తి స్వర్గానికి పోతాడ'ని అంటాను.

[సహీహ్ బుఖారీ: 23వ ప్రకరణం - జనాయెజ్, 1వ అధ్యాయం - ఫిల్ జనాయిజి వమన్ కాన ఆఖిరు కలామిహీ లా ఇలాహ ఇల్లల్లాహు]

59. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ రోజు (నా ముందు) విశ్వప్రభువు తరపున ఒక వార్తాహరుడొచ్చి తనకీ వార్త విన్పించాడని లేక శుభవార్త అందజేశాడని చెబుతూ, "నా అనుచర సమాజంలో దేవునికి సాటి కల్పించని స్థితిలో చనిపోయేవారు స్వర్గంలో ప్రవేశిస్తారు" అని అన్నారు. అప్పుడు నేను "వ్యభిచారం చేసినా, దొంగతనానికి పాల్పడినా వారు స్వర్గంలో ప్రవేశిస్తారా?" అని అడిగాను. దానికి ఆయన "ఆ... వ్యభిచారం చేసినా, దొంగతనానికి పాల్పడినా సరే (స్వర్గంలో ప్రవేశిస్తారు)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 1వ అధ్యాయం - ఫిల్ జనాయిజ్ వమన్ కాన ఆఖిరూ కలామిహీ లా ఇలాహ ఇల్లల్లాహ్]

60. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళే ఆ సమయంలో ఆయన తెల్లదుప్పటి కప్పుకొని గాఢంగా నిద్రపోతున్నారు. నేను మళ్ళీ వచ్చి చూస్తే ఆయన మేల్కొని ఉన్నారు. అప్పుడాయన (నన్ను చూసి) "దేవుడు తప్ప మరో ఆరాధ్యుడులేడని సాక్ష్యమిచ్చి, అదే మాటపై చనిపోయేదాకా నిలకడగా ఉండేవారు తప్పకుండా స్వర్గానికి వెళ్తారు" అని అన్నారు. "వ్యభిచారం చేసినా, దొంగతనానికి పాల్పడినా స్వర్గానికి వెళ్తారా వారు?" అని అడిగాను నేను (ధృవపరచుకోవడానికి). "ఔను. వ్యభిచారం చేసినా, దొంగతనానికి ఒడిగట్టినా సరే వెళ్తారు" అన్నారు దైవప్రవక్త(స). నేను ఆశ్చర్యపోతూ "ఏమిటీ, వ్యభిచారం, దొంగతనం లాంటి నేరాలు చేసి ఉన్నా (స్వర్గానికి వెళ్తారా)?" అని అడిగాను. అప్పుడు దైవప్రవక్త(స) "ఆ.... వ్యభిచారం, దొంగతనం చేసి ఉన్నా సరే. ఈ విషయాలు అబూజర్‌కు ఎంత ఆందోళన కలిగిస్తున్నా సరే (వారు స్వర్గానికి తప్పకుండా వెళ్తారు)" అని ఉద్ఘాటించారు. హజ్రత్ అబూజర్ (రజి) ఈ హదీసును వివరించినప్పుడల్లా "వ ఇన్ రగిమ అన్ఫ అబీజర్రిన్ (అబూజర్ తన ముక్కుకు మన్ను తగిలించుకున్నా సరే!) అని తప్పక అనేవారు.

[సహీహ్ బుఖారీ: 77వ ప్రకరణం - లిబాస్, 24వ అధ్యాయం - అస్సియాబిల్‌బైజ్]

## 39వ అధ్యాయం - లా ఇలాహ ఇల్లల్లాహ్ అని పలికిన అవిశ్వాసిని వధించడం నిషిద్ధం.

61. హజ్రత్ మిఖ్దాద్ బిన్ అస్వద్ (రజి) (మిఖ్దాద్ బిన్ అమ్రకుంది అనే పేరు కూడా ఈయనకు ఉంది)కథనం:- నేను దైవప్రవక్త (స)తో మాట్లాడుతూ " ఏ అవిశ్వాసి అయినా (యుద్ధరంగంలో) నాకు ఎదురయి మేమిద్దరం పరస్పరం పోరాడుకుంటున్నప్పుడు, అతను నా చేతినొకదాన్ని ఖడ్గంతో తెగ్గొట్టి వెంటనే ఏదైనా చెట్టు చాటుకు వెళ్ళి 'దేవుని (ప్రసన్నత) కోసం నేను ముస్లింనయ్యాను అని అన్నాడనుకోండి. అలాంటి స్థితిలో నేనతడ్ని హతమార్చవచ్చా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(స) "లేదు, నీవతడ్ని - హతమార్చకూడదు" అని అన్నారు. "దైవప్రవక్తా! అతను నా చేతినొకదాన్ని తెగ్గొట్టాడు. ఆ తరువాతనే ఈ మాటలు పలికాడు కదా?" అన్నాను నేను.

అప్పుడు దైవప్రవక్త (స) "ఏమైనా సరే నీవతడ్ని వధించడానికి ఏ మాత్రం వీల్లేదు. ఒకవేళ నీవతడ్ని వధిస్తే, అతడ్ని వధించక పూర్వం నీవు ఏ స్థానంలో ఉన్నావో ఆ స్థానంలో అతను ఉంటాడు. అలాగే అతను సద్వచనం (కలిమా) పఠించక పూర్వం ఏ స్థానంలో ఉండేవాడో ఆ స్థానంలో నీవు ఉంటావు" అని సమాధానమిచ్చారు. ★

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 12వ అధ్యాయం -హద్దసనీఖలీఫా]

62. హజ్రత్ ఉసామా బిన్‌జైద్ (రజి) కథనం :- దైవప్రవక్త(స) ఓసారి మమ్మల్ని హుర్ఖా (తెగ) వారి వైపుకు పంపించారు. మేము (మరునాడు) ఉదయాన్నే దాడి చేసి వారిని చిత్తుగా ఓడించాము. ఆ సందర్భంలో నేను, ఒక అన్సార్ యోధుడు ఇద్దరం కలసి ఆ తెగకు చెందిన ఒక వ్యక్తిని వెంబడించి చుట్టు ముట్టాము. అప్పుడతను 'అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు' అనే సద్వచనం పఠించాడు. ఈ మాట వినగానే అన్సార్ యోధుడు తన చేతిని వెనక్కి తీసుకున్నాడు. కాని నేను మాత్రం ఈటె విసరి అతడ్ని కడతేర్చాను.

ఆ తరువాత మేము (మదీనాకు) తిరిగొచ్చినప్పుడు నేను చేసిన పని సంగతి దైవప్రవక్త(స)కు తెలిసింది. ఆయన (వెంటనే నన్ను పిలిపించి) "ఉసామా! నీవతడ్ని అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని పలికిన తరువాత కూడా వధించావా?" అని నిలదీశారు. నేను సమాధానమిస్తూ "అతను ప్రాణం

---

★ అంటే, ఇస్లాం స్వీకరించి ముస్లిం అయిన కారణంగా అతడ్ని వధించడం నిషిద్ధం (హరాం) అవుతుంది; హత్యా ప్రతీకారం (ఖసాస్) కారణంగా నిన్ను వధించడం ధర్మ సమ్మతం (హలాల్) అవుతుంది అని అర్థం. అయితే యుద్ధరంగంలో అవిశ్వాసి 'లా ఇలాహ ఇల్లల్లాహ్' (కలిమా) పఠించిన తర్వాత అతడ్ని వధించే విషయంలో ధర్మవేత్తల మధ్య విభిన్న అభిప్రాయాలు ఏర్పడ్డాయి. ముందు రాబోయే ఒక హదీసు దృష్ట్యా అలాంటి వ్యక్తిని వధించిన ముస్లింపై ఎలాంటి దోషం లేదని, ప్రతీకార హత్య (ఖిసాస్)గాని, రక్తపరిహారం (దయత్)గాని, పాపపరిహారం (కప్ఫారా) గాని లేదని కొందరు అభిప్రాయపడ్డారు.
హజ్రత్ ఉసామా (రజి) వల్ల ఇలాంటి పొరపాటే జరిగినపుడు దైవప్రవక్త(సల్లం) ఆయన్ని ప్రతీకార చర్యగా హత్య చేయలేదు. ఆయనపై రక్తపరిహారం, పాపపరిహారం కూడా విధించలేదు. కొందరు ధర్మవేత్తల దృష్టిలో పాపపరిహారం చెల్లింపు విధి (హజిబ్) అయి ఉంది. కాని ఆ ముస్లిం అతడ్ని పొరపాటున అవిశ్వాసి అని పొరపడి వధించినందువల్ల ప్రతీకారహత్య ఉండదు. అదీగాక జిహాద్ సందర్భంలో జరిగిన ఈ పొరపాటు హత్య వల్ల ఆ ముస్లిం అవిశ్వాసి (కాఫిర్)గా పరిగణించబడడు. ముఖ్యంగా ఆ వ్యక్తి కొందరు ముస్లింలను గాయపరచిన తర్వాత తన ప్రాణం కాపాడుకోవడానికి మాత్రమే 'కలిమా' పఠిస్తున్నాడని ముస్లిం యోధుడు అనుమానించి అతడిని హతమార్చినపుడయితే ప్రతీకారహత్య, రక్తపరిహారాల ప్రసక్తేరాదు.

కాపాడుకోవడానికి (ఇలా) సద్వచనం పఠించాడు" అన్నాను. కాని దైవప్రవక్త(స) మళ్ళీ ఆ విషయాన్నే నొక్కి ప్రస్తావిస్తూ "నీవతణ్ణి అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని పలికిన తరువాత కూడా వధించావా?" అని అడిగారు. ఈ మాటలు ఆయన మాటిమాటికీ అంటూ నన్ను నిలదీశారు. దాంతో నేను (భయపడిపోయి) ఈ రోజు వరకు ముస్లింనయి ఉండకపోతే ఎంత బాగుండేది! (దైవప్రవక్త (స) ఆగ్రహానికి గురయ్యేవాణ్ణి కాదు) అని మనసులో తలపోశాను.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 45వ అధ్యాయం - బఅసున్నబియ్యి(స)]

## 40వ అధ్యాయం - మన (ముస్లింల) మీద కత్తిఎత్తినవాడు మనవాడు కాదు.

63. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- "మన (ముస్లింల) మీద కత్తిఎత్తినవాడు మన (జీవనశైలి అనుసరించే) వాడు కాదు" అని దైవప్రవక్త(స) ప్రవచించారు.(1)

[సహీహ్ బుఖారీ : 92వ ప్రకరణం - ఫిత్న్, 7వ అధ్యాయం]

## 42వ అధ్యాయం - ఏడ్పులు, పెడబొబ్బలు, మూఢనమ్మకాల నినాదాలు నిషిద్ధం.

64. హజ్రత్ అబూమూసా (రజి) కథనం:- "మన (ముస్లింల) మీద కత్తిఎత్తిన వాడు మన (సంస్కృతి ప్రకారం నడుచుకునే) వాడు కాదు" అని దైవప్రవక్త (స) ప్రవచించారు.

[సహీహ్ బుఖారీ: 92 వ ప్రకరణం - ఫిత్న్, 7వ అధ్యాయం]

65. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- "నెత్తీ నోరూ బాదుకుంటూ, దుస్తులు చించుకుంటూ మూఢకాలం పలుకులు పలికేవాడు మన (పద్ధతి అనుసరించే)వాడు కాదు" అని తెలిపారు దైవప్రవక్త (స).(2)

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్; 39వ అధ్యాయం - లైసమిన్నా మన్ జరబల్ ఖుదూద్]

66. హజ్రత్ అబూ బుర్దా బిన్ అబూ మూసా (రజి) కథనం:- ఓ రోజు అబూమూసా వ్యాధిగ్రస్తులయి స్పృహ కోల్పోయారు. అప్పుడాయన శిరస్సు ఆయన కుటుంబ స్త్రీలలో ఒకామె వడిలో ఉంది. (ఆ స్త్రీ ఆయన పరిస్థితి చూసి భయపడిపోయి పెడబొబ్బలు పెట్టనారంభించింది.) అబూ మూసా (రజి) స్పృహ కోల్పోయి ఉన్నందున ఆమె ఏడ్పులు పెడబొబ్బల పట్ల ఎలాంటి ప్రతిస్పందన వెలిబుచ్చలేకపోయారు. కాస్సేపటికి స్పృహ రాగానే ఆయన (విసుక్కుంటూ) "దైవప్రవక్త (స) అసహ్యించుకున్న వాటన్నిటినీ నేను అసహ్యించుకుంటున్నాను. ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టే, తల గొరిగించుకునే, వక్షస్థల వస్త్రాన్ని చించుకునే స్త్రీలను దైవప్రవక్త(స) అసహ్యించుకున్నారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 38వ అధ్యాయం - మాయున్హా మినల్‌ఖల్ఖి ఇన్దల్ ముసీబ]

---

(1) ముస్లింలపై కత్తి కట్టడమే గాక, దాన్ని ధర్మసమ్మతమైన చర్యగా భావించేవాడు ఎంతమాత్రం ముస్లిం కానేకాడు. ధర్మవేత్తలు ఈ హదీసును గురించి ఇలాంటి అర్థాన్నే తీసుకున్నారు.

(2) మూఢకాలం పలుకులు అంటే, పూర్వం అజ్ఞానయుగంలో అరబ్బులు తమ సన్నిహితుడెవరైనా చనిపోతే అతని పేరు పెట్టి పిలుస్తూ ఏడ్పులు పెడబొబ్బలు పెట్టేవారు. ఇస్లాం ప్రకారం ఈ చర్య నిషిద్ధం. ఇలా ప్రవర్తించడమే గాక దీన్ని ధర్మ సమ్మతమని భావించే ముస్లిం ధర్మ భ్రష్టుడవుతాడు.

## 43వ అధ్యాయం - పరోక్ష నిందకు, చాడీలకు పాల్పడటం నిషిద్ధం.

67. హజ్రత్ హుజైఫా (రజి) కథనం:- "కొండెములు (చాడీలు) చెప్పేవాడు స్వర్గంలో ప్రవేశించ లేడని" దైవప్రవక్త(స) చెబుతుండగా నేను విన్నాను.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 5వ అధ్యాయం]

## 44వ అధ్యాయం - బట్టను చీలమండలం క్రిందికి ఉండేలా ధరించడం, మేలు చేసి ఎత్తిపొడవడం, వ్యాపారంలో అబద్ధమాడటం నిషిద్ధం.

68. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ప్రవచనం ప్రకారం మూడు రకాల వ్యక్తులున్నారు. ప్రళయ దినాన దేవుడు దయాభావంతో వారివైపు కన్నెత్తి కూడా చూడడు; వారి పాపాలను క్షమించి వారిని పరిశుద్ధపరచడు; పైగా వారికి తీవ్రమైన (నరక) శిక్ష విధిస్తాడు. వారిలో ఒక కోవకు చెందిన వ్యక్తి అవసరానికి మించి ప్రయాణ సామగ్రి కలిగి ఉన్నప్పటికీ, తోటి ప్రయాణీకులకు వాటినిచ్చి ఆదుకోవడానికి నిరాకరిస్తాడు. రెండవ వ్యక్తి ప్రాపంచిక స్వలాభాపేక్షతో ఇమామ్ (రాజ్యాధినేత)కు మద్దతునిస్తూ ప్రయాణం చేస్తాడు. అందువల్ల ఆ ఇమామ్ సిరిసంపదలు ఇస్తే అతను సంతోషిస్తాడు, ఇవ్వకపోతే ముఖం మాడ్చుకుంటాడు. మూడవ వ్యక్తి సాయంత్రం వేళ తన వ్యాపార సరుకుతో (జనం ముందు) నిలబడి, "సాటిలేని మేటి అయిన దేవుని సాక్షిగా చెబుతున్నాను, నేనీ సరుకును ఇంత ధరకు కొన్నాను" అని (అబద్ధం) చెబుతాడు. ప్రజలు అతను నిజమే చెబుతున్నాడని భావిస్తారు.

దైవప్రవక్త(స) ఆ తరువాత ఖుర్ఆన్‌లోని ఈ సూక్తిని పఠిస్తారు, "కొందరు తమ వాగ్దానాలను, దేవుని విషయంలో చేసిన ప్రమాణాలను అతి స్వల్ప మూల్యానికి అమ్ముకుంటారు. ఇలాంటి (అమ్ముడుబోయిన) వారికి పరలోకంలో ఎలాంటి (పుణ్యఫలం) వాటా లభించదు. వారితో దేవుడు మాట్లాడడు. చివరికి వారివైపు ప్రళయదినాన కన్నెత్తి కూడా చూడడు. వారిని పరిశుద్ధ పరిచే ప్రసక్తి కూడా లేదు. పైగా వారికి వ్యధాభరితమైన శిక్ష పడుతుంది." (3:77)

[సహీహ్ బుఖారీ : 42వ ప్రకరణం - ముసాఖా, 5వ అధ్యాయం - ఇస్మిమమ్మన ఇబ్నుస్సబీలి మినల్ మాయి]

## 45వ అధ్యాయం - ఆత్మహత్య చేసుకున్న వాడికి నరకంలో అదే శిక్ష, నిజమైన ముస్లింకే స్వర్గ ప్రవేశం.

69. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ప్రవచనం ప్రకారం, కొండమీద నుంచి పడి ఆత్మహత్య చేసుకున్నవాడు నరకానికిపోయి, మాటిమాటికి కొండ మీద నుంచి త్రోయబడే ఘోర శిక్షను శాశ్వతంగా చవిచూస్తూ ఉంటాడు. విషం తిని ఆత్మహత్య చేసుకున్నవాడు నరకంలో విషం చేత పట్టుకొని తింటూ ఎల్లప్పుడూ తనను తాను హతమార్చుకుంటూ ఉంటాడు. ఏదైనా ఆయుధంతో ఆత్మహత్య చేసుకున్నవాడు నరకంలో కూడా అదే ఆయుధం తీసుకొని కడుపులో పొడుచుకుంటూ, ఎల్లప్పుడు తీవ్ర యాతనలు అనుభవిస్తూ ఉంటాడు.

[సహీహ్ బుఖారీ : 76వ ప్రకరణం - తిబ్, 56వ అధ్యాయం]

70. హజ్రత్ సాబిత్ బిన్ జహాక్ (రజి) కథనం :- దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "ఇస్లాం సంప్రదాయం ప్రకారం కాకుండా వేరే మత సంప్రదాయం ప్రకారం ప్రమాణం చేసినవాడు తను ప్రమాణం చేసిన విషయం లాంటివాడే అవుతాడు (అంటే ఆ మతానికి చెందిన వ్యక్తిగానే పరిగణించబడుతాడు). తన శక్తి పరిధిలో లేని విషయం గురించి మొక్కుబడి చేసుకున్నవాడు అలాంటి మొక్కుబడి నెరవేర్చనవసరం లేదు. ఆత్మహత్య చేసుకున్నవాడు ఇహలోకంలో తనను తాను ఏ వస్తువుతో హతమార్చుకున్నాడో ప్రళయదినాన అతడ్ని అదే వస్తువుతో శిక్షించడం జరుగుతుంది. విశ్వాసిని హత్య చేయడం ఎంత ఘోరమైన పాపమో, అతడ్ని దూషించడం కూడా అంతే (ఘోరమైన) పాపకార్యమవుతుంది. అలాగే అతనిపై సత్యతిరస్కార (కుఫ్ర్) అపనిందను మోపడం కూడా అంతే (ఘోరమైన) పాపకార్యమవుతుంది.★

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 44వ అధ్యాయం - మాయన్హా మినస్సిబాబివల్లాన్]

71. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- మేము ఓసారి దైవప్రవక్త(స)తో కలసి ఖైబర్ యుద్ధంలో పాల్గొన్నాము. ఆ సందర్భంలో తనను తాను ముస్లింఅని చెప్పుకునే ఒక వ్యక్తిని గురించి దైవప్రవక్త(స) ప్రస్తావిస్తూ, అతను నరక నివాసి అవుతాడని అన్నారు. ఆ తరువాత యుద్ధం మొదలయింది. అప్పుడా వ్యక్తి అత్యంతోత్సాహంతో, అమిత ధైర్య సాహసాలతో అవిశ్వాసులతో పోరాడుతూ చివరికి తీవ్రంగా గాయపడ్డాడు.

అప్పుడు కొందరు అనుచరులు దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! మీరు నరకవాసి అవుతాడని తెలిపిన వ్యక్తి ఈ రోజు అవిశ్వాసులతో అనన్య ధైర్య సాహసాలతో పోరాడి చని పోయాడు" అని అన్నారు. దైవప్రవక్త (స) ఈ మాట విని కూడా అతను నరకానికే పోతాడని అన్నారు. దైవప్రవక్త (స) పలికిన ఈ పలుకుల్ని కొందరు శంకించేలోగా ఒకతను వచ్చి ఆ వ్యక్తి చనిపోలేదని, తీవ్రంగా గాయపడ్డాడని తెలిపాడు. అయితే ఆ రోజు రాత్రి ఆ వ్యక్తి గాయాల బాధ తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ సంగతి తెలుసుకున్న దైవప్రవక్త (స) "దేవుడు గొప్పవాడు! నేను దేవుని దాసుణ్ణి, ఆయన ప్రవక్తనని సాక్ష్యమిస్తున్నాను" అని అన్నారు. ఆ తరువాత ఆయన హజ్రత్ బిలాల్ (రజి)ని పిలిచి, "మనస్ఫూర్తిగా (ఇస్లాం ధర్మాన్ని విశ్వసించి) ముస్లిం అయినవాడు మాత్రమే స్వర్గంలో ప్రవేశిస్తాడని, ఒక్కోసారి దేవుడు చెడ్డవాడి ద్వారా కూడా తన ధర్మానికి సహాయం చేయించుకుంటాడని ప్రకటన చెయ్యి" అని ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ: 56వ ప్రకరణం - జిహాద్, 182 వ అధ్యాయం - ఇన్నల్లాహయు అయ్యిదుద్దీన బిర్రజులిల్ ఫాజిర్]

72. హజ్రత్ సహల్ బిన్ సాద్ సాది (రజి) కథనం :- దైవప్రవక్త(స) ఒక యుద్ధంలో అవిశ్వాసుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఇరు వర్గాలు పరస్పరం ఢీకొన్నాయి. చివరికి దైవప్రవక్త(స) తన గుడారానికి తిరిగొచ్చారు. అవిశ్వాసులు కూడా తమ తమ గుడారాలకు వెళ్ళిపోయారు. ప్రవక్త అనుచరులలో ఒకతను యుద్ధమైదానంలో ఒంటరిగా కన్పించే ప్రతి శత్రువుని సమయస్ఫూర్తితో వెంటాడి మట్టుపెట్టేవాడు. కొందరు యోధులు అతను చేసిన ఈ సాహసకార్యాలు చూసి, "ఈ రోజు జరిగిన

---

★ ఇది ఒక హెచ్చరికగా, మందలింపుగా పేర్కొనబడింది. నవవి (రహ్మలై) గారి ప్రకారం మనిషి హృదయాలలో ఇస్లాం పట్ల నిజమైన విశ్వాసం ఉంటే అతను అవిశ్వాసి కాజాలడు. ఒకవేళ అతని హృదయంలో ఇస్లాంకు బదులు ఇతర ధర్మాల పట్ల ఔన్నత్య భావం ఉంటే అతను తప్పకుండా అవిశ్వాసి అవుతాడు.

యుద్ధంలో ఆ వ్యక్తి సాధించిన ఘనకార్యాలు మరెవరూ సాధించలేదు'' అని అన్నారు. దైవప్రవక్త (స) ఈ మాటలు విని ''నిజమే, కాని ఆ వ్యక్తి నరకవాసి అవుతాడు'' అని అన్నారు.

ఇది విని ఒక సహచరుడు తానా వ్యక్తి వెంట (నీడలా) ఉంటానని నిర్ణయించుకున్నాడు. ఆ తరువాత అతను ఆ వ్యక్తిని వెన్నంటి తిరుగుతూ అతను నిల్చుంటే నిల్చోవడం, అతను పరుగెత్తితే అతని వెంట పరుగెత్తడం చేయసాగాడు. కాస్సేపటికి ఆ వ్యక్తి తీవ్రంగా గాయపడి (బాధకు తట్టుకోలేక) తొందరపడి ఆత్మహత్యకు పాల్పడ్డాడు. అతను ఖడ్గం పిడిని నేలమీద నిలబెట్టి దాని మొనను తన వక్షస్థలం మధ్య ఆనిచ్చి, తన శరీర బరువంతా దాని మీద మోపి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ దృశ్యం చూడగానే అతన్ని వెంబడించిన సహచరుడు దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి ''(మహానుభావా!) మీరు (ముమ్మాటికి) దైవ ప్రవక్తేనని నేను సాక్ష్యమిస్తున్నాను'' అని అన్నాడు.

అది విని దైవ ప్రవక్త (స) ''ఏమిటీ విశేషం?'' అని అడిగారు. అప్పుడా సహచరుడు ఇలా అన్నాడు: ''ఇంతకు ముందే మీరు ఒక వ్యక్తిని గురించి అతను నరకవాసి అవుతాడని చెప్పారు. జనం ఈ మాట నమ్మలేకపోయారు. నేను వెంటనే ఆ వ్యక్తి సంగతేమిటో ఆరా తీద్దామని మనసులో అనుకున్నాను. ఆ తరువాత నేనతడ్ని వెంబడించాను. చివరికి అతను తీవ్రంగా గాయపడి తొందరపాటుతో మృత్యువుని ఆహ్వానించాడు. అతను కత్తి పిడిని నేలమీద నిలబెట్టి, దాని మొనను తన వక్షస్థలం మధ్య ఆనించి దాని మీద పడి ఆత్మ హత్య చేసుకున్నాడు''. దైవప్రవక్త (స) ఈ సంగతి విని ''ఒక్కోసారి ఒక వ్యక్తి పైకి స్వర్గవాసుల కర్మల మాదిరిగానే సత్కర్మలు ఆచరిస్తాడు. అయితే అసలతను నరకవాసి అవుతాడు. అలాగే మరొక వ్యక్తి పైకి నరకవాసుల కర్మల మాదిరిగానే దుష్కర్మలు ఆచరిస్తాడు. కాని వాస్తవానికి అతను స్వర్గవాసి అవుతాడు'' అని ప్రవచించారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, - 77వ అధ్యాయం - లా యఖూలు ఫలాన్ షహీద్]

73. హజ్రత్ జున్దుబ్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు, ''మీకు పూర్వం గతించిన జాతులలో ఒక వ్యక్తి తీవ్రంగా గాయపడ్డాడు. ఆ బాధకు తట్టుకోలేక అతను (గాయమయిన) తన చేతిని కత్తితో నరికి వేశాడు. అయితే రక్తస్రావం ఆగలేదు. దాంతో అతను చనిపోయాడు. అప్పుడు దేవుడు అతని నిర్వాకం చూసి ''నా దాసుడు ఆత్మహత్య చేసుకోవడంలో నా ఆజ్ఞను మీరిపోయాడు. అందువల్ల నేనతనికి స్వర్గ ప్రవేశాన్ని నిషేధించాను'' అని అన్నాడు.

[సహీహ్ బుఖారీ: 60వ ప్రకరణం - అంబియా, 50వ అధ్యాయం - మాజుకి రఅన్‌బనీ ఇస్రాయీల్

## 46వ అధ్యాయం - యుద్ధప్రాప్తిలో మోసం చేయడం ఘోరమైన నేరం

74. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- మేము ఖైబర్ ప్రాంతాన్ని జయించినప్పుడు, యుద్ధ సొత్తు (మాలె గనీమత్)గా మాకు వెండి బంగారాలే గాక ఆవులు, ఒంటెలు, తోటలు, ఇతర సామగ్రి కూడా లభించాయి. ఖైబర్ విజయం తరువాత మేము దైవప్రవక్త(స) వెంట ఖురా లోయకు తిరిగొచ్చాము. ఆ సమయంలో దైవప్రవక్త(స) వెంట ఆయన బానిస 'మిద్అమ్' కూడా ఉన్నాడు. ఈ బానిసను బనీ జిబాబ్ తెగకు చెందిన ఒక వ్యక్తి దైవప్రవక్త(స)కు కానుకగా సమర్పించాడు. ఆ బానిస దైవప్రవక్త (ఒంటెపై నుంచి) అంబారీని తీసివేస్తున్నప్పుడు అకస్మాత్తుగా ఎక్కడ్నుంచో ఒక బాణం వచ్చి అతనికి

తగిలింది. దాంతో అతను ప్రాణం విడిచాడు. ప్రజలు అభినందన భావంతో "అతని అమరగతి (వీరమరణం) ఎంతో శుభప్రదమైనది!" అని పలికారు.

అయితే దైవప్రవక్త (స) ఈ పలుకులు విని "బాగానే ఉంది. కాని నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యం! ఖైబర్ యుద్ధం జరిగిన రోజు యుద్ధప్రాప్తిని పంచక ముందే అతను ఒక దుప్పటిని స్వాధీనం చేసుకున్నాడు. ఆ దుప్పటి అతని పాలిట అగ్నిజ్వాలగా మారుతుంది" అని అన్నారు. ఒక వ్యక్తి ఈ మాటలు విని వెంటనే తన దగ్గరున్న ఒకటో రెండో తాళ్ళు తీసుకొచ్చి "ఇవి నాకు దొరికాయి (తీసుకోండి)" అన్నాడు. దైవప్రవక్త (స) వాటిని చూసి "ఒకటైనా రెండయినా ఈ త్రాళ్ళు కూడా నిప్పుగా మారిపోతాయి" అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - ముగాజి, 38వ అధ్యాయం - జంగ్-ఇ-ఖైబర్]

## 51వ అధ్యాయం - అజ్ఞాన కాలం నాటి కర్మల లెక్క

75. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- ఒకవ్యక్తి దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! అజ్ఞానకాలంలో ఆచరించిన కర్మలను గురించి కూడా (దేవుని ముందు) విచారణ జరుగుతుందా?' అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) ఇలా సమాధానమిచ్చారు. "ఇస్లాం స్వీకరించిన తరువాత సత్కర్మలు ఆచరిస్తూ ఉంటే అజ్ఞానకాలంలో చేసిన దుష్కర్మలను గురించి నిలదీయడం జరగదు. అయితే ఇస్లాం స్వీకరించిన తరువాత కూడా దుష్కార్యాలు చేస్తూ ఉంటే, అతను గతంలో చేసిన వాటితో పాటు మొత్తం పాపకార్యాల విషయంలో పట్టుబడిపోతాడు."

[సహీహ్ బుఖారీ : 88వ ప్రకరణం - ఇస్తితాబతిల్ ముర్తదీన్, 1వ అధ్యాయం- ఇస్మిమన్ అష్రిక్ బిల్లాహి]

## 52వ అధ్యాయం - ఇస్లాం స్వీకరించినా, హజ్, హిజ్రత్‌లు చేసినా గత పాపాలు క్షమించబడతాయి.

76. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- కొందరు బహుదైవారాధకులు (గతంలో) అనేకమంది (అమాయకుల్ని)ని చంపి హత్యానేరాలు చేసి ఉన్నారు. అలాగే లెక్కలేనన్ని సార్లు వ్యభిచారం కూడా చేసి ఉన్నారు. చివరికి వారు (ఓ రోజు) దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "మీరు చెబుతున్న విషయాలు ఎంతో బాగున్నాయి. అందులో ఎలాంటి సందేహం లేదు. కాని మేము గతంలో ఎన్నో పాపకార్యాలు చేసి ఉన్నాము. మరి వాటికి ప్రాయశ్చితం ఏదైనా ఉందంటారా?" అని అడిగారు.

దాన్ని గురించి ఈ క్రింది ఖుర్‌ఆన్ సూక్తులు అవతరించాయి :

1) "వారు (కరుణామయుని భక్తులు) ఒక్క దేవుడ్ని తప్ప మరెవరినీ మొరపెట్టుకోరు. దేవుడు నిషేధించిన ఏ ప్రాణినీ అన్యాయంగా హతమార్చరు. వ్యభిచారానికి ఏ మాత్రం పాల్పడరు. ఈ పనులు చేసే వారు మాత్రం తమ పాపఫలాన్ని అనుభవిస్తారు." (అల్‌ఫుర్కాన్: 68)

2) "(ఓ ప్రవక్తా!) వారికిలా తెలియజెయ్యి - ఆత్మవంచనకు పాల్పడిన నా దాసులారా! దేవుని కరుణ పట్ల నిరాశ చెందకండి. ఆయన మీ పాపాలన్నీ క్షమించగలడు. ఆయన గొప్ప క్షమాశాలి, అమిత కరుణామయుడు." (అజ్జుమర్ : 53)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 39వ అధ్యాయం - సూరతు జ్జుమర్]

## 53వ అధ్యాయం - అవిశ్వాసులు తమ అవిశ్వాస జీవితంలో చేసిన సత్కార్యాలకు ఇస్లాం స్వీకరణ తరువాత పుణ్యఫలం లభిస్తుందా?

77. హజ్రత్ హకీం బిన్ హిజామ్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! నేను నా అవిశ్వాస జీవితంలో చేసిన సత్కార్యాలకు ఎలాంటి ప్రతిఫలం లభిస్తుంది? నేను గతంలో దానధర్మాలు, బానిసల విముక్తి, బంధువుల పట్ల దయాదాక్షిణ్యాలు మొదలైన సత్కార్యాలు చేశాను. మరి నాకు వాటి సుకృతఫలం లభిస్తుందంటారా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ' ' నీవు నీ గత సత్కార్యాల కారణంగానే ముస్లిం అయ్యావు (అంటే ఇస్లాం స్వీకరించిన కారణంగా నీ గత సత్కార్యాలకు కూడా ఇప్పుడు పుణ్యఫలం లభిస్తుంది)" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 24వ అధ్యాయం - మన తసద్దఖఫిష్షిర్కి సుమ్మ అస్లమ్]

78. హజ్రత్ అబ్దుల్లాబిన్ మస్వూద్ (రజి) కథనం:- "సత్యాన్ని విశ్వసించి, తమ విశ్వాసానికి ఎలాంటి అన్యాయం తలపెట్టని వారికే శాంతి లభిస్తుంది; అలాంటి వారే నిజానికి సన్మార్గగాములు" అనే ఖుర్ఆన్ సూక్తి (6:82) అవతరించినప్పుడు ముస్లింలు భయపడిపోయి "దైవప్రవక్తా! మాలో ఆత్మలకు అన్యాయం చేసుకోని వారెవరున్నారు?" అని అడిగారు. అప్పుడు దైవప్రవక్త (స) ఇలా అన్నారు. "ఇక్కడ అన్యాయం అంటే మీరు సాధారణంగా భావిస్తున్న అన్యాయం కాదు, ఈ సూక్తిలో అన్యాయం అంటే షిర్క్ (బహుదైవారాధన) అని అర్థం. (ఖుర్ఆన్‌లో) హజ్రత్ లుఖ్మాన్ (అలైహి) తన కుమారునికి హితబోధ చేస్తూ 'కుమారా! దేవునికి ఏ శక్తినీ సాటి కల్పించకు. దేవునికి సాటి కల్పించడం (బహుదైవారాధన) ఘోరమైన అన్యాయం' అని పలికిన మాటలు మీకు తెలియవా?"

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 41వ అధ్యాయం - ఖౌలుల్లాహ్ తాలా వలఖద్ ఆతైనా లుఖ్మాన్]

## 56వ అధ్యాయం - పైశాచిక ఆలోచనలు ఆచరణల్లో రాకుండా ఉంటే క్షమించబడతాయి.

79. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) (ఓసారి మాకు) హితోపదేశం చేస్తూ "నా అనుచర సమాజం ప్రజల హృదయాల్లో రేకెత్తే పైశాచిక ఆలోచనలు కార్యరూపం దాల్చనంతవరకు, లేదా అవి ఇతరుల ముందు ప్రస్తావించబడనంతవరకు దేవుడు వాటిని క్షమిస్తాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 11వ అధ్యాయం - అత్తలాఖుఫిల్ ఇగ్లాఖ్]

★ హజ్రత్ హకీం బిన్ హిజామ్ ఇస్లాం స్వీకరించక పూర్వం వందమంది బానిసలకు బానిసత్వం నుండి విమోచనం కలిగించారు. అంతేగాక వంద ఒంటెలు మోసే సామగ్రి కూడా దానం చేసి ఉన్నారు.

## 57వ అధ్యాయం - సత్సంకల్పానికి పుణ్యం ఉంది కాని, దుస్సంకల్పానికి పాపం లేదు

80. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ప్రవచనం ప్రకారం, "ఒక వ్యక్తి తన ఇస్లాం ధర్మాన్ని మెరుగుపరచుకుంటున్నప్పుడు అతను చేసే ప్రతి సత్కార్యానికి పది నుంచి ఏడు వందల రెట్లు పుణ్యం అతని కర్మ పత్రంలో వ్రాయబడుతుంది. అయితే అతను చేసే ప్రతి దుష్కార్యానికి మాత్రం ఒక్క పాపమే అతని కర్మపత్రంలో వ్రాయబడుతుంది."

[సహీహ్ బుఖారీ : 2 వ ప్రకరణం - ఈమాన్, 31వ అధ్యాయం - హుస్నె ఇస్లామిల్ మర్యి]

81. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ప్రవచనం ప్రకారం దేవుడు (మానవుల) పాపపుణ్యాలను (ముందే) రాసి పెట్టి, వాటిని గురించి స్పష్టంగా వివరించాడు. కనుక ఒక సత్కార్యం చేయ సంకల్పించుకున్నవాడు ఆ సంకల్పాన్ని ఆచరణలో పెట్టలేకపోయినా దేవుడు అతని కర్మపత్రంలో పూర్తిగా ఒక పుణ్యం రాసిపెడ్తాడు. ఒకవేళ అతను సంకల్పించుకున్న పనిని ఆచరణలో కూడా పెడ్తే దేవుడు అతని కర్మపత్రంలో పది నుంచి ఏడు వందల రెట్లు పుణ్యం రాసి పెడ్తాడు. పైగా అంతకంటే అనేక రెట్లు ఎక్కువ పుణ్యం కూడా రాసిపెడ్తాడు. పోతే ఒక దుష్కార్యం చేయ సంకల్పించుకున్నవాడు ఆ పని చేయకపోతే దేవుడు అతని కర్మపత్రంలో పూర్తిగా ఒక పుణ్యం రాసి పెడ్తాడు. ఒకవేళ అతను సంకల్పించుకున్న దుష్కార్యం ఆచరణలో పెడ్తే దేవుడు అతని కర్మపత్రంలో ఒక పాపమే నమోదు చేస్తాడు.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 31వ అధ్యాయం - మన్‌హమ్మబిహ సనతిన్ అన్ బిసయ్యిఅతిన్]

## 58వ అధ్యాయం - మనస్సులో దుష్ట ఆలోచనలు వచ్చినప్పుడు ఏం చేయాలి?

82. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త(స) సెలవిచ్చారు, "ఒక్కోసారి షైతాన్ మీలో ఒకరి దగ్గరకు వచ్చి, దీన్నెవరు సృష్టించారు, దాన్నెవరు సృష్టించారు? అని అడుగుతాడు. చివరికి నీ ప్రభువుని ఎవరు సృష్టించారని కూడా దుష్టాలోచనలు కలిగిస్తాడు. అందువల్ల ఇలాంటి దుష్టాలోచనలు మనసులో రేకెత్తినప్పుడు (వెంటనే) మీరు (వాటి కీడు నుంచి) దేవుని శరణు కోరండి. మీరు స్వయంగా ఇలాంటి పైశాచిక ఆలోచనలకు మనస్సులో తావీయకండి."

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాయిల్ ఖల్ఖ్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీస్ వ జునూదిహీ]

83. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త(స) ప్రకారం, ప్రజలు ఎల్లప్పుడూ ఏదో ఒక దాన్ని గురించి పరస్పరం ప్రశ్నించుకుంటారు. చివరికి 'దేవుడు అన్నిటినీ సృష్టించాడు, బాగానే ఉంది. అయితే దేవుడ్ని ఎవరు సృష్టించినట్లు?' అని అడుగుతారు.

[సహీహ్ బుఖారీ : 96వ ప్రకరణం - ఏతెసామ్, 3వ అధ్యాయం - మాయుక్రహు మిన్ కస్రతిస్సవాల్]

## 59వ అధ్యాయం - అసత్య ప్రమాణం చేసి సాటి ముస్లింని వంచించే వ్యక్తికి నరకశిక్ష

84. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- "తోటి ముస్లిం సోదరుడి ధనాన్ని కాజేయడానికి

అబద్ధపు సాక్ష్యమిచ్చే వ్యక్తి (మరణానంతరం) దేవుణ్ణి కలుసుకున్నప్పుడు, దేవుడు అతని పట్ల ఆగ్రహోదగ్రుడయిపోతాడు" అన్నారు దైవప్రవక్త(స). ఈ విషయాన్ని ధృవీకరిస్తూ దేవుడు దివ్యఖుర్ఆన్‌లో ఈ క్రింది సూక్తిని అవతరింపజేశాడు :

"కొందరు తమ వాగ్దానాలను, దేవుని విషయంలో చేసిన ప్రమాణాలను అతి స్వల్ప మూల్యానికి అమ్ముకుంటారు. అలాంటి (అమ్ముడుబోయిన) వారికి పరలోకంలో ఎలాంటి (పుణ్యఫలం) వాటా లభించదు. వారితో దేవుడు మాట్లాడడు, చివరికి వారి వైపు ప్రళయదినాన కన్నెత్తి కూడా చూడడు. వారిని పరిశుద్ధపరిచే ప్రసక్తి కూడా లేదు. పైగా వారికి వ్యధాభరితమైన శిక్ష పడుతుంది." (3:77)

ఉల్లేఖకుడు ఈ హదీసుని ఉల్లేఖిస్తున్నప్పుడు హజ్రత్ అష్‌అస్ బిన్ ఖైస్ (రజి) వచ్చి, "అబ్దుల్లా బిన్ మస్‌వూద్ ప్రజలకు ఏ హదీసు విన్పిస్తున్నార"ని అడిగారు. ఫలానా హదీసు విన్పిస్తున్నారని మేము చెప్పాము. అప్పుడు హజ్రత్ అష్‌అస్ బిన్ ఖైస్ (రజి) ఇలా అన్నారు: "ఈ (ఖుర్ఆన్) సూక్తి నా విషయంలో అవతరించింది. మా పినతండ్రి కొడుక్కు చెందిన స్థలంలో నేను త్రవ్వించిన ఒక బావి ఉంది. (దీని విషయంలో మా ఇద్దరి మధ్య తగాదా వచ్చింది). ఈ సందర్భంలో దైవప్రవక్త(స) నన్ను ఉద్దేశించి (బావి నీదయితే) సాక్ష్యం తీసుకురా. లేదా అతను (బావి తనదని) ప్రమాణం చేయాలి" అని అన్నారు. దానికి నేను 'దైవప్రవక్తా! అతను ఎలాగైనా ప్రమాణం చేస్తాడు' అన్నాను. అప్పుడు దైవప్రవక్త (స) 'ఏ ముస్లిం సోదరుడి ధనాన్నయినా కాజేయడానికి అబద్ధపు సాక్ష్యమిచ్చేవాడు (మరణానంతరం) దేవుణ్ణి కలుసుకున్నప్పుడు, దేవుడు అతని పట్ల ఆగ్రహోదగ్రుడయిపోతాడు' అని చెప్పారు."

[సహీహ్ బుఖారీ : 65 వ ప్రకరణం - తఫ్సీర్, 3వ అధ్యాయం - సూరా ఆలిఇమ్రాన్-3]

## 60వ అధ్యాయం - ఇతరుల సొమ్మును దౌర్జన్యంగా కొల్లగొట్టడం ఘోర పాపం.

85. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- "సొంత ఆస్తిని కాపాడుకునే ప్రయత్నంలో (దోపిడీ దొంగలచే) హతమార్చబడిన వ్యక్తి అమరగతి (వీరమరణం) పొందుతాడు" అని దైవప్రవక్త(స) చెబుతుండగా నేను విన్నాను.

[సహీహ్ బుఖారీ : 46వ ప్రకరణం - మజాలిమ్, 33వ అధ్యాయం - మన్‌ఖాతల దూనమలిహీ]

## 61వ అధ్యాయం - ప్రజల హక్కుల్ని కాలరాచే పాలకుడికి నరకశిక్ష.

86. ఇమామ్ హసన్ బస్రి (రహ్మాలై) కథనం:- హజ్రత్ మాఖల్ బిన్ యసార్ (రజి) ప్రాణాంతక వ్యాధికి గురయినప్పుడు ఉబైదుల్లా బిన్ జియాద్ ఆయన్ని పరామర్శించడానికి వచ్చారు. అప్పుడు హజ్రత్ మాఖల్ (రజి) ఆయనతో ఇలా అన్నారు, "నేను స్వయంగా దైవప్రవక్త(స) నోట విన్న ఒక హదీసు విన్పించనా? 'దేవుడు ఒక దాసుణ్ణి ప్రజాపాలకుడిగా చేసినప్పుడు, ఆ దాసుడు శ్రేయోభిలాషతో ప్రజల రక్షణ బాధ్యతను గనక నెరవేర్చకపోతే, అతను (మరణానంతరం) స్వర్గ సువాసనను కూడా ఆఘ్రాణించలేడు' అన్నారు దైవప్రవక్త(స)."

[సహీహ్ బుఖారీ : 93వ ప్రకరణం - అహ్కామ్; 8వ అధ్యాయం - మనిస్తురియర యియ్యత్‌న్ ఫలమ్ యన్సహ్]

## 62వ అధ్యాయం - నిజాయితీ, విశ్వాసం లోపించిన హృదయాల్లో దుష్టాలోచనలు

87. హ్జ్రజత్ హుజైఫా (రజి) కథనం:- దైవప్రవక్త(స) మాకు (భవిష్యత్ ప్రకటనలకు సంబంధించిన) రెండు హదీసులు విన్పించారు. ఇందులో ఒకటి (నిజమవడం) నేను చూశాను. రెండవ దాని కోసం ఎదురు చూస్తున్నాను. దైవప్రవక్త(స) మా ముందీ విషయం ప్రస్తావిస్తూ, "నిజాయితీ, విశ్వసనీయతలు ప్రజల స్వభావంలో వేరుగొన్నవి. ఆ తరువాత ప్రజలు వాటిని గురించి ఖుర్ఆన్, హదీసుల ద్వారా వివరంగా తెలుసుకున్నారు" అని అన్నారు.

ప్రజల హృదయాల నుండి నిజాయితీ, విశ్వసనీయతలు క్షీణించి పోవడం★ గురించి ఆయన మాట్లాడుతూ ఇలా అన్నారు: ఒక వ్యక్తి కాస్సేపు పడుకుంటాడు. అప్పుడు అతని హృదయం నుండి నిజాయితీ తీసివేయడం జరుగుతుంది. గాయం నయమయిన తరువాత దాని గుర్తు మిగిలిపోయినట్లు అతని నిజాయితీకి సంబంధించిన ఓ చిన్న గుర్తు మాత్రమే ఉండిపోతుంది.

ఆ తరువాత ఆ వ్యక్తి మరికాస్సేపు పడుకుంటాడు. అప్పుడు మిగిలిపోయిన ఆ కాస్త నిజాయితీ కూడా తీసివేయబడుతుంది. నిప్పు కణం కాలు మీద పడినప్పుడు బొబ్బివచ్చి చర్మం ఎలా ఉబ్బెత్తుగా కన్పిస్తుందో అలా ఉంటుంది మిగిలిన ఈ నిజాయితీకి సంబంధించిన గుర్తు. బొబ్బిలోపల ఏమీ ఉండదు (పల్చటి రసి తప్ప). ఈ నిజాయితి స్థితి కూడా అంతే. (మరో మాటలో చెప్పాలంటే ఇది నేతి బీరకాయ వంటి నిజాయితీ అన్నమాట). ప్రజలు అమ్మకం కొనుగోళ్ళయితే చేస్తారు, కాని ఏ ఒక్కరూ నిజాయితీతో వ్యవహరించరు. చివరికి 'ఫలానా తెగ మనిషి ఎంతో నిజాయితీపరుడు, ఫలానా వ్యక్తి ఎంతో మంచివాడు! ఎంతో బుద్ధిమంతుడు!!' అని ప్రశంసిస్తారు. నిజానికి అతనిలో అణుమాత్రం నిజాయితీ కూడా ఉండదు.

ఒకప్పుడు నేను మీలో ఎవరి నుండి కొనుగోలు చేస్తున్నానన్న విషయాన్ని పట్టించుకునే వాణ్ణి కాను. ఆ వ్యక్తి ముస్లిం అయి ఉంటే అతని ధర్మమైన ఇస్లాం నాకు రావలసిన హక్కు అతని నుండి ఇప్పిస్తుంది. ఒకవేళ ఆ వ్యక్తి క్రైస్తవుడయి ఉంటే అతని అధికారి ఆ హక్కు నాకు ఇప్పించేవాడు. ఈనాడు పరిస్థితి మారిపోయింది. ఇప్పుడు నేను ఫలానా వ్యక్తులతో మాత్రమే అమ్మకం, కొనుగోళ్ళు చేస్తున్నాను.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 35 వ అధ్యాయం - రఫ్అల్ అమానత్]

## 63వ అధ్యాయం - ఇస్లాం దారిద్ర్య పీడనా స్థితుల్లో ప్రారంభమైంది తిరిగి అదే స్థితికి వస్తుంది.

88. హ్జ్రజత్ హుజైఫా (రజి) కథనం:- మేము (ఓ రోజు) హ్జ్రజత్ ఉమర్ (రజి) దగ్గర కూర్చుని ఉన్నప్పుడు ఆయన మాతో మాట్లాడుతూ, "మీలో ఎవరికైనా ఉపద్రవానికి సంబంధించి దైవప్రవక్త(స)

---

★ అంటే ప్రజల హృదయాల్లో నుంచి ఇస్లాం జ్యోతి క్రమంగా సన్నగిల్లి 'అవిశ్వాస' చీకటి ఆవరిస్తూ పోతుంది. మొదట్లో ఓ చిన్న మచ్చ ఏర్పడుతుంది. తర్వాత అది కాస్త పెద్దదవుతుంది. చివరికి హృదయం పూర్తిగా నల్లబడిపోతుంది. ఇలా క్రమంగా విశ్వాసం అంతరించి అక్కడ అవిశ్వాసం గూడుకట్టుకుంటుంది. (అనువాదకుడు)

ప్రవచించిన ఏదైనా హదీసు గుర్తున్నదా?'' అని అడిగారు. "నాకు గుర్తుంది, దైవప్రవక్త(స) ఎలా ప్రవచించారో ఆ విధంగానే నాకు గుర్తుంది'' అన్నాను నేను. దానికి హజ్రత్ ఉమర్ (రజి) తప్పకుండా నీవలా చెప్పగలవని ఆశించగలను'' అని అన్నారు. అప్పుడు నేను (మాట్లాడుతూ) "ఒక మనిషికి అతని భార్యా పిల్లలు, ఇరుగు పొరుగు, సిరిసంపదల మూలంగా ఎదురయ్యే ఉపద్రవం నమాజ్, ఉపవాసవ్రతాలు, దానధర్మాలు చేయడం వల్ల, మంచిని ప్రచారం చేయడం, చెడుని అరికట్టడం వల్ల దూరమవుతుంది'' అని అన్నాను.

దానికి హజ్రత్ ఉమర్ (రజి) "నేనీ ఉపద్రవాన్ని గురించి అడగడం లేదు. భయంకరమైన ఉప్పెనలా విరుచుకుపడే ఉపద్రవాన్ని గురించి అడుగుతున్నాను'' అని అన్నారు. "విశ్వాసుల నాయకా! ఆ ఉపద్రవం వల్ల మీకెలాంటి ప్రమాదం ఉండదు. మీకు, ఆ ఉపద్రవానికి మధ్య ఒక మూసిన తలుపుంది'' అన్నాను నేను. "ఈ తలుపును బద్దలుగొడతారా లేక తెరుస్తారా?'' అని అడిగారు ఆయన. "దీన్ని బద్దలు గొట్టడం జరుగుతుంది'' అన్నాను నేను. "అయితే ఇక ఎప్పటికీ మూసు కోదు'' అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). "మరి ఈ తలుపుకు అర్థం ఏమిటో హజ్రత్ ఉమర్ (రజి)కు తెలుసా?'' అని అడిగారు అక్కడున్న వారిలో ఒకరు. "ఈ రోజు పగటి తరువాత వచ్చే రాత్రి గురించి మీకెంత తెలుసో ఆ తలుపు గురించి హజ్రత్ ఉమర్ (రజి)కు అంతకంటే బాగానే తెలుసు'' అన్నాను నేను. (ఆ తరువాత) నేను హజ్రత్ ఉమర్ (రజి)కు ఏ మాత్రం పొరపాటు లేని హదీసు విన్పించాను.

హదీసు ఉల్లేఖకుడు ఈ సందర్భంలో మాట్లాడుతూ "మేము తలుపు గురించి తెలుసుకోవడానికి హజ్రత్ హుజైఫా (రజి)ను అడిగేందుకు భయపడ్డాము. హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై)తో "మీరడగండి' అన్నాము. అప్పుడాయన అడిగితే, హజ్రత్ హుజైఫా (రజి) "ఆ తలుపు స్వయంగా హజ్రత్ ఉమరే (రజి)'' అని చెప్పారు.

(సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 4వ అధ్యాయం - అస్సలాతు కప్పారా]

89. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "పాము తన పుట్టలోకి వచ్చి ఎలా ఇమిడిపోతుందో 'విశ్వాసం' కూడా అలాగే మదీనాలోకి వచ్చి ఇమిడిపోతుంది'' అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 29 వ ప్రకరణం - ఫజాయెలుల్ మదీనా, 6వ అధ్యాయం - ఈమానుయాజరు ఇలల్ మదీనా]

## 65వ అధ్యాయం - ప్రాణాపాయ స్థితిలో విశ్వాసాన్ని దాచడం ధర్మసమ్మతమే.

90. హజ్రత్ హుజైఫా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ రోజు మాతో "ఇస్లాం సద్వచనం పఠించే వారి పేర్లన్నీ రాసి నాకివ్వండి'' అని అన్నారు. మేము పదిహేను వందల (1500) మంది పేర్లు రాసిచ్చాము. అప్పుడు మేము "మన సంఖ్య పదిహేను వందల దాకా ఉన్నా, మనం అవిశ్వాసులకు భయపడుతున్నాము. మన మీదేదో పెద్ద విపత్తు వచ్చి పడినట్లు బెంబేలు పడిపోతూ మనలో కొందరు ఒంటరిగా (ఇళ్ళల్లో రహస్యంగా) నమాజు చేస్తున్నారే'' అని మనసులో తలపోశాము.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 181 వ అధ్యాయం - కితాబతిల్ ఇమామిన్నాస్]

## 66వ అధ్యాయం - బలహీన విశ్వాసిని అతను ఖచ్చితంగా విశ్వాసి అని అనకూడదు

91. హజ్రత్ సాద్ (రజి) కథనం:- ఓ సారి దైవప్రవక్త(స) కొంతమందికి ధనం పంచిపెట్టారు. కాని నాకు ఇష్టమయిన ఒక వ్యక్తికి మాత్రం ఏమీ ఇవ్వకుండా వదిలేశారు. అప్పుడు నేను (ఆశ్చర్యపోతూ) "దైవప్రవక్తా! మీరీ వ్యక్తి పట్ల ఇలా ఎందుకు వ్యవహరించారు? దైవసాక్షి! నేను మటుకు ఇతడ్ని విశ్వాసిగానే భావిస్తున్నాను" అని అన్నాను. దానికి దైవప్రవక్త(స) "ఏమిటీ విశ్వాసియా లేక ముస్లిమా?" అని అడిగారు. ఆయన మాటలు విని నేను కాస్సేపు మౌనంగా ఉండిపోయాను.

కాని ఆ తరువాత ఆ వ్యక్తి గురించి నాకు తెలిసిన విషయాలు నన్ను మరోసారి ఈ సంగతి అడిగేందుకు ఒత్తిడి చేశాయి. నేను సంగతిని తిరిగి ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! మీరీ మనిషి పట్ల ఇలా ఎందుకు ప్రవర్తించారు? దైవసాక్షిగా చెబుతున్నాను. నాదృష్టిలో ఇతను విశ్వాసియే" అని అన్నాను. దానికి దైవప్రవక్త(స) "ఏమిటి, విశ్వాసియా లేక ముస్లిమా?" అని అన్నారు తిరిగి. దాంతో నేను మరోసారి మౌనంగా ఉండిపోయాను. అయితే కాస్సేపటి తరువాత అతడ్ని గురించి నేనెరిగిన విశేషాలు నన్ను మళ్ళీ ఈ ప్రశ్న అడిగేలా చేశాయి. నేనా సంగతిని మళ్ళీ ప్రస్తావించాను. దైవప్రవక్త(స) కూడా తిరిగి అదే సమాధానమిచ్చి ఊరుకున్నారు.

ఆ తరువాత కాస్సేపటికి ఇలా అన్నారు, "సాద్! ఒక్కోసారి నేను నాకెంతో ఇష్టుడయిన మనిషిని వదిలేసి అంతకంటే తక్కువ ఇష్టుడయిన మరొకతనికి (ధనం) ఇస్తుంటాను. (అలా ఇవ్వని పక్షంలో అతను ఇస్లాంకు దూరమయిపోవచ్చు. తత్ఫలితంగా) దేవుడు అతడ్ని నరకంలోకి విసిరి బోర్లా పడవేస్తాడేమో నన్న భయంతో నేనతనికి ధనం ఇస్తుంటాను."

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 19వ అధ్యాయం - ఇజాలమ్ యకునిల్ ఇస్లాము అలల్ హఖైఖా]

## 67వ అధ్యాయం - పటిష్టమైన ప్రమాణాలే ఎక్కువ తృప్తినిస్తాయి

92. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "(ఏదైనా విషయం గురించి) సందేహించడానికి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కంటే నేనే ఎక్కువ హక్కుదారుడ్ని,★ హజ్రత్

★ హదీసులో పేర్కొనట్లు సందేహించడానికి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కంటే నేనే ఎక్కువ హక్కుదారుడ్ని అంటే, హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) అసలు అనుమానంలో పడిపోవడమే అసాధ్యమైన విషయమని అర్థం. ఒకవేళ దైవప్రవక్తలు అనుమానంలో పడిపోయే పొరపాటు పాల్పడటం జరిగితే ఆ విషయంలో నేను హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కంటే ఎక్కువ అనుమానంలో పడిపోయేవాడ్ని. కాని హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ఎన్నడూ అనుమానించలేదు. మృతుల్ని బ్రతికించే దైవశక్తి విషయంలో స్వయంగా నేనే ఎన్నడూ అనుమానంలో పడిపోలేదని మీకు తెలుసు. అలాంటప్పుడు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ఎందుకు అనుమానంలో పడిపోతారు. ఈ విషయంలో ఆయన నాకంటే గొప్పవారు. హజ్రత్ లూత్ (అలైహి) దృఢమైన ఆధారాన్ని ఆశ్రయించడం అంటే దేవుని రక్షణను కోరుకోవడం అన్నమాట. రాజదూత మాటను ఒప్పుకోవటం అంటే - అపనింద నుండి బయటపడేందుకు షరతు విధించే ప్రయత్నం చేయకుండా జైలు నుండి బయటపడే అవకాశం లభించినపుడు దాన్ని తొందరగా వినియోగించుకోవడానికి ప్రయత్నించడం అని అర్థం.

హజ్రత్ ముహిస్సనత (రహ్మలై) అభిప్రాయం ప్రకారం మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) యూసుఫ్ (అలైహి) సహనాన్ని ప్రశంసించారు. ఆయన జైల్లో సుదీర్ఘకాలం గడిపినప్పటికీ రాజదూత వచ్చినప్పుడు జైలు నుండి బయటపడటానికి తొందరపడలేదు. నేరస్తులు సాధారణంగా క్షమాభిక్ష లభించగానే జైలు నుండి బయటపడేందుకు ఉబలాటపడతారు హజ్రత్ యూసుఫ్ (అలైహి) అలా చేయకుండా, మీ రాజుగారి దగ్గరకెళ్ళి చేతులు కోసుకున్న స్త్రీల సంగతేమిటో అడిగిరా అన్నారు. రాజదూతతో ఈ విధంగా ఆయన తన నిర్దోషిత్వాన్ని, చేయని నేరానికి జరిగిన అన్యాయాన్ని రాజు ముందు నిరూపించాలని భావించారు.

ఇబ్రాహీం (అలైహి) దేవునితో 'ప్రభూ! నీవు మృతుల్ని ఎలా బ్రతికిస్తావో కాస్త నాకు చూపించు' అని అన్నారు. అప్పుడు దేవుడు 'నీకు (నామీద) నమ్మకం లేదా?' అని అడిగాడు. దానికి, ఆయన 'ఎందుకు లేదు, నమ్మకం ఉంది. కాకపోతే మనోతృప్తి కోసం అడుగుతున్నా' అని అన్నారు. దేవుడు హజ్రత్ లూత్ (అలైహి)ని కరుణించుగాక. ఆయన దృఢమైన ఆశ్రయం (అంటే దేవుని రక్షణ) కోరుకునేవారు! ఒకవేళ నేను కారాగారంలో హజ్రత్ యూసుఫ్ (అలైహి) ఉన్నంత కాలం గనక ఉండి ఉంటే రాజదూత మాటను ఒప్పుకునేవాడ్ని."

[సహీహ్ బుఖారీ: 60వ ప్రకరణం - అంబియా, 15వ అధ్యాయం - ఖాలుహువ నబ్బిహుమ్ అన్ జైఫి ఇబ్రాహీం]

## 68వ అధ్యాయం - మహనీయ ముహమ్మద్ (స) యావత్తు మానవాళి కోసం వచ్చిన దైవప్రవక్త

93. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు, "నాకు పూర్వం వచ్చిన దైవప్రవక్తలందరికీ వారికి ముందొచ్చిన ప్రవక్తల కివ్వబడిన మహిమల్లాంటి మహిమలే ప్రసాదించబడ్డాయి. ఆ మహిమలను చూసి ప్రజలు విశ్వసించారు. అయితే దేవుడు నాకు (గొప్ప మహిమగా) దివ్యాస్మృతి (దివ్యఖుర్ఆన్)ని ప్రసాదించాడు. అందువల్ల ప్రళయదినాన ఇతర దైవప్రవక్తల అనుచరుల కంటే నా అనుచరులు అత్యధిక సంఖ్యలో ఉంటారని నేను ఆశిస్తున్నాను."

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం -1వ అధ్యాయం - కైఫ నుజూలుల్ వహీ]

94. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఇలా తెలిపారు, "మూడు విధాల వ్యక్తులకు దేవుడు రెట్టింపు పుణ్యఫలం ప్రసాదిస్తాడు (1) గ్రంథ ప్రజలకు చెందినవాడు. (యూదుడు లేక క్రైస్తవుడు అయి ఉండి తమ దైవప్రవక్త (హజ్రత్ మూసా లేక హజ్రత్ ఈసా)తో పాటు, ముహమ్మద్ (స)ను కూడా విశ్వసించే వ్యక్తి. (2) అటు దేవుని హక్కుల్ని, ఇటు తన యజమాని హక్కుల్ని కూడా నిర్వర్తించే బానిస. (3) ఒక మహిళా బానిసను కలిగి ఉండి, ఆమెకు మంచి విద్యాబుద్ధులు గరిపి, తరువాత ఆమెను బానిసత్వం నుంచి విముక్తి కలిగించి తన భార్యగా చేసుకునే వ్యక్తి. అతనికి కూడా రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది."

[3వ ప్రకరణం - ఇల్మ్, 31వ అధ్యాయం - తాలీమిర్రజులి ఉమ్మత్]

## 69వ అధ్యాయం - హజ్రత్ ఈసా (అలై) పునరాగమనం - ముహమ్మదీయ ధర్మశాస్త్రమే ఆయనకు శరణ్యం

95. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఈవిధంగా తెలిపారు, "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్ష్యం! త్వరలోనే మర్యమ్ కుమారుడు (హజ్రత్ ఈసా అలైహిస్సలాం) రాజ్యాధినేతగా మీ మధ్య అవతరిస్తారు. అప్పుడాయన శిలువను విరగ్గొడతారు, సూకరసంహారం చేస్తారు. జజ్‌యా (దక్షిణ రుసుం)ను రద్దు చేస్తారు. సిరిసంపదలు అపరిమితంగా వచ్చి పడతాయి. దాంతో ధనికులు దానం చేయగోరినా దాన్ని స్వీకరించేవారే ఉండరు."

[సహీహ్ బుఖారీ : 34 వ ప్రకరణం - అల్‌బుయూ, 102వ అధ్యాయం - ఖతలిల్ ఖంజీర్]

96. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "మర్యం కుమారుడు ఈసా (అలైహి) మీ మధ్య అవతరిస్తారు. (ఆయన సమక్షంలో కూడా) మీ అధినేత మీలోని వాడే అయి ఉంటాడు. అప్పుడు మీకు ఎలా అన్పిస్తుంది (ఎంత ఆనందంగా ఉంటుంది)?" అన్నారు దైవప్రవక్త (స). ★

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 59వ అధ్యాయం - నుజూలె ఈసాబిన్ మర్యం అలైహి]

## 70వ అధ్యాయం - స్వీకారయోగ్యం కాని విశ్వాసం, ప్రళయకాల చిహ్నం

97. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం :- "సూర్యుడు పడమర నుంచి ఉదయించనంతవరకు ప్రళయం సంభవించదు. సూర్యుడు పడమర నుంచి ఉదయించగానే ప్రజలు ఆ వింత చూసి అందరూ (ఇస్లాం ధర్మాన్ని) విశ్వసిస్తారు. కాని అప్పుడు విశ్వసించడం వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు" అన్నారు దైవప్రవక్త(స). ఆ తరువాత ఆయన దివ్యఖుర్ఆన్‌లోని ఈ సూక్తిని పఠించారు:

> "ఇకవారు దేనికోసం ఎదురుచూస్తున్నారు? వారి ముందు దైవదూతలు ప్రత్యక్షం కావాలని చూస్తున్నారా? లేక నీ ప్రభువు స్వయంగా వారి దగ్గరకు దిగి రావాలనా? లేక నీ ప్రభువు సూచనల్లో కొన్ని బహిర్గతమయ్యే సమయం కోసం ఎదురుచూస్తున్నారా? నీ ప్రభువు సూచనల్లో కొన్ని ప్రత్యేక సూచనలు బహిర్గతమయ్యే రోజు అసలు సత్యాన్నే విశ్వసించనివాడు వాటిని (కళ్ళారా చూసి) విశ్వసించినా దాని వల్ల అతనికి ఎలాంటి ప్రయోజనం ఉండదు. అలాగే (గతంలో) విశ్వసించి ఎలాంటి సత్కార్యం చేయని వాడికి సయితం అతని విశ్వాసం ఆ రోజు ఎలాంటి ప్రయోజనం చేకూర్చదు." (6:158)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 6వ అధ్యాయం - సూరతుల్ అన్ ఆమ్ - 9వ అంశం హలుమ్మ షుహదా అకుమ్]

98. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- నేను మస్జిద్‌లో ప్రవేశించాను. దైవప్రవక్త(స) లోపల కూర్చొని ఉన్నారు. సూర్యుడు అస్తమించగానే "అబూజర్! ఈ సూర్యుడు ఎక్కడికెళ్తున్నాడో నీకేమైనా తెలుసా?" అని అడిగారాయన. నేను "దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు' అన్నాను. అప్పుడు దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు. "ఈ సూర్యుడు (దైవసన్నిధికి) వెళ్ళి సాష్టాంగ ప్రణామం చేయడానికి అనుమతి అడుగుతాడు. అతనికి అనుమతి లభిస్తుంది. చివరికి (ఒక రోజు) నీవు ఎక్కడ్నుంచి వచ్చావో అక్కడికే తిరిగి వెళ్ళు అని ఆజ్ఞ అవుతుంది. దాంతో సూర్యుడు పడమర నుండి ఉదయిస్తాడు." ఆ తరువాత దైవప్రవక్త(స) "ఇదే అతని గ్యమస్థానం" అనే సూక్తిని పఠించారు.

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 22వ అధ్యాయం - వకాన అర్షుహూ అలల్ మాయి వహువ రబ్బుల్ అర్షిల్ అజీం]

## 71వ అధ్యాయం - దైవప్రవక్త(స)పై 'వహీ' అవతరణ ప్రారంభం

99. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ప్రారంభంలో దైవప్రవక్త(స)కు కొన్ని

★ అంటే, హజ్రత్ ఈసా (అలైహి) తిరిగి వచ్చినపుడు, ఆయన షరీయతె ముహమ్మదీని అనుసరించి ఖుర్ఆన్, హదీసుల ప్రకారమే ఆచరిస్తారని అర్థం.

నిజమైన కలలు వచ్చేవి. అవి పగటి వెల్తురులా స్పష్టంగా ఉండేవి. ఈ విధంగా ఆయనపై దివ్యావిష్కృతి (వహీ) అవతరించడం మొదలయింది. దాంతో ఆయన ఏకాంతం, ఏకాగ్రతలను కోరుకొని హిరా కొండ గుహలో ఒంటరిగా గడపనారంభించారు. ఆ గుహలో ఆయన రోజుల తరబడి ఇంటికి వెళ్ళకుండా దైవారాధనలో నిమగ్నులయి ఉండేవారు. ఈ పనికోసం ఆయన అన్న పానీయాలు కూడా వెంట తీసికెళ్ళి పెట్టుకునేవారు. అవి అయిపోయిన తరువాత (ఇంటికి) హజ్రత్ ఖదీజా(రజి) దగ్గరకు వచ్చేవారు. అయితే మళ్ళీ ఆయన అదే విధంగా అన్నపానీయాలు తీసుకొని గుహకు వెళ్ళిపోయేవారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక, ఓ రోజు ఉన్నట్టుండి ఆ కొండ గుహలో హఠాత్తుగా సత్యం (దివ్యావిష్కృతి) సాక్షాత్కరించింది. ఆయన దగ్గరకు ఓ దైవదూత (హజ్రత్ జిబ్రయీల్ అలైహి) వచ్చి 'చదువు' అన్నాడు. దానికి దైవప్రవక్త(స) తాను చదువురాని వాడినని సమాధానమిచ్చారు. ఆయన ఈ సంఘటనను ప్రస్తావిస్తూ ఇలా తెలియజేశారు:

"అప్పుడు దైవదూత నన్ను పట్టుకొని గట్టిగా అదిమి వదలిపెట్టారు. ఆ సమయంలో నాకు శ్వాస ఆగినంత పనయింది. తరువాత ఆయన 'చదువు' అన్నారు మళ్ళీ. నేను తిరిగి 'నాకు చదువు రాదు' అన్నాను. దైవదూత నన్ను మరోసారి పట్టుకొని గట్టిగా అదిమి వదిలేశారు. నాకు మళ్ళీ శ్వాస ఆగిపోయినంత బాధ కలిగింది. దైవదూత మళ్ళీ 'చదువు' అన్నారు. నేను యథా ప్రకారం నాకు చదువురాదని చెప్పాను. దైవదూత నన్ను మూడోసారి పట్టుకొని గట్టిగా అదిమి వదలి పెట్టారు. దాంతో నాకు మళ్ళీ శ్వాస ఆగిపోయినంత బాధవేసింది. ఆ తరువాత అతను 'చదువు సర్వసృష్టికర్త అయిన నీ ప్రభువు పేరుతో. ఆయన మానవుణ్ణి నెత్తుటి ముద్దతో సృష్టించాడు. చదువు నీ ప్రభువు ఎంతో అనుగ్రహశాలి' అని అన్నాడు." (అలఖ్)

దైవప్రవక్త(స) భయకంపితులయి (ఎలాగో) ఈ మాటలు ఉచ్చరించారు. ఆ తరువాత ఆయన (ఇంటికి) హజ్రత్ ఖదీజా బిన్తె ఖువైలిద్ దగ్గరకు వచ్చారు. వచ్చీ రాగానే (పడక మీద పడి) 'దుప్పటి కప్పు, దుప్పటి కప్పు' అన్నారు. హజ్రత్ ఖదీజా (రజి) గబగబా దుప్పటి తెచ్చి కప్పారు. దాంతో కాస్సేపటికి ఆయనకు ఆవహించిన భయాందోళనలు కాస్త తగ్గు ముఖం పట్టాయి. అప్పుడాయన హజ్రత్ ఖదీజా(రజి)కు జరిగిన వృత్తాంతం పూస గుచ్చినట్లు చెప్పి, తన ప్రాణానికేదో ముప్పు వాటిల్లినట్లు అనిపిస్తోందని అన్నారు. హజ్రత్ ఖదీజా (రజి) ఆయనకు ధైర్యం చెబుతూ "దైవసాక్ష్యం! అలా ఎన్నటికీ జరగదు. మీరు బంధువుల్ని ఆదరిస్తారు, అభిమానిస్తారు. ఇతరుల బరువు బాధ్యతలను మోస్తారు. ఆపదల్లో ఉన్నవారిని ఆదుకుంటారు. సంపాదించలేని వారికి సంపాదించిపెడ్తారు. అతిథుల్ని సత్కరిస్తారు. సత్యమార్గంలో ఎదురయ్యే కష్టనష్టాలను భరిస్తారు. ఈ విషయంలో ఇతరుల క్కూడా సహాయం చేస్తారు. అలాంటి మిమ్మల్ని దేవుడు ఎన్నటికీ అవమానపర్చడు" అని అన్నారు.

ఆ తరువాత హజ్రత్ ఖదీజా (రజి) దైవప్రవక్త(స)ను తన పెదనాన్న కొడుకు వరఖా బిన్ నౌఫిల్ బిన్ అసద్ బిన్ అబ్దుల్ ఉజ్జా దగ్గరకు పిలుచుకెళ్ళారు. ఈయన పూర్వం అజ్ఞానకాలంలో క్రైస్తవ మతస్థుడిగా ఉండేవాడు. హెబ్రూ భాష మాట్లాడటం, చదవడం ఆయనకు బాగా తెలుసు. హెబ్రూ భాషలో ఆయన ఇంజీల్ (బైబిల్)ని రాస్తుంటారు. చాలా వృద్ధుడయిపోయాడు. కళ్ళు కూడా కానరాకుండా పోయాయి.

హజ్రత్ ఖదీజా (రజి) ఆయన దగ్గరకు చేరుకొని "అన్నా! మీ అబ్బాయి చెప్పే మాటలు కాస్త వినండి" అన్నారు. అప్పుడు వరఖా దైవప్రవక్త(స)ను ఉద్దేశించి "అబ్బాయి! నువ్వేమి చూశావో చెప్పు" అన్నారు. దైవప్రవక్త(స) తాను కన్నది, విన్నది అంతా వివరంగా ఆయనకు తెలియజేశారు. వరఖా ఈ మాట విని ఇలా అన్నారు: "అయితే అతను మూసా ప్రవక్త (అలైహి) దగ్గరకు దేవుడు దివ్యాజ్ఞ్ఞృతినిచ్చి పంపిన దైవదూతే. అందులో ఎలాంటి సందేహం లేదు. నీ జాతి ప్రజలు నిన్ను (మక్కా నుండి) బహిష్కరించేనాటికి నేను బ్రతికి ఉంటే ఎంత బాగుండు!"

ఈ మాటలకు దైవప్రవక్త (స) ఆశ్చర్యపోతూ "ఏమిటీ, ప్రజలు నన్ను ఇక్కడ్నుంచి వెళ్ళగొడ్తారా?" అన్నారు. "ఔను నాయనా! నీవు ఈనాడు చెబుతున్నటువంటి విషయాలే గతంలో కూడా కొందరు చెప్పారు. వారిలో ప్రతి ఒక్కర్నీ ఈ లోకం విరోధించింది. (అలాంటిది నిన్ను విరోధించడంలో వింతేముంది) అప్పటి దాకా నేను జీవించి ఉంటే నా శక్తివంచన లేకుండా నీకు సహాయపడతా" అన్నారు వరఖా బిన్ నౌఫిల్.

[సహీహ్ బుఖారీ : 1వ ప్రకరణం - వహీ, 3వ అధ్యాయం - హద్దసనా యహ్యా బిన్ బకీర్]

100. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త(స)కు వహీ తాత్కాలికంగా నిలిచిపోయిన రోజులను గురించి మాట్లాడుతూ ఇలా అన్నారు - "ఓ రోజు నేను నడిచివెళ్తుంటే (దారిలో ఓ చోట) హఠాత్తుగా నాకు ఆకాశం నుండి ఓ (కంఠ) స్వరం విన్పించింది. నేను వెంటనే తలపైకెత్తి చూశాను. చూస్తే ఇంకేముంది, హిరా గుహలో నా దగ్గరకు వచ్చి పోయిన దైవదూతే భూమ్యాకాశాల మధ్య ఓ కుర్చీ మీద కూర్చొని ఉన్నాడు. అతడ్ని అతని మహాకాయం, గాంభీర్యతను చూడగానే నా గుండె ఝల్లుమంది. నేను భయంతో వణికిపోతూ ఇంటికి వచ్చి పడ్డాను. పడక మీద మేను వాల్చి "దుప్పటి కప్పు, నాకు దుప్పటి కప్పు" అన్నాను. సరిగ్గా అదే సమయంలో "దుప్పటి కప్పి పడుకున్నవాడా! లే, లేచి ప్రజలను హెచ్చరించు..........సహనం వహించు" వరకు గల సూక్తులు నాపై అవతరించాయి. ఆ తరువాత 'వహీ' నిరాఘాటంగా రావడం మొదలయింది."

[సహీహ్ బుఖారీ : 1వ ప్రకరణం - వహీ, 3వ అధ్యాయం]

101. హజ్రత్ యహ్యాబిన్ కసీర్ (రహ్మాలై) కథనం:- నేను దివ్యఖుర్‌ఆన్‌లోని ఏ సూక్తి మొట్టమొదట అవతరించిందని అబూ సల్మాబిన్ అబ్దుర్రహ్మాన్‌ని అడిగాను. దానికాయన 'యా అయ్యుహల్ ముద్దస్సిర్ (దుప్పటి కప్పి పడుకున్నవాడా!)' అని సమాధానమిచ్చారు. "కాని జనం 'ఇఖ్రాబిస్మిరబ్బికల్లజి' సూక్తులు మొదట అవతరించాయని చెబుతున్నారే" అని అన్నాను నేను. హజ్రత్ అబూసల్మా (రహ్మాలై) నా మాటలు విని "నేను ఈ విషయం గురించి హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రహ్మాలై)ను అడిగాను. నీ వంటున్న మాటలనే ఆయన ముందు ప్రస్తావించాను. దానికాయన "నేను నీ ముందు స్వయంగా దైవప్రవక్త (స) చెప్పిన విషయాన్నే ఉంచుతాను. దైవప్రవక్త(స) ఇలా తెలిపారు అన్నారు-

నేను హిరా గుహలో ఏకాంత జీవితం గడుపుతున్న రోజులవి. నా ధ్యాన యోగం ముగిసిన తరువాత నేను అక్కడ్నుంచి బయలుదేరి క్రిందికి దిగాను. అంతలో ఎక్కడ్నుంచో ఒక శబ్దం వినిపించింది. నేను కుడి-ఎడమ, వెనుకా -ముందూ అంతా కలియజూశాను. కాని నాకెవరూ కన్పించలేదు. తరువాత నేను తలపైకెత్తి ఆకాశం వైపు చూశాను. అక్కడ నేను ఓ (అద్భుత) దృశ్యం

చూశాను. ఆ దృశ్యం చూడగానే నేను (భయపడిపోయి) ఖదీజా(రజి) దగ్గరికి (ఇంటికి) వచ్చి 'దుప్పటికప్పు, నా మీద చన్నీళ్ళు చిలికించు' అన్నాను. ఆమె వెంటనే దుప్పిటి తెచ్చి కప్పి నా మీద కొంచెం చన్నీళ్ళు చిలికించింది. అప్పుడు 'యా అయ్యుహల్ ముద్దస్సిరు ఖుమ్ ఫఅన్‌జిర్...' అనే సూక్తులు అవతరించాయి."

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ 73 - అల్‌ముద్దసిర్ సూరా]

## 72వ అధ్యాయం - మహాప్రవక్త(స) గగన యాత్రలో నమాజ్ ఆదేశం

102. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ అబూజర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు - "నేను మక్కాలో నివసిస్తున్న కాలంలో (ఓ రోజు రాత్రి) నా ఇంటికప్పుకు రంధ్రం వేసి (దైవదూత) హజ్రత్ జిబ్రయీల్ అవతరించారు. ఆయన నా హృదయాన్ని బయటికి తీసి జమ్ జమ్ జలంతో శుద్ధి చేశారు. ఆ తరువాత ఆయన ఒక బంగారు పళ్ళెంలో వివేచన, విశ్వాసాలను నింపి తెచ్చి వాటిని నా హృదయంలో పోశారు. ఆపై నా హృదయాన్ని యథాతథంగా హృదయ కుహరంలో పెట్టేశారు. ఆ తరువాత నా చేయి పట్టుకొని, భూమండలానికి సమీపంలో ఉన్న ఆకాశం వైపుకు అధిరోహించారు.

మేము మొదటి ఆకాశం దగ్గరికి చేరుకున్న తరువాత హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) అక్కడున్న ద్వారపాలకునితో 'తలుపు తెరు' అన్నారు. దానికి ద్వారపాలకుడు 'ఎవరు మీరు?' అని అడిగాడు. "దైవదూత జిబ్రయీల్‌ని" అని సమాధానమిచ్చారు. "మీ వెంట మరెవరైనా ఉన్నారా?" అని ప్రశ్నించాడు ద్వారపాలకుడు. తన వెంట ముహమ్మద్(స) ఉన్నారని అన్నారు జిబ్రయీల్ (అలైహి). "మరి ఆయన్ని పిలుచుకు రావడానికి ఎవరినైనా పంపడం జరిగిందా?" అని తిరిగి అడిగాడు ద్వారపాలకుడు. ఔనన్నారు జిబ్రయీల్ (అలైహి). ఈ మాట విని ద్వారపాలకుడు తలుపు తెరిచాడు. మేము మొదటి ఆకాశం మీదికి చేరుకున్నాము.

అక్కడ మేము ఒక వ్యక్తిని చూశాము. అతని కుడి ఎడమల వైపు జనసమూహాలున్నాయి. ఆ వ్యక్తి కుడివైపు చూసినప్పుడల్లా సంతోషిస్తూ ఉంటాడు; ఎడమవైపు చూసినప్పుడల్లా దుఃఖిస్తూ ఉంటాడు. అతను (నన్ను చూడగానే) "సదాచార సంపన్నుడయిన దైవప్రవక్తా! సద్గుణశాలి అయిన కుమారరత్నమా!! స్వాగతం! రా నాయనా!!" అని అన్నారు. నేను (ఆశ్చర్యపోతూ) "ఎవరీయన?" అని అడిగాను. "ఈయన (ఆదిమానవుడు) హజ్రత్ ఆదం(అలైహి). ఈ జనసమూహాలు ఆయన సంతతికి చెందిన ఆత్మలు. ఈ ఆత్మలలో కుడివైపున్న ఆత్మలు స్వర్గానికి పోయేవి; ఎడమవైపున్న ఆత్మలు నరకానికి పోయేవి. అందుకే హజ్రత్ ఆదం (అలైహి) కుడివైపు చూసి సంతోషంతో నవ్వుతున్నారు, ఎడమవైపు చూసి దుఃఖంతో రోదిస్తున్నారు" అని సమాధానమిచ్చారు హజ్రత్ జిబ్రయీల్ (అలైహి).

ఆ తరువాత ఆయన నన్ను వెంటబెట్టుకొని రెండవ ఆకాశం మీదికి చేరుకున్నారు. అక్కడి ద్వారపాలకుడితో 'తలుపు తెరువు' అన్నారు. ఆ ద్వారపాలకుడు కూడా మొదటి ఆకాశద్వారపాలకుడు అడిగినటువంటి ప్రశ్నలే అడగటం, వాటికి హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) సమాధానాలివ్వడం జరిగింది. ఆ తరువాత ద్వారపాలకుడు తలుపు తెరిచాడు.

హజ్రత్ అనస్ (రజి) ఇతర విశేషాలను హజ్రత్ అబూజర్ (రజి) మాటల్లో ఇలా తెలియజేశారు: "దైవప్రవక్త(స) సప్తాకాశాలలో హజ్రత్ ఆదం (అలైహి)ను, హజ్రత్ ఇద్రీస్ (అలైహి)ను, హజ్రత్ మూసా(అలైహి)ను, హజ్రత్ ఈసా (అలైహి)ను, హజ్రత్ ఇబ్రాహీం(అలైహి)ను చూశారు. అయితే వారి స్థానాలను గురించి ప్రస్తావించలేదు. కాకపోతే తాను హజ్రత్ ఆదం (అలైహి)ను భూసమీప ఆకాశం మీద, హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ను ఆరవ ఆకాశం మీద చూశానని మాత్రం తెలిపారు.

హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం జిబ్రయీల్ (అలైహి) దైవప్రవక్త(స)తో కలసి హజ్రత్ ఇద్రీస్ (అలైహి)ను సమీపించినప్పుడు "సదాచార సంపన్నుడయిన దైవ ప్రవక్తా! సద్గుణశాలి అయిన సోదరా!! స్వాగతం!!!" అన్నారు హజ్రత్ ఇద్రీస్ (అలైహి). ఆ తరువాతి విషయం దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు:-

నేను జిబ్రయీల్ (అలైహి)ని "ఈయన ఎవర"ని అడిగాను. దానికి జిబ్రయీల్ (అలైహి) "ఈయన ఇద్రీస్" అని చెప్పారు. ఆ తరువాత నేను మూసా (అలైహి)ను సమీపించాను. ఆయన నన్ను చూడగానే "సదాచార సంపన్నుడయిన దైవప్రవక్తా! సద్గుణశాలి అయిన సోదరా!! స్వాగతం!!!" అని అన్నారు. నేను జిబ్రయీల్(అలైహి)ని "ఈయన ఎవర"ని అడిగాను. "ఈయన మూసా(అలైహి)" అని తెలిపారు జిబ్రయీల్(అలైహి). ఆ తరువాత నేను ఈసా (అలైహి)ను సమీపించాను. ఆయన కూడా నన్ను చూడగానే "సదాచార సంపన్నుడయిన దైవప్రవక్తా! సద్గుణశాలి అయిన సోదరా!! స్వాగతం!!!" అని ఆహ్వానించారు. నేను "ఈయన ఎవర"ని అడిగాను. "ఈయన ఈసా (అలైహి)" అని తెలిపారు జిబ్రయీల్(అలైహి). ఆ తరువాత నేను ఇబ్రాహీం (అలైహి)ను సమీపించాను. ఆయన కూడా నన్ను చూడగానే "సదాచార సంపన్నుడయిన దైవప్రవక్తా! సద్గుణశాలి అయిన కుమారా!! స్వాగతం!!!" అని నన్ను స్వాగతించారు. నేను "ఈయన ఎవర"ని అడిగాను. "ఈయన ఇబ్రాహీం (అలైహి)" అని తెలిపారు జిబ్రయీల్ (అలైహి).

ఆ తరువాత నన్ను (జిబ్రయీల్) మరింత పైకి తీసికెళ్ళారు. చివరికి నేను ఓ విశిష్ట ప్రదేశానికి చేరుకున్నాను. అక్కడ (విధివ్రాత) రాస్తున్న కలం ధ్వని నాకు సరసరమంటూ విన్పించింది.

ఆ తరువాత దేవుడు నా అనుచర సమాజానికి (రోజుకు) యాభై నమాజులు విధించాడు. నేను దీన్ని తీసుకొని తిరిగి వస్తుంటే మార్గమధ్యలో హజ్రత్ మూసా (అలైహి) తారసపడి "దేవుడు మీ అనుచర సమాజానికి ఏ పని విధించాడు?" అని అడిగారు. నేను "యాభై నమాజులు విధించాడ"ని చెప్పాను. అప్పుడాయన "మీ అనుచర సమాజం అన్ని నమాజులు చేయజాలదు. మీ ప్రభువు దగ్గరికి తిరిగి వెళ్ళి నమాజుల సంఖ్య తగ్గించమని విన్నవించుకోండి" అని అన్నారు. ఈ విధంగా మూసా(అలైహి) నన్ను వెనక్కి పంపించారు. (నేను విషయం విన్నవించుకున్నాక) దేవుడు కొన్ని నమాజులు తగ్గించాడు. తిరిగి నేను మూసా (అలైహి) దగ్గరకు వచ్చి "దేవుడు కొన్ని నమాజులు తగ్గించాడ"ని తెలిపాను. "మరొకసారి మీ ప్రభువు దగ్గరకు వెళ్ళండి. మీ అనుచర సమాజం అన్ని నమాజులు కూడా చేయజాలదు" అన్నారు మూసా (అలైహి). దాంతో నేను దేవుని దగ్గరకు వెళ్ళి మళ్ళీ విన్నవించుకున్నాను. దేవుడు మరి కొన్ని నమాజులు తగ్గించాడు. నేను మూసా(అలైహి) దగ్గరకు తిరిగొచ్చి "దేవుడు మరి కొన్ని నమాజులు తగ్గించాడ"ని తెలియజేశాను. "కాని మీ అనుచర సమాజం అన్ని నమాజులు కూడా చేయజాలదు, ఇంకొకసారి మీ ప్రభువు దగ్గరకు వెళ్ళిరండి" అన్నారు మూసా (అలైహి). అంచేత నేను

మరొకసారి వెళ్ళి దేవునికి విన్నవించుకున్నాను. అప్పుడు దేవుడు నమాజులను ఐదుకు తగ్గించి " ఈ ఐదు నమాజులు యాభై నమాజులతో సమానం. నా దగ్గర మాట మారదు" అని అన్నాడు. నేను మూసా దగ్గరకు తిరిగి వచ్చి ఈ సంగతి చెప్పాను. ఆయన నన్ను తిరిగి నా ప్రభువు దగ్గరకు వెళ్ళమని పురమాయించారు. కాని "నా ప్రభువు దగ్గరకు వెళ్ళి మళ్ళీ అడగటానికి నాకు సిగ్గేస్తుంద"ని అన్నాను నేను.

ఆ తరువాత హజ్రత్ జిబ్రయీల్(అలైహి) నన్ను వెంటబెట్టుకొని అక్కడ్నుంచి బయలుదేరారు. ఇలా నేను సిద్రతుల్ ముంతహా (అంటే అత్యద్భుతమైన ఓ విశిష్ఠ వృక్షరాజం) దగ్గరకు చేర్చబడ్డాను. అదొక చిత్రవిచిత్రమైన రంగురంగుల సన్నివేశం.★ కాని అదేమిటో, దాని వాస్తవికతేమిటో మాత్రం నాకు తెలియదు. ఆ తరువాత నన్ను స్వర్గానికి తీసికెళ్ళారు. అక్కడ నేను ముఖాలతో నిర్మించబడిన గుమ్మటాలు చూశాను. అక్కడి మన్ను కస్తూరి వాసనలు గుబాళిస్తుంది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 1వ అధ్యాయం - కైఫ ఫురిజతిస్సలాత్]

103. హజ్రత్ మాలిక్ బిన్ సాసా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "నేను కాబా గృహం సమీపంలో అరమోడ్పు కనులతో అర్ధ నిద్రావస్థలో కూర్చొని ఉన్నాను - దైవప్రవక్త(స) ఈ సందర్భంలో ఇద్దరు వ్యక్తులు వచ్చిన విషయాన్ని ప్రస్తావిస్తూ - వారు నా దగ్గరకు ఒక బంగారు పళ్ళెం తీసుకొచ్చారు. అందులో విశ్వాసం, వివేచనలు నిండి ఉన్నాయి. నా వక్ష స్థలాన్ని పొట్ట క్రింది భాగం వరకు చీల్చివేశారు. తరువాత నా ఉదరాన్ని 'జమ్ జమ్' జలంతో శుద్ధి చేసి విశ్వాసం, వివేచనలతో దాన్ని నింపారు. ఆ తరువాత గాడిద కంటే కొంచెం పొట్టి, కంచర గాడిద కన్నా కొంచెం ఎత్తయిన ఒక తెల్ల జంతువుని తెచ్చారు. దాన్ని 'బురాఖ్' అంటారు. (దాని మీద ఎక్కి) నేను జిబ్రయీల్ (అలైహి)తో కలసి బయలుదేరాను.

చివరికి మేమిద్దరం భూసమీప ఆకాశం దగ్గరకు చేరుకున్నాము. అక్కడ (ద్వారపాలకుడు) ఎవరు మీరని అడిగాడు. దానికి జిబ్రయీల్, తాను జిబ్రయీల్‌నని అన్నారు. "మరి మీతో పాటు ఉన్న ఈ వ్యక్తి ఎవర"ని అడిగాడు (ద్వారపాలకుడు). "ఈయన (దైవప్రవక్త) ముహమ్మద్ (స)" అన్నారు జిబ్రయీల్ (అలైహి). "ఈయన్ని పిలవడం జరిగిందా?" అని అడిగాడు (ద్వార పాలకుడు). ఔనన్నారు జిబ్రయీల్ (అలైహి). "అయితే రండి. సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అన్నాడు (ద్వారపాలకుడు). ఆ తరువాత నేను హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరకు చేరుకొని ఆయనకు సలాం చేశాను. ఆయన నన్ను స్వాగతిస్తూ "రా నాయనా! నీవు దైవప్రవక్తవు కూడా, నాకు కుమారుడువి కూడా" అన్నారు.

అక్కడ్నుంచి మేము రెండవ ఆకాశానికి చేరుకున్నాము. (అక్కడి ద్వారపాలకుడు కూడా) "ఎవరు మీరు" అన్నాడు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) తాను జిబ్రయీల్‌నని సమాధానమిచ్చారు. "మరి మీతో పాటు వచ్చిన ఈ వ్యక్తి ఎవరు?" అని అడిగాడు (ద్వారపాలకుడు). "ఈయన (దైవప్రవక్త) ముహమ్మద్(స)" అన్నారు జిబ్రయీల్ (అలైహి). "ఈయన్ని పిలవడం జరిగిందా?" అడిగాడు (ద్వారపాలకుడు). ఔనన్నారు జిబ్రయీల్ (అలైహి). "అయితే రండి, సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అన్నాడు ద్వారపాలకుడు. ఆ తరువాత నేను హజ్రత్ ఈసా (అలైహి), హజ్రత్ యహ్యా

★ అంటే, అది అంతకు పూర్వం ఎన్నడూ కానరాని, మాటల్లో వర్ణించ వీలులేని, చిత్ర విచిత్రమైన అద్భుత దృశ్యం అని అర్థం.

(అలైహి)ల దగ్గరకు వెళ్ళాను. వారిద్దరు నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం సోదరా! శుభం దైవప్రవక్తా!!" అని అన్నారు.

అక్కడ్నుంచి మేము మూడవ ఆకాశానికి చేరుకున్నాము. (అక్కడి ద్వారపాలకుడు కూడా) "ఎవరు మీర"ని అడిగాడు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) తాను జిబ్రయీల్‌నని సమాధానమిచ్చారు. "మరి మీతో పాటు వచ్చిన ఈ వ్యక్తి ఎవరు?" అని అడిగాడు (ద్వారపాలకుడు). "ఈయన (దైవప్రవక్త) ముహమ్మద్(స)" అన్నారు హజ్రత్ జిబ్రయీల్ (అలైహి). "ఈయన్ని పిలిపించడం జరిగిందా?" అడిగాడు (ద్వారపాలకుడు). ఔనన్నారు జిబ్రయీల్(అలైహి). "అయితే రండి, సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అన్నాడు (ద్వారపాలకుడు). ఆ తరువాత నేను హజ్రత్ యూసుఫ్ (అలైహి)ను చేరుకొని ఆయనకు సలాం చేశాను. ఆయన నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం సోదరా! శుభం దైవప్రవక్తా!!" అని అన్నారు.

అక్కడ్నుంచి మేము నాలుగవ ఆకాశానికి చేరుకున్నాము. (అక్కడి ద్వారపాలకుడు కూడా) "ఎవరు మీర"ని అడిగాడు. దానికి జిబ్రయీల్ (అలైహి) తాను జిబ్రయీల్‌నని చెప్పారు. "మరి మీతో పాటు ఉన్న ఈ వ్యక్తి ఎవరు?" అన్ని ప్రశ్నించాడు (ద్వారపాలకుడు). "ఈయన (దైవప్రవక్త) ముహమ్మద్ (స)" అన్నారు జిబ్రయీల్ (అలైహి). "దూతను పంపి ఈయన్ని పిలిపించడం జరిగిందా?" అడిగాడు ద్వారపాలకుడు. ఔనన్నారు జిబ్రయీల్ (అలైహి). "అయితే రండి, సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అన్నాడు (ద్వారపాలకుడు). ఆ తరువాత నేను హజ్రత్ ఇద్రీస్ (అలైహి) దగ్గరకు చేరుకొని ఆయనకు సలాం చేశాను. ఆయన నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం సోదరా! శుభం దైవప్రవక్తా!!" అని అన్నారు.

అక్కడ్నుంచి మేము ఐదవ ఆకాశానికి చేరుకున్నాము. (అక్కడి ద్వారపాలకుడు కూడా) "ఎవరు మీర"ని అడిగాడు. దానికి జిబ్రయీల్ (అలైహి) తాను జిబ్రయీల్‌నని అన్నారు. "మరి మీతో పాటు ఉన్న ఈ వ్యక్తి ఎవరు?" అని ప్రశ్నించాడు (ద్వారపాలకుడు). "ఈయన (దైవప్రవక్త) ముహమ్మద్ (స)" అన్నారు జిబ్రయీల్ (అలైహి). "దూతను పంపి ఈయన్ని పిలిపించడం జరిగిందా?" అడిగాడు (ద్వారపాలకుడు). ఔనన్నారు జిబ్రయీల్ (అలైహి). "అయితే రండి, సుస్వాగతం ! మీ రాక శుభదాయకం!!" అన్నాడు (ద్వారపాలకుడు). ఆ తరువాత నేను హజ్రత్ హారూన్ (అలైహి) దగ్గరకు వెళ్ళాను. ఆయనకు నేను సలాం చేశాను. అప్పుడాయన నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం సోదరా! శుభం దైవప్రవక్తా!!" అని అన్నారు.

అక్కడ్నుంచి మేము ఆరవ ఆకాశానికి చేరుకున్నాము. అక్కడ కూడా ఇలా ప్రశ్నోత్తరాలు జరిగాయి. ప్రశ్న :- ఎవరు మీరు? జవాబు:- జిబ్రయీల్. ప్రశ్న:- మీతో పాటు ఉన్న ఈ వ్యక్తి ఎవరు? జవాబు:- (దైవప్రవక్త) ముహమ్మద్ (స). ప్రశ్న:- ఈయన్ని పిలిపించడం జరిగిందా? జవాబు:- ఔను. "అయితే రండి, సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అన్నాడు (ద్వారపాలకుడు). ఆ తరువాత నేను హజ్రత్ మూసా (అలైహి) దగ్గరకు చేరుకొని ఆయనకు సలాం చేశాను. ఆయన నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం సోదరా! శుభం దైవప్రవక్తా!!" అని అన్నారు. అక్కడ్నుంచి కదలి నేను ముందుకు నడుస్తుంటే హజ్రత్ మూసా (అలైహి) దుఃఖించడం మొదలెట్టారు. నేను వెనక్కి తిరిగి "మీరెందుకు దుఃఖిస్తున్నారు?" అని అడిగాను. దీనికి సమాధానంగా ఆయన "దేవా! నా తరువాత

నీవు దైవప్రవక్తగా నియమించి పంపిన ఈ యువకుని అనుచర సమాజం నా అనుచర సమాజం కంటే అత్యధిక సంఖ్యలో స్వర్గ ప్రవేశం చేస్తుందే! (ఇతనెంత అదృష్టవంతుడు!!)" అని అన్నారు.

అక్కడ్నుంచి మేము ఏడవ ఆకాశానికి చేరుకున్నాము. (అక్కడ కూడా ఇలాంటి ప్రశ్నోత్తరాలే సాగాయి). ప్రశ్న:- ఎవరు మీరు? సమాధానం:- జిబ్రయీల్. ప్రశ్న:- మీతో పాటు వచ్చిన ఈ వ్యక్తి ఎవరు? సమాధానం:- (దైవప్రవక్త) ముహమ్మద్ (స). ప్రశ్న:- దూతను పంపి పిలిపించబడ్డాడా ఇతను? సమాధానం:- ఔను. "అయితే రండి, సుస్వాగతం! మీ రాక శుభదాయకం!!" అని స్వాగతం పలకబడింది. ఇక్కడ నేను హజ్రత్ ఇబ్రాహీం (అలైహి)ను కలుసుకున్నాను. ఆయనకు సలాం చేశాను. అప్పుడాయన నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ "స్వాగతం కుమారా! శుభం దైవప్రవక్తా!!" అన్నారు.

అక్కడ్నుంచి నన్ను "బైతుల్ మామూర్" దగ్గరకు తీసికెళ్ళడం జరిగింది. నేను దాన్ని చూసి "ఇదేమిటీ?" అని అడిగాను. "ఇదే బైతుల్ మామూర్" అన్నారు జిబ్రయీల్ (అలైహి). ఇక్కడ ప్రతి రోజూ డెబ్భై వేల మంది దైవదూతలు ప్రార్థన చేస్తారు. ఇలా ప్రార్థన చేసిన డెబ్భై వేల మంది దైవదూతలు తిరిగి ప్రళయం వరకూ ఇక్కడ ప్రార్థన చేయడానికి రాలేరు. (అంటే దైవదూతల సంఖ్య అసంఖ్యాకంగా ఉన్నందున ఏ ఒక్కరికీ ఇక్కడ రెండవ సారి ప్రార్థన చేసే అవకాశమే రాదన్నమాట).

ఆ తరువాత నన్ను "సిద్రతుల్ ముంతహా" [1] ఓ విశిష్ట (దివ్యవృక్షరాజం) దగ్గరికి తీసికెళ్ళి చూపారు. దాని రేగు పండ్లు చూస్తే హజర్[2] ప్రాంతంలో ఉండే (మట్టి) కడవల్లా కన్పించాయి. దాని ఆకులు ఏనుగు చెవులంత పెద్దగా ఉన్నాయి. ఆ చెట్టు మొదలు నుంచి నాలుగు సెలయేరులు ప్రవహిస్తున్నాయి. ఆ నాలుగింటిలో రెండు బహిరంగమైనవి, రెండు గుప్తమైనవి. నేను వీటి సంగతేమిటని అడిగితే "సప్తనదులు స్వర్గంలో ఉన్నాయని, బహిరంగ నదులు (భూమండలంలోని) నైలు, ఫరాత్ నదుల"ని జిబ్రయీల్(అలైహి) తెలియజేశారు.

ఆ తరువాత నాకు (నా అనుచర సమాజానికి) యాభై నమాజులు ఆచరించాలని విధించారు. ఈ ఆజ్ఞ తీసుకొని నేను తిరిగి వస్తుంటే దారిలో హజ్రత్ మూసా (అలైహి) నన్ను, పరిస్థితి ఏమిటని అడిగారు. "(రోజూ) యాభై నమాజులు విధిగా చేయాలని నిర్ణయం జరిగింద"ని చెప్పాను నేను. అప్పుడు హజ్రత్ మూసా (అలై) ఇలా అన్నారు: "నాకు మనుషుల స్థితిగతుల్ని గురించి మీకంటే ఎక్కువ తెలుసు. నేను ఇస్రాయీల్ సంతతి ప్రజలను బాగా పరీక్షించి చూశాను. మీ అనుచర సమాజం ఇంతటి భారాన్ని మోయజాలదు. మీరు మీ ప్రభువు దగ్గరకు తిరిగి వెళ్ళి (కొన్ని నమాజులు) తగ్గించమని విన్నవించుకోండి". ఈ మాటలు విని నేను దేవుని సన్నిధికి తిరిగి వెళ్ళి విషయం విన్నవించుకున్నాను. దేవుడు (నా విన్నపం విని) నలభై నమాజులకు తగ్గించాడు. కాని హజ్రత్ మూసా (అలైహి) మళ్ళీ ఇంతకు ముందులాగే (మరికొన్ని నమాజులు తగ్గించమని దైవాన్ని అభ్యర్థించండని) అన్నారు. నేను దేవుని సన్నిధికి మళ్ళీ వెళ్ళాను. దేవుడు ఈసారి ముప్ఫై నమాజులకు తగ్గించాడు. కాని మళ్ళీ అదే జరిగింది. నేను దేవుని సన్నిధికి మరోసారి వెళ్ళాను. దేవుడు నమాజుల సంఖ్యను ఇరవైకి తగ్గించాడు. హజ్రత్ మూసా (అలైహి) తిరిగి అదే సలహా ఇచ్చారు. నేను మళ్ళీ పోయి దేవుని సన్నిధిలో

(1) అరబీ భాషలో 'సిద్రా' అంటే రేగు చెట్టు అని అర్థం.

(2) హజర్ అంటే మదీనా పట్టణం సమీపంలో ఉన్న ఒక ప్రదేశం పేరు.

విన్నవించుకున్నాను. దేవుడు నమాజుల సంఖ్యను పదికి తగ్గించాడు. కాని హజ్రత్ మూసా (అలైహి) మళ్ళీ అదే సలహా ఇచ్చి నన్ను పురమాయించారు. (నేను మరోసారి వెళ్ళి విన్నవించుకుంటే) దేవుడు విధిగా చేయవలసిన నమాజుల సంఖ్యను ఐదుకు తగ్గించాడు. అయితే హజ్రత్ మూసా (అలైహి) మరొకసారి వెళ్ళి విన్నవించుకోమని సలహా ఇచ్చారు. కాని (నాకు మనస్స్పృక) "నేను దైవాజ్ఞను శిరసావహించాను" అని చెప్పేశాను. అప్పుడు దేవుని వైపు నుంచి "నేను నా (దాసుల కొరకు నిర్ణయించిన) విధిని జారీ చేశాను. నా దాసులపై భారం కూడా తగ్గించాను. ఒక పుణ్యకార్యానికి పదింతల పుణ్యఫలం ప్రసాదిస్తాను. (అంటే ఐదు నమాజులకు యాభై నమాజులంత పుణ్యఫలం లభిస్తుందన్నమాట)" అని ఓ (అదృశ్య) వాణి విన్పించింది.

[సహీహ్ బుఖారీ: 59వ ప్రకరణం - బద్‌యిల్‌ఖల్ఖ్, 6వ అధ్యాయం - జిక్రుల్ మలాయిక]

104. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) తన గగన పర్యటనను గురించి ప్రస్తావిస్తూ ఇలా అన్నారు: "నేను మేరాజ్ (గగన పర్యటన) రాత్రి హజ్రత్ మూసా (అలైహి)ను చూశాను. ఆయన గోధుమ వర్ణంతో, పొడుగ్గా, వంకీల జుట్టు కలిగి ఉన్నారు. షనుఆ తెగకు చెందిన మనిషిలా ఉన్నారు. నేను హజ్రత్ ఈసా (అలైహి)ని కూడా చూశాను. ఆయన సాధారణ ఎత్తు కలిగి ఉన్నారు. తెలుపు, ఎరుపు కలిసిన వర్ణంతో, వంకీలు లేని సామాన్య శిరోజాలు కలవారు. ఆ రాత్రి నేను నరకపాలకుడయిన మాలిక్‌ని, దజ్జాల్‌ని కూడా చూశాను."

(హజ్రత్ ఇబ్నె అబ్బాస్ కథనం ప్రకారం) ఇవి దైవప్రవక్త(స)కు ఆ రాత్రి దేవుడు చూపిన కొన్ని నిదర్శనాలు. అనంతరం ఆయన (సఅసం) ఈ వచనం పఠించారు: కనుక "ఆయనకు లభించిన వాటి పట్ల మీరు అనుమానంలో పడకండి." (ఖుర్‌ఆన్ - 32 : 23)

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్‌యిల్‌ఖల్ఖ్, 7వ అధ్యాయం - ఇజాఖాల అహ్దకుమ్....]

105. హజ్రత్ ముజాహిద్ (రహ్మలై) కథనం:- మేము హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) దగ్గర కూర్చొని ఉన్నాము. అప్పుడు మాలో కొందరు దజ్జాల్ ప్రస్తావన లేవదీస్తూ "దజ్జాల్ రెండు కళ్ళ మధ్య (నుదుటిపై) కాఫిర్ అనే పదం వ్రాయబడి ఉంటుందని దైవప్రవక్త(స) తెలిపార"ని అన్నారు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మధ్యలో కల్పించుకొని "నేనీ సంగతి వినలేదు. అయితే హజ్రత్ మూసా (అలైహి) హాజరయ్యానంటూ లోయలో దిగుతుండగా చూసిన దృశ్యం ఇప్పటికీ తన కళ్ళ ముందు మెదలుతోందని మాత్రం దైవప్రవక్త(స) అన్నారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 30వ అధ్యాయం - అత్తల్బియతి ఇజన్ హదరఫిల్ వాది]

106. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: దైవప్రవక్త (స) మేరాజ్ రాత్రిని ప్రస్తావిస్తూ ఇలా అన్నారు: "నేను మేరాజ్ రాత్రిన హజ్రత్ మూసా (అలైహి)ను చూశాను. ఆయన బక్కచిక్కిన మనిషి. ఆయన శిరోజాలు పెద్దగా వంకీలు తిరగలేదు. షనుఆ తెగకు చెందిన మనిషిలా ఉంటారు. నేను హజ్రత్ ఈసా (అలైహి)ని కూడా చూశాను. ఆయన పొడుగూ పొట్టీ కాని మధ్య రకం ఎత్తు కలిగినవారు. ఎర్రగా ఉంటారు. స్నానాల గది నుండి అప్పుడే బయటికి వచ్చిన మనిషిలా (ఎంతో శుభ్రంగా) ఉంటారు. హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) సంతతిలో ఆయనే అందరికంటే ఎక్కువగా ఇబ్రాహీం (అలైహి) ని పోలి ఉంటారు. ఆ తరువాత నా దగ్గరికి రెండు గిన్నెలు తీసుకువచ్చారు. అందులో ఒకటి పాలగిన్నె. రెండవ దానిలో సారాయి ఉంది. హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) వాటి వైపు చూపిస్తూ "ఈ రెండిటిలో మీ

కిష్టమైనది సేవించవచ్చు" అని అన్నారు. అప్పుడు నేను పాలగిన్నె తీసుకొని అందులోని పాలను త్రాగాను. అప్పుడు (ఎవరో) "నీవు సహజత్వాన్ని[1] పొందావు. దానికి బదులు నీవు సారాయి త్రాగడానికి ఇష్టపడి ఉంటే నీ అనుచర సమాజం చెడిపోయి ఉండేది."

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - 24వ అధ్యాయం - ఖౌలిల్లాహి - హల్ అతాక హదీసు మూసా]

## 73వ అధ్యాయం - మర్యం కుమారుడు మసీహ్ - దజ్జాల్ మసీహ్‌ల ప్రస్తావన

107. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ రోజు ప్రజల ముందు దజ్జాల్ మసీహ్ గురించి ప్రస్తావిస్తూ "దేవుడు సుతరామూ గుడ్డివాడు కాదు. కాని దజ్జాల్ మసీహ్ మాత్రం కుడికన్ను లేనివాడయి ఉంటాడు. అతని కన్ను ఉబ్బిన ద్రాక్ష పండులా ఉంటుంది" అని తెలిపారు.

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్ కుర్ ఫిల్ కితాబి మర్యమ్]

108. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలిపారు - "రాత్రి నేను ఓ కల గన్నాను. ఆ కలలో నేను కాబా గృహం దగ్గర ఓ వ్యక్తిని చూశాను. అతను గోధుమ వర్ణంలో ఎంతో అందంగా ఉన్నాడు. అతని శిరోజాలు తిన్నగా భుజాల మీద వ్రేలాడుతున్నాయి. తల నుంచి నీటి బిందువులు రాలి పడుతున్నాయి. అతను ఇద్దరు వ్యక్తుల భుజాల మీద చేతులు వేసి కాబా గృహం ప్రదక్షిణ చేస్తున్నాడు. నేను ప్రజలను ఇతనెవరని అడిగాను. "అతను మర్యం కుమారుడు మసీహ్ (అలైహి)" అని చెప్పారు వారు. నేను అతని వెనుక మరొక వ్యక్తిని కూడా చూశాను. ఆ వ్యక్తి తల వెంట్రుకలు చిందరవందరగా పడి ఉన్నాయి, వంకీలు తిరిగిన జుట్టది. కుడికన్ను పోయి ఉంది. అతను చాలా వరకు ఇబ్నెఖతన్‌లా[2] ఉంటాడు. అతను కూడా ఇద్దరు మనుషుల భుజాల మీద చేతులు వేసి కాబా ప్రదక్షిణం చేస్తున్నాడు. నేను ప్రజలను ఇతనెవరని అడిగాను. "అతను మసీహ్ దజ్జాల్" అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ: 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్ కుర్ ఫిల్ కితాబి మర్యమ్]

109. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచిస్తుండగా విన్నాను - "ఖురైష్ నాయకులు (మేరాజ్ సంఘటన విషయమయి) నన్ను ధిక్కరించినప్పుడు నేను హిజ్ర్ అనే చోట నిలబడి ఉన్నాను. అదే సమయంలో దేవుడు బైతుల్ మఖ్దిస్ దృశ్యాన్ని నా కళ్ళ ముందు ప్రదర్శించాడు. దాన్ని చూస్తూ నేను బైతుల్ మఖ్దిస్ గుర్తులన్నీ తెలియజేశాను."

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబే అన్సారీ, 41వ అధ్యాయం - హదీసుల్ ఇస్రా]

## 74వ అధ్యాయం - సిద్రతుల్ ముస్తహా (విశిష్ఠ రేగు వృక్షం)

110. అబూ ఇస్‌హాఖ్ షైబానీ (రహ్మాలై) కథనం:- నేను జిర్రబిన్ హుబైష్ (రహ్మాలై) ముందు " ఈ విధంగా అతను రెండు ధనస్సులంత దూరాన లేక అంతకంటే కొంచెం తక్కువ దూరాన వచ్చి

(1) సహజత్వం అంటే ఇక్కడ ఇస్లాం అని అర్థం.

(2) ఇబ్నె ఖతన్ బిన్ అబ్దుల్ ఉజ్జా అజ్ఞానయుగంలో (ఇస్లాం అవతరణకు పూర్వమే) చనిపోయిన ఒక అవిశ్వాసి.

నిలబడ్డాడు. ఆ తరువాత అతను తాను అందజేయవలసిన దివ్య సందేశాన్ని (ఆ) దైవదాసునికి అందజేశాడు (53:9,10)'' అనే దైవ సూక్తిని ప్రస్తావించి, ఈ విషయం గురించి మీ అభిప్రాయం ఏమిటని అడిగాను. దీనికాయన సమాధానమిస్తూ ''దీని అర్థం దైవప్రవక్త(స) హజ్రత్ జిబ్రయీల్ (అలైహి)ని చూశారని, హజ్రత్ జిబ్రయీల్‌కు ఆరొందల రెక్కలున్నాయని హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) తెలియజేశారు.'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్‌యిల్ ఖల్ఖ్, 7వ అధ్యాయం - ఇజ్ ఖాల అహదుకుమ్....]

## 75వ అధ్యాయం - దైవప్రవక్త (స) తమ ప్రభువును దర్శించారా?

**111.** హజ్రత్ మస్రూఖ్ (రజి) కథనం:- నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను ''అమ్మా! దైవప్రవక్త(స) తమ ప్రభువును (ప్రత్యక్షంగా) చూశారా?'' అని అడిగాను. దానికి ఆమె ఇలా అన్నారు: ''నీ మాటలు విని నా రోమాలు నిక్కపొడుచుకున్నాయి. నీకు తెలుసా? ఈ మూడు విషయాలను గురించి మీలో ఎవరైనా తన వైపు నుంచి ఏదైనా అంటే అతను అబద్ధాలకోరుగా పరిగణించబడతాడు :

(1) ''ఎవరి చూపులూ ఆయన్ని అందుకోజాలవు. ఆయన మాత్రం అందరి చూపులనూ అందుకోగలడు.'' (దివ్యఖుర్‌ఆన్ = 6:103)
''దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షంగా సంభాషించడు. మానవ మాత్రుడికి అది సాధ్యమయ్యే పని కాదు. దేవుడు తన మాటను వహీ ద్వారానో లేక తెర వెనుక నుంచో మాత్రమే మానవునికి చేరవేస్తాడు.''

(దివ్యఖుర్‌ఆన్- 42:51)

(2) అలాగే రేపు జరగబోయే విషయాలేవో దైవప్రవక్త(స)కు తెలుసనేవాడు కూడా అబద్ధాల కోరే. ఈ సందర్భంలో హజ్రత్ ఆయిషా (రజి) ఈ సూక్తిని ఉదాహరించారు - ''రేపు తాను ఏం చేయనున్నాడో ఏ మానవునికీ తెలియదు.''

(దివ్యఖుర్‌ఆన్ - 31:34)

(3) అదే విధంగా దైవప్రవక్త (స) (ధర్మానికి సంబంధించిన) ఏదైనా విషయం రహస్యంగా ఉంచారని అనేవాడు కూడా అబద్ధాలరాయుడే. దీన్ని గురించి హజ్రత్ ఆయిషా (రజి) ఈ సూక్తిని ఉదాహరించారు - ''ప్రవక్తా! నీ ప్రభువు నుండి నీపై అవతరించే బోధనలను ప్రజలకు అందజేస్తూ ఉండు. ఒకవేళ నీవలా చేయకపోతే దౌత్య బాధ్యతను నెరవేర్చని వాడవుతావు.''

(దివ్యఖుర్‌ఆన్ - 5:67)

కనుక అసలు విషయం ఏమిటంటే, దైవప్రవక్త(స) జిబ్రయీల్ (అలైహి)ను అతని నిజ స్వరూపంలో రెండు సార్లు చూశారు.''

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 53వ సూరా - అన్నజ్మ్ - 1వ అధ్యాయం - హద్దసనా యహ్యా]

112. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఎవరైనా, దైవప్రవక్త(స) తన ప్రభువును చూశానని అన్నాడంటే అతను చాలా ఘోరమైన (తప్పుడు) మాట అన్నాడన్న మాట. నిజానికి ఆయన(దేవుడ్ని చూడలేదు) హజ్రత్ జిబ్రయీల్ (అలైహి)ని మాత్రమే అతని నిజరూపంలో చూశారు. అతని రూపం, ఆకారంలో యావత్తు దిగ్మండలపై విస్తరించింది. అతను ఆకాశాన్ని ఈ చివరి నుంచి ఆ చివరి వరకు కప్పి వేశాడు.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 7వ అధ్యాయం - ఇజ్ఖాల అహ్దకుమ్...]

## 78వ అధ్యాయం - విశ్వాసులు పరలోకంలో దైవాన్ని దర్శిస్తారు

113. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు: "స్వర్గంలో రెండు రజిత వనాలు ఉన్నాయి. ఆ వనాల్లో పాత్రలతో సహా సమస్త వస్తువులు వెండితో రూపొందించినవి అయి ఉంటాయి. అలాగే మరో రెండు స్వర్గ వనాలు కూడా ఉన్నాయి. ఆ వనాల్లో పాత్రలతో సహా సమస్త వస్తువులు బంగారంతో రూపొందించినవి అయి ఉంటాయి. అదనవనంలో దైవదర్శనం కొరకు దాసులకు, వారి ప్రభువుకు మధ్య దివ్య తేజస్సుతో కూడిన అద్భుతమైన పరదా మాత్రమే ఉంటుంది. అది ఆయన ముఖవర్చస్సును కప్పి ఉంటుంది. (ఆ తెర లేకపోతే దాసులు తమ ప్రభువును అనుక్షణం చూస్తూ ఉంటారు.)"

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం -అత్తఫ్సీర్, 55వ సూరా, -అర్రహ్మాన్ - 1వ అధ్యాయం - వమిన్ దూనిహిమా జన్నతాన్.]

## 79వ అధ్యాయం - దైవదర్శనం ఎలా ఉంటుంది?

114. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- కొందరు దైవప్రవక్త(స) ముందు ప్రళయ దినం గురించి ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! ప్రళయదినాన మనం మన ప్రభువును చూస్తామా?" అని అడిగారు. దానికి ఆయన "మబ్బు లేనప్పుడు సూర్యుడ్ని చూడటంలో మీకేమయినా అనుమానం కలుగుతుందా?" అని ఎదురు ప్రశ్న వేశారు. ప్రజలు లేదన్నారు. అప్పుడు దైవప్రవక్త (స) ఇలా అన్నారు :

"అదే విధంగా మీరు ప్రళయదినాన మీ ప్రభువును చూడగలుగుతారు. ప్రళయదినాన మానవులు పునర్జీవులయినప్పుడు దేవుడు వారితో 'ప్రపంచంలో ఉండగా ఎవరు ఏ శక్తిని ఆరాధిస్తూ ఉండేవారో, వారంతా తమ తమ ఆరాధ్యదైవాల వెనుక వెళ్ళి నిలబడండి' అని ఆదేశిస్తాడు. దాంతో కొందరు సూర్యుని వెనుక, కొందరు చంద్రుని వెనుక, మరి కొందరు విగ్రహాల వెనుక వెళ్ళి నిలబడతారు. చివర్లో ఈ అనుచర సమాజం (ముస్లిం సమాజం) మిగిలి ఉంటుంది. ఇందులో కపట విశ్వాసులు కూడా ఉంటారు.

ఆ తరువాత దేవుడు వారి దగ్గరకు వచ్చి నేను మీ ప్రభువును అంటాడు. కాని వారు (ఆయన్ని గుర్తుపట్టలేరు. అందువల్ల) 'మా ప్రభువు మా దగ్గరకు రానంతవరకు మేము ఇక్కడే నిల్చుంటాము. మా ప్రభువు వచ్చిన తరువాత మేము ఆయన్ని గుర్తిస్తాము' అని అంటారు. ఆ తరువాత దేవుడు (ముస్లింలకు పరిచయమైన రూపంలో) వారి ముందుకు వచ్చి, నేను మీ ప్రభువును అంటాడు. అప్పుడు వారు ఆ విషయాన్ని అంగీకరిస్తూ , 'ఔను, నీవే మా ప్రభువు' అనంటారు.

“ఆ తరువాత నరకం మీద ఒక వారధి నిర్మించబడుతుంది. ఆ వారధిపై నుంచి అందరూ నడవాల్సిందిగా చెప్పడం జరుగుతుంది. దైవ ప్రవక్తలందరిలోకెల్లా నేనే మొట్టమొదట నా అనుచర సమాజాన్ని వెంట బెట్టుకొని ఆ వారధి దాటుతాను. ఆ రోజు దైవప్రవక్తలు తప్ప మరెవరూ మాట్లాడలేరు. దైవప్రవక్తలయినా 'దేవా! కాపాడు. (మమ్మల్ని నరకాగ్ని నుండి) కాపాడు' అని మాత్రమే అంటారు. నరకంలో సాదాన్ (చెట్టు) ముండ్లులాంటి మొనదేలిన కొక్కెలు ఉంటాయి. మీరు సాదాన్ ముండ్లు చూశారా ఎప్పుడైనా?” దీనికి ప్రవక్త అనుచరులు 'చూశాం' అన్నారు.

దైవప్రవక్త(స) తిరిగి ఇలా చెప్పడం ప్రారంభించారు: “ఆ కొక్కెలు కూడా అచ్చం సాదాన్ (చెట్టు) ముండ్లులాగే ఉంటాయి. అయితే ఇవి చాలా పెద్దవిగా ఉంటాయి. వాటిని గురించి దేవునికి తప్ప మరెవరికీ తెలియదు. అవి మానవుల్ని వారి వారి దుష్కర్మలను బట్టి గుచ్చి లాక్కుంటాయి. అలా నరక వారధి దాటే వారిలో కొందరు తమ దుష్కర్మలను బట్టి (కొక్కెలకు తగిలి నరకంలో పడిపోయి) హతమవుతారు. మరి కొందరు నుజ్జునుజ్జు అయిపోతారు. అయితే ఆ తరువాత విముక్తి పొందుతారు. (కర్మ విచారణ, వారధి దాటివేత మొదలైన పనులన్నీ ముగిసిన) తరువాత దేవుడు తన దూతలను పిలిచి, దేవుణ్ణి ఆరాధించిన వారందర్నీ నరకం నుండి బయటికి తీయండని ఆజ్ఞాపిస్తాడు.

“అప్పుడు దైవదూతలు నరకంలో పడ్డ వారిలో సజ్దా (సాష్టాంగ ప్రణామం) చిహ్నాలు ఉన్న వారిని గుర్తిస్తారు. సజ్దా చిహ్నం ఉండే శరీర భాగాన్ని కాల్చకూడదని దేవుడు నరకాగ్నిని నిషేధించాడు. అది తప్ప మానవుని మిగిలిన దేహమంతటినీ నరకాగ్ని దహించి వేస్తుంది. ఈ కారణంగానే దైవదూతలు (ఏకదైవారాధకులయిన) వారిని ఆ చిహ్నాల ద్వారా గుర్తించి నరకాగ్ని నుండి బయటికి తీస్తారు. అప్పటికే ఆ నరకాగ్ని బాధితులు బాగా కాలిపోయి బొగ్గుగా మారిపోతారు. నరకం నుండి బయటికి తీసిన తరువాత వారి మీద అమృతం చిలికించబడుతుంది. దాంతో వారు వరదకు కొట్టుకు వచ్చిన మట్టి నుండి మొలకెత్తిన విత్తనంలా మొలకెత్తుతారు.

“దాసుల కర్మ విచారణ పూర్తిగా ముగిసిన తరువాత చివర్లో ఒక మనిషి మిగిలిపోతాడు. ఇతను స్వర్గప్రవేశం చేసే వారిలో చివరి వాడవుతాడు. అయితే అతను నరకం నుండి బయట పడినప్పటికీ అతని ముఖం మాత్రం నరకం వైపే తిరిగి ఉంటుంది. అప్పుడా వ్యక్తి దేవుణ్ణి వేడుకుంటూ “ప్రభూ! నరకం నుండి వస్తున్న దుర్వాసనతో నేను చచ్చిపోతున్నాను. దాని (సుదీర్ఘ) జ్వాలలు నన్ను మాడ్చివేస్తున్నాయి. నా ముఖాన్ని నరకం వైపు నుండి వేరే వైపుకు తిప్పి వేయి” అని అంటాడు.

దానికి దేవుడు “నీ ఈ విన్నపాన్ని మన్నిస్తే ఆ తరువాత నీవు మరొక విన్నపం చేయకుండా ఉంటావని నమ్మకం ఏమిటి?” అని అంటాడు.

“చేయను. నీ గౌరవ ప్రతిష్ఠల సాక్ష్యంగా చెబుతున్నాను. (ఈ కోరిక మన్నిస్తే) ఇక నేను మరే కోరికా కోరను” అంటాడు ఆ వ్యక్తి. ఈ సందర్భంగా అతను అనేక విధాల ప్రమాణాలు చేస్తాడు. అప్పుడు దేవుడు అతని ముఖాన్ని నరకాగ్ని నుండి స్వర్గం వైపుకు తిప్పుతాడు.

దాంతో ఆ మనిషి స్వర్గంలోని సుందర దృశ్యాలు, భోగభాగ్యాలను (ఆశ్చర్యచకితుడయి) చూస్తూ ఉంటాడు. దేవుడు తలచినంతసేపు (అలా చేస్తూ) మౌనంగా ఉంటాడు. ఆ తరువాత “ప్రభూ! నన్ను స్వర్గద్వారం దగ్గరకు చేర్చు” అంటాడతను.

"ఏమిటీ, నీవు మొదట ఒక కోరిక కోరుకుంటున్నప్పుడు ఆ తరువాత మరొక కోరిక కోరనని ప్రమాణం చేసి చెప్పలేదా?" అని దేవుడు అడుగుతాడు.

"ప్రభూ! (నన్ను కరుణించు) నీవు సృష్టించిన యావజ్జీవ కోటిలో నేను అత్యంత దౌర్భాగ్యుడిగా ఉండాలనుకోవడం లేదు" అంటాడా దాసుడు.

"సరే ఈ కోరిక మన్నిస్తే, ఆ తరువాత నీవు మరో కోరిక కోరవని నమ్మకం ఏమిటి?" అడుగుతాడు దేవుడు.

"కోరను ప్రభూ! నీ గౌరవ ప్రతిష్ఠల సాక్ష్యంగా చెబుతున్నాను. ఇక ముందు మరెలాంటి కోరికా కోరను," అంటాడా వ్యక్తి. ఆ సందర్భంలో కూడా అతను దేవుని ముందు చేయవలసిన ప్రమాణాలన్నీ చేస్తాడు.

అప్పుడు దేవుడు అతడ్ని స్వర్గద్వారం దగ్గరకు చేర్చుతాడు. అతను స్వర్గద్వారం దగ్గరకు చేరుకొని స్వర్గం లోపలి అసామాన్య అందచందాలు, అపార సౌఖ్యాలను (సంభ్రమాశ్చర్యాలతో) చూస్తూ ఉంటాడు. దేవుడు తలచినంతసేపు ఆ వ్యక్తి వాటిని (గుటకలు వేస్తూ) మౌనంగా చూస్తాడు. ఆ తరువాత (ఇక ఉండబట్టలేక) "ప్రభూ! నన్ను కూడా స్వర్గం లోపలికి పంపించు" అని అంటాడు.

"ఆదం కుమారా, నీ వైఖరి చాలా విచిత్రంగా ఉంది! చేసిన వాగ్దానాన్ని ఎంత ఘోరంగా భంగపరుస్తున్నావు!! నీకివ్వబడినది తప్ప మరేమీ కోరనని నీవు ప్రమాణం చేసి మరీ వాగ్దానం చేయలేదా?" అని అడుగుతాడు దేవుడు.

"చేశాను ప్రభూ! కాని నీ సృష్టిరాసుల్లో కెల్లా నన్ను పరమదౌర్భాగ్యుడిగా ఉండనివ్వకు స్వామీ!" అంటూ మొరపెట్టుకుంటాడు ఆ వ్యక్తి.

ఈ మాటలు విని దేవుడు నవ్వుతాడు. తరువాత అతడ్ని (కనికరించి) స్వర్గంలో ప్రవేశించడాన్ని అనుమతిస్తాడు. ఆ తరువాత "నీకు ఇంకేమేమి కావాలో కోరుకో" అని అంటాడు.

దాంతో ఆ దాసుడు తన కోరికల్ని వెలిబుచ్చుతాడు. అవన్నీ తీరుతాయి. అప్పుడు దేవుడు మరిన్ని కోరికలు గుర్తు చేస్తూ ఇది కోరుకో, అది కోరుకో అనంటాడు. వాటిని కూడా అతను కోరుకుంటాడు. ఇలా అతను అన్నిటినీ కోరిన తరువాత "వాటన్నిటినీ ఇచ్చి వేస్తున్నాను. అంతేకాదు, నీవు కోరిన వాటికి రెట్టింపు ఇస్తున్నాను, వాటిని కూడా తీసుకో" అని అంటాడు దేవుడు".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 129వ అధ్యాయం - ఫజ్లిస్సుజూద్]

115. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- "దైవప్రవక్తా! ప్రళయదినాన మేము మా ప్రభువును చూడగలమా?" అని అడిగాము మేము. "ఆకాశం మేఘావృతం కాకుండా నిర్మలంగా ఉన్నప్పుడు సూర్యుడ్ని, చంద్రుడ్ని చూడటంలో మీకేమయినా ఇబ్బంది కలుగుతుందా?" అని ఎదురు ప్రశ్న వేశారు దైవప్రవక్త(స). మేము, కలగదని చెప్పాము. "అదే విధంగా మీరు ప్రళయదినాన మీ ప్రభువును దర్శించుకోవడంలో కూడా ఎలాంటి ఇబ్బంది ఉండదు. ఇబ్బంది ఏదైనా ఉంటే ఈనాడు సూర్యచంద్రుల్ని చూడటంలో ఎంత ఇబ్బంది ఉంటుందో ఆ రోజు అంతే ఇబ్బంది ఉంటుంది" అన్నారు దైవప్రవక్త(స).

ఆ తరువాత ఆయన ఇలా తెలియజేశారు : ప్రళయదినాన ఒక ప్రకటనకర్త వచ్చి, "ఏ వర్గం వారు ఏ శక్తిని ఆరాధిస్తూ ఉండేవారో వారంతా ఆ ఆరాధ్యశక్తి వెనుక నిలబడండి" అని ప్రకటిస్తాడు. అప్పుడు సిలువను పూజించే వారు సిలువ వెనుక, విగ్రహాలను పూజించేవారు విగ్రహాల వెనుక నిలబడతారు. ఇలా మిథ్యాదైవాలను పూజించే వారంతా తమ తమ మిథ్యాదైవాల దగ్గరికెళ్ళి నిల్చుంటారు. చివర్లో సదాచారులైనా, దురాచారులైనా అల్లాహ్‌ను ఆరాధించేవారు మైదానంలో మిగిలిపోతారు. అలాగే గ్రంథప్రజలలో కూడా (ఏకదైవారాధకులైన వారు) కొందరు మిగిలిపోతారు.

ఆ తరువాత మానవుల ముందుకు నరకం తీసుకు రాబడుతుంది. అది వారికి (దూరం నుంచి) ఎండమావిలా కన్పిస్తుంది. ఆ తరువాత (దైవదూతలు) యూదుల్ని నిలదీసి "మీరు ఎవరిని ఆరాధిస్తూ ఉండేవారు?" అని అడుగుతారు. "మేము హజ్రత్ ఉజైర్ (అలైహి)ని దేవుని కుమారుడిగా విశ్వసిస్తూ ఆయన్నే ఆరాధిస్తూ ఉండేవాళ్ళము" అని సమాధానమిస్తారు యూదులు. "మీరు అసత్యం పలికారు. దేవునికి భార్యా పిల్లలే లేరు" అని వారికి చెప్పబడుతుంది. ఆ తరువాత "సరే ఇప్పుడు మీరేం కోరుతున్నారు?" అని ప్రశ్నిస్తారు (దైవదూతలు). దానికి వారు "త్రాగడానికి నీళ్ళివ్వండ"ని అంటారు. "ఇవిగో త్రాగండి" అని సమాధానం వస్తుంది. ఆ వెనువెంటనే వారు నరకంలో పడిపోతారు.

ఆ తరువాత క్రైస్తవుల్ని నిలదీసి "మీరు ఎవరిని ఆరాధిస్తూ ఉండేవారు?" అని ప్రశ్నిస్తారు (దైవదూతలు). "మేము హజ్రత్ మసీహ్ (అలైహి)ను దేవుని కుమారుడిగా విశ్వసిస్తూ ఆయన్నే ఆరాధిస్తూ ఉండేవారము" అని సమాధానమిస్తారు క్రైస్తవులు. "మీరు అసత్యం పలికారు. దేవునికి భార్యాలేదు, పిల్లలూ లేరు" అని చెప్పబడుతుంది. ఆ తరువాత "సరే, ఇప్పుడు మీరేం కోరుతున్నారు?" అని ప్రశ్నిస్తారు (దైవదూతలు). దానికి వారు "మాకు త్రాగడానికి నీళ్ళివ్వండి" అంటారు. "ఇవిగో త్రాగండి" అని సమాధానం వస్తుంది. ఆ వెనువెంటనే వారు నరకంలో పడిపోతారు.

ఆ తరువాత అల్లాహ్‌ను ఆరాధిస్తూ ఉండేవారు రంగంలో మిగిలిపోతారు. వారిలో సజ్జనులూ ఉన్నారు, దుర్జనులూ ఉన్నారు. (వారి దగ్గరకు దైవదూతలు వచ్చి) "అందరూ వెళ్ళిపోయారు కదా! మిమ్మల్ని ఏ విషయం ఇక్కడ నిలిపి ఉంచింది?" అని అడుగుతారు. దానికి వారు ఇలా అంటారు - మాకు వారి అవసరం ఎంతో ఉన్నప్పటికీ, మేము (సత్యం కోసం ప్రపంచంలోనే) వారి నుండి ఆనాడే వేరయిపోయాము. అదీగాక, ప్రతి వర్గమూ తాను ఆరాధిస్తూ ఉండిన దైవం దగ్గరికి వెళ్ళి నిలబడాలని ఒక ప్రకటన కర్త చేసిన ప్రకటన విన్నాము. అందువల్ల మేము ఇక్కడే ఉండి మా ప్రభువు రాకకోసం ఎదురు చూస్తున్నాము."

అప్పుడు దేవుడు వారు ఇది వరకు చూసిన రూపానికి భిన్నంగా మరో రూపంలో ప్రత్యక్షమయి "నేనే మీ ప్రభువుని" అంటాడు. దానికి వారు "నీవా మా ప్రభువు!" అంటారు (ఆశ్చర్యపోతూ). ఆ రోజు విశ్వప్రభువు ముందు దైవప్రవక్తలు తప్ప ఎవరూ పెదవి విప్పలేరు. (పరిస్థితి చాలా భయానకంగా ఉంటుంది). దేవుడు వారిని తిరిగి ప్రశ్నిస్తూ, "మీరు మీ ప్రభువును గుర్తించడానికి ఆయన తరఫున మీ దగ్గర ఏదైనా ఆధారం ఉందా?" అని అడుగుతాడు. "మాకు మోకాలు దర్శనం గుర్తుగా నిర్ణయించబడింది" అని అంటారు వారు. అప్పుడు దేవుడు తన మోకాలును ప్రత్యక్షపరుస్తాడు. దాన్ని చూడగానే విశ్వాసులంతా ఒక్కసారిగా సాష్టాంగ ప్రణామం చేస్తారు.

అయితే వారిలో పేరు ప్రతిష్ఠల కోసం దేవుడ్ని ప్రార్థిస్తూ ఆయన ముందు సాష్టాంగ ప్రణామం చేస్తూ ఉండేవారు మాత్రం ఆ రోజు సాష్టాంగ ప్రణామం చేయకుండా నిలబడి ఉంటారు. వారు సాష్టాంగ ప్రణామం చేయడానికి ప్రయత్నిస్తారు కాని, వారి నడుములు బల్లపరుపులా బిగుసుకుపోయి ఏ మాత్రం వంగవు. ఆ తరువాత నరకం మీద ఒక వారధి నిర్మింపబడుతుంది.

ప్రవక్త అనుచరులు (రజి) వారధి ప్రస్తావన వినగానే "దైవ ప్రవక్తా! ఈ వారధి సంగతేమిటి?" అని అడిగారు. దైవప్రవక్త(స) తిరిగి ఇలా చెప్పడం ప్రారంభించారు -

అదొక (భయంకరమైన) జారుడు చోటు. దాని మీద నుంచి దాటిపోయే వారు (కొందరు) జారిపడతారు, (మరికొందరు) నిలదొక్కుకుంటారు. దాటే వారిని లాగి పడేయడానికి దాని మీద మొనదేలిన కొండీలు వంటి పెద్ద పెద్ద ముండ్లు లేచి ఉంటాయి. ఇవి నజద్ ప్రాంతంలో ఉండే సాదాన్ చెట్ల ముండ్లులా చాలా పొడవుగా, లావుగా ఉంటాయి. విశ్వాసులు (వారి వారి కర్మలను బట్టి) ఆ వారధి మీద నుంచి రెప్పపాటులో మెరుపు వేగంతో, తుఫాను వేగంతో వేగంగా పరుగెత్తే గుర్రాల్లా, (ఇతర) వాహనాల్లా దాటిపోతారు. అలా దాటే వారిలో కొందరు ఎలాంటి ప్రమాదం లేకుండా క్షేమంగా బయటపడతారు; మరికొందరు తీవ్రంగా గాయపడి (రక్తసిక్తమయి) నరకాగ్నిలో పడిపోతారు. అందరికంటే చివర్లో ఉండేవారు పడుతూ లేస్తూ పడతారు.

ఆ రోజు విశ్వాసులు తాము బయట పడినప్పటికీ, నరకంలో పడిపోయిన తమ సోదర విశ్వాసుల్ని కాపాడేందుకు దేవుడ్ని పరిపరి విధాలా ప్రార్థిస్తారు. ఈ రోజు మీరు స్పష్టంగా తేలిన ఒక హక్కు గురించి నన్ను ఎంత గట్టిగా అడుగుతారో, ఆ రోజు వారు తమ సోదరుల్ని కాపాడుకోవడానికి అంతకంటే గట్టిగా దేవుడ్ని అడుగుతారు. వారు దైవసన్నిధిలో తమ కోరికను వెలిబుచ్చుతూ "ప్రభూ! మా ఈ సోదరులు మాతో పాటు నమాజు చేస్తుండేవారు; ఉపవాసాలు పాటిస్తూ ఉండేవారు; ఇతర సత్కార్యాలు కూడా చేస్తూ ఉండేవారు. అలాంటి వీరు నరకంలో ఎలా పడ్డారో మాకు అర్థం కావడం లేదు. (ప్రభూ!) వీరిని క్షమించు" అని ప్రార్థిస్తారు.

దేవుడు వారి మొర ఆలకించి "సరే వెళ్ళండి. హృదయంలో ఒక్క దీనారు విలువంత విశ్వాసం ఉన్న వారిని సయితం నరకాగ్ని నుండి బయటకు తీసుకోండి" అని అంటాడు. అప్పుడు వారు నరకంలో ఉన్న తమ సోదర విశ్వాసుల దగ్గరకు వెళ్తారు. అప్పుడు వారిలో కొందరు పాదాల వరకు, మరికొందరు మోకాళ్ళ వరకు అగ్నిలో చిక్కుకొని ఉంటారు. అయితే అగ్ని వారి ముఖాలను మాడ్చి వికృతంగా చేయకుండా దేవుడు దాన్ని నిషేధిస్తాడు. దాంతో ఈ విశ్వాసులు తాము గుర్తించిన వారందర్నీ నరకం నుండి బయటికి తీస్తారు.

ఆ తరువాత దేవుని సన్నిధికి వచ్చి మళ్ళీ విన్నవించుకుంటారు. అప్పుడు దేవుడు "సరే వెళ్ళండి. హృదయంలో అర్ధ దీనారంత విలువగల విశ్వాసమున్న వారిని కూడా నరకం నుండి తీసేసుకోండి" అని అంటాడు. వారు నరకానికి వెళ్ళి తాము గుర్తించగలిగిన వారందర్నీ నరకం నుండి వెలుపలకు తీస్తారు. అలా తీసిన తరువాత దేవుని సన్నిధికి వచ్చి మళ్ళీ విన్నవించుకుంటారు. "సరే వెళ్ళండి. హృదయంలో అణుమాత్రం విశ్వాసం (ఈమాన్) ఉన్న వారిని కూడా నరకం నుండి తీసేసుకోండి" అని అంటాడు దేవుడు. వారు మూడవసారి వెళ్ళి తాము గుర్తించగలిగిన వారందర్నీ నరకం నుండి తీసి రక్షిస్తారు.

హజ్రత్ అబూ సయీద్ (రజి) ఈ సందర్భంగా మాట్లాడుతూ "నా మాటల మీద మీకు నమ్మకం లేకపోతే దేవుడు ఎవరికీ అణుమాత్రం అన్యాయం కూడా చేయడు. ఎవరైనా ఒక పుణ్యకార్యం చేస్తే దేవుడు దానికి రెట్టింపు పుణ్యఫలం ప్రసాదిస్తాడు (4:40) అనే ఖుర్‌ఆన్ సూక్తి చదువుకోండి" అని అన్నారు.

ఈ విధంగా (నరకంలోని ముస్లింలను రక్షించడానికి) దైవప్రవక్తలు, దైవదూతలు, విశ్వాసులు అంతా సిఫారసు చేసిన తరువాత చివర్లో దేవుడు ముందుకు వచ్చి "ఇక నా సిఫారసు మిగిలి ఉంది" అని అంటాడు. ఆ తరువాత ఆయన నరకం నుండి ఓ గుప్పెడు మందిని బయటికి తీస్తాడు. వారు అప్పటికే బాగా కాలిపోయి బొగ్గుగా మారిపోతారు. (దైవదూతలు) వారిని తీసి స్వర్గం అంచున ఉండే ఒక సెలయేరులో పడవేస్తారు. అందులోని నీటిని 'జీవజలం' అంటారు. ఆ సెలయేరులో పడగానే, నదిఒడ్డు మీద విత్తనాలు మొలకెత్తి సస్యశ్యామలమైనట్లు వారు నూతనశక్తి సౌందర్యాలతో నవనవలాడుతూ లేస్తారు.

మీరు అనేకసార్లు చెట్ల ప్రక్కనో, రాళ్ళ ప్రక్కనో విత్తనాలు మొలకెత్తడాన్ని చూసే ఉంటారు. అలా మొలకెత్తే మొక్కల్లో ఎండ తగిలే మొక్కలు పచ్చగా ఉంటాయి. ఎండ తగలకుండా నీడ పడే మొక్కలు పాలిపోతాయి. వారు సెలయేరు నుండి ముత్యాల్లా మెరిసిపోతూ బయటికి వస్తారు. కాకపోతే వారి మెడల మీద ఒక మచ్చ ఉండిపోతుంది. ఆ తరువాత వారు స్వర్గంలో ప్రవేశిస్తారు. అప్పుడు స్వర్గవాసులు వారిని చూసి, "వీరు ఎలాంటి పుణ్యకార్యాలు చేయకపోయినా దేవుడు వీరికి (నరకం నుండి) విముక్తి కలిగించాడు" అని అంటారు. దేవుడు అలా స్వర్గంలో ప్రవేశించిన వారిని ఉద్దేశించి "మీరిక్కడ చూస్తున్న (స్వర్గసంప)దంతా మీదే; అంతేకాదు ఇంకా అంత (సంపద) కూడా అదనంగా మీకు లభిస్తుంది" అని అంటాడు.

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 24వ అధ్యాయం - ఖౌలిల్లాహు....ఉజూహుయ్యౌమయిజిన్నాసిరా....]

## 80వ అధ్యాయం - ఏక దైవారాధకుల నరక విమోచనకై సిఫారసు

116. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు - (పరలోకంలో కర్మల విచారణ ముగిసిన తరువాత) స్వర్గవాసులు స్వర్గంలో, నరకవాసులు నరకంలో ప్రవేశిస్తారు. ఆ తరువాత "హృదయంలో ఆవగింజంత విశ్వాసం ఉన్న వారిని (సయితం) నరకం నుండి బయట తీయండి" అని దేవుడు ఆజ్ఞాపిస్తాడు. ఈ ఆజ్ఞతో (చాలామంది) మానవులు నరకం నుండి బయటపడతారు. వారిలో కొందరు (బాగా కాలిపోయి బొగ్గులా) నల్లగా మారిపోతారు. అలాంటి వారిని వర్షనది లేక 'జీవనది'లో పడవేస్తారు. దాంతో వారు యేటి ఒడ్డున ధాన్యపు విత్తనం మొలకెత్తినట్లు మొలకెత్తుతారు. ఆ మొక్క పసిమి వన్నెతో ఎంత అందంగా ముస్తాబయి మొలకెత్తుతుందో మీరు చూడలేదా?

[సహీహ్ బుఖారీ :2వ ప్రకరణం - ఈమాన్, 15వ అధ్యాయం - తఫాజులి అహ్‌లిల్ ఈమాని ఫిల్ ఆమాల్]

## 81వ అధ్యాయం -నరకం నుండి బయటపడే చివరి మనిషి

117. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఈ విధంగా సెలవిచ్చారు - నరకం నుండి అందరికంటే చివర్లో బయటపడే, స్వర్గంలోనూ అందరికంటే చివర్లో ప్రవేశించే వ్యక్తిని గురించి నాకు బాగా తెలుసు. అతను నరకం నుండి పడుతూ లేస్తూ బయలుదేరుతాడు. అతనితో దేవుడు 'వెళ్ళు, (ఇక) స్వర్గంలో ప్రవేశించు' అని అంటాడు. ఆ వ్యక్తి స్వర్గం దగ్గరికి వస్తాడు. చూస్తే స్వర్గం పూర్తిగా నిండిపోయి (జనంతో) క్రిక్కిరిసి ఉన్నట్లు కన్పిస్తుంది. దాంతో అతను వెనక్కి తిరిగొచ్చి "ప్రభూ! అది పూర్తిగా నిండిపోయి ఉంది (నా కక్కడ చోటే ఉన్నట్లు కన్పించడం లేదు)" అని అంటాడు.

దానికి దేవుడు "వెళ్ళు, స్వర్గంలో ప్రవేశించు. నేనక్కడ నీకు ప్రపంచమంత చోటిచ్చాను. ప్రపంచ మంతేమిటి, దానికి పదింతలు విశాలమైన చోటిచ్చాను (వెళ్ళు)" అని అంటాడు. (అయితే ఆ వ్యక్తికి నమ్మకం కలగలేదు అందువల్ల) అతను "ప్రభూ! తమరు (సర్వలోకాల) చక్రవర్తి అయి ఉండి నాలాంటి వారితో పరిహాసమాడుతున్నారా? లేక నన్ను ఆట పట్టిస్తున్నారా?" అని అంటాడు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) ఈ హదీసు ఉల్లేఖించిన తరువాత "దైవ ప్రవక్త(స) ఈ విషయం తెలియజేస్తూ ఫక్కున నవ్వారు. అప్పుడు ఆయన పల్లు కూడా స్పష్టంగా కనిపించాయి" అని అన్నారు. ఈ వ్యక్తి స్వర్గవాసులలో అందరికంటే అతి తక్కువ అంతస్తు కలవాడని అంటారు.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతుల్ జన్నతి వన్నార్]

## 82వ అధ్యాయం - అందరికంటే అధమశ్రేణి స్వర్గనివాసి

118. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవక్రపవక్త(స) ఇలా తెలియజేశారు - ప్రళయ దినాన దేవుడు మానవుల్ని (హష్ర్ మైదానంలో) సమీకరిస్తాడు. మానవులు (అప్పటి పరిస్థితి భరించలేక) "ఇక్కడి నుంచి మనల్ని విముక్తి కలిగించడానికి ఎవరైనా దేవుని సన్నిధిలో సిఫారసు చేస్తే బాగుండు" అని అంటారు. (ఇలా మాట్లాడుకొని) అందరూ కలసి హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరకు వెళ్తారు.

ఆయన దగ్గర (పరిస్థితి వివరిస్తూ) "దేవుడు మిమ్మల్ని తన స్వహస్తాలతో సృష్టించాడు. మీలో తన ఆత్మను ఊదాడు. దైవదూతల్ని ఆజ్ఞాపించగానే వారు మీకు సాష్టాంగ ప్రణామం చేశారు. అందువల్ల మీరు దేవుని దగ్గర మా కోసం సిఫారసు చేయండి" అని అంటారు. దానికి హజ్రత్ ఆదం (అలైహి) తాను చేసిన ఒక తప్పును ప్రస్తావిస్తూ "నేను విశ్వప్రభువు సన్నిధిలో మీ కోసం సిఫారసు చేసేటంతటి వాణ్ని కాను. మీరు హజ్రత్ నూహ్ (అలైహి) దగ్గరకు వెళ్ళండి. దేవుడు ప్రభవింపజేసిన సందేశహరులలో ఆయన మొట్టమొదటివాడు" అని అన్నారు.

ఈ మాటలు విని ప్రజలు హజ్రత్ నూహ్ (అలైహి) దగ్గరకు వెళ్తారు. (తమ సిఫారసు విషయం ఆయన ముందుంచుతారు.) అయితే ఆయన కూడా తాను చేసిన తప్పును ప్రస్తావిస్తూ "నేనందుకు తగినవాణ్ని కాను. మీరు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు వెళ్ళండి. ఆయన్ని దేవుడు తన మిత్రుడిగా చేసుకున్నాడు" అని అంటారు.

ప్రజలు అక్కడ్నుంచి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు వెళ్తారు. కాని ఆయన కూడా తను చేసిన తప్పును ప్రస్తావిస్తూ "నేనందుకు తగినవాడ్ని కాను. మీరు హజ్రత్ మూసా (అలైహి) దగ్గరకు వెళ్ళండి. దేవుడు ఆయనతో ప్రత్యక్ష సంభాషణ జరిపాడు" అని అంటారు.

ప్రజలు అక్కడ్నుంచి హజ్రత్ మూసా (అలైహి) దగ్గరకు వెళ్తారు. అయితే ఆయన కూడా తాను చేసిన తప్పును గుర్తు చేస్తూ "నేను మిమ్మల్ని గురించి సిఫారసు చేసేటంతటి అర్హుడ్ని కాను. మీరు హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్ళండి" అని అంటారు.

అక్కడ్నుంచి ప్రజలు హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్తారు. ఆయన కూడా "నేను సిఫారసు చేయడానికి తగిన యోగ్యుడ్ని కాను. మీరు హజ్రత్ ముహమ్మద్ (స) దగ్గరకు వెళ్ళండి. ఆయన ఎంతో గొప్పవాడు. దేవుడు ఆయన భూత భవిష్యత్ కాలాల పొరపాట్లన్నిటినీ క్షమించాడు" అని చెబుతారు.

అది విని ప్రజలు నా దగ్గరకు వస్తారు. నేను దైవసన్నిధిలో హాజరు కావడానికి అనుమతి అర్థిస్తాను. (అనుమతి లభించిన తరువాత) నేను దేవుని ముందు హాజరయి, ఆయన దర్శన భాగ్యం కలగగానే సాష్టాంగ పడిపోతాను. దేవుడు తలచినంత వరకు ఆయన నన్ను ఆ (సాష్టాంగ ప్రణామం) స్థితిలోనే ఉంచుతాడు. ఆ తరువాత "ముహమ్మద్! తలపైకెత్తు. నీవు కోరదలచుకున్నదేమిటో కోరుకో, నేనివ్వడానికి సిద్ధంగా ఉన్నాను. నీవేదయినా సిఫారసు చేయదలిస్తే చెయ్యి. దాన్ని కూడా ఆమోదించడానికి నేను సిద్ధంగా ఉన్నాను" అని అంటాడు విశ్వసామ్రాజ్యాధినేత.

అప్పుడు నేను తలపైకెత్తి, ముందుగా నా ప్రభువు ఔన్నత్యాన్ని స్తుతిస్తాను. (ఆ సమయంలో) ఆయన నాకు నేర్పిన మాటల్లోనే ఆయన్ని ప్రశంసిస్తాను. ఆ తరువాత (ప్రజల కోసం) సిఫారసు చేస్తాను. అయితే దేవుడు నా కోసం ఒక పరిమితి విధిస్తాడు. (ఆ మేరకు) నేను ప్రజలను నరకం నుండి తీసి స్వర్గంలో ప్రవేశింపజేస్తాను. ఆ తరువాత మళ్ళీ దేవుని సన్నిధికి వచ్చి ఇంతకు ముందులాగే సాష్టాంగం (సజ్దా)లో పడిపోతాను. అదే విధంగా మూడవసారి, నాల్గవసారి కూడా చేస్తాను. చివరికి నరకంలో దివ్యఖుర్ఆన్ నిరోధించినవారు మాత్రమే మిగిలిపోతారు. దివ్యఖుర్ఆన్ వారిని (అంటే సత్యతిరస్కారుల్ని) శాశ్వతంగా నరకంలో ఉండేలా చేసింది.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతుల్ జన్నతి వన్నార్]

119. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఈ విధంగా సెలవిచ్చారు- ప్రళయదినాన మానవులు ఇసుకపోస్తే రాలనంత అత్యధిక సంఖ్యలో ఉంటారు. ఈ కారణంగా పరస్పరం సముద్రకెరటాల్లా కలసిపోయి తీవ్ర ఆందోళనకు గురవుతూ ఉంటారు. అప్పుడు వారు హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరకు వెళ్ళి "మీ ప్రభువు సన్నిధిలో మా గురించి కాస్త సిఫారసు చేయండి" అని అంటారు. దానికి ఆయన "నేనందుకు తగిన వాడ్ని కాను. మీరు హజ్రత్ ఇబ్రాహీం(అలైహి) దగ్గరకు వెళ్ళండి. ఆయన దేవుని మిత్రుడు కూడా" అని అన్నారు. అప్పుడు వారంతా హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు వెళ్తారు. కాని ఆయన కూడా "నేనందుకు తగిన వాడ్ని కాను; మీరు మూసా (అలైహి) దగ్గరకు వెళ్ళండి. ఆయన దైవ సంభాషితుడు అని కూడా పేరు పడ్డారు" అని అంటారు. మానవులు అక్కడ్నుంచి హజ్రత్ మూసా (అలైహి) దగ్గరకు వెళ్తారు. ఆయన కూడా "నేనందుకు తగిన వాడ్ని కాను; మీరు హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్ళండి. ఆయన

దైవాత్మ, దైవవచనం అని కూడా ప్రఖ్యాతి చెందారు" అని చెబుతారు - మానవులు అక్కడ్నుంచి హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్తారు. అయితే చివరికి ఆయన కూడా తన అశక్తతను తెలుపుతూ "నేనీ పనికి యోగ్యుడ్ని కాను. మీరు హజ్రత్ ముహమ్మద్ (స) దగ్గరకు వెళ్ళండి" అని సలహా ఇస్తారు.

అప్పుడు వారంతా నా దగ్గరకు వస్తారు. నేను వారితో "అ....... ఈ పని నేనే చేయగలను, చేస్తాను" అని అంటాను. ఆ తరువాత నేను విశ్వ ప్రభువు కొలువులో ప్రవేశించడానికి అనుమతి కోరుతాను. నాకు అనుమతి లభిస్తుంది. ఆ సందర్భంలో దైవస్తుతి కోసం కొన్ని స్తోత్ర వచనాలు కూడా నా హృదయంలో నాటబడతాయి, ఇప్పుడవి నాకు జ్ఞాపకం లేవు. ఆ వచనాలతో నేను దేవుని ఔన్నత్యాన్ని, ఆయన పవిత్రతను కొనియాడుతూ ఆయన సన్నిధిలో సాష్టాంగపడతాను.

ఆ తరువాత "ముహమ్మద్! తలపైకెత్తు. నీవు చెప్పదలచుకున్నదేమిటో చెప్పు, నీ మాటలు ఆలకిస్తాను. నీవు కోరుతున్నదేమిటో చెప్పు, నీ కోరిక తీరుస్తాను. ఏదైనా సిఫారసు చేయాలనుకుంటే సిఫారసు చెయ్యి, నీ సిఫారసు అంగీకరిస్తాను" అని అంటాడు దేవుడు. అప్పుడు నేను "ప్రభూ! నా అనుచర సమాజాన్ని క్షమించు. నా అనుచర సమాజాన్ని కనికరించు" అని అంటాను.

"సరే, వెళ్ళు. వెళ్ళి మనస్సులో బార్లీగింజంత విశ్వాసం ఉన్న వారిని సయితం నరకం నుండి బయటికి తీసుకో" అని అంటాడు దేవుడు. నేను అలాంటి వారందర్నీ నరకం నుండి బయటికి తీస్తాను. తరువాత దేవుని దగ్గరికి తిరిగి వచ్చి, నాకు నేర్పిన వచనాలతో స్తోత్రం చేస్తూ మళ్ళీ ఆయన సన్నిధిలో సాష్టాంగపడతాను.

దేవుడు తిరిగి "ముహమ్మద్! తలపైకెత్తు. చెప్పు నీ మొర ఆలకిస్తాను. అడుగు నీ కోరిక తీరుస్తాను. సిఫారసు చెయ్యి, నీ సిఫారసు అంగీకరిస్తాను" అని అంటాడు. నేనప్పుడు "ప్రభూ! నా అనుచర సమాజం, నా అనుచర సమాజాన్ని కనికరించు" అని అంటాను.

"సరే, వెళ్ళు. వెళ్ళి మనస్సులో ఇసుమంత లేదా ఆవగింజంత విశ్వాసమున్న వారిని సయితం నరకం నుండి బయటికి తీసుకో" అని అంటాడు దేవుడు. నేను వెళ్ళి అలాంటి వారందర్నీ నరకం నుండి బయటికి తీస్తాను. ఆ తరువాత (మూడవసారి) తిరిగొచ్చి, నాకు నేర్పిన వచనాలతో స్తోత్రం చేస్తూ దేవుని సన్నిధిలో మళ్ళీ సాష్టాంగపడతాను.

దేవుడు తిరిగి "ముహమ్మద్! తలపైకెత్తు. చెప్పు నీ మొర ఆలకిస్తాను. అడుగు నీ కోరిక తీరుస్తాను. సిఫారసు చెయ్యి, నీ సిఫారసు ఆమోదిస్తాను'" అని అంటాడు. నేను (ఇది వరకటిలాగే) "ప్రభూ! నా అనుచర సమాజాన్ని మన్నించు. నా అనుచర సమాజాన్ని నరకం నుండి కాపాడు" అని అంటాను.

"సరే వెళ్ళు. వెళ్ళి మనస్సులో ఆవగింజ కన్నా అతి తక్కువ పరిమాణంలో విశ్వాసమున్న వారిని సయితం నరకం నుండి బయటికి తీసుకో" అని అంటాడు దేవుడు. నేను వెళ్ళి అలాంటి వారందర్నీ నరకం నుండి బయటికి తీస్తాను. ఆ తరువాత నాల్గవసారి వెళ్ళి అవే వచనాలతో స్తోత్రం చేస్తూ దేవుని సన్నిధిలో సాష్టాంగపడతాను.

దేవుడు మళ్ళీ " ముహమ్మద్! తలపైకెత్తు. చెప్పు, నీ మొర ఆలకిస్తాను. అడుగు నీ కోరిక

తీరుస్తాను. సిఫారసు చెయ్యి, నీ సిఫారసు ఆమోదిస్తాను'' అని అంటాడు. నేను (యథాప్రకారం) ''ప్రభూ! నా అనుచర సమాజం, నా అనుచర సమాజాన్ని కనికరించు'' అని అంటాను. అప్పుడు దేవుడు ''నా గౌరవౌన్నత్యాల సాక్ష్యం! అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని నోటితో పలికిన ప్రతి మనిషినీ నేను నరకం నుండి విముక్తం చేస్తాను'' అని అంటాడు.

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 36వ అధ్యాయం - కలామిర్రబ్బి ఇజ్జవజల్ యౌమల్ ఖియామతి మఅల్ అంబియాయి గైరిహిమ్]

120. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఓ రోజు దైవప్రవక్త(స) దగ్గరికి కొంత మాంసం (కానుకగా) వచ్చింది. దైవప్రవక్త (స) కు ముందరి కాళ్ళ మాంసమంటే ఎంతో ఇష్టం. అందువల్ల ఆ మాంసంలో నుంచి ఆయనకు ముందరి కాళ్ళ మాంసం కొంత సమర్పించడం జరిగింది. అందులో కొంత మాంసం ఆయన తిని ఇలా ప్రవచించారు -

ప్రళయదినాన నేను యావత్తు మానవులకు నాయకుణ్ణవుతాను. ఇది ఎలా అవుతుందో మీకు తెలుసా? ప్రళయదినాన భూత భవిష్యత్ వర్తమాన కాలాల మానవులంతా ఒకే మైదానంలో సమీకరించబడతారు. (ఆ మైదానం చదునుగా ఉండటం వల్ల) పిలిచే వాడి పిలుపును అందరూ వినగలుగుతారు. అలాగే చూసేవారు అందరినీ చూడగలుగుతారు. సూర్యుడు అతి దగ్గరగా వస్తాడు. (దాంతో ఒకవైపు తీక్షణమైన ఎండ, ఉక్కపోతల వల్ల, మరో వైపు ఇసుకపోస్తే రాలనంత అత్యధిక జనాభా కారణంగా) మానవులు తీవ్రమైన ఆందోళనతో ఉక్కిరిబిక్కిరి అవుతుంటారు. పరిస్థితి చాలా దుర్భరంగా ఉంటుంది.

ఆ స్థితిలో వారు పరస్పరం మాట్లాడుకుంటూ ''సోదరులారా! మనం ఎలాంటి ఆపదలో చిక్కుకున్నామో గమనించారా?'' అంటారు కొందరు. ''ఎందుకు గమనించలేదు? మనల్ని గురించి మన ప్రభువు దగ్గర సిఫారసు చేసే వారెవరైనా దొరుకుతారేమో వెతుకుదాం పదండి'' అంటారు మరి కొందరు. ఆ తరువాత వారు పరస్పరం సంప్రదించుకొని హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరికి వెళ్ళాలని నిర్ణయించుకుంటారు.

నిర్ణయం ప్రకారం అందరూ హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరకు వెళ్ళి ''(మహానుభావా!) మీరు మానవులందరికీ తండ్రి. దేవుడు మిమ్మల్ని తన స్వహస్తాలతో తయారు చేసి, మీ శరీరంలో తన ఆత్మను ఊదాడు. అంతేగాక దైవదూతలందర్నీ మీ ముందు మోకరిల్లమని ఆదేశించాడు. అందువల్ల మీరు (దయచేసి) మీ ప్రభువు దగ్గర మా గురించి కాస్త సిఫారసు చేయండి. మా పరిస్థితి చూడండి, మేమెలాంటి ఆపదలో చిక్కుకున్నామో! పరిస్థితి ఇలాగే ఉంటే చివరికి మా గతేం కాను?'' అని అంటారు.

దానికి హజ్రత్ ఆదం (అలైహి) సమాధానమిస్తూ ''ఈ రోజు నా ప్రభువు ఇది వరకు ఎన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడయి ఉన్నాడు, ఇక ముందు కూడా ఎన్నడూ ఇంత ఉగ్రుడయిపోడు. అదీగాక (నా వల్ల ఒక పొరపాటు జరిగిపోయింది) ఆయన నన్ను ఒక ప్రత్యేక వృక్షం దగ్గరికి వెళ్ళకూడదని ఆజ్ఞాపించాడు. కాని నేనా ఆజ్ఞను పాటించలేకపోయాను. నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి పట్ల ఆందోళన పడుతున్నాను. అందువల్ల మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ నూహ్(అలైహి)

దగ్గరకు వెళ్ళండి. (నా దృష్టిలో ఆయన ఈ పని చేయగల సమర్థుడు)'' అని అంటారు.

అప్పుడు మానవులంతా హజ్రత్ నూహ్ (అలైహి) దగ్గరకు వెళ్ళి, ''నూహ్! మీరు యావత్తు ప్రపంచంలో మొట్టమొదటి దైవసందేశహరులు. దేవుడు మీకు 'కృతజ్ఞుడయిన దాసుడ'ని బిరుదు ఇచ్చాడు. అందువల్ల మీరు (దయచేసి) దేవుని సన్నిధిలో మా గురించి కాస్త సిఫారసు చేయండి. మేమెలా ఆపదలో పడిపోయామో చూస్తున్నారు కదా మీరు?'' అని అంటారు.

దానికి హజ్రత్ నూహ్ (అలైహి) ''ఈ రోజు నా ప్రభువు ఇది వరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడయి ఉన్నాడు. ఇక ముందు కూడా ఎన్నడూ ఇంత ఉగ్రుడయిపోడు. అదీగాక (నావల్ల ఒక పొరపాటు జరిగిపోయింది) నేను నా జాతి ప్రజలను (తొందరపడి) శపించాను. (తత్ఫలితంగా వారంతా సర్వనాశనమయ్యారు.) ఏమయినప్పటికీ నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి పట్ల ఆందోళన పడుతున్నాను. అందువల్ల మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు వెళ్ళండి. (నా దృష్టిలో ఆయన ఈ పని చేయగల సమర్థుడు)'' అని అంటారు.

జనం అక్కడ్నుంచి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు వెళ్ళి ''ఇబ్రాహీం! మీరు దేవుని ప్రవక్త. యావత్ప్రపంచంలోనే దేవునికి (ప్రాణ) స్నేహితులు. కనుక మీరు (దయచేసి) మా గురించి దేవునికి సిఫారసు చేయండి. చూస్తున్నారు కదా మా స్థితి, మేమెలా ఆపదలో చిక్కుకున్నామో?'' అని అంటారు.

అది విని హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ''ఈ రోజు నా ప్రభువు ఇది వరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడయి ఉన్నాడు. ఇక ముందు కూడా ఎన్నడూ ఇంత ఉగ్రుడయిపోడు. అదీగాక (నావల్ల ఒక పొరపాటు జరిగిపోయింది) నేను మూడు సందర్భాలలో అబద్ధమాడాను (హదీసు ఉల్లేఖకుడు అబూ హయ్యాన్ ఈ సందర్భంగా ఈ మూడు అబద్ధాలేమిటో వివరించారు). ఏమైనా నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి ఏమవుతుందోనని ఆందోళన పడుతున్నాను. అంచేత మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ మూసా(అలైహి) దగ్గరకు వెళ్ళండి. (ఆయన ఈ పని చేయగల సమర్థుడు)'' అని అంటారు.

దాంతో జనం అక్కడ్నుంచి హజ్రత్ మూసా(అలైహి) దగ్గరకు వెళ్ళి ''మూసా! మీరు దేవుని సందేశహరులు. దేవుడు మీతో ప్రత్యక్షంగా సంభాషించి, మిమ్మల్ని ప్రత్యేక ప్రవక్తగా నియమించాడు. పైగా ఆయన మీకు యావత్తు మానవుల్లోకెల్లా అత్యధిక గౌరవోన్నతులను ప్రసాదించాడు. అందువల్ల మీరు (దయచేసి) మా గురించి దేవుని దగ్గర సిఫారసు చేయండి. మా పరిస్థితి చూడండి, మేమెలా ఆపదలో పడి సతమతమవుతున్నామో!'' అని అంటారు.

హజ్రత్ మూసా (అలైహి) ఈ మాటలు విని ''ఈ రోజు నా ప్రభువు ఇదివరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడయి ఉన్నాడు, ఇక ముందు ఎన్నడూ ఇంత ఉగ్రుడయిపోడు. అదీగాక (నా వల్ల ఒక పొరపాటు జరిగిపోయింది) నాకెలాంటి ఆజ్ఞ లభించకపోయినా నేనొక వ్యక్తిని (తొందరపడి) హతమార్చాను. దీని కారణంగా నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి ఏమవుతుందోనని ఆందోళన పడుతున్నాను. అందువల్ల మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్ళండి. (ఆయన మీ పని చేసి పెట్టవచ్చు)'' అని అంటారు.

ప్రజలు (ఉసూరుమంటూ) అక్కడ్నుంచి హజ్రత్ ఈసా (అలైహి) దగ్గరకు వెళ్తారు. "ఈసా! మీరు దేవుని ప్రవక్త, దైవవచనం కూడా. దేవుడు దాన్ని హజ్రత్ మర్యం (అలైహి) వైపు వదిలేశాడు. మీరు దేవుని ఆత్మ(గా) కూడా (ప్రసిద్ధి చెందారు). మీరు శిశు దశలోనే తల్లి ఒడి నుండి జనంతో మాట్లాడారు. కనుక మీరు (దయచేసి) మా గురించి కాస్త దేవుని దగ్గర సిఫారసు చేయండి. చూస్తున్నారు కదా మా పరిస్థితి, మేమెలా ఆపదలో పడి సతమతమవుతున్నామో?" అని అంటారు.

దీనికి హజ్రత్ ఈసా (అలైహి) సమాధానమిస్తూ "సోదరులారా! ఈ రోజు నా ప్రభువు ఇది వరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడయి ఉన్నాడు. ఇక ముందు ఎప్పుడూ ఇంత ఉగ్రుడయిపోడు" అని అంటారు. హజ్రత్ ఈసా (అలైహి) తానేదయినా తప్పు చేసినట్లు ఇక్కడ ఎలాంటి ప్రస్తావన చేయరు. "(ఈ స్థితిలో నేను మీకు ఎలాంటి సహాయం చేయలేను.) స్వయంగా నేను నా పరిస్థితి ఏమవుతుందోనని భయపడి పోతున్నాను. మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ ముహమ్మద్ (స) దగ్గరికి వెళ్ళండి. (ఆయనే మీకు సహాయం చేయగల సమర్థుడు)" అని మాత్రమే అంటారు.

ఈ మాటలు విని జనం (నిరాశతో) అక్కడ్నుంచి బయలుదేరి ముహమ్మద్(స) దగ్గరకు (అంటే నా దగ్గరకు) వస్తారు. "ముహమ్మద్! మీరు దేవుని ప్రవక్త. దైవప్రవక్తలందరిలోకెల్లా కట్ట కడపటి వారు. దేవుడు మీ వెనుకటి, ముందటి తప్పులన్నీ క్షమించేశాడు. కనుక (దయచేసి) మీరు మా గురించి దేవుని దగ్గర సిఫారసు చేయండి. చూస్తున్నారు కదా మా పరిస్థితి, మేమెలా ఆపదలో చిక్కుకొని సతమతమవుతున్నామో?" అంటారు వారు.

అప్పుడు నేను బయలుదేరి దైవ సింహాసనం దగ్గరకు చేరుకుంటాను. అక్కడ నా ప్రభువు ముందు సాష్టాంగపడతాను. అప్పుడు దేవుడు స్తోత్రం కోసం కొన్ని విశేష వచనాలు నా మనసులో నాటుతాడు. ఇలాంటి స్తోత్ర వచనాలు ఇదివరకెప్పుడూ ఎవరికీ నేర్పి ఉండడు. ఆ తరువాత దేవుడు నన్ను సంబోధిస్తూ "ముహమ్మద్! తలపైకెత్తు. నీవు అడగదలచుకున్నదేమిటో అడుగు, నీ కోరిక తీరుస్తాను. ఏదైనా సిఫారసు చెయ్యాలనుకుంటే చెయ్యి, నేను నీ సిఫారసు ఆమోదిస్తాను" అని అంటాడు.

నేను తలపైకెత్తి "ప్రభూ! నా అనుచర సమాజం; ప్రభూ! నా అనుచర సమాజం పాపాల్ని మన్నించు, ప్రభూ! నా అనుచర సమాజాన్ని నరకాగ్ని నుండి కాపాడు" అని అంటాను. దానికి దేవుడు "ముహమ్మద్! వెళ్ళు. వెళ్ళి నీ అనుచర సమాజంలోని న్యాయ విచారణ పరిధి నుంచి మినహాయించబడిన వారందరినీ తీసుకొని, కుడివైపు ద్వారం గుండా స్వర్గం లోపలికి పంపించుకో. వారు ఇతర ద్వారాల గుండా కూడా రాకపోకలు నిరభ్యంతరంగా సాగించుకోవచ్చు" అని సమాధానమిస్తాడు.

ఆ తరువాత దైవప్రవక్త(స) ప్రమాణం చేస్తూ "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ మహోన్నత శక్తి సాక్ష్యం! మక్కా, హుమైర్‌ల మధ్య లేదా మక్కా, బస్రాల మధ్య ఎంత దూరం ఉంటుందో స్వర్గంలోని ఒక ద్వారం వెడల్పు అంత దూరం ఉంటుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 17 సూరతుల్ ఇస్రా, 5వ అధ్యాయం - జుర్రియ్యతి మన్ హమల్‌నా మఅ నూహ్]

## 83వ అధ్యాయం - సిఫారసు కోసం ప్రత్యేక వేడుకోలు

121. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- "ప్రతి దైవప్రవక్తకూ (ఆమోదయోగ్యమైన) ఒక వేడుకోలు ప్రత్యేకించబడింది. అందువల్ల నేనీ వేడుకోలును (ఇహలోకంలో వాడుకోకుండా) దైవచిత్తమయితే ప్రళయదినాన నా అనుచర సమాజం కొరకు సిఫారసు చేయడానికి భద్రపరుచుకుంటాను" అని అన్నారు దైవప్రవక్త (స).

[సహీహ్ బుఖారీ: 97వ ప్రకరణం - తౌహీద్, 32వ అధ్యాయం - ఫిల్ మషియ్యతి వల్ అరాద]

122. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ప్రతి దైవప్రవక్త ఒక కోరిక కోరుకున్నాడని దైవప్రవక్త(స) అన్నారు. లేక ఆయన ప్రతి దైవప్రవక్తకు ఒక వేడుకోలు చేసుకునే అధికారం ఇవ్వబడిందని చెబుతూ "దాని ప్రకారం దైవ ప్రవక్తలంతా తమ తమ వేడుకోళ్ళు వినియోగించుకున్నారు. అవి ఆమోదించబడ్డాయి కూడా. అయితే నేను మాత్రం నా వేడుకోలును (ఇంకా వినియోగించుకోలేదు. దాన్ని) ప్రళయదినాన నా అనుచర సమాజం కొరకు సిఫారసు చేయడానికి భద్రపరచుకున్నాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 80వ ప్రకరణం - దావాత్, 1వ అధ్యాయం - లికుల్లి నబియ్యిన్ దావతుమ్ముస్తజాబతున్]

## 87వ అధ్యాయం - దైవాజ్ఞ "మీ దగ్గరి బంధువులను హెచ్చరించు"

123. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "మీ దగ్గరి బంధువులను హెచ్చరించు" అన్న దైవసూక్తి (26:214) అవతరించినపుడు దైవప్రవక్త (స) లేచి నిలబడి ఇలా అన్నారు -

"ఖురైష్ ప్రజలారా! మీ ప్రాణాలను (నరకాగ్ని నుండి) కాపాడుకోండి. నేను మిమ్మల్ని దైవశిక్ష నుండి ఏ విధంగానూ కాపాడలేను. అబ్దె మునాఫ్ సంతతి ప్రజలారా! నేను మిమ్మల్ని దేవుని పట్టు నుండి ఏ మాత్రం రక్షించలేను. అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్! నేను మిమ్మల్ని దేవుని పట్టు నుండి కొంచెం కూడా కాపాడలేను. ప్రవక్త మేనత్త సఫియా! నేను నిన్ను కూడా దేవుని పట్టు నుండి కాపాడలేను. నా చిట్టితల్లి ఫాతిమా! నువ్వు కోరితే నా ఆస్తిపాస్తుల నుండి నీకు ఎంతైనా ఇవ్వగలను. కాని దేవుని పట్టు నుండి మాత్రం నిన్ను ఏ విధంగానూ రక్షించలేను."

[సహీహ్ బుఖారీ: 55వ ప్రకరణం - వసాయా, 11వ అధ్యాయం - హల్యదీ ఖులున్నిసావు వల్ వలదు ఫిల్ అఖారిబ్]

124. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- "నీ దగ్గరి బంధువులను, నీ తెగలోని ముఖ్యమైన వ్యక్తులను (దైవశిక్షను గురించి) హెచ్చరించు" అనే ఖుర్‌ఆన్ సూక్తి అవతరించిన తరువాత దైవప్రవక్త(స) ఇంటి నుండి బయలుదేరారు. ఆయన సఫా కొండెక్కి "హోషియార్! అప్రమత్తంగా ఉండండి!!" అని బిగ్గరగా ఒక హెచ్చరిక చేశారు. ప్రజలు ఈ కేక విని, "ఎవరబ్బా ఈ హెచ్చరిక చేస్తున్నది?" అని ఆశ్చర్యపోయారు. వెంటనే వారు (తమ తమ ఇండ్ల నుండి బయలుదేరి) దైవప్రవక్త(స) దగ్గరికి చేరుకోవడం ప్రారంభించారు.

ఇలా అందరూ తన దగ్గరకు వచ్చిన తరువాత దైవప్రవక్త(స) వారిని ఉద్దేశించి "సోదరులారా! నేనొక వేళ ఈ కొండచాటు నుండి వాహనాల మీద ఒక సైనిక దళం వస్తోందని చెబితే మీరు

నమ్ముతారా!" అని అడిగారు. దానికి వారు "ఎందుకు నమ్మము? నీవు ఎన్నడూ అబద్ధమాడినట్లు మేము చూడలేదు" అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త(స) "అయితే నేను మిమ్మల్ని శాశ్వతమైన, అతి భయంకరమైన (పరలోక) శిక్షను గురించి హెచ్చరిస్తున్నాను" అని అన్నారు.

(వచ్చిన వారిలో) అబూలహబ్ (అనేవాడు వెంటనే భృకుటి ముడిచి) "నీ పాడుగాను! ఇందుకేనా నువ్వు మమ్మల్నందర్నీ పిలిచావు?" అని అంటూ అక్కడ్నుంచి (చరచరా) వెళ్ళిపోయాడు. అతని విషయం గురించే "లహబ్" (తబ్బత్ యదా అబీల హబి(వ్వతబ్బ్) అనే సూరా అవతరించింది.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - తఫ్సీర్, 111 తబ్బత్‌యదా సూరా, అధ్యాయం - హద్దసనా యూసుఫ్]

## 88వ అధ్యాయం - అబూ తాలిబ్ గురించి దైవప్రవక్త సిఫారసు

125. హజ్రత్ అబ్బాస్ బిన్ ముత్తలిబ్ (రజి) కథనం:- "దైవప్రవక్తా! మీ పెదనాన్న అబూతాలిబ్ మీకు మద్దతు నిచ్చి, ఎల్లప్పుడూ మిమ్మల్ని (కంటిరెప్పలా) కాపాడుతుండేవారు. మీ కోసం మీ ప్రత్యర్థులపై తీవ్రాగ్రహం వెలిబుచ్చుతుండేవారు. అలాంటి మీ పెదనాన్నకు మీరేమయినా ప్రయోజనం చేకూర్చారా?" అని అడిగాను నేను. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "ఆయన నరకాగ్నిలో చీలమండలం వరకు దహించబడుతూ ఉంటారు. నేను గనక సిఫారసు చేయకపోతే ఆయన నరకంలో అట్టడుగు అంతస్తులో ఉండేవారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 40వ అధ్యాయం - ఖిస్సతి అబీతాలిబ్]

126. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (స) దగ్గర ఆయన పెదనాన్న అబూతాలిబ్ ప్రస్తావన వచ్చింది. అప్పుడు దైవప్రవక్త (స) ఇలా అన్నారు: "ప్రళయదినాన ఆయనకు నా సిఫారసు కొంత ప్రయోజనం కలిగిస్తుందని నేను ఆశిస్తున్నాను. ఆయన నరకంలోని పై అంతస్థులో ఉంచబడతారు. అక్కడ నరకాగ్ని ఆయన కాళ్ళ మడమల వరకు మాత్రమే చేరుతుంది. ఆ వేడికి ఆయన మెదడు కుతకుత ఉడికిపోతూ ఉంటుంది."

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 40వ అధ్యాయం - ఖిస్సతి అబీతాలిబ్]

## 89వ అధ్యాయం - యావత్తు నరకవాసులలో అతి తక్కువ శిక్ష అనుభవించేవాడు

127. హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) ఇలా చెబుతుండగా విన్నాను: "ప్రళయదినాన అందరికంటే అతి తేలిక శిక్ష చవి చూసేవాడి పరిస్థితి ఎలా ఉంటుందంటే అతని పాదాల క్రింద అగ్ని కణాలు ఉంటాయి. వాటి వేడికి అతని మెదడు కుతకుత ఉడికిపోతూ ఉంటుంది."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్]

## 91వ అధ్యాయం - విశ్వాసుల మధ్య పరస్పర స్నేహ సంబంధాలు

128. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) బహిరంగంగా ఇలా చెబుతుండగా నేను విన్నాను - "అబూ ఫలా సంతానం నా స్నేహితులు కాదు. దేవుడు మరియు సజ్జనులైన విశ్వాసులే

నా స్నేహితులు. కాకపోతే అబూ ఫలా సంతానం నాకు బంధువులయినందున, నేను వారి పట్ల అవసరమైనప్పుడల్లా సద్వర్తనంతో మెలుగుతాను."

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 14వ అధ్యాయం - యబుల్లుర్రహిమ బిబలాలహా]

## 92వ అధ్యాయం - విచారణ జరగకుండానే స్వర్గంలో ప్రవేశించే ముస్లింలు

129. హజ్రత్ అబూ హురైరా(రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) ఇలా చెబుతుండగా విన్నాను - "నా అనుచర సమాజంలో డెబ్భైవేల మంది జన సమూహం ఒకటి స్వర్గంలో ప్రవేశిస్తుంది. (స్వర్గంలో) వారి ముఖాలు, పూర్ణచంద్రుడిలా ప్రకాశిస్తూ ఉంటాయి." హజ్రత్ అక్కాషా బిన్ ముహ్సిన్ అసది (రజి) ఈ మాటలు విని అంగవస్త్రం దగ్గరికి లాక్కొని లేచి నిల్చున్నారు. నిల్చొని "దైవప్రవక్తా! అలాంటి వారిలో నన్ను కూడా చేర్చమని దైవాన్ని ప్రార్థించండి" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (స) "దేవా! అక్కాషాను అలాంటి వారిలో చేర్చు" అని ప్రార్థించారు.

ఆ తరువాత అన్సార్ ముస్లింల నుండి ఒక వ్యక్తి లేచి "దైవ ప్రవక్తా! దేవుడు నన్ను కూడా అలాంటి వారిలో చేర్చమని ప్రార్థన చేయండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "ప్రార్థన విషయంలో అక్కాషా నీ కంటే మించిపోయాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 50వ అధ్యాయం - యద్ఖులుల్ జన్నత సబ్వూన అల్ఫన్ బిగైరి హిసాబ్]

130. హజ్రత్ సహల్ బిన్ సాద్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు : "నా అనుచర సమాజంలో డెబ్భైవేల మంది లేదా ఏడు లక్షల మంది (కచ్చితమైన సంఖ్యను గురించి హదీసు ఉల్లేఖకుడు సందిగ్ధంలో పడిపోయాడు) ఒకరి చేతులు మరొకరు పట్టుకొని స్వర్గంలో ప్రవేశిస్తారు. వారిలో చివరి వ్యక్తి స్వర్గంలో ప్రవేశించనంతవరకు మొదటి వ్యక్తి కూడా స్వర్గంలో అడుగుపెట్టడు. (స్వర్గంలో) వారి ముఖాలు పూర్ణచంద్రుడిలా దేదీప్యమానంగా వెలిగిపోతుంటాయి."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం -- రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతుల్ జన్నతి వన్నార్]

131. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- ఓ రోజు దైవప్రవక్త (స) తమ అనుచరుల దగ్గరికి వచ్చి ఇలా అన్నారు - నాకు వివిధ అనుచర సమాజాలను చూపించడం జరిగింది. (వారికి సారథ్యం వహిస్తూ) దైవప్రవక్తలు నా ముందు నుంచి (స్వర్గం వైపు) వెళ్ళసాగారు. అప్పుడు కొందరు ప్రవక్తల వెనుక ఒక్కొక్క వ్యక్తి మాత్రమే ఉన్నాడు. అలాగే కొందరు ప్రవక్తల వెనుక ఇద్దరేసి వ్యక్తులు ఉంటే, మరికొందరు ప్రవక్తల వెనుక ఓ చిన్న సమూహం ఉండేది. అసలు ఒక్క మనిషి కూడా తమ వెనుక లేని దైవప్రవక్తలు కూడా వారిలో ఉన్నారు. ఆ తరువాత నాకు ఒక పెద్ద జన సమూహం కన్పించింది. అది యావత్తు దిగ్మండలం విస్తరించి ఉంది. అది నా అనుచర సమాజం కావచ్చని భావించాను. కాని ఆ సమూహం హజ్రత్ మూసా (అలైహి), ఆయన అనుచర సమాజమని నాకు తెలియజేయబడింది.

ఆ తరువాత అటు చూడమని నాతో అన్నారు (దైవదూతలు). నేను తలపైకెత్తి అటు చూశాను. చూస్తే బ్రహ్మాండమైన జన సమూహం ఒకటి యావత్తు దిగ్మండలంపై కనుచూపు మేరకు విస్తరించి ఉండటం కన్పించింది. కాస్త కుడి ఎడమల వైపు ఇటు అటు కూడా చూడమని అన్నారు. నేను అలాగే చూశాను. ఎటు చూసినా జనసంద్రమే. యావత్తు దిగ్మండలం జన సమూహంతో కప్పి వేయబడింది.

అప్పుడు దైవదూతలు "ఈ జన సమూహం మీ అనుచర సమాజమే. వీరిలో డెబ్భై వేల మంది ఎలాంటి విచారణ జరగకుండానే స్వర్గంలో ప్రవేశిస్తారు" అని తెలిపారు.

ఆ తరువాత ప్రవక్త అనుచరులు లేచి వెళ్ళిపోయారు. (ఈ డెబ్భైవేల మంది ఎవరయి ఉంటారో) దైవప్రవక్త(స) వివరించలేదు. దాంతో కొందరు అనుచరులు పరస్పరం మాట్లాడుకుంటూ "మనం అవిశ్వాసం, బహుదైవారాధనల వాతావరణంలో పుట్టాము. ఆ తరువాతనే కొంత కాలానికి దేవుణ్ణి, ఆయన ప్రవక్తను విశ్వసించాము. అందువల్ల (విచారణ జరగకుండా) స్వర్గంలో ప్రవేశించే ఈ (డెబ్భైవేల మంది) ప్రజలు మనం కాము, మన సంతానం అయి ఉండొచ్చు" అని అన్నారు.

ఈ మాటలు చివరికి దైవప్రవక్త(స)కు చేరాయి. అప్పుడాయన విషయం విశదీకరిస్తూ "వారు (అంటే విచారణ జరగకుండా స్వర్గానికి వెళ్ళేవారు) దుశ్శకునాలను పాటించరు; మంత్రాలు, తాయత్తుల జోలికిపోరు; కాల్పులు, వాతలతో చికిత్స చేయించుకోరు, వారు తమ ప్రభువును మాత్రమే నమ్ముకొని (ఏ కష్టమొచ్చినా) ఆయన మీదే ఆధారపడతారు" అని అన్నారు.

ప్రవక్త అనుచరులలో హజ్రత్ అక్కాషా(రజి)ఈ మాటలు వినగానే లేచి నిలబడి "దైవప్రవక్తా! నేను కూడా ఆ జనంలో చేరి ఉంటానా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "ఆ..... నువ్వుకూడా వారిలో ఉంటావు" అని చెప్పారు. తరువాత మరొక వ్యక్తి లేచి "దైవప్రవక్తా! మరి నేను కూడా వారిలో చేరి ఉంటానా?" అని అడిగాడు. అయితే దైవప్రవక్త(స) (అతనికి పై విధంగా సమాధానమివ్వకుండా) "అక్కాషా నీ కంటే మించిపోయాడు" అని (మాత్రమే) అన్నారు.

[సహీహ్ బుఖారీ : 76వ ప్రకరణం - అత్తిబ్, 42 వ అధ్యాయం - మ(ల్లమ్ యర్ఖ్]

132. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- ఒకసారి మేము దైవప్రవక్త(స)తో పాటు ఓ గుడారంలో కూర్చుని ఉన్నాము. అప్పుడు దైవప్రవక్త మమ్మల్ని ఉద్దేశించి "మీరు స్వర్గవాసుల్లో నాల్గో వంతు సంఖ్యలో ఉంటారంటే మీకు సంతోషమేనా?" అని అడిగారు. దానికి మేము 'సంతోషమే' అన్నాము. "మరి మీరు స్వర్గవాసుల్లో మూడో వంతు సంఖ్యలో ఉంటారంటే మీకు సంతోషమేనా?" అన్నారు తిరిగి దైవప్రవక్త(స). మేము 'సంతోషమే' అన్నాము. "మరి మీరు స్వర్గవాసుల్లో సగం మంది ఉంటారంటే మీకు సంతోషమేనా?" అన్నారు ఆయన మళ్ళీ. మేము మళ్ళీ 'సంతోషమే' అన్నాము. అప్పుడాయన ఇలా అన్నారు: "ఎవరి అధీనంలో ముహమ్మద్ ప్రాణం ఉందో ఆ శక్తిమంతుని సాక్ష్యం! మీరు మొత్తం స్వర్గవాసుల్లో సగం మంది ఉంటారని నేను ఆశిస్తున్నాను. తన మనోమస్తిష్కాలను పూర్తిగా దేవునికి సమర్పించుకొని, ఆయన ఆజ్ఞలకు బద్ధుడయి జీవితం గడిపేవాడు స్వర్గంలో ప్రవేశిస్తాడు. మీ పరిస్థితి బహుదైవారాధకులకు భిన్నంగా నల్లెద్దు చర్మంపై ఒకటీ అరా తెల్లవెంట్రుకలున్నట్లు లేదా ఎర్రెద్దు చర్మంపై ఒకటి అరా నల్ల వెంట్రుకలున్నట్లు ఉంది."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 45వ అధ్యాయం - కైఫల్‌హష్ర్]

## 94వ అధ్యాయం - ప్రతి వేయి మందిలో తొమ్మిదొందల తొంభై తొమ్మిది మంది నరక వాసులే

133. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు: (ప్రళయదినాన

దేవుడు హజ్రత్ ఆదం (అలైహి)ని "ఆదం!" అని పిలుస్తాడు. దానికి ఆయన "నేను ఉన్నాను (దేవా!) నీ ఆజ్ఞ శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాను. ప్రతి మంచీ, మేలు నీ చేతిలోనే ఉన్నాయి" అని అంటారు. "నరకానికి పంపవలసిన వారిని ప్రజల నుండి వేరు చెయ్యి" అంటాడు దేవుడు. "నరకానికి పంపవలసిన వారు ఎంత మంది ఉన్నారు?" అని అడుగుతారు హజ్రత్ ఆదం (అలైహి). "ప్రతి వేయి మందిలో తొమ్మిదొందల తొంభై తొమ్మిది మంది" అంటాడు దేవుడు.

అది అత్యంత కఠిన సమయం. (తీవ్రమైన ఆందోళన, అమితమైన దిగులుతో) బాలుడు సయితం వృద్ధుడయిపోతాడు. గర్భిణీ స్త్రీకి గర్భస్రావం జరిగిపోతుంది. మానవులు ఒక విధమైన మైకంలో పడి ఉంటారు. నిజానికి వారు ఏమైకంలోనూ ఉండరు. దైవశిక్ష ప్రభావంతో వారి పరిస్థితి అలా మారిపోతుంది.

ఈ మాటలు విని ప్రవక్త అనుచరులు ఎంతో కంగారుపడిపోతూ "దైవప్రవక్తా! ఆ వేయి మందిలో స్వర్గానికి పోయేవారు ఒక్కరు అయితే మాలో ఆ ఒక్కరు ఎవరెవరయి ఉంటారు?" అని అన్నారు. "భయపడకండి, సంతోషించండి. నరకానికి పోయే వారిలో వేయి మంది యాజూజ్, మాజూజ్ జాతుల వారయి ఉంటే, ఒక్కడు మాత్రమే మీలోని వాడయి ఉంటాడు" అన్నారు దైవప్రవక్త (స). తిరిగి ఆయన ఇలా అన్నారు "ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ శక్తిమంతుని సాక్ష్యం! మొత్తం స్వర్గవాసుల్లో మీరు మూడోవంతు సంఖ్యలో ఉంటారని నేను ఆశిస్తున్నాను" అని అన్నారు.

హదీసు ఉల్లేఖించిన వారు ఇలా అంటున్నారు: "ఈ మాట విని మేము దేవుని ఔన్నత్యాన్ని స్తుతిస్తూ, అల్లాహు అక్బర్ అన్నాము." ఆ తరువాత దైవప్రవక్త(స) తిరిగి ఈ విధంగా అన్నారు: "ఎవరి గుప్పెట్లో నా ప్రాణం ఉందో ఆ మహోన్నతుడి సాక్ష్యం! మొత్తం స్వర్గవాసుల్లో మీ సంఖ్య సగం ఉంటుందని నేను నమ్ముతున్నాను. ఇతర సమాజాలతో పోల్చుకుంటే మీ సమాజం సంఖ్య నల్లెద్దు చర్మం మీద ఒక్క తెల్ల వెంట్రుక ఉన్నట్లు లేదా గాడిద డొక్క మీద ఓ (చిన్న) మచ్చ ఉన్నట్లు ఉంటుంది".

**[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 46వ అధ్యాయం - ఇన్నజల్ జలతస్సా అతిషైవున్ అజీమ్]**

# శుచి, శుభ్రతల ప్రకరణం

## 2వ అధ్యాయం - నమాజు కొరకు పరిశుద్ధత అనివార్యం (వాజిబ్)

134. హజ్రత్ అబూ హురైరా(రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- మీలో ఎవరి వుజూ (ముఖం కాళ్ళు చేతుల పరిశుభ్రత) అయినా భంగమయితే అతను (తిరిగి) వుజూ చేయనంతవరకు అతను చేసే నమాజును దేవుడు స్వీకరించడు.

[సహీహ్ బుఖారీ : 90వ ప్రకరణం - హీల్, 2వ అధ్యాయం - ఫిస్సలాత్]

## 3వ అధ్యాయం - వుజూ చేసే విధానం, దాని సమగ్ర స్వరూపం

135. హజ్రత్ ఉస్మాన్ (రజి) బిన్ అప్ఫాన్ గురించి ఉల్లేఖకులు ఇలా తెలిపారు: హజ్రత్ ఉస్మాన్ (రజి) ఒక చెంబులో నీళ్ళు తెప్పించి, మొదట తన రెండు ముంజేతులపై నీళ్ళు పోసి కడుక్కున్నారు. తరువాత కుడి చేతిని చెంబులో ముంచి, (పిడికెడు నీళ్ళతో) నోరు పుక్కిలించారు. అలాగే ముక్కులోకి నీళ్ళు ఎక్కించి శుభ్రపరచుకున్నారు. ఆ తరువాత మూడుసార్లు ముఖం కడుక్కున్నారు. దాని తరువాత మూడుసార్లు చేతులు మోచేతుల దాకా కడుక్కున్నారు. దాని తర్వాత తడి చేతులతో తల తుడుచుకున్నారు. ఆపై రెండు కాళ్ళు చీలమండలం వరకు మూడుసార్లు కడుక్కున్నారు. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారని తెలిపారు - "ఎవరు నా పద్ధతి ప్రకారం వుజూ చేసి, మనసులో ఎలాంటి (ప్రాపంచిక) ఆలోచనలు రానివ్వకుండా పూర్తి ఏకాగ్రతతో రెండు రకాతులు నమాజు చేస్తారో అతని (ఆ తరువాయి నమాజు వరకు) జరగబోయే పాపాలు క్షమించబడతాయి."★

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 24వ అధ్యాయం - అల్ ఉజూయెసలాసన్ సలాసా]

## 7వ అధ్యాయం - వుజూ గురించి దైవప్రవక్త(స) వివరణ

136. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఎలా వుజూ చేసేవారని అడిగితే, హజ్రత్ అబ్దుల్లా (రజి) ఒక చెంబులో నీళ్ళు తెప్పించారు. దాంతో వుజూ చేసి, ప్రశ్నించిన వ్యక్తికి ప్రవక్త వుజూ పద్ధతి చూపారు. మొదట ఆయన చెంబులో నుంచి నీళ్ళు వంచి మూడుసార్లు ముంజేతులు కడుక్కున్నారు. తరువాత చెంబులో చేతిని ముంచి, మూడుసార్లు నీళ్ళతో నోరు పుక్కిలించారు. అలాగే మూడు సార్లు ముక్కులోకి నీరు ఎక్కించి చీది శుభ్రపరుచుకున్నారు. తరువాత చెంబులో నుంచి నీళ్ళు తీసుకొని మూడుసార్లు ముఖం కడుక్కున్నారు. ఆ తరువాత చెంబులో నుంచి నీళ్ళు తీసుకొని రెండు చేతులు మోచేతుల వరకు మూడుసార్లు కడుక్కున్నారు. ఆ తరువాత చెంబులో నుంచి నీళ్ళు తీసుకొని (తడి చేతులతో) తల తుడుచుకున్నారు. అప్పుడు మొదట తన రెండు చేతుల్ని తల ముందు భాగం నుంచి వెనక భాగం వరకు పోనిస్తూ తుడుచుకున్నారు. తరువాత తల వెనుక భాగం నుంచి

★ ఇక్కడ 'పాపాలు' అంటే చిన్న చిన్న పాపాలని అర్థం; పెద్ద పాపాలు కాదు. (అనువాదకుడు)

ముందు భాగం వరకు రానిచ్చి తుడుచుకున్నారు. ఈ విధంగా ఆయన ఒకసారి మాత్రమే (మసహ్) చేశారు. ఆ తరువాత రెండు కాళ్ళు చీలమండలం వరకు కడుక్కున్నారు.

[సహీహ్ బుఖారీ:4వ ప్రకరణం - వుజూ, 39వ అధ్యాయం - గస్లిర్రిజ్‌లైని ఇలల్ కాబైన్]

## 8వ అధ్యాయం - ముక్కులోకి నీళ్ళు ఎక్కించే పర్యాయాలు, మర్మాంగం శుద్ధి చేసుకునే మట్టి పెడ్డలు బేసి సంఖ్యలో ఉండాలి

137. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- వుజూ చేసుకునే వ్యక్తి ముక్కులో నీళ్ళు పోసుకొని చీది శుభ్రపరచుకోవాలి. అలాగే మట్టి పెడ్డలతో మర్మాంగ్రం శుభ్రపరచుకునే వ్యక్తి మట్టి పెడ్డలు బేసి సంఖ్యలో ఉండేలా చూసుకోవాలి.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 25వ అధ్యాయం - అల్‌ఇస్తిన్‌సారి ఫిల్‌వుజూ]

138. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు: షైతాన్ నిద్రించేవాడి ముక్కు దూలం మీద రాత్రి గడుపుతాడు. అందువల్ల నిద్ర నుండి లేచిన వ్యక్తి మూడుసార్లు ముక్కు చీది శుభ్రపరచుకోవాలి.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్‌యిల్ ఖల్ఖ్, 11వ అధ్యాయం - సిఫతిల్ ఇబ్లీస వజునూదిహీ]

## 9వ అధ్యాయం - (వుజూలో) కాళ్ళు పూర్తిగా కడుక్కోవడం తప్పనిసరి (వాజిబ్)

139. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- ఒకసారి మేము దైవప్రవక్త(స)తో కలసి ప్రయాణం చేస్తుంటే ఆయన ప్రయాణంలో వెనక పడ్డారు. అయితే ఆ తరువాత (ఎలాగో) మమ్మల్ని చేరుకున్నారు. అది నమాజు వేళ మించిపోతున్న సమయం. అంచేత (త్వరత్వరగా) మేము వుజూ చేస్తూ ఆ తొందర్లో మేము కాళ్ళు కడుక్కోవడానికి బదులు, వాటిని తడి చేతులతో తుడుచుకోసాగాము. దైవప్రవక్త(స) అది చూసి "జాగ్రత్త! (వుజూ సందర్భంలో తడవని) కాలి మడమలు నరకాగ్నితో నాశన మవుతాయి". అని బిగ్గరగా మూడుసార్లు అన్నారు.

[సహీహ్ బుఖారీ: 3వ ప్రకరణం - ఇల్మ్, 3వ అధ్యాయం - మన్‌రఫ అసౌతహు బిల్ ఇల్మ్]

140. హజ్రత్ అబూ హురైరా (రజి) ఎక్కడికో పోతూ ఉంటే ఒక చోట కొందరు వ్యక్తులు చెంబుతో వుజూ చేసుకుంటూ ఉండటం కన్పించింది. అప్పుడు ఆయన వారిని ఉద్దేశించి "(నీటితో తడవని) కాలి మడమలకు నరకాగ్నితో నాశనం ఉందని అబుల్ ఖాసిం(స) చెబుతుంటే నేను విన్నాను. అందువల్ల మీరు (ప్రవక్త) పద్ధతి ప్రకారం సమగ్రంగా వుజూ చేయండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 29వ అధ్యాయం - గస్లిల్ అఖాబ్]

## 12వ అధ్యాయం - ముఖం పూర్తిగా కడగాలి, కాళ్ళు చేతులు మడమలు మోచేతుల దాకా కడగాలి

141. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నాను: "ప్రళయ దినాన నా అనుచర సమాజాన్ని (కర్మ విచారణ కోసం) పిలవడం జరుగుతుంది. అప్పుడు

వారి ముఖాలు, కాళ్ళు, చేతులు వుజూ ప్రభావంతో తెల్లగా, మహోజ్వలంగా ఉంటాయి. అందువల్ల మీలో ఎవరైనా తమ తెలుపు, తేజస్సులను వృద్ధి చేసుకోదలిస్తే వారు వుజూలో పూర్తిగా ముఖం కడుక్కొని అలా వృద్ధి చేసుకోవచ్చు."

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 3వ అధ్యాయం - ఫజ్లిల్ వుజూయి వల్ గుర్రల్ ముహజ్జలూన్]

## 15వ అధ్యాయం - మిస్వాక్ (బ్రష్) చేయడం గురించి

142. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "నా అనుచర సమూజానికి లేక ప్రజలకు కష్టమవుతుందని నేను భావించకపోతే, ప్రతి నమాజుకు ముందు మిస్వాక్ (బ్రష్)చేసుకోవాలని వారిని ఆదేశించేవాడ్ని".

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 8వ అధ్యాయం - అల్ మిస్వాకియౌముల్ జుమా]

143. హజ్రత్ అబూ మూసా అష్అరి (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (స) సన్నిధికి వెళ్ళాను. అప్పుడు ఆయన చేతిలో మిస్వాక్ (పనుదోముపుల్ల) పట్టుకొని పల్లు తోముకుంటున్నారు. (ఆ తరువాత) దాన్ని నోట్లో పెట్టుకొని వాంతి చేసుకుంటున్నట్లు వావ్వావ్ అనసాగారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 73వ అధ్యాయం - అల్‌మిస్వాక్]

144. హజ్రత్ హుజైఫా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రాత్రివేళ తహజ్జుద్ నమాజ్ కోసం నిద్ర నుండి లేవగానే పనుదోము పుల్లతో గట్టిగా పల్లు తోముకునేవారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 73వ అధ్యాయం - అల్‌మిస్వాక్]

## 16వ అధ్యాయం - సహజ లక్షణాలు

145. హజ్రత్ అబూ హురైరా (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా తెలిపారు: "ప్రకృతికి అనుగుణమైన అయిదు విషయాలు ఉన్నాయి. (1) ఖత్నా (వడుగు) చేయడం, (2) నాభి క్రింది వెంట్రుకలు తీసివేయడం, (3) చంకలోని వెంట్రుకలు తొలగించడం, (4) గోళ్ళు కత్తిరించడం, (5) మీసాలు కత్తిరించడం."

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 63వ అధ్యాయం - ఖస్సిష్షారిబ్]

146. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు:- "మీ వేషధారణ బహుదైవారాధకులకు భిన్నంగా ఉండేలా చూసుకోండి. గడ్డం పెంచండి, మీసాలు కత్తిరించండి."

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 64వ అధ్యాయం - తఖ్లీముల్ అజ్ఫార్]

147. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా బోధించారు:- "మీసాలు కత్తిరించండి, గడ్డాలు పెంచండి."

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 65వ అధ్యాయం - ఈఫావుల్లుహా]

## 17వ అధ్యాయం - మరుగుదొడ్డికి పోయే పద్ధతి

148. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా బోధించారు:- "మీరు మలమూత్రాల కోసం వెళ్ళినప్పుడు మీ ముఖం, వీపు ఖిబ్లా (కాబా గృహం) వైపుకు ఉండేలా కూర్చోకండి; తూర్పు లేక పడమర వైపు ఉండేలా కూర్చోండి."

ఈ హదీసు ఉల్లేఖించిన తరువాత హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) ఇలా తెలియజేస్తున్నారు:- "ఆ తరువాత మేము సిరియా వెళ్తే అక్కడ మల మూత్ర విసర్జనకై నిర్మించిన గుంటలు ఖిబ్లా దిశగా ఉండటం వల్ల, మేము చేసేది లేక వాటి మీదనే కూర్చునేవాళ్ళము. కాకపోతే కాస్త ముఖం పక్కకు తిప్పుకునే వాళ్ళం. దైవాన్ని క్షమాపణ కోరుకునేవాళ్ళం."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 29వ అధ్యాయం - ఖిబ్లతి అహ్లిల్ మదీనతి వ అహ్లిష్షామి వల్ మష్రిఖ్]

149. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- మలమూత్ర విసర్జన కోసం కూర్చుంటే ఖిబ్లా (కాబా) వైపుగాని, బైతుల్ మఖ్దిస్ వైపుగాని ముఖం లేదా వీపు పెట్టి కూర్చోకూడదని అంటారు కొందరు. కాని ఓ రోజు నేను ఇంటి కప్పు మీద ఎక్కి చూస్తే, దైవప్రవక్త(స) రెండు ఇటుకల మీద కాళ్ళు పెట్టి బైతుల్ మఖ్దిస్ వైపుకు తిరిగి కూర్చొని మల (మూత్ర) విసర్జన చేస్తూ ఉండటం కన్పించింది.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 12వ అధ్యాయం - మన్ తబర్రజ అలా లబిన తైన్]

150. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒకసారి నేను ఏదో పని కోసం ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ హఫ్సా (రజి) గారి ఇంటి మీది కెక్కాను. ఎక్కి చూస్తే, (దూరాన ఓ చోట) దైవప్రవక్త(స) ఖిబ్లా(కాబా) వైపు వీపు, సిరియా వైపు ముఖం పెట్టి మల(మూత్ర) విసర్జన చేయడం కన్పించింది.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 14వ అధ్యాయం - అత్తబర్రుజు ఫిల్ బుయూత్]

## 18వ అధ్యాయం - కుడిచేత్తో మూత్రశుద్ధి నిషిద్ధం

151. హజ్రత్ అబూ ఖతాద (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:- "నీళ్ళు త్రాగుతున్నప్పుడు నీళ్ళ పాత్రలోకి శ్వాస వదలకూడదు. అలాగే మలమూత్ర విసర్జన సమయంలో కుడిచేత్తో మర్మాంగాన్ని పట్టుకోకూడదు. కుడిచేత్తో మూత్రశుద్ధి చేయకూడదు".

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 18వ అధ్యాయం - అన్నహి అనిల్ ఇస్తిన్జాయి బిల్ యమీన్]

## 19వ అధ్యాయం - మూత్ర విసర్జన గాని, ఇతర పనులుగాని కుడివైపు నుండి ఆరంభించాలి

152. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స)కు ఏ పనయినా కుడివైపు నుండి ప్రారంభించడమంటే ఎంతో ఇష్టం. చివరికి ఆయన చెప్పులు తొడుక్కున్నా, తల దువ్వుకున్నా, మూత్ర శుద్ధి చేసినా కుడివైపు నుండే ప్రారంభిస్తారు.

[సహీహ్ బుఖారీ: 4వ ప్రకరణం - వుజూ, 31వ అధ్యాయం - అత్తయిమ్ముని ఫిల్ వుజూయివల్ గుస్ల్]

## 21వ అధ్యాయం - మలమూత్ర విసర్జన తరువాత నీటితో శుద్ధి

153. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మలమూత్ర విసర్జన కోసం బయలుదేరినప్పుడు నేను, మరొక అబ్బాయి కలసి ఒక బొక్కెన నీళ్ళు, ఒక ఈటె తీసుకొని ఆయన వెంట వెళ్ళేవారము. దైవప్రవక్త(స) ఆ నీళ్ళతో శుద్ధి చేసుకునేవారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 17వ అధ్యాయం - హమ్లుల్ అనజతి మఅల్ మాయి ఫిల్ ఇస్తిన్జా.]

154. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మలమూత్ర విసర్జన కోసం దూరంగా నిర్జన ప్రదేశం వైపుకు వెళ్ళారు. అప్పుడు నేను ఆయన దగ్గరికి నీళ్ళు తీసికెళ్ళాను. దాంతో ఆయన శుద్ధి చేసుకునే వారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 56వ అధ్యాయం- మాజాఅఫీగస్లిల్‌బౌల్]

## 22వ అధ్యాయం - మేజోళ్ళ మీద మసా (తడి చేత్తో తుడవడం)

155. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) ఓసారి మూత్ర విసర్జన తరువాత వుజూ చేస్తూ మేజోళ్ళ మీద 'మసా' చేశారు (అంటే తడి చేత్తో తుడిచారు.) ఆ తరువాత ఆయన లేచి నమాజు చేశారు. ఆయనగారి ఈ ఆచరణాసరళి గురించి అడిగితే, దైవప్రవక్త(స) ఇలా చేయడాన్ని తాను చూశానని ఆయన సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 25వ అధ్యాయం - అస్సలాతి ఫిల్ ఖిఫాఫ్]

156. హజ్రత్ హుజైఫా (రజి) కథనం:- ఒకసారి నేను దైవప్రవక్త(స) వెంట ప్రయాణం చేస్తున్నాను. (దారిలో) ఆయన ఒక తెగవారి కసువు దిబ్బ సమీపంలోని ఒక గోడ చాటుకు వెళ్ళి అందరూ నిలబడినట్లే నిలబడ్డారు. అలా నిలబడి మూత్ర విసర్జన చేయడం ప్రారంభించారు.★ ఆ సమయంలో నేను కొంచెం పక్కకు తప్పుకున్నాను. అయితే దైవప్రవక్త (స) నన్ను (చేత్తో) సైగ చేసి దగ్గరికి పిలిచారు. నేను వెళ్ళి ఆయన వెనకాల మూత్ర విసర్జన పని ముగించుకునే దాకా నిల్చున్నాను.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 61వ అధ్యాయం - అల్‌బౌలి ఇన్ద సాహిబిహి వత్త సత్తురుబిల్ హాయిత్]

157. హజ్రత్ ముగైరా బిన్ షాబ(రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి మలమూత్ర విసర్జన కోసం వెళ్తుంటే నేను ఓ బొక్కెనలో నీళ్ళు తీసుకొని ఆయన వెనకాల బయలుదేరాను. ఓ చోట ఆయన మల(మూత్ర) విసర్జన ముగించుకున్నారు. ఆ తరువాత నేను (ఆయన చేతుల మీద) నీళ్ళు పోశాను. దాంతో ఆయన వుజూ చేశారు. వుజూ సందర్భంలో మేజోళ్ళ మీద 'మసా' చేశారు. (అంటే తడి చేత్తో తుడుచుకున్నారు.)

[సహీహ్ బుఖారీ: 4వ ప్రకరణం - వుజూ, 48వ అధ్యాయం - అల్ మస్‌హి అలల్ ఖుఫ్ఫైన్]

---

★ నిల్చొని మూత్ర విసర్జన చేసే విషయంలో హదీసు ఉల్లేఖకుల మధ్య భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. హజ్రత్ ఆయిషా (రజి) నుండి సంగ్రహించిన ఒక కథనం ప్రకారం ఇలా చేయడం నిషిద్ధం. కాని ధర్మవేత్తలు దీన్ని గురించి రెండు హదీసుల్ని పరిశీలించి ఒక మధ్యేమార్గాన్ని నిర్ణయించారు. దాని ప్రకారం నేల బురదగా ఉంటే, మలిన బిందువులు పైన పడే ప్రమాదం ఉంటే, లేదా బట్టలు పాడయిపోయే సూచనలుంటే అలాంటి చోట నిలబడి మూత్రం పోయడంలో తప్పులేదు. అలాగే కూర్చొని పోయలేని వ్యాధిగ్రస్తులు, వికలాంగులు కూడా నిలబడి మూత్ర విసర్జన చేయవచ్చు. ఇవేమీ లేకుండా నిలబడి మూత్ర విసర్జన చెయ్యడం మక్రూహ్ (అవాంఛనీయం) అవుతుంది. కనుక ఇలాంటి చర్యకు దూరంగా ఉండాలి.

158. హజ్రత్ ముగైరా బిన్ షాబ (రజి) కథనం:- ఒకసారి నేను దైవప్రవక్త(స)తో కలసి ప్రయాణం చేస్తుంటే ఓ చోట ఆయన (ఆగి) "ముగైరా! తోలుతిత్తిలో నీళ్ళు సిద్ధంగా ఉంచు" అని చెప్పి వెళ్ళారు. అలా కనుచూపు మేరదాటి (నిర్జన ప్రదేశంలోకి) పోయి కాలకృత్యం తీర్చుకుని వచ్చారు. ఆ సమయంలో ఆయన పొడుగు చేతుల సిరియన్ చొక్కా ధరించి ఉన్నారు. చొక్కా చేతులు బిగుతుగా ఉండటం వల్ల ఆయన దాని క్రింది నుంచి చేతులు బయట తీశారు. అప్పుడు నేను ఆయన చేతుల మీద నీళ్ళు పోశాను. దాంతో ఆయన వుజూ చేశారు. వుజూ చేస్తున్నప్పుడు మేజోళ్ళ మీద మసా చేశారు. (అంటే తడిచేత్తో తుడుచుకున్నారు.) ఆ తరువాత నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 7వ అధ్యాయం - అస్సలాతి ఫిల్ జుబ్బతి ష్షామియ్యా]

159. హజ్రత్ ముగైరా బిన్ షాబ (రజి) కథనం:- ఓ సారి ప్రయాణంలో నేను రాత్రి వేళ దైవప్రవక్త(స) వెంట ఉన్నాను. ఆయన నన్ను పిలిచి "నీ దగ్గర నీళ్ళేమయినా ఉన్నాయా?" అని అడిగారు. నేను ఉన్నాయన్నాను. అప్పుడాయన వాహనం నుంచి క్రిందికి దిగి ఒక వైపుకు వెళ్ళిపోయారు. అలా చీకటిలో నాకు కనపడనంత దూరం వెళ్ళిపోయారు. తిరిగొచ్చిన తరువాత ఆయన చేతులపై నేను నీళ్ళు పోయడం మొదలెట్టాను. ఆయన ముంజేతులు, ముఖం కడుక్కున్నారు. కాని ఆ తరువాత చేతులు పూర్తిగా కడుక్కోవడానికి చొక్కా చేతులు పైకి జరపడానికి ప్రయత్నిస్తే లోపల ధరించిన ఉన్ని బనియన్ వల్ల అవి బిగుతుగా ఉండి పైకి పోలేదు. అప్పుడాయన చొక్కా క్రింది నుంచి చేతులు బయటికి తీసి కడుక్కున్నారు. తరువాత తల 'మసా' చేసుకున్నారు. (అంటే తడి చేత్తో తుడుచుకున్నారు.) ఆ తరువాత నేను ఆయన కాళ్ళ నుండి మేజోళ్ళు తీసేద్దామని క్రిందికి వంగాను. ఆయన నన్ను వారిస్తూ "ఉండనివ్వు. నేను కాళ్ళు కడుక్కునే మేజోళ్ళు తొడుగుకున్నాను" అని చెప్పి మేజోళ్ళ మీద 'మసా' చేశారు.

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 11వ అధ్యాయం - జుబ్బతిసూఫి ఫిల్ గజ్వా]

## 27వ అధ్యాయం - కుక్క నీళ్ళు త్రాగిన పాత్ర

160. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త(స) ఇలా అన్నారు:- ఏదైనా పాత్రలో నుంచి కుక్క నీళ్ళు త్రాగితే ఆ పాత్రను ఏడు సార్లు కడగాలి.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 33వ అధ్యాయం]

## 28వ అధ్యాయం - నిలకడగా ఉన్న నీటిలో మూత్రం పోయరాదు

161. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు:- నిలకడగా (ప్రవహించకుండా) ఉన్న నీటిలో మూత్ర విసర్జన చేయకూడదు. మూత్ర విసర్జన తరువాత అందులో స్నానం కూడా చేయకూడదు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 68వ అధ్యాయం - అల్‌బౌలిఫిల్ మాయిద్దాయిమ్].

## 30వ అధ్యాయం - మూత్రం తదితర మలినాలతో మలినమయిన మస్జిద్‌ని నీటితో కడిగి వేయడం

162. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒకసారి ఓ దేశ దిమ్మరి మస్జిద్‌లోనే మూత్రం పోయసాగాడు. అది చూసి జనం అతడ్ని వారించడానికి లేచి వెళ్ళారు. అప్పుడు దైవప్రవక్త(స) "అతడ్ని మూత్రం పోసుకోనివ్వండి" అన్నారు. అతను మూత్రం పోసిన తరువాత దైవప్రవక్త(స) ఒక చేద నీళ్ళు తెప్పించి ఆ స్థలంలో పోశారు.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 35వ అధ్యాయం - అర్రిఫ్ఖిఫిల్ అమ్రి కుల్లిహీ]

## 31వ అధ్యాయం - చంటి పిల్లవాని మూత్ర మలినం శుభ్రపరిచే పద్ధతి

163. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ప్రజలు దైవప్రవక్త(స) దగ్గరకు తమ పసి పిల్లలను తీసుకు వచ్చేవారు. దైవప్రవక్త (స) ఆ పిల్లల కోసం దుఆ (వేడుకోలు) చేసేవారు. ఒకసారి ఒక పిల్లవాడ్ని ఆయన దగ్గరకు తెచ్చారు. ఆ పిల్లవాడు ఆయన బట్టలపై మూత్రం పోశాడు. అప్పుడు దైవప్రవక్త(స) నీళ్ళు తెప్పించి బట్టలు జాడించి కడిగివేశారు.★

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 3వ అధ్యాయం - అద్దుఆయి లిస్సిబ్యాని బిల్ బర్కతి....]

164. హజ్రత్ ఉమ్మెకైస్ బిన్తె ముహ్సిన్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(స) సన్నిధికి ఇంకా అన్నం కూడా తిననటువంటి ఒక పసి పిల్లవాడ్ని తీసుకొని వెళ్ళాను. దైవప్రవక్త(స) ఆ పిల్లవాడ్ని తీసుకొని తన ఒడిలో కూర్చోబెట్టుకున్నారు. అంతలో ఆ పిల్లవాడు ఆయన బట్టలపై మూత్రం పోశాడు. అప్పుడు ఆయన నీళ్ళు తెప్పించి బట్టలు జాడించి కడిగివేశారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 59వ అధ్యాయం - బౌలిస్సిబ్యాన్]

## 32వ అధ్యాయం - వీర్యపు మరకలను గీకి కడిగి వేయడం

165. ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (రజి) గారిని అడగటం జరిగింది: "బట్టలపై వీర్యం పడిపోతే ఏం చేయాలి?" అని. దానికామె ఇలా సమాధానమిచ్చారు. "నేను (అలాంటప్పుడు)

---

★ పిల్లల మూత్రం విషయంలో ధర్మవేత్తల మధ్య మూడు విధాల అభిప్రాయాలున్నాయి. (1) హజ్రత్ అలీ (రజి), అతాబిన్ అబీ రబాహ్ (రహ్మాలై), హసన్ బస్రీ (రహ్మాలై), ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ ప్రభృతులతో పాటు అహ్లెహదీస్ విద్వాంసుల అభిప్రాయం ప్రకారం మగపిల్లవాడు మూత్రం పోసిన చోట నీళ్ళు చిలికిస్తే చాలు, కడగనవసరం లేదు. అయితే ఆడపిల్ల మూత్రం పోస్తే మాత్రం తప్పకుండా కడిగివేయాలి. (2) 'షాఫ' ధర్మం ప్రకారం ఆడపిల్లలయినా, మగపిల్లవాడయినా సరే మూత్రం పోస్తే నీళ్ళు చిలకరిస్తే చాలు. (3) ఇమామ్ మాలిక్ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం, ఆడపిల్లలయినా, మగపిల్లవాడయినా మూత్రం పోస్తే తప్పకుండా కడిగివేయాలి. ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) అభిప్రాయం కూడా అదే. ఈ అభిప్రాయభేదాలన్నీ కేవలం పాలుత్రాగే పిల్లల విషయంలోనే. ఆ తర్వాత అన్నం తదితర ఇతర ఆహార పదార్థాలు తినడం ప్రారంభించిన దగ్గర్నుంచి ఆడపిల్లయినా, మగపిల్లవాడయినా సరే మూత్రం పోస్తే తప్పనిసరిగా కడిగివేయాలి. ఇది ధర్మవేత్తలందరి అభిప్రాయం.

దైవప్రవక్త(స) బట్టలను ఉతికి వేస్తాను. వారు ఆ బట్టలే ధరించి నమాజుకు వెళ్లారు. అప్పుడు ఆ బట్టలపై ఉతుకుడు గుర్తులు, తడి అలాగే ఉండేవి.''

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 64వ అధ్యాయం - గస్లిల్‌మనియ్యి వఫర్కిహీ వగస్లిమాయుసీబు మినల్ మర్అతి]

## 33వ అధ్యాయం - రుతు రక్తపు మలినాన్ని శుభ్రపరిచే పద్ధతి

166. హజ్రత్ అస్మా (రజి) కథనం:- ఓ సారి దైవప్రవక్త(స) సన్నిధికి ఓ స్త్రీ వచ్చి ''స్త్రీ తన బట్టలపై రుతు రక్తం అంటుకున్నప్పుడు ఏం చేయాలి?'' అని అడిగింది. దానికి దైవప్రవక్త(స) ''మొదట ఆ రక్తం మరకల్ని గీకి వేయాలి. తరువాత నీళ్ళు పోసి రుద్ది కడిగివేయాలి. ఆ తరువాత ఆ బట్టలు ధరించే నమాజు చేయవచ్చు'' అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 63వ అధ్యాయం - గస్లిద్దమ్]

## 34వ అధ్యాయం - మూత్రాశుద్ధతకు దూరంగా ఉండాలి

167. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి రెండు సమాధుల మధ్య నుంచి నడుస్తూ ''ఈ రెండు సమాధుల వాసులు శిక్ష అనుభవిస్తున్నారు. ఈ శిక్షకు పెద్ద కారణం ఏదీ లేదు. వారిద్దరిలో ఒకడు మూత్రం (చుక్కలు) వంటిపై పడకుండా జాగ్రత్త వహించేవాడు కాదు. రెండవ వ్యక్తి చాడీలు చెబుతూ తిరుగుతుండేవాడు. అంతే'' అని తెలియజేశారు. తరువాత ఆయన ఓ పచ్చటి మండ తీసుకొని, దాన్ని మధ్యకు చీల్చి రెండు భాగాలు చేశారు. ఆ రెండింటినీ ఆ రెండు సమాధులపై నాటారు.

అనుచరులు అది చూసి ''దైవప్రవక్తా! మీరిలా ఎందుకు చేశారు''అని అడిగారు. దానికి ఆయన సమాధానమిస్తూ ''ఇలా చేయడం వల్ల ఈ మండలు ఎండిపోనంతవరకు వీరి (సమాధి) శిక్ష కొంత వరకు తగ్గిపోవచ్చని భావిస్తున్నాను'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 56వ అధ్యాయం - మాజా అఫీ గస్లిల్ బౌల్]

# బహిష్టు ప్రకరణం

## 1వ అధ్యాయం - బహిష్టు స్త్రీతో లోఉడుపుపై శారీరక కలయిక

168. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- "మాలో ఎవరైనా బహిష్టు అయినప్పుడు దైవప్రవక్త(స) ఆమె దేహానికి దేహం ఆనించదలచుకుంటే, ఆమెను (లంగోటి లాంటి) లోఉడుపును కట్టుకోమని ఆదేశించేవారు. ఆ తరువాత ఆమె దేహానికి దేహం ఆనించేవారు... లైంగికవాంఛపై దైవప్రవక్త(స) కున్న ఇంతటి నిగ్రహశక్తి మీలో ఎవరికైనా ఉందా?" అని హజ్రత్ ఆయిషా (రజి) అన్నారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 5వ అధ్యాయం - ముబాషిరతిల్ హాయిజ్]

169. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- దైవప్రవక్త (స) తన భార్యలలో ఎవరితోనైనా దేహానికి దేహం ఆనించదలచుకున్నప్పుడు, ★ఆమె బహిష్టు అయి ఉంటే, (లంగోటిలాంటి) లో ఉడుపు కట్టుకోమని ఆమెను ఆదేశించేవారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం, - హైజ్, 5వ అధ్యాయం - ముబాషిరతిల్ హాయిజ్]

## 2వ అధ్యాయం - ఒకే దుప్పటిలో బహిష్టు స్త్రీతో కలసి పడుకోవడం

170. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మెసల్మా (రజి) కథనం:- ఒకసారి, నేను, దైవప్రవక్త(స) ఒకే దుప్పటి కప్పుకొని పడుకున్నాము. కాస్సేపటికి నాకు హఠాత్తుగా రుతుస్రావం మొదలయింది. వెంటనే నేను మెల్లగా దుప్పటి నుంచి బయటికి వచ్చి బహిష్టు బట్ట కట్టుకున్నాను. దైవప్రవక్త(స) ఇది గమనించి "ఏమిటీ, నువ్వు బహిష్టు అయ్యావా?" అని అడిగారు. నేను ఔనన్నాను. అయినప్పటికీ ఆయన నన్ను పడక మీదికి పిలుచుకున్నారు. నేను వెళ్ళి ఆయన దగ్గర అదే దుప్పటి క్రింద పడుకున్నాను.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 22వ అధ్యాయం - మనిత్త ఖజసియాబిల్ హైజ్ సివా సియా బత్తుహ్రా]

171. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఉపవాస వ్రత స్థితిలో నన్ను ముద్దాడేవారు. పోతే నేను, దైవప్రవక్త (స) ఒకే పాత్రలోని నీళ్ళతో (లైంగిక అశుద్ధత తొలగింపు) స్నానం చేసేవాళ్ళము.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 21వ అధ్యాయం - అన్నౌమి మఅల్ హాయిజి వహియ ఫీ సియాబహా]

---

★ ఇక్కడ మూలభాషలో 'ముబాషిరత్' అనే పదం వచ్చింది. అంటే శరీరంతో శరీరం కలపడం అని అర్థం. అంతేగాని ఇక్కడ సందర్భాన్ని బట్టి లైంగిక సంపర్కం అనే భావం రాదు. ఎందుకంటే దివ్యఖుర్‌ఆన్‌లో "రుతుస్రావం గురించి ఆజ్ఞ ఏమిటని అడుగుతున్నారు వారు, అదొక అపరిశుద్ధావస్థ అనీ, ఆ స్థితిలో భార్యలకు దూరంగా ఉండాలని, వారు (స్నానం చేసి) పరిశుభ్రం కానంత వరకు వారి దగ్గరకు వెళ్ళకూడదని చెప్పెయ్యి" అని ఉంది. (2:222)

## 3వ అధ్యాయం - బహిష్టు స్త్రీ తన భర్తకు తలంటవచ్చు, తల దువ్వవచ్చు

172. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (స) మస్జిద్‌లో ఉండి (ఏతెకాఫ్ (తపోనిష్ఠ) స్థితిలో) తన శిరస్సును నా వైపుకు రానిచ్చేవారు. అప్పుడు నేను ఆయనకు తల దువ్వేదాన్ని. ఆయన ఏతెకాఫ్ పాటిస్తున్న రోజుల్లో అనవసరంగా (మస్జిద్ వదిలి) ఇంటికొచ్చేవారు కాదు.

[సహీహ్ బుఖారీ : 33వ ప్రకరణం - ఏతెకాఫ్, 3వ అధ్యాయం - లాయద్ ఖులుల్ బైత ఇల్లాలిహాజత్]

173. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను బహిష్టు అయిన రోజుల్లో (కూడా) దైవప్రవక్త(స) నన్ను దేహానికి దేహం ఆనిచ్చి[1] స్పర్శించేవారు. అలాగే ఏతెకాఫ్ (తపోనిష్ఠ)లో (కూడా) ఆయన మస్జిద్‌లో ఉండి తమ శిరస్సును నా వైపుకు పెడ్తే నేను బహిష్టు అయి ఉండి కూడా ఆయనకు తలంటేదాన్ని.

[సహీహ్ బుఖారీ : 33వ ప్రకరణం- ఏతెకాఫ్, 4వ అధ్యాయం - గుస్లిల్ మోతకిఫ్]

174. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను బహిష్టు అయిన రోజుల్లో (కూడా) దైవప్రవక్త(స) నా ఒడిని తలగడగా ఉపయోగించుకుని దివ్యఖుర్‌ఆన్ పఠించేవారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 3వ అధ్యాయం - ఖిరాఅతిర్రజులి ఫీ హజ్రి అమ్రాతిహీ వహియ హాయిజ్]

## 4వ అధ్యాయం - శుక్ర నష్టం శుద్ధి

175. హజ్రత్ అలీ (రజి) కథనం:- నాకెక్కువగా శుక్రనష్టం[2] జరుగుతూ ఉంటుంది. అయితే ఈ సమస్యను గురించి దైవప్రవక్త(స)ను అడగడానికి నేనెంతో సిగ్గుపడేవాడ్ని. అందువల్ల దీన్ని గురించి దైవప్రవక్త(స)ను అడిగి పరిష్కారం తెలుసుకోవలసిందిగా ఓ రోజు నేను హజ్రత్ మిఖ్దాద్ బిన్ అస్వద్(రజి)తో అన్నాను. ఆయన వెళ్ళొచ్చి "శుక్రనష్టం జరిగితే (వెంటనే) వుజూ చేసుకోవాలని దైవప్రవక్త(స) అన్నార"ని తెలియజేశారు. (సహీహ్ బుఖారీ)

## 6వ అధ్యాయం - లైంగిక అశుద్ధావస్థలో వుజూ చేసి పడుకోవాలి

176. హజ్రత్ ఆయిషా (రజి)కథనం:- దైవప్రవక్త (స) లైంగిక అశుద్ధావస్థలో పడుకోదలచుకుంటే, తమ మర్మాంగాన్ని కడుగుకొని, నమాజు కోసం చేసే విధంగా వుజూ చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 27వ అధ్యాయం - అల్‌జుంబి యత వజ్జావు సుమ్మయనామ్]

177. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) ఓ సారి "దైవప్రవక్తా! లైంగిక అశుద్ధావస్థలో అలాగే పడుకోవచ్చా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "ఆ.... లైంగిక అశుద్ధావస్థలో

---

(1) ఈ హదీసులో కూడా 'ముబాషిరత్' అనే పదమే వాడబడింది. అంటే దేహాన్ని దేహంతో కలపడం, ఆనించడం, తాకించడం అని శాబ్దిక అర్థం, సంభోగం అనే అర్థం రాదు.

(2) సాధారణంగా లైంగికాలోచన కలిగినపుడు స్త్రీ పురుషుల మర్మావయవాల నుండి పల్చటి జిగట ద్రవం వెలువడుతుంది. దీన్నే శుక్రనష్టం అంటారు. దీనివల్ల లైంగికోద్రేకం చల్లారదు. పూర్తిగా వీర్యస్ఖలనం జరిగినపుడే ఆ ఉద్రేకం చల్లారుతుంది.

వుజూ చేసి పడుకోవచ్చు'' అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 26వ అధ్యాయం - నౌమిల్ జుంబి]

178. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) ఓసారి "దైవప్రవక్తా! రాత్రివేళ నాకు వీర్యస్ఖలనం జరుగుతుంది. (ఆ సమయంలో నేను స్నానం చేయలేను. ఏం చెయ్యాలి)?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "వుజూ చెయ్యండి.★ మర్మావయం కడుక్కొని పడుకోండి'' అని అన్నారు.

(సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 27వ అధ్యాయం - అల్ జుంబియత్ వజావు సుమ్మ యనామ్]

179. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఒకే రాత్రి తన భార్యలందరి దగ్గరికి పోయి వచ్చేవారు. ఆ రోజుల్లో ఆయనకు తొమ్మిది మంది భార్యలున్నారు.

[సహీహ్ బుఖారీ - 5వ ప్రకరణం - గుసుల్, 24వ అధ్యాయం - అల్‌జుంబి యఖ్రుజు వయమ్‌షీ ఫిస్సూఖి వగైరిహీ]

## 7వ అధ్యాయం - స్త్రీకి స్ఖలనమయితే ఆమె కూడా స్నానం చేయాలి

180. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- ఒకసారి ఉమ్మె సలీం (రజి) దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! సత్యం తెలపడంలో దేవుడు సిగ్గుపడడు. స్త్రీలకు స్వప్న స్ఖలనమయితే వారు కూడా విధిగా గుసుల్ (స్నానం) చేయాలా?'' అని అడిగింది. దానికి దైవప్రవక్త(స) "చెయ్యాలి, స్వప్న స్ఖలనంలో వీర్యం కన్పిస్తే వాళ్ళు కూడా విధిగా గుసుల్ చేయవలసిందే'' అని సమాధానమిచ్చారు.

(విశ్వాసుల మాతృమూర్తి) హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) ఈ మాటలు విని సిగ్గుతో ముఖం దాచుకుంటూ "దైవప్రవక్తా! స్త్రీలకూ కూడా స్వప్న స్ఖలనమవుతుందా?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "పిచ్చిదానా! స్త్రీకి కూడా వీర్యస్ఖలనమవుతుంది. లేకపోతే పిల్లవాడికి తల్లి పోలికలు ఎలా వస్తాయనుకున్నావు?'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 50వ అధ్యాయం - అల్ హయావు ఫిల్ ఇల్మ్]

## 9వ అధ్యాయం - లైంగిక అశుద్ధావస్థలో స్నానం చేసే పద్ధతి

181. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) లైంగిక అశుద్ధతను తొలగించుకోవడానికి స్నానం చేయసిద్ధమయినప్పుడు ముందుగా రెండు చేతులు కడిగి శుభ్రపరుచుకుంటారు. తరువాత నమాజు కోసం చేసే విధంగా వుజూ చేస్తారు. ఆ తరువాత చేతి వ్రేళ్ళను నీటిలో ముంచి తీసి దువ్వెనలా తలలోకి జొనిపించి తిప్పుకునేవారు. ఆ తరువాత రెండు చేతుల్లో నీళ్ళు తీసుకొని మూడుసార్లు తలమీద పోసుకుంటారు. ఆపై పూర్తి శరీరంపై నీళ్ళు పోసుకుంటారు.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 1వ అధ్యాయం - అల్ వుజూ ఖబ్లల్ గుస్ల్]

182. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- దైవప్రవక్త (స) స్నానం చేయడానికి

★ అంటే అప్పటికప్పుడే వుజూ చేయాలని అర్థం కాదు. నమాజు కోసం లేచినప్పుడు వుజూ చేసుకోవచ్చు అని భావం.

(ఓసారి) నేను నీళ్ళు తోడిపెట్టాను. ఆయన (మొట్టమొదట) కుడిచేత్తో ఎడమ చేతిపై నీళ్ళు పోసుకొని, రెండు చేతులు కడుక్కున్నారు. తరువాత మర్మాంగాన్ని కడుక్కున్నారు. ఆ తరువాత ఎడమ చేతిని మట్టితో రుద్ది (నీళ్ళతో) కడుక్కున్నారు. ఆ తరువాత నోరు పుక్కిలించారు. దాని తరువాత ముక్కులోకి నీరు ఎక్కించి శుభ్రపరుచుకున్నారు. దాని తరువాత ముఖం కడుక్కున్నారు. ఆ తరువాత తలపై నీళ్ళు పోసుకున్నారు. ఆ తరువాత ఆ చోటు నుంచి పక్కకు జరిగి రెండు కాళ్ళు కడుక్కున్నారు. ఆ తరువాత తువాలు తెచ్చిస్తే దాంతో ఆయన (శరీరం) తుడుచుకోలేదు.

[సహీహ్ బుఖారీ - 5వ ప్రకరణం - గుసుల్, 7వ అధ్యాయం - అల్‌మజమ్ జతివల్ ఇస్తిన్‌షాఖ్ ఫిల్ జనాబతి]

183. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) లైంగిక అశుద్ధావస్థలో స్నానం చేయడానికి సిద్ధమైనప్పుడు ఓ పాత్రలో[(1)] నీళ్ళు తెప్పించుకుంటారు. అందులో నుంచి చేత్తో నీళ్ళు తీసుకొని మొదట తల కుడి భాగం, తరువాత ఎడమ భాగం కడుక్కుంటారు. ఆ తరువాత రెండు చేతులలో నీళ్ళు తీసుకొని తలమీద పోసుకుంటారు.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 6వ అధ్యాయం - మన్‌బదాయి బిల్ హిలాబి అవిత్తీబి ఇన్దల్ గుస్లి]

## 10వ అధ్యాయం - లైంగిక పారిశుధ్య స్నానం కోసం నీటి పరిమాణం

184. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స) 'ఫర్ఖ్'[(2)] అని ఒకే బాన (గంగాలం)లోని నీటితో స్నానం చేసేవాళ్ళము.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్; 2వ అధ్యాయం - గుస్లిర్రజులి మఅమ్రాతిహీ]

185. హజ్రత్ అబూ సల్మా బిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి)ని ఆమె సోదరుడు అబ్దుర్రహ్మాన్ బిన్ అబూ బకర్ (రజి) దైవప్రవక్త (స) స్నానం గురించి అడిగినప్పుడు ఆమె 'సా'[(3)] (4 సేర్ల)కు సమానమైన పరిమాణం గల ఒక బాన నిండా నీళ్ళు తెప్పించారు. ఆ నీటితో ఆమె స్నానం చేశారు; తలపై నీళ్ళు పోసుకున్నారు. అప్పుడు ఆమెకు, మాకు మధ్య ఒక తెర కట్టారు.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం, గుసుల్, 2వ అధ్యాయం - అల్ గుస్లి బిస్సాయి వనహ్‌విహీ]

186. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) స్నానం చేయడానికి ఒక 'సా' (4 సేర్ల) నుండి ఐదు 'ముద్' (సేరు)ల వరకు నీటిని వాడేవారు. ఒక 'ముద్' (సేరు)[(4)] నీటితో వుజూ చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 47వ అధ్యాయం - అల్ వుజూ బిల్ ముద్]

---

(1) హదీసులో అసలు పదం 'హిలాబ్' అని ఉంది. హిలాబ్ అంటే జానెడు పొడవు, జానెడు వెడల్పు గల ఒక విధమైన పాత్ర. ఇందులో సుమారు నాలుగు సేర్ల నీళ్ళు పడ్తాయి.

(2) 'ఫర్ఖ్' అంటే మదీనాలో వాడే ఒక విధమైన బాన. ఇందులో దాదాపు 8 సేర్ల నీళ్ళు పడ్తాయి.

(3) ఒక 'సా' అంటే దాదాపు నాలుగుసేర్లకు సమానమైన పరిమాణం. అయితే ధర్మవేత్తల ఏకాభిప్రాయం ప్రకారం స్నానం (గుసుల్) చేయడానికి అవసరమైనంత నీరు వాడవచ్చు. ఇంత నీరే వాడాలన్న నిబంధన ఏదీ లేదు.

(4) 'సా', 'ముద్' - ఈ రెండూ ఆనాటి ప్రసిద్ధ కొలమానాలు. 'సా' పరిమాణం అయిదునుండి ఎనిమిది పౌండ్ల వరకు ఉంటుంది. 'ముద్' పరిమాణం దాదాపు ఒక సేరు ఉంటుంది. ఏమయినప్పటికీ వుజూ, గుసుళ్ళ కోసం ఒక నిర్ణీత పరిమాణం మేరకే నీటిని వాడాలన్న నిబంధన ఏదీ లేదు. అవసరాన్ని బట్టి ఎక్కువ కూడా వాడవచ్చు. కాకపోతే నీటిని అవసరానికి మించి వాడుతూ వృధా చేయకూడదు.

## 11వ అధ్యాయం - దేహంపై ఇతర అవయవాలపై మూడేసిసార్లు నీళ్ళు పోసుకోవడం

187. హజ్రత్ జుబైర్ బిన్ ముతయిమ్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) "నేను తలమీద ఇలా మూడుసార్లు నీళ్ళు పోసుకుంటాను" అంటూ తన చేతుల వైపు సైగచేసి చూపారు.

[సహీహ్ బుఖారీ: 5వ ప్రకరణం - గుసుల్, 4వ అధ్యాయం - మన్అఫాజ అలారాసిహీ సలాసా]

188. హజ్రత్ అబూ జాఫర్ (రహ్మలై) కథనం:- నేను మా నాన్నగారు (ఇమామ్ జైనుల్ ఆబిదీన్) కలసి హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి)గారి దగ్గర కూర్చున్నాము. ఆ సమయంలో ఆయన దగ్గర మరికొందరు వ్యక్తులు కూడా కూర్చొని ఉన్నారు. వాళ్ళు జాబిర్ (రజి) గారిని స్నానం గురించి ప్రశ్నించారు. అప్పుడు జాబిర్ (రజి) గారు "ఒక 'సా' (నాలుగు సేర్ల) నీరు సరిపోతుంది" అన్నారు. వెంటనే వారిలో ఒక వ్యక్తి "నాకు ఒక 'సా' (నాలుగుసేర్ల) నీరు సరిపోదు" అన్నాడు. దానికి జాబిర్ (రజి) గారు "నీ కంటే (ప్రతి విషయంలో అగ్రగణ్యుడు, నీ శిరోజాల కంటే ఎక్కువ శిరోజాలు కలిగిన మహనీయునికి ఒక 'సా' (నాలుగుసేర్ల) నీరే సరిపోయేది (నీకు సరిపోదా?)" అని అన్నారు. ఆ తరువాత ఆయన మాకు నాయకత్వం వహించి నమాజు చేశారు. అప్పుడాయన ఒంటిపై ఒకే ఒక వస్త్రం ఉండింది.

[సహీహ్ బుఖారీ: 5వ ప్రకరణం - గుసుల్, 3వ అధ్యాయం - అల్గుస్లిబిస్సాయి]

## 13వ అధ్యాయం - రుతుమతి కస్తూరీ వాసన బట్టకట్టుకొని స్నానం చేయడం

189. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒక స్త్రీ దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి, బహిష్టు తరువాత స్నానం చేసే పద్ధతి ఏమిటని అడిగింది. దైవప్రవక్త (స) స్నానం చేసే పద్ధతి వివరించి "కస్తూరీ వాసన గల గుడ్డ పీలికతో శుభ్రపరచుకో" అని చెప్పారు. దానికి ఆమె (విషయం అర్థంగాక) "సువాసన గల బట్టతో ఎలా శుభ్రపరచుకోవాలి?" అని అడిగింది " అంతే, దాంతో శుద్ధి చేసుకో" అన్నారు దైవప్రవక్త(స). (అప్పటికీ విషయం అర్థంగాక) "ఎలాగండీ?" అని అడిగింది మళ్ళీ. దైవప్రవక్త(స) ఆశ్చర్యం వెలిబుచ్చుతూ "సుబ్హానల్లాహ్ (నువ్వు ఆ మాత్రం మాట కూడా అర్థం చేసుకోలేవా)! సువాసన బట్టతో శుద్ధి చేసుకో, అంతే" అని అన్నారు.

అప్పుడు నేనా స్త్రీని పక్కకు లాక్కెళ్ళి విషయం ఏమిటో వివరిస్తూ "సువాసన బట్టతో రక్తస్రావమయిన శరీర భాగాన్ని తుడుచుకో" అని చెప్పాను.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 13వ అధ్యాయం - జిల్కిల్ మర్అతి నఫ్సహా ఇజాతతహ్హరత్ మినల్ ముహీజ్]

## 14వ అధ్యాయం - గడువు దాటినా రక్తస్రావం అయ్యే రుతుమతి స్నానం చేసే పద్ధతి

190. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- అబూ హుబైష్ కుమార్తె అయిన ఫాతిమా (రజి) ఓ రోజు దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నాకు నిరంతరాయంగా రుతుస్రావమవుతుంది. నేను పరిశుద్ధురాలయ్యే సూచనలే కన్పించడం లేదు. ఇలాంటి స్థితిలో (నేనేం చెయ్యాలి?) నమాజు

మానెయ్యాలా?'' అని అడిగింది. అప్పుడు దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "అలా చెయ్యకు. ఇది రుతుస్రావం కాదు. ఒక విధమైన నరం నుండి కారుతున్న రక్తం ఇది. అందువల్ల నీ రుతు గడువు దినాల్లో మాత్రమే నమాజు చెయ్యడం మానేసి, ఆ తరువాత ఒంటి మీది రక్తాన్ని కడిగేసుకొని నమాజు ప్రారంభించు. కాకపోతే తిరిగి నీ రుతు గడువు దినాలు వచ్చే వరకు ప్రతి నమాజు కోసం కొత్తగా వుజూ చేస్తూ ఉండాలి.''

[సహీహ్ బుఖారీ: 4వ ప్రకరణం - వుజూ, 63వ అధ్యాయం - గస్లిద్దామ్]

191. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- (జహష్ కుమార్తె అయిన) ఉమ్మె హబీబా(రజి)కు ఏడేండ్లగా రుతుస్రావం అవుతూ ఉంటే, ఆమె దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి పరిస్థితి విన్నవించుకున్నది. అప్పుడు దైవప్రవక్త(స) "(రుతు గడువు దినాలు ముగిసిన తరువాత) స్నానం చెయ్యి'' అని అన్నారు. ఆ తరువాత "ఇదొక విధమైన నరం నుండి కారుతున్న రక్తం (రుతుస్రావం కాదు)'' అని అన్నారు. అప్పటి నుంచి ఉమ్మె హబీబా (రజి) ప్రతి నమాజు కోసం వుజూ★ చేయడం ప్రారంభించింది.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 26వ అధ్యాయం - ఇర్ఖిల్ ఇస్తిహాజా]

## 15వ అధ్యాయం - బహిష్టు స్త్రీలు తప్పనిసరిగా ఖజా రోజాలు పాటించాలి

192. హజ్రత్ ఆయిషా (రజి) దగ్గరకు ఒక స్త్రీ వచ్చి "బహిష్టు రోజుల్లో తప్పిపోయిన నమాజులను పరిశుభ్రమయిన తరువాత (అంటే గడువు తీరి స్నానం చేసిన తరువాత) ఖజా నమాజులుగా తిరిగి చేసుకోవాలా?'' అని అడిగింది. దానికి హజ్రత్ ఆయిషా (రజి) "నువ్వు ఖార్జీ (వర్గం) మహిళవా? దైవప్రవక్త(స) కాలంలో మేము బహిష్టు అయితే, (బహిష్టు దినాల్లో) తప్పిపోయిన నమాజులకు ఖజా పాటించాలని మమ్మల్ని ఆయన ఆదేశించేవారు కాదు'' అని అన్నారు. లేక "మేము మాత్రం ఇలా చేసే వాళ్ళం కాదు'' అని అన్నారు ఆమె.

[సహీహ్ బుఖారీ: 6వ ప్రకరణం - హైజ్, 20వ అధ్యాయం - లాతఖ్జిల్ హాయిజుస్సలా]

## 16వ అధ్యాయం - స్నానం చేసేటప్పుడు మరుగు ఏర్పరచుకోవాలి

193. అబూ తాలిబ్ కుమార్తె హజ్రత్ ఉమ్మెహానీ (రజి) కథనం:- మక్కా పట్టణం జయించబడిన సంవత్సరం ఓ రోజు నేను దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన స్నానం చేస్తున్నారు. ఆయన కుమార్తె ఫాతిమా (రజి) ఆయనకు తెర ఏర్పరచి పట్టుకొని ఉన్నారు. నేను దైవప్రవక్త (స)కు సలాం చేశాను. ఆయన (తెర వెనుక నుంచి స్నానం చేస్తూ) ఎవరూ? అని అడిగారు. "నేను అబూ తాలిబ్ కూతురు ఉమ్మెహానీని''. అన్నాను నేను. "ఉమ్మెహానీ! రామ్మా!'' అన్నారు ఆయన నన్ను ఆహ్వానిస్తూ.

---

★ రుతుస్రావ వ్యాధిగ్రస్తురాలి విషయంలో అత్యధిక ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఆమె ప్రతి నమాజు కోసం గుసుల్ (స్నానం) చేయనవసరం లేదు. రుతుస్రావం గడువు ముగిసిన తరువాత ఒకసారి గుసుల్ చేస్తే సరిపోతుంది. అయితే ప్రతి నమాజు కోసం వుజూ మాత్రం తప్పకుండా చేయవలసి ఉంటుంది. ప్రతి నమాజు కోసం గుసుల్ చేయాలి అనే ప్రస్తావన ఉన్న హదీసులన్నీ బలహీనమైనవి. - ఇమామ్ నవవీ (రహ్మాలై)

ఆ తరువాత ఆయన స్నానం ముగించుకొని, ఒక వస్త్రం చుట్టుకొని ఎనిమిది రకాతులు నమాజ్ చేశారు. నమాజ్ చేశాక నా దగ్గరికి వచ్చారు. (నేను వచ్చిన విషయం తెలియజేస్తూ) "దైవప్రవక్తా! నా సోదరుడు (హజ్రత్ అలి), ఇబ్నె హుబైర్‌ని చంపుతానంటున్నాడు. నేను ఇబ్నె హుబైర్‌కు ఆశ్రయమిచ్చాను" అని అన్నాను. అప్పుడు దైవప్రవక్త(స) "ఉమ్మెహానీ ఆశ్రయమిచ్చిన వ్యక్తికి నేను కూడా ఆశ్రయం (రక్షణ) ఇస్తున్నాను" అని అన్నారు.

ఆ సమయంలో దైవప్రవక్త(స) చేసిన నమాజ్ 'చాష్త్' నమాజ్.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 4వ అధ్యాయం - అస్సలాతి ఫిస్సౌబిల్ వాహిది ముల్తహిఫా బిహీ...]

## 18వ అధ్యాయం - ఏకాంతంలో నగ్నంగా స్నానం చేయవచ్చు

194. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు:- ఇస్రాయీల్ సంతతి ప్రజలు ఒకరి మర్మాంగాలు మరొకరు చూసుకుంటూ నగ్నంగా సామూహిక స్నానం చేస్తారు. మూసా (అలైహి) మాత్రం ఏకాంతంగా స్నానం చేసేవారు. దాంతో ఇస్రాయీల్ సంతతి ప్రజలు (లేనిపోని అనుమానానికి గురయి) "మూసా (అలైహి)కు వరిబీజం ఉంది. అందుకే ఆయన (ఎవరితోనూ కలవకుండా) ఒంటరిగా స్నానం చేస్తారు" అని చెప్పుకోసాగారు.

ఆ తరువాత ఓ రోజు మూసా (అలైహి) బట్టలు ఊడదీసి ఓ బండరాయి మీద పెట్టి స్నానం చేయడానికి ఉపక్రమించారు. అంతే, ఆ బండరాయి బట్టలతో సహా పైకి లేచి పరుగు తీసింది. అది చూసి మూసా (అలైహి) "నా బట్టలు, నా బట్టలు!" అంటూ దాని వెనుక పరుగెత్తారు. ఆ విధంగా ఆయన పరుగెత్తుతుంటే చివరికి ఒక చోట ఇస్రాయీల్ సంతతి వారు ఆయన (నగ్న) శరీరాన్ని కళ్ళారా చూసి, "దేవదేవ! మూసా(అలైహి)కు ఎలాంటి వ్యాధి లేదు (అనవసరంగా మనం ఆయన్ని అనుమానించాము)" అని అన్నారు. (బండరాయి ఒక చోట నిలిచిపోయింది. బండరాయిని వెంబడిస్తున్న) మూసా (అలైహి) తన బట్టలను తీసేసుకున్నారు. అయితే ఆయన (కోపంతో) బండరాయిని బాదడం ప్రారంభించారు.

హజ్రత్ అబూ హురైరా(రజి) ఈ హదీసును విన్పించిన తరువాత "దైవసాక్షి! మూసా (అలైహి) కొట్టిన దెబ్బల వల్ల ఆ రాయి మీద ఆరు గుర్తులు (ఇప్పటికీ) ఉన్నాయి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 5వ ప్రకరణం - గుసుల్, 20వ అధ్యాయం - మనిగ్తసల ఉర్యానన్ వహ్దహూ ఫిల్ ఖిల్వతి]

## 19వ అధ్యాయం - మర్మావయవంపై ఆచ్ఛాదన చాలా అవసరం

195. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- కాబా పునర్నిర్మాణంలో దైవప్రవక్త(స) కూడా (తన తోటి తెగ) ఖురైష్ వాళ్ళతో కలసి రాళ్ళు మోశారు. ఆయన (ఆ చిరుప్రాయంలో) లుంగీ కట్టుకొని రాళ్ళు మోస్తుంటే, ఆయన పెదనాన్న హజ్రత్ అబ్బాస్(రజి) వచ్చి, "బాబూ! ఆ లుంగీ ఊడదీసి భుజం మీద రాయి క్రింద పెట్టుకో మెత్తగా ఉంటుంది" అని అన్నారు. అలా అన్న వెంటనే ఆయన దైవప్రవక్త(స) కట్టుకున్న లుంగీ ఊడదీసి, దాన్ని ఆయన భుజం మీద పెట్టారు. ఒంటిమీద అంగవస్త్రం

ఊడదీయగానే ఆయన సిగ్గుతో (బక్కచిక్కి) స్పృహ తప్పిపోయారు.[1] ఆ రోజు నుండి ఆయన మరెప్పుడూ నగ్నంగా ఉండటాన్ని జనం చూడలేదు.

[సహీహ్ బుఖారీ : 7వ ప్రకరణం - సలాత్, 8వ అధ్యాయం - కరాహియ తిత్తఅర్రీ ఫిస్సలాతి వగైరిహా]

## 21వ అధ్యాయం - వీర్యస్ఖలనం అయినప్పుడే స్నానం తప్పనిసరి అవుతుంది

196. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఒక అన్సారీ ముస్లింని పిలుచుకు రావడానికి ఒక వ్యక్తిని పంపారు. (కాస్సేపటికి) ఆ అన్సారీ ముస్లిం పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆ సమయంలో అతని శిరోజాల నుండి స్నానం తాలూకు నీటి బిందువులు రాలి పడుతున్నాయి. దైవప్రవక్త(స) అతడ్ని చూసి "బహుశా నేను పిలవడం వల్ల నీవు రావడంలో తొందర చేయవలసి వచ్చింది" అని అన్నారు. దానికతను "ఔనండీ!" అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) అతనితో "త్వరగా బయటపడవలసిన పరిస్థితి వస్తే, లేదా వీర్యస్ఖలనం జరగకపోతే వుజూ చేస్తే చాలు (స్నానం చేయనవసరం లేదు)"[2] అని అన్నారు.

(సహీహ్ బుఖారీ: 4వ ప్రకరణం - వుజూ, 34వ అధ్యాయం - మన్లమ్ యరల్ వుజూఅ ఇల్లా మినల్ ముఖ్రజీన్]

197. హజ్రత్ అబీ బిన్ కాబ్ (రజి) కథనం:- నేనొకసారి "దైవప్రవక్తా! ఎవరైనా ఒక వ్యక్తి తన భార్యతో సంభోగించినప్పుడు అతనికి వీర్యస్ఖలనం కాకపోతే స్నానం తప్పనిసరి (వాజిబ్)గా చేయాలా?" అని అడిగాను. దానికాయన ఇలా సమాధానమిచ్చారు: "అతని దేహానికి స్త్రీ దేహం నుండి అంటిన మలినాన్ని కడిగివేయాలి, ఆ తరువాత వుజూ చేసి నమాజు చేసుకోవచ్చు."

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 29వ అధ్యాయం - గుస్లి మాయుసీబు మిన్ఫర్జిల్ మరా]

198. హజ్రత్ ఉస్మాన్ బిన్ అప్పాన్ (రజి) కథనం:- జైద్ బిన్ ఖాలిద్ (రజి) ఓ రోజు హజ్రత్ ఉస్మాన్ (రజి)తో మాట్లాడుతూ "ఒక వ్యక్తి తన భార్యతో సంభోగించినప్పుడు అతనికి వీర్యస్ఖలనం కాకపోయినా స్నానం విధిగా చేయాలా?" అని అడిగారు. దానికి హజ్రత్ ఉస్మాన్ (రజి) సమాధానమిస్తూ "నమాజు కోసం వుజూ చేసినట్లు వుజూ చేస్తే చాలు. (దానికి ముందు) మర్మాంగాన్ని కడుక్కోవాలి" అని అన్నారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఈ విషయం చెప్పిన తరువాత "నేను దైవప్రవక్త(స) నోట విన్నది మాత్రమే నీకు తెలియజేశాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 34వ అధ్యాయం - మన్లమ్ యరల్ వుజూఅఇల్లా మినల్ ముఖ్రజీన్]

## 22వ అధ్యాయం - స్త్రీ పురుషుల మర్మాంగాలు పరస్పరం కలసిపోతే చాలు స్నానం తప్పనిసరి

199. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు - పురుషుడు

---

(1) ఈ హదీసును బట్టి దైవప్రవక్త(సల్లం) బాల్యం నుండే మూఢకాలం నాటి దురలవాట్లకు, దుర్లక్షణాలకు దూరంగా ఉండేవారని తెలుస్తోంది. ఒక హదీసులో ఆకాశం నుండి ఒక దైవదూత దిగివచ్చి ఆయనకు లుంగీ కట్టారని ఉంది.

(2) ఈ ఆజ్ఞ తర్వాత రద్దయిపోయింది. 199వ హదీసు పాదసూచిక చూడండి.

స్త్రీ తొడల మధ్య కూర్చొని బలం ప్రయోగిస్తే చాలు, (వీర్యస్ఖలనం కాకపోయినా) అతను విధిగా స్నానం చేయవలసి ఉంటుంది.★

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం, గుసుల్, 28వ అధ్యాయం - ఇజల్ తఖాఅల్ ఖితానాన్]

## 24వ అధ్యాయం - ఉడకబెట్టిన ఆహార పదార్థం తింటే వుజూ భంగం అనే హదీసు రద్దయింది

200. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ రోజు మేక కాలి మాంసం తిన్నారు. ఆ తరువాత నమాజు చేశారు; తిరిగి వుజూ చేయలేదు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 50వ అధ్యాయం - మఽల్లమ్‌యతవజ్జా మిన్‌ల్లహ్మిష్షాతి వస్సవీఖ్]

201. హజ్రత్ అమ్ర్‌బిన్ ఉమయ్య(రజి) కథనం:- ఓ రోజు దైవప్రవక్త (స) మేక కాలి మాంసం తింటూ ఉండగా నేను చూశాను. అంతలో నమాజు కోసం పిలుపు (అజాన్) వచ్చింది. దైవప్రవక్త (స) వెంటనే కత్తి ఓ పక్కన పడేసి, వుజూ చేయకుండానే వెళ్ళి నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 50వ అధ్యాయం - మఽల్లమ్‌యతవజ్జా మిన్‌ల్లహ్మిష్షాతి వస్సవీఖ్]

202. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- దైవప్రవక్త(స) మా ఇంట్లో (ఓ రోజు) మేక కాలి మాంసం తిన్నారు. ఆ తరువాత వుజూ చేయకుండానే నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 51వ అధ్యాయం - మమ్మాజ్మాజ మినస్సవీఖి వలమ్ యతవజ్జా]

203. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) పాలు త్రాగిన తరువాత నీటితో నోరు పుక్కిలించి "పాలు త్రాగడం వల్ల నోరు తైలయుతమవుతుంది (అంచేత నీళ్ళతో పుక్కిలించి నోరు శుభ్రపరచుకోవాలి)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 52వ అధ్యాయం - హల్‌యుమజ్మిజు మినల్లబన్]

## 26వ అధ్యాయం - వుజూ భంగమైందని కేవలం అనుమానం వల్ల నమాజ్‌ని మధ్యలో విరమించరాదు

204. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (స)ను "నమాజు చేస్తున్నప్పుడు ఒక్కోసారి ఏదో అయి (అపానవాయువు వెడలి) నట్లు అన్పిస్తుంది; అప్పుడేం చేయాలి?" అని

★ ఈ హదీసు భావం గురించి ఇమామ్ నవవీ (రహ్మలై) ప్రకారం గుసుల్ చేయడం వాజిబ్ (తప్పనిసరి) కావడానికి స్త్రీ పురుషులిరువురి మర్మాంగాలు కలిస్తే చాలు, వీర్యస్ఖలనం జరగనవసరం లేదు. ఈ విషయం గురించి ప్రారంభంలో ప్రవక్త అనుచరుల మధ్య భేదాభిప్రాయాలుండేవి. ఆ తర్వాత ఏకాభిప్రాయం ఏర్పడింది. ఇప్పుడు అన్ని వర్గాల ఏకాభిప్రాయం ప్రకారం గుసుల్ చేయడం వాజిబ్ కావడానికి వీర్యస్ఖలనం జరగనవసరం లేదు. ఇద్దరి మర్మావయవాలు కలిస్తే చాలు, ఇద్దరూ తప్పనిసరిగా గుసుల్ చేయవలసి ఉంటుంది.

అడిగాను. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "(అపానవాయువు వెడలినట్లు) శబ్దం వినపడనంతవరకు లేదా దుర్వాసన రానంతవరకు నమాజ్‌ని భంగపరచకు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 4వ అధ్యాయం - లాయతవజ్జావు మినష్షక్కి హత్తాయ స్తైఖిన్]

## 27వ అధ్యాయం - మృత జంతువు చర్మాన్ని పదును పెడితే శుద్ధి అవుతుంది

205. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- విశ్వాసుల మాతృమూర్తి మైమూన (రజి) గారి సేవకురాలికి ఎవరో ఒక మేకను దానంగా ఇచ్చారు. (తరువాత అది చచ్చిపోయింది). దైవప్రవక్త(స) (ఓ చోట) దాన్ని పడి ఉండటం చూసి "మీరు దీని చర్మాన్ని ఎందుకు ఉపయోగించుకోరు?" అని అడిగారు. దానికి వారు "ఇది మృత జంతువు కదా?" అని అన్నారు. "మృత జంతువును తినడం నిషిద్ధం. కాని దాని చర్మాన్ని ఉపయోగించుకోవడంలో తప్పులేదు" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 61వ అధ్యాయం - అస్సదఖాతి అలా మవాలి అజ్వాజిన్నబి(స)]

## 28వ అధ్యాయం - తయమ్ముమ్

206. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(స)తో పాటు ప్రయాణం చేస్తున్నాం. బైదా లేక జాతుల్ జైష్ అనే ప్రాంతానికి (ఈ రెండింటిలో ఏ ప్రాంతమో ఉల్లేఖకులు అనుమానంలో పడ్డారు) చేరుకునేసరికి నా కంఠహారం తెగి ఎక్కడో పడిపోయింది. దైవప్రవక్త(స) దాన్ని వెతకడానికి అక్కడ ఆగిపోయారు. ఆయనతో పాటు మిగిలినవాళ్ళు కూడా ఆగిపోయారు. ఆ ప్రదేశంలో ఎక్కడా నీటి చుక్కలేదు. జనం హజ్రత్ అబూ బకర్ (రజి) దగ్గరకు వెళ్ళి "మీ అమ్మాయి ఆయిషా (రజి) ఏం చేసిందో చూశారా? ఆమె మూలంగా దైవప్రవక్త(స) ఇక్కడ ఆగిపోవలసి వచ్చింది. ఆయనతో పాటు ప్రజలంతా ఆగిపోయారు. కాని ఈ ప్రదేశంలో చూస్తే నీటి చుక్క కూడా లేదు. జనం దగ్గర కూడా నీళ్ళు అయిపోయాయి" అని అన్నారు.

ఈ మాటలు విని హజ్రత్ అబూబకర్ (రజి) నా దగ్గరకు వచ్చారు. ఆ సమయంలో దైవప్రవక్త నా వడిలో తలపెట్టి నిద్రపోతున్నారు. హజ్రత్ అబూ బకర్ (రజి) వచ్చీ రాగానే "నీ మూలంగా దైవప్రవక్త(స) ఆగిపోవలసి వచ్చింది. ఆయనతో పాటు ప్రజలూ ఆగిపోవాల్సి వచ్చింది. కాని ఇక్కడెక్కడా నీటి చుక్క కూడా లేదు. జనం దగ్గర కూడా నీళ్ళు లేవు" అని మండిపడ్డారు నా మీద. ఆయన చేత్తో నా వీపు మీద కొడ్తూ అనదలచిన మాటలన్నీ అన్నారు. దైవప్రవక్త (స) నా తొడల మీద తల ఆనిచ్చి పడుకొని ఉండటం వల్ల నేను (దెబ్బలు సహిస్తూ) కదలకుండా ఉండవలసి వచ్చింది.

దైవప్రవక్త(స) తెల్లవారు జామున మేల్కొంటే (వుజూ చేయడానికి) నీళ్ళే లేవు. అప్పుడు దేవుడు 'తయమ్ముమ్'కు సంబంధించిన ఆదేశాలు అవతరింపజేశాడు. దాంతో అందరూ 'తయమ్ముమ్' చేశారు. ఆ సందర్భంలో ఉసైద్ బిన్ హుజైర్ (రజి) మాట్లాడుతూ "అబూ బకర్ సంతానమా? మీ మూలంగా (ముస్లింలకు) శుభం కలగడం ఇది మొదటిసారి మాత్రమే కాదు (ఇంతకు పూర్వం కూడా అనేకసార్లు శుభం కలిగి ఎంతో ప్రయోజనం పొందారు)" అని అన్నారు.

ఆ తరువాత నేను ఎక్కి కూర్చున్న ఒంటెను పైకి లేపారు. దాని క్రింద నా కంఠహారం దొరికింది.

[సహీహ్ బుఖారీ : 7వ ప్రకరణం - తయమ్ముమ్, 1వ అధ్యాయం]

207. హజ్రత్ షఖీఖ్ (రహ్మలై) కథనం:- నేను అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి), అబూ మూసా అష్అరీ (రజి) ల దగ్గర కూర్చుని ఉన్నాను. అప్పుడు అబూ మూసా (రజి), అబ్దుల్లా (రజి) తో మాట్లాడుతూ "ఎవరికైనా లైంగిక అశుద్ధావస్థ ఏర్పడి, ఒక నెల వరకూ స్నానం చేయడానికి నీళ్ళు లభించకపోతే అలాంటి వ్యక్తి తయమ్ముమ్ చేసి నమాజు చేయకూడదంటారా?" అని అడిగారు. దానికి హజ్రత్ అబ్దుల్లా (రజి) "నెల రోజుల దాకా నీళ్ళు లభించకపోయినా సరే తయమ్ముమ్ చేయకూడదు" అని అన్నారు. "ఏమిటీ, 'నీళ్ళు లభించకపోతే పరిశుభ్రమైన మట్టి ఉపయోగించుకోండి' అనే మాయిదా సూరాలోని సూక్తిని మీరు విస్మరించగలరా?" అని అడిగారు హజ్రత్ అబూ మూసా (రజి). "ఇలా చేయడానికి ప్రజలకు అనుమతినిస్తే ఇక వారు నీళ్ళు చల్లగా ఉన్నాయని భావించినప్పుడు కూడా వాటిని వదలి తయమ్ముమ్ చేసుకుంటారు మరి" అన్నారు హజ్రత్ అబ్దుల్లా (రజి). "అయితే మీరు అందుకేనా తయమ్ముమ్ అంటే ఇష్టపడటం లేదు?" అని అడిగాను నేను. దానికాయన ఔనన్నారు. అప్పుడు హజ్రత్ అబూ మూసా (రజి) ఇలా అన్నారు -

మీరు హజ్రత్ అమ్మార్ (రజి) తెలిపిన ఈ విషయాన్ని హజ్రత్ ఉమర్ (రజి) నోట వినలేదా? ఆయన ఈ విధంగా తెలియజేశారు. "దైవప్రవక్త(స) ఒక పని మీద నన్ను ( ఓ ప్రాంతానికి) పంపించారు. (దారిలో ఒక చోట) నేను స్నానం చేయవలసి వచ్చింది. అయితే నాకు ఎక్కడా నీళ్ళు లభించలేదు. అప్పుడు నేను పశువులా నేలమీద అటూ ఇటూ బాగా దొర్లాను. దాంతో వంటి నిండా మన్ను అంటుకున్నది. నేను ప్రయాణం నుంచి తిరిగొచ్చి ఈ సంగతి దైవప్రవక్త(స)కు తెలియజేశాను. అప్పుడాయన "నువ్విలా చేస్తే సరిపోయేది" అంటూ తన చేతిని ఓ సారి నేలమీద తట్టి విదిలించారు. తరువాత కుడిచేత్తో ఎడమ చేయి వెనుక భాగాన్ని లేక ఎడమ చేత్తో కుడి చేయి వెనుక భాగాన్ని తడిమి, రెండు చేతులతో ముఖాన్ని రుద్దుకున్నారు."

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ఈ మాటలు విని "హజ్రత్ అమ్మార్ (రజి) మాటలను హజ్రత్ ఉమర్ (రజి) నమ్మలేకపోయిన సంగతి మీరు గమనించలేదా?" అని అన్నారు హజ్రత్ అబ్దుల్లా (రజి)తో.'★

[సహీహ్ బుఖారీ :7వ ప్రకరణం - తయమ్ముమ్, 8వ అధ్యాయం-అత్తయమ్ముమ్ జరబ్]

208. ఓ రోజు ఒక వ్యక్తి హజ్రత్ ఉమర్ (రజి) దగ్గరకు వచ్చి, "నేను లైంగిక అశుద్ధావస్థకు లోనయి స్నానం చేయడానికి నీళ్ళు లభించని పక్షంలో ఏం చెయ్యాలి?" అని అడిగాడు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి)ని ఉద్దేశించి హజ్రత్ అమ్మార్ (రజి) ఇలా అన్నారు: "మీకు గుర్తుందా? ఓసారి మనిద్దరం

---

★ హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి) మొదట్లో వీర్యస్ఖలనం జరిగినప్పుడు తయమ్ముమ్ చేయాలన్న విషయాన్ని సమర్థించేవారు కాదు. ఇతర సహాబీలు, తాబాయిలూ మాత్రం 'తయమ్ముమ్' తప్పకుండా చేయాలని భావించేవారు. ఆ తరువాత కొన్నాళ్లకు హజ్రత్ ఉమర్, హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కూడా దీన్ని సమర్థించారు. నీరు లభించని పరిస్థితిలో లైంగిక అశుద్ధావస్థను తొలగించి పరిశుద్ధం కావడానికి 'తయమ్ముమ్' చేసి నమాజు చేయాలని సంస్కర్తలందరూ నిర్ణయించారు.

ప్రయాణం చేస్తుంటే★ (ఓ చోట నమాజు వేళకు) మీరు నమాజు చేయలేదు. నేను మాత్రం (నీళ్ళు లభించకపోయినా) మట్టిలో పడి అటూ ఇటూ దొర్లి ఆ తరువాత నమాజు చేశాను. ఈ సంగతి దైవప్రవక్త(స) ముందు ప్రస్తావించినప్పుడు ఆయన "నువ్విలా చేస్తే సరిపోయేది" అంటూ రెండు చేతుల్ని నేలమీద తట్టి వాటి మీద ఊదారు (దుమ్ముపోవడానికి). ఆ తరువాత రెండు చేతులతో ముఖాన్ని, రెండు చేతుల్ని రుద్దుకున్నారు."

[సహీహ్ బుఖారీ : 7వ ప్రకరణం - తయమ్ముమ్, 4వ అధ్యాయం - హల్‌యన్ ఫుఖుఫీహిమా....]

209. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) చేత విముక్తి నొందిన బానిస ఉమైర్ (రహ్మాలై) కథనం:- నేను, అబ్దుల్లా బిన్ యసార్ కలసి హజ్రత్ అబూ జహీం బిన్ హారిస్ బిన్ సుమ అన్సారీ దగ్గరకు వెళ్ళాము. అప్పుడు అబూ జహీం ఇలా తెలిపారు: "దైవప్రవక్త (స) బైర్ జమల్ (ప్రాంతం) నుండి తిరిగి వస్తుంటే దారిలో ఒక చోట ఒక వ్యక్తి తారసపడి సలాం చేశాడు. దైవప్రవక్త(స) అతని సలాంకు ప్రతి సలాం చెప్పకుండా ఒక గోడ వైపుకు తిరిగి నిల్చున్నారు. దాని మీద చేతులు తట్టి వాటితో ముఖాన్ని, చేతుల్ని రుద్దుకున్నారు. ఆ తరువాత ఆ వ్యక్తికి ప్రతి సలాం చెప్పారు."

[సహీహ్ బుఖారీ : 7వ ప్రకరణం - తయమ్ముమ్, 3వ అధ్యాయం - అత్తయమ్ముమ్ ఫిల్‌హజ్రి ఇజాలమ్ యజిదిల్ మాయి]

## 29వ అధ్యాయం - విశ్వాసి ఎట్టి స్థితిలోనూ అపరిశుద్ధుడు కాడు

210. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి (దారిలో) నన్ను కలిశారు. అప్పుడు నేను లైంగిక అశుద్ధావస్థకులోనై ఉన్నాను. దైవప్రవక్త (స) నా చేయి పట్టుకొని నడిచారు. చివరికి ఒక చోటికెళ్ళి కూర్చున్నారు. అప్పుడు నేను అక్కడ్నుంచి మెల్లిగా జారుకొని నా బసకు చేరుకున్నాను. అక్కడ స్నానం చేసి తిరిగి దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చాను. అప్పటిదాక ఆయన అక్కడే కూర్చొని ఉన్నారు. ఆయన నన్ను చూడగానే "అబూహురైరా! ఎక్కడి కెళ్ళావు?" అని అడిగారు. నేను విషయం తెలియజేశాను. అప్పుడాయన "సుబ్‌హానల్లాహ్!! విశ్వాసి కూడా అపరిశుద్ధుడవుతాడా ఎక్కడైనా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 5వ ప్రకరణం - గుసుల్, 24వ అధ్యాయం - అల్‌జునుబి యఖ్రుజు వయమ్‌షీ ఫిస్సూఖి వగైరిహీ]

## 32వ అధ్యాయం - మరుగుదొడ్డికి పోయే ముందు చేయవలసిన వేడుకోలు (దుఆ)

211. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మరుగుదొడ్డికి పోయేటప్పుడు ఈ వచనాలు పఠించేవారు. "అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ ఖుబ్‌సి వల్ ఖబాయిస్. [దేవా! నేను అపరిశుద్ధ వస్తువుల, అపవిత్ర కార్యాల కీడు నుండి నీ శరణు కోరుతున్నాను.]

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 9వ అధ్యాయం - మాయఖూలు ఇన్దల్ ఖలా]

★ సహీహ్ ముస్లిం గ్రంథంలో అదనంగా "మనిద్దరం లైంగిక అశుద్ధావస్థకు లోనయి ఉన్నాము" అనే మాట కూడా పేర్కొనబడింది.

## 33వ అధ్యాయం - కూర్చొని కునుకుపాట్లు పడటం వల్ల వుజూకు భంగం కలగదు

212. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఒకసారి (ఇషా నమాజు కోసం) ఇఖామత్ పిలుపు ఇవ్వడం జరిగింది. అయితే దైవప్రవక్త(స) మస్జిద్‌లో ఓ మూలన ఎవరితోనో మాట్లాడుతూ ఉండిపోయారు. ఆ (సంభాషణ ముగిసిన) తరువాత ఆయన నమాజు కోసం లేచారు. అప్పటి వరకు (ఆయన) అనుచరులు కునుకుపాట్లుపడుతూనే ఉన్నారు. దైవప్రవక్తతో పాటు వారూ లేచి, తిరిగి వుజూ చేయకుండానే నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 27వ అధ్యాయం - అల్ ఇమామి తారిజు లహుల్ హాజతు బాదల్ ఇఖామ]

# నమాజు ప్రకరణం

## 1వ అధ్యాయం - అజాన్ ప్రారంభ దశ

213. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ముస్లింలు మదీనా వచ్చిన తరువాత ప్రారంభంలో నమాజు కోసం అజాన్ చెప్పే సంప్రదాయం ఉండేది కాదు, నిర్ణీత వేళకు ప్రజలు తమంతట తామే (మస్జిద్‌లో) గుమిగూడి నమాజు చేసుకునేవారు. కొన్నాళ్ళ తరువాత ఓ రోజు ముస్లింలు దీన్ని గురించి పరస్పరం సంప్రదించుకోవడానికి సమావేశమయ్యారు. అప్పుడు కొందరు తమ అభిప్రాయం వెలిబుచ్చుతూ "క్రైస్తవుల మాదిరిగా ఒక గంట ఏర్పాటు చేసుకొని మోగించాల"ని అన్నారు. మరి కొందరు యూదుల మాదిరిగా శంఖం ఊదాలని అన్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) మాట్లాడుతూ, "మనం నమాజు ప్రకటన కోసం ప్రత్యేకంగా ఒక వ్యక్తిని ఎందుకు నియమించుకోకూడదు?" అని అన్నారు. దైవప్రవక్త(స) ఈ సలహా విని హజ్రత్ బిలాల్ (రజి)తో "లే, లేచి నమాజు కోసం ప్రకటన చెయ్యి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 1వ అధ్యాయం - బద్ఇల్ అజాన్]

## 2వ అధ్యాయం - అజాన్ వాక్యాలు రెండేసి సార్లు పలకాలి

214. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ప్రజలు (నమాజు ప్రకటన విషయంలో) అగ్ని గురించి, శంఖం గురించి మాట్లాడారు. యూదులు, క్రైస్తవులు ఇలా చేస్తారని వారి పద్ధతుల్ని గురించి కూడా ప్రస్తావించారు. ఆ తరువాత దైవప్రవక్త(స) అజాన్ చెప్పమని హజ్రత్ బిలాల్ (రజి)ని ఆదేశిస్తూ అజాన్‌లో (అజాన్ పదాలు) రెండేసి సార్లు పలకాలని, ఇఖామత్‌లో అయితే (ఈ పదాలనే) ఒక్కొక్కసారి పలకాలని అన్నారు. ★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 1వ అధ్యాయం - బద్ఇల్ అజాన్]

## 7వ అధ్యాయం - అజాన్ వినేవారు కూడా అజాన్ పదాలే ఉచ్చరించి చివర్లో దరూద్ పఠించాలి

215. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు:-

---

★ అజాన్ పదాలు రెండేసి సార్లు పలకాలి అంటే అర్థం ప్రారంభంలో అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ అని ఒకే గుక్కలో రెండుసార్లు పలకడం వల్ల అది ఒకసారిగానే పరిగణించబడేది. ఈ విధంగా రెండు సార్లు పలకాలి అంటే 'అల్లాహు అక్బర్' అని నాలుగు సార్లు ఉచ్చరించాలన్న మాట. 'ఇఖామత్'లో 'ఖద్‌ఖామతిస్సలాత్' అనే పదం రెండు సార్లు, మిగతా పదాలు ఒక్కొక్కసారి ఉచ్చరించాలి. ఇది ఇమామ్ మాలిక్, ఇమామ్ షాఫయి (రహ్మలై), సలఫీ ధర్మవేత్తల అభిప్రాయం. దీనికి భిన్నంగా హనఫీ ధర్మవేత్తలు అజాన్‌లో అయినా, ఇఖామత్‌లో అయిన ప్రతిపదం రెండేసి సార్లు ఉచ్చరించాలని నిర్ణయించారు.

(అనువాదకుడు)

"మీరు అజాన్ వింటున్నప్పుడు ముఅజ్జిన్ (అజాన్ చెప్పేవాడు) పలికే పదాలే పలకండి."[1]

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 7వ అధ్యాయం - మాయఖూలు ఇజా సమిఅల్ మునాదీ]

## 8వ అధ్యాయం - అజాన్ ఔన్నత్యం - షైతాన్‌పై దాని ప్రభావం

216. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు :- అజాన్ చెప్పడం ప్రారంభించగానే షైతాన్ వెనక్కి తిరిగి పలాయనం చిత్తగిస్తాడు. (తీవ్రమైన భయాందోళనతో) వాడికి అపానవాయువు వెడలుతుంది. దాంతో వాడు అజాన్ వినరానంత దూరం పారిపోతాడు. అయితే అజాన్ చెప్పడం అయిపోగానే వాడు మళ్ళీ (ప్రార్థనా స్థలానికి) చేరుకుంటాడు. ఇఖామత్ చెప్పగానే తిరిగి తోకముడిచి పారిపోతాడు. ఇఖామత్ చెప్పడం అయిపోగానే మళ్ళీ వచ్చి మానవుని హృదయంలో దుష్టాలోచనలు రేకెత్తిస్తాడు. మనిషికి అంతకు ముందు గుర్తుకురాని విషయాలన్నిటినీ (నమాజు కోసం నిలబడగానే) గుర్తు చేస్తూ 'ఇది జ్ఞాపకం తెచ్చుకో', 'అది జ్ఞాపకం తెచ్చుకో' అని పురిగొల్పుతాడు. దాంతో మనిషికి (వాడి మాయజాలంలో పడిపోయి) తాను ఎన్ని రకాతులు పఠించానన్న సంగతి కూడా జ్ఞాపకం ఉండదు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 4వ అధ్యాయం - ఫజ్లిత్తాజీన్]

## 9వ అధ్యాయం - రుకూ నుండి లేచేటప్పుడు రఫఅద్దైన్ చేయడం అభిలషణీయం

217. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) నమాజు కోసం నిలబడినప్పుడు ముందుగా (అల్లాహు అక్బర్ అంటూ) రెండు చేతులను భుజాల వరకు ఎత్తడం నేను చూశాను.[2]

---

(1) అజాన్ సందర్భంలో 'ముఅజ్జిన్' "హయ్యఅలస్సలాహ్, హయ్య అలల్ ఫలహ్" అని పలికినప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) గారి హదీసు ప్రకారం అజాన్ వినేవాడు "లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్" అని పలకాలి.

(2) ఇమామ్ నవవీ (రహ్మలై) కథనం ప్రకారం తక్బీరె తహ్రీమా (అంటే నమాజ్ ప్రారంభంలో అల్లాహు అక్బర్ అని) చెప్పేటప్పుడు మాత్రం రఫయెద్దైన్ (అంటే చేతులు చెవుల దాకా పైకెత్తే) విషయంలో యావత్తు ముస్లిం సమాజంలో ఏకాభిప్రాయం ఉంది. కాని ఇతర సందర్భాలలో రఫయెద్దైన్ చేసే విషయం గురించి భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మలై),

ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై), ఇమామ్ మాలిక్ (రహ్మలై), ఇంకా అనేకమంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం రుకూ స్థితిలోకి పోయేటప్పుడు, రుకూ నుండి పైకి లేచినప్పుడు రఫయెద్దైన్ చేయడం అభిలషణీయం (ముస్తహబ్).

ఇమామ్ షాఫయి (రహ్మలై) దృష్టిలో రెండు రకాతుల తరువాత 'అత్తహియ్యాత్' చదివి పైకి లేచేటప్పుడు కూడా రఫయెద్దైన్ చేయవలసి ఉంటుంది. దైవప్రవక్త(స) ఇలా చేసేవారని హజ్రత్ ఉమర్ (రజి) తెలిపినట్లు ఇమామ్ బుఖారీ (రహ్మలై) పేర్కొన్నారు. అబూ బకర్ బిన్ మున్జిర్ (రహ్మలై), అబూఅలి తబ్రీ (రహ్మలై), ఇంకా అహ్లె హదీస్ వర్గంలోని కొందరి అభిప్రాయం ప్రకారం రెండు సజ్దాల మధ్య కూడా రఫయెద్దైన్ ముస్తహబ్.

అయితే ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై), ఇమామ్ మాలిక్ (రహ్మలై), అహ్లె కూఫాల అభిప్రాయంలో తక్బీరె తహ్రీమా సమయంలో తప్ప మరే సందర్భంలోనూ రఫయెద్దైన్ చేయకూడదు. ఏమయినప్పటికీ రఫయద్దైన్ చేయడం (ఏ సందర్భంలోనూ) వాజిబ్ (తప్పనిసరి) మటుకు కాదని అయితే అది 'సున్నత్' అన్నది నిర్వివాదాంశమని మొత్తం ముస్లిం సమాజం అంగీకరించింది. పోతే చేతులు ఏ మేరకు పైకెత్తాలి అనే విషయంలో అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం బొటనవ్రేళ్ళు చెవుల క్రింది భాగం వరకు, ఇతర వ్రేళ్ళు చెవులపైభాగం వరకు చేరేలా చేతులు పైకెత్తాలి. చేతులు పైకెత్తే సమయం గురించి మూడు రకాల ఉల్లేఖనాలున్నాయి. (1) తక్బీర్ (అంటే అల్లాహు అక్బర్ అని) చెప్పే ముందు, (2) తక్బీర్ చెప్పిన తరువాత, (3) కచ్చితంగా తక్బీర్ చెప్పే క్షణానే చేతులు పైకెత్తాలి.

(దీన్ని రఫయెద్దైన్ అంటారు) అలాగే రుకూ కోసం తక్బీర్ పలికేటప్పుడు కూడా (రఫయెద్దైన్) చేసేవారు. తిరిగి రుకూ నుండి తలపైకెత్తేటప్పుడు కూడా అలాగే చేసేవారు. (రుకూ నుండి లేచేటప్పుడు) ఆయన "సమిఅల్లాహు లిమన్ హమిదహ్" అని అంటారు. అయితే సజ్దా స్థితిలోకి పోయేటప్పుడు గాని సజ్దా నుండి లేచేటప్పుడు గాని ఆయన రఫయెద్దైన్ చేసేవారు కాదు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 84వ అధ్యాయ- రఫ్ఇల్ యదైని ఇజా కబ్బర వ ఇజారకా]

218. హజ్రత్ అబూ ఖిలాబ (రహ్మాలై) కథనం:- మాలిక్ బిన్ హువైరిస్ (రజి) నమాజులో (మొదటి) తక్బీర్ పలికేటప్పుడు, రుకూ స్థితిలోకి పోయేటప్పుడు, రుకూ నుండి లేచేటప్పుడు కూడా రఫయెద్దైన్ చేస్తూ ఉండటం నేను చూశాను. దైవప్రవక్త(స) ఇలా చేస్తుండేవారని ఆయన అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 84వ అధ్యాయం - రఫ్యదైని ఇజా కబ్బర వ ఇజా రకా వ ఇజా రఫఅ]

## 10వ అధ్యాయం - నమాజులో వంగేటప్పుడు, లేచేటప్పుడు ప్రతి సారీ 'అల్లాహు అక్బర్' అని పలకాలి

219. అబూ సల్మాబిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబూ హురైరా(రజి) నమాజు చేస్తున్న సందర్భంలో వంగేటప్పుడు, పైకి లేచేటప్పుడు అల్లాహు అక్బర్ అని పలికేవారు. సలాముతో నమాజు ముగించిన తరువాత ఆయన మాట్లాడుతూ "మీ అందరి నమాజు కన్నా నా నమాజు ఎక్కువగా దైవప్రవక్త (స) నమాజును పోలి ఉంటుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 115వ అధ్యాయం - ఇత్మామిత్తక్బీరి ఫిర్రుకూ]

220. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త(స) నమాజు కోసం నిలబడినప్పుడు 'అల్లాహు అక్బర్' అంటారు. రుకూ స్థితిలోకి పోయేటప్పుడు కూడా మళ్ళీ 'అల్లాహు అక్బర్' అంటారు. అయితే రుకూ నుండి లేచేటప్పుడు మాత్రం 'సమిఅల్లాహులిమన్ హమిదా' అంటారు. ఆ తర్వాత నిల్చొని 'రబ్బనా లకల్ హమ్ద్' అంటారు. తిరిగి 'అల్లాహు అక్బర్' అంటూ సజ్దా స్థితిలోకి వెళ్తారు. సజ్దా నుండి లేచి కూర్చునేటప్పుడు కూడా 'అల్లాహు అక్బర్' అంటారు. అలాగే రెండవ సజ్దాలోకి పోయేటప్పుడు తిరిగి లేచి కూర్చునేటప్పుడు కూడా 'అల్లాహు అక్బర్' అంటారు. ఈ విధంగా ఆయన పూర్తి నమాజు చేసి ముగిస్తారు. రెండు రకాతుల తరువాత మొదటి ఖాయిదా (కూర్చునే స్థితి) నుండి పైకి లేచేటప్పుడు కూడా 'అల్లాహు అక్బర్' అంటారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 117వ అధ్యాయం - అత్తక్బీరి ఇజాఖామ మినస్సుజూద్]

221. హజ్రత్ ముతర్రిఫ్ బిన్ అబ్దుల్లా (రహ్మాలై) కథనం:- ఓ రోజు నేను, ఇమ్రాన్ బిన్ హసీన్ కలసి హజ్రత్ అలీ (రజి) వెనుక నమాజు చేశాము. హజ్రత్ అలీ (రజి) సజ్దా స్థితిలోకి పోయేటప్పుడు సజ్దా నుండి లేచేటప్పుడు 'అల్లాహు అక్బర్' అని పలికేవారు. రెండు రకాతులు పూర్తి అయిన తరువాత లేచి నిలబడేటప్పుడు కూడా 'అల్లాహు అక్బర్' అని పలికేవారు. ఇలా నమాజు ముగిసిన తరువాత ఇమ్రాన్ బిన్ హసీన్ నా చేయి పట్టుకొని "ఈ రోజు చేసిన నమాజు నాకు దైవప్రవక్త(స) చేసే నమాజును స్ఫురణకు తెచ్చింది" అని అన్నారు. లేక "హజ్రత్ అలీ (రజి) మనకు దైవప్రవక్త (స) నమాజు చేయించారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 116వ అధ్యాయం - ఇత్మామిత్తక్బీరి ఫిస్సుజూద్]

## 11వ అధ్యాయం - ప్రతి రకాతులో ఫాతిహా సూరా విధిగా పఠించాలి

222. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:- "ఫాతిహా సూరా పఠించని వారి నమాజు నెరవేరనే నెరవేరదు."★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 95వ అధ్యాయం - వుజూబుల్ ఖిరాతిలిల్ ఇమామి వల్ మామూమి ఫిస్సలాతి కుల్లిహా]

223. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ప్రతి నమాజులో ఖిరాత్(పారాయణం) చేయాలి. ఏ నమాజులలో దైవప్రవక్త (స) (బిగ్గరగా) పారాయణం చేసి మాకు విన్పించారో ఆ నమాజులలో మేము కూడా మీకు (బిగ్గరగా) పారాయణం చేసి విన్పించాము. మరే నమాజులలో దైవప్రవక్త (స) (మెల్లిగా పఠించి) మా ముందు దాచారో ఆ నమాజులలో మేము కూడా (మెల్లిగా పఠించి) మీ ముందు దాచాము. (నమాజులో) ఫాతిహా సూరా మాత్రమే పఠించి ఖుర్ఆన్‌లోని మరే ఆయతులు పఠించకపోయినా సరిపోతుంది (నమాజు నెరవేరుతుంది). ఒకవేళ ఫాతిహా సూరాతో పాటు అదనంగా ఖుర్ఆన్‌లోని మరికొన్ని సూక్తులు కూడా పఠిస్తే మరీ మంచిది.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 104వ అధ్యాయం - అల్‌ఖిరాతి ఫిల్ ఫజ్ర్]

224. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఓ రోజు దైవ ప్రవక్త (స) మస్జిద్‌కు వెళ్ళారు. అదే సమయంలో ఒక వ్యక్తి వచ్చి నమాజు చేశాడు. అతను నమాజు ముగించుకొని దైవప్రవక్త(స)కు సలాం చేశాడు. దైవప్రవక్త(స) అతనికి ప్రతి సలాం చేసి "వెళ్ళి నమాజు చెయ్యి. నువ్వసలు నమాజు చెయ్యలేదు" అన్నారు. ఆ వ్యక్తి వెళ్ళి (తిరిగి) నమాజు చేశాడు. నమాజు చేసి వచ్చి దైవప్రవక్త (స)కు సలాం చేశాడు. దైవప్రవక్త(స) తిరిగి అదే మాట చెబుతూ "వెళ్ళు, వెళ్ళి నమాజు చెయ్యి. నువ్వసలు (సరిగా) నమాజు చేయలేదు" అని అన్నారు. ఈ విధంగా ఆ వ్యక్తి మూడుసార్లు నమాజు చేసి వచ్చాడు. ప్రతీసారి దైవప్రవక్త(స) "నువ్వసలు నమాజు చేయలేదు. వెళ్ళి నమాజు చెయ్యి" అనే అన్నారు.

చివరికి ఆ వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరకొచ్చి "మిమ్మల్ని దైవప్రవక్తగా నియమించి పంపిన ఆ దేవుని సాక్ష్యం! నాకు ఇంత కంటే మెరుగైన నమాజు చేయడం రాదు. కాస్త మీరే నేర్పండి ఎలా చేయాలో" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) ఇలా చెప్పారు -

---

★ ఈ ఉల్లేఖనాన్ని బట్టి ఇమామ్, ముఖ్తదీలు ఉభయులూ ప్రతి నమాజులో ఫాతిహా సూరా పఠించవలసిన అవసరముందని హజ్రత్ అబూహురైరా (రజి) భావించినట్లు తెలుస్తోంది. ఈ విషయమై సహాబీల (ప్రవక్త ప్రత్యక్ష అనుచరుల)లో కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. ముఖ్తదీలు ఫాతిహా సూరా పఠించడం మక్రూహ్ (అవాంఛనీయం) అని కొందరు భావించారు. ముఖ్తదీలు కూడా ఫాతిహా సూరా పఠించాలని మరి కొందరు అభిప్రాయపడ్డారు. ఇంకా కొందరు సహాబీలు ఇలా పఠించడం అవసరమని గాని, మక్రూహ్ అని గాని భావించలేదు. అందువల్లనే హజ్రత్ అబూబకర్(రజి) మనవడు హజ్రత్ ఖాసిం (రహ్మలై) దృష్టికి ఈ సమస్య వచ్చినప్పుడు చాలామంది ఇమాములు ఫాతిహా సూరా పఠించకూడదని, చాలా మంది ఇమాములు ఫాతిహా సూరా పఠించాలని అన్నారని ఆయన తెలియజేశారు. అంతేగాని ఆయన తన సొంత అభిప్రాయాన్ని వెలిబుచ్చలేదు.

అలాగే వివిధ ధర్మవేత్తలు, సంస్కరణ వాదులలో కూడా ఈ సమస్య గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షాఫయి, ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్, ఇమామ్ మాలిక్ (రహ్మలై)ల అభిప్రాయం నమాజు ఒంటరిగా చేసినా, ఇమామ్ వెనుక నిల్చొని సామూహికంగా చేసినాసరే ఫాతిహా సూరా పఠించడం వాజిబ్ (తప్పనిసరి). హనఫీ ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఇమామ్ వెనుక నిలబడి నమాజు చేసే వాళ్ళు ఫాతిహా సూరా పఠించడం మక్రూహ్ (అవాంఛనీయం).

"నువ్వు నమాజు కోసం నిలబడినప్పుడు మొట్టమొదట 'అల్లాహు అక్బర్' అని పలకాలి. తరువాత నీవు ఖుర్‌ఆన్ సులభంగా ఎంత భాగం పఠించగలవో అంత పఠించు. ఆ తరువాత రుకూ చెయ్యి. రుకూ నింపాదిగా చేశాక తలపైకెత్తి నిటారుగా నిలబడు. ఆ తరువాత సజ్దా చెయ్యి. సజ్దా నింపాదిగా చేసిన తరువాత, తలపైకెత్తి ప్రశాంతంగా కూర్చో. ఆ తరువాత మళ్ళీ సజ్దా చెయ్యి. సజ్దా నింపాదిగా చేసిన తరువాత తలపైకెత్తి ప్రశాంతంగా కూర్చో. ఈ విధంగా పూర్తి నమాజు చేసి ముగించాలి".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 122వ అధ్యాయం - అమ్రిన్నబియ్యి (స) అల్లజీ లా యుతిమ్ము రుకూ అహూ బిల్ ఇఆదా]

## 13వ అధ్యాయం- నమాజులో 'బిస్మిల్లా' పదం బిగ్గరగా పఠించకూడదు

225. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స), హజ్రత్ అబూ బకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి)లు "అల్‌హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్" అనే వాక్యంతో నమాజు ప్రారంభించేవారు. (దానికి ముందు బిస్మిల్లా అనే పదం మెల్లిగా పఠించడం వల్ల పైకి విన్పించేది కాదు).

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 89 వ అధ్యాయం - మాయఖూలు బాదత్తక్బీర్]

## 16వ అధ్యాయం - నమాజులో 'తషహ్హుద్' పఠనం

226. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- ప్రారంభంలో మేము దైవప్రవక్త(స)తో కలసి నమాజు చేస్తుంటే "దాసులకు పూర్వం దేవునికి శాంతి కలుగుగాక! తరువాత జిబ్రయీల్‌కు, మెకాయీల్‌కు, ఫలానా వ్యక్తికి (ఇలా) మొదలగు వారికి శాంతి కలుగుగాక!" అని పఠించేవాళ్ళము. ఆ తరువాత ఓ రోజు నమాజు ముగిసిన తరువాత దైవప్రవక్త(స) మా వైపుకు తిరిగి ఇలా అన్నారు:

"దేవుడు స్వయంగా శాంతిమయుడు. (ఆయనకు మీరు శాంతి కలుగుగాక అని చెప్పనవసరం లేదు) అందువల్ల మీరు నమాజులో (తషహ్హుద్ పఠనం కోసం) కూర్చున్నప్పుడు 'అత్తహియ్యాతులిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వరహ్మతుల్లాహి వబరకాతుహూ అస్సలాము అలైనా వఅలా ఇబాదిల్లాహిస్సాలిహీన్' అని పఠించండి. ఈ విధంగా మీరు శాంతి ప్రార్థన చేస్తే భూమ్యాకాశాలలో ఉన్న ఉత్తమ దైవదాసులందరికీ శాంతి చేకూరుతుంది. (ఆ తరువాత) 'అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్ హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్' (అని పఠించండి). ఇలా పఠించిన తరువాత మీరు చేయదలచుకున్న దుఆ (వేడుకోలు) చేసుకోవచ్చు."

[సహీహ్ బుఖారీ : 79వ ప్రకరణం - ఇస్తీజాన్, 3వ అధ్యాయం - అస్సలాము ఇస్మున్ మిన్ అస్మాయిల్లాహ్]

## 17వ అధ్యాయం - తషహ్హుద్ తరువాత దైవప్రవక్త(స) కోసం దరూద్ పఠనం

227. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూ లైలా (రహ్మలై) కథనం:- ఓ రోజు నన్ను కాబ్ బిన్ ఉజరా (రజి) కలిసి, "నేను దైవప్రవక్త(స) నోట విన్న ఒక హదీసును విన్పించనా?" అని అన్నారు. నేను "తప్పకుండా

విన్పించండి'' అన్నాను. అప్పుడాయన ఇలా అన్నారు -

నేను దైవప్రవక్త (స)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! మీ కోసం, మీ కుటుంబం కోసం శాంతి వేడుకోలు ఎలా చెయ్యాలో మాత్రం దేవుడు మాకు తెలియజేశాడు. కాని మీ కోసం, మీ కుటుంబం కోసం, దరూద్ వేడుకోలు ఎలా చేయాలి మరి?'' అని అడిగాను. అప్పుడు దైవప్రవక్త(స) ఇలా చెప్పారు: "అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిఁవ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిఁవ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్‌త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదు మ్మజీద్.''

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 10వ అధ్యాయం - హద్దసనా మూసా బిన్ ఇస్మాయీల్]

228. హజ్రత్ అబూ హమీద్ సాఅది (రజి) కథనం:- ఓ సారి దైవప్రవక్త (స)తో ఆయన అనుచరులు మాట్లాడుతూ "దైవప్రవక్తా! మేము మీ కోసం దరూద్ వేడుకోలు ఎలా చేయాలి?'' అని అడిగారు. దానికాయన ఇలా సమాధానమిచ్చారు: "ఇలా అనండి - అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిఁవ్వఅజ్ వాజిహీ వ జుర్రియ్యతిహీ కమాసల్లైత అలా ఇబ్రాహీమ వ బారిక్ అలా ముహమ్మదిఁవ్వ అజ్వాజిహీ వ జుర్రియ్యతిహీ కమాబారక్త అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్.''

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 10వ అధ్యాయం - హద్దసనా మూసా బిన్ ఇస్మాయీల్]

## 18వ అధ్యాయం - సమి అల్లాహులిమన్ హమిదా, రబ్బనా లకల్ హమ్ద్, ఆమీన్

229. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- ఇమామ్ (నమాజులో) 'సమిఅల్లాహులిమన్ హమిదా' అని అన్నప్పుడు మీరు 'రబ్బనా! వ లకల్ హమ్ద్' అని చెప్పండి. ఇలా దైవదూతల మాటకు అనుగుణంగా పలికే వారి గత పాపాలన్నీ క్షమించబడతాయి.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 125 వ అధ్యాయం - ఫజ్లిల్లాహుమ్మ రబ్బనా వ లకల్ హమ్ద్]

230. హజ్రత్ అబూ హురైరా(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- మీలో ఎవరైనా 'ఆమీన్' అని పలకగానే ఆకాశంలో దైవదూతలు కూడా 'ఆమీన్' అంటారు. ఇలా మీరు పలికే ఆమీన్, వారు పలికే ఆమీన్ పరస్పరం కలసిపోతుంది. ఆపై 'ఆమీన్' పలికే వ్యక్తి గత పాపాలన్నీ క్షమించబడతాయి.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 112వ అధ్యాయం - ఫజ్లిత్తామీన్]

231. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- ఇమామ్ (నమాజులో) గైరిల్ మగ్జూబి అలైహిమ్ వలజ్జాలీన్ అని అన్నప్పుడు మీరంతా 'ఆమీన్'★ అని చెప్పండి. మీరు చెప్పే ఆమీన్ దైవదూతలు చెప్పే ఆమీన్‌కు అనుగుణంగా చేయబడుతుంది. అదీగాక ఇలా ఆమీన్ అని చెప్పే వ్యక్తి గత పాపాలు క్షమించబడతాయి.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 113 వ అధ్యాయం - జహ్‌రిల్ మామూమి బిత్తామీన్]

---

★ ఇమామ్, ముఖ్తదీలు ఉభయులూ ఆమీన్ పలకడం ముస్తహబ్ (అభిలషణీయం). అయితే ఉభయులూ ఒకేసారి పలకాలి. ఇమామ్ మాలిక్ (రహ్మలై), ఇమామ్ అబుహనీఫా (రహ్మలై)ల అభిప్రాయం ప్రకారం ఆమీన్ మెల్లగా పలకాలి. ఇతర ధర్మవేత్తలు, సంస్కరణ వాదుల అభిప్రాయం ప్రకారం 'ఆమీన్' బిగ్గరగా పలకాలి.

## 19వ అధ్యాయం - ముఖ్తదీలు (నమాజులో) ఇమామ్‌ని విధిగా అనుకరించాలి

232. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ సారి గుర్రం మీద నుంచి పడిపోయారు. దాని వల్ల ఆయన శరీరం కుడి భాగం దోక్కుని పోయింది. మేము ఆయన్ని పరామర్శించడానికి వెళ్ళాం. మేము ఆయన సన్నిధికి వెళ్ళేటప్పటికి నమాజు వేళ అయింది. ఆయన మాకు కూర్చునే నమాజు చేయించారు. మేము కూడా ఆయన వెనుక కూర్చునే నమాజు చేశాము. ఆయన నమాజు ముగించిన తరువాత "ఇమామ్ నియామకం ఆయన్ని (ముఖ్తదీలు) అనుకరించడానికే జరుగుతుంది. అందువల్ల అతను (అల్లాహు అక్బర్ అని) తక్బీర్ పలికితే మీరు తక్బీర్ పలకండి. ఆయన రుకూ చేస్తే మీరూ రుకూ చేయండి. ఆయన రుకూ నుండి పైకి లేస్తే మీరూ లేవండి. అప్పుడు ఇమామ్ 'సమిఅల్లాహులిమన్ హమిదా' అంటే మీరు 'రబ్బనా! వలకల్ హమ్ద్' అనండి. (ఆ తరువాత) అతను సజ్దా చేస్తే మీరూ సజ్దా చేయండి" అని ప్రబోధించారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 128వ అధ్యాయం - యహ్వీ బిత్తక్బీరి హీన యస్జుద్]

233. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ సారి వ్యాధిగ్రస్తులయితే ఇంట్లోనే నమాజు చేశారు. ఇంట్లో ఆయన కూర్చొని నమాజు చేస్తుంటే కొందరు ఆయన వెనుక నిల్చొని నమాజు చేశారు. దైవప్రవక్త(స) అది గమనించి వాళ్ళను కూర్చోమని ఆదేశించారు. నమాజు ముగిసిన తరువాత "ఇమామ్ నియమించబడింది ఆయన్ని అనుసరించడానికే. అందువల్ల అతను రుకూ చేస్తే మీరూ రుకూ చేయండి. రుకూ నుండి పైకి లేస్తే మీరూ లేవండి. అతను కూర్చొని నమాజు చేస్తే మీరూ కూర్చొనే నమాజు చేయండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 51వ అధ్యాయం - ఇన్నమాజుయిలల్ ఇమాము లియూతమ్మబిహీ]

234. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- ఇమామ్‌ని నియమించేది అతడ్ని అనుసరించడానికే. అందువల్ల అతను 'అల్లాహు అక్బర్' అంటే మీరూ అల్లాహు అక్బర్ అనండి. అతను రుకూ చేస్తే మీరూ రుకూ చేయండి. అతను 'సమి అల్లాహు లిమన్ హమిదా' అంటే మీరు 'రబ్బనా వలకల్ హమ్ద్' అనండి. అతను సజ్దా చేస్తే మీరూ సజ్దా చేయండి. అతను కూర్చొని నమాజు చేస్తే మీరూ కూర్చొని నమాజు చేయండి. ★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 82 వ అధ్యాయం - ఈ జాబిత్తక్బీరి వఫ్ఫితాహిస్సలాహ్]

★ 'ఇమామ్ కూర్చొని నమాజ్ చేస్తే ముఖ్తదీలు కూడా కూర్చొనే నమాజు చేయాలి' అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. ఇమామ్ ఔజాయి (రహ్మలై), ఇమామ్ అహ్మద్ (రహ్మలై) ల ప్రకారం ఈ హదీసుని తప్పకుండా ఆచరించాలి. ఇమామ్ మాలిక్(రహ్మలై) అభిప్రాయం ప్రకారం నిలబడే శక్తి ఉన్నవాడు, కూర్చొని నమాజు చేయించే ఇమామ్ వెనుక నమాజు చేయడం సరికాదు. అయితే దైవప్రవక్త(సల్లం) తమ జీవిత అంత్య దినాలలో జబ్బు పడినప్పుడు కూర్చొని నమాజు చేయించారు. ఆయన వెనుక ఆయన అనుచరులు నిలబడి నమాజు చేశారు. తత్కారణంగానే ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై), ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇంకా ఇతర ధర్మవేత్తలు అనేకమంది కూర్చొని నమాజు చేయించే ఇమామ్ వెనుక ముఖ్తదీలు నిలబడే నమాజు చేయాలని అన్నారు.

## 21వ అధ్యాయం - అనివార్య పరిస్థితుల్లో ఇమామ్ నమాజు కోసం తన ప్రతినిధిని నియమించుకోవచ్చు

235. హజ్రత్ ఉబైదుల్లా బిన్ అబ్దుల్లా బిన్ ఉత్బా (రహ్మలై) కథనం:- నేనొక రోజు విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) సన్నిధికెళ్ళి "అమ్మా! మీరు దైవప్రవక్త(స) వ్యాధి గురించి మాకేమీ చెప్పరా?" అని అడిగాను. అప్పుడామె ఇలా అన్నారు -

ఎందుకు చెప్పను? దైవప్రవక్త(స) వ్యాధిగ్రస్తులయి బలహీనులయిపోయినప్పుడు (ఓ రోజు) "ప్రజలు నమాజు చేసుకున్నారా?" అని అడిగారు. 'లేదు, అందరూ మీ కోసం ఎదురు చూస్తున్నారు' అని మేము అన్నాము. "అయితే నా కోసం నీళ్ళు పెట్టండి" అని అన్నారు ఆయన. మేము ఆయన ఆదేశాన్ని పాటించాము. ఆయన కూర్చొని స్నానం చేశారు. స్నానం చేశాక నడవడానికి ప్రయత్నిస్తే కళ్ళు తిరిగి స్పృహ కోల్పోయారు. కాస్త స్పృహ వచ్చిన తరువాత "ప్రజలు నమాజు చేసుకున్నారా?" అని అడిగారు మళ్ళీ. మేము "లేదు, దైవప్రవక్తా! వాళ్ళంతా మీ కోసం ఎదురు చూస్తున్నారు" అని అన్నాము. "అయితే ఓ పాత్రలో నా కోసం నీళ్ళు తీసుకురండి" అని అన్నారు ఆయన. మేము తిరిగి నీళ్ళు తీసిపెట్టాము. ఆయన కూర్చొని స్నానం చేశారు. కాని లేచి నడవడానికి ప్రయత్నిస్తే మళ్ళీ స్పృహ తప్పిపోయారు. కాస్సేపటికి స్పృహ వచ్చిన తరువాత "ప్రజలు నమాజు చేసుకున్నారా?" అని అడిగారు మళ్ళీ. మేము "లేదు దైవప్రవక్తా! వారంతా మీ కోసం ఎదురు చూస్తున్నారు" అని అన్నాము.

అటు ప్రజల పరిస్థితి చూస్తే వారు ఇషా నమాజు చేయడానికి మస్జిద్‌లో కూర్చొని దైవప్రవక్త(స) రాక కోసం ఎదురు చూస్తున్నారు. చివరికి దైవప్రవక్త(స) (మస్జిద్‌కు రాలేక) హజ్రత్ అబూ బకర్ (రజి)ను నమాజు చేయించమని ఆదేశించారు. ఈ ఆదేశం తీసుకొని ఒక వ్యక్తి హజ్రత్ అబూ బకర్ (రజి) దగ్గరకు వచ్చి "దైవప్రవక్త(స) మిమ్మల్ని ప్రజలకు నాయకత్వం వహించి నమాజు చేయించమని ఆజ్ఞాపించారు" అని తెలియజేశాడు. కాని హజ్రత్ అబూబకర్ (రజి) (సున్నిత హృదయుడయినందున తానీ పని చేయడానికి సాహసించలేక) హజ్రత్ ఉమర్ (రజి)తో "మీరు నమాజు చేయించండి" అని అన్నారు. దానికి హజ్రత్ ఉమర్ (రజి) "నమాజు విషయంలో మీరే జనానికి నాయకత్వం వహించగల యోగ్యులు" అని అన్నారు. దాంతో ఆ రోజుల్లో హజ్రత్ అబూబకరే (రజి) నమాజు చేయించారు.

ఒకరోజు దైవప్రవక్త(స) ఆరోగ్యం కొంత కుదుటపడగానే ఇద్దరు వ్యక్తుల సహాయంతో జుహర్ నమాజు కోసం (మస్జిద్‌కు) వచ్చారు. ఆ ఇద్దరిలో ఒక వ్యక్తి హజ్రత్ అబ్బాస్ (రజి). దైవప్రవక్త (స) మస్జిద్‌లో అడుగుపెట్టే సమయానికి హజ్రత్ అబూ బకర్ (రజి) జనానికి నాయకత్వం వహించి నమాజు చేయించసాగారు. ఆయన దైవప్రవక్త(స) రాకను గమనించి ఇమామత్ స్థానం నుండి వెనక్కి జరగడానికి ప్రయత్నించారు. అయితే దైవప్రవక్త (స) ఆయన్ని వెనక్కి జరగవద్దని సైగతో వారించారు. ఆ తరువాత ఆయన "నన్ను (అబూబకర్) సిద్దీఖ్ పక్కన కూర్చోబెట్టండి" అని అన్నారు. అప్పుడు ఆ ఇద్దరు వ్యక్తులు ఆయన్ని హజ్రత్ అబూ బకర్ (రజి) పక్కన తీసికెళ్ళి కూర్చోబెట్టారు.

ఉల్లేఖకుని కథనం ప్రకారం, ఆ తరువాత హజ్రత్ అబూ బకరే (రజి) తాను దైవప్రవక్త (స)

నాయకత్వంలో ఆయన వెనుక నమాజు చేస్తున్నట్లు నమాజు చేయించారు. (నిజానికి) ప్రజలు హజ్రత్ అబూబకర్ (రజి) నాయకత్వాన నమాజు చేశారు.

ఆ తరువాత నేను (ఉల్లేఖకుడ్ని) హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) దగ్గరకు వెళ్ళి "దైవప్రవక్త(స) వ్యాధి గురించి హజ్రత్ ఆయిషా (రజి) చెప్పిన విషయాలు నేను మీకు తెలియజేయనా?'' అని అన్నాను. ఆయన తెలియజేయమన్నారు. నేను హజ్రత్ ఆయిషా (రజి) చెప్పిన (పై) ఉదంతం అంతా ఆయన ముందు ప్రస్తావించాను. అందులో ఆయన ఏ విషయంలోనూ నాతో విభేదించలేదు. ఆయన అంతా విని "హజ్రత్ అబ్బాస్ (రజి)తో పాటు ఉన్న రెండవ వ్యక్తి ఎవరో హజ్రత్ ఆయిషా (రజి) మీకు తెలియజేశారా?'' అని అడిగారు. నేను లేదన్నాను. అప్పుడాయన "ఆ రెండవ వ్యక్తి హజ్రత్ అలీ (రజి)'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 51వ అధ్యాయం - ఇన్నమాజ అలల్ ఇమాము లియూతమ్మబిహీ]

236. హజ్రత్ ఆయిషా(రజి) కథనం:- దైవప్రవక్త(స) అస్వస్థులయ్యారు. బాధ క్రమంగా అధికమవుతూ పోయింది. అప్పుడాయన వ్యాధి ఉన్నంత కాలం నా ఇంట ఉండటానికి అనుమతి నివ్వమని తన భార్యలందరినీ పిలిచి అడిగారు. వారందుకు సంతోషంగా అనుమతినిచ్చారు. ఆ రోజుల్లో (ఓ రోజు) దైవప్రవక్త(స) ఇద్దరు మనుషుల భుజాల మీద చేతులు వేసి వారి తోడ్పాటుతో బయటికి వెళ్ళారు. అప్పుడు ఆయన (నడవలేక) రెండు కాళ్ళను నేలమీద ఈడుస్తూ వెళ్ళారు. ఆ ఇద్దరు వ్యక్తుల్లో ఒకరు హజ్రత్ అబ్బాస్ (రజి). రెండో అతను మరొక వ్యక్తి.

ఉల్లేఖకుడు ఉబైదుల్లా (రహ్మలై) ఇలా అన్నారు:- నేను హజ్రత్ ఆయిషా (రజి) తెలియజేసిన (ఈ) విషయాలను హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) దగ్గర ప్రస్తావించాను. ఆయన విని "హజ్రత్ ఆయిషా (రజి) తెలపని ఆ రెండవ వ్యక్తి పేరేమిటో మీకు తెలుసా?'' అని అన్నారు. తెలియదన్నాను నేను. "ఆ వ్యక్తి హజ్రత్ అలీ బిన్ అబీతాలిబ్ (రజి)'' అని అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - అల్‌హిబా, 14వ అధ్యాయం - హిబతిర్రజులిల్ ఇమ్రాతిహీ వల్ మరాతి బిజౌజిహా]

237. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- (హజ్రత్ అబూ బకర్ (రజి)ని నమాజు చేయించమని దైవప్రవక్త(స) ఆదేశించినప్పుడు) నేను ఆలోచనలో పడ్డాను. దైవప్రవక్త(స) స్థానంలో మరే వ్యక్తి నియమించబడినా ప్రజలు అతడ్ని ఎన్నటికీ ఇష్టపడరు. పైగా అతడ్ని తమ పాలిట దుఃశకునంగా భావిస్తారు. అందువల్ల దైవప్రవక్త(స) ఈ విషయంలో హజ్రత్ అబూ బకర్ (రజి)ని క్షమించాలని నేను కోరుకున్నాను. నేనీ విషయాన్నే దృష్టిలో పెట్టుకొని (ఈ ఆజ్ఞను గురించి) పునరాలోచించవలసిందిగా దైవప్రవక్త (స) ముందు అనేకసార్లు విన్నవించుకున్నాను.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - అల్‌మగాజి, 83వ అధ్యాయం - మర్జున్నబియ్యి (స) వ వఫాతహూ]

238. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇహలోకం వీడిపోవడానికి దారి తీసిన వ్యాధికి గురయి ఉన్న రోజుల్లో ఒకసారి నమాజు వేళ అయింది. అజాన్ పిలుపు కూడా ఇవ్వబడింది. అప్పుడు దైవప్రవక్త(స) మాట్లాడుతూ "ప్రజలకు నాయకత్వం వహించి నమాజు చేయించమని అబూబకర్ (రజి)కు చెప్పండి'' అని అన్నారు. "అబూ బకర్ (రజి) సున్నిత మనస్కులు. ఆయన మీ స్థానంలో

నిలబడితే (తీవ్రదుఃఖంతో) నమాజు చేయించలేరు" అని అన్నారు ప్రజలు. కాని దైవప్రవక్త(స) ఆ మాటలనే తిరిగి ఉద్ఘాటించారు. ప్రజలు మళ్ళీ ఆ విషయాన్నే విన్నవించుకున్నారు. మూడవసారి కూడా దైవప్రవక్త(స) అలాగే ఆదేశించడం, ప్రజలు ఆ విషయాన్నే విన్నవించుకోవడం జరిగింది.

అప్పుడు దైవప్రవక్త(స) (చిరుకోపంతో) "మీరు హజ్రత్ యూసుఫ్ (ప్రవక్త)ను కవ్వించబూనిన స్త్రీల వంటివారు. (వెళ్ళండి, వెళ్ళి) అబూబకర్ (రజి)తో నమాజు చేయించమని చెప్పండి" అని అన్నారు. ఈ సంగతి అబూబకర్ (రజి)కు తెలియజేస్తే, ఆయన జనానికి నాయకత్వం వహించి నమాజు చేయించారు. (అదే సమయంలో) దైవప్రవక్త(స) ఆరోగ్యం కాస్త కుదుటపడినట్లు అన్పించగానే ఇద్దరు వ్యక్తుల సహాయంతో బయటికి వెళ్ళారు. ఆయన బయటికి వెళ్ళిన ఆ సన్నివేశం ఇప్పటికీ నా కళ్ళ ముందు మెదలుతోంది.

తీవ్రమైన వ్యాధి, బలహీనతల వల్ల (నడవలేక) నేలమీద కాళ్ళు ఈడుస్తూ వెళ్ళారు. (ఆయన రావడం గమనించి హజ్రత్ అబూ బకర్ (రజి) వెనక్కి జరగడానికి ప్రయత్నించారు. అయితే దైవప్రవక్త(స) ఆయన్ని అక్కడే ఉండమని సైగ చేశారు. తరువాత దైవప్రవక్త(స)ను హజ్రత్ అబూబకర్ (రజి) పక్కన కూర్చోబెట్టారు. దైవప్రవక్త(స) నమాజు చేయిస్తూ ఉంటే, హజ్రత్ అబూ బకర్ (రజి) ఆయన్ని అనుసరిస్తూ పోయారు. మరి ప్రజలు మాత్రం అబూబకర్ (రజి)ని అనుసరిస్తూ నమాజు చేయసాగారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 39వ అధ్యాయం - హద్దుల్ మరీజి అఁయ్యష్ హదల్ జమాఅత్]

239. ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) వ్యాధిగ్రస్తులయినప్పుడు (ఓ రోజు) ఆయన్ని హజ్రత్ బిలాల్ (రజి) నమాజు కోసం పిలవడానికి వచ్చారు. అప్పుడు ఆయన మాట్లాడుతూ "ప్రజలకు నాయకత్వం వహించి నమాజు చేయించమని అబూబకర్ (రజి)కు చెప్పండి" అని అన్నారు. అది విని నేను "దైవప్రవక్తా! అబూబకర్ (రజి) సున్నిత మనస్కులు. మీ స్థానంలో ఆయన నిల్చుంటే ఆయన నోట మాట వెలువడదు. ఖుర్ఆన్ పఠించలేరు. మీరు ఉమర్ (రజి)ని ఆజ్ఞాపిస్తే బాగుంటుంది" అని అన్నాను. కాని దైవప్రవక్త(స), "అబూబకర్ (రజి)కు నమాజు చేయించమని చెప్పండి" అని అన్నారు మళ్ళీ. నేనప్పుడు హజ్రత్ హఫ్సా (రజి)తో "నువ్వు కాస్త దైవప్రవక్త(స)కు నచ్చజెప్పు. అబూబకర్ (రజి) సున్నిత హృదయులు. ఆయన దైవప్రవక్త(స) స్థానంలో నిల్చుంటే నోట మాటే పెగలదు. ఖుర్ఆన్ పఠించి ప్రజలకు విన్పించలేరు. అందువల్ల హజ్రత్ ఉమర్ (రజి) నమాజు చేయిస్తే బాగుంటుందని చెప్పి ఆయన్ని ఈ పని కోసం ఆదేశించమని విజ్ఞప్తి చెయి" అని అన్నాను. అదే విషయం హజ్రత్ హఫ్సా (రజి) విన్నవించారు. అప్పుడు దైవప్రవక్త(స) (చిరుకోపంతో) "మీరు హజ్రత్ యూసుఫ్ (ప్రవక్త)కు తారసపడ్డ స్త్రీల లాంటి స్త్రీలులా ఉన్నారు. వెళ్ళండి, అబూబకర్ (రజి)కు నమాజు చేయించమని చెప్పండి" అని అన్నారు.

చివరికి హజ్రత్ అబూబకర్ (రజి) నమాజు చేయించడానికి నిలబడ్డారు. కాస్సేపటికి దైవప్రవక్త(స) ఆరోగ్యం కాస్త కుదుటపడినట్లు అన్పిస్తే లేచి ఇద్దరు వ్యక్తుల సహాయంతో మస్జిద్‌కు వెళ్ళారు. అప్పుడు ఆయన కాళ్ళు నేలమీద ఈడుస్తూ వెళ్ళారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఆయన రాకను గమనించి వెనక్కి జరగడానికి ప్రయత్నించారు. కాని దైవప్రవక్త(స) ఆయన్ని అక్కడే ఉండమని ఆదేశించి, ఆయన ఎడమ పక్కన వెళ్ళి కూర్చున్నారు. ఇలా హజ్రత్ అబూబకర్ (రజి) నిలబడి నమాజు

చేయిస్తుంటే, దైవప్రవక్త(స) కూర్చుని నమాజు చేయించసాగారు. హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త(స)ను అనుసరించసాగారు. మిగతా జనం అబూబకర్ (రజి)ని అనుసరిస్తూ నమాజు చేయసాగారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 68వ అధ్యాయం - అర్రజులి యాతమ్ము బిల్ ఇమామి వయాతమ్మున్నాసుబిల్ మామూమ్]

240. దైవప్రవక్త సహచర్య భాగ్యం లభించడంతో పాటు, రేయింబవళ్ళు ఆ మహనీయునికి సేవ చేసే అదృష్టానికి కూడా నోచుకున్న ప్రముఖ సహాబీ (శిష్యుడు) హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) జీవితపు చివరి రోజుల్లో హజ్రత్ అబూబకర్ (రజి) నమాజులో ప్రజలకు నాయకత్వం వహించి నమాజు చేయిస్తూ ఉండేవారు. ఓసారి సోమవారం జనం బారులు తీరి నమాజు చేయడంలో నిమగ్నులయిపోయారు. దైవప్రవక్త(స) తమ ఇంటి (ద్వారపు) తెర పైకెత్తి మావైపు చూశారు. అప్పుడు ఆయన నిలబడి ఉన్నారు. ఆయన ముఖారవిందం ఖుర్ఆన్ పుటలా దేదీప్యమానంగా వెలిగిపోసాగింది. అదీగాక ఆయన పెదవులపై చిరునగవు తొణకిసలాడింది. ఇటు మేమంతా దైవప్రవక్త(స)ను చూసి, సంతోషాతిశయంతో తన్మయత్వం చెందసాగాము. హజ్రత్ అబూబకర్ (రజి) పరిస్థితి గమనించి దైవప్రవక్త(స) నమాజు చేయించడానికి వస్తున్నారేమోనని భావించారు. అందుచేత ఆయన ఇమామత్ చోటు నుంచి మెల్లిగా వెనక్కి జరుగుతూ ముఖ్తదీల పంక్తిలో నిలబడటానికి ప్రయత్నించారు. అయితే దైవప్రవక్త(స) చేత్తో సైగ చేస్తూ, అందరూ తమ తమ స్థానాల్లోనే ఉండి నమాజు పూర్తి చేయవలసిందిగా ఆదేశించారు. ఆ తరువాత ఆయన తెర దించి వేశారు. అదే రోజు ఆయన ఇహలోకం వీడిపోయారు.

(సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 46వ అధ్యాయం - అహ్లుల్ ఇల్మి వల్ ఫజ్లి అహఖ్ఖుబిల్ ఇమామ]

241. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) (తమ జీవిత అంత్య దశలో) మూడు రోజుల పాటు నమాజు చేయించడానికి బయటికి రాలేకపోయారు. ఆ మూడు రోజులు హజ్రత్ అబూబకర్ (రజి) నమాజు చేయించారు. తరువాత ఒక రోజు దైవప్రవక్త (స) తమ ఇంటి పరదా పైకెత్తారు. అప్పుడు మాకు ఆయన ముఖారవిందాన్ని దర్శించుకునే భాగ్యం లభించింది. ఆయన ముఖారవిందాన్ని మించిన సుందర దృశ్యం మేము మా జీవితంలో మరెన్నడూ చూడలేదు. తరువాత ఆయన చేత్తో సైగచేస్తూ, హజ్రత్ అబూబకర్ (రజి)ని నమాజు చేయించమని ఆదేశించి తెర దించివేశారు. ఆ తరువాత ఆయన చనిపోయేవరకు తెరపైకెత్తి మాకు తమ దర్శన భాగ్యం కలిగించలేకపోయారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 46వ అధ్యాయం - అహ్లుల్ ఇల్మి వల్ ఫజ్లి అహఖ్ఖు బిల్ ఇమామ]

242. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- దైవప్రవక్త(స) వ్యాధిగ్రస్తులయి వ్యాధి తీవ్ర రూపం దాల్చినప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి)ని నమాజు చేయించమని ఆదేశించారు. హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాట విని "అబూబకర్ (రజి) సున్నితమనస్కులు. మీ స్థానంలో ఆయన నిలబడితే (తీవ్రమైన భావోద్రేకాలకు లోనయి) నమాజు చేయించలేరు" అని అన్నారు. దైవప్రవక్త (స) తిరిగి అదే విషయాన్ని ప్రస్తావిస్తూ "అబూబకర్ (రజి)కు నమాజు చేయించమని చెప్పండి" అని అన్నారు. హజ్రత్ ఆయిషా (రజి) తమ విజ్ఞప్తిని మళ్ళీ ప్రస్తావించారు. దైవప్రవక్త(స) మళ్ళీ అదే ఆజ్ఞ జారీ చేస్తూ "అబూబకర్ (రజి)కు నమాజు చేయించమని చెప్పండి. మీరు యూసుఫ్ (ప్రవక్త)ను పురిగొల్పడానికి ప్రయత్నించిన స్త్రీల మాదిరిగా ఉన్నారు" అని అన్నారు. దాంతో ఒక వ్యక్తి హజ్రత్ అబూబకర్ (రజి)

దగ్గరికి వెళ్ళి ఈ ఆజ్ఞ విన్పించారు. హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త(స) జీవించి ఉండగా ప్రజలకు నాయకత్వం వహించి నమాజు చేయించారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 46వ అధ్యాయం - అహ్లుల్ ఇల్మి వల్ ఫజ్లి అహఖ్ఖు బిల్ ఇమామ]

## 22వ అధ్యాయం - నియమిత ఇమామ్ రావడంలో ఆలస్యమైతే మరొకర్ని ఇమామ్‌గా నియమించుకోవడం

243. హజ్రత్ సహల్ బిన్ సాద్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి బనీ ఉమర్ బిన్ ఔఫ్ తెగ ప్రజల మధ్య రాజీ కుదర్చడానికి వారి దగ్గరకు వెళ్ళారు. ఆ సందర్భంలో నమాజు వేళ అయింది. అప్పుడు ముఅజ్జిన్, హజ్రత్ అబూబకర్(రజి)తో "మీరు నమాజు చేయిస్తారా? నేను తక్బీర్ (ఇఖామత్) చెబుతాను" అని అన్నాడు. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) 'సరే, చేయిస్తాను' అని అన్నారు. ఆ తరువాత ఆయన నమాజు చేయించడం ప్రారంభించారు. ప్రజలు ఇంకా నమాజు ముగించలేదు, అంతలో దైవప్రవక్త(స) వచ్చారు. ఆయన జనాన్ని దాటుకుంటూ మొదటి పంక్తిలోకి వెళ్ళి నిల్చున్నారు.

ఆయన్ని చూసి ప్రజలు చప్పట్లు చరచి [హజ్రత్ అబూబకర్(రజి)ని] సైగ చేయడానికి ప్రయత్నించారు. కాని హజ్రత్ అబూబకర్ (రజి) [ఆ విషయాన్ని పట్టించుకోలేదు. ఆయన] నమాజు చేస్తున్నప్పుడు మరే విషయంపై దృష్టి సారించరు. చివరికి ప్రజలు చప్పట్లు చరచడం అధికం చేయడంతో ఆయన విషయం గమనించారు. దైవప్రవక్త(స)ను చూడగానే ఆయన (ఇమామత్ చోటు నుంచి) వెనక్కి జరగడానికి ప్రయత్నించారు. అయితే దైవప్రవక్త(స) ఆయన్ని (కదలకుండా) తన స్థానంలోనే నిలబడమని ఆదేశించారు. కాని హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త(స) ఆదేశం విని (ఆయన తనను అంతటి యోగ్యుడిగా గుర్తించినందుకు) రెండు చేతులెత్తి కృతజ్ఞతగా దైవాన్ని స్తుతించారు. తరువాత వెనక్కి జరిగి అందరితో పాటు సమానంగా పంక్తిలో నిల్చున్నారు.

అప్పుడు దైవప్రవక్త (స) ముందుకు వెళ్ళి నమాజు చేయించారు. నమాజు ముగిసిన తరువాత "అబూబకర్! నీ స్థానంలోనే నిలబడమని నేను ఆజ్ఞాపించినప్పటికీ నీవు అలా ఎందుకు చేయలేదు?" అని అడిగారు ఆయన. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) "అబూ హాఫా కొడుక్కి దైవప్రవక్త(స) ముందు నిలబడేటంత శక్తి, సాహసం ఎక్కడున్నాయి" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) ప్రజల వైపుకు తిరిగి " మీరు (అనవసరంగా) చాలా సార్లు చప్పట్లు చరిచారు. అసలీ చేత్తో శబ్దం చేయడం అనేది స్త్రీల పని. నమాజులో ఏదైనా ఊహించని విషయం జరిగితే మీరు "సుబ్‌హానల్లాహ్" అనండి చాలు. సుబ్‌హానల్లాహ్ అనగానే ఇమామ్ మీ ఉద్దేశ్యాన్ని పసిగడతారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 48వ అధ్యాయం - మన్ దఖల లియౌమ్మున్నాస ఫజా అల్ ఇమాముల్ అవ్వలు ఫత అఖ్ఖరల్ ఆఖిర్]

## 23వ అధ్యాయం - నమాజులో ఊహించని సంగతేదైనా జరిగితే ఇమామ్‌కు సూచించే పద్ధతి

244. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- (నమాజులో ఊహించని పరిణామం ఏదైనా జరిగిపోతే) పురుషులు 'సుబ్‌హానల్లాహ్' అనాలి. స్త్రీలయితే చేత్తో శబ్దం చేయాలి.

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం - అల్ అమల్ ఫిస్సలాత్, 5వ అధ్యాయం - తస్ఫీఖున్నిసా]

## 24వ అధ్యాయం - నమాజులో ఏకాగ్రత, సముచిత రీతులు

245. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా అన్నారు:- నేను (నమాజు చేస్తున్నప్పుడు) ఖిబ్లా వైపు మాత్రమే చూస్తానని మీరు భావిస్తున్నారా? దైవసాక్షి! మీ ఏకాగ్రత, రుకూ, సజ్దాలను గురించి కూడా నాకు తెలుసు. నేను నా వెనుకవైపు నుండి కూడా మీ చర్యలను ఓ కంట గమనిస్తుంటాను.

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 40వ అధ్యాయం - ఇజతిల్ ఇమామిన్నాసఫీఇత్మామిస్సలాతి వజిక్రిల్ ఖిబ్ల]

246. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:- "రుకూ, సజ్దాలు, సరిగ్గా చేయండి. దైవసాక్షి! మీరు రుకూ, సజ్దాలు ఎలా చేస్తున్నారో నేను నా వెనుకవైపు నుండి అంతా గమనిస్తూ ఉంటాను."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 88వ అధ్యాయం - అల్‌ఖుషూ ఫిస్సలాత్]

## 25వ అధ్యాయం - ఇమామ్‌కు ముందే రుకూ, సజ్దాలు చేయకూడదు

247. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:- "(నమాజులో రుకూ, సజ్దాల సందర్భంగా) ఇమామ్‌కు ముందు తలపైకెత్తేవాడు తన తలను దేవుడు, గాడిద తలగా మార్చుతాడేమోనని భయపడడా?"లేక దైవప్రవక్త(స) ఇలా అన్నారు. " అతను తన రూపాన్ని దేవుడు, గాడిద రూపంగా మార్చుతాడేమోనని భయపడడా?"

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 53వ అధ్యాయం - ఇస్మిమర్రఫ అరాసహూ ఖబ్లల్ ఇమామ్]

## 28వ అధ్యాయం - పంక్తులను వంకరటింకరగా లేకుండా తిన్నగా ఉంచాలి

248. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు:- మీ పంక్తులను (వంకరటింకరగా లేకుండా) తిన్నగా ఉంచండి. పంక్తులను తీర్చిదిద్దడం నమాజు (వ్యవస్థ)కు పరిపూర్ణతనివ్వడంలో ఒక భాగమయి ఉంది.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 74వ అధ్యాయం - ఇఖామతుస్సఫ్ఫి మిన్ తమామిస్సలాతి]

249. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:- మీ పంక్తులను తిన్నగా,

సక్రమంగా ఉంచుకోండి. వినండి! మీరు నా వెనుక నిల్చున్నప్పుడు కూడా నేను మిమ్మల్ని చూడగలుగుతాను.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 71వ అధ్యాయం - తిస్వయతిస్సుఫూ ఫి ఇన్దల్ ఇఖామతి వ బాదహా]

250. హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు:- మీరు సర్వావస్థల్లో మీ పంక్తులను తిన్నగా, సక్రమంగా ఉంచుకోవాలి. అలా చేయకపోతే దేవుడు మీ ముఖాలను పరస్పరం వ్యతిరేకంగా మార్చివేస్తాడు (అంటే మీరు పరస్పరం విభేదించుకొని అనైక్యతకు గురవుతారు).

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 71వ అధ్యాయం - తిస్వయతిస్సుఫూఫి ఇన్దల్ ఇఖామతి వ బాదహా]

251. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు :- అజాన్ చెప్పడంలో, మొదటి పంక్తిలో చేరడంలో ఎంత పుణ్యం ఉందో ప్రజలకు గనక తెలిస్తే, ఆ అవకాశాలు లాటరీ పద్ధతి ద్వారా మాత్రమే లభిస్తాయని తెలిస్తే, మీరు తప్పకుండా పరస్పరం లాటరీ వేసుకుంటారు. అలాగే వేళ కాగానే తొలి సమయంలో నమాజు చేయడంలో ఎంత పుణ్యం ఉందో తెలిస్తే, అందులో కూడా ప్రజలు ఒకర్నొకరు మించిపోవడానికి పోటీపడతారు. అదే విధంగా ఇషా, ఫజ్ర్ (సామూహిక) నమాజులు చేయడంలో ఎంత పుణ్యం ఉందో తెలిస్తే, వాటికోసం కాళ్ళీడ్చుకుంటూ నడవవలసి వచ్చినా సరే వారు పరస్పరం పోటీపడి వస్తారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 9వ అధ్యాయం - అల్ఇస్తిహామి ఫిల్అజాన్]

## 29వ అధ్యాయం - నమాజులో పురుషులు తలపైకెత్తే వరకు స్త్రీలు తలపైకెత్తరాదు

252. హజ్రత్ సహల్ బిన్ సాద్ (రజి) కథనం:- కొందరు (అనుచరులు చాలీ చాలని బట్టల వల్ల) అంగవస్త్రాన్ని పిల్లల మాదిరిగా మెడలో కట్టుకొని దైవప్రవక్త(స) వెనుక నమాజు చేసేవారు. అందువల్ల పురుషులు సజ్దా నుండి తలపూర్తిగా పైకెత్తనంతవరకు స్త్రీలు కూడా సజ్దా నుండి తలపైకెత్తకూడదని దైవప్రవక్త(స) ఆజ్ఞాపించేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - అస్సలాత్, 6వ అధ్యాయం - ఇజాకానస్సౌబుజయ్యిఖా]

## 30వ అధ్యాయం - ఎలాంటి ఉపద్రవం లేదనుకుంటే స్త్రీలు సువాసన పూసుకోకుండా మస్జిద్‌కు వెళ్ళవచ్చు

253. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:- మీ భార్యలు మస్జిద్‌కు వెళ్ళడానికి అనుమతి అడిగితే, వారిని నిరోధించకండి.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 116వ అధ్యాయం - ఇస్తీజానిల్ మర్అతిజౌజహా ఫిల్ ఖురూజీ ఇలల్ మస్జిద్]

254. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) భార్యలలో ఒకరు ఫజ్ర్, ఇషా ల సామూహిక నమాజులు చేయడానికి మస్జిద్‌కు వెళ్ళేవారు. "స్త్రీలు మస్జిద్‌కు వెళ్ళడాన్ని హజ్రత్

ఉమర్ (రజి) ఇష్టపడరని, ఈ విషయంలో ఆయన ఎంతో అభిమానం గల వ్యక్తి అని తెలిసి కూడా మీరు ఇంటి నుండి బయటికి ఎందుకు వెళ్తున్నారు?'' అని ఆమెను ఒకరు అడిగారు. దానికామె "అయితే ఉమర్ (రజి) నన్నెందుకు నిరోధించడం లేదు?'' అని ఎదురు ప్రశ్నవేశారు. "ఎందుకంటే దేవుని దాసీలను దేవుని ఆలయానికి వెళ్ళడాన్ని నిరోధించకండని దైవప్రవక్త(స) అన్నారు. ఈ ప్రవచనమే మిమ్మల్ని నిరోధించకుండా ఆయనకు అడ్డుతగిలింది'' అని అన్నాడు ఆ వ్యక్తి.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 13వ అధ్యాయం - హద్దసనా యూసుఫు బిన్ మూసా]

255. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- (ఈనాడు) స్త్రీలు (రకరకాల ఫ్యాషన్లతో) తమల్ని తాము (సింగారించుకొని) ఎలా రూపొందించుకున్నారో దైవప్రవక్త(స) గనక చూస్తే, బనీ ఇస్రాయీల్ మహిళలు ఎలా నిరోధించబడ్డారో అలా స్త్రీలను ఆయన మస్జిద్‌కు వెళ్ళకుండా నిరోధించేవారు.

[సహీహ్ బుఖారీ: 10వ ప్రకరణం - అజాన్, 163వ అధ్యాయం - ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్]

## 31వ అధ్యాయం - అలజడి రేగే ప్రమాదం ఉంటే నమాజులో ఖుర్‌ఆన్ బిగ్గరగా పఠించకూడదు

256. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- "మీ నమాజు (లో ఖుర్‌ఆన్ సూక్తులు) మరీ బిగ్గరగా గాని, మరీ మెల్లగా గాని పఠించకండి'' అనే ఖుర్‌ఆన్ సూక్తి (17:110) దైవప్రవక్త(స) మక్కాలో (తమ ఇంట్లో) రహస్యంగా నమాజు చేస్తుండిన రోజుల్లో అవతరించింది. ఆ కాలంలో ఖుర్‌ఆన్ బిగ్గరగా పఠిస్తే బహుదైవారాధకులు విని ఖుర్‌ఆన్‌ని, ఖుర్‌ఆన్‌ని అవతరింపజేసేవాడ్ని, ఖుర్‌ఆన్ తెచ్చేవాడ్ని నానా మాటలతో దూషించేవారు. ఈ కారణంగా "నమాజులో ఖుర్‌ఆన్ సూక్తుల్ని బహుదైవారాధకులు వినగలిగే అంత బిగ్గరగా గాని, (ఇమామ్ వెనుక నిల్చునే) అనుచరులకు సయితం వినపడనంత మెల్లిగాగాని పఠించకుండా మధ్యేమార్గాన్ని అవలంబించండి'' అని దేవుడు ఆజ్ఞాపించాడు.

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 34వ అధ్యాయం]

## 32వ అధ్యాయం - దివ్యఖుర్‌ఆన్‌ని శ్రద్ధగా ఆలకించ[illegible]

[illegible] హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) వహీ తెచ్చి విన్పిస్తున్నప్పుడు దైవప్రవక్త(స) తమ నాలుక, పెదాలను కదిలించేవారు. దాని వల్ల ఆయనకు బాధ కలిగేది. ఈ సంగతి ఆయన ముఖకవళికలను బట్టి తెలిసేది. అందువల్ల దేవు[illegible] ఖియామా సూరాలో "ప్రవక్తా! ఈ వహీని జ్ఞాపకముంచుకోవడానికి వడివడిగా నాలుక తిప్పకు. దాన్ని [illegible] గుర్తు చేయించడం, నీ చేత చదివించడం మా పని. అంచేత మేము పఠిస్తున్నప్పుడు నీవు దా[illegible] శ్రద్ధగా ఆలకిస్తూ ఉండు చాలు. ఆ తరువాత దాని భావం తెలియజేయడం కూడా మ[illegible]త్యతే'' (75:16-19) అనే సూక్తుల్ని అవతరింపజేశాడు. అప్పటి నుంచి హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) (వహీ తీసుకొని) వచ్చినప్పుడల్లా దైవప్రవక్త(స) తలవంచి శ్రద్ధగా ఆలకించేవారు. జిబ్రయీల్ (అలైహి) వెళ్ళిపోయిన తరువాత ఆయన దాన్ని దేవుని వాగ్దానం ప్రకారం పఠించేవారు (అంటే హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) నోట ఒక్కసారి వినగానే ఆయనకు ఇక ఎల్లప్పుడూ గుర్తుండిపోతుందన్నమాట.)

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - అత్తఫ్సీర్, 75వ సూరా - అల్ ఖియామ: 2వ అధ్యాయం]

258. "ఈ వహీని గుర్తుంచుకోవడానికి వడివడిగా నాలుక తిప్పకు" అనే దైవాజ్ఞ అవతరణ గురించి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేస్తూ "దైవసందేశం అవతరిస్తున్నప్పుడు దైవప్రవక్త (స) దాన్ని గుర్తుంచుకోవడానికి నాలుకను వడివడిగా తిప్పుతూ చాలా ఇబ్బంది పడేవారు" అని అన్నారు. ఆ తరువాత ఇబ్నె అబ్బాస్ (రజి) "దైవప్రవక్త(స) తమ నాలుకను ఎలా తిప్పారో అలా నా నాలుకను, పెదవుల్ని తిప్పి చూపుతాను" అని అన్నారు.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ ద్వారా ఈ హదీసును ఉటంకించిన హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ ఇలా అన్నారు: హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఎలా తన పెదవుల్ని కదిపారో నేను మీకు కదిపి చూపుతాను. తరువాత ఆయన (రహ్మలై) తన పెదవులను తిప్పి చూపారు.

అందువల్ల దేవుడు "ప్రవక్తా! ఈ వహీని గుర్తుంచుకోవడానికి వడివడిగా నాలుక తిప్పకు. దాన్ని గుర్తు చేయించడం, నీ చేత చదివించడం మా పని. అంచేత మేము పఠిస్తున్నప్పుడు నీవు దాన్ని చెవి యొగ్గి విను చాలు. ఆ తరువాత దాని భావం తెలియజేయడం కూడా మా బాధ్యతే" అనే సూక్తుల్ని అవతరింపజేశాడు. ఈ ఆజ్ఞ వచ్చిన తరువాత దైవప్రవక్త(స) పరిస్థితి మారిపోయింది. హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) దైవసందేశం తెచ్చినప్పుడల్లా దైవప్రవక్త(స) దాన్ని చెవి యొగ్గి వినేవారు. జిబ్రయీల్ (అలైహి) వెళ్ళిపోయిన తరువాత ఆయన ఆ సూక్తుల్ని జిబ్రయీల్ దూత (అలైహి) పఠించినట్లు పఠించేవారు.

[సహీహ్ బుఖారీ : 1వ ప్రకరణం - వహీ, 4వ అధ్యాయం - హద్దసనా మూసా బిన్ ఇస్మాయీల్]

## 33వ అధ్యాయం - ఫజ్ర్ నమాజ్‌లో బిగ్గరగా ఖుర్‌ఆన్ పారాయణం - జిన్నులకు ఖుర్‌ఆన్ బోధ

259. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ సారి కొందరు అనుచరుల్ని వెంట బెట్టుకొని అకాజ్ (ప్రాంతానికి) బయలుదేరారు. ఇది ఆకాశంలో అగ్నిజ్వాలలు షైతానుల్ని (దుష్టశక్తుల్ని) తరిమివేస్తూ వారికి దివ్య లోకాల సమాచారం అందకుండా ద్వారాలు మూసివేయబడిన నాటి సంగతి. షైతానులు (దివ్యలోకాల సమాచారం సేకరించలేక నిరాశతో) వెనుదిరిగి తమ మిత్రమూక దగ్గరికి వచ్చినప్పుడు "ఏమయింది మీకు (ఉత్త చేతులతో వచ్చారు)?" అని అడిగింది ఆ మిత్రమూక. దానికి వారు "మా మీద అగ్నిజ్వాలలు కురిపించబడ్డాయి, దివ్యలోకాల మాటలు విననీయకుండా మనల్ని నిరోధించడం జరిగింది" అని సమాధానమిచ్చారు. "మనం వార్తలు సయితం వినకుండా నిరోధించబడ్డాం అంటే, దానికి కారణం ఏదో కొత్త సంఘటనే జరిగిందన్నమాట. అందువల్ల మనం నేల నాలుగు చెరగులా తిరిగి, దివ్యలోకాల వార్తలు విననీయకుండా మనకు అడ్డుపడిన విషయం ఏమిటో అన్వేషించాలి" అన్నారు వారి మిత్రులు.

(దాని ప్రకారం జిన్నులు ప్రపంచం నలుమూలలా వ్యాపించారు.) ఒక బృందం తహామా (ప్రాంతం)లో పర్యటిస్తూ, అకాజ్ బజారుకు బయలుదేరి దారిలో నఖ్లా (ప్రదేశం)లో ఆగిన దైవప్రవక్త(స) దగ్గరికి చేరుకున్నది. అప్పుడు దైవప్రవక్త(స) ఫజ్ర్ నమాజ్ చేయసాగారు. జిన్నులు ఆయన నోట దివ్యఖుర్‌ఆన్ విని "దైవసాక్షి! దివ్యలోకాల మాటలు విననీయకుండా మనకు అడ్డుగా

నిలిచిన విషయం ఇదే'' అని అన్నారు. ఆ తరువాత వారు అక్కడ్నుంచి తమ జాతి దగ్గరకు చేరుకొని "(సోదరులారా!) ఈ రోజు మేము అద్భుతమైన ఖుర్‌ఆన్ వాణి విన్నాము. అది (మనల్ని) రుజుమార్గం వైపుకు ఆహ్వానిస్తోంది. అందువల్ల మేము దాన్ని విశ్వసించాము. ఇక నుండి మేము మా(నిజ) ప్రభువుకు ఎవరినీ సాటి కల్పించము'' అని అన్నారు.

ఈ సందర్భంలోనే దేవుడు మహాప్రవక్త(స)పై "జిన్ సూరా (అధ్యాయం)'' అవతరింపజేశాడు. ఇది జిన్ సూరాలో "ఖుల్ ఊహియ ఇలయ్య అన్న హుస్తమఅ నఫ్రుఁమినల్ జిన్ని'' నుండి మొదలవుతుంది. ఇందులో జిన్నులకు సంబంధించిన విషయాలు అవతరించాయి.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 105 వ అధ్యాయం - అల్‌జహ్‌రి బిఖిరాఅతి సలాతిల్ ఫజ్ర్]

## 34వ అధ్యాయం - జుహ్ర్, అస్ర్ నమాజుల్లో ఖుర్‌ఆన్ పఠనం గురించి

260. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- దైవప్రవక్త (స) జుహ్ర్ నమాజ్ మొదటి రెండు రకాతులలో ఫాతిహా సూరా, ఆ తరువాత (ఒక్కొక్క రకాతులో ఒక సూరా చొప్పున) రెండు సూరాలు పఠించేవారు. మొదటి రకాతులో సుదీర్ఘ పారాయణం, రెండవ రకాతులో సంక్షిప్త పారాయణం చేసేవారు. ఒక్కోసారి ఒకటీ అరా సూక్తి (ఆయత్) మాకూ వినిపిస్తుండేది. అస్ర్ నమాజ్‌లో మొదటి రెండు రకాతులలో (ప్రతి రకాతులో) ఫాతిహా సూరా, ఆ తరువాత మరేదైనా ఒక సూరా పఠించేవారు. మొదటి రకాతులో మటుకు సుదీర్ఘ పారాయణం చేసేవారు. అలాగే ఫజ్ర్ నమాజులో కూడా మొదటి రకాతులో సుదీర్ఘ పారాయణం, రెండవ రకాతులో సంక్షిప్త పారాయణం చేసేవారు.

[సహీహ్ బుఖారీ: 10వ ప్రకరణం - అజాన్, 96వ అధ్యాయం - అల్ ఖిరాఅతి ఫిజ్జుహ్ర్]

261. హజ్రత్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం:- కూఫా ప్రజలు (ఖలీఫా) హజ్రత్ ఉమర్ (రజి) దగ్గర హజ్రత్ సాద్ (రజి)ని గురించి ఫిర్యాదు చేశారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ సాద్ (రజి)ని (గవర్నర్ పదవి నుంచి) తొలగించి, హజ్రత్ అమ్మార్ (రజి)ను కూఫా పాలకునిగా నియమించారు. కూఫా ప్రజలు చేసిన ఫిర్యాదులో హజ్రత్ సాద్ (రజి) నమాజ్ సరిగ్గా చేయించరనే విషయం కూడా ఉంది.

అందువల్ల హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ సాద్ (రజి)ని పిలిపించి "అబూ ఇస్‌హాఖ్! మీరు సరిగ్గా నమాజు చేయించడం లేదని వీరు ఆరోపిస్తున్నారు (దీనికి మీ సమాధానం ఏమిటి?)'' అని అడిగారు. హజ్రత్ సాద్ (రజి) సమాధానమిస్తూ "దైవసాక్షిగా చెబుతున్నాను. దైవప్రవక్త(స) ఏ విధంగా నమాజు చేయించేవారో నేను అదే విధంగా నమాజు చేయిస్తున్నాను. అందులో నేను ఎలాంటి లోటు రానివ్వడం లేదు. ఇషా నమాజు చేయిస్తున్నప్పుడు నేను మొదటి రెండు రకాతులలో సుదీర్ఘ పారాయణం, ఆ తరువాతి రెండు రకాతులలో సంక్షిప్త పారాయణం చేస్తున్నాను'' అని అన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "అబూ ఇస్‌హాఖ్! నేను మీ నుండి ఇలాంటి సమాధానమే ఆశించాను'' అని అన్నారు.

ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ సాద్ (రజి)పై వచ్చిన ఆరోపణలను గురించి విచారించడానికి ఆయన వెంట ఒక వ్యక్తిని లేదా కొందరు వ్యక్తులను కూఫా పంపించారు. ఆ వ్యక్తులు

కూఫాలోని ప్రతి మస్జిద్‌కు వెళ్ళి ప్రజలను విచారించారు. ప్రజలంతా హజ్రత్ సాద్ (రజి) గుణగణాలను ప్రశంసించారు. అయితే బనీ అబస్ పేట మస్జిద్‌లో (అబూ సాదా) ఉసామా బిన్ ఖతాదా అనే ఒక వ్యక్తి లేచి "మీరు మమ్మల్ని ప్రమాణం చేసి చెప్పమంటున్నారు గనక అసలు విషయం చెబుతున్నాను. హజ్రత్ సాద్ (రజి) సైనిక దళాలతో కలసి అసలు యుద్ధానికే పోరు. యుద్ధసొత్తు (మాలెగనీమత్)ను సమానంగా పంచరు. అలాగే వ్యవహార విచారణ చేస్తున్నప్పుడు న్యాయంగా తీర్పివ్వరు (పక్షపాతం వహిస్తారు)" అని అన్నారు.

ఈ మాటలకు హజ్రత్ సాద్ (రజి) (నిర్ఘాంతపోయి) "దేవదేవ! ఎంత దారుణం! ఈ ఆరోపణలను గురించి నిజానిజాలు తెలుసుకోవాలంటే నా దగ్గర ఒకే ఒక మార్గం ఉంది. నేను దేవుడ్ని ప్రార్థించి ఇతనికి మూడు శాపాలు పెడ్తాను. (ఇతను సత్యవంతుడయితే ఈ శాపాలకు గురికాకుండా ఉంటాడు)" అని అన్నారు. ఆ తరువాత "దేవా! నీ ఈ దాసుడు గనక అబద్ధాలకోరు అయి, పేరు ప్రతిష్ఠల కోసం ప్రాకులాడుతూ ప్రదర్శనా బుద్ధితో నా మీద ఇలాంటి అభాండాలు వేస్తుంటే ఇతనికి (1) సుదీర్ఘ వయస్సు ప్రసాదించు (2) దీర్ఘకాలంగా దారిద్ర్యంలో మగ్గి ఉండేలా చెయ్యి (3) ఇంకా ఇతన్ని పరీక్షలకు గురి చెయ్యి" అని ప్రార్థించారు ఆయన.

ఉల్లేఖకుని కథనం ప్రకారం ఆ తరువాత ఆ వ్యక్తిని అతని పరిస్థితి ఏమిటని అడిగినప్పుడు "ఏమని చెప్పను! నేను పరమ దౌర్భాగ్యుడ్ని, కష్టాలలో చిక్కుకున్న ముసలివాడ్ని. నాకు సాద్ (రజి) గారి శాపం తగిలింది" అని సమాధానమిచ్చేవాడు. హదీసు ఉల్లేఖకులలో అబ్దుల్ మాలిక్ (రహ్మాలై) అనే ఒక ఉల్లేఖకుడు ఇలా తెలియజేస్తున్నారు - "ఈ సంఘటన జరిగిన కొన్నేళ్ళకు నేనా వ్యక్తిని చూశాను. అప్పుడతను బాగా ముసలివాడయిపోయాడు. కనుబొమలు వ్రేలాడిపోయి అతని కళ్ళ మీద పడ్డాయి. దారిలో నిల్చొని వచ్చేపోయే అమ్మాయిలను అల్లరిపెడ్తూ, వారి చేత శాపనార్థాలు పెట్టించుకునేవాడు".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 95వ అధ్యాయం - వుజూ బిల్ ఖిరాతి లిల్ ఇమామి వల్ మామూమి ఫిస్సలాతి కుల్లిహా]

## 35వ అధ్యాయం - ఫజ్ర్, మగ్రిబ్ నమాజుల్లో ఖుర్‌ఆన్ పఠనం గురించి

262. హజ్రత్ అబూ బర్జా(రజి) కథనం:- మాలో ప్రతి వ్యక్తీ తన సహచరుడ్ని గుర్తు పట్టగలిగే అంత వెలుతురు వచ్చిన సమయంలో దైవప్రవక్త(స) ఫజ్ర్ నమాజు చేసేవారు. (ఈ నమాజులో) ఆయన అరవై నుండి వంద సూక్తుల దాకా ఖుర్‌ఆన్ పఠించేవారు. జుహర్ నమాజు సూర్యుడు నడి నెత్తిమీది నుండి కొంచెం వాలిన తరువాత, అస్ర్ నమాజు (నమాజు ముగించి) ఒక వ్యక్తి మదీనా పట్టణంలో ఈ చివరి నుండి ఆ చివరి వరకు నడచి వెళ్ళినా సూర్యుడు ఇంకా ప్రకాశిస్తూనే ఉండే వేళలో చేసేవారు. పోతే ఇషా నమాజు కోసం రాత్రి మూడింట ఒక వంతు గడచిపోయినా తప్పు లేదని భావించేవారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలా - 11వ అధ్యాయం - వఖ్తిజ్జుహ్రి ఇన్దజ్జవాల్]

263. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేను "వల్ ముర్సలాతి ఉర్ఫా" అనే సూరా పఠిస్తుంటే హజ్రత్ ఉమ్ముల్ ఫజల్ (రజి) విని ఇలా అన్నారు: "బాబూ! నువ్వీ సూరా పఠిస్తుంటే నాకో

విషయం గుర్తొస్తోంది. దైవప్రవక్త(స) నోట నేను చివరిసారిగా విన్న సూరా ఇదే. దైవప్రవక్త(స) దీన్ని మగ్రిబ్ నమాజులో పఠించారు.''

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 98వ అధ్యాయం - అల్‌ఖిరాతి ఫిల్ మగ్రిబ్]

264. హజ్రత్ జుబైర్ బిన్ ముత్‌ఇమ్ (రజి) కథనం:- నేను మగ్రిబ్ నమాజులో దైవప్రవక్త(స) 'అత్తూర్' సూరా పఠిస్తుండగా విన్నాను.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 99వ అధ్యాయం - అల్‌జహ్రి ఫిల్ మగ్రిబ్]

## 36వ అధ్యాయం - ఇషా నమాజులో ఖుర్‌ఆన్ పఠనం గురించి

265. హజ్రత్ బరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఒకసారి ప్రయాణావస్థలో ఉన్నప్పుడు ఇషా నమాజుకు చెందిన (మొదటి రెండు రకాతులలో) ఒక రకాతులో "వత్తీని వజ్జైతూన్'' అనే సూరా పఠించారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 100వ అధ్యాయం - అల్‌జహ్రి ఫిల్ ఇషా]

266. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) దైవప్రవక్త(స) వెనుక (ఇషా) నమాజు చేసి (ఇంటికి) వెళ్ళిపోయేవారు. వెళ్ళి తన తెగవారికి (ఇషా) నమాజు చేయించేవారు. ఒకసారి ఆయన (ఇషా) నమాజులో 'బఖరా' సూరా పఠించారు. అప్పుడు ఒక వ్యక్తి పంక్తి నుండి వేరయిపోయి విడిగా సంక్షిప్త నమాజు చేసి వెళ్ళిపోయాడు. హజ్రత్ ముఆజ్ (రజి)కు అతను చేసిన పని తెలిసి "నిస్సందేహంగా అతను కపట విశ్వాసి'' అని అన్నారు.

హజ్రత్ ముఆజ్(రజి) తనను కపట విశ్వాసి అన్నారని తెలుసుకున్న ఆ వ్యక్తి దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! మేము కూలినాలి చేసి బ్రతికే శ్రమ జీవులం. (పగలల్లా) ఒంటెల సహాయంతో నీళ్ళు తోడి మోసుకెళ్ళి పోస్తుంటాము. కాని హజ్రత్ ముఆజ్(రజి) గత రాత్రి (ఇషా) నమాజులో బఖరా సూరా (పూర్తిగా) పఠించారు. దాంతో నేను పంక్తి నుండి వేరయి ఒంటరిగా సంక్షిప్త నమాజు చేసుకొని వెళ్ళిపోయాను. దానిపై హజ్రత్ ముఆజ్ (రజి) నన్ను కపట విశ్వాసి అంటున్నారు'' అని ఫిర్యాదు చేశాడు. అప్పుడు దైవప్రవక్త(స) హజ్రత్ ముఆజ్ (రజి)ని పిలిచి "ఏమిటీ నీ సంగతి? జనాన్ని చిక్కుల్లో పడవేసి ధర్మం పట్ల వారికి వెగటు కలిగించదలిచావా?'' అని అన్నారు. ఈ మాట ఆయన మూడుసార్లు అన్నారు. ఆ తరువాత "వష్షమ్సి వఝ్ఝుహాహా, సబ్బిహిస్మ రబ్బికల్ ఆలా'' లాంటి (చిన్న) సూరాలు (సామూహిక నమాజులో) పఠిస్తూ ఉండు'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అల్ ఆదాబ్, 73వ అధ్యాయం - మల్లమ్ యర్ కఫార మన్‌ఖాల జాలిక ముతావలన్ అల్‌జాహిలన్]

## 37వ అధ్యాయం - ఇమామ్ ప్రజలకు భారం అన్పించని నమాజు చేయించాలి

267. హజ్రత్ అబూ మస్‌వూద్ అన్సారీ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! ఒక వ్యక్తి (సామూహిక నమాజులో) సుదీర్ఘ పారాయణం చేస్తుంటాడు. దాని వల్ల నేను ఫజ్ర్ వేళ సామూహిక నమాజులో పాల్గొనలేకపోతున్నాను'' అని ఫిర్యాదు చేశాడు. అప్పుడు దైవప్రవక్త

(స) ప్రజలను సంబోధిస్తూ "జనులారా! మీలో కొందరు ఇతరుల్ని ధర్మం పట్ల వెగటు కలిగించేవారు కూడా ఉన్నారు. అయితే ఒక విషయం గుర్తుంచుకోండి. మీలో ఇమామత్ (నమాజులో నాయకత్వం) బాధ్యతలు నిర్వహించేవారు నమాజ్‌ని క్లుప్తంగా చేయించాలి. ఎందుకంటే ఇమామ్ వెనుక నమాజు చేసేవారిలో వృద్ధులు, బలహీనులు, శ్రమజీవులు కూడా ఉంటారు" అని హితబోధ చేశారు. అప్పుడాయన ఇదివరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రులయి పోవడం నేను చూశాను.

**[సహీహ్ బుఖారీ : 93వ ప్రకరణం - అహ్‌కామ్, 13వ అధ్యాయం - హల్‌యఖ్ జిల్ హాకమ్ అవ్ యఫ్తీ వహువ గజబాన్]**

268. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు :- "నమాజుకు వచ్చే వారిలో బలహీనులు, వ్యాధిగ్రస్తులు, వృద్ధులు కూడా ఉంటారు. అందువల్ల ఇతరులకు నాయకత్వం వహించి నమాజు చేయించే వ్యక్తి (ఎవరికీ భారం అన్పించకుండా) సంక్షిప్తంగా నమాజు చేయించాలి. అతను ఒంటరిగా నమాజు చేసుకుంటున్నప్పుడు కావాలనుకుంటే ఎంత సుదీర్ఘంగానైనా నమాజు చేసుకోవచ్చు".

**[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 62వ అధ్యాయం - ఇజాసల్లాలినఫ్సిహీ ఫల్ యుతవ్విల్ మాషా]**

269. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) సంక్షిప్తంగా నమాజు చేయించేవారు. కాని అన్ని విధాలా ఆ నమాజు సంపూర్ణంగా ఉండేది.

**[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 64వ అధ్యాయం - అల్ ఏజాజి ఫిస్సలాతి వ ఇక్మాలిహా]**

270. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఎంతో సంక్షిప్తంగా సంపూర్ణంగా నమాజు చేయించేవారు. ఆ విధంగా మరెవరూ నమాజు చేయించడాన్ని నేను చూడలేదు. దైవప్రవక్త(స) ఎవరి బిడ్డయినా ఏడుస్తూ ఉండటం వింటే చాలు, ఆ బిడ్డ తల్లి ఎక్కడ కంగారుపడుతుందోనన్న భయంతో వెంటనే నమాజును మరింత సంక్షిప్తం చేసేవారు.

**[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 65వ అధ్యాయం - మన అఖఫ్ఫస్సలాత ఇన్ద బుకాయిస్సబియ్యి]**

271. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "నేను సుదీర్ఘ నమాజు చేయించాలని మొదట అనుకునేవాడ్ని. కాని ఆ తరువాత ఏదయినా బిడ్డ ఏడ్పు వినపడగానే దాన్ని సంక్షిప్తం చేస్తాను. బిడ్డ ఏడ్పు వల్ల ఆ బిడ్డ తల్లి కంగారుపడుతుందని నాకు తెలుసు."

**[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 65వ అధ్యాయం - మన్‌అఖఫ్ఫస్సలాత ఇన్ద బుకాయిస్సబియ్యి]**

## 38వ అధ్యాయం - నమాజులో సంతులనం, సంక్షిప్తం పాటించాలి

272. హజ్రత్ బరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) నమాజులో ఖియాం (నిలబడే పద్ధతి),ఖాయిదా (కూర్చునే పద్ధతి) తప్ప రుకూ (వంగటం), సజ్దా (సాష్టాంగపడటం), రెండు సజ్దాల మధ్య జల్సా (విరామ) స్థితి, రుకూ నుండి లేచి నిలబడే విరామం (ఖౌమా) వంటి అంశాలన్నిటి విషయంలో పాటించే సమయం సమానంగా ఉంటుంది.

**[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 121వ అధ్యాయం - హద్ది ఇత్మామి ర్రుకూయి వల్ ఏతెదాల్...]**

273. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) మాకు నాయకత్వం వహించి నమాజు చేయించడం

నేను చూశాను. అందువల్ల నేను మీకు నాయకత్వం వహించి అలాంటి నమాజునే చేయిస్తాను. అందులో ఎలాంటి కొరతా చేయను.

హదీసు ఉల్లేఖకుడు హజ్రత్ సాబిత్ (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు:- నమాజులో మీరు చేయనటువంటి ఒక పని హజ్రత్ అనస్ (రజి) చేయడం నేను చూశాను. ఆయన రుకూ నుండి లేచి చాలాసేపు నిల్చుంటారు. చూసేవారికి ఆయన సజ్దా చేయడం మరచిపోయారా అన్పిస్తుంది. అలాగే రెండు సజ్దాల మధ్య విరామ విషయంలో కూడా చూసేవారికి ఆయన రెండవ సజ్దా చేయడం మరచిపోయారా అన్పించేలా సుదీర్ఘ విరామం పాటిస్తారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 140 వ అధ్యాయం - అల్‌మక్సిబైనస్సజ్దతైన్]

## 39వ అధ్యాయం - ఇమామ్‌కు ముందు ఏ పనీ చేయకూడదు

274. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం:- మేము దైవప్రవక్త(స) వెనుక నమాజు చేస్తున్న సమయంలో ఆయన 'సమిఅల్లా హులిమన్ హమిదః' అని అన్నప్పుడు, ఆ తరువాత ఆయన తన నుదుటిని నేల మీద ఆనించనంతవరకు మాలో ఏ ఒక్కడూ నడుము వంచే వాడు కాదు (అంటే సజ్దా స్థితిలోకి పోవడానికి ప్రయత్నించేవాడు కాదన్న మాట).

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 133వ అధ్యాయం - అస్సుజూది అలా సబ్అతి ఆజుం]

## 42వ అధ్యాయం - రుకూ, సజ్దాలలో పఠించవలసిన విషయాలు

275. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రుకూ, సజ్దాలలో సాధారణంగా "సుబ్‌హానకల్లాహుమ్మ రబ్బనా వబిహమ్దిక అల్లాహుమ్మగ్ ఫిర్లీ" అనే మాటలు ఉచ్చరిస్తారు. ఈ విధంగా ఆయన ఖుర్‌ఆన్ ఆజ్ఞ ప్రకారం ఆచరించేవారు.★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 139వ అధ్యాయం - అత్తస్బీహి వద్దు ఆఫిస్సుజూద్]

## 44వ అధ్యాయం - సజ్దాలో పాటించవలసిన, పాటించకూడని విషయాలు

276. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- సజ్దా చేస్తున్నప్పుడు ఏడు అవయవాలు నేలమీద ఆనించాలని, శిరోజాలు, వస్త్రాలు దగ్గరికి లాక్కోరాదని దైవప్రవక్త(స)కు ఆజ్ఞ అయింది. ఆ ఏడు అవయవాలు ఇవి - (1) నుదురు, (2) రెండు (అర) చేతులు, (3) రెండు మోకాళ్ళు, (4) రెండు కాళ్ళు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 133వ అధ్యాయం - అస్సుజూది అలా సబ్ అతి ఆజుం]

## 46వ అధ్యాయం - సజ్దాలో మధ్యేమార్గం సరైన పద్ధతి

277. హజ్రత్ అబ్దుల్లా బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) సజ్దా స్థితిలో తమ రెండు చేతులు,

★ దివ్యఖుర్‌ఆన్‌లో "ఫసబ్బిహ్ బిహమ్ది రబ్బిక వస్తగ్ ఫిర్హు" (నీ ప్రభువు స్తోత్రంతో పాటు ఆయన పేరును స్మరించు, ఆయన సన్నిధిలో పాప మన్నింపు వేడుకో) అని ఉంది. (110:3)

రెండు ప్రక్కటెముకల మధ్య ఎంత ఎడం ఉంచే వారంటే, ఆ స్థితిలో ఆయన చంకల తెల్లదనం కన్పించేది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - అస్సలాత్, 27వ అధ్యాయం - యుబ్దీ జబ్ఐహి వయుజాఫీ ఫిస్సుజూద్]

## 47వ అధ్యాయం - 'సుత్రా' ఆవశ్యకత

278. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- పండుగరోజు దైవప్రవక్త(స) నమాజు కోసం (ఊరు) వెలుపలికి వెళ్ళినప్పుడు ఆయన ఆజ్ఞతో ఆయన ముందు ఒక బల్లెం పాతడం జరిగేది. దాని ఆసరాతో దైవప్రవక్త(స) నమాజు చేసేవారు. మిగిలిన వారంతా ఆయన వెనుక ఉండేవారు. ప్రయాణావస్థలో కూడా దైవప్రవక్త(స) ఇలాగే (బల్లెం పాతి దాని ముందు నమాజు) చేసేవారు. ఈ కారణంగానే (ఇతర) నాయకులు (కూడా) ఇదే పద్ధతి అవలంబించారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 90వ అధ్యాయం - సుత్రతుల్ ఇమామి సుత్రతు మన్ ఖల్ఫ]

279. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) తన ఒంటెను ఎదురుగా కూర్చోబెట్టి దాని ఆసరాతో నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 98వ అధ్యాయం - అస్సలాతు ఇలర్రాహిలతి వల్ బయీరి నష్షజర్ వ ర్రజుల్]

280. హజ్రత్ అబూ హుజైఫా (రజి) కథనం:- నేనొకసారి హజ్రత్ బిలాల్ (రజి) అజాన్ చెబుతుంటే విన్నాను. ఆయన అజాన్ చెబుతున్నప్పుడు ముఖాన్ని అటూ ఇటూ తిప్పేవారు. ఆయనతో పాటు నేను కూడా ఆయన ముఖం ఎటు తిప్పితే అటు చూసేవాడ్ని.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 19వ అధ్యాయం - హల్ యతతబ్బవుల్ ముఅజ్జిను ఫాహుహా హునా వహాహునా]

281. హజ్రత్ అబూ హుజైఫా (రజి) కథనం:- నేనొకసారి (మక్కాలో) దైవప్రవక్త(స) ఎర్ర చర్మపు గుడారంలో కూర్చొని ఉండటం చూశాను. అప్పుడు హజ్రత్ బిలాల్ (రజి) దైవప్రవక్త(స) వుజూ చేయగా మిగిలిపోయిన నీటిని తీసుకు వచ్చారు. ఆ నీటి కోసం జనం ఎగబడ్డారు. ఎవరికి ఏ కొద్దిపాటి నీరు దొరికినా ఆ నీటిని ముఖం మీద పులుముకునేవారు. ఏ మాత్రం నీళ్ళు దొరకని వాళ్ళు తమ స్నేహితుల తడి చేతుల్ని తీసుకొని ముఖానికి రాసుకునేవారు.

ఆ తరువాత చూస్తే హజ్రత్ బిలాల్ (రజి) ఒక ఈటెను నేలమీద పాతారు. దైవప్రవక్త(స) అరుణ వస్త్రాలు ధరించి, క్రిందికి వ్రేలాడుతున్న అంగవస్త్రాన్ని మడిమలపైకెత్తి పట్టుకొని బయటికి వచ్చారు. అలా వచ్చి ఈటె ముందు నిల్చొని రెండు రకాతులు నమాజు చేయించారు. ఆ తరువాత చూస్తే ఈటె అవతలి వైపు నుండి ప్రజలు, పశువులు నడచిపోవడం కన్పించింది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 17వ అధ్యాయం - అస్సలాతి ఫిస్సౌబిల్ అహ్మర్]

282. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి 'మినా' ప్రాంతంలో ఎలాంటి ఆసరా లేకుండానే (ఆరు బయట మైదానంలో) నమాజు చేయసాగారు. నేను గాడిద మీద

ముందువైపు నుంచి వచ్చి దిగాను. గాడిదను మేయడానికి వదిలేసి నేను పంక్తి ముందు నుంచి నడచివెళ్ళి నమాజీల సమూహంలో చేరిపోయాను. అది నేను నవ యౌవనంలో అడుగు పెడుతుండిన కాలం. (అయినప్పటికీ) దైవప్రవక్త(స) నేను చేసిన ఈ పనిని విమర్శించలేదు.

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 18వ అధ్యాయం - మతాయసిహ్హు సిమావుస్సగీర్]

## 48వ అధ్యాయం - నమాజు చేస్తున్న వారి ముందు నుండి వెళ్ళకూడదు

283. హజ్రత్ అబూ సాలిహ్ సమ్మాన్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) ఓసారి శుక్రవారం నాడు జనావాసానికి దూరంగా వెళ్ళి ఒక వస్తువుని ఆసరాగా చేసుకొని ఒంటరిగా నమాజు చేస్తుంటే నేను చూశాను. అంతలో అబూ ముయీత్ సంతానంలో ఒక యువకుడు ఆయన ముందు నుంచి వెళ్ళడానికి ప్రయత్నించాడు. అయితే హజ్రత్ అబూ సయీద్ (రజి) అతని ఛాతీ మీద చేత్తో ఓ దెబ్బ చరిచారు. ఆ యువకుడు (అటూ ఇటూ) చూశాడు. కాని హజ్రత్ అబూసయీద్ (రజి) ముందు నుంచి వెళ్ళడం తప్ప మరో మార్గం కన్పించకపోవడంతో అతను మరోసారి ఆయన ముందు నుండి వెళ్ళడానికి ప్రయత్నించాడు. అప్పుడు హజ్రత్ అబూ సయీద్ (రజి) అతని ఛాతీ మీద అంతకు ముందుకంటే గట్టిగా చరిచి వెనక్కి నెట్టారు. దాంతో ఆ యువకుడు హజ్రత్ అబూ సయీద్ (రజి) మీద మండి పడి ఏవేవో కూశాడు.

ఆ తరువాత అతను (మదీనా గవర్నర్) మర్వాన్ దగ్గరికెళ్ళి దీన్ని గురించి ఫిర్యాదు చేశాడు. హజ్రత్ అబూ సయీద్ (రజి) కూడా అతని వెనకాలే బయలుదేరి మర్వాన్ దగ్గరకు చేరుకున్నారు. మర్వాన్ ఆయన్ని చూడగానే "మీకూ, మీ సోదరుని కొడుకు మధ్య ఈ గొడవేమిటి?" అని అడిగారు. దానికి హజ్రత్ అబూ సయీద్ (రజి) ఇలా సమాధానమిచ్చారు:-

దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు: "ఒక వ్యక్తి ఏదైనా వస్తువుని ఆసరాగా చేసుకొని నమాజు చేస్తున్నప్పుడు ఇతరులెవరైనా అతని ముందు నుంచి వెళ్ళడానికి ప్రయత్నిస్తే అతడ్ని నమాజు చేసే వ్యక్తి (చేత్తో) కొట్టి నెట్టివేయాలి. అయినా అతను తన వైఖరి మార్చుకోకపోతే అతను షైతాన్ అని గ్రహించి అతనితో పోరాడాలి."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 100వ అధ్యాయం - యరద్దుల్ ముసల్లీ మఁ మ్మర బైనయదైహి]

284. హజ్రత్ బసర్ బిన్ సయీద్ (రహ్మాలై) కథనం:- జైద్ బిన్ ఖాలిద్ నన్ను హజ్రత్ అబూ జుహైమ్ (రజి) దగ్గరకు పంపించి, నమాజీ ముందు నుంచి వెళ్ళే వ్యక్తి గురించి ఆయన దైవప్రవక్త(స) నోట ఏం విన్నారో తెలుసుకొని రమ్మన్నారు. హజ్రత్ అబూ జుహైమ్ (రజి) దగ్గరికి వెళ్తే ఆయన ప్రవక్త ప్రవచనాన్ని ఈ విధంగా తెలిపారు :-

"నమాజు చేస్తున్న వ్యక్తి ముందు నుంచి వెళ్తే ఎంత పాపమో తెలిసి ఉంటే, మనిషి అలాంటి చర్యకు పాల్పడడానికి బదులు నలభై (సంవత్సరాలు, నెలలు, రోజుల పాటు - ఉల్లేఖకునికి ఎంత కాలమో సరిగా గుర్తులేదు) వరకు నిలబడి ఉండటం ఎంతో మేలని భావిస్తాడు."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 101 వ అధ్యాయం - ఇస్మిల్ మర్రిబైన యదయిల్ ముసల్లీ]

## 49వ అధ్యాయం - నమాజీకి, ఆసరా వస్తువుకు మధ్య ఎంత ఎడం ఉండాలి?

285. హజ్రత్ సహల్ బిన్ సాద్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) నమాజు కోసం ఎక్కడ నిల్చుంటారో అక్కడ్నుంచి ఆయన ఎదురుగా ఉండే గోడ (లేక మరేదైనా అడ్డు వస్తువు) వరకు ఒక మేక దూరగలిగే అంత సందు మాత్రమే ఉంటుంది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 91వ అధ్యాయం - ఖద్రికుమ్ యంబగి అఁయ్యకూన బైనల్ ముసల్లీ వస్సుత్రా]

286. హజ్రత్ సల్మా (రజి) కథనం:- ప్రవక్త మస్జిదు (ఖిబ్లా వైపున్న) గోడకు వేదిక (మెంబర్) దగ్గరగా ఉంది. (ఆ గోడకు వేదికకు మధ్య) ఒక మేక దూరిపోగల ఖాళీ మాత్రమే ఉంది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - 91వ అధ్యాయం - ఖద్రికుమ్ యంబగి అఁయ్యకూన బైనల్ ముసల్లీ వస్సుత్రా]

287. హజ్రత్ యజీద్ బిన్ అబూ ఉబైద్( రహ్మాలై) కథనం:- నేను (తరచుగా) హజ్రత్ సలమా బిన్ అకూ (రజి) వెంట ప్రవక్త మస్జిదుకు వెళ్తుండేవాడ్ని. ఆయన దివ్యఖుర్‌ఆన్ ఉంచబడిన స్తంభం దగ్గర నమాజు చేసేవారు. నేనొకసారి (అందులో ఉన్న ఆంతర్యం ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలంతో) "అబూ సలీం (రజి)! మీరీ స్తంభం దగ్గరే నమాజు చేయడానికి ప్రయత్నిస్తున్నారు (కారణం ఏమిటి)?" అని అడిగాను. దానికాయన సమాధానమిస్తూ "దైవప్రవక్త (స) కూడా ఈ స్తంభం దగ్గరే నమాజు చేయడానికి ప్రయత్నించేవారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 95వ అధ్యాయం - అస్సలాతు ఇలల్ ఉస్తువానత్]

## 51వ అధ్యాయం - నమాజు చేసే వ్యక్తి ముందు పడుకోవచ్చు

288. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇంట్లో నమాజు చేస్తున్నప్పుడు నేను ఆయన ముందు ఖిబ్లా వైపు శవపేటిక ఉంచబడే తీరులో నేలమీద పడుకుని ఉండేదానిని.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 22వ అధ్యాయం - అస్సలాతు అలల్ ఫర్ష్]

289. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (స) నమాజు చేస్తున్నప్పుడు నేను ఆయన పడక మీద అడ్డంగా పడి నిద్రపోయేదాన్ని. (కాస్సేపటికి) ఆయన వితర్ నమాజు చేయదలచుకున్నప్పుడు నన్ను నిద్రలేపేవారు. లేచి నేను కూడా వితర్ నమాజు చేసేదాన్ని.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 103వ అధ్యాయం - అస్సలాతి ఖల్ఫన్నాయిమ్]

290. హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై) కథనం:- నమాజు చేసే వ్యక్తి ముందు నుంచి కుక్కగాని, గాడిదగాని, స్త్రీగాని వెళ్ళడం జరిగితే అతని నమాజు భంగమయిపోతుంది అనే విషయం హజ్రత్ ఆయిషా (రజి) ముందు ప్రస్తావించబడింది. హజ్రత్ ఆయిషా (రజి) ఆ మాట విని "ఏమిటీ, మీరు మమ్మల్ని (స్త్రీలను) కుక్కలు, గాడిదలతో పోల్చుతున్నారా!? వినండి, దైవసాక్షిగా చెబుతున్నాను. దైవప్రవక్త(స) నమాజు చేస్తున్నప్పుడు, నేను ఆయన ముందు ఖిబ్లా వైపు బల్లమీద పడుకొని ఉండేదాన్ని. తరువాత నాకేదయినా పనిబడితే, నేను లేచి కూర్చొని ఆయనకు బాధ కలిగించడం భావ్యం కాదని తలచి,

పడుకున్న స్థితిలోనే మెల్లిగా కాళ్ళవైపు నుంచి జారుకునేదాన్ని."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 105వ అధ్యాయం - మన్ఖాల లాయఖ్ఖువుస్సలాతసైవున్]

291. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మీరు మమ్మల్ని (స్త్రీలను) కుక్కలు, గాడిదలతో కలిపేశారా! కాని (అసలు విషయం వినండి) నేను బల్లమీద పడుకొని ఉన్నప్పుడు, దైవప్రవక్త(సల్లం) వచ్చి ఆ బల్ల ముందు నిలబడి నమాజు చేసేవారు. నేనిలా ఆయన కెదురుగా పడుకొని ఉండటం (ఆయన పట్ల) అపచారమని భావించేదాన్ని. అందువల్ల నేను పడుకున్న స్థితిలోనే కాళ్ళ వైపున జరుగుతూ, దుప్పటి నుంచి బయటపడేదాన్ని.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 99వ అధ్యాయం - అస్సలాతి ఇలస్సరీర్]

292. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (నమాజు చేస్తూ ఉన్నప్పుడు ఆయన) ఎదురుగా నేను పడుకొని ఉండేదాన్ని. అప్పుడు నా కాళ్ళు ఆయన ముందు ఖిబ్లావైపు, ఆయన సజ్దా చేసే చోట ఉండేవి. ఆయన సజ్దా చేయడానికి ఉపక్రమిస్తూ నా కాళ్ళను తాకేవారు. నేనప్పుడు నా కాళ్ళను ముడుచుకునేదాన్ని. ఆయన సజ్దా నుండి లేచి నిలబడగానే నేను యథాప్రకారం కాళ్ళు చాపుకునేదాన్ని. ఆ రోజుల్లో మేము ఇండ్లలో దీపాలు వెలిగించే వాళ్ళము కాము.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 104 వ అధ్యాయం - అత్తతవ్వా ఖల్ఫల్ మర్అతి]

293. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నమాజు చేస్తూ ఉన్నప్పుడు నేను ఆయన ముందు (పడుకొని లేదా కూర్చొని) ఉండెదాన్ని. అప్పుడు నేను (ఒక్కోసారి) బహిష్టు అయి కూడా ఉండేదాన్ని. అదీగాక దైవప్రవక్త(సల్లం) సజ్దా చేస్తున్నప్పుడు (ఒక్కోసారి) ఆయన దుస్తులు నాకు తగులుతుండేవి కూడా.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 19వ అధ్యాయం - ఇజా అసాబ సౌబుల్ ముసల్లి అమ్రాతహు]

## 52వ అధ్యాయం - ఒకే అంగవస్త్రంతో నమాజు చేయడం గురించి

294. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "ఒక బట్ట మాత్రమే కట్టుకొని నమాజు చేయవచ్చా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "మరి మీలో ప్రతి ఒక్కరి దగ్గర రెండేసి బట్టలు ఉన్నాయా?" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 4వ అధ్యాయం - అస్సలాతి ఫిస్సౌబిల్ వాహిది ముల్తహిఫా]

295. హజ్రత్ అబూహురైరా( రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఒక్క బట్ట మాత్రమే ఉండి దాంతో నమాజు చేయదలచిన వ్యక్తి భుజమ్మీద (కాస్తయినా) ఆచ్ఛాదన లేకుండా

---

★ ఆనాడు అనేక మంది సహాబీల దగ్గర ఒక కట్టు వస్త్రం మాత్రమే ఉండేది. అందువల్ల ఒక వస్త్రం కట్టుకున్నా నమాజు నెరవేరుతుందని అనుమతి లభించింది. కనుక ఈ సమస్యపై ఎలాంటి భిన్నాభిప్రాయాలు లేవు. దీంతో విభేదిస్తూ హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) నుండి ఉల్లేఖించబడినట్లు ఉన్న హదీసుకు సరైన ఆధారం లేదు. అయితే రెండు వస్త్రాలు కట్టుకొని నమాజు చేయడం చాలా మంచిది అనే విషయంలో ఏకాభిప్రాయం ఉంది.

నమాజు చేయకూడదు."★

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 5వ అధ్యాయం - ఇజాసల్లా ఫిస్సౌబిల్ వాహిది ఫల్‌యజ్ అల్ అలా ఆతిఖైహి)

296. హజ్రత్ ఉమర్ బిన్ అబూసల్మా(రజి) కథనం:- నేనొక సారి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) గారి ఇంట్లో దైవప్రవక్త (సల్లం) ఒక వస్త్రం మాత్రమే కట్టుకొని నమాజు చేస్తూ ఉంటే చూశాను. అప్పుడు ఆ వస్త్రం చెరుగులు రెండూ ఆయన భుజమ్మీద (కట్టబడి) ఉన్నాయి.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 4వ అధ్యాయం - అస్సలాతి ఫిస్సౌబిల్ వాహిది ముల్తహిఫా]

297. హజ్రత్ ముహమ్మద్ బిన్ మున్కదిర్ (రహ్మాలై) కథనం:- నేనొకసారి హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) ఒక్క బట్ట మాత్రమే ధరించి నమాజు చేస్తూ వుంటే చూశాను. ఆ తరువాత ఆయన మాట్లాడుతూ "దైవప్రవక్త (సల్లం) కూడ (ఇలా) ఒక్క అంగవస్త్రంతో నమాజు చేస్తుండగా నేను చూశాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 3వ అధ్యాయం - అఖిల్ ఇజారి అలల్ ఖఫాఫిస్సలాత్)

★ భుజం మీద బట్టలేకపోతే 'సతర్' భాగం బయటపడే ప్రమాదం ఉంది. ఇమామ్ అబూ హనీఫా, ఇమామ్ షాఫయి, ఇమామ్ మాలిక్ (రహ్మాలై)ల ప్రకారం భుజం మీద వస్త్రం లేకుండా నమాజు చేస్తే ఆ నమాజ్ మక్రూహ్ (అవాంఛనీయం) అవుతుంది. బాతిల్ కాదు (అంటే చెడిపోదు). ఇమామ్ అహ్మద్ (రహ్మాలై) ప్రకారం అవకాశం ఉన్నప్పటికీ భుజం మీద వస్త్రం లేకుండా నమాజు చేస్తే అది సరికాదు. నమాజు విధి నెరవేరుతుంది గాని, అలా చేయడం పాపమవుతుందని ఆయన ఒక సందర్భంలో అన్నారు.

# ప్రార్థనా స్థలాల ప్రకరణం

298. హజ్రత్ అబూజర్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (స)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! ప్రపంచంలో అన్నిటి కంటే ముందు నిర్మించబడిన మస్జిద్ ఏది?" అని అడిగాను. దానికాయన "మస్జిదుల్ హరాం (కాబా గృహం)" అని సమాధానమిచ్చారు. "ఆ తరువాత ఏది?" అని నేను మళ్ళీ అడిగాను. "బైతుల్ మఖ్దిస్" అన్నారు ఆయన. "అయితే ఈ రెండిటి నిర్మాణాల మధ్య ఎంత వ్యవధి ఉంది?" అని తిరిగి ప్రశ్నించాను. "నలభై ఏళ్ళ"ని ఆయన సమాధానమిచ్చారు. ఆ తరువాత "కాల చక్రం నిన్ను ఏ చోటుకు తెస్తే ఆ చోటనే (వేళకు) నమాజు చెయ్యి. అదే శ్రేష్ఠమైన పని" అని హితవు చేశారు ఆయన.(1)

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా.... అధ్యాయం ]

299. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు:- నాకు పూర్వం ఏ దైవప్రవక్తకూ ప్రసాదించబడని ఐదు ప్రత్యేకతలు ప్రసాదించబడ్డాయి. (1) నా గాంభీర్యానికి శత్రువులు ఒక నెల ప్రయాణపు దూరం నుండే భయపడిపోయేలా దేవుడు నాకు సహాయం చేస్తున్నాడు. (2) నా కోసం యావత్తు భూమండలం ప్రార్థనా స్థలంగా, పరిశుద్ధ పరిచే వస్తువుగా చేయబడింది. అందువల్ల నా అనుచర సమాజంలోని ప్రతి వ్యక్తీ ఏ చోటున ఉంటే ఆ చోటునే వేళయినప్పుడు నమాజు చేసుకోవచ్చు. (3) నా కోసం యుద్ధప్రాప్తి (మాలె గనీమత్)ను వాడుకోవడం ధర్మసమ్మతం చేయబడింది. (4) ఇతర దైవప్రవక్తలందరూ తమ తమ జాతుల కోసం మాత్రమే ప్రత్యేకించబడగా, నేను యావత్తు మానవాళి కోసం దైవప్రవక్తగా పంపబడ్డాను. (5) నాకు (పరలోక తీర్పుదినాన సాధారణ) సిఫారసు(2) చేసే అధికారం ఇవ్వబడింది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 56వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి.... జు ఇలత్ లియల్ అర్జుకుల్లహ మస్జిదన్ వ తహూర]

300. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- "నాకు సంక్షిప్త పదాలతో విస్తృత భావం కలిగి వున్న (ఖుర్ఆన్) వాణి ప్రసాదించబడింది. (నా గురించి విని శత్రువుల గుండెల్లో గుబులు పుట్టేలా) నాకు గాంభీర్యత నిచ్చి సహాయం చేయబడింది. ఓ రోజు

---

(1) అంటే, నిషిద్ధ ప్రదేశాల్లో తప్ప మరెక్కడయినా వేళకాగానే ఆలస్యం చేయకుండా నమాజు చేయడం ఉత్తమం అని అర్థం. నిషిద్ధ ప్రదేశాలు అంటే శ్మశానం, భవన నిర్మాణ సామగ్రి ఉండే ప్రదేశాలు, పేడ కసువు ఉండే పశువుల కొట్టాలు, మార్గాలు, మలిన ప్రదేశాలు, స్నానాల దొడ్లు మొదలగునవి.

(2) ఇక్కడ సిఫారసు అంటే, హష్ర్ మైదానంలో మానవులంతా తీవ్ర ఆందోళనకు గురి అయినపుడు చేసే సాధారణ సిఫారసు అని అర్థం. అప్పుడు ఇతర ప్రవక్తలందరూ ప్రజలను నిరాశపరుస్తారు. అయితే ఇతర సందర్భాలలో ప్రత్యేక సిఫార్సు ప్రవక్తలు, సజ్జనులు కూడా చేస్తారు.
లేదా ఇక్కడ సిఫార్సు అంటే రద్దు కానటువంటి సిఫార్సు గాని, అణుమాత్రం విశ్వాసమున్న వారికి సయితం ప్రయోజనం చేకూర్చే సిఫార్సు గానీ అయి ఉంటుంది.

నేను నిద్రపోతూంటే (కలలో) నా చేతికి ప్రపంచంలోని సిరిసంపదలు, నిక్షేపాలకు సంబంధించిన తాళపు చెవులు అందించబడ్డాయి".

హజ్రత్ అబూహురైరా (రజి) ఈ హదీసు ఉల్లేఖించిన తర్వాత "దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోయిన తరువాత ఇప్పుడు మీరా సిరిసంపదలు, నిక్షేపాలు హస్తగతం చేసుకుంటున్నారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 122వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి.... నుసిర్తు బిర్రూబి....]

## 1వ అధ్యాయం - మస్జిదె నబవీ (నిర్మాణం) గురించి

301. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మదీనా వచ్చిన తరువాత బనీ ఉమర్ బిన్ ఔఫ్ వాడలో విడిది చేశారు. అక్కడ పద్నాలుగు రోజులు ఉన్నారు. తర్వాత ఆయన బనీనజ్జార్ తెగవాళ్ళను పిలిపించారు. వారు తమ ఖడ్గాలు ధరించి వచ్చారు.

ఆ దృశ్యం ఇప్పటికీ నా దృష్టి పథంలో మెదలుతోంది. దైవప్రవక్త (సల్లం) ఒంటె ఎక్కి కూర్చున్నారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఆయన వెనుక కూర్చున్నారు. బనూ నజ్జార్ తెగనాయకులు ఆయన చుట్టూ నిలబడి ఉన్నారు. (ఈ విధంగా బయలుదేరి) చివరికి అబూ అయ్యూబ్ (రజి) గారి ఇంటి ముందు దిగారు. ఎక్కడ నమాజు వేళయితే అక్కడే నమాజు చేయడమంటే దైవప్రవక్త(సల్లం)కు ఎంతో ఇష్టం. ఆ రోజులలో ఆయన మేకల కొట్టంలో కూడా నమాజు చేసేవారు. ఆ తరువాత మస్జిదు నిర్మించడానికి పూనుకున్నారు. దీని కోసం ఆయన బనీనజ్జార్ తెగ మనుషులను పిలిపించి "బనీనజ్జార్ (సోదరులారా!) మీరీ తోటను నాకు అమ్మివేయండి" అని అన్నారు. దానికి వారు "దైవసాక్షి! మేమీ తోట ధరను మీ నుండి వసూలు చేయము. దీని ప్రతిఫలాన్ని మేము దేవుని నుండి తీసుకోదలిచాము" అని అన్నారు.

హజ్రత్ అనస్ (రజి) ఇలా వివరిస్తున్నారు: ఆ తోటలో ఏమేమి ఉన్నాయో చెబుతాను వినండి. అక్కడ బహు దైవారాధకుల సమాధులు, కొన్ని శిథిలమయిపోయిన ఇండ్లు, కొన్ని ఖర్జూర చెట్లు ఉన్నాయి. అందువల్ల దైవప్రవక్త(సల్లం) ఆదేశంతో ఆయన అనుచరులు ఆ సమాధుల్ని తొలగించి, శిథిల గృహాలను నేలమట్టం చేశారు. ఖర్జూర చెట్లను నరికి, వాటి మొదళ్ళను కాబా దిక్కున పేర్చి పెట్టారు. వాటి రెండు వైపులా రాళ్ళు నిలబెట్టి తలుపు మాదిరిగా చేశారు. అనుచరులు (రజి) రాళ్ళు మోస్తూ వుంటే, దైవప్రవక్త(సల్లం) కూడా వారితో పాటు ఆ పని చేస్తూ "దేవా! పరలోక శ్రేయస్సే నిజమైన శ్రేయస్సు. అందువల్ల (వలస వచ్చిన) ముహాజిర్‌లను, (వారిని ఆదుకున్న) అన్సారులను ఉభయుల్ని మన్నించు" అని కవితా రూపంలో ప్రార్థన చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 48వ అధ్యాయం - హల్‌తంభిషు ఖుబూరు ముష్రికిల్ జాహిలియ్యాతి వయత్తఖిజు మకానుహా మసాజిద్]

## 2వ అధ్యాయం - ఆరాధన కేంద్ర దిశ (ఖిబ్లా) నిర్ణయం

302. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (మదీనా వచ్చిన తరువాత) పదహారు,

పదిహేడు మాసాల వరకు బైతుల్ మఖ్దిస్ వైపు తిరిగి నమాజు చేశారు. అయితే కాబా గృహం వైపు తిరిగి నమాజు చేయాలని ఆయన మనసు ఆరాటపడసాగింది. దాంతో దేవుడు "నీ ముఖాన్ని మాటి మాటికీ ఆకాశం వైపు ఎత్తడాన్ని మేము చూస్తున్నాము...... " అనే సూక్తిని అవతరింపజేశాడు. ఈ సూక్తి అవతరించిన తరువాత దైవప్రవక్త (స) కాబా వైపు తిరిగి నమాజు చేయడం ప్రారంభించారు.

బుద్ధిహీనులు, అంటే యూదులు (ఈ మార్పు పట్ల విస్తుబోయి) "ఏమయింది వీరికి, నిన్నటిదాకా ఒక దిక్కుకు తిరిగి ప్రార్థన చేస్తూ ఉండిన వీరు ఈ రోజు హఠాత్తుగా మరో దిక్కుకు మరలారు?" అని అంటారు. ప్రవక్తా! వారికిలా చెప్పు - "తూర్పు పడమరలు అన్నీ దేవుని దిక్కులే. ఆయన తాను తలచిన వారికి సన్మార్గం చూపుతాడు." (దివ్యఖుర్ఆన్ - 2:142)

ఈ ఆజ్ఞ వచ్చిన తరువాత ఒక వ్యక్తి దైవప్రవక్త(స)తో పాటు (జుహర్) నమాజు చేసిన తరువాత ఎక్కడికో బయలుదేరాడు. అస్ర్ నమాజ్ వేళకు అతను అన్సార్ తెగ వాడ మీదుగా ముందుకు సాగాడు. అయితే అక్కడ (అన్సార్) ప్రజలు బైతుల్ మఖ్దిస్ వైపు తిరిగి నమాజు చేస్తూ ఉండటం చూసి "నేను (ఇంతకు క్రితమే) దైవప్రవక్త(స)తో కలసి నమాజు చేశానని సాక్ష్యమిస్తున్నాను. అప్పుడాయన తన దిశను కాబా వైపుకు మరల్చుకున్నారు" అని బిగ్గరగా చెప్పాడు. ఈ మాట వినగానే అందరూ తమ దిశను కాబా వైపుకు మరల్చుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 31వ అధ్యాయం - అత్తవజ్జుహి నహ్ వల్ ఖిబ్లతి హైసుకాన]

303. హజ్రత్ బరా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (స) వెనుక పదహారు, పదిహేడు మాసాల వరకు బైతుల్ మఖ్దిస్ వైపు తిరిగి నమాజు చేశాము. ఆ తరువాత ప్రస్తుత ఖిబ్లా (కాబా) వైపుకు తిరిగి నమాజు చేయాలని ఆజ్ఞ అయింది.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, బఖరా సూరా, 18వ అధ్యాయం - వలికుల్లి వ్విజ్ హతున్హువ మువల్లీహా]

304. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- ప్రజలు ఓ రోజు ఖుబా మస్జిదులో ప్రాతఃకాల ప్రార్థన చేస్తూ ఉంటే ఒక వ్యక్తి వచ్చి "రాత్రి దైవప్రవక్త(స)పై ఓ ఖుర్ఆన్ సూక్తి అవతరించింది. అందులో మన ప్రార్థన దిశను కాబా వైపుకు మార్చుకోవాలని ఆజ్ఞ జారీ అయ్యింది" అని తెలియజేశాడు. ఈ మాట వినగానే వారంతా తమ ప్రార్థనా దిశను 'కాబా' వైపుకు మార్చుకున్నారు. అంతకు ముందు వారు సిరియా (బైతుల్ మఖ్దిస్) వైపు తిరిగి నమాజు చేస్తూ ఉన్నారు. ఈ ఆజ్ఞ వినగానే అందరూ (నమాజు స్థితిలోనే) తమ దిశను కాబా వైపుకు మరల్చుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 32వ అధ్యాయం - మాజాఫిల్ ఖిబ్లా]

## 3వ అధ్యాయం - సమాధులపై మస్జిద్ నిర్మించరాదు

305. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- విశ్వాసుల మాతృమూర్తులు హజ్రత్ ఉమ్మె హబీబా (రజి), హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)లు అబిసీనియాలోని ఒక చర్చిలో కొన్ని విగ్రహాలు ఉండటం చూసి వాటిని గురించి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించారు. దానిపై దైవప్రవక్త(సల్లం) ఇలా వ్యాఖ్యానించారు: "వారిలో (అంటే యూదులు, క్రైస్తవులలో) ఎవరైనా సత్పురుషుడు చనిపోతే

అతని సమాధిపై వారు ప్రార్థనా మందిరాన్ని నిర్మిస్తారు. ఆ ప్రార్థనా మందిరంలో ఇలాంటి విగ్రహాలు తయారు చేసి ప్రతిష్ఠిస్తారు. వారిలో ఇదొక సంప్రదాయమయిపోయింది. అయితే వారు ప్రళయ దినాన దేవుని దగ్గర యావత్తు సృష్టిలో అత్యంత నీచమైన వాళ్ళుగా పరిగణించబడతారు."

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 48వ అధ్యాయం - హల్‌తుం బషు ఖుబూరు ముష్రికిల్ జాహిలియ్య]

306. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తమ మరణానికి కారణమయిన వ్యాధికి గురయిన రోజుల్లో "యూదులు క్రైస్తవులు తమ ప్రవక్తల సమాధుల్ని ప్రార్థనా స్థలాలుగా చేసుకున్నారు. దేవుడు వారిని శపించుగాక" అని అన్నారు.

ఈ హదీసు తెల్పిన తరువాత హజ్రత్ ఆయిషా (రజి) దానిపై ఇలా వ్యాఖ్యానించారు: "దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించి ఉండకపోతే ఆయన సమాధి (ప్రజల దర్శనార్థం ఎలాంటి కట్టడి లేకుండా) తెరిచి ఉంచబడేది. అంతేకాదు అది (కొంతకాలానికి) ప్రార్థనా స్థలంగా కూడ మారిపోవచ్చని నా భయం".

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 62వ అధ్యాయం - మా యుక్రహు మిన్ ఇత్తిఖాజి మసాజిద్ అలల్ ఖుబూర్]

307. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "యూదులు, క్రైస్తవులు తమ ప్రవక్తల సమాధుల్ని ప్రార్థనా స్థలాలుగా చేసుకున్నారు. దేవుడు వారిని నాశనం చేయుగాక!"

[సహీహ్‌బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 55వ అధ్యాయం - హద్దసనా అబూ యమాన్]

308. హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)ల కథనం:- దైవప్రవక్త (సల్లం)కు మరణ సమయం ఆసన్నమయినపుడు ఆయన పరిస్థితి చాలా దుర్భరంగా మారిపోయింది. ఒక్కోసారి ఆయన తన దుప్పటిని ముఖం మీదికి లాగుకునేవారు. కాస్సేపటికి ఊపిరి ఆడకపోవడంతో ముఖం మీది దుప్పటిని తొలగించి వేసేవారు. అలాంటి స్థితిలో సయితం ఆయన (సమాధి పూజలను శపిస్తూ) "యూదులు, క్రైస్తవులు తమ ప్రవక్తల సమాధుల్ని ప్రార్థనా స్థలాలుగా చేసుకున్నారు. దేవుడు వారిని శపించుగాక!" అని అన్నారు. ఈ విధంగా ప్రవచించి ఆయన ముస్లింలను ఇలాంటి చర్యలకు పాల్పడకూడదని పరోక్షంగా హెచ్చరించారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం -సలాత్, 55వ అధ్యాయం - హద్దసనా అబూయమాన్]

## 4వ అధ్యాయం - మస్జిదుల నిర్మాణం పట్ల ప్రోత్సాహం

309. హజ్రత్ ఉబైదుల్లా ఖూలానీ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఉస్మాన్ (రజి) మస్జిదె నబవి (ప్రవక్త మస్జిదు)ని పునర్నిర్మించినపుడు ప్రజలు ఆయన్ని ఏవేవో మాటలు అన్నారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఆ మాటలు విని ఇలా అన్నారు. "మీరు లేనిపోని మాటలు అంటున్నారు గాని దైవప్రవక్త (సల్లం) ఏమన్నారో తెలుసా? 'కేవలం దేవుని ప్రసన్నత కోసం ఎవరైనా మస్జిదు నిర్మిస్తే అతని కోసం దేవుడు అలాంటిదే ఒక ఇల్లు స్వర్గంలో నిర్మిస్తాడు' అని అన్నారాయన."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 65వ అధ్యాయం - మన్‌బనా మస్జిద్]

## 5వ అధ్యాయం - రుకూ స్థితిలో చేతులు మోకాలిపై పెట్టడం గురించి

310. హజ్రత్ సాద్‌బిన్ అబీవఖ్ఖాస్ (రజి) కుమారుడు హజ్రత్ ముసైబ్ (రహ్మాలై) కథనం:- నేను మా తండ్రిగారి ప్రక్కన నిల్చుని నమాజు చేశాను. అప్పుడు నేను రుకూ స్థితిలో నా రెండు చేతుల్ని కలిపి తొడల మధ్య పెట్టుకున్నాను. మా నాన్నగారు అది చూసి నన్ను వారిస్తూ "ప్రారంభంలో మేము ఇలాగే చేస్తుండేవాళ్ళము. అయితే ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని అలా చేయకూడదని వారించి రెండు చేతుల్ని (విడిగా) మోకాలి చిప్పలపై పెట్టుకోవాలని ఆదేశించారు" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 118వ అధ్యాయం - వజ్ అల్ అకిఫ్ఫి అలర్రుకబ ఫిర్రుకూ]

## 7వ అధ్యాయం - నమాజు స్థితిలో మాట్లాడటం నిషిద్ధం

311. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- మొదట్లో మేము దైవప్రవక్త(సల్లం) నమాజు చేస్తుంటే ఆయనకు సలాం చేసే వాళ్ళము. నమాజు స్థితిలోనే ఆయన మాకు ప్రతి సలామ్ పలికేవారు. అయితే మేము (అబిసీనియా రాజు) నజాషీ దగ్గర నుండి (వలసవెళ్ళి) తిరిగి వచ్చిన తరువాత మేము దైవప్రవక్త (సల్లం)కు (నమాజు స్థితిలో) సలాం చేస్తే, ఆయన మాకు సమాధానమివ్వలేదు. (నమాజు ముగిసిన తరువాత) "నమాజు చేస్తున్నప్పుడు మనిషికి ఏకాగ్రత చాలా అవసరం" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ - 21వ ప్రకరణం, అల్ అమలు ఫిస్సలాత్, 2వ అధ్యాయం - మాయున్హా మినల్ కలామి ఫిస్సలాత్]

312. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం:- ప్రారంభంలో మేము నమాజు స్థితిలో మాట్లాడే వాళ్ళము. మాలో ఎవరైనా తన ప్రక్క వాడితో పని బడితే అతను తన ప్రక్క నుండే మిత్రునితో మాట్లాడేవాడు. కొంత కాలానికి "మీరు ప్రార్థన (నమాజు) లన్నిటినీ, ముఖ్యంగా 'మధ్యస్థ' ప్రార్థనను క్రమం తప్పకుండా నిర్వహిస్తూ జాగ్రత్తగా కాపాడుకోండి. దేవుని సన్నిధిలో వినయ విధేయతలతో నిలబడండి" అన్న ఖుర్‌అన్ సూక్తి అవతరించింది. దాంతో మేము (నమాజు స్థితిలో) ఇతరులతో మాట్లాడకుండా మౌనంగా ఉండాలని దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, బఖరా సూరా 43వ అధ్యాయం - వఖూ మ వల్లాహి ఖానితీన్]

313. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఓ సారి దైవప్రవక్త (సల్లం) నన్ను ఒక పని మీద (ఒక చోటికి ) పంపించారు. నేనా పని ముగించి ఆయన సన్నిధికి తిరిగొచ్చి సలాం చేసాను. కాని ఆయన నా సలాంకు సమాధానమివ్వలేదు. దాంతో నేను ఎంతో బాధపడ్డాను. నా బాధ దేవుడు తప్ప మరెవరూ గ్రహించలేరు. నేను తిరిగి రావడం ఆలస్యమయిందని దైవప్రవక్త(సల్లం)కు నా మీద కోపం వచ్చి ఉంటుందని నేను మనసులో అనుకున్నాను. నేను మరోసారి సలాం చేశాను. దానికీ ఆయన సమాధానమివ్వలేదు. అప్పుడు నేను మరింత బాధపడ్డాను. నేను తిరిగి మూడోసారి సలాం చేశాను. అప్పుడు ఆయన నా సలాంకు సమాధానమిస్తూ "నేను నమాజు చేస్తూ ఉండటం వల్ల నీ సలాంకు సమాధానం ఇవ్వలేకపోయాను. అంతేగాని మరేం లేదు" అని అన్నారు. ఆ సమయంలో ఆయన

★ రెండు చేతుల్ని కలిపి తొడల మధ్య పెట్టుకునే ఈ ఆదేశం ఆ తర్వాత రద్దయిపోయి, చేతుల్ని మోకాలి చిప్పలపై పెట్టుకోవాలన్న ఆజ్ఞ వచ్చింది.

ఒంటె ఎక్కి ఉన్నారు. అయితే ఆయన ఖిబ్లా వైపు తిరిగి వుండలేదు.

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం -అల్ అమలు ఫిస్సలాత్, 15వ అధ్యాయం - లాయరుద్దు స్సలాము ఫిస్సలాత్]

## 8వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు షైతాన్‌ని శపించవచ్చు

314. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "గత రాత్రి ఒక దుష్ట పొగరుబోతు జిన్ (భూతం) నమాజు నుండి నా దృష్టి మరల్చడానికి హఠాత్తుగా నా మీదికి దాడికొచ్చాడు. దాంతో నేను మధ్యలోనే నమాజు విరమించవలసి వచ్చింది. అయితే దేవుడు నాకు వాడ్ని ఎదుర్కొనే శక్తి ప్రసాదించాడు. మొదట్లో నేను వాడ్ని మస్జిద్‌లో ఒక స్తంభానికి కట్టివేసి ఉదయం మీకందరికీ చూపిద్దామని అనుకున్నాను. కానీ అంతలో నా సోదరుడు సులైమాన్ (అలైహి) చేసిన ప్రార్థన గుర్తుకొచ్చింది. "ప్రభూ! నన్ను క్షమించు, నా తరువాత మరెవరికీ శోభించనటువంటి అద్భుత సామ్రాజ్యాన్ని నాకు ప్రసాదించు" అని ఆయన దైవాన్ని వేడుకున్నారు. అందువల్ల నేను పరాభవం పాలైన అతన్ని తిరిగి వెళ్ళేందుకు అనుమతించాను."

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 75వ అధ్యాయం - అల్ అసీరి వల్ గరీమి యుర్బితు ఫిల్ మస్జిద్]

## 9వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు బిడ్డను ఎత్తుకోవడం ధర్మసమ్మతమే

315. హజ్రత్ అబూ ఖతాదా అన్సారీ (రజి) కథనం:- ఓసారి దైవప్రవక్త(సల్లం) తమ మనుమరాలు ఉమామాని ఒళ్ళో తీసుకుని నమాజు చేయసాగారు. ఆ పాప దైవప్రవక్త కుమార్తె హజ్రత్ జైనబ్, అబుల్ ఆస్‌ల కూతురు. దైవప్రవక్త(సల్లం) సజ్దా స్థితిలోనికి పోయేటపుడు ఆ పాపను ఒళ్ళో నుండి తీసి ప్రక్కన వదలిపెట్టేవారు. సజ్దా నుంచి లేచి నిలబడేటప్పుడు మరల ఆమెను ఎత్తుకునేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 106వ అధ్యాయం - ఇజా హమల జారియతన్ సగీరతన్ అలా అన్‌ఖహూ ఫిస్సలాత్]

## 10వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు ఒకటి రెండు అడుగులు నడవొచ్చు

316. హజ్రత్ అబూహాజిమ్ బిన్ దీనార్ (రహ్మలై) కథనం:- కొందరు వ్యక్తులు (ప్రవక్త మస్జిదులోని) ప్రసంగ వేదిక ఏ కలపతో తయారు చేయబడిందన్న విషయం గురించి పరస్పరం వాదించుకొని పరిష్కారం కోసం హజ్రత్ సహెల్ బిన్‌సాద్ సాది (రజి) దగ్గరకు వచ్చారు. హజ్రత్ సాద్ (రజి) విషయం విన్న తరువాత ఇలా అన్నారు :-

"దైవసాక్షిగా చెబుతున్నాను. అది ఏ కలపతో నిర్మించబడిందో, దాన్ని ఎవరు నిర్మించారో నాకు బాగా తెలుసు. నేను దాన్ని (మస్జిదులో) మొదటిసారి ప్రతిష్ఠించిన దగ్గర్నుంచి దైవప్రవక్త(సల్లం) తొలిసారిగా దాని మీద ఎక్కిన దగ్గర్నుంచి ఎరుగుదును. దైవప్రవక్త(సల్లం) ఫలానా స్త్రీకి (ఆ స్త్రీ పేరేమిటో హదీసు ఉల్లేఖించిన వారు మరిచిపోయారు) కబురు చేసి 'ప్రజలకు బోధ చేసేటపుడు నేను కూర్చోవడానికి వీలుగా చెక్కలతో ఏదైనా వేదిక తయారు చేయమని నీ వడ్రంగి బానిసకు చెప్పు' అని అన్నారు. ఆ స్త్రీ అలాగే తన బానిసను ఆదేశించింది. ఆ బానిస 'గాబా' ప్రాంతంలో ఉండే ఒక

విధమైన వెదురు కర్రలతో వేదిక తయారు చేసి తెచ్చాడు. దాన్ని ఆ స్త్రీ దైవప్రవక్త (సల్లం)కు పంపింది. ఆయన ఆజ్ఞతో ఆ వేదిక అక్కడ ఉంచారు.

ఆ తరువాత దైవప్రవక్త(సల్లం) దానిపై నిలబడి నమాజు చేయించడం నేను చూశాను. ఆయన దాని మీద నిలబడి అల్లాహు అక్బర్ అని తక్బీరు పలికారు. దాని మీద నిలబడే రుకూ కూడ చేశారు. అయితే ఆ తరువాత వెనక్కి దిగి వచ్చి (వేదిక ప్రక్కన) నేలమీద సజ్దా చేశారు. ఆ తరువాత మళ్ళీ వేదిక మీదికి వెళ్ళి నిల్చున్నారు. ఈ విధంగా నమాజు చేసిన తరువాత ప్రజల వైపు తిరిగి "ప్రజలారా! మీరు నన్ను అనుసరించడానికి, నేను చేసినట్లు నమాజు చేయడానికే నేనిలా చేశాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - అల్‌జుమా, 26వ అధ్యాయం - అల్ ఖుత్బతి అలల్ మింబర్]

## 11వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు నడుం మీద చేతులు పెట్టుకోరాదు

317. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- నడుం మీద చేతులు పెట్టుకొని నమాజు చేయకూడదని వారించడం జరిగింది.

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం - అమలు ఫిస్సలాత్, 17వ అధ్యాయం - అల్ ఖుస్రి ఫిస్సలాత్]

## 12వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు రాళ్ళు, మట్టి తొలగించడం గురించి

318. హజ్రత్ ముఅయ్‌ఖీబ్ (రజి) కథనం:- సజ్దా స్థలం నుంచి మన్ను (దుమ్ము) తొలగించి శుభ్రపరుచుకునే విషయం గురించి దైవప్రవక్త (సల్లం) ప్రస్తావిస్తూ "ఎవరైనా తప్పకుండా ఇలా చేయదలచుకుంటే ఒకసారి మాత్రమే చేయవచ్చు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం - అమలు ఫిస్సలాత్, 8వ అధ్యాయం - మస్‌హిల్ హిసా ఫిస్సలాత్]

## 13వ అధ్యాయం - మస్జిదులో ఉమ్మి వేయడం నిషిద్ధం

319. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు మస్జిదులోని ఖిబ్లా వైపు గోడపై ఎవరో ఉమ్మి వేయడం చూసి దాన్ని తొలగించారు. ఆ తరువాత మనిషి నమాజు చేస్తున్నప్పుడు దేవుడు అతనికి అభిముఖంగా ముందు వైపు ఉంటాడు. అందువల్ల నమాజు చేస్తున్నప్పుడు ఎవరూ ముందు వైపు ఉమ్మి వేయకూడదు అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 33వ అధ్యాయం - హక్కిల్ బుజాఖి బిల్ యది మినల్ మస్జిద్]

320. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు మస్జిదులోని ఖిబ్లా వైపు గోడమీద (ఎవరో ఉమ్మి లేక చీదివేసిన) కఫం పడి వుండటం చూసి ఒక రాయితో గీకి శుభ్రపరిచారు. ఆ తర్వాత ఆయన ముందు వైపు గాని, కుడివైపు గాని ఉమ్మకూడదని అన్నారు. అయితే ఎడమవైపు గాని, లేదా ఎడమకాలి క్రింద గాని ఉమ్మివేయవచ్చని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 36వ అధ్యాయం - లియబ్ జక అంయ్యాసారిహీ అవ్‌తహ్త కిద్మతుల్ యస్రా]

321. హజ్రత్ అబూ హురైరా (రజి) హజ్రత్ అబూ సయీద్ (రజి)ల కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓ రోజు మస్జిదులో గోడ మీద కఫం పడి వుండటం చూసి ఒక రాయి తీసుకొని దాన్ని గీకి శుభ్రపరిచారు. ఆ తరువాత "ఎవరైనా ఉమ్మి వేయదలచుకుంటే తన ముందు వైపుగాని, కుడి వైపుగాని ఉమ్మకూడదు. ఎడమ వైపుగాని లేదా ఎడమకాలి క్రింద గాని ఉమ్మాలి" అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 34వ అధ్యాయం - హక్కుల్ ముఖాతి బిల్ హిసా మినల్ మస్జిద్]

322. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్ర వక్త (సల్లం) ఓ రోజు మస్జిదులో గోడమీద ఉమ్మివేసిన లేక చీది వేసిన శ్లేష్మాన్ని చూసి దాన్ని గీకి తొలగించారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 23వ అధ్యాయం- హక్కిల్ బుజాఖి బిల్ యది మినల్ మస్జిద్]

323. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "విశ్వాసి నమాజు చేస్తున్నప్పుడు అతను తన ప్రభువుతో గుసగుసలాడుతున్నాడన్నమాట. అందువల్ల అతను తన ముందువైపు గాని, కుడివైపు గాని ఉమ్మి వేయకూడదు. ఎడమవైపు లేదా ఎడమకాలి క్రింద మాత్రమే ఉమ్మివేయాలి."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 36వ అధ్యాయం - లియబ్ జిఖ్ అయ్యసారిహీ ఔ తహ్త ఖిద్మ]

324. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మస్జిదులో ఉమ్మి వేయడం పాపం. (అలా జరిగితే) దానికి పాప పరిహారంగా ఆ ఉమ్మిని తీసి (నేలలో) మట్టి క్రింద కప్పివేయాలి."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 37వ అధ్యాయం - కఫారతిల్ బుజాఖి ఫిల్ మస్జిద్]

## 14వ అధ్యాయం - పాదరక్షలు ధరించి నమాజు చేయవచ్చు

325. హజ్రత్ సయీద్ బిన్ యజీద్ అజ్ది (రహ్మాలై) కథనం:- హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) ని "దైవప్రవక్త (సల్లం) పాదరక్షలు ధరించి నమాజు చేసేవారా?" అని నేను అడిగాను. దానికి హజ్రత్ అనస్ (రజి) ఔనని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 24వ అధ్యాయం - అస్సలాతి ఫిన్నిఆల్]

## 15వ అధ్యాయం - పూలదుస్తులు ధరించి నమాజు చేయడం అవాంఛనీయం (మక్రూహ్)

326. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ "సారి పూల దుప్పటి కప్పుకొని నమాజు చేశారు. ఆ తరువాత (అనుచరులతో మాట్లాడుతూ)" ఈ పూల డిజైన్ వల్ల నమాజులో నాకు అంతరాయం ఏర్పడి నా ఏకాగ్రతకు భంగం కలిగింది. దీన్ని తీసికెళ్ళి అబూ జహం (రజి)కి ఇచ్చేసి,★అతని దగ్గర్నుంచి ఒక ముతక దుప్పటి తీసుకురండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 93 వ అధ్యాయం - అల్ఇల్తిఫాతి ఫిస్సలాత్]

★ ఈ పూల డిజైన్ దుప్పటిని అబూ జహం (రజి) గారే దైవప్రవక్త(సల్లం)కు కానుకగా ఇచ్చారు.

## 16వ అధ్యాయం - భోజనం వడ్డించిన తరువాత నమాజుకు వెళ్ళకూడదు

327. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "రాత్రి భోజనం తెచ్చి పెట్టిన తరువాత సామూహిక నమాజు కోసం అఖామత్ చెబుతుంటే ముందు భోజనం చేయాలి."

[సహీహ్ బుఖారీ : 70వ ప్రకరణం - అత్అమా, 58వ అధ్యాయం - ఇజాహజ రుల్ ఇషా.......]

328. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు:- "భోజనం తెచ్చి పెట్టడం జరిగితే మగ్రిబ్ నమాజు చేయడానికి ముందే భోజనం చేయండి. అంతేగాని భోజనం వదిలేసి నమాజు కోసం తొందరపడకండి."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 42వ అధ్యాయం - ఇజాహజరి త్తామ్మి వ అఖీమతిస్సలాత్]

329. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా బోధించారు:- "రాత్రి భోజనం తెచ్చి పెట్టిన తరువాత అటు నమాజు కోసం అఖామత్ చెప్పడం జరుగుతుంటే, ముందు భోజనం చేయండి."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 42వ అధ్యాయం - ఇజాహజరత్తఆము వ అఖీమతుస్సలాత్]

330. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు :- "రాత్రి భోజనం తెచ్చి ముందు పెట్టడం జరిగినప్పుడు సామూహిక నమాజు ప్రారంభమయితే మొదట భోజనం చేయాలి. భోజనం చేయకుండా నమాజు కోసం తొందర పడకూడదు."★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 42వ అధ్యాయం - ఇజాహజరత్తాము వఅఖీమతిస్సలాత్]

## 17వ అధ్యాయం - ఉల్లి, వెల్లుల్లి వంటి దుర్వాసన గల పదార్థాలు తిని మస్జిదుకు రాకూడదు.

331. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఖైబర్ దండయాత్ర సందర్భంలో ఇలా అన్నారు. "వెల్లుల్లి తిన్న వ్యక్తి మన మస్జిదు దరిదాపులకు సయితం రాకూడదు."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 160వ అధ్యాయం - మాజాఆ ఫిస్సూమి వల్ కరాసి వల్ బసలిన్నబీ]

332. హజ్రత్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) కథనం:- ఒక వ్యక్తి హజ్రత్ అనస్ (రజి)తో మాట్లాడుతూ "వెల్లుల్లి విషయంలో మీరు దైవప్రవక్త(సల్లం) నోట ఏం విన్నారు?" అని అడిగారు. "ఈ మొక్క (అంటే వెల్లుల్లి) తిన్నవారు మన మస్జిదు దరిదాపులకు కూడా రాకూడదని దైవప్రవక్త (సల్లం) అన్నారు. లేక మాతో కలసి నమాజు చేయకూడదని ఆయన అన్నారు" అని హజ్రత్ అనస్ (రజి) సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 160వ అధ్యాయం - మాజా అఫి స్సూమి.....]

---

★ భోజనం ముందుకు వచ్చినపుడు దాన్ని తినకుండా ఆకలి కడుపుతో నమాజు చేయడం 'మక్రూహ్' (అవాంఛనీయం) అవుతుంది. ఆ స్థితిలో నమాజు చేస్తే మనిషి ధ్యాస అంతా భోజనం మీదే ఉంటుంది. నమాజులో ఏకాగ్రత ఉండదు. అలాగే మలమూత్రాల విసర్జన అవసరం వస్తే ముందు ఆ పని ముగించుకోవాలి. అయితే నమాజు వేళ మించిపోయి ఖజా అయ్యే ప్రమాదం ఉన్నప్పుడు భోజనానికి, మలమూత్ర విసర్జనకు అంతగా తొందర లేకపోతే మొదట నమాజే చేయాలి. అందులో ఎలాంటి తప్పు (మక్రూహ్) లేదు.

333. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వెల్లుల్లి (గురించి ప్రస్తావిస్తూ) "ఉల్లిగాని, వెల్లుల్లిగాని తిన్న వ్యక్తి మనకు దూరంగా ఉండాలి"అని అన్నారు. లేక "మన మస్జిదుకు దూరంగా తన ఇంట్లోనే నమాజు చేస్తూ ఉండిపోవాలి" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) దగ్గరికి (ఒకరు) కూరగాయలున్న ఒక కుండ తీసుకువచ్చాడు. దైవప్రవక్త(సల్లం) అందులో వాసన చూసి 'ఏమిటిది?' అన్నారు. అప్పుడు అందులో ఏఏ కూరగాయలున్నాయో ఆయనకు వివరించడం జరిగింది. "అయితే దీన్ని (దగ్గరే కూర్చున్న ఒక సహాబీకి) ఇచ్చి వేయండి" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). అతను కూడ దాన్ని తినడానికి ఇష్టపడకపోవడంతో దైవప్రవక్త (సల్లం) (కూరగాయలు తెచ్చిన వ్యక్తితో) "ఎవరితో మీరు మాట్లాడలేరో వారితో (అంటే దైవదూతలతో) నేను మాట్లాడవలసి ఉంటుంది. (గనక నేను దీన్ని తినలేను) నువ్వే తిను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 160వ అధ్యాయం - మాజా ఆ ఫిస్సూమి]

## 19వ అధ్యాయం - నమాజులో మరచిపోవటం, సహూ సజ్దా చేయడం గురించి

334. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "అజాన్ చెప్పడం ప్రారంభించగానే షైతాన్ వెనక్కి తిరిగి పలాయనం చిత్తగిస్తాడు. అప్పుడు (తీవ్రమైన భయాందోళనతో) వాడికి అపానవాయువు వెడలుతుంది. దాంతో వాడు అజాన్ వినరానంత దూరం పారిపోతాడు. అయితే అజాన్ చెప్పడం అయిపోగానే వాడు మళ్ళీ (ప్రార్థనా స్థలానికి) చేరుకుంటాడు. ఇఖామత్ చెప్పగానే తిరిగి తోక ముడిచి పారిపోతాడు. ఇఖామత్ చెప్పడం అయిపోగానే మళ్ళీ వచ్చి మానవుని హృదయంలో దుష్టాలోచనలు రేకెత్తిస్తాడు. (మనిషికి) అంతకుముందు గుర్తుకురాని విషయాలన్నిటినీ (నమాజు చేయడానికి నిలబడగానే) గుర్తు చేస్తూ 'ఇది జ్ఞాపకం తెచ్చుకో, అది జ్ఞాపకం తెచ్చుకో' అని పురిగొల్పుతాడు. దాంతో మనిషికి (వాడి మాయాజాలంలో పడిపోయి) తాను ఎన్ని రకాతులు పఠించానన్న సంగతి కూడ జ్ఞాపకం వుండదు.

ఎవరికైనా (ఇలాంటి పరిస్థితి ఎదురయి) తాను ఎన్ని రకాతులు పఠించాను, మూడా నాలుగా అన్న విషయం గుర్తుకు రాకపోతే అతను కూర్చొనే రెండుసార్లు సజ్దా (సాష్టాంగ ప్రణామం) చేయాలి."

[సహీహ్ బుఖారీ :22వ ప్రకరణం - సహూ, 6వ అధ్యాయం - ఇజాలమ్ యద్రికుమ్....]

335. హజ్రత్ అబ్దుల్లా బిన్ బహీనా (రజి) కథనం:- (ఓ రోజు) దైవప్రవక్త (సల్లం) ఒక నమాజులో రెండు రకాతులు పఠించిన తర్వాత లేచి నిల్చున్నారు. 'ఖాయిదాయె ఊలా' ప్రకారం కూర్చోవడం మరచిపోయారు. అనుచరులు కూడా ఆయనతో పాటు పైకి లేచారు. నమాజు పూర్తయి 'సలాం' చేయడానికి మేము ఎదురుచూస్తున్న తరుణంలో దైవప్రవక్త(సల్లం) 'అల్లాహు అక్బర్' అంటూ కూర్చునే రెండు సార్లు సజ్దా చేశారు. ఆ తర్వాత కుడి ఎడమల వైపు సలాం చేశారు.

[సహీహ్ బుఖారీ : 22వ ప్రకరణం - సహూ, 15వ అధ్యాయం - మాజాఅ ఫిస్సహూ.....]

336. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) నమాజు చేయించారు. హదీసు ఉల్లేఖకుడు ఇబ్రాహీం (రహ్మలై) ఈ విషయం ప్రస్తావిస్తూ దైవప్రవక్త(సల్లం) (నమాజులో) ఏదైనా

అధికం చేశారో తగ్గించారో నాకు జ్ఞాపకం లేదు అని అన్నారు. మొత్తానికి దైవప్రవక్త(సల్లం) నమాజు పూర్తి చేసి కుడి ఎడమల వైపు సలాం చేసిన తరువాత "దైవప్రవక్తా! నమాజు గురించి ఏదైనా కొత్త ఆదేశం జారీ అయిందా?" అని అడిగారు అనుచరులు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఎందుకు ఏమయిందీ?" అని ప్రశ్నించారు. "మీరు (రోజు చేస్తున్న పద్ధతికి భిన్నంగా) ఇలా నమాజు చేశారే?" అన్నారు అనుచరులు. అప్పుడు దైవప్రవక్త (సల్లం)కాళ్ళు ముడుచుకుని ఖిబ్లా వైపు తిరిగి రెండుసార్లు సజ్దా చేశారు. ఆ తర్వాత కుడి ఎడమల వైపు సలాం చేసి మా వైపు తిరిగి ఇలా అన్నారు: "నమాజు గురించి ఏదైనా కొత్త ఆదేశం వస్తే నేను మీకు ముందే తెలియజేసి ఉండేవాడ్ని. అలాంటిదేమీ లేదు. అసలు విషయం ఏమిటంటే నేను కూడ మీలాంటి మానవ మాత్రుడ్ని. మీకు మల్లే నాకూ మరుపు వస్తుంది. అందుచేత ఎప్పుడైనా నేనేదయినా మరచిపోతే నాకు గుర్తు చేయండి. నమాజు చేస్తున్నప్పుడు ఎవరికైనా ఏదైనా అనుమానం వస్తే సరైన నిర్ణయం తీసుకోవడానికి కృషి చేసి దాని ప్రకారం నమాజు పూర్తి చేయండి, కుడి ఎడమల వైపు సలాం చేయండి. ఆ తరువాత రెండు సార్లు సజ్దా చేయండి."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 31వ అధ్యాయం - అత్తవజ్జు....]

337. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ సారి జుహర్ నమాజులో రెండు రకాతులు పఠించి కుడిఎడమల వైపు సలాం చేశారు. ఆ తరువాత మస్జిదులో ఖిబ్లా వైపు ఉంచిన ఓ కర్ర దగ్గరకు వెళ్ళి దాని మీద చేయి ఆనిచ్చి నిల్చున్నారు. ఆ సమయంలో హజ్రత్ అబూబక్ర్ (రజి) హజ్రత్ ఉమర్ (రజి) కూడ వున్నారు, కాని వారిద్దరు నోరు విప్పడానికి భయపడ్డారు. తొందరపాటు తత్వం గలవారు "నమాజు తగ్గించబడిందంటూ" లేచి నిలబడ్డారు.

అంతలో దైవప్రవక్త (సల్లం) చేత 'జువాలీదైన్' (ద్విహస్తుడు)(1)అని పిలువబడే ఒక వ్యక్తి ముందుకు వచ్చి "దైవప్రవక్తా! మీరు నమాజు తగ్గించారు, లేదా మరచిపోయి ఉంటారు" అని అన్నాడు. దానికి దైవప్రవక్త(సల్లం) "నేను నమాజు తగ్గించలేదు, మరచిపోవడం కూడ జరగలేదు" అని అన్నారు. వెంటనే ఇతర అనుచరులు కొందరు జోక్యం చేసుకుంటూ "లేదు దైవప్రవక్తా! మీరు మరచిపోయారు" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అంటే 'జువాలీదైన్' చెప్పింది నిజమేనన్నమాట" అని అన్నారు. ఆ తరువాత నిలబడి మరో రెండు రకాతులు నమాజు చేసి, కుడి ఎడమలవైపు సలాం చేశారు. ఆ వెనువెంటనే 'అల్లాహు అక్బర్' అంటూ సజ్దా చేశారు. ఇది ఆయన లోగడ చేస్తూ వస్తున్న సజ్దా వంటిదే. కాకపోతే కాస్త సుదీర్ఘంగా చేసి ఉండవచ్చు. ఆ తరువాత సజ్దా నుండి లేచి 'అల్లాహు అక్బర్' అంటూ తిరిగి అదే విధంగా సజ్దా చేశారు. లేదా అంతకంటే కొంచెం దీర్ఘంగా చేసి ఉంటారు. ఆ తరువాత సజ్దా నుండి తలపైకెత్తుతూ 'అల్లాహు అక్బర్' (2)అన్నారు.

[సహీహ్ బుఖారీ, 78వ ప్రకరణం - అదబ్, 45వ అధ్యాయం - మాయజూజు మినజ్జిక్రిన్నాస్]

---

(1) ఈ వ్యక్తి అజానుబాహుడయినందున ఇతనికి ద్విహస్తుడన్న పేరు వచ్చింది.

(2) 'సహూసజ్దా' విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. 'సహూసజ్దా' సలాంకు ముందు చేయాలా లేక సలాం తర్వాత చేయాలా అనే విషయం నమాజు చేసే వ్యక్తి ఇష్టాయిష్టాలపై ఉందని కొందరు అభిప్రాయపడ్డారు. ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం సహూసజ్దా సలామ్ తర్వాతే చేయాలి. ఇమామ్ షాఫయి (రహ్మాలై) ప్రకారం సలామ్‌కు ముందే చేయాలి. -అనువాదకుడు

## 20వ అధ్యాయం - ఖుర్‌ఆన్ పారాయణపు సజ్దాలు

338. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) మా ముందు 'సజ్దా' ఉండే ఏదైనా సూరా పఠిస్తున్నప్పుడు (సజ్దా వాక్యం రాగానే) ఆయనతో పాటు మేము కూడా సజ్దా చేసేవాళ్ళము. ఆ సమయంలో జనానికి సజ్దా చేసేందుకు నుదురు ఆనించడానికి సయితం సరిపడ చోటు లేనంతగా జన సమూహం ఉండేది.

[సహీహ్ బుఖారీ : 17వ ప్రకరణం - సుజూదుల్ ఖుర్‌ఆన్, 8వ అధ్యాయం - మన్ సజద, లిసుజూదిల్ ఖారి]

339. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ సారి మక్కాలో 'అన్నజ్మ్' సూరా పఠించారు. అందులో సజ్దా వాక్యం వచ్చినప్పుడు ఆయనతో పాటు ఆయన సమీపంలో ఉన్నవారంతా (బహుదైవారాధకులు సయితం) సజ్దా చేశారు. ఒక వృద్ధుడు మాత్రం (సజ్దా చేయకుండా) చేతిలో కొన్ని కంకరాళ్ళు తీసుకొని, నుదుటి దగ్గరికి ఎత్తి "నాకిది చాలు" అన్నాడు. ఆ తరువాత కొంత కాలానికి నేనతని పరిస్థితి గమనించాను. అతను (ఉమయ్యబిన్‌ఖల్ఫ్) అవిశ్వాస స్థితిలోనే వధించబడ్డాడు. (ఇస్లాం స్వీకారభాగ్యానికి నోచుకోలేకపోయాడు).

[సహీహ్ బుఖారీ : 17వ ప్రకరణం - సుజూదుల్ ఖుర్‌ఆన్, 1వ అధ్యాయం - మాజాఫీ సుజూదిల్ ఖుర్‌ఆని వ సున్నతిహా]

340. హజ్రత్ అతాబిన్ యసార్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ జైద్‌బిన్ సాబిత్ (రజి)ని ఖుర్‌ఆన్ పఠనం గురించి విచారిస్తే దానికి ఆయన సమాధానమిస్తూ "నేను దైవప్రవక్త(సల్లం) ముందు 'నజ్మ్' సూరా పఠించినపుడు ఆయన సజ్దా చేయలేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 17వ ప్రకరణం - సుజూదుల్ ఖుర్‌ఆన్, 6వ అధ్యాయం - మన్‌ఖరా అస్సజ్దత వలమ్ యస్జుద్]

341. హజ్రత్ అబూరాఫె (రహ్మాలై) కథనం:- నేనొకసారి హజ్రత్ అబూహురైరా (రజి) వెనుక ఇషా నమాజు చేశాను. ఆ నమాజులో ఆయన 'ఇజస్సమాఉన్‌షఖ్ఖత్' అనే సూరా పఠించారు. అప్పుడు 'తిలావత్ సజ్దా' చేశారు. ఆ తరువాత నేను "ఏమిటీ సజ్దా?" అని అడిగాను. దానికి ఆయన "నేను సూరా పారాయణం సమయంలో దైవప్రవక్త (సల్లం) వెనక సజ్దా చేశాను. ఇప్పుడిక నేను ఆయన దగ్గరకు వెళ్ళే దాకా 'సజ్దా' చేస్తూ ఉంటాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 101 వ అధ్యాయం - అల్‌ఖరాఅతి ఫిల్ ఇషాఇ బిస్సజ్దా]

## 23వ అధ్యాయం - నమాజు తరువాత జిక్ర్ (ధ్యానం) గురించి

342. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- తక్బీర్ (అల్లాహు అక్బర్) ధ్వని వినగానే దైవప్రవక్త (సల్లం) నమాజు ముగించారని నాకు తెలిసిపోయేది.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 155వ అధ్యాయం - అజ్జిక్రిబాదస్సలాత్]

## 24వ అధ్యాయం - నమాజులో సమాధి శిక్ష నుండి శరణు పొందే వేడుకోలు

343. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ రోజు మదీనా యూదులకు చెందిన ఇద్దరు వృద్ధ మహిళలు నా దగ్గరకు వచ్చి "సమాధుల్లో మృతులు శిక్షించబడతారు" అని అన్నారు.

నేనీ మాటవిని ఖండించాను. వాళ్ళ మాటలు నిజమని ఒప్పుకోవడానికి నాకు మనసొప్పలేదు. వాళ్ళు వెళ్ళిపోయారు. కాస్సేపటికి దైవప్రవక్త(సల్లం) ఇంటికి తిరిగి వచ్చారు. నేను ఇద్దరు యూద వృద్ధ స్త్రీలు వచ్చిపోయిన సంగతి ప్రస్తావించి, దైవప్రవక్తా! వారిలా అన్నారు అని అన్నాను. దానికి ఆయన "వాళ్ళు చెప్పింది నిజమే. సమాధిలోని మృతులను తీవ్రంగా శిక్షించడం జరుగుతుంది. దాన్ని జంతువులు సయితం వింటారు" అని అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త(సల్లం) ప్రతి నమాజులోను సమాధి శిక్ష నుండి దైవాన్ని శరణు కోరుతూ ఉండటం నేను చూశాను.

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 37వ అధ్యాయం - అత్తవూజు మిన్ అజాబిల్ ఖబ్ర్]

## 25వ అధ్యాయం - నమాజులో ఏఏ కీడు నుండి దేవుని శరణుకోరాలి?

344. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దజ్జాల్ ఉపద్రవం నుండి దేవుడ్ని శరణు కోరుతుంటే నేను విన్నాను.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 149వ అధ్యాయం - అద్దుఆవు ఖబ్లస్సలాం]

345. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నమాజులో తషహ్హుద్ తరువాత ఇలా దుఆ (ప్రార్థన) చేస్తూ ఉంటే నేను విన్నాను. **అల్లాహుమ్మ ఇన్నీఅఅవూజుబిక మిన్ అజాబిల్ ఖబ్రి వ అవూజుబిక మిన్ ఫిత్నతిల్ మసీహిద్దజ్జాలి వ అవూజుబిక మిన్ ఫిత్నతిల్ మహ్యాయి వ ఫిత్నతిల్ మమాతి. అల్లాహుమ్మ ఇన్నీ అఅవూజుబిక మినల్ మాసమి వల్ మగ్రమ్.** ("దేవా! నేను సమాధి యాతన నుండి నీ శరణు కోరుతున్నాను. 'మసీహిద్దజ్జాల్' ఉపద్రవం నుండి నీ శరణు కోరుతున్నాను. జీవన్మ★రణాల పరీక్ష నుండి నీ శరణు కోరుతున్నాను. దేవా! పాపాల్లో పడివేసే పనుల నుండి నీ శరణు కోరుతున్నాను. రుణగ్రస్తుణ్ణయ్యే దుస్థితి నుండి నీ శరణు కోరుతున్నాను.")

ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! మీరు రుణగ్రస్త స్థితి నుండి కూడా అంత ఎక్కువగా శరణు కోరుతున్నారెందుకు?" అని అడిగాడు. దానికి ఆయన సమాధానమిస్తూ "ఎందుకంటే మనిషి అప్పుల పాలయితే అసత్యమాడతాడు. వాగ్దాన భంగానికి పాల్పడతాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 149వ అధ్యాయం - అద్దుఆవు ఖబ్లస్సలాం]

346. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా దేవుడ్ని వేడుకునేవారు

---

★ 'జీవిత' పరీక్ష అంటే, మానవ జీవితంలో ఎదురయ్యే పరీక్షలన్నీ అని అర్థం. ఉదాహరణకు - పనికిమాలిన విషయాల్లో చిక్కుకుపోవడం, మనోవాంఛలకు బలయిపోవడం మొదలైనవి. మరణపరీక్ష అంటే, మనిషి మరణ ఘడియల్లో దైవానుగ్రహం పట్ల నిరాశ చెందడం, సద్వచనం.(కలిమా) పలకలేకపోవడం, ఇస్లాం వ్యతిరేక విషయాలు మాట్లాడడం ఇత్యాదివి. రుణగ్రస్తుడవడం అంటే, అధర్మకార్యాలు లేక అనవసరమైన పనుల కోసం చేసే అప్పు అన్నమాట. లేదా అప్పు తీర్చే సద్బుద్ధి లేకపోవడం. నిజమైన అవసరాల నిమిత్తం అప్పు తీసుకోవడంలో తప్పులేదు. అయితే దాంతో పాటు అప్పు తీర్చే స్తోమత కూడా ఉండాలి. ఈ దుఆ (వేడుకోలు) మొదటి భాగం దేవుని హక్కులకు, రెండవ భాగం దాసులహక్కులకు సంబంధించినది.

"దేవా! నేను సమాధి శిక్ష నుండి, అగ్ని శిక్ష నుండి, జీవన్మరణాల పరీక్ష నుండి మసీహ్ దజ్జాల్ ఉపద్రవం నుండి నీ శరణు కోరుతున్నాను."

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 88వ అధ్యాయం - అత్తఅవ్వుజు మిన్ అజాబిల్ ఖబ్ర్]

## 26వ అధ్యాయం - నమాజు తరువాత ఏ ధ్యానం అభిలషణీయం

347. హజ్రత్ ముగైరా బిన్ షాబ (రజి) గారి కార్యదర్శి హజ్రత్ వర్రాద్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ముగైరా (రజి) నా చేత అమీర్ ముఆవియా (రజి) పేర ఒక ఉత్తరం వ్రాయించారు. అందులో దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించేవారని ఉంది.

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహు లా షరీకలహు
లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వ హువ
అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. అల్లాహుమ్మ లా
మానిఅ లిమా ఆతైత వలా మూతియ లిమా
మనాత వలా యన్ఫహు జల్‌జద్ది మిన్కల్‌జద్దు."

("దేవుడు తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు మరెవరూ సహవర్తులు లేరు. యావత్తు విశ్వ సామ్రాజ్యం ఆయనదే. అన్ని విధాల స్తోత్రాలకు, ప్రశంసలకు ఆయనే యోగ్యుడు. ఆయన సర్వ సమర్థుడు. ప్రతిదానిపై అధికారం కలవాడు. దేవా! నీవు ప్రసాదించే దాన్ని అడ్డుకునే వారు లేరు. నీవు అడ్డుకునే దాన్ని ఇప్పించేవారు కూడా ఎవరూ లేరు. నీకు వ్యతిరేకంగా ఎవరి ప్రయత్నం కూడా సఫలం కాజాలదు")

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 155వ అధ్యాయం - అజ్జిక్రి బాదస్సలాత్]

348. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఓ రోజు కొందరు పేద ప్రజలు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! ధనికులు తమ సిరిసంపదల మూలంగా గొప్పగొప్ప హోదా, అంతస్తులు, శాశ్వత సౌఖ్యాలు పొందగలుగుతున్నారు. వారు మాలాగా నమాజులు కూడ చేస్తున్నారు, ఉపవాసాలు కూడా పాటిస్తున్నారు, పైగా డబ్బున్నందున హజ్, ఉమ్రా అచారాలు కూడ పాటిస్తున్నారు. జిహాద్ (ధర్మపోరాటం) కూడా చేస్తున్నారు. దానధర్మాలు కూడ చేస్తున్నారు" అని అన్నారు.

అది విని దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : "సరే, నేను మీకో విషయం తెలియజేయనా? దాన్ని గనక మీరు మీ దినచర్యగా చేసుకుంటే, మిమ్మల్ని మించిపోయిన వాళ్ళతో మీరూ సమానులయిపోతారు. ఆ తరువాత మీతో మరెవరూ పోటీ ఉండరు. ఈ పద్ధతి అనుసరించే వాడుతప్ప మీరే అందరికంటే శ్రేష్ఠులయిపోతారు. ఆ విషయం ఏమిటంటే, ప్రతి నమాజు తరువాత, 'సుబ్‌హానల్లాహ్' అని, 'అల్‌హమ్దులిల్లాహ్'అని, 'అల్లాహు అక్బర్' అని ముప్పై మూడుసార్లు చొప్పున స్మరించండి".

హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఆ తరువాత (వీటి సంఖ్య విషయమయి) మాలో విభేదాలు వచ్చాయి. కొందరు సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దు లిల్లాహ్ అనే మాటలు ముప్పైమూడుసార్లు చొప్పున స్మరించాలని, అల్లాహు అక్బర్ అనే మాటను ముప్పై నాలుగుసార్లు స్మరించాలని అన్నారు.

అందువల్ల నేను ఈ విషయం గురించి మరోసారి దైవప్రవక్త(సల్లం)ను అడిగాను. అప్పుడాయన "సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్ అనే మాటలలో ప్రతిదాన్ని ముప్ఫై మూడు సార్లు పఠించండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 115 వ అధ్యాయం - అజ్జిక్రి బాదస్సలాత్]

## 27వ అధ్యాయం - 'తక్బీరె తహ్రీమా'కి 'ఖిరాత్' కు మధ్య ఏం పఠించాలి?

349. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తక్బీరె తహ్రీమాకు (అంటే నమాజు ప్రారంభించే ముందు 'అల్లాహు అక్బర్' అని పలకడానికి), ఖిర్‌అత్‌కు (అంటే నమాజులో ఖుర్‌ఆన్ పఠనానికి) మధ్య కాసేపు మౌనంగా ఉండిపోతారు. అందువల్ల నేనొక రోజు "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీకై సమర్పితులు గాక! మీరు తక్బీరె తహ్రీమాకు, ఖిరాత్‌కు మధ్య కాస్సేపు నిశ్శబ్దంగా ఉంటారు. అప్పుడు మీరేం పఠిస్తారు" అని అడిగాను. దానికి దైవప్రవక్త(సల్లం) ఇలా సమాధానమిచ్చారు.

నేనప్పుడు దైవాన్నిలా వేడుకుంటాను -
"అల్లాహుమ్మ బాయిద్ బైనీ వ బైన ఖతాయాయ
కమా బఅత్త బైనల్ మష్రిఖి వల్ మగ్రిబి
అల్లాహుమ్మ నఖ్ఖినీ మినల్ ఖతాయా కమా
యునఖ్ఖ సౌబుల్ అబ్‌యజు మినద్దనసి
అల్లాహుమ్మగ్ సిల్ ఖతాయాయ బిల్‌మాయి
వస్సలజి వల్ బరద్".

(దేవా! నీవు తూర్పు పడమరల మధ్య ఎంత దూరం వుంచావో నన్ను పాపాలకు అంతే దూరంగా ఉంచు. ఓ నా దేవా! మాసిన బట్ట తెల్లబట్టలా ఎలా శుభ్రమవుతుందో నా పాపాలను అలా పూర్తిగా శుద్ధి చెయ్యి. దేవా! నా పాపాలను నీరు, మంచు, వడగండ్లతో కడిగివెయ్యి).

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 89వ అధ్యాయం - మాయఖూలు బాదత్తక్బీర్]

## 28వ అధ్యాయం - నమాజు కోసం పరుగెత్తరాదు, నింపాదిగా నడవాలి

350. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "నమాజు చేయడానికి జన సమూహం నిలబడినపుడు అందులో చేరడానికి పరుగెత్తిపోకూడదు. నింపాదిగా నడచి వెళ్ళాలి. సామూహిక నమాజులో మీకు ఏ మేరకు లభిస్తే ఆ మేరకు చేయండి. మిగిలిన భాగాన్ని వ్యక్తిగతంగా చేసి నమాజు పూర్తి చేసుకోండి".

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 18వ అధ్యాయం - అల్‌మష్‌యి ఇలల్ జుముఅ....]

351. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- మేమంతా ఓ రోజు దైవప్రవక్త (సల్లం)తో కలసి నమాజు చేస్తుంటే, కొందరు పరుగెత్తుకొస్తున్న అడుగుల చప్పుడు దైవప్రవక్త (సల్లం)కు విన్పించింది. నమాజు ముగిసిన తరువాత ఆయన వారిని ఉద్దేశించి "ఏమిటీ, ఏమయింది మీకు అలా పరుగెత్తుకొచ్చారు?" అని అడిగారు. దానికి వారు "మేము త్వరగా జమాఅత్ (సామూహిక నమాజు)లో

కలవడానికి పరుగెత్తాము" అని విన్నవించుకున్నారు.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) హితవు చేస్తూ "ఇక నుండి అలా చేయకండి. నమాజు చేయడానికి వచ్చినప్పుడల్లా హుందాగా, నింపాదిగా నడచి రండి. సామూహిక నమాజులో ఎంత భాగం లభిస్తే అంతే చేయండి. మిగిలిన భాగాన్ని మీరంతగా మీరు (వ్యక్తిగతంగా) చేసి నమాజును పూర్తి చేసుకోండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 20వ అధ్యాయం - ఖౌలిర్రజులి ఫఅతతునస్సలాత్]

## 29వ అధ్యాయం - నమాజు కోసం నిరీక్షణ

352. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒకసారి సామూహిక నమాజు కోసం ఇఖామత్ తక్బీర్ చెప్పబడింది. అది విని ప్రజలు బారులు తీరి నిలబడ్డారు. దైవప్రవక్త(సల్లం) నమాజు చేయించడానికి 'ముసల్లా' మీద కెళ్ళి నిల్చున్నారు. అంతలో తాను లైంగిక అశుద్ధావస్థలో ఉన్న సంగతి గుర్తుకు రావడంతో ఆయన "అందరూ మీ మీ స్థానాల్లో నిలబడండ"ని చెప్పి ఇంటికి వెళ్ళిపోయారు. స్నానం చేసి మళ్ళీ వచ్చారు. అప్పుడు ఆయన శిరస్సు నుండి నీటి బిందువులు రాలిపడుతుండేవి. ఆయన రాగానే అల్లాహు అక్బర్ అంటూ నమాజు చేయించడానికి ఉపక్రమించారు. మేమంతా ఆయన వెనుక నిలబడి నమాజు చేశాము.

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 17వ అధ్యాయం - ఇజాజకర్ ఫిల్ మస్జిది...]

## 30వ అధ్యాయం - సామూహిక నమాజులో ఒక్క రకాతు లభించినా అది సామూహిక నమాజే

353. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "ఎవరికైనా (సామూహిక) నమాజులో ఒక్క రకాతు లభించినా సరే అతని నమాజు మొత్తం సామూహిక నమాజుగా పరిగణించబడుతుంది."

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - అల్‌మవాకియతుస్సలాత్, 29వ అధ్యాయం - మన్ అద్రక మినస్సలాతి రక అతన్]

## 31వ అధ్యాయం - అయిదు నమాజుల వేళలు

354. హజ్రత్ అబూమస్‌వూద్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) ఓ సారి వచ్చి సామూహిక నమాజుకు నాయకత్వం వహిస్తే, నేను ఆయనతో కలిసి నమాజు చేశాను. మళ్ళీ (రెండోసారి) నమాజు చేశాను, తిరిగి (మూడవసారి) నమాజు చేశాను. ఆ తరువాత (నాల్గవసారి) నమాజు చేశాను, ఆపై (అయిదవసారి) నమాజు చేశాను". దైవప్రవక్త (సల్లం) ఈ విషయం చెబుతూ అయిదు (వేళల) నమాజులను వ్రేళ్ళమీద లెక్కపెట్టారు.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్‌యిల్ ఖల్క్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయిక్]

355. హజ్రత్ ఇబ్నెషిహాబ్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) ఓ రోజు ఆలస్యంగా నమాజు చేశారు. అప్పుడు హజ్రత్ ఉర్వాబిన్ జుబైర్ (రజి) వచ్చి హజ్రత్ ఉమర్ బిన్

అబ్దుల్ అజీజ్ (రహ్మాలై)తో ఇలా అన్నారు:- హజ్రత్ ముగైరా బిన్‌షొబ (రజి) ఇరాక్‌లో ఉన్న రోజుల్లో ఓసారి (ఇలాగే) ఆలస్యంగా నమాజు చేశారు. అప్పుడు ఆయన దగ్గరకు హజ్రత్ అబూ మస్‌వూద్ అన్సారీ (రజి) వచ్చి ఇలా అన్నారు -

"ముగైరా! ఏమిటి మీరిలా చేశారు! మీకు తెలియదా!? హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) వచ్చి నమాజు చేయించారు. దైవప్రవక్త(సల్లం) ఆయనతో కలసి నమాజు చేశారు. హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) మళ్ళీ నమాజు చేయించారు; దైవప్రవక్త (సల్లం) కోరి ఆయనతో కలసి మళ్ళీ నమాజు చేశారు. ఈ విధంగా ఆయన హజ్రత్ జిబ్రయీల్ (అలైహి)తో కలసి అయిదు(వేళల) నమాజులు చేశారు. తరువాత హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) ఆయనతో 'ఇలా నమాజు చేయాలని మీకు ఆజ్ఞ ఇవ్వబడింది' అని తెలియజేశారు".

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) ఈ మాటలు విని "ఉర్వా! ఆలోచించి మాట్లాడండి, మీరు చెబుతున్న దాన్ని బట్టి హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) దైవప్రవక్త (సల్లం)కు నమాజు వేళలు నిర్ణయించి తెలిపారని అర్థమవుతోంది" అని అన్నారు. దానికి హజ్రత్ ఉర్వా సమాధానమిస్తూ, "బషీర్ బిన్ అబూ మస్‌వూద్ అన్సారీ కూడ తమ తండ్రి (అబూమస్‌వూద్ అన్సారీ (రజి)) నోట ఇలాగే విని చెప్పారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖీయతుస్సలాత్, 1వ అధ్యాయం - మవాఖీయతుస్సలాతి వఫజ్లిహా]

356. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- సూర్యరశ్మి (ఎండ)పై కెక్కకుండా ఇంకా నా ఇంటి ముంగిట ఉంటుంది; ఆ సమయంలో దైవప్రవక్త(సల్లం) అస్ర్ నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖీయతుస్సలాత్, 1వ అధ్యాయం - మవాఖీయతుస్సలాతి వఫజ్లిహా]

## 32వ అధ్యాయం - ఎండ తీవ్రంగా ఉన్నప్పుడు జుహర్ నమాజు చేసే సమయం

357. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "నరక జ్వాలనం అధికమయినపుడు (ఇహలోకంలో) ఎండ తీవ్రమవుతుంది. అందువల్ల మీరు ఎండ తీవ్రమయినపుడు (కాస్త ఆలస్యం చేసి) వాతావరణం చల్లబడిన తరువాత (జుహర్) నమాజు చేయండి".

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖీయతుస్సలాత్, 9వ అధ్యాయం - అల్ ఇబ్రాది బిజ్జుహ్రి ఫీషిద్దతిల్ హర్రి]

358. హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) కథనం:- దైవప్రవక్త గారి ముఅజ్జిన్ (హజ్రత్ బిలాల్ -రజి) అజాన్ చెప్పడం మొదలెట్టారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) (ఆయన్ని వారిస్తూ) "చల్లబడని, కాస్త చల్లబడని" అన్నారు. లేక "కాస్త ఆగు, కాస్త ఆగు" అన్నారు. ఆ తరువాత "నరక తాపం తీక్షణమయినపుడు (ఇహలోకంలో) ఎండ తీవ్రమవుతుంది. అందుచేత ఎండ తీవ్రంగా ఉన్నప్పుడు వాతావరణం కాస్త చల్లబడిన తరువాత (జుహర్) నమాజు చేయండి" అని బోధించారు ఆయన(స). వేసవి కాలంలో దైవప్రవక్త(సల్లం) గుట్టల నీడ కన్పించేటంత ఆలస్యంగా జుహర్ నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖీయతుస్సలాత్, 9వ అధ్యాయం - అల్ఇబ్రాది బిజ్జుహ్రి ఫీషిద్దతిల్ హర్రి]

359. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నరకాగ్ని దైవాన్ని వేడుకుంటూ "ప్రభూ! నాలోని ఒక భాగాన్ని మరొక భాగం తినేసింది. (ఈ అత్యుష్ణాన్ని

భరించలేకపోతున్నా, నన్ను కాపాడు)" అన్నది. అప్పుడు దేవుడు దానికి (ఏటా) రెండు సార్లు ఊపిరిపీల్చుకోవడానికి అనుమతినిచ్చాడు. ఈ ఊపిరి పీల్చుకునే వేళలే మీరు (ప్రతి సంవత్సరం) చూస్తున్న ఎండా(కాలం), చలి(కాలం) తీవ్రతలు.

[సహీహ్ బుఖారీ: 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 9వ అధ్యాయం - అల్ ఇబ్రాది బిజ్జుహ్రి ఫీషిద్దతిల్ హ్ర్రి]

## 33వ అధ్యాయం - ఎండ తీవ్రంగా లేకపోతే జుహర్ నమాజ్ తొలి వేళకే చేయడం మంచిది

360. హజ్రత్ అనస్ (రజి) కథనం:- మేము ఎండ తీవ్రంగా ఉన్నప్పుడు దైవప్రవక్త(సల్లం) వెనుక జుహ్ర్ నమాజు చేసే వాళ్ళము. అప్పుడు (ఎండ తీవ్రత వల్ల) కొందరు తమ నుదుటిని నేలమీద ఆనించలేక ఒక గుడ్డ పరచుకొని దాని మీద 'సజ్దా' చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం - అల్ అమలు ఫిస్సలాత్, 9వ అధ్యాయం - బస్తిస్సాబి ఫిస్సలాతి లిస్సుజూద్]

## 34వ అధ్యాయం - అస్ర్ నమాజ్ తొలివేళ చేయడం మంచిది

361. హజ్రత్ అనస్ (రజి) కథనం:- పొద్దువాలిన తరువాత సూర్యకిరణాలు బాగా వాడిగా ఉన్నప్పుడు దైవప్రవక్త(సల్లం) అస్ర్ నమాజు చేసేవారు. నమాజు ముగించిన తరువాత ఎవరైనా మదీనా (పట్టణం వెలుపల) కొండ గుట్టల వైపు పోదలచుకుంటే, అతను అక్కడికి పొద్దువాలిపోయి సూర్యకిరణాలు వాడిగా ఉండగానే చేరుకుంటాడు. మదీనా కొండ గుట్టలలో కొన్ని నాలుగు మైళ్ళ దూరాన ఉన్నాయి. లేక సుమారు నాలుగుమైళ్ళ దూరాన ఉన్నాయి.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 13వ అధ్యాయం - వఖ్తిల్ అస్ర్]

362. హజ్రత్ అబూ అమామా (రహ్మాలై) కథనం:- ఒకసారి మేము హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై)తో కలసి జుహర్ నమాజు చేశాము. నమాజు ముగిసిన తరువాత మేము హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) దగ్గరకు వెళ్ళి చూస్తే ఆయన అస్ర్ నమాజ్ చేస్తూ ఉండటం కన్పించింది. (నమాజు అయిన తరువాత) "బాబాయి! మీరిప్పుడు చేసిన నమాజు ఏ వేళ నమాజు?" అని అడిగాను నేను. దానికాయన సమాధానమిస్తూ "అస్ర్ నమాజ్. మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి ఇలాంటి (వేళే) అస్ర్ నమాజు చేస్తూ ఉండేవాళ్ళము" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 13వ అధ్యాయం - వఖ్తిల్ అస్ర్]

363. హజ్రత్ రాఫెబిన్ ఖదీజ్ (రజి)కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి (పొద్దు చాలా ఉండగానే) అస్ర్ నమాజు చేసే వాళ్ళము. నమాజు ముగిసిన తరువాత మేము ఒంటెను కోసి దాని మాంసాన్ని పది భాగాలుగా విభజిస్తాము. ఆ మాంసాన్ని వండి, సూర్యాస్తమయం కాక మునుపే తినేసే వాళ్ళము.

[సహీహ్ బుఖారీ : 47వ ప్రకరణం - అష్షిరిక - 1వ అధ్యాయం - అష్షిర్కతి ఫిత్తఆమ్]

## 35వ అధ్యాయం - అస్ర్ నమాజు పోగొట్టుకుంటే కలిగే నష్టం ఎంత?

364. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైతే అస్ర్ నమాజు పోగొట్టుకుంటాడో (అంటే ఖజా చేస్తాడో) అతని ఇల్లు, సంపద, సామగ్రి సర్వం నాశనమయిపోయినట్లే."

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 14వ అధ్యాయం - ఇస్మిమన్ ఫాతతహు సలాతిల్అస్ర్]

## 36వ అధ్యాయం - 'సలాతుల్ వస్తా' అంటే అస్ర్ నమాజ్ అని చెప్పేవారి ప్రమాణం

365. హజ్రత్ అలీ (రజి) కథనం:- దైవప్రవక్త (స) అహ్జాబ్ యుద్ధం రోజుల్లో (బహుదైవారాధకుల్ని శపిస్తూ) "దేవుడు వారి ఇళ్ళను, సమాధుల్ని అగ్నితో నింపుగాక! సూర్యుడు అస్తమించినా వారు మనల్ని 'సలాతుల్ వస్తా' చేయనివ్వలేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 56వ ప్రకరణం - జిహాద్, 98వ అధ్యాయం - అద్దుఆ అలల్ ముష్రికీన....]

366. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కందకం యుద్ధకాలంలో (అంటే అహ్జాబ్ యుద్ధకాలంలో) ఓ రోజు సూర్యాస్తమయమయిన తరువాత దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చారు. ఆయన వచ్చీ రాగానే ఖురైష్ బహుదైవారాధకులకు శాపనార్థాలు పెడుతూ "దైవప్రవక్తా! (వీరి మూలంగా) నేను సూర్యాస్తమయమవుతున్నా అస్ర్ నమాజు ఇంతవరకు చేయలేకపోయాను" అని అన్నారు. దానికి దైవప్రవక్త (స) "దైవసాక్షి! నేను కూడా చేయలేక పోయాను" అని అన్నారు.

ఆ తరువాత మేమంతా బుత్హాన్ అనే ప్రదేశానికి చేరుకొని వుజూ చేశాము. అప్పుడు దైవప్రవక్త (స) సూర్యాస్తమయం అయిన తరువాత అస్ర్ నమాజ్ (సాముహికంగా) చేశారు. ఆ తరువాత (వెంటనే) మగ్రిబ్ నమాజు చేశారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 36వ అధ్యాయం - మన్సల్లా బిన్నాసి జమాఅతు బాద జహా బిల్ వఖ్]

## 37వ అధ్యాయం - ఫజ్ర్, అస్ర్ నమాజుల ఔన్నత్యం, వాటి పరిరక్షణ

367. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు:-"మీ దగ్గరకు రాత్రి దైవదూతలు, పగటి దైవదూతలు ఒకరి వెనుక మరొకరు వస్తారు. ఈ రెండు బృందాలు ఫజ్ర్, అస్ర్ నమాజులలో మాత్రం కలుస్తారు. రాత్రంతా మీతో పాటు గడిపిన దైవదూతలు తిరిగి ఆకాశంపైకి వెళ్ళినప్పుడు మీ ప్రభువు వారిని ఉద్దేశించి "మీరు నా దాసులను ఏ స్థితిలో వదలి పెట్టి వచ్చారు?' అని అడుగుతాడు. దానికి దైవదూతలు "మేము వారి దగ్గర్నుంచి బయలు దేరేటప్పుడు వారు నమాజు చేస్తూ ఉండటం కన్పించింది. అంతకు ముందు మేము వారి దగ్గరకు చేరుకున్నప్పుడు కూడా వారిని నమాజ్ స్థితిలోనే చూశాము" అని సమాధానమిస్తారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 16వ అధ్యాయం - ఫజ్లి స్సలాతిల్ అస్ర్]

368. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(స) చెంత (కూర్చొని) ఉండగా రాత్రి వేళ అయింది. అప్పుడు దైవప్రవక్త(స) ఆకాశంలో (పున్నమి) చంద్రుడ్ని చూసి మాతో ఇలా అన్నారు :

"ఇప్పుడు మీరు చంద్రుడ్ని ఎలా స్పష్టంగా చూస్తున్నారో అదే విధంగా త్వరలోనే మీరు (ప్రళయదినాన) మీ ప్రభువుని స్పష్టంగా చూస్తారు. ఆయన్ని దర్శించడంలో మీ ముందు ఎలాంటి ఆటంకం ఉండదు. అందువల్ల మీరు సూర్యోదయానికి పూర్వం చేయవలసిన (ఫజ్ర్) నమాజును, సూర్యాస్తమయానికి పూర్వం చేయవలసిన (అస్ర్) నమాజును చేయడంలో వీలైనంతవరకు మీ ముందు ఎలాంటి ఆటంకం ఏర్పడకుండా ఉండేలా కృషి చేయండి (అశ్రద్ధ, అలసత్వాలకు ఏ మాత్రం తావీయకండి.)"

ఇలా అన్న తరువాత " వ సబ్బిహ్ బిహమ్ది రబ్బిక ఖబ్లతులూ యిష్షమ్సి వ ఖబ్లల్ గురూబ్" (మీరు సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి పూర్వం మీ ప్రభువు ఔన్నత్యాన్ని స్తుతిస్తూ, ఆయన్ని స్మరించండి) అనే ఖుర్ఆన్ - (ఖాఫ్-39) సూక్తి పఠించారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 16వ అధ్యాయం - ఫజ్లి స్సలాతిల్ అస్ర్]

369. హజ్రత్ అబూమూసా అష్అరి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "రెండు చల్లని వేళల్లో చేయవలసిన (ఫజ్ర్, అస్ర్) నమాజులు (ప్రతి రోజు క్రమం తప్పకుండా) చేసే వ్యక్తి స్వర్గంలో ప్రవేశిస్తాడు."

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 26వ అధ్యాయం - ఫజ్లిస్సలాతిల్ ఫజ్ర్]

## 38వ అధ్యాయం - మగ్రిబ్ నమాజు వేళ సూర్యాస్తమయం కాగానే అవుతుంది

370. హజ్రత్ సల్మాబిన్ అకూ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి, సూర్యుడు పూర్తిగా తెరమరుగయిన తరువాత మగ్రిబ్ నమాజు చేసేవాళ్ళము.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 18వ అధ్యాయం - వఖ్తుల్ మగ్రిబ్]

371. హజ్రత్ రాఫె బిన్ ఖదీజ్ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి మగ్రిబ్ నమాజు చేసి (ఇండ్లకు) తిరిగి వెళ్తుంటే (పూర్తిగా చీకటి పడేది కాదు) మనిషి తన బాణం పడిన చోటును స్పష్టంగా చూడగలిగినంత వెలుగు వుండేది.★

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 18వ అధ్యాయం - వఖ్తిల్ మగ్రిబ్]

---

★ ఈ హదీసును 'ముస్నద్ అహ్మద్' గ్రంథంలోని ఒక ప్రామాణిక ఉల్లేఖనం వివరిస్తోంది. దీన్ని అలీబిన్ బిలాల్ (రహ్మలై) కొందరు అన్సారీ సహాబీల నుండి గ్రహించారు. వారిలా తెలియజేశారు:- "దైవప్రవక్త(సల్లం) కాలంలో మేము మగ్రిబ్ నమాజ్ చేసి వచ్చిన తర్వాత ధనుర్బాణపోటీల్లో పాల్గొనేవాళ్ళము. ఆ తర్వాత మేము ఇండ్లకు తిరిగివస్తాము. ఆ సమయంలో మేము బాణం వేసిన చోటును సయితం చూడగలిగేటంత వెలుగు ఉండేది. దీన్ని బట్టి మగ్రిబ్ నమాజ్ వేళ కాగానే వెంటనే చేయాలనీ, నమాజు దీర్ఘంగా కాకుండా సంక్షిప్తంగా చేయాలని తెలుస్తోంది. - సంకలనకర్త

## 39వ అధ్యాయం - ఇషా నమాజు వేళ, దాన్ని ఆలస్యంగా చేయడం గురించి

372. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక రోజు రాత్రి ఇషా నమాజు చాలా ఆలస్యంగా చేశారు (ఇది ఇస్లాం ఇంకా వ్యాపించని నాటి సంఘటన). హజ్రత్ ఉమర్ (రజి) వచ్చి "దైవప్రవక్తా! పిల్లలు, స్త్రీలు నిద్ర కూడా పోయారు" అని చెప్పేదాకా ఆయన ఇంటి నుంచి బయలుదేరలేదు. హజ్రత్ ఉమర్ (రజి) మాట విని ఆయన బయటికి వచ్చారు. మస్జిదులో సమావేశమయిన వారిని ఉద్దేశించి "ఈ సమయంలో మొత్తం భూలోక వాసుల్లో మీరు తప్ప మరెవ్వరూ ఈ నమాజు కోసం ఇంతగా నిరీక్షించడం లేదు" అని అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 22వ అధ్యాయం - ఫజ్లుల్ ఇషా]

373. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒక రోజు రాత్రి ఇషా నమాజు వేళ దైవప్రవక్త(స) ఏదో పనిలో నిమగ్నులయిపోవడం వల్ల మస్జిదుకు రావడం చాలా ఆలస్యమయిపోయింది. మేము మస్జిదులో ఆయన కోసం ఎదురు చూసి చూసి చివరకు నిద్రపోయాము. కాస్సేపటికి లేచి మళ్ళీ నిద్రపోయాము. ఆ తరువాత లేచి చూస్తే ఆయన వచ్చేశారు. (నమాజు చేయించిన) తరువాత ఆయన మమ్మల్ని ఉద్దేశించి "ఈ సమయంలో యావత్తు భూలోక వాసుల్లో మీరు తప్ప మరెవ్వరూ నమాజు కోసం (ఇంత తీవ్రంగా) ఎదురు చూడటం లేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 24వ అధ్యాయం - అన్నౌమిఖబ్లల్ ఇషాయి లిమన్ గులిబ్.....]

374. హజ్రత్ హుమైద్ (రహ్మాలై) కథనం:- "దైవప్రవక్త(స) ఉంగరం వాడారా?" అని ఒక వ్యక్తి హజ్రత్ అనస్ (రజి)ని అడిగాడు. దానికాయన సమాధానమిస్తూ ఇలా అన్నారు. "ఓ రోజు రాత్రి దైవప్రవక్త (స) ఇషా నమాజుకు చాలా ఆలస్యంగా అర్ధరాత్రి గడచిన తరువాత వచ్చారు. ఆ తరువాత ఆయన మమ్మల్ని ఉద్దేశించి "జనమంతా నమాజు చేసి పడుకున్నారు. మీరు నమాజు కోసం ఎంత సేపు నిరీక్షించారో అదంతా మీరు నమాజులో గడిపినట్లే లెక్క" అని అన్నారు. ఆయన ధరించిన ఉంగరం ఇప్పటికీ నా కళ్ళ ముందు వెలిగిపోతూ కన్పిస్తోంది."

[సహీహ్ బుఖారీ: 77వ ప్రకరణం - అల్లిబాస్, 48వ అధ్యాయం - ఫస్సిల్ ఖాతమ్]

375. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- నేను, ఓడలో నాతో పాటు వచ్చిన నా సహచరులు అందరం మదీనా వెలుపల 'బఖీ' అనే చోట కంకర్రాళ్ళ ప్రదేశంలో బస చేశాము. దైవప్రవక్త(స) మదీనాలో ఉన్నారు. అందువల్ల మాలో ఒక్కొక్క బృందం వంతులవారీగా ప్రతి రోజూ ఇషా వేళకు దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళేది. ఒక రోజు నా వంతు వచ్చింది. నేను కొందరు సహచరులతో కలసి దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళాను. అయితే ఆ రోజు యాదృచ్ఛికంగా దైవప్రవక్త(స)కు ఏదో పని తగలడం వల్ల ఆయన ఇషా నమాజుకు రావడం చాలా ఆలస్యమయిపోయింది. అర్ధరాత్రి గడచిపోయింది. అప్పుడు ఆయన వచ్చి నమాజు చేయించారు. నమాజు ముగిసిన తరువాత సభికుల్ని ఉద్దేశించి "ఆగండి. మీకో శుభవార్త! దేవుడు మీకెంతో మేలు చేశాడు. ఈ సమయంలో మీరు తప్ప మరెవరూ నమాజు చేయడం లేదు" అని అన్నారు. లేక "ఈ సమయంలో మీరు తప్ప మరెవరూ నమాజు చేయలేదు" అని అన్నారు. ఆ తరువాత మేము (మా విడిదికి) వెళ్ళిపోయాము. ఆ రోజు ఆయన నోట ఆ శుభవార్త విని మేమెంతో ఆనందించాము.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 22వ అధ్యాయం - ఫజ్లిల్ ఇషా]

376. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ఓ రోజు రాత్రి దైవప్రవక్త(స) ఇషా నమాజుకు చాలా ఆలస్యంగా వచ్చారు. జనం (ఆయన కోసం ఎదురు చూసి చూసి చివరకు) నిద్రపోయారు. ఆ తరువాత మరో కునుకు తీశారు. ఈ పరిస్థితి చూసి హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) లేచి "నమాజు (కోసం జన సమూహం) సిద్ధంగా ఉంద"ని దైవప్రవక్త(స)కు తెలియజేశారు. అది విని దైవప్రవక్త(స) బయటకు వచ్చారు. ఆయన తలమీద చేయి పెట్టుకొని రాసాగారు. తలపై నుండి నీటి బిందువులు రాలుతున్నాయి. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళ ముందు మెదలుతోంది. ఆ తరువాత దైవప్రవక్త (స) అనుచరుల్ని ఉద్దేశించి "నా అనుచర సమాజం ఇబ్బందులకు గురవుతుందన్న ఆలోచన నాకు కలగకపోయి ఉంటే, ఇలాగే (ప్రతి రోజూ ఆలస్యంగా) ఇషా నమాజు చేయాలని నేను ఆదేశించే వాడ్ని" అని అన్నారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) నోట హజ్రత్ అతా (రహ్మాలై) వినగా, ఆయన ద్వారా ఈ హదీసు ఉల్లేఖించిన హజ్రత్ ఇబ్నె జరీజ్ (రహ్మాలై) ఇలా తెలియజేశారు - "నేను అతా (రహ్మాలై)ను (ఈ హదీసు గురించి వివరాలు అడుగుతూ) "దైవప్రవక్త(స) తమ శిరస్సు మీద ఎలా చేయిపెట్టుకున్నారో హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మీకు చేసి చూపించినట్లు నాక్కూడా మీరు కాస్త చేసి చూపండి" అని విన్నవించుకున్నాను. అప్పుడు హజ్రత్ అతా (రహ్మాలై) నాకు చూపించడానికి, తన చేతివ్రేళ్ళను కాస్త ఎడం చేసి వాటి చివర్లను తల వైపుకు చుట్టూపోనిచ్చారు. తరువాత కణత, గడ్డం అంచు కలసి ఉన్న చెవి భాగాన్ని బొటనవ్రేలు స్పర్శించేలా చేతివ్రేళ్ళను తలమీద త్రిప్పారు. ఆయన ఇలా చేస్తున్నప్పుడు తొందరగా గాని, ఆలస్యంగా గాని చేయకుండా నింపాదిగా చేశారు. ఆ తరువాత దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించినట్లు తెలిపారు - "నా అనుచర సమాజం ఇబ్బందులకు గురవుతుందన్న ఆలోచన నాకు కలగకపోతే ఇలాగే (ప్రతి రోజూ ఆలస్యంగా) ఇషా నమాజు చేయాలని నేను ఆజ్ఞాపించేవాడ్ని."

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 24వ అధ్యాయం - అన్నౌమి ఖబ్లల్ ఇషాయి లిమన్ గులిబ్]

## 40వ అధ్యాయం - ఫజ్ర్ నమాజ్ చీకటి ఉండగానే తొలి ఉషస్సులో చేయడం మంచిది

377. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) నేతృత్వంలో ఫజ్ర్ నమాజు చేయడానికి ముస్లిం మహిళలు దుప్పట్లు కప్పుకొని మస్జిదుకు వెళ్ళేవారు. నమాజు ముగిసిన తరువాత వారు తమ తమ ఇండ్లకు మరలేటప్పుడు బయట తమను ఎవరూ గుర్తించలేనంత చీకటిగా ఉండేది.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 27వ అధ్యాయం - వఖ్తిల్ ఫజ్ర్]

378. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త(స) జుహర్ నమాజ్ మధ్యాహ్నం (సూర్యుడు వాలిన వెంటనే) చేసేవారు. అస్ర్ నమాజు సూర్యుడు (పశ్చిమదిశకు వాలిపోయి ఇంకా) స్పష్టంగా ప్రకాశిస్తున్న వేళ చేసేవారు. మగ్రిబ్ నమాజు సూర్యుడు అస్తమించగానే చేసేవారు. ఇషా నమాజు రాత్రివేళ ఒక్కొక్కసారి పొద్దుపోయి (ఆలస్యంగా) చేసేవారు, ఒక్కొక్కసారి కాస్త పెందలాడే చేసేవారు. అంటే జనం తొందరగా గుమికూడితే కాస్త త్వరగా, ఆలస్యంగా గుమికూడితే కాస్త

ఆలస్యంగా చేసేవారు. పోతే ఫజ్ర్ నమాజ్ - (ఇక్కడ ఈ హదీసు ఉల్లేఖించిన వ్యక్తికి కర్త ఎవరో సరిగా జ్ఞాపకం లేక) హజ్రత్ జాబిర్ (రజి) ముస్లిములో లేక దైవప్రవక్తో (స) చెప్పారని అంటూ ఇలా తెలియజేశాడు - చివరి జాము చీకటి ఇంకా మిగిలి ఉండగానే చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 18వ అధ్యాయం - వఖ్తిల్ మగ్రిబ్]

379. హజ్రత్ అబూ బర్జా అస్లమి (రజి) కథనం:- దైవప్రవక్త (స) జుహర్ నమాజు (మధ్యాహ్నం వేళ) సూర్యుడు నెత్తిమీది నుండి వాలగానే చేసేవారు. అస్ర్ నమాజు ఎలాంటి వేళలో చేసేవారంటే (నమాజు ముగిసిన తరువాత) ఎవరైనా మదీనా నగరం ఈ చివరి నుంచి ఆ చివరికి వెళ్ళి తిరిగొచ్చినా సూర్యుడు ఇంకా వాడిగా ప్రకాశిస్తూనే ఉంటాడు - మగ్రిబ్ నమాజు విషయంలో హజ్రత్ అబూ బర్జా (రజి) ఏం చెప్పారో ఇక్కడ ఈ హదీసు ఉల్లేఖించిన వ్యక్తికి గుర్తులేదు - దైవప్రవక్త(స) ఇషా నమాజు మూడింట ఒక రాత్రి గడిచేవరకూ చేయడంలో ఎలాంటి తప్పులేదని భావించేవారు. అయితే ఇషా నమాజుకు ముందు భోజనం చేయడం, ఇషా నమాజు తరువాత కబుర్లు చెప్పుకోవటం అంటే ఆయనకు నచ్చేదికాదు. (తెల్లవారుజామున) ఫజ్ర్ నమాజు ఎప్పుడు చేసేవారంటే నమాజు ముగిసిన తరువాత మనిషి తన స్నేహితుడ్ని చూస్తే సులభంగా గుర్తుపట్టగలడు. (ఈ నమాజుకు సంబంధించిన) రెండు (ఫర్జ్) రకాతుల్లో లేక ప్రతి రకాతులో అరవై మొదలు వంద ఆయత్‌ల (సూక్తుల) వరకు ఖుర్‌ఆన్ పఠనం చేసేవారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 104వ అధ్యాయం - అల్‌ఖిరాఅతి ఫిల్ ఫజ్ర్]

## 42వ అధ్యాయం - సామూహిక నమాజు ప్రాముఖ్యం, దీనిని పోగొట్టుకున్న వారికి హెచ్చరిక

380. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు :- "వ్యక్తిగత నమాజు కంటే జమాఅత్ (సంఘం)తో కలసి చేసే సామూహిక నమాజు ఇరవై ఐదు రెట్లు శ్రేష్ఠమైనది. ఫజ్ర్ నమాజు (సమయం)లో రాత్రి దైవదూతలు, పగటి దైవదూతలు పరస్పరం సమావేశమవు తారు".

హజ్రత్ అబూ హురైరా (రజి) ఈ హదీసు తెలిపిన తరువాత "(మీకు అంతగా నమ్మకం లేకపోతే) 'ఇన్న ఖుర్‌ఆనల్ ఫజ్రి కాన మష్హూదా' [నిస్సందేహంగా ఫజ్ర్ నమాజు (దైవదూతలు) సమావేశమయ్యే సమయం] అనే (ఖుర్‌ఆన్ 17:78) సూక్తి చదివి చూసుకోండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 31వ అధ్యాయం - ఫజ్లిస్సలాతిల్ ఫజ్రి ఫీజమాఅత్]

381. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "వ్యక్తిగతంగా (ఒంటరిగా) చేసే నమాజు కన్నా సామూహికంగా (సంఘంతో కలసి) చేసే నమాజు ఇరవై ఏడు రెట్లు శ్రేష్ఠమైనది."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 30వ అధ్యాయం - ఫజ్లి సలాతిల్ జమాఅత్]

382. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా అన్నారు:- "నా ప్రాణం

ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యం! కట్టెలు సమీకరించమని, అజాన్ ఇవ్వమని ఆజ్ఞాపించి, నమాజు చేయించడానికి నా స్థానంలో మరొకరిని నిలబెట్టి (సామూహిక నమాజులో పాల్గొనని) వారి దగ్గరకు వెళ్ళి వారి ఇండ్లను తగలబెడదామని నేను (ఎన్నో సార్లు) అనుకున్నాను. నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యం! ఇషా నమాజు చేస్తే ఓ పెద్ద మాంసపు ముక్కగాని లేదా శ్రేష్ఠమైన రెండు మేక కాళ్ళు గాని లభిస్తాయని తెలిస్తే వారు తప్పకుండా ఇషా నమాజు చేయడానికి (మస్జిదుకు) వచ్చేవారు".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 29వ అధ్యాయం - వజూబి సలాతిల్ జమాఅత్]

383. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "కపట విశ్వాసులకు ఫజ్ర్, ఇషా నమాజుల కంటే మరే నమాజూ భారంగా వుండదు. అయ్యో! ఈ రెండు నమాజులకు ఎంత పుణ్యం లభిస్తుందో తెలిస్తే వారీ నమాజుల్లో పాల్గొనడానికి మోకాళ్ళ మీద కుంటుకుంటూ రావలసి వచ్చినాసరే తప్పకుండా వస్తారు (కాని ఈ కపటులకసలు నా మాటల మీద నమ్మకమే లేదాయె). ముఅజ్జిన్‌కు ఇఖామత్ (పిలుపు) ఇవ్వమని చెప్పి, నమాజు చేయించడానికి (నా స్థానంలో) మరొకరిని నిలబడమని ఆజ్ఞాపించి నేను స్వయంగా అగ్నిజ్వాల తీసుకొని నమాజుకు ఇంకా రాని వారి ఇండ్లను తగలబెడదామని (ఎన్నోసార్లు) అనుకున్నాను."

[సహీహ్ బుఖారీ: 10వ ప్రకరణం - అజాన్, 34వ అధ్యాయం - ఫజ్లిల్ ఇషాయి ఫిల్ జమాఅత్]

## 47వ అధ్యాయం - సరైన కారణముంటే సామూహిక నమాజులో పాల్గొనకపోవడం ధర్మసమ్మతమే

384. మహ్మూద్ బిన్ రబీ అన్సారీ కథనం:- బద్ర్ యుద్ధంలో పాల్గొన్న ఒక అన్సారీ ముస్లిం హజ్రత్ ఇత్బాన్ బిన్ మాలిక్ (రజి) ఒక రోజు దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నాక్కాస్త దృష్టిలోపం ఉంది. నేను నా తెగవాళ్ళకు నాయకత్వం వహిస్తున్నాను. అయితే వర్షం కురిసినప్పుడల్లా నాకు, నా తెగవాళ్ళకు మధ్య వరద వస్తుంది. అప్పుడు నేను వారికి నాయకత్వం వహించి నమాజు చేయించడానికి వారి మస్జిద్‌కు వెళ్ళలేకపోతున్నాను. అందుచేత దైవప్రవక్తా! నాదొక విన్నపం. మీరొకసారి మా ఇంటికి వచ్చి నమాజు చేయిస్తే, ఆ పవిత్ర స్థలాన్ని నేను నమాజు కోసం ప్రత్యేకించుకుంటాను" అని అన్నారు. దానికి దైవప్రవక్త(సల్లం) "సరే దైవచిత్తమయితే నేను అలాగే చేస్తాను" అని అన్నారు.

హజ్రత్ ఇత్బాన్ (రజి) ఇలా అన్నారు: మరునాడు ఉదయం దైవప్రవక్త(సల్లం) హజ్రత్ అబూబకర్ (రజి)ని వెంటబెట్టుకొని వచ్చి ఇంట్లో ప్రవేశించడానికి అనుమతి కోరారు. నేను అనుమతి ఇచ్చాను. ఆయన లోపలికి వచ్చి కూర్చోకముందే "నేను మీ ఇంట్లో ఎక్కడ నమాజు చేయించాలని నీవు కోరుకుంటున్నావు?" అని అడిగారు. అప్పుడు నేను ఇంట్లో ఒక మూల చూపించాను. దైవప్రవక్త (సల్లం) వెంటనే ఆ చోట నిలబడి 'అల్లాహు అక్బర్' అంటూ నమాజు చేయించడానికి ఉపక్రమించారు. మేము కూడ ఆయన వెనుక వరుస తీరి నిల్చున్నాము. దైవప్రవక్త(సల్లం) రెండు రకాతులు నమాజు

చేయించారు. ఆ తరువాత మేము తయారు చేయించిన 'హలీం'★(ఓ ప్రత్యేకమైన వంటకం) పెడదామని ఆయన్ని ఆపాము".

హజ్రత్ ఇత్బాన్ (రజి) ఇంకా ఇలా తెలియజేస్తున్నారు. ఈ విందుకు వాడలోని మరికొందరు కూడా వచ్చారు. ఇలా చాలా మంది మా ఇంటికి వచ్చారు. అప్పుడొక వ్యక్తి 'మాలిక్ బిన్ దుఖైషెన్ ఏడి (రాలేదేమిటి)?' అని అడిగారు. అప్పుడు విందుకు వచ్చిన వారిలో మరొక వ్యక్తి సమాధానమిస్తూ "అతను కపట విశ్వాసి. దేవుని మీద, దైవప్రవక్త(సల్లం) మీద అతనికి అసలు అభిమానం ఉంటే కదా రావటానికి"! అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని అలా అనకు. అతను కేవలం దైవప్రసన్నత కోసం 'దేవుడు తప్ప మరే ఆరాధ్యుడు లేడని పలికిన సంగతి నీకు తెలియదా?' అని అన్నారు. దానికి ఆ వ్యక్తి, ఆ విషయం దేవునికి, ఆయన ప్రవక్త (సల్లం)కు మాత్రమే బాగా తెలుసు. కాని మాకు మాత్రం అతని ధోరణి చూస్తుంటే అతను కపట విశ్వాసులపైన్నే ఆసక్తి చూపుతూ వారి శ్రేయస్సునే కోరుతున్నట్లు అనిపిస్తోంది? అని అన్నారు. [అప్పుడు దైవప్రవక్త (సల్లం) 'కేవలం దైవప్రసన్నత కోసం దేవుడు తప్ప మరే ఆరాధ్యుడూ లేడని పలికే వ్యక్తికి దేవుడు నరకాగ్నిని నిషేధించాడు' అని అన్నారు."]

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 46వ అధ్యాయం - అల్ మసాజిద్ ఫిల్ బుయూత్]

385. హజ్రత్ మహమూద్ బిన్ రబీ (రజి) కథనం:- నాకు దైవప్రవక్త (సల్లం) బాగా గుర్తున్నారు. ఆయన మా వాడలో చేదతో నీళ్ళు తీసుకొని నోరు పుక్కిలించిన సంగతి కూడా నాకు జ్ఞాపకం వుంది. హజ్రత్ మహ్మూద్ (రజి) ఈ మాట చెప్పిన తరువాత, హజ్రత్ ఇత్బాన్ బిన్ మాలిక్ (రజి) ద్వారా గ్రహించిన పై హదీసును వివరించారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 154వ అధ్యాయం]

## 48వ అధ్యాయం - నఫిల్ నమాజ్ సామూహికంగా చేయడం ధర్మసమ్మతమే

386. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నమాజు చేస్తుంటే నేను ఆయన ప్రక్కనే కూర్చొని ఉండేదానిని. (కొన్నిసార్లు) నేను బహిష్టు అయి ఉండేదానిని. 'సజ్దా' చేసేటప్పుడు అనేకసార్లు ఆయన (స) గారి అంగవస్త్రం నాకు తగిలేది. హజ్రత్ మైమూన (రజి) ఇంకా ఇలా అంటున్నారు. ఆయన (స) ఖర్జూరపు చాపపై నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - అస్సలాత్ : 19వ అధ్యాయం]

## 49వ అధ్యాయం - సామూహిక నమాజు ప్రాముఖ్యం, దాని ఔన్నత్యం

387. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మనిషి తన ఇంట్లోనైనా వీధిలోనైనా ఒంటరిగా చేసే నమాజు కన్నా సామూహికంగా చేసే నమాజు పుణ్యం

---

★ ఇక్కడ మూలభాషలో 'ఖజీరా' అనే పదం వాడబడింది (హలీంకాదు). మాంసాన్ని చిన్న చిన్న ముక్కలుగా కోసి నీటిలో పోసి ఉడకబెడ్తారు. బాగా ఉడికిన తర్వాత అందులో పిండి కలిపి మరికాస్సేపు ఉడకబెడ్తారు. ఆ తర్వాత దాన్ని మెత్తగా రుబ్బుతారు. ఇలా తయారయిన వంటకాన్నే ఖజీరా అంటారు. (సంకలనకర్త)

రీత్యా పాతికరెట్లు శ్రేష్ఠమయినది. మనిషి శుభ్రంగా సముచిత రీతిలో వుజూ చేసి కేవలం నమాజు చేసే ఉద్దేశంతో మస్జిదుకు వెళ్తుంటే, మస్జిదులో ప్రవేశించే వరకు అతను వేసే ప్రతి అడుగుకు దేవుడు ఒక్కొక్కటి చొప్పున అతనికి (పరలోకపు) అంతస్తులను పెంచుతాడు. అదీగాక అతని వల్ల జరిగిన ఒక్కొక్క పాపాన్ని తుడిచివేస్తాడు. ఇక మస్జిదులో ప్రవేశించిన తరువాత సామూహిక నమాజు కోసం అతను ఎంతసేపు నిరీక్షిస్తాడో అంతసేపు అతనికి నమాజు చేసినంత పుణ్యం ప్రాప్తమవుతుంది. అతను తన నమాజు స్థానంలో కూర్చుని ఉన్నంతవరకు దైవదూతలు అతని శ్రేయస్సు కోసం ప్రార్థిస్తూ "దేవా! ఇతని వుజూ భంగం కానంతవరకు ఇతడ్ని క్షమించు, ఇతడ్ని కనికరించు" అని అంటారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 87వ అధ్యాయం - అస్సలాతి ఫీమస్జిదిస్సూఖ్]

## 50వ అధ్యాయం - నమాజు కోసం మస్జిదుకు వెళ్ళే వారికి అడుగడుగునా పుణ్యమే

388. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "మస్జిదుకు అందరికంటే ఎక్కువ దూరముండే వ్యక్తి నమాజు కోసం అందరికంటే ఎక్కువ దూరం నడవవలసి వస్తుంది. అందువల్ల అతనికే అందరికన్నా ఎక్కువ నమాజు పుణ్యం లభిస్తుంది. అలాగే (ఇషా) నమాజు తొందరగా చేసి పడుకునే వ్యక్తి కంటే ఇమామ్ వెనుక సామూహిక నమాజు కోసం ఎదురు చూసే వ్యక్తికి ఎక్కువ పుణ్యం లభిస్తుంది."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 31వ అధ్యాయం - సలాతిల్ ఫజ్రి ఫీజమాఅత్]

## 51వ అధ్యాయం - నమాజు కోసం మస్జిదుకు వెళ్తే పాపాలు క్షమించబడతాయి

389. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా అన్నారు:- "ఒక వ్యక్తి ఇంటి ముందు ఒక నది ప్రవహిస్తూ ఉంది, అతనా నదిలో ప్రతి రోజు అయిదుసార్లు స్నానం చేస్తూ ఉంటే, ఇక అతని శరీరం మీద మలినం ఉంటుందా? దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?"

దానికి ప్రవక్త అనుచరులు "అతని శరీరం మీద ఎలాంటి మలినం మిగిలి ఉండదు" అని అన్నారు ముక్తకంఠంతో. అప్పుడు దైవప్రవక్త(సల్లం), "రోజుకు అయిదుసార్లు నమాజు చేసే మనిషి పరిస్థితి కూడా అలాగే ఉంటుంది. అయిదు వేళలా నమాజు చేయడం వల్ల దాసుని పాపాలను దేవుడు క్షమిస్తాడు" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 6వ అధ్యాయం - అస్సలవాతుల్ ఖమ్సి కప్పారా]

390. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం నమాజు చేయడానికి మస్జిదుకు వెళ్ళే వ్యక్తి కోసం దేవుడు స్వర్గంలో విందు ఏర్పాటు చేస్తాడు".

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 37వ అధ్యాయం - ఫజ్లిమన్ ఘుదా ఇలల్ మస్జిది వరాహ]

## 53వ అధ్యాయం - నమాజు నాయకత్వానికి ఎక్కువ అర్హులెవరు?

391. హజ్రత్ మాలిక్ బిన్ హువైరిస్ (రజి) కథనం:- నేనొకరోజు నా తెగ వాళ్ళు కొందరిని వెంట

బెట్టుకొని దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను. మేమంతా ఆయన దగ్గర ఇరవై రాత్రులు గడిపాము. ఆయన ఎంతో దయామయులు, మృదు హృదయులు. మేము మా భార్యాబిడ్డల దగ్గరికి తిరిగి వెళ్ళదలచుకున్నప్పుడు ఆయన మమ్మల్ని సంబోధిస్తూ "మీరు (మీ స్వస్థలానికి) వెళ్ళిపోండి. మీ తెగ వాళ్ళలోనే ఉండి వారికి ధర్మశిక్షణ ఇవ్వండి, నమాజు చేయించండి. నమాజు వేళ అయినపుడు మీలో ఒకరు అజాన్ ఇవ్వాలి. అందరిలో కెల్లా ఎక్కువ వయస్సున్న వ్యక్తి నమాజులో నేతృత్వం వహించాలి" అని హితోపదేశం చేశారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 17వ అధ్యాయం - మన్‌ఖాల లియుజన్ ఫిల్ సఫరి ముఅజ్జిన్ వాహిద్]

## 54వ అధ్యాయం - ఏదైనా విపత్తు వచ్చి పడితే అన్ని నమాజుల్లో "ఖునూతె నాజిలా" పఠించాలి

392. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) రుకూ స్థితి నుండి తలపైకెత్తేటప్పుడు "సమిఅల్లాహులిమన్ హమిదహ్, రబ్బనా వలకల్ హమ్ద్' (దేవుడు స్తుతించేవారి స్తుతి పలుకుల్ని విన్నాడు; ప్రభూ! స్తుతిస్తోత్రాలు నీకే శోభిస్తాయి)" అని అనేవారు. ఆ తరువాత కొందరి పేర్లను ప్రస్తావించి "దేవా! వలీద్ బిన్ వలీద్‌ని, సల్మా బిన్ హెషామ్‌ని, అయ్యాష్ బిన్ అబీరబియ్యాని, (అవిశ్వాసుల దౌర్జన్యకాండకు గురి అయిన) నిరుపేద ముస్లింలందరినీ కాపాడు. దేవా! ముజీర్ తెగను అణచివెయ్యి. హజ్రత్ యూసుఫ్ (అలైహి) కాలంలో సంవత్సరాల తరబడి వచ్చిన కరువులాంటి కరువు విపత్తును ముజీర్ తెగమీద తెచ్చి పడవెయ్యి" అని ప్రార్థించారు. ఆ కాలంలో ముజీర్ తెగకు చెందిన తూర్పు వాసులు దైవప్రవక్త(సల్లం)కు విరోధులయి ఉన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 128వఅధ్యాయం - యహ్విబిత్తక్బీరి హీనయస్జుద్]

393. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) రీల్, జిక్వాన్, తెగలను శపిస్తూ వరుసగా ఒక నెల రోజుల పాటు 'ఖునూతె నాజిలా' పఠించారు. ★

[సహీహ్ బుఖారీ : 14వ ప్రకరణం - విత్ర్, 7వ అధ్యాయం - అల్ ఖునూతు ఖబ్లర్రుకూవబాద్]

394. హజ్రత్ ఆసిమ్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ అనస్ (రజి)ని 'దుఆయె ఖునూత్'ని గురించి అడిగితే "దుఆయెఖునూత్"ని రుకూ స్థితిలో పోవడానికి ముందు పఠిస్తారని" ఆయన సమాధానమిచ్చారు. "కాని రుకూ స్థితి నుండి పైకి లేచిన తరువాత 'దుఆయె ఖునూత్' పఠిస్తారని మీరు చెప్పినట్లుగా ఫలానా వ్యక్తి వాదిస్తున్నాడే?" అన్నాను నేను. హజ్రత్ అనస్ (రజి) ఆ విషయాన్ని ఖండిస్తూ " ఆ వ్యక్తి అబద్ధం చెప్పాడు" అని అన్నారు. ఆ తరువాత ఆయన అసలు విషయాన్ని తెలియజేస్తూ ఇలా అన్నారు: "దైవప్రవక్త (సల్లం) ఒక నెల రోజుల పాటు రుకూ స్థితి నుండి తలపైకెత్తిన తరువాత 'ఖునూతె నాజిలా' పఠించారు. అందులో ఆయన బనీసలీంకు చెందిన కొన్ని ఉప తెగలను శపించారు" అని అన్నారు. హజ్రత్ అనస్ (రజి) (ఆ తెగల నిర్వాకం గురించి తెలుపుతూ) "ఆ బహుదైవారాధకుల వైపుకు నలభై లేక డెబ్బై మంది ఖారీ (నిబద్ధపాఠకు)లను (ఖారీల సంఖ్య

---

★ రీల్, జిక్వాన్ అనేవి బనీసలీమ్‌కు చెందిన రెండు ఉపతెగలు. ఈ తెగలవాళ్ళు 'బైర్ మవూన' అనే ప్రాంతంలో 70 మంది సహాబీలను మోసగించి హతమార్చారు.

కచ్చితంగా ఎంతో హదీసు ఉల్లేఖకునికి గుర్తులేదు) పంపితే వారిపై ఆ దుర్మార్గులు దాడి చేసి హతమార్చారు. దైవప్రవక్త(సల్లం)కు, ఆ తెగలకు మధ్య శాంతి ఒప్పందం జరిగినప్పటికీ వారు దాన్ని ఖాతరు చేయలేదు. ఈ సంఘటనతో దైవప్రవక్త (సల్లం) ఆ తెగలపై ఆగ్రహోదగ్రులయిపోయారు. ఆయనలో అంతటి ఆగ్రహాన్ని నేనిది వరకెప్పుడూ చూడలేదు.''

[సహీహ్ బుఖారీ : 58వ ప్రకరణం - అల్‌జజ్‌యా - 8వ అధ్యాయం - దుఆ ఇల్ ఇమామి అలా మన్నకస అహదా]

395. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కొందరు ఖారీలను పంపితే (దారిలో) వారు హతమార్చబడ్డారు. ఈ సంగతి విని దైవప్రవక్త(సల్లం) ఎంతో బాధపడ్డారు. ఆయన గతంలో ఇంత బాధపడినట్లు నేనెన్నడూ చూడలేదు. ఈ సంఘటన తరువాత ఆయన ఒక నెల దాకా ఫజ్ర్ నమాజులో "ఖునూతె నాజిలా'' పఠించారు. అందులో ఆయన "దేవునికి, దైవప్రవక్తకు ఉసయ్య ద్రోహం చేశాడు" అని అంటుండేవారు.

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 58వ అధ్యాయం - అద్దు ఆవు అలల్ ముష్రికీన్]

## 55వ అధ్యాయం - ఖజా నమాజు త్వరగా నెరవేర్చాలి

396. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం:- ఓసారి మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి ప్రయాణం చేస్తూ (ఒక రోజు) రాత్రంతా నడిచాము. తెల్లవారుతూ ఉండగా ఓ చోట విడిది చేసి పడుకున్నాం. రాత్రంతా మేల్కొనడం వలన పడుకోగానే గాఢనిద్ర పట్టింది. చివరికి లేచి చూస్తే సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాశించసాగాడు. అందరి కంటే ముందు హజ్రత్ అబూబకర్ (రజి) మేల్కొన్నారు. దైవప్రవక్త(సల్లం) స్వయంగా మేల్కొనంతవరకు ఆయన్ని ఎవరూ లేపకూడదని ముందు నుంచే ఒక రివాజు వుంది (అందుచేత ఆయన్ని ఎవరూ లేపలేదు). ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) మేల్కొన్నారు. హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త(సల్లం) తలవైపు కూర్చొని "అల్లాహు అక్బర్! అల్లాహు అక్బర్''!! అంటూ బిగ్గరగా చెప్పసాగారు. దాంతో చివరికి దైవప్రవక్త(సల్లం) కూడా మేల్కొన్నారు. (వెంటనే) ఆయన మాకు (నాయకత్వం వహించి) నమాజు చేయించారు.

అప్పుడు ఒకతను మాతోపాటు కలసి నమాజు చేయలేదు. నమాజు ముగిసిన తరువాత దైవప్రవక్త (సల్లం) అతడ్ని పిలిపించి "నీవు మాతో పాటు నమాజు ఎందుకు చేయలేదు?'' అని అడిగారు. దానికావ్యక్తి "నేను (లైంగిక) స్నానం చేయవలసిన పరిస్థితి వచ్చింది'' అని అన్నాడు. "అయితే (నీళ్ళు లభించని పక్షంలో) మన్నుతో తయమ్ముమ్ చేసుకో'' అని ఆదేశించారు దైవప్రవక్త(సల్లం). అప్పుడా వ్యక్తి తయమ్ముమ్ చేసి నమాజు చేశాడు.

మేమంతా తీవ్రమైన దప్పికతో ఉన్నాము. అందువల్ల దైవప్రవక్త (సల్లం) నన్ను కొందరు వాహనరోహకులతో కలసి ముందుకు సాగమని పురమాయించారు. మేము ముందు ముందు నడవసాగాము. కొంత దూరం ప్రయాణించాక ఒక చోట హఠాత్తుగా ఒక స్త్రీ కన్పించింది. ఆమె తన రెండు కాళ్ళను రెండు పెద్ద నీటి తిత్తుల మధ్య (ఒంటెపై) వ్రేలాడదీసి వెళ్తోంది. మేమామెను "(ఇక్కడెక్కడైనా) నీళ్ళున్నాయా?'' అని అడిగాము. ఆమె లేవన్నది. "సరే నీ ఇంటికి, నీటికి మధ్య ఎంత దూరం ఉంది?'' అని మళ్ళీ అడిగాము. దానికామె "ఒక పగలు, ఒక రాత్రి'' అని

సమాధానమిచ్చింది. "సరే దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్దాం పద" అన్నాము మేము. అందుకామె "దైవప్రవక్త ఎవరో నేనెరగను" అన్నది. చివరికి మేము ఒత్తిడి తెచ్చి ఆమెను దైవప్రవక్త(సల్లం) సన్నిధికి తీసికెళ్ళాము.

ఆ స్త్రీ దైవప్రవక్త(సల్లం)తో కూడా మాతో అన్న మాటలే అన్నది. దాంతో పాటు తాను అనాథ పిల్లలను పోషిస్తున్నానని చెప్పింది. దైవప్రవక్త(సల్లం) ఆమెను నీటి తిత్తులు తెరవమని ఆదేశించారు. ఆ తరువాత ఆయన నీటి తిత్తుల మూతులపై చేయి తిప్పారు. అప్పుడు మేము నలభై మంది దాహార్తులు ఆ నీటి తిత్తులలో నుంచి తనవి తీరా నీళ్ళు త్రాగాము. అంతేకాదు, మా దగ్గరున్న మొత్తం పాత్రలు తోలుతిత్తుల్ని కూడా నీటితో నింపుకున్నాము. ఒంటెలకు మాత్రం నీళ్ళు తాపలేదు. అటు ఆ స్త్రీ నీటి తిత్తుల్ని చూస్తే, ఒక్క చుక్క కూడా తగ్గకుండా యథాతథంగా నీళ్ళు నిండి ఉన్నాయి.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) " మీ దగ్గర ఉన్న ఆహార పదార్థాలు తీసుకురండి" అని (అనుచరుల్ని) ఆదేశించారు. దాంతో మేము మా దగ్గరున్న రొట్టెలు, ఖర్జూర పండ్లు అన్నీ ప్రోగుచేసి ఆ స్త్రీకి ఇచ్చి వేశాము. ఆమె వాటిని తీసుకొని ఇంటికి వెళ్ళిపోయింది. వెళ్ళి తన కుటుంబ సభ్యులకు (ఈ విచిత్ర సంఘటనను తెలియజేస్తూ) "ఈ రోజు నేను ఓ గొప్ప మాంత్రికుడ్ని కలుసుకున్నాను. లేదా అందరూ అనుకున్నట్లు ఆయన నిజంగా దైవప్రవక్త అయి ఉండవచ్చు" అని చెప్పింది. ఆ స్త్రీ మూలంగా దేవుడు ఆ ఊరి ప్రజలందరికీ సన్మార్గం చూపించాడు. ఈ విధంగా ఆ స్త్రీ కూడా ముస్లిం అయిపోయింది; ఆ ఊరి ప్రజలు కూడా ముస్లింలయిపోయారు.

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతున్న బువ్వతి ఫిల్ ఇస్లాం]

397. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "ఎవరయినా ఏదయినా నమాజు వేళకు చేయడం మరచిపోతే జ్ఞాపకం వచ్చిన వెంటనే అతనా నమాజు చేయాలి. మరచిపోయిన నమాజుకు అదే నిష్కృతి. 'వ అఖిమిస్సలాతలిజిక్రీ' (నా జ్ఞాపకార్థం నమాజు వ్యవస్థను నెలకొల్పండి)". (ఖుర్ఆన్ - 20:14)

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 37వ అధ్యాయం - మన్ నసియ సలాతన్ ఫల్ యుసల్లిహా ఇజా జకరహా]

# ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం

## 1వ అధ్యాయం - బాటసారి నమాజు, ప్రయాణావస్థలో నమాజు సంక్షిప్తీకరణ

398. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దేవుడు (ప్రారంభంలో) నమాజు విధిగా చేయాలని నిర్ణయించినప్పుడు ప్రయాణావస్థలో ఉన్నా, లేకపోయినా రెండేసి రకాతులు విధిగా చేయాలని ఆదేశించాడు. అయితే ఆ తరువాత కొన్నాళ్ళకు ప్రయాణావస్థలో రకాతుల సంఖ్యను ఇదివరకటిలాగే యథాతథంగా ఉంచి, ప్రయాణావస్థలో లేనప్పుడు నిర్వర్తించవలసిన రకాతుల సంఖ్యను పెంచడం జరిగింది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 1వ అధ్యాయం - కైఫఫర్జియ తిస్సలాతు ఫిల్ ఇస్రా]

399. హజ్రత్ హఫ్స్ బిన్ ఆసిమ్ (రహ్మలై) కథనం ప్రకారం హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా తెలియజేశారు:- నేను (ఓసారి ప్రయాణంలో) దైవప్రవక్త (స) వెంట ఉన్నాను. ఆయన (ఈ) ప్రయాణంలో సున్నత్ నమాజులు చేస్తూ ఉండగా నేను చూడలేదు. కాగా; దేవుడు (ఖుర్ఆన్‌లో) "దైవప్రవక్త (జీవనసరళి)లో మీకొక చక్కని ఆదర్శం ఉంది" అని అన్నాడు. (33:21)

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 11వ అధ్యాయం - మన్‌ల్లమ్ యతతవ్వుఫిస్సఫ్రి దుబుర సలవాత్]

400. హజ్రత్ అనస్ (రజి) కథనం:- నేను మదీనాలో దైవప్రవక్త (స) వెనుక నాలుగు రకాతులు జుహర్ నమాజు చేశాను; 'జుల్ హులైఫా'లో రెండు రకాతులు అసర్ నమాజు చేశాను.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 5వ అధ్యాయం - యఖ్సురు ఇజా ఖరజ మిమ్మవుజా....]

401. హజ్రత్ అనస్ (రజి)కథనం:- మేమొకసారి దైవప్రవక్త(స) వెంట మదీనా నుండి మక్కాకు బయలుదేరాము. ఈ ప్రయాణంలో మేము (మక్కా నుండి) తిరిగి మదీనా చేరుకునే వరకు రెండేసి రకాతులు (మాత్రమే ఫర్జ్) నమాజ్ చేశాము.

హజ్రత్ యహ్యా బిన్ అబూ ఇస్‌హాఖ్ (రహ్మలై) ఈ హదీసు విని "మరి మీరు మక్కాలో ఎన్ని రోజులు విడిది చేశారు?" అని అడిగారు. దానికి హజ్రత్ అనస్ (రజి) "మక్కాలో మేము పది రోజులు ఉన్నాము" అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 1వ అధ్యాయం - మాజాఅఫిత్తఖ్సీరి వకమ్ యుఖీము హత్తాయుఖస్సిర్]

## 2వ అధ్యాయం - 'మినా'లో ఖస్ర్ నమాజు చేయడం

402. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో కలసి, హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి)లతో కలసి కూడా 'మినా' (ప్రదేశం)లో రెండు రకాతులు (ఖస్ర్ నమాజు) చేశాను. హజ్రత్ ఉస్మాన్ (రజి) గారి పరిపాలనా కాలంలో కూడా ఆయనతో కలసి నేను (మినాలో) రెండు రకాతులు మాత్రమే (ఖస్ర్ నమాజు) చేశాను. అయితే ఆ తరువాత

ఆయన (ప్రయాణావస్థలో) పూర్తిగా (నాలుగు రకాతులు) నమాజు చేయడం ప్రారంభించారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 2వ అధ్యాయం - అస్సలాతి బిమినా]

403. హజ్రత్ హారిస్ బిన్ వహబ్ ఖుజాయి(రజి) కథనం:- మేమొకసారి 'మినా'లో దైవప్రవక్త(సల్లం)తో కలసి రెండు రకాతులు 'ఖస్ర్ నమాజు' చేశాము. ఆనాడు మేము గతంలో కన్నా అత్యధిక సంఖ్యలో ఉన్నాము. పూర్వం కన్నా అప్పుడు ఎక్కువ శాంతియుత వాతావరణంలో ఉన్నాము.

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 84వ అధ్యాయం - అస్సలాతి బిమినా]

## 3వ అధ్యాయం - వర్షం పడుతున్నప్పుడు ఇంట్లోనే నమాజు చేయవచ్చు

404. హజ్రత్ నాఫె (రహ్మాలై) కథనం:- ఒక రోజు రాత్రి తీవ్రమయిన ఈదురుగాలులు వీస్తున్నప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) అజాన్ (నమాజ్ కొరకు పిలుపు) ఇచ్చారు. అయితే ఆ అజాన్‌లో (నమాజు కొరకు రండి అని చెప్పడానికి బదులు) "ప్రజలారా! మీ ఇండ్లలోనే నమాజు చేసు కోండి" అని అన్నారు. ఇలా అజాన్ ఇచ్చిన తరువాత, రాత్రివేళ బాగా చలి వున్నప్పుడు గాని, వర్షం కురుస్తున్నప్పుడు గాని, మీ మీ ఇండ్లలోనే నమాజు చేసుకోండి అంటూ అజాన్ ఇవ్వాలని దైవప్రవక్త(సల్లం) ముఅజ్జిన్‌ని ఆదేశించేవారు" అని తెలియజేశారు. ★

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 40వ అధ్యాయం - అర్రుఖ్సతు ఫిల్ మతరి వల్ ఇల్లతి అయ్యు సల్లి]

405. ఒకసారి (శుక్రవారం నాడు) హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) అజాన్ ఇవ్వమని ముఅజ్జిన్‌ని ఆజ్ఞాపిస్తూ, అజాన్‌లో 'అష్హదు అన్న ముహమ్మదర్రసూలుల్లాహ్' అని పలికిన తరువాత హయ్యా అలస్సలాహ్ అని చెప్పకుండా 'సల్లూ ఫీ బుయూతికుమ్' (మీమీ ఇండ్లలోనే నమాజు చేయండి) అని చెప్పాలని అన్నారు. ఈ మాటలు విని జనం ఆశ్చర్యపోయారు. అప్పుడు హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) వారి ఆశ్చర్యాన్ని పటాపంచలు చేస్తూ "నా కంటే ఎంతో శ్రేష్ఠుడయిన మహనీయులు (సల్లం) ఈ విధంగానే ఆచరించారు. జుమా నమాజ్ విధిగా చేయవలసిన ప్రార్థన అన్నది నిజమే. కాని మిమ్మల్ని బురదలో, జారుటలో నడిపించి ఇబ్బందులకు గురి చేయడం నాకిష్టం లేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 14వ అధ్యాయం - అర్రుఖ్సతు లిమన్ లమ్ యహ్ జురిల్ జుము అ ఫిల్ మతర్]

## 4వ అధ్యాయం - ప్రయాణంలో వాహనంపై (నడుస్తూ) నమాజు చేయవచ్చు

406. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా అన్నారు:- దైవప్రవక్త(సల్లం) ప్రయాణం చేస్తూ

---

★ ఈ హదీసులో చలి, గాలులను గురించి ప్రస్తావన వచ్చింది. అంటే తీవ్రమైన చలి, తుఫాను గాలి అని అర్థం తీశారు ధర్మవేత్తలు. అదే విధంగా తీవ్రమైన మండుటెండల్లో కూడా నమాజు ఇంట్లోనే చేసుకునే అనుమతి ఉంది. పోతే కుండపోత వర్షం రాత్రివేళ కురుస్తున్నా, పగటివేళ కురుస్తున్నా నమాజు ఇంట్లోనే చేసుకోవచ్చు. కాని తుఫాను గాలి విషయంలో రాత్రివేళలో మాత్రమే నమాజు ఇంట్లో చేసుకునే అనుమతి ఉంది. దానిక్కారణం రాత్రివేళలోనే ఎక్కువ బాధ, శ్రమ ఉంటాయి. అయితే హజ్రత్ ఉమర్ (రజి), తుఫాను గాలిలో కూడ కుండపోత వర్షంలో లాగే బాధ ఉంటుందని అభిప్రాయపడ్డారు. ఇంట్లో నమాజు ఒంటరిగా చేయవచ్చు, సామూహికంగా కూడా చేయవచ్చు. హదీసులో ప్రస్తావించిన తీరును గమనిస్తే, సామూహిక నమాజు అసలు స్థానం మస్జిద్ మాత్రమే గనక, (ఇంట్లో) నమాజు ఒంటరిగానే చేసుకోవాలన్న భావమే స్ఫురిస్తోంది.

వాహనం మీద కూర్చొని ఉండే నమాజు చేసేవారు. వాహనం ఏ దిక్కుకు తిరిగి నడుస్తున్నా సరే దాని మీదే నమాజు చేసేవారు (రుకూ, సజ్దాలు) సైగల ద్వారా నిర్వర్తించేవారు. ఇది రాత్రివేళ నమాజు. ఫర్జ్ నమాజులు తప్ప (ఫర్జ్ నమాజును వాహనం దిగి చేసేవారు) ఇతర (సున్నత్, నఫిల్) నమాజులన్నీ ఇలా (వాహనం మీద కూర్చొని) చేసేవారు. వితర్ నమాజు కూడా వాహనం మీద కుర్చొనే చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 14వ ప్రకరణం - వితర్, 6వ అధ్యాయం - అల్ వితరి ఫిస్సఫర్]

407. హజ్రత్ ఆమిర్ బిన్ రబీయ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) వాహనంపై కూర్చొని ప్రయాణం సాగిస్తూనే రాత్రివేళ నఫిల్ నమాజు చేస్తూ ఉండటం నేను చూశాను. వాహనం ఏ దిశవైపుకు నడుస్తున్నా సరే (ఆ దిశవైపుకే ముఖం పెట్టి నమాజు చేసేవారు).

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 12వ అధ్యాయం - మన్ తతవ్వవుఫిస్సఫరి ఫీగైరి దుబురి స్సలాత్]

408. హజ్రత్ అనస్ బిన్ సైరీన్ (రహ్మాలై) కథనం:-హజ్రత్ అనస్ (రజి) ఓ రోజు సాయంత్రం వచ్చినపుడు మేము ఆయనకు స్వాగతం చెప్పడానికి వెళ్ళాము. మేము ఆయన్ని 'ఐనిత్తమర్' అనే ప్రదేశంలో కలుసుకున్నాము. అప్పుడు ఆయన గాడిద మీద కూర్చొని (ప్రయాణం చేస్తూనే) నమాజు చేస్తూ వుండటం నేను చూశాను. (నమాజులో) ఆయన ముఖం ఖిబ్లా నుండి కుడి వైపుకు వుంది. అందువల్ల (నమాజు ముగిసిన తరువాత) నేనీ విషయాన్ని విచారిస్తూ "మీరు నమాజు చేస్తున్నప్పుడు మీ ముఖం ఖిబ్లా వైపు కాకుండా వేరే దిశకు ఉండటం కన్పించిందే?" అని అన్నాను. దానికి హజ్రత్ అనస్ (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త(సల్లం) గనక ఇలా చేసి ఉండకపోతే నేనీ విధంగా చేసేవాణ్ణి కాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 10వ అధ్యాయం - సలాతితవ్వవు అలల్ హిమార్]

## 5వ అధ్యాయం - ప్రయాణావస్థలో ఒకేసారి రెండు (వేళల) నమాజులు చేయవచ్చు

409. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ప్రయాణావస్థలో త్వరగా వెళ్ళాలనుకున్నప్పుడు, మగ్రిబ్ నమాజ్ని వేళకాగానే చేయకుండా (ఇషావేళ సమీపించే వరకు) ఆలస్యం చేసేవారు. ఆ తరువాత మగ్రిబ్, ఇషా నమాజులు కలిపి ఒకేసారి చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 6వ అధ్యాయం - యుసల్లిల్ మగ్రిబి సలాసన్ ఫిస్సఫర్]

410. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) సూర్యుడు నెత్తి మీద నుండి వాలక ముందే ప్రయాణం చేయవలసి వస్తే జుహర్ నమాజ్ని వేళకాగానే చేయకుండా అసర్ వేళ సమీపించే వరకు ఆలస్యం చేసేవారు. తరువాత (అసర్వేళకు) ఒక చోట ఆగి (జుహర్, అసర్) రెండు నమాజులు కలిపి ఒకేసారి చేసేవారు. ఒకవేళ ఆయన ప్రయాణమవడానికి ముందే సూర్యుడు నెత్తి మీద నుండి వాలితే జుహర్ నమాజు చేసిన తరువాత బయలుదేరేవారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 16వ అధ్యాయం - ఇజా అర్తహల్ బాద మాజాగతిష్షమ్సు సలాఅజ్జుహ్ర సుమ్మ రకబ్]

## 6వ అధ్యాయం - ప్రయాణావస్థలో లేనపుడు రెండు నమాజులు కలిపి చేయడం

411. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (సల్లం)తో కలసి (జుహర్, అసర్ వేళలకు చెందిన) ఎనిమిది రకాతుల నమాజు, (మగ్రిబ్, ఇషావేళలకు చెందిన) ఏడు రకాతుల నమాజు కలిపి చేశాను.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 30వ అధ్యాయం - మల్లమ్ యత తవ్వు బాదల్ మక్తూబా]

## 7వ అధ్యాయం - నమాజు ముగిసిన తరువాత ఇమామ్ కుడివైపో, ఎడమవైపో తిరిగి కూర్చోవచ్చు

412. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- ఏ మనిషి కూడా తన నమాజులో షైతాన్‌కు భాగం ఇవ్వకూడదు. (నమాజు ముగిసిన తరువాత) మనిషి కుడివైపుకే తిరిగి కూర్చోవాలని నిర్ణయించుకోవడం కూడ నమాజులో షైతాన్‌కు భాగం కల్పించడమే అవుతుంది. దైవప్రవక్త(సల్లం) ఎన్నోసార్లు ఎడమవైపుకు తిరిగి కూర్చోవడాన్ని నేను చూశాను.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 195వ అధ్యాయం - అల్ఇన్ఫితాలి వల్ ఇన్సిరాఫి అనిల్‌యమీని వష్షిమాల్]

## 9వ అధ్యాయం - ఇఖామత్ చెప్పిన తర్వాత నఫిల్ నమాజు ప్రారంభించరాదు

413. హజ్రత్ అబ్దుల్లా బిన్ మాలిక్ (రజి) కథనం:- ఫజ్ర్ వేళ (ముఅజ్జిన్) తక్బీరె ఇఖామ చెప్పిన తరువాత ఒక వ్యక్తి రెండు రకాతుల సున్నత్ నమాజు చేస్తూ ఉండటాన్ని దైవప్రవక్త(సల్లం) గమనించారు. (ఫర్జ్) నమాజు ముగిసిన తరువాత జనం దైవప్రవక్త (సల్లం) చుట్టూ గుమిగూడారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆ వ్యక్తిని ఉద్దేశించి "ఏమిటీ, ఫజ్ర్ వేళ నాలుగు రకాతుల నమాజు ఉన్నదా? నాలుగు రకాతుల నమాజ్ ఉన్నదా?!" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 38వ అధ్యాయం - ఇజా అఖీమతిస్సలాతు ఫలా సలాత ఇల్లల్ మక్తూబా]

## 11వ అధ్యాయం - ప్రతి వేళా రెండు రకాతుల తహ్యాతుల్ మస్జిద్ నమాజ్ చేయడం అభిలషణీయం

414. హజ్రత్ అబూ ఖతాద (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "మస్జిదులో ప్రవేశించిన వ్యక్తి కూర్చోవడానికి ముందు రెండు రకాతులు (తహ్యాతుల్ మస్జిద్) నమాజు చేయాలి."

[సహీహ్ బుఖారీ: 8వ ప్రకరణం - సలాత్, 60వ అధ్యాయం - ఇజా దఖలుల్ మస్జిద్ ఫల్ యర్కవు రకతైన్]

## 12వ అధ్యాయం - ప్రయాణం నుండి తిరిగి రాగానే ముందు మస్జిద్ కెళ్ళి రెండు రకాతుల నమాజు చేయడం అభిలషణీయం

415. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(సల్లం)తో కలసి ఒక

యుద్ధంలో పాల్గొన్నాను. అయితే తిరుగు ప్రయాణంలో నా ఒంటె అలసిపోవడం వలన నేను వెనుకపడ్డాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నా దగ్గరకు వచ్చి "ఎవరు జాబిరా?" అని అన్నారు. "ఔనండి, నేను జాబిర్‌నే" అన్నాను నేను. "ఏమిటీ, ఏమయింది (వెనకబడ్డావు)?" అని అడిగారు ఆయన. "నా ఒంటె బాగా అలసిపోయింది. అందువల్ల నేను కాస్త వెనకబడిపోయాను" అన్నాను నేను.

రెండో రోజు ఉదయం చేరుకున్నాను నేను. మస్జిదు వైపుకు వస్తుంటే, దైవప్రవక్త(సల్లం) నన్ను, మస్జిదు ద్వారం దగ్గర కలసి "నీవిప్పుడు చేరుకున్నావా?" అని అడిగారు. నేను ఔనండీ! అన్నాను. "సరే నీ ఒంటెను ఇక్కడే వదిలి ముందు మస్జిద్ కెళ్ళి రెండు రకాతులు (నఫిల్) నమాజు చేసుకో" అని అన్నారు ఆయన. నేను అలాగే మస్జిదులోకి వెళ్ళి రెండు రకాతుల నమాజు చేశాను.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - అల్‌బుయూ, 34వ అధ్యాయం - షరాఇద్దవాబ్ వల్ హమీర్]

## 13వ అధ్యాయం - చాష్త్ నమాజ్ కనీసం రెండు రకాతులు చేయడం అభిలషణీయం

416. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స)కు కొన్ని పనులు చేయడం ఇష్టమయినప్పటికీ ఆయన వాటిని విడనాడేవారు. కారణం, ఇలా నిరంతరం చేయడం వల్ల ప్రజలు ఆ పనిని విధిగా నిర్ణయించబడినట్లు భావించవచ్చని (దాని వల్ల అనుచర సమాజంపై మరింత భారం పడుతుందని) దైవప్రవక్త(స) తలపోయడమే. అందుకే ఆయన చాష్త్ వేళ నఫిల్ నమాజు ఎన్నడూ చేయలేదు. కాని నేను మాత్రం చాష్త్ నమాజు చేస్తున్నాను.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 5వ అధ్యాయం - తహ్‌రీజున్నబీ (స) అలా సలాతిల్లైలి వన్నవాఫిలి మిన్‌గైరియజాబ్]

417. హజ్రత్ ఇబ్నె అబీ లైలా (రహ్మాలై) కథనం:- దైవప్రవక్త(స) చాష్త్ వేళ నఫిల్ నమాజులు చేయడం తాను చూసినట్లు హజ్రత్ ఉమ్మె హానీ (రజి) తెలిపారు. ఈ సమాచారం ఆమె తప్ప మరెవరి ద్వారా మాకు చేరలేదు. హజ్రత్ ఉమ్మె హానీ (రజి) ఇలా తెలియజేశారు - "దైవప్రవక్త (స) మక్కా జయించబడిన రోజు మా ఇంట్లో స్నానం చేసి ఎనిమిది రకాతులు నమాజు సంక్షిప్తంగా చేశారు. ఆయన ఇంత సంక్షిప్తంగా నమాజు చేయడం నేను లోగడ ఎప్పుడూ చూడలేదు. అయితే ఈ నమాజులో కూడా ఆయన రుకూ, సజ్దాలు సంపూర్ణంగా (నింపాదిగా) చేశారు. (వాటిలో ఎలాంటి కొరత చేయలేదు)."

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 12వ అధ్యాయం - మన్‌తతవ్వఅ ఫిస్సఫరి ఫీగైరి దుబురిస్సలాతి వఖబ్లహా]

418. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- నా ప్రాణ స్నేహితులు దైవప్రవక్త(స) నాకు మూడు విషయాలను గురించి హితబోధ చేశారు. నేను వాటిని నా బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ వదలిపెట్టను. ఆ మూడు విషయాలు ఇవి - (1) ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసాలు పాటించడం, (2) చాష్త్ నమాజు చేయడం, (3) వితర్ నమాజు చేసి నిద్రపోవడం.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 33వ అధ్యాయం - సలాతిజ్జుహా ఫిల్ హజర్]

## 14వ అధ్యాయం - ఫజ్ర్ వేళ సున్నత్ నమాజు ప్రాముఖ్యం

419. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ హఫ్సా (రజి) కథనం:- ముఅజ్జిన్ అజాన్ ఇచ్చి కూర్చుంటాడు. ఫజ్ర్ (ఉదయం) ప్రారంభమవుతుంది. అప్పుడు దైవప్రవక్త(స) సామూహిక నమాజుకు ముందు రెండు రకాతులు తేలికపాటి నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 12వ అధ్యాయం - అల్ అజాన్ బాదుల్ ఫజ్ర్]

420. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (స)ఫజ్ర్ నమాజు వేళ అజాన్, ఇఖామత్‌ల మధ్య రెండు రకాతులు తేలికపాటి నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 12వ అధ్యాయం - అల్ అజాన్ బాదల్ ఫజ్ర్]

421. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఫజ్ర్ వేళ (ఫర్జ్) నమాజుకు ముందు ఎంతో సంక్షిప్తంగా రెండు రకాతులు సున్నత్ నమాజు చేసేవారు. ఆ నమాజు చూస్తుంటే ఒక్కోసారి నాకు ఆయన అల్‌హమ్డ్(సూరా) అయినా పఠించారా లేదా అనిపించేది. అంత తేలికపాటి నమాజు చేసేవారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 28వ అధ్యాయం - మాయఖ్రా ఫీరకఅతియల్‌ఫజ్ర్]

422. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఫజ్ర్ వేళ రెండు రకాతులు సున్నత్ నమాజ్‌ని ప్రతి రోజూ క్రమం తప్పకుండా చేసేవారు. ఆ విధంగా (నాగా లేకుండా) మరే నఫిల్ నమాజు కూడా ఆయన చేసేవారు కాదు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 17వ అధ్యాయం]

## 15వ అధ్యాయం - ఫర్జ్ నమాజుకు ముందు, ఆ తరువాత చేసే సున్నత్ నమాజుల ప్రాముఖ్యం

423. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స)తో కలసి సున్నత్ నమాజులు ఈ విధంగా చేశాను. జుహర్ (ఫర్జ్ నమాజు)కు పూర్వం రెండు రకాతులు, జుహర్ (ఫర్జ్) తరువాత రెండు రకాతులు, మగ్రిబ్ (ఫర్జ్ నమాజు) తరువాత రెండు రకాతులు, ఇషా (ఫర్జ్ నమాజు) తరువాత రెండు రకాతులు, జుమా (ఫర్జ్ నమాజు) తరువాత రెండు రకాతులు సున్నత్ నమాజు చేసేవారు. మగ్రిబ్, ఇషా వేళల సున్నత్ నమాజులు ఆయన ఇంట్లోనే చేసుకునేవారు.

(సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 29వ అధ్యాయం - అత్తతవ్వొఅ బాదల్ మక్తూబా]

## 16వ అధ్యాయం - నఫిల్ నమాజు కూర్చొని చేయడం కూడా ధర్మ సమ్మతమే

424. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రాత్రి వేళ ఏ నమాజులో కూడా కూర్చొని ఖుర్‌ఆన్ పఠించడం నేను చూడలేదు. వృద్ధాప్యం సమీపించిన రోజుల్లో కూడా ఆయన కూర్చొనే (నఫిల్) నమాజు చేసేవారు. అయితే సూరా (అధ్యాయం)లో ముప్ఫై నలభై ఆయత్‌లు (సూక్తులు) ఇంకా మిగిలి ఉన్నాయనగా ఆయన లేచి నిలబడతారు. అలా నిల్చొని మిగిలిన సూక్తులు పఠించేవారు. ఆ

తరువాత రుకూ చేసేవారు.

[సహీహ్ బుఖారీ: 19వ ప్రకరణం - తహజ్జుద్, 16వ అధ్యాయం - ఖియామున్నబీ (స) బిల్లైలి ఫీ రమజాన్ వగైరిహీ]

425. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కూర్చొని (నఫిల్) నమాజు చేయదలచుకున్నప్పుడు కూర్చొని వుండే అందులో ఖుర్ఆన్ పారాయణం చేసేవారు. ఇలా చేశాక (సూరా)లో ఇంకా దాదాపు ముప్పై, నలభై సూక్తులు మిగిలి ఉండిపోయేవి. అప్పుడు ఆయన లేచి నిలబడి ఆ మిగిలి ఉన్న సూక్తుల్ని పఠించేవారు. ఆ తరువాత రుకూ, సజ్దాలు చేస్తారు. అదే విధంగా రెండవ రకాత్‌లో కూడా చేసేవారు. ఈ విధంగా (రెండు రకాతులు) నమాజు ముగించి (నేను మేల్కొని ఉన్నానా లేదా అని నా వైపు) చూసేవారు. నేనొక వేళ మేల్కొని ఉంటే నాతో మాట్లాడేవారు, నిద్రపోతూ ఉంటే ఆయన కూడా నిద్రకు ఉపక్రమించేవారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 20వ అధ్యాయం - ఇజాసల్లా ఖాయిదన్ సుమ్మ సహ్హ అవ్ వజద్ ఖిప్ఫతన్.....]

## 17వ అధ్యాయం - ఇషా నమాజులో పఠించవలసిన రకాతుల సంఖ్య

426. హజ్రత్ అబూసలమా (రహ్మాలై) బిన్ అబ్దుర్రహ్మాన్ (రజి) కథనం:- "రమజాన్ నెలలో దైవప్రవక్త (సల్లం) ఎన్ని రకాతులు నమాజు చేసేవారు?" అని నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ని అడిగాను. దానికామె ఇలా సమాధానమిచ్చారు.

రమజాన్ మాసంలో అయినా ఇతర మాసాలలోనయినా దైవప్రవక్త (సల్లం) పదకొండు రకాతులకు మించి (నఫిల్) నమాజు చేసేవారు కాదు. మొదట నాలుగు రకాతులు పఠిస్తారు. ఈ నాలుగు రకాతుల నమాజు ఎంతో సుందరంగా సుదీర్ఘంగా వర్ణనాతీతంగా ఉంటుంది. దాం తరువాత మరో నాలుగు రకాతులు నమాజు చేస్తారు. ఇది కూడ ఎంతో సుందరంగా, సుదీర్ఘంగా, వర్ణనాతీతంగా ఉంటుంది. ఆ తరువాత మరో మూడు రకాతులు పఠిస్తారు. నేను దైవప్రవక్త (సల్లం)ను ఉద్దేశించి "మీరు వితర్ నమాజు చేయడానికి ముందు పడుకుంటారా?" అని అడిగాను (ఓసారి). అందుకాయన "ఆయిషా! నా కళ్ళు తప్పకుండా నిద్రిస్తాయి. కాని నా హృదయం మాత్రం (మేల్కొనే ఉంటుంది అది) ఎన్నటికీ నిద్రించదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - అత్తహజ్జుద్, 16వ అధ్యాయం - ఖియామున్నబీ (సల్లం) బిల్లైలి ఫీరమజాన వ గైరిహీ]

427. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రాత్రివేళ పదమూడు రకాతులు నమాజ్ చేసేవారు. ఆ పదమూడు రకాతులలో (ఒక రకాత్) వితర్, ఫజ్ర్ వేళకు సంబంధించిన రెండు రకాతుల సున్నత్ కూడ చేరి ఉన్నాయి.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 10వ అధ్యాయం - కైఫకానసలాతిన్నబీ (సల్లం) వకమ్ కానన్నబీ(స) మిన్నల్లైల్]

428. హజ్రత్ అస్వద్ బిన్ యజీద్ (రహ్మాలై) కథనం:- "రాత్రివేళ దైవప్రవక్త (సల్లం) నమాజు పరిస్థితి ఏమిటి?" అని నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను అడిగాను. దానికామె ఇలా సమాధానమిచ్చారు. "దైవప్రవక్త (సల్లం) రాత్రి తొలి జామున పడుకుంటారు. చివరి జామున మేల్కొని

నమాజు చేస్తారు. ఆ తరువాత పడక మీద కెళ్ళి పడుకుంటారు. (తెల్లవారుజామున) ముఅజ్జిన్ అజాన్ ఇవ్వగానే పడకమీద నుంచి, లేచి స్నానం చేయవలసివస్తే స్నానం చేస్తారు, లేకుంటే వుజూ మాత్రమే చేసి బయటికి (మస్జిదు వైపు) వెళ్తారు".

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 15వ అధ్యాయం - మన్ నామ అవ్వలులైలి వ అహ్యా అఖిరా]

429. హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై) కథనం:- నేను (ఓసారి) హజ్రత్ ఆయిషా (రజి)ని "దైవప్రవక్త (సల్లం)కు అన్నిటికంటే ఎక్కువగా ఏ పని అంటే ఇష్టం?" అని అడిగాను. దానికామె "ఆయనకు నిత్యం క్రమం తప్పకుండా చేసేపని అంటే ఎంతో ఇష్టం" అని సమాధానమిచ్చారు. "మరి రాత్రివేళ ఆయన (తహజ్జుద్ నమాజు చేయడానికి) ఎప్పుడు లేస్తారు?" అని అడిగాను మళ్ళీ. అందుకామె "కోడికూత వినగానే లేస్తారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 7వ అధ్యాయం - మన్నామ ఇన్దస్సహర్]

430. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నా దగ్గర ఎప్పుడు (రాత్రి) గడిపినా తెల్లవారు జామున మాత్రం తప్పకుండా పడుకునేవారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - తహజ్జుద్, 7వ అధ్యాయం - మన్ నామ ఇన్దస్సహరి]

431. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రాత్రి అన్ని వేళల్లోను వితర్ నమాజు చేస్తారు. చివరికి ఆయన తెల్లవారు జామున (సహర్ వేళ) కూడ వితర్ నమాజు చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 14వ ప్రకరణం - వితర్, 2వ అధ్యాయం - సాఅతిల్ విత్ర్]

## 20వ అధ్యాయం - రాత్రి (తహజ్జుద్) నమాజు రెండేసి రకాతుల చొప్పున చేయాలి, చివరి జామున ఒక రకాత్ వితర్

432. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను రాత్రివేళ (తహజ్జుద్) నమాజు గురించి అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "రాత్రి వేళ నఫిల్ నమాజు రెండేసి రకాతుల చొప్పున చేయాలి. ఇక ఉషోదయం కావస్తోందని భావించినపుడు ఒక రకాతు పఠించు. దీనివల్ల మొత్తం నమాజులు వితర్ (బేసి సంఖ్య నమాజ్) అయిపోతాయి".

[సహీహ్ బుఖారీ : 14వ ప్రకరణం - వితర్, 1వ అధ్యాయం - మాజాఅ ఫిల్ విత్ర్]

433. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- రాత్రి వేళ నమాజు ముగింపులో వితర్ నమాజు చేయండని దైవప్రవక్త(సల్లం) సెలవిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 14వ ప్రకరణం - వితర్, 4వ అధ్యాయం - లియజ్ అల్ ఆఖిర సలాతిహి విత్రా]

## 24వ అధ్యాయం - రాత్రి చివరి జామున జిక్ర్, దుఆ చేయడం

434. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మహోన్నతుడు, శుభదాయకుడు అయిన మన ప్రభువు ప్రతి రోజు రాత్రి చివరి మూడోజామున మొదటి ఆకాశంపై అవతరించి (మానవుల్ని సంబోధిస్తూ) "నన్ను మొర పెట్టుకునే వారెవరైనా

ఉన్నారా? (ఈ సమయంలో) నేను వారి మొరలను ఆలకిస్తాను. నన్ను పిలిచే వారెవరైనా ఉన్నారా? నేను వారి పిలుపుకు సమాధానమిస్తాను. నన్ను క్షమాపణ కోరే వారెవరైనా ఉన్నారా? నేను వారిని క్షమిస్తాను" అని అంటాడు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 14వ అధ్యాయం - అద్దుఆఇవస్సలాతి మిన్ ఆఖిరిల్లైల్]

## 25వ అధ్యాయం - రమజాన్ నెలలో తరావీహ్ నమాజు ప్రాముఖ్యం

435. హజ్రత్ అబూహురైరా (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "రమజాన్ నెలలో ఎవరు ధృఢ విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో రాత్రిళ్ళు తరావీహ్ నమాజు చేస్తారో వారి గత పాపాలన్నీ క్షమించబడతాయి."

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 27వ అధ్యాయం - తతవ్వువు ఖియామి రమజాన్ మినల్ ఈమాన్]

436. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ రోజు నడిరేయి వేళ దైవప్రవక్త (సల్లం) మస్జిదుకెళ్ళి నమాజు చేశారు. అప్పుడు మరికొందరు వ్యక్తులు కూడ వచ్చి ఆయనతో పాటు నమాజు చేశారు. ఉదయం ఈ విషయం గురించి ప్రజలు పరస్పరం చెప్పుకున్నారు. (రెండో రోజు రాత్రి) మొదటి రాత్రి కంటే ఎక్కువమంది జనం వచ్చారు. అందరూ దైవప్రవక్త (సల్లం) నేతృత్వంలో నమాజు చేశారు. మరునాడు ఈ విషయం గురించి జనం మరింత ఎక్కువగా చెప్పుకున్నారు. మూడో రోజు రాత్రి జనం ఇంకా ఎక్కువ మంది వచ్చారు. దైవప్రవక్త(సల్లం) కూడా ఇంటి నుంచి బయలుదేరి ప్రజలకు నేతృత్వం వహించి నమాజు చేశారు.

నాల్గవ రోజు రాత్రి అయితే జనం మరింత అత్యధిక మంది రావడంతో మస్జిదు కిటకిటలాడిపోయింది. అయితే [ఆ రోజు రాత్రి దైవప్రవక్త(సల్లం) ఇంటి నుంచి బయటకి రాలేదు] తెల్లవారుజామున మాత్రమే ఫజ్ర్ నమాజు కోసం బయలుదేరి మస్జిదుకు వచ్చారు. నమాజు ముగిసిన తరువాత ప్రజల వైపు దృష్టి సారించారు. దైవస్తోత్రం తర్వాత ఇలా అన్నారు: "ప్రజలారా! రాత్రి మీరు మస్జిద్‌లో ఉన్నారన్న సంగతి నాకు తెలియనిది కాదు, కానీ (నేనిలా ప్రతి రాత్రి వస్తుంటే) ఈ విధంగా ఈ (తరావీహ్) నమాజు మీకు ఫర్జ్ (విధి) చేయబడవచ్చనీ, ఆ తరువాత మీరు దాన్ని నెరవేర్చలేకపోతారేమోనని నేను భయపడ్డాను."

[సహీహ్ బుఖారీ : 11 వ ప్రకరణం - జుమా, 29వ అధ్యాయం - మన్‌ఖాల ఫిల్ ఖుత్బతి బాదస్సనా అమ్మాబాద్]

## 26వ అధ్యాయం - నడిరేయి నమాజు (తహజ్జుద్), తరువాత వేడుకోలు (దుఆ)

437. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేనొక రోజు రాత్రి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) గారి ఇంట్లో గడిపాను. (ఆ రోజు అర్ధరాత్రి) దైవప్రవక్త (సల్లం) మేల్కొని కాలకృత్యాలు తీర్చుకున్నారు. ముఖం, చేతులు కడుక్కొని పడుకున్నారు. ఆ తరువాత (కాస్సేపటికి) మళ్ళీ లేచి నీళ్ళ తిత్తి దగ్గరకు వెళ్ళారు. దాని మూతి విప్పదీసి మధ్యస్థాయి వుజూ చేశారు. అంటే నీళ్ళు ఎక్కువగా వాడలేదు, కాని పూర్తిగా వుజూ చేశారు. ఆ తర్వాత నమాజు చేయడానికి ఉపక్రమించారు.

నేను కూడా లేచాను. నేను నిద్రపోకుండా జాగరణ చేస్తున్నానని ఆయన భావించవచ్చేమో,

అది ఆయనకు అయిష్టం కలిగించవచ్చేమో. అందువల్ల నేను కూడా లేచి ఒళ్ళు విరుచుకున్నాను. ఆయన దైనందిన కార్యకలాపాలను గమనిస్తూ నేను కూడ వుజూ చేశాను. ఆయన నిలబడి నమాజు చేస్తుంటే నేను వెళ్ళి ఆయన ఎడమవైపున నిల్చున్నాను. (వెంటనే) ఆయన నా చెవిపెట్టి మెలేస్తూ, నన్ను తన కుడివైపున నిలబెట్టుకున్నారు. దైవప్రవక్త(సల్లం) ఆ సమయంలో పదమూడు రకాతులు నమాజు చేశారు. ఆ తర్వాత పడుకొని గురకబెట్టి నిద్రపోయారు. నిద్రలో గురకపెట్టడం ఆయనకు అలవాటు. ఆ తరువాత (తెల్లవారుజామున) హజ్రత్ బిలాల్ (రజి) వచ్చి ఫజ్ర్ నమాజు వేళయిందని తెలియజేశారు. దైవప్రవక్త(సల్లం) (మస్జిదుకెళ్ళి) నమాజు చేశారు. (దాని కోసం) వుజూ చేయలేదు. ఆయన (ఆ రాత్రి తహజ్జుద్ నమాజ్ తర్వాత) ఈ విధంగా దుఆ (వేడుకోలు) చేశారు.

"అల్లాహుమ్మజ్ అల్ ఫీ ఖల్బీ నూరన్ వ్వఫీ బసరీ
నూరన్ వ్వఫీ సమ్యీ నూరన్ వ్వ అన్య్యమీనీ నూరన్ వ్వ
అన్య్యసారీ నూరన్ వ్వఫౌఖీ నూరన్ వ్వ తహ్తీ నూరన్ వ్వ
అమామీ నూరన్ వ్వ ఖల్ఫీ నూరన్వ్వజ్ అల్లీనూరా."

(దేవా! నా హృదయాన్ని జ్యోతిర్మయం చెయ్యి. నా కళ్ళు కూడా జ్యోతిర్మయం చెయ్యి. నా చెవులు కూడ జ్యోతితో నింపు. నా కుడివైపు, ఎడమవైపులను, నా పైనా, క్రిందా, నా ముందూ, వెనకాల కూడ జ్యోతిర్మయం చెయ్యి. నాకు (ఆపాదమస్తకం) జ్యోతిని ప్రసాదించు).

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) నుండి ఈ హదీసు గ్రహించిన హజ్రత్ కురైబ్ (రహ్మాలై) ఈ సందర్భంగా మాట్లాడుతూ "నా దగ్గర ఇంకా ఏడు పదాలు రాసి పెట్టి ఉన్నాయి. ప్రస్తుతం అవి నాకు గుర్తుకు రావటం లేదు" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకుడు విషయాన్ని వివరిస్తూ "తర్వాత నేను అబ్బాస్ కుటుంబానికి చెందిన ఒక వ్యక్తిని కలుసుకున్నాను. అతను విషయం తెలియజేస్తూ "నా నరాలు, నా రక్తమాంసాలు, నా వెంట్రుకలు, నా చర్మం" అని ప్రస్తావించారు. ఆయన మరో రెండు వస్తువులను★ గురించి కూడా ప్రస్తావించారు.

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 10వ అధ్యాయం - అద్దుఆవు ఇజా అంతబమినల్లైల్]

438. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేనొక రోజు రాత్రి నా పినతల్లి, విశ్వాసుల మాతృమూర్తి అయిన హజ్రత్ మైమూన (రజి) గారి ఇంట్లో గడిపాను. ఆ రాత్రి నేను పడక మీద అడ్డంగా పడుకున్నాను. దైవప్రవక్త సతీమణి (రజి) పడకమీద నిలువుగా పడుకున్నారు. దైవప్రవక్త(సల్లం) కూడ పడుకున్నారు. అలా దాదాపు అర్ధరాత్రి దాకా పడుకున్నారు. అంటే అర్ధరాత్రికి కొంచెం ముందు వరకు లేదా అర్ధరాత్రి దాటిన కాస్సేపటికి వరకు పడుకున్నారు. ఆ తరువాత లేచి కూర్చున్నారు. చేత్తో కళ్ళు నలుపుకొని నిద్ర మత్తును దూరం చేసుకున్నారు. తర్వాత ఆలి ఇమ్రాన్ సూరా (అధ్యాయాల)లోని చివరి పది సూక్తులు పఠించి నిలబడ్డారు. వ్రేలాడుతున్న ఒక నీటి తిత్తి దగ్గరకు వెళ్ళి, అందులోని నీటితో వుజూ చేసుకున్నారు. ఎంతో చక్కగా వుజూ చేసుకున్నారు. ఆ తరువాత నిలబడి నమాజు చేయడం ప్రారంభించారు.

★ ఈ రెండు వస్తువులు ఎముకలు, మజ్జ (సారము) కావచ్చని కొందరి అభిప్రాయం. అవి కొవ్వు, ఎముకలని మరికొందరి అభిప్రాయం. నిజం దేవునికే తెలుసు.

నేను కూడ లేచి దైవప్రవక్త (సల్లం) చేసినట్లే చేశాను. ఆ తరువాత వచ్చి ఆయన ఎడమ ప్రక్క నిలబడ్డాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తన కుడిచేతిని నా తల మీద పెట్టి నా కుడి చెవి మెలివేయడం ప్రారంభించారు. (అలా నన్ను తన కుడిప్రక్కకు లాగి నిల్చో బెట్టుకున్నారు). ఆ తరువాత ఆయన రెండు రకాతులు నమాజు చేశారు. తర్వాత రెండు, ఆ తరువాత రెండు, ఆ తరువాత రెండు, ఆ తరువాత రెండు, ఆ తరువాత రెండు, ఆ తరువాత (ఒక రకాతు) వితర్ నమాజు చేశారు. ఆ తర్వాత వెళ్ళి పడుకున్నారు. చివరికి ముఅజ్జిన్ వచ్చి ఆయన్ని లేపారు. ఆయన లేచి రెండు రకాతులు తేలికపాటి నమాజు చేశారు. ఆ తర్వాత బయటికి వెళ్ళి (మస్జిద్‌లో) ఫజ్ర్ నమాజ్ చేయించారు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 36వ అధ్యాయం - ఖిరాతిల్ ఖుర్‌ఆని బాదల్ హదసి వగైరిహీ]

439. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) రాత్రివేళ నమాజులో పదమూడు రకాతులు పఠించేవారు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 1వ అధ్యాయం - కైఫకానత్ సలాతున్నబీ (స) వ కమ్ కానన్నబీ యుసల్లీ మినల్లయిల్]

440. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) రాత్రివేళ తహజ్జుద్ నమాజు చేయడానికి లేచినపుడు ఈ విధంగా దుఆ (వేడుకోలు) చేసేవారు.

అల్లాహుమ్మ లకల్ హమ్దు అంత నూరుస్సమావాతి వల్
అర్జ్. వ లకల్ హమ్దు అంత ఖయ్యిముస్సమావాతి వల్
అర్జ్. వ లకల్ హమ్దు అంత రబ్బుస్సమావాతి వల్
అర్జ్. వ మన్‌ఫీహిన్న, అంత హఖ్ఖు వ వాదుకల్ హఖ్ఖు
వ ఖౌలుకల్ హఖ్ఖు వ లిఖావుక హఖ్ఖున్ వల్ జన్నతు
హఖ్ఖున్ వన్నారు హఖ్ఖున్ వన్నబియ్యూన హఖ్ఖున్
వస్సాఅతు హఖ్ఖున్, అల్లాహుమ్మ లక అస్లంతు వ
బిక ఆమంతు వ అలైక తవక్కల్తు వ ఇలైక
అనబ్తు వ బిక ఖాసమ్తు వ ఇలైక హాకమ్తు ఫగ్ఫిర్లీ
మా ఖద్దమ్తు వమా అఖ్ఖర్తు వ మాఅస్‌రర్తు
వ మా ఆలన్తు అంత ఇలాహీ లా ఇలాహ ఇల్లా అంత.

"దేవా! స్తుతిస్తోత్రాలు నీకే శోభిస్తాయి. నీవు భూమ్యాకాశాల కాంతివి. స్తుతిస్తోత్రాలకు నీవే అర్హుడవు. భూమ్యాకాశాలను స్థిరంగా నిలపగలవాడివి నీవే. నీకే సకల ప్రశంసలు వర్తిస్తాయి. భూమ్యాకాశాలకు, వాటిలో ఉండే సమస్త సృష్టిరాసులకు నీవే ప్రభువువి, పోషకుడివి. నీ వాగ్దానం సత్యంతో కూడుకున్నది. నీ వాణి కూడా సత్యమైనది. (మేమంతా మరణానంతరం) నీ సన్నిధికి రావడం యదార్థం. స్వర్గ నరకాలు రెండు యదార్థాలే. దైవప్రవక్తలంతా సత్యమంతులే. ప్రళయం కూడా సత్యబద్ధమే. దేవా! నేను నీ విధేయుడ్ని, ఆజ్ఞాబద్ధుడ్ని. నిన్ను విశ్వసించాను. నిన్నే నమ్ముకున్నాను. నీ మీదే నా మనసు లగ్నం చేశాను. నీ కోసమే పోరాడుతున్నాను. నిన్నే తీర్పుకై అర్థిస్తున్నాను. నా గత

భవిష్యత్ పాపాలు, నా గుప్త బహిర్గత పాపాలు సమస్తం క్షమించు. నీవే నా ప్రభువు,' ఆరాధ్యదైవానివి నీవు తప్ప మరెవరూ ఆరాధ్యుడు లేడు."

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 35వ అధ్యాయం - ఖౌలిల్లాహు తాలా యురీదూన అఁయ్యు బద్దిలూ కలామల్లాహ్]

## 27వ అధ్యాయం - నడిరేయి నమాజులో సుదీర్ఘ పారాయణం అభిలషణీయం

441. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- ఓ రోజు రాత్రి నేను దైవప్రవక్త(సల్లం)తో కలసి (తహజ్జుద్) నమాజు చేశాను. అప్పుడు ఆయన (నమాజులో) చాలాసేపు నిలబడ్డారు. దాంతో నా మనసులో ఒక దురాలోచన పుట్టింది.

( ఈ సందర్భంలో ఒక వ్యక్తి) "మీ మనసులో పుట్టిన ఆ దురాలోచన ఏమిటని" అడిగాడు. దానికి హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్(రజి) "దైవప్రవక్తను వదిలిపెట్టి నేను కూర్చుందామన్న ఆలోచన కలిగింది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 9వ అధ్యాయం - తవీలుల్ ఖియామి ఫీసలాతిల్లైల్]

## 28వ అధ్యాయం - నమాజు చేయకుండా తెల్లవారేదాకా పడుకునే వ్యక్తి

442. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- (నమాజు చేయకుండా) తెల్లవారేదాకా పడుకునే వ్యక్తిని గురించి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించగా "అలాంటి వ్యక్తి చెవిలో లేదా చెవుల్లో షైతాన్ మూత్రం పోస్తాడు" అని అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ: 59వ ప్రకరణం - బద్అల్ఖల్క్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీస్ వజునూదహు]

443. హజ్రత్ అలీ (రజి) బిన్ అబీ తాలిబ్ కథనం:- ఓ రోజు రాత్రి దైవప్రవక్త (సల్లం) మా ఇంటికి వచ్చి "మీరు (తహజ్జుద్) నమాజు చేయరా?" అని అడిగారు. దానికి నేను "దైవప్రవక్తా! మా ప్రాణాలు దేవుని అధీనంలో ఉన్నాయి. ఆయన మమ్మల్ని తాను తలచుకున్నప్పుడు మేల్కొలుపుతాడు" అని అన్నాము. ఈ మాటలు వినగానే ఆయన మాకు ఎలాంటి సమాధానం ఇవ్వకుండానే వెనుదిరిగి వెళ్ళిపోతూ, "నిజంగా మానవుడు పెద్ద జగడాల మారిగా తయారయ్యాడు" అని అన్నారు. (కహఫ్ సూరాలోని 54వ సూక్తిని ఉచ్చరిస్తూ)

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 5వ అధ్యాయం - 1 తహ్రీజున్నబీ (సల్లం) అలా సలాతిల్లైలి వన్నవాఫిల్]

444. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మనిషి రాత్రివేళ పడుకున్నా తరువాత షైతాన్ అతని ముచ్చిలి గుంటపై మూడు ముళ్ళు వేస్తాడు. ప్రతి ముడి మీద 'రాత్రి ఇంకా చాలా వుంది, హాయిగా పడుకో' అంటూ మంత్రించి ఊదుతాడు. అప్పుడు మనిషి మేల్కొని దేవుణ్ణి స్మరించగానే ఒక ముడి ఊడిపోతుంది. తరువాత వుజూ చేస్తే రెండవ ముడి ఊడిపోతుంది. ఆ తరువాత నమాజు చేస్తే మూడవ ముడి కూడా ఊడిపోతుంది. దాంతో ఆ వ్యక్తి తెల్లవారు జామున ఎంతో ఉత్సాహంతో, సంతోషంతో లేస్తాడు. అలా చేయకపోతే వళ్ళు బరువయి బద్ధకంగా లేస్తాడు".

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 12వ అధ్యాయం - అఖ్దష్షైతాని అలా ఖాఫియాతిర్రాస్]

## 29వ అధ్యాయం - నఫిల్ నమాజు ఇంట్లో చేయడం అభిలషణీయం

445. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మీరు కొన్ని నమాజులు మీ ఇండ్లలో చేసుకోండి. మీ ఇండ్లను సమాధులుగా మార్చుకోకండి."

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 52వ అధ్యాయం - కరాహియతుస్సలాతి ఫిల్ మఖాబిర్]

446. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- "ఎవరైతే తన ప్రభువుని స్మరిస్తూ ఉంటాడో అతనే సజీవ మానవుడు. మరెవరు తన ప్రభువును స్మరించడో అతను శవం లాంటివాడు."★

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 66వ అధ్యాయం - ఫజ్లి జిక్రిల్లాహి అజ్జ వ జల్ల]

447. హజ్రత్ జైద్‌బిన్ సాబిత్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రమజాన్ మాసంలో చాపలతో ఒక కుటీరాన్ని నిర్మించుకుని, అందులో కొన్ని రాత్రులు నమాజు చేశారు. (ఆయన్ని చూసి) ఆయన అనుచరుల్లో కూడా కొందరు ఆయన వెనుక నమాజు చేయడం ప్రారంభించారు. కొందరు తనతో కలసి నమాజు చేస్తున్నారని తెలిసి దైవప్రవక్త (సల్లం) కుటీరం నుండి బయటికి రావడం మానేశారు. ఆ తరువాత (మరునాడు ఉదయం) వారి దగ్గరకు వచ్చి "మీరు చేస్తున్నదాన్ని నేను చూశాను. దాని వెనుక మీ ఉద్దేశం ఏమిటో కూడా నాకు తెలుసు (అంటే పుణ్యార్జన ఉద్దేశంతో మీరు నా వెనుక నమాజు చేయడం ప్రారంభించారు.) కనుక ప్రజలారా! మీరు మీ ఇండ్లలో (నఫిల్) నమాజు చేస్తూ ఉండండి. ఫర్జ్ నమాజ్ తప్ప మనిషికి అన్నిటికంటే తన ఇంట్లో చేసే నమాజే శ్రేష్ఠమయినది" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 81వ అధ్యాయం - సలాతిల్లైల్]

## 31వ అధ్యాయం - నమాజు చేస్తున్నప్పుడు కునుకు వస్తే కునికిపాటు పోయేదాకా పడుకోవాలి

448. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త(సల్లం) (మస్జిదుకు) వచ్చి చూస్తే రెండు నిట్టాడుల మధ్య ఒకతాడు కట్టి ఉండటం కన్పించింది. అప్పుడు ఆయన "ఈ తాడు ఎందుకు కట్టారు?" అని అడిగారు. "దీన్ని జైనబ్ (రజి) కట్టారు. నిలబడి నమాజు చేస్తు చేస్తూ అలసిపోతే ఆమె ఈ తాడు ఆధారంతో వ్రేలాడుతారు" అని చెప్పారు సహచరులు. అది విని దైవప్రవక్త(సల్లం) "అలా చేయకూడదు. ఈ తాడు విప్పదీయండి. మనస్సు లగ్నమయి వున్నంతసేపు నమాజు చేయాలి. అలుపు వస్తే కూర్చొని( కాస్సేపు) విశ్రాంతి తీసుకోవాలి. ఇదే మంచి పద్ధతి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 18వ అధ్యాయం - మాయుక్రహు మినత్తష్దీది ఫిల్ ఇబాదా]

449. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త (సల్లం) నా దగ్గరికి వచ్చినప్పుడు నా ముందు ఒక స్త్రీ కూర్చొని వుంది. (ఆమెను చూసి) "ఈ స్త్రీ ఎవర"ని అడిగారు ఆయన.

---

★ సహీహ్ ముస్లిం గ్రంథంలో హజ్రత్ అబూమూసా (రజి) కథనం ఇలా వుంది. "దైవనామస్మరణ జరిగే ఇల్లు సజీవ మానవుడు లాంటిది. దైవనామస్మరణ జరగని ఇల్లు మృత మానవుని లాంటిది".

హజ్రత్ ఆయిషా (రజి) ఆమె ఫలానా స్త్రీ అని చెప్పి (రాత్రంతా మేల్కొని నమాజు చేస్తుంటుంది అంటూ) ఆమెను పొగడనారంభించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు. "ఇక ఆపెయ్యి (ఈ పొగడ్తలు). (ఈవిడ) ఇలా చేయడం మంచి పద్ధతి కాదు. నెరవేర్చే శక్తి గల బాధ్యతలనే మనిషి తనమీద మోపుకోవాలి. దైవసాక్షి! (దేవుణ్ని) ఆరాధించడంలో మీరు అలసిపోనంత వరకు దేవుడు కూడా (మీకు పుణ్యం ప్రసాదించడంలో) అలసిపోడు."

మనిషి చేసే ధర్మ కార్యాలన్నిటిలో అతను క్రమం తప్పకుండా ఎల్లప్పుడు చేసే పని మాత్రమే దైవప్రవక్త (సల్లం)కు ఎక్కువ ప్రీతికరమైనది.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 32వ అధ్యాయం - అహిబ్బుద్దీని ఇల్లల్లాహి అద్వముహూ]

450. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "నమాజు చేస్తున్నప్పుడు ఎవరికైనా కునుకు వస్తే ఆ కునికిపాటు దూరమయ్యే వరకు అతను పడుకోవాలి. నమాజు చేస్తూ కునుకుతుంటే అతను పాప క్షమాపణ కోరుతూ (అకస్మాత్తుగా) తనను తానే నిందించుకోవడం ప్రారంభించవచ్చు. ఆ సంగతి అతనికెలా తెలుస్తుంది?"

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 53వ అధ్యాయం - అల్ వుజూ మినన్నౌమ్]

## 33వ అధ్యాయం - ఖుర్ఆన్ పారాయణంలో ఫలానా సూక్తి మరచిపోయానని చెప్పరాదు

451. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి రాత్రివేళ మస్జిదులో ఒకతను ఖుర్ఆన్ పఠిస్తుంటే విని "ఆ వ్యక్తిపై దేవుడు తన కారుణ్యాన్ని అవతరింపజేయుగాక. నేను ఫలానా సూరా (అధ్యాయం) పఠిస్తున్నప్పుడు వదిలిపెట్టిన ఫలానా సూక్తిని అతను నాకు గుర్తు చేశాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 27వ అధ్యాయం - మన్లమ్ యరబాస అఁయ్యఖూల సూరతుల్ బఖర వ సూరతు కిజా వకిజా]

452. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "ఖుర్ఆన్ కంఠస్తం చేసిన మనిషి పోలిక తన ఒంటెను త్రాడుతో కట్టి ఉంచిన వ్యక్తిలా ఉంది. అతనా ఒంటెను అలా కాపలా కాస్తూ ఉంటే అది ఎక్కడికీ పోకుండా ఆగి వుంటుంది. ఒకవేళ (తాడు విప్పి) స్వేచ్ఛగా వదిలివేస్తే అది ఎక్కడికైనా వెళ్తుంది."

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 23వ అధ్యాయం - ఇస్తిజ్ కారిల్ ఖుర్ఆని వత ఆహుదిహీ]

453. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా దివ్యఖుర్ఆన్‌లోని ఫలానా సూక్తి (ఆయత్) మరచిపోయానని అనకూడదు. దానికి బదులు నన్ను మరపింపజేయడం జరిగిందని చెప్పాలి. ఖుర్ఆన్ (ఏమరుపాటు వహించే) ప్రజల హృదయాల నుండి పొగరుబోతు ఒంటెల కంటే కూడా వేగంగా బయటికెళ్ళిపోతుంది. అందువల్ల ఖుర్ఆన్‌ని నిరంతరం పఠిస్తూ జ్ఞాపకం ఉంచుకోండి".

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 23వ అధ్యాయం - ఇస్తిజ్కారిల్ ఖుర్ఆని వతాహుదిహీ]

454. హజ్రత్ అబూమూసా (రజి) కథనం:- ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా సెలవిచ్చారు:- "ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్షి! ఖుర్ఆన్ కాళ్ళు కట్టివేసిన ఒంటెల కంటే కూడ వేగంగా విడిపించుకొని పారిపోతుంది. అందువల్ల మీరు ఖుర్ఆన్‌ని పరిరక్షిస్తూ ఉండండి. (అంటే దాన్ని నిరంతరం పఠిస్తూ జ్ఞాపకం ఉంచుకోండి)".

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 23వ అధ్యాయం - ఇస్తిజ్కారిల్ ఖుర్ఆని వతఆహుదిహీ]

## 34వ అధ్యాయం - ఖుర్ఆన్‌ని ఉచ్ఛారణ నిబద్ధతతో చక్కగా పఠించడం అభిలషణీయం

455. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "సుమధుర స్వరంతో ఖుర్ఆన్ పారాయణం చేసే దైవప్రవక్త (సల్లం) కంఠస్వరాన్ని దేవుడు ఎంతో శ్రద్ధగా ఆలకిస్తాడు. ఆయన అంత శ్రద్ధగా మరే స్వరాన్నీ వినడు". అంటే (చక్కని ఉచ్ఛారణతో) బిగ్గరగా పారాయణం చేయడమని అర్థం.

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 19వ అధ్యాయం - మఁల్లమ్ యతగన్ని బిల్ ఖుర్ఆన్]

456. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నన్ను సంబోధిస్తూ "అబూమూసా! హజ్రత్ దావూద్ (అలైహి) గారి స్వరమాధుర్యంలో ఒక భాగం నీకు ప్రసాదించబడింది."

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 31వ అధ్యాయం - హుస్ని స్సౌతి బిల్ ఖిరాఅత్]

## 35వ అధ్యాయం - మక్కా విజయం నాడు దైవప్రవక్త(సల్లం) ఫతహ్ సూరా పఠించడం

457. హజ్రత్ అబ్దుల్లా బిన్ ముగప్ఫిల్ (రజి) కథనం:- మక్కా జయించబడిన రోజు దైవప్రవక్త(సల్లం) తన ఒంటె మీద ఎక్కి (నడుస్తూ) 'ఫతహ్' సూరాను లయబద్ధంగా పఠించడం నేను విన్నాను.

హజ్రత్ అబ్దుల్లాబిన్ ముగప్ఫిల్ (రజి) ఈ విషయం తెలియజేస్తూ ఇలా అన్నారు; "ప్రజలు నా చుట్టూ గుమికూడతారన్న భయం గనక లేకపోతే, నేను ఆ రోజు దైవప్రవక్త(సల్లం) పఠించిన విధంగా లయబద్ధంగా పఠించి విన్పించేవాడ్ని". ★

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - అల్‌మగాజి, 48వ అధ్యాయం - ఐనరకజన్నబీ (సల్లం) అర్రాయత యౌమల్ ఫతహ్]

## 36వ అధ్యాయం - ఖుర్ఆన్ పారాయణ శుభంతో 'స్థిమితం' అవతరిస్తుంది

458. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం:- ఒక వ్యక్తి (నమాజులో) ఖుర్ఆన్ పఠిస్తుంటే అతని ఇంట్లో కట్టివేయబడిన పశువు బెదరసాగింది. దాంతో అతను నమాజు ముగించి చూస్తే ఒక మేఘం లేక పొగమంచు తన చుట్టూ ఆవరించి ఉండటం కన్పించింది. (ఆ తరువాత) ఈ సంఘటన గురించి

---

★ ఇక్కడ మూలభాషలో 'తర్జీ' అనే పదం ప్రయోగించబడింది. తర్జీ అంటే స్వరాన్ని కంఠంలోనే తిప్పుతూ పఠించడం. హజ్రత్ అబ్దుల్లా బిన్ ముగప్ఫిల్ (రజి) అప్పుడు దైవప్రవక్త (సల్లం) పఠించిన తీరుని ఆచరణాత్మకంగా విన్పించారు. దాన్ని బట్టి ఒంటె నడుస్తూ ఉండటం వల్ల దైవప్రవక్త(సల్లం) కూడా కదులుతూ పఠనంలో దీర్ఘాలు తీసి ఉంటారని తెలుస్తోంది.

అతను దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించాడు. దైవప్రవక్త (సల్లం) అది విని "నీవు (ఎల్లప్పుడూ ఇలాగే) ఖుర్ఆన్ పారాయణం చేస్తూ ఉండు. ఖుర్ఆన్ పారాయణ మహత్తులో అవతరించిన లేక అవతరిస్తూ ఉండిన 'స్థిమితం' ఇది"★ అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలా మాతిన్న బువ్వత్ ఫిల్ ఇస్లాం]

459. హజ్రత్ ఉసైద్ బిన్ హుజైర్ (రజి) కథనం:- ఓ రోజు రాత్రివేళ నేను బఖరా సూరా పఠిస్తూ ఉంటే సమీపంలోనే కట్టివేయబడిన నా గుర్రం బెదరసాగింది. నేను ఖుర్ఆన్ పఠించడం ఆపేయగానే గుర్రం కూడ బెదరిపోవడం ఆగింది. నేను మళ్ళీ ఖుర్ఆన్ పఠనం మొదలెట్టగా అది తిరిగి బెదరిపోసాగింది. నేను పఠనం ఆపేయగానే అది కూడ ఆగిపోయింది. నేను తిరిగి పఠించగానే అది మళ్ళీ బెదరిపోసాగింది.

ఆ తర్వాత హజ్రత్ ఉసైద్ బిన్ హుజైర్ (రజి) ఖుర్ఆన్ పారాయణం ఆపేశారు. ఆయన కొడుకు యహ్యా గుర్రానికి సమీపంలోనే ఉన్నాడు. గుర్రం ఇలా బెదిరిపోతూ కొడుక్కు నష్టం కలిగిస్తుందేమోనని ఆయన భయపడ్డారు. అందువల్ల అతడ్ని అక్కడ్నుంచి తప్పించి తన వైపుకు పిలిపించుకున్నారు. అయితే ఆయన అటువైపు తలపైకెత్తి చూస్తే అక్కడ ఆకాశం కన్పించలేదు. (దానికి బదులు గొడుగు ఆకారంలో వెలుగుతున్న దీపిక లేవో కన్పించాయి.)

మరునాడు ఉదయం హజ్రత్ ఉసైద్ (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి జరిగిన వృత్తాంతం పూర్తిగా తెలియజేశారు. దైవప్రవక్త (సల్లం) ఆ సంఘటన విని "ఇబ్నె హుజైర్! నీవు ఖుర్ఆన్ పారాయణం అలాగే కొనసాగిస్తే ఎంత బాగుండేది!! ఇబ్నెహుజైర్! నువ్వు అలాగే పఠిస్తూ ఉంటే ఎంత బాగుండేది!!" అని అన్నారు.

"దైవప్రవక్తా! నా కొడుకు గుర్రానికి అతి చేరువలో ఉన్నాడు. అది (బెదరిపోతూ) అతడ్ని ఎక్కడ తొక్కివేస్తుందోనని భయపడ్డాను. అందువల్ల నా దృష్టి అతనిపైకి వెళ్ళింది. ఆ తరువాత నేను తలపైకెత్తి ఆకాశం వైపు చూశాను. అక్కడ నాకు గొడుగు ఆకారంలో ఒక వింత వస్తువు కన్పించింది. అందులో (అనేక) దీపాలు వెలిగిపోతూ కన్పించాయి. ఆ తరువాత నేను ఆ దృశ్యాన్ని చూడలేక అక్కడ్నుంచి బయటికి వెళ్ళాను" అన్నారు హజ్రత్ ఉసైద్ (రజి).

"ఇంతకూ అదేమిటో నీకు తెలుసా?" అడిగారు దైవప్రవక్త (సల్లం). "తెలియదు" అన్నారు హజ్రత్ ఉసైద్ (రజి). " ఆ దృశ్యం దైవదూతలు. నీ కంఠస్వరం వినడానికి వచ్చారు. నీవు అలాగే తెల్లారే దాకా ఖుర్ఆన్ పఠనం కొనసాగించి వుంటే ఉదయం ప్రజలు వారిని చూసేవారు. వారు ప్రజలకు కనుమరుగయ్యేవారు కాదు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ: 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 15వ అధ్యాయం-నుజూలిస్సకీనతి వల్ మలాయికతి ఇన్ద ఖిర్అతిల్ ఖుర్ఆన్]

## 37వ అధ్యాయం - ఖుర్ఆన్ క్రమం తప్పకుండా పఠించే వ్యక్తి ఘనత

460. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:-

★ ఇక్కడ మూలభాషలో 'సకీనత్' అనే పదం వచ్చింది. దీనికి విస్తృతభావం ఉంది. ఇది దేవుని సృష్టిలో ఒక విశిష్టవస్తువు. ఇందులో మనో స్థిమితం, దేవుని కారుణ్యం ఉన్నాయి. వాటితో పాటు దైవదూతలు కూడా దిగివస్తారు.

"ఖుర్ఆన్ పఠించే వ్యక్తి (విశ్వాసి) రుచిలోనూ, సువాసనలోనూ మేలు జాతికి చెందిన నారింజపండు లాంటివాడు. ఖుర్ఆన్ పఠించని విశ్వాసి (మోమిన్) రుచి ఉన్నా సువాసన లేని ఖర్జూర పండు లాంటివాడు. ఖుర్ఆన్ పఠించే కపట విశ్వాసి పరిమళం ఉన్న చేదుఫలం లాంటివాడు. ఖుర్ఆన్ పఠించని కపట విశ్వాసి సువాసనలేని చేదుగా వుండే అడవి దోసకాయలాంటివాడు."

[సహీహ్ బుఖారీ : 70వ ప్రకరణం - అల్ అత్ అము - 30వ అధ్యాయం - జిక్రిత్తామ్]

## 38వ అధ్యాయం - శ్రమకోర్చి ఖుర్ఆన్ పఠించే వ్యక్తి ఘనత

461. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "ఖుర్ఆన్ కంఠపాఠి గౌరవనీయులైన దైవదూత లాంటివాడు. అతను (ప్రళయదినాన) వారితోనే ఉంటాడు. ఖురాన్ పఠించడం తనకు ఎంతో ప్రయాసతో కూడిన పని అయినప్పటికీ, దాన్ని పఠించి కంఠస్థం చేసే వ్యక్తి రెట్టింపు పుణ్యఫలానికి అర్హుడవుతాడు."

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ ఖుర్ఆన్, 80వ అధ్యాయం - 'అబస' సూరా]

## 39వ అధ్యాయం - ఉన్నత స్థానం పొందిన పండితులకు ఖుర్ఆన్ విన్పించడం పుణ్యప్రదం

462. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓసారి హజ్రత్ అబీ బిన్ కాబ్ (రజి)తో "నేను నీ ముందు 'లమ్యకు నిల్లజీన కఫరూ' సూరా పఠించి విన్పించాలని దేవుడు నన్ను ఆదేశించాడు", అని అన్నారు. హజ్రత్ అబీ (రజి) అది విని (ఆశ్చర్యంతో) "ఏమిటి? దేవుడు నా పేరు ప్రస్తావించి అలా ఆదేశించాడా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఔను. దేవుడు నీ పేరు ప్రస్తావించి ఇలా అన్నాడు" అని తెలియజేశారు. ఈ మాట విని హజ్రత్ అబీ (రజి) ఒక్కసారిగా రోదించారు.

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 16వ అధ్యాయం - మనాఖిబ్ అబీ బిన్‌కాబ్]

## 40వ అధ్యాయం - ఖుర్ఆన్ వినడం, శ్రద్ధగా ఆలకించడం, దాని పట్ల దుఃఖించడం

463. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓసారి తనముందు ఖుర్ఆన్ పఠించి విన్పించవలసిందిగా నన్ను ఆదేశించారు. నేను (ఆశ్చర్యంతో) "ఏమిటీ? నేను మీకు ఖుర్ఆన్ విన్పించాలా. దైవప్రవక్తా!? నిజానికి ఖుర్ఆన్ స్వయంగా మీపైనే అవతరించింది కదా!" అని అన్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) "(ఔను) నేను మరెవరి ద్వారానైనా ఖుర్ఆన్ వినాలని నాకు అన్పిస్తోంది" అని అన్నారు. అప్పుడు నేను 'నిసా' సూరా పఠించడం ప్రారంభించాను. అలా నేను ప్రతి అనుచర సమాజం నుండి మేము ఒక సాక్షిని తెచ్చి, ఈ ప్రజల మీద నిన్ను (అంటే ముహమ్మద్ ప్రవక్తను) సాక్షిగా నిలబెట్టే రోజు వీరి పరిస్థితి ఏమవుతుంది? అనే సూక్తి దగ్గరికి చేరుకోగానే 'ఆగు' లేక ఇక 'ఆపెయ్యి' అన్నారు దైవప్రవక్త(సల్లం). నేను తలపైకెత్తి చూస్తే ఆయన కళ్ళు ధారాపాతంగా వర్షించసాగాయి.

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 35వ అధ్యాయం - అల్ బుకాయి ఇన్ద ఖిరా అతిల్ ఖుర్ఆన్]

464. హజ్రత్ అల్ఖమా (రహ్మాలై) కథనం:- మేము హమస్ (సిరియా దేశంలోని ఒక పట్టణం పేరు)లో ఉన్నప్పుడు ఓసారి హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) 'యూసుఫ్' సూరా పఠించారు. అప్పుడు ఒక వ్యక్తి "ఈ సూరా ఈ విధంగా అవతరించలేదు" అని అన్నాడు. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ అది విని "నేను దైవప్రవక్త(సల్లం) ముందు ఈ విధంగానే పఠించాను. ఆయన విని నీవు చక్కగా పఠించావని అన్నారు" అని అన్నారు. అదే సమయంలో ఆ వ్యక్తి మద్యం సేవించినట్లు అతని నోటి దుర్వాసన ద్వారా పసిగట్టారు. దాంతో ఆయన "నీవు రెండు నేరాలు చేశావు. ఒకటి, దైవవాణిని తిరస్కరించావు. రెండు, మద్యం సేవించావు" అని అన్నారు. అందువల్ల ఆయన ఆ వ్యక్తిని మద్యం సేవించినందుకు శిక్ష విధించి దాన్ని అమలు పరిచారు.

[సహీహ్ బుఖారీ: 66వ ప్రకరణం - ఫజాయలె ఖుర్ఆన్, 8వ అధ్యాయం - అల్ ఖురాయి మిన్ అస్హాబి నబీ(సల్లం)]

## 43వ అధ్యాయం - ఫాతిహా సూరా మొత్తం, బఖరా సూరాలోని చివరి రెండు సూక్తుల ఔన్నత్యం

465. హజ్రత్ అబూ మస్వూద్ బద్రి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "బఖరా సూరాలోని చివరి రెండు సూక్తుల్ని రాత్రివేళ పఠించే వ్యక్తికి ఆ రాత్రంతా ఆ రెండు సూక్తులే చాలు" ( అంటే ఆ రాత్రంతా ఖుర్ఆన్ పఠించినంత పుణ్యం లభిస్తుందన్నమాట).

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - అల్ మగాజి, 12వ అధ్యాయం - హద్దసనీ ఖలీఫా]

## 47వ అధ్యాయం - ఖుర్ఆన్ విద్య నేర్చుకొని ఇతరులకు నేర్పే వ్యక్తి ఔన్నత్యం

466. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- ఇద్దరు తప్ప ఇతర వ్యక్తుల పట్ల అసూయ చెందడం ధర్మసమ్మతం కాదు. ఒకరు, దేవుడు ఖుర్ఆన్ విద్య ప్రసాదించగా దాన్ని రేయింబవళ్ళు చదవడంలో, చదివించడంలో నిమగ్నుడయి ఉండే వ్యక్తి. రెండోవాడు, దేవుడు సిరిసంపదలు అనుగ్రహించగా వాటిని రేయింబవళ్ళు (సత్కార్యాలలో) వినియోగించే వ్యక్తి." (ఇలాంటి వారి పట్ల అసూయ చెందడంలో తప్పులేదు).

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 45వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి(స) రజులున్ అతాహుల్లాహుల్ ఖుర్ఆని ఫహువ యఖూము బిహీ]

467. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలియజేశారు:- "ఇద్దరు తప్ప మరెవరి పట్లా అసూయ చెందడం ధర్మసమ్మతం కాదు. ఒకరు, దేవుడు సిరిసంపదలు అనుగ్రహించడంతో పాటు, వాటిని దైవమార్గంలో వినియోగించే సద్బుద్ధి కూడా ప్రసాదించబడిన వ్యక్తి. రెండోవాడు, దేవుడు విజ్ఞతా వివేకాలు ప్రసాదించగా, వాటి ప్రకారం నిర్ణయాలు తీసుకుంటూ, ఆ విజ్ఞతావివేకాలను ఇతరులక్కూడా బోధిస్తూ ఉండే వ్యక్తి."

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - ఇల్మ్, 15వ అధ్యాయం - అల్ ఇగ్తిబాతి ఫిల్ ఇల్మివల్ హిక్మత్]

## 48వ అధ్యాయం - దివ్యఖుర్ఆన్ ఏడు రకాల ఉచ్చారణ శైలిలో అవతరించింది

468. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం:- ఒకసారి హిషామ్ బిన్ హకీమ్ బిన్ హిజామ్ 'ఫుర్ఖాన్' సూరా పఠించసాగారు. కాని ఆయన పఠనాశైలి నా పఠనాశైలికి భిన్నంగా ఉంది. మాకు దైవప్రవక్త (సల్లం) నేర్పిన శైలికి కూడ భిన్నంగా ఉంది. నేను ఆగ్రహంతో ఊగిపోతూ ఆయన మీద విరుచుకుపడేవాణ్ణి. కాని ఆయన పఠించడం ముగిసేవరకు ఎలాగో తమాయించుకున్నాను. పఠనం పూర్తి కాగానే నేనాయన మెడకు చుట్టుకున్న దుప్పటి పట్టుకొని ఆయన్ని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి లాక్కెళ్ళాను. అక్కడ "దైవప్రవక్తా! మీరు నాకు నేర్పిన ఉచ్చారణ శైలికి భిన్నంగా ఈయన (ఫుర్ఖాన్) సూరా పఠిస్తుంటే నేను విన్నాను" అని విన్నవించుకున్నాను.

దైవప్రవక్త (సల్లం) అది విని మొదట "ఇతణ్ణి వదిలిపెట్టు" అని చెప్పారు. తర్వాత ఆయన వైపు తిరిగి "ఏది నువ్వు పఠించి విన్పించు, విందాం" అన్నారు. వెంటనే ఆయన (ఇంతకు ముందు మాదిరిగానే) (ఫుర్ఖాన్‌సూరా) పఠించారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "ఇది ఈ విధంగానే అవతరించింది". అని అన్నారు. ఆ తరువాత నన్ను పఠించమని ఆదేశించారు. నేను కూడా (నాకు నేర్పిన ఉచ్చారణాశైలిలో) పఠించాను. (నా పఠనాశైలి విని) "ఇది (కూడా) ఆ విధంగానే అవతరించింది" అన్నారు దైవప్రవక్త(సల్లం). తరువాత ( ఆ విషయాన్ని వివరిస్తూ) "దివ్యఖుర్ఆన్ ఏడురకాల ఉచ్చారణ శైలిలో అవతరించింది. మీకు ఏది సౌలభ్యంగా ఉంటే ఆ శైలిలో పఠించండి" అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 44వ ప్రకరణం - ఖుసూమాత్, 4వ అధ్యాయం - కలామిల్ ఖుసూమి బాజుహుమ్ ఫీబాజ్]

469. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- "నాకు జిబ్రయీల్ (అలైహి) ఒక్క ఉచ్చరణాశైలిలో (మాత్రమే) ఖుర్ఆన్ పఠించడం నేర్పారు. అయితే నేను మరికొన్ని ఉచ్చారణ శైలుల్లో పఠించడం నేర్పమని మాటిమాటికీ అడుగుతూ పోయాను. చివరికి ఈ ఉచ్చారణ శైలుల సంఖ్య ఏడుకు చేరింది."(1)

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్ ఇల్ ఖల్క్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయిక]

## 49వ అధ్యాయం - ఖుర్ఆన్ ఆగి ఆగి నిదానంగా పఠించాలి, వేగంగా పఠించకూడదు

470. హజ్రత్ అబూ వాయిల్ (రహ్మాలై) కథనం:- ఒక వ్యక్తి హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) దగ్గరికి వచ్చి "నేను గతరాత్రి ఒక్క రకాత్‌లో ముఫస్సిల్(2) సూరాలన్నీ పఠించాను" అని అన్నారు.

---

(1) ఏడు సంఖ్య ఇక్కడ సూచనప్రాయంగా తెలియజేయబడిందనీ, అందువల్ల ఏడంటే కచ్చితంగా ఏడేకానవసరం లేదని కొందరు ధర్మవేత్తలు అభిప్రాయపడ్డారు. కాని మరికొందరు ఏడంటే ఏడు సంఖ్యను మాత్రమే తీసుకోవాలి గాని దానిని ఎక్కువ తక్కువ చేయడానికి వీల్లేదని అభిప్రాయపడ్డారు. దీనిపై ఇంకా అనేక భిన్నాభిప్రాయాలున్నాయి. వీటన్నిటినీ పరిశీలిస్తే అరేబియాలోని వివిధ తెగల్లో ఉన్న విభిన్న ఉచ్చారణలు, మాండలికాల మూలంగా విభిన్న శైలుల్లో పఠించే అనుమతి ఇవ్వబడినట్లు అనిపిస్తోంది.

(2) (1) ఖుర్ఆన్‌లోని ఫతహ్ సూరా నుండి చివరి సూరా వరకున్న సూరాలను 'ముఫస్సిల్' సూరాలు అంటారు.
(2) సూక్తుల సంఖ్యారీత్యా పరస్పరం పోలిక ఉన్న పది జంట సూరాలను 'నజాయిర్' సూరాలు అంటారు. ఇవి ఈ విధంగా ఉన్నాయి. (1) రహ్మాన్-నజ్మ్ (2) ఇఖ్తరబత్ - అల్‌హాఖ్ఖ, (3) జారియా-తూర్ (4) వాఖియా - నూన్ (5) సాలసాయిల్ -నాజియాత్ (6) వైలుల్లిల్ ముతఫ్ఫిఫీన్ - అబస్ (7) ముద్దస్సిర్ - ముజ్జమ్మిల్ (8) హల్‌అతా - లావుఖ్సిమ్ (9) అమ్మయత్ సాలూన్ - ముర్సలాత్ (10) ఇజషమ్సు కువ్విరత్ - దుఖ్ఖాన్.

హజ్రత్ అబ్దుల్లా (రజి) ఆ మాట విని "ఏమిటీ, నువ్వు కవుల మాదిరిగా వడివడిగా పఠిస్తున్నావా?" అని అడిగారు. ఆ తరువాత "నజాయిర్ సూరాలను గురించి నాకు బాగా తెలుసు. దైవప్రవక్త(సల్లం) వాటిని కలిపేసి (ఒక్కొక్క రకాతులో) పఠించేవారు" అని అన్నారు. ఆ సందర్భంలో ఆయన ముఫస్సిల్ సూరాలలో ఇరవై సూరాలను ప్రస్తావించి, వీటిలో నుంచి దైవప్రవక్త(సల్లం) ప్రతి రకాత్‌లో రెండేసి సూరాలు పఠించేవారు" అని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 106వ అధ్యాయం - అల్‌జమ్‌అ బైన స్సూరతైని ఫిర్రకాత్]

## 50వ అధ్యాయం - ఖుర్‌ఆన్‌కు సంబంధించిన కొన్ని విషయాలు

471. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) "ఫహల్ మిమ్‌ముద్ద కిర్" (ఖమర్ సూరా 17వ సూక్తిలోని పదం) అని ఉచ్చరించేవారు (ముజ్జకిర్ అని కాదు).

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ - 54వ సూరా - ఇఖ్తర బతిస్సాఅత్]

472. హజ్రత్ ఇబ్రాహీం (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) సహచరులు కొందరు హజ్రత్ అబూదర్దా (రజి) ప్రాంతానికి (సిరియా) వచ్చినపుడు హజ్రత్ అబూదర్దా (రజి) వారిని వెతుక్కుంటూ వచ్చారు. (చివరికి) వారిని కలుసుకొని "మీలో హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) గారి ఉచ్చారణా శైలి ప్రకారం ఖుర్‌ఆన్ పఠించగలిగే వారు ఎవరైనా ఉన్నారా?" అని అడిగారు. దానికి వారు తామంతా వారి ఉచ్చారణా శైలి ప్రకారమే పఠిస్తామని అన్నారు. "అయితే మీలో ఆయన ఉచ్చారణాశైలి గురించి ఎక్కువగా ఎవరికి తెలుసు?" అని హజ్రత్ అబూదర్దా (రజి) మళ్ళీ అడిగారు. వారు హజ్రత్ అల్ఖమా (రహ్మాలై) వైపు సూచించారు. హజ్రత్ అబూదర్దా (రజి) అల్ఖమా (రహ్మాలై)ని ఉద్దేశించి "మీరు (వల్లైలి ఇజాయగ్షా సూరాను) హజ్రత ఇబ్నె మస్‌వూద్ (రజి) ఎలా పఠిస్తూ ఉండగా విన్నారు?" అని ప్రశ్నించారు. దానికి అల్ఖమా (రహ్మాలై) సమాధానమిచ్చారు. (వజ్జకరివల్‌ఉన్సా-అని). అప్పుడు హజ్రత్ అబూదర్దా(రజి) నేను కూడా దైవప్రవక్త(సల్లం) ఈ విధంగానే పఠిస్తుంటే విన్నానని సాక్ష్యమిస్తున్నాను. కాని ఇక్కడి (సిరియా) జనం నేను వమా ఖలఖజ్జకర వల్ ఉన్సా అని చదవాలని కోరుతున్నారు. దైవసాక్షి! నేను ఎన్నటికీ వీరిని అనుసరించను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 92వ సూరా, వల్లైల్ - 7వ అధ్యాయం - వమా ఖలఖజ్జకర వల్ ఉన్సా]

## 51వ అధ్యాయం - నమాజు చేయకూడని (నిషిద్ధ) వేళలు

473. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నా ముందు కొందరు పుణ్యాత్ములు దైవప్రవక్త(సల్లం) రెండు వేళలల్లో నమాజు చేయడాన్ని నిషేధించారని సాక్ష్యమిచ్చారు. అందులో ఒకటి: ఫజ్ర్ నమాజు తరువాత సూర్యోదయం అయ్యే వరకుండే సమయం, రెండు: అస్ర్ నమాజ్ తర్వాత సూర్యాస్తమమయ్యే వరకుండే సమయం. ఆ పుణ్యాత్ములలో అందరికంటే నా దృష్టిలో హజ్రత్ ఉమర్ (రజి) ఎక్కువ ఉత్తములు, పుణ్యాత్ములు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 30వ అధ్యాయం - అస్సలాతు బాదల్ ఫజ్రి హత్తా తర్తఫ అష్షమ్స్]

474. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఫజ్ర్ నమాజు తరువాత మొదలుకొని సూర్యుడు ఉదయించి పూర్తిగా పైకి వచ్చేవరకుండే సమయంలో ఎలాంటి నమాజు కూడా చేయకూడదు. అలాగే అస్ర్ నమాజు తరువాత మొదలుకొని పూర్తిగా సూర్యాస్తమయం అయ్యే వరకుండే సమయంలో కూడా ఎలాంటి నమాజు చేయకూడదు".

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 31వ అధ్యాయం - లాయతహర్రిస్సలాతు ఖబ్లి గురూబిషమ్స్]

475. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా బోధించారు:- "సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు గానీ, అస్తమిస్తున్నప్పుడు గానీ నమాజు చేయకండి".

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 30వ అధ్యాయం - అస్సలాతు బాదల్ ఫజ్రిహత్తా తర్తఫ అష్షమ్స్]

476. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- "సూర్యుడు ఉదయించి పూర్తిగా పైకి రానంతవరకు నమాజు చేయకండి. అలాగే సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు అతడు పూర్తిగా అస్తమించనంత వరకు కూడా నమాజు చేయకండి."

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బద్ఇల్ఖల్ఖ్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీసివ జనూదిహీ]

## 54వ అధ్యాయం - అస్ర్ నమాజు తర్వాత దైవప్రవక్త (సల్లం) చేసిన రెండు రకాతుల నమాజు గురించిన వాస్తవ పరిస్థితి

477. హజ్రత్ కురేబ్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఇబ్నె అబ్బాస్, ముసవ్విర్ బిన్ మఖ్రమ, అబ్దుర్రహ్మాన్ బిన్ అజ్హర్ (రజి)లు నన్ను విశ్వాసుల మాతృమూర్తి ఆయిషా సిద్దీఖా (రజి) సన్నిధికి పంపించారు. మనందరి తరపున ఆమెకు సలాం చేసిన తరువాత దైవప్రవక్త(సల్లం) అస్ర్ తరువాత చేసిన రెండు రకాత్ల (సున్నత్) నమాజు గురించి అడగవలసినదిగా వారు నాకు చెప్పారు. అదీగాక దైవప్రవక్త(సల్లం) అస్ర్ తరువాత (మరే) నమాజు చేయకూడదని వారించిన హదీసు మా దాకా చేరిందని, అయినప్పటికీ మీరు కూడా ఈ రెండు రకాతులు పఠిస్తున్నారని మాకు తెలిసిందని కూడ ఆమె దృష్టికి తీసుకు రావాలని వారు చెప్పారు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మరొక విషయం తెలియజేస్తూ, "హజ్రత్ ఉమర్ (రజి)తో కలసి ఈ రెండు రకాతులు పఠిస్తుంటే నేను (జనాన్ని) కొడ్తుండేవాడ్ని కూడా" అని అన్నారు.

నేను హజ్రత్ ఆయిషా (రజి)గారి సన్నిధికి వెళ్ళి నన్ను అడిగి రమ్మని చెప్పిన విషయాల్ని ఆమె ముందుంచాను. హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాటలు విని "ఈ విషయం హజ్రత్ ఉమ్మెసల్మా (రజి)ని అడగండని" అన్నారు. నేను హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) దగ్గరకు తిరిగి వచ్చి, హజ్రత్ ఆయిషా (రజి) ఇచ్చిన సమాధానం విన్పించాను. అప్పుడు వారు ముగ్గురూ నన్ను హజ్రత్ ఉమ్మెసల్మా(రజి) సన్నిధికి పంపుతూ హజ్రత్ ఆయిషా (రజి)ని అడిగిన విషయాలే ఆమెను కూడా అడగమని చెప్పారు.

హజ్రత్ ఉమ్మెసల్మా (రజి) (నా మాటలు విని) ఇలా అన్నారు: "దైవప్రవక్త(సల్లం) ఈ రెండు రకాతుల నమాజు చేయకూడదని వారించిన సంగతి స్వయంగా నేను కూడ విన్నాను. అయితే ఆ తరువాత (ఓరోజు) ఆయన (సల్లం) అస్ర్ తర్వాత రెండు రకాతుల నమాజు చేయడం నేను చూశాను.

(ఆ రోజు) అస్ర్ నమాజు చేసిన తరువాత ఆయన నా ఇంటికి వచ్చి రెండు రకాతులు పఠించసాగారు. ఆ సమయంలో అన్సారీ తెగ-బనీహరాంకు చెందిన కొందరు స్త్రీలు నా దగ్గర కూర్చొని ఉన్నారు. (అందువల్ల నేను ఈ విషయం అడగడానికి ఆయన దగ్గరికి వెళ్ళలేకపోయాను). నేను ఆయన దగ్గరికి ఒక అమ్మాయిని పంపాను. "ఆయన సమీపానికి వెళ్ళి ఒకవైపు జరిగి నిల్చుని దైవప్రవక్తా! ఈ రెండు రకాతులు పఠించకూడదని మీరు వారించడం స్వయంగా నేను విన్నాను. ఇప్పుడేమో మీరే ఈ రెండు రకాతులు పఠిస్తూ ఉండటం నేను చూస్తున్నాను; కారణం ఏమిటి అని నా మాటలుగా ఆయన్ని అడుగు. ఆయన గనుక చేత్తో ఏదైనా సైగ చేస్తే నువ్వు కాస్త వెనక్కి జరిగి నిలబడు'' అని చెప్పాను.

ఆ అమ్మాయి వెళ్ళి నేను చెప్పమన్న మాటలు ఆయనకు చెప్పింది. అప్పుడు ఆయన ఆ అమ్మాయిని ఆగమని చేత్తో సైగ చేశారు. ఆమె కాస్త వెనక్కి జరిగి నిల్చుంది. దైవప్రవక్త (సల్లం) నమాజు ముగించిన తరువాత ఆ అమ్మాయి ద్వారా నన్ను ఉద్దేశించి ఇలా అన్నారు:- "అబూఉమయ్యా కూతురా (ఉమ్మెసల్మా)! అస్ర్ తరువాత నేను చేస్తున్న రెండు రకాతుల నమాజు గురించి నన్ను అడుగుతున్నావు, విను, (ఇది అస్ర్ తరువాత చేసే రెండు రకాతుల నమాజు కాదు). నా దగ్గరికి (జుహర్ సమయంలో) బనీ అబ్దైఖైస్ తెగకు చెందిన కొందరు రావడం వల్ల నేను జుహర్ (ఫర్జ్ నమాజు) తర్వాత చేయవలసిన రెండు రకాతుల (సున్నత్) నమాజు చేయలేకపోయాను. అందుచేత ఆ రెండు రకాతుల (సున్నత్) నమాజును ఇప్పుడు (అస్ర్ తరువాత) నెరవేర్చాను. ఇదసలు జుహర్ తరువాత చేయవలసిన రెండు రకాతుల నమాజు''.

[సహీహ్ బుఖారీ : 22వ ప్రకరణం - అస్సహూ, 8వ అధ్యాయం - ఇజాకుల్లిమ వహువ యుసల్లీ ఫాషారా బియదిహి వస్తమ]

478. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- రహస్యంగానైనా, బహిరంగంగానైనా రెండు నమాజులను దైవప్రవక్త(సల్లం) ఎన్నడూ విడనాడలేదు. ఒకటి: ఫజ్ర్ నమాజుకు ముందు చేసే రెండు రకాతులు (సున్నత్ నమాజు). రెండు: అస్ర్ నమాజు తరువాత చేసే రెండు రకాతులు (సున్నత్ నమాజు).

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 33వ అధ్యాయం - మాయు సల్లా బాదల్ అస్రి......]

## 55వ అధ్యాయం - మగ్రిబ్ నమాజుకు ముందు రెండు రకాతులు పఠించడం అభిలషణీయం

479. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ముఅజ్జిన్ (మగ్రిబ్ నమాజు కోసం) అజాన్ ఇవ్వగానే ప్రవక్త అనుచరులు (మస్జిదు) స్తంభాల వైపు పరుగెత్తేవారు. చివరికి దైవప్రవక్త(సల్లం) వచ్చేస్తారు. అయితే వారు మగ్రిబ్ (ఫర్జ్ నమాజు)కు ముందు రెండు రకాతులు (సున్నత్) నమాజు చేసేవారు. అజాన్, ఇఖామత్‌ల మధ్య అంతగా విరామం ఉండదు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 14వ అధ్యాయం - కమ్ బైనల్ అజాని వల్ ఇఖామత్]

## 56వ అధ్యాయం - ప్రతి రెండు అజాన్‌ల (అంటే అజాన్, ఇఖామత్‌ల) మధ్య ఒక నమాజు వుంది

480. హజ్రత్ అబ్దుల్లా బిన్ ముగప్ఫిల్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) "ప్రతి రెండు అజాన్‌ల మధ్య, అంటే అజాన్, ఇఖామత్‌ల మధ్య ఒక నమాజు ఉంద"ని తెలిపారు. ఆయన ఈ విషయాన్ని మూడుసార్లు చెప్పారు. అయితే మూడవసారి "చేయదలచినవారికి (ఈ నమాజు ఉంది)" అని కూడా ఆయన చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 16వ అధ్యాయం - బైనకుల్లి అజానైని సలాతుల్లిమన్‌షా]

## 57వ అధ్యాయం - నమాజె ఖౌఫ్ (భయానక స్థితిలో చేసే నమాజు)

481. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓసారి (భయానక స్థితిలో) సైన్యాన్ని రెండు భాగాలుగా విభజించి, ఒక భాగం సైన్యంతో కలసి (ఒక రకాతు) నమాజు చేశారు. ఆ సమయంలో రెండో భాగం సైన్యం శత్రుసైన్యం ముందు నిలబడి ఉంది. తరువాత వీరు (అంటే దైవప్రవక్త (సల్లం)తో కలసి ఒక రకాతు నమాజు చేసిన యోధులు) వెనక్కి వెళ్ళి తమ సహయోధుల స్థానాల్లో నిలబడ్డారు. అప్పుడు వారొచ్చి దైవప్రవక్త (సల్లం)తో కలసి ఒక రకాతు నమాజు చేశారు. (రెండు రకాతులు పఠించిన తరువాత) దైవప్రవక్త (సల్లం) కుడిఎడమలవైపు తిరిగి సలాం చేశారు. వారు (వెంటనే) లేచి నిలబడి (తప్పిపోయిన) ఒక రకాతు పఠించి నమాజు పూర్తి చేసుకున్నారు. తరువాత (వీరు వెళ్ళిపోయాక దైవప్రవక్తతో కలసి ఒక రకాతు పఠించి వెళ్ళిపోయిన వారు తిరిగొచ్చి) నిలబడి మరొక రకాతు పఠించారు. ఇలా వారు తమ నమాజును పూర్తి చేసుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 31వ అధ్యాయం - గజావతి జాతిర్రిఖా]

482. హజ్రత్ సహల్ బిన్ అబీజస్మ (రజి) కథనం:- (భయానక స్థితిలో నమాజు చేయవలసినపుడు) ఇమాం ఖిబ్లా దిశకు అభిముఖంగా నిలబడతాడు. సైన్యంలోని ఒక భాగం అతని వెనుక నిలబడుతుంది. రెండో భాగం సైన్యం శత్రువుల ముందు ఉంటుంది. వారి ముఖాలు కూడా శత్రువుల వైపు తిరిగి ఉంటాయి. ఇమాం తన వెనుక నిల్చున్న వారికి ఒక రకాతు నమాజు చేయిస్తాడు. ఆ తరువాత వీరు ఇమాం నుండి వేరయిపోయి విడిగా మరొక రకాతు నమాజు చేస్తారు. అంటే ఒక రుకూ, రెండు సజ్దాలు చేస్తారు.

ఆ తరువాత వీరు వెనక్కి వెళ్ళి శత్రువు ముందు నిల్చున్న వారి స్థానాల్లో నిలబడతారు. అప్పుడు వారొచ్చి ఇమాం వెనుక నిల్చుంటారు. ఇమామ్ వారితో కలసి మరొక రకాతు పఠించి నమాజ్ పూర్తి చేస్తాడు. ఇలా ఇమాంకు రెండు రకాతుల నమాజ్ అవుతుంది. అప్పుడు అతని వెనుక నిల్చున్నవారు లేచి నిలబడి అక్కడే ఒక రుకూ, రెండు సజ్దాలతో మరొక రకాతు నమాజ్ చేస్తారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 31వ అధ్యాయం - గజ్వాతిజాతిర్రిఖా]

483. దైవప్రవక్త (సల్లం)తో కలసి జాతిర్రిఖా యుద్ధంలో పాల్గొని ఆయన వెనుక 'నమాజె ఖౌఫ్' చేసిన హజ్రత్ ఖవాత్ బిన్ జుబైర్ (రజి) గారి కథనం:- సైన్యంలోని ఒక భాగం యోధులు దైవప్రవక్త(సల్లం)

వెనుకబారులు తీరి నిలబడ్డారు. మిగిలిన భాగం సైనికులు శత్రువుల ముందు నిల్చొన్నారు. దైవప్రవక్త (సల్లం) తన వెనుక నిల్చున్నవారికి ఒక రకాతు నమాజు చేయించారు. ఆ తర్వాత వీరు విడిగా మరొక రకాతు పఠించి నమాజు ముగించి, శత్రుసైన్యం ముందుకెళ్ళి నిలబడ్డారు. శత్రుసైన్యం ముందు నిల్చున్న మొదటి దళం యోధులు వచ్చి దైవప్రవక్త(సల్లం) వెనుక నిలబడ్డారు. అప్పటిదాకా దైవప్రవక్త(సల్లం) మౌనంగా అలాగే నిలబడ్డారు. వారు రాగానే ఆయన వారికి కూడా ఒక రకాతు నమాజు చేయించారు. అలా దైవప్రవక్త (సల్లం) రెండు రకాతులు పఠించి, వారు మిగిలిపోయిన మరొక రకాతు పఠించి నమాజు పూర్తి చేసుకునేదాకా మౌనంగా కూర్చున్నారు. తర్వాత వారితో కలసి కుడి ఎడమల వైపు తిరిగి సలాం చేశారు. (అంటే నమాజు ముగించారు)

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 31వ అధ్యాయం - గుజ్వతిజాతిర్రికా]

484. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- జాతిర్రిఖా యుద్ధంలో మేము దైవప్రవక్త(సల్లం) వెంట ఉన్నాము. మేము ఒక ఛాయావృక్షం దగ్గరికి చేరుకున్నాక దాన్ని దైవప్రవక్త(సల్లం) కోసం (విశ్రాంతి తీసుకోవడానికి) ప్రత్యేకించాము. అప్పుడు ఒక బహు దైవారాధకుడు వచ్చి వృక్షానికి వ్రేలాడదీసిన ప్రవక్త ఖడ్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ వెనువెంటనే ఒరలో నుండి ఆ ఖడ్గాన్ని బయటికి తీసి "మీరు నాకు భయపడుతున్నారా?" అని అడిగాడు దైవప్రవక్త (సల్లం)ని. దైవప్రవక్త లేదన్నారు. అతను (ఖడ్గం చూపిస్తూ) "ఇప్పుడు నా బారి నుండి మిమ్మల్ని ఎవరు కాపాడగలరు?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(సల్లం) "దేవుడే కాపాడగలడు" అని అన్నారు. (అంతలో) ప్రవక్త అనుచరులు కొందరు (అక్కడికి చేరుకొని) అతడ్ని గదమాయించారు.

ఆ తరువాత నమాజు కోసం అజాన్ చెప్పారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) సైన్యంలోని ఒక భాగంతో కలసి రెండు రకాతులు నమాజు చేశారు. తర్వాత వీరు వెనక్కి వెళ్ళిపోయారు. ఆ తరువాత సైన్యంలోని మిగిలిన భాగం వస్తే దాంతో కలసి కూడ దైవప్రవక్త(సల్లం) రెండు రకాతులు నమాజు చేశారు. ఈ విధంగా ఆయన నాలుగు రకాతులు నమాజు చేశారు. సైనికులు మాత్రం రెండేసి రకాతుల నమాజు చేశారు.★

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 31వ అధ్యాయం - గజ్వతి జాతిర్రిఖా]

---

★ భయాందోళనల సందర్భంలో చేసే నమాజు గురించి ఇదే కాకుండా ఇంకా అనేక పద్ధతులున్నాయి. ధర్మవేత్తలు వాటి ఘనత, ప్రాముఖ్యతలను బట్టి విభిన్న పద్ధతులు అవలంబించారు. సందర్భానుసారం ఏ పద్ధతి అవలంబించినా నమాజు నెరవేరుతుంది.

# జుమా ప్రకరణం

485. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "జుమా (నమాజు)కు వచ్చేవాడు గుస్ల్ (స్నానం) చేసి రావాలి."

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 2వ అధ్యాయం - ఫజ్లిల్ గుస్లి యౌముల్ జుమా]

486. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- ఒకసారి హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) జుమా ప్రసంగం చేస్తుంటే, ప్రవక్త సహచరుల్లో ముహాజిరీన్ వర్గానికి చెందిన గతకాల[1] అగ్రగణ్యుల్లోని ఒక సహాబి(ప్రవక్త సహచరుడు) వచ్చారు. హజ్రత్ ఉమర్ (రజి) ఆయన్ని ఉద్దేశించి "మీరిలా ఆలస్యంగా రావడానికి కారణం ఏమిటీ?" అని ప్రశ్నించారు. దానికి ఆ సహాబి (రజి) "నేనొక ముఖ్యమైన పనిలో ఉండిపోవడం వలన కాస్త ఆలస్యమయింది. నేను (పని ముగించుకొని) ఇంటికి వచ్చేటప్పటికి అజాన్ వినపడసాగింది. వెంటనే నేను వుజూ మాత్రమే చేసి, మరేపనీ చేయకుండా (నమాజుకు) వచ్చేశాను" అని అన్నారు. "ఏమిటీ వుజూ మాత్రమే చేశారా? (జుమా నమాజు కోసం) స్నానం (గుస్ల్) చేయాలని దైవప్రవక్త(సల్లం) ఆజ్ఞాపించిన సంగతి తెలియదా?" అని అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 2వ అధ్యాయం - ఫజ్లిల్ గుస్లియౌముల్ జుముఅ]

## 1వ అధ్యాయం - శుక్రవారం రోజు ప్రతి వయోజనుడు స్నానం చేయడం తప్పనిసరి (వాజిబ్)

487. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా సెలవిచ్చారు : "ప్రతి వయోజన పురుషుడు శుక్రవారం నాడు తప్పనిసరి (వాజిబ్)గా స్నానం చేయాలి."[2]

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 16వ అధ్యాయం - వుజూ అస్సిబ్యాని వ మతా యజిబు అలైహిముల్ గుస్ల్]

488. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- శుక్రవారం రోజు ప్రజలు తమ ఇండ్లలో నుంచి మదీనా చుట్టు ప్రక్కల గ్రామాల నుండి, దుమ్ము, ధూళి కొట్టుకొని చెమటలతో తడిసి గుంపులు గుంపులుగా (జుమా నమాజుకు) వచ్చేవారు. దుమ్ముతో కలిసి చెమట కారుతూ (దుర్వాసన

---

(1) గతకాల అగ్రగణ్యులు అంటే బద్ర్ యుద్ధంలో పాల్గొన్న వారు, రిజ్వాన్ శపథం చేసినవారు, రెండు ఖిబ్లాల (బైతుల్ మఖ్దిస్, కాబా షరీఫ్)ల వైపు అభిముఖులై నమాజ్ చేసినవారు - అని అర్థం. వారిలో ఒక సహాబీ అంటే హజ్రత్ ఉస్మాన్ జున్నూరైన్ (రజి) అని అర్థం. ఇస్లామీయ చరిత్రలో ఈ సంఘటన కూడా సమతా, న్యాయాలకు ఒక మచ్చుతునక. ఆత్మపరిశీలన విషయంలోగానీ, విమర్శ విషయంలో గానీ అందరూ సమానులేనని ఈ సంఘటన తెలియజేస్తోంది.

(2) ఈ హదీసుని బట్టి శుక్రవారం రోజు తప్పనిసరిగా తలస్నానం చేయాలని తెలుస్తోంది. దీన్ని కొందరు సహాబీలు పాటించారు. అయితే హజ్రత్ ఆయిషా (రజి)గారి ఉల్లేఖనం బట్టి శుక్రవారం స్నానం వాజిబ్ (విధి) కాదని ముస్తహిబ్ (అభిలషణీయం) మాత్రమేనని కూడా మరొక వైపు తెలుస్తోంది. అందువల్ల అత్యధిక మంది ధర్మవేత్తలు ఈ పద్ధతినే అవలంబించారు. దీనికి మరింత బలం చేకూర్చుతున్న మరో హదీసు ఉంది. అందులో దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "ఎవరైనా (శుక్రవారం రోజు) వుజూ చేస్తే సరే (సరిపోతుంది). అయితే గుసుల్ చేయడం మరింత మంచిది.

కొద్దూ) ఉండేది. ఒకసారి అలాంటి వారిలో ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చాడు. ఆ సమయంలో దైవప్రవక్త(సల్లం) నా దగ్గర కూర్చొని ఉన్నారు. ఆయన ఆ వ్యక్తిని చూసి "ఈ రోజు మీరు (ప్రజలు) గనక శుచి శుభ్రతలు పాటిస్తే (అంటే స్నానం చేసి ఉంటే) ఎంత బాగుంటుంది?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 15వ అధ్యాయం - మిన్‌ఐన తూతల్ జుముఅ]

489. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ప్రజలు (ఆ కాలంలో) తమ పనులు తామే చేసుకునేవారు. (అలా పనులు చేసి) జుమా నమాజుకు అవే బట్టలతో (దుమ్ము చెమటలతో కూడిన) శరీరంతో వచ్చేవారు. అందువల్ల 'మీరు స్నానం చేసి వస్తే ఎంత బాగుండేది' అని (దైవప్రవక్త) చెప్పేవారు వారికి.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 16వ అధ్యాయం - వఖ్తిల్ జుముఅతి ఇజా జాలతిష్షమ్స్]

## 2వ అధ్యాయం - శుక్రవారం రోజు సువాసనలు పూసుకోవడం, మిస్వాక్ చేయటం మంచిది

490. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- "శుక్రవారం రోజు ప్రతి ముస్లిం యువజనుడు విధి (వాజిబ్)గా స్నానం చేయాలి. మిస్వాక్ (బ్రష్) కూడా చేయాలి. ఉంటే సువాసనలు కూడ పూసుకోవాలి."

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 3వ అధ్యాయం - అత్తీబిలిల్ జుముఅ]

491. హజ్రత్ తావూస్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) స్నానం గురించి దైవప్రవక్త (సల్లం) ప్రకటించిన ఒక హదీసు విన్పించారు. అప్పుడు నేను జోక్యం చేసుకుంటూ, "ఈ హదీసులో, అతని భార్య దగ్గర తైలం సువాసనలు ఉంటే వాటిని సయితం ఉపయోగించాలన్న విషయం కూడా ఉందా?" అని అడిగాను. దానికి ఆయన "ఈ సంగతి నాకు తెలియదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం, జుమా, 6వ అధ్యాయం - అద్దుహ్నిలిల్ జుముఅ]

492. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ప్రతి ముస్లిం వారానికి (కనీసం) ఒకసారి స్నానం చేయాలి. ఆ స్నానంలో తల, శరీరం పూర్తిగా కడుక్కోవాలి. ఇది ముస్లింలపై ఉన్న దేవుని హక్కు."

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 12వ అధ్యాయం - హల్ అలామన్ లమ్ యష్ హదుల్ జుముఅత గుస్లున్ మినన్నిసా]

493. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- శుక్రవారం రోజు ఎవరు జనాబత్ గుస్ల్ (పూర్తిస్థాయి స్నానం) చేసి (పెందలాడే) జుమా నమాజు చేయడానికి వెళ్తాడో, అతను ఒక ఒంటెను బలి ఇచ్చిన వాడవుతాడు. (తర్వాత) రెండవ వేళలో ఇలా వెళ్ళిన వ్యక్తికి ఒక ఆవును బలి ఇచ్చిన పుణ్యం లభిస్తుంది. మూడవ వేళలో వెళ్ళేవాడికి ఒక పొట్టేలును బలిచ్చిన పుణ్యం, నాల్గవ వేళలో వెళ్ళేవాడికి ఒక కోడిని బలిచ్చిన పుణ్యం లభిస్తుంది. అయిదవ వేళలో వెళ్ళేవాడు దైవమార్గంలో ఒక కోడి గ్రుడ్డును దానం చేసిన వాడవుతాడు. ఆ తరువాత ఇమామ్ మస్జిదులో ప్రవేశించగానే దైవదూతలు కూడా అతని ప్రసంగం వినడానికి వస్తారు. (ఆ తరువాత వచ్చే వారికి దైవదూతలు హాజరు వేయరు).

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 4వ అధ్యాయం - ఫజ్లిల్ జుముఅ]

## 3వ అధ్యాయం - జుమా ప్రసంగం చేస్తున్నప్పుడు నిశ్శబ్దంగా వుండాలి

494. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "శుక్రవారం రోజు ఇమామ్ జుమా ప్రసంగం చేస్తున్నప్పుడు, మీరు గనక మీ (ప్రక్కన కూర్చున్న) సహచరునితో 'నిశ్శబ్దంగా' ఉండు అని అంటే మీరొక పనికిమాలిన పనికి పాల్పడినవారవుతారు."

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 36వ అధ్యాయం - అల్ ఇన్సాతి యౌముల్ జుమా వల్ ఇమాము యఖ్తుబ్]

495. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) జుమా గురించి ప్రస్తావిస్తూ ఇలా ప్రవచించారు:- "ఆ రోజు ఓ ప్రత్యేక (శుభ) ఘడియ ఉంది. ఆ ఘడియలో ఎవరైనా ముస్లిం నమాజు స్థితిలో దేవుణ్ణి ఏదైనా వేడుకుంటే దేవుడు అతని కోరికను తప్పకుండా తీర్చుతాడు." దైవప్రవక్త(సల్లం) ఈ సంగతి చెబుతూ "ఆ ఘడియ అతి స్వల్పంగా ఉంటుంది" అని చేత్తో సైగ చేశారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 37వ అధ్యాయం - అస్సాఅతిల్లతీ ఫీయౌమిల్ జుముఅ]

## 6వ అధ్యాయం - ముస్లిం అనుచర సమాజానికి శుక్రవారం వైపు మార్గదర్శనం

496. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ప్రపంచంలో మనం యావత్తు అనుచర సమాజాల కంటే వెనుక వచ్చాము. అయితే ప్రళయదినాన మనం అందరికన్నా మించిపోతాము. మనకు పూర్వమే యావత్తు అనుచర సమాజాలకు (దైవ) గ్రంథం లభించింది. మనకు వారి తరువాత లభించింది. (అంటే వారు గతంలోనికి పోయారు. మనం వారి వెనుక ఉన్నాం) కాని ఈ రోజు (అంటే శుక్రవారం) విషయంలో వారు దైవాజ్ఞ పాటింపుతో విభేదించారు. (అంచేత ఈ శుభదినం మనకు లభించింది. ఈ కారణంగానే మనం ప్రళయ దినాన వారిని మించిపోతాము) రేపటి దినం (శనివారం) యూదులకు లభించింది. ఎల్లుండి దినం (ఆదివారం) క్రైస్తవులకు లభించింది."

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్]

## 9వ అధ్యాయం - జుమా నమాజు వేళ సూర్యుడు నెత్తిమీద నుండి వాలిన తరువాత అవుతుంది

497. హజ్రత్ సహల్ (రజి) కథనం:- "మేము (దైవప్రవక్త కాలంలో) శుక్రవారం రోజు నమాజుకు పూర్వం అన్నం తినడం గాని, విశ్రాంతి తీసుకోవడం గాని చేసే వాళ్ళము కాము. నమాజు ముగించిన తరువాతనే ఈ పనులు చేసే వాళ్ళం."

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 40వ అధ్యాయం - ఖాలల్లాహుతాలా ఫయిజా ఖుజియతిస్సలాతు ఫన్తషిరూ ఫిల్ అర్జ్]

498. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం:- శుక్రవారం రోజు మేము దైవప్రవక్త(సల్లం)తో కలసి నమాజు చేశాక ఇండ్లకు తిరిగి వస్తున్నప్పుడు గోడలు మేము ఆశ్రయం పొందే అంత నీడలు ఇచ్చేవి కావు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 35వ అధ్యాయం - గజ్వతుల్ హుదైబియా]

## 10వ అధ్యాయం - జుమా నమాజుకు పూర్వం రెండు ప్రసంగాలు, వాటి మధ్య కాస్సేపు కూర్చోవడం

499. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) నిలబడి (జుమా) ప్రసంగం చేసేవారు. మధ్యలో కాసేపు కూర్చుంటారు. తర్వాత తిరిగి లేచి మీరీనాడు ప్రసంగిస్తున్నట్లే నిలబడి ప్రసంగించేవారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 27వ అధ్యాయం - అల్‌ఖుత్బతి ఖాయిమా]

## 11వ అధ్యాయం - "వ ఇజారఔ తిజారతన్" అనే దైవసూక్తి అవతరణ

500. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) వెనుక (జుమా) నమాజు చేస్తుంటే, ఆహారధాన్యాలు తీసుకొని ఒక వర్తక బిడారం (నగరానికి) వచ్చింది. దాంతో చాలా మంది జనం దానివైపు దృష్టి మరల్చారు. దైవప్రవక్త (సల్లం)తో పాటు పన్నెండుమంది మాత్రమే (మస్జిదులో) ఉండిపోయారు. ఆ సందర్భంలో "వ ఇజారఔ తిజారతన్ ఔలహ్ వానిన్ ఫజ్జూ ఇలైహా వతర కూక ఖాయిమా" (వారు వ్యాపారం, వినోదం, తమాషా జరుగుతుంటే చూసి నిన్ను ఒంటరిగా వదిలేసి అటువైపు పరుగెత్తారు" అనే (జుమా సూరాలోని) సూక్తి అవతరించింది.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 38వ అధ్యాయం - ఇజానఫరన్నాసు అనిల్ ఇమామి ఫీ సలాతిల్ జుముఅ]

## 13వ అధ్యాయం - జుమా నమాజు, జుమా ప్రసంగాలు సంక్షిప్తంగా ఉండాలి

501. హజ్రత్ యాలబిన్ ఉమయ్య (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (శుక్రవారం రోజు) "వ నాదవ్ యా మాలికు లియఖ్జి అలైనా రబ్బుక్" (జుఖ్రుఫ్ సూరా --77వ సూక్తి) అనే సూక్తి పఠిస్తుంటే నేను విన్నాను.

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాయిల్ ఖల్ఖ్,7వ అధ్యాయం - ఇజా ఖాల అహదుకుమ్ ఆమీని...]

## 14వ అధ్యాయం - జుమా ప్రసంగం సమయంలో 'తహ్యాతుల్ ఉజూ' నమాజ్ చేయవచ్చు

502. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఓ సారి శుక్రవారం రోజు దైవప్రవక్త (సల్లం) ఉపన్యాసం ఇస్తుంటే, ఒక వ్యక్తి అప్పుడే మస్జిదులోనికి ప్రవేశించాడు. దైవప్రవక్త(సల్లం) అతడ్ని ఉద్దేశించి "నీవు నమాజు చేశావా?" అని అడిగారు. దానికావ్యక్తి చేయలేదన్నాడు. "అయితే ముందు రెండు రకాతులు (నఫిల్) నమాజు చెయ్యి" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 33వ అధ్యాయం - మన్‌జా అవల్ ఇమామి యఖ్తుబు సలారకాతైని ఖఫీఫతైన్]

503. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఉపన్యాసం ఇస్తూ "ఇమామ్ ఉపన్యాసం ఇస్తున్నప్పుడు" లేక ఉపన్యాసం ఇవ్వడానికి ఉపక్రమించినపుడు ఎవరైనా వస్తే

అతను (ముందుగా) రెండు రకాతులు (నఫిల్) నమాజు చేయాలి" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 25వ అధ్యాయం - మాజాఅ ఫిత్తత్వా మస్నామస్నా]

## 17వ అధ్యాయం - శుక్రవారం రోజు ఏ సూరాలు పఠించడం అభిలషణీయం?

504. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- శుక్రవారం రోజు దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజులో సజ్దా, దహర్ సూరాలు పఠించేవారు.

[సహీహ్ బుఖారీ : 11వ ప్రకరణం - జుమా, 10వ అధ్యాయం - మాయఖ్రావు ఫీసలాతిల్ ఫజ్రి యౌముల్ జుముఅ]

★ ఈ సమస్యపై ధర్మవేత్తలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇమామ్ అహ్మద్‌బిన్ హంబల్ (రహ్మలై) మరికొందరు పరిశోధకులు, హదీసువేత్తల అభిప్రాయం ప్రకారం ఇమాం (ఖుత్బా) (ఉపన్యాసం) ఇస్తున్నప్పుడు మస్జిద్‌లో ప్రవేశించే వ్యక్తి ముందుగా రెండు రకాతుల నమాజు చేయడం ముస్తహబ్ (అభిలషణీయం). అయితే ముక్తసరిగా చేయాలి. ఆ తర్వాతే ఖుత్బా వినాలి. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), మరికొందరు పరిశోధకుల అభిప్రాయం ప్రకారం ఖుత్బా ఇస్తున్నప్పుడు నఫిల్‌గాని, మరే నమాజు గాని చేయకూడదు. ఖుత్బా సందర్భంలో మరే పనీ చేయకూడదని కొన్ని హదీసుల్లో ఉన్నది.

- అనువాదకుడు

# పండుగ నమాజ్ ప్రకరణం

## ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్హా నమాజులు

505. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో కలసి ఈదుల్ ఫిత్ర్ నమాజు చేశాను. అలాగే శ్రేష్ఠ ఖలీఫాలయిన అబూబక్ర్ (రజి), ఉమర్ (రజి), ఉస్మాన్ (రజి) గార్లతో కలసి కూడా ఈదుల్ ఫిత్ర్ నమాజు చేశాను. దైవప్రవక్త(సల్లం), శ్రేష్ఠ ఖలీఫాలు కూడా మొదట నమాజు చేసి ఆ తరువాత ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చేవారు. ఆనాడు దైవప్రవక్త (సల్లం) (ఉపన్యాస వేదిక నుంచి) క్రిందికి దిగి, ప్రజలను కూర్చోమని చేత్తో సైగ చేస్తూ (పురుషుల) పంక్తులను చీల్చుకుంటూ స్త్రీల పంక్తుల సమీపానికి చేరుకున్న దృశ్యం ఇప్పటికీ నా కళ్ళ ముందు మెదలుతోంది. ఆ సమయంలో హజ్రత్ బిలాల్ (రజి) కూడా దైవప్రవక్త(సల్లం) వెంట ఉన్నారు.

దైవప్రవక్త (సల్లం) "యా హయ్యు హన్నబియ్యు ఇజా జా అకల్ మూమినాతు యుబాయిానక అలా అన్‌ల్లా యుష్రిక్‌న" (ప్రవక్తా! విశ్వసించిన స్త్రీలు నీ దగ్గరికి వచ్చి తాము దేవునికి (ఆయన దైవత్వంలో) మరెవరినీ సాటి కల్పించబోమని, దొంగతనం చేయబోమని, వ్యభిచారానికి పాల్పడబోమని, తమ సంతనాన్ని హతమార్చము అనీ, అక్రమ సంబంధాలను గురించిన అపనిందలు సృష్టించమని, మంచి విషయాల్లో నీకు అవిధేయత చూపమని ప్రమాణం చేస్తే, వారి చేత ప్రమాణం చేయించు. వారి పాప మన్నింపు కోసం దేవుడ్ని ప్రార్థించు. దేవుడు తప్పకుండా క్షమించేవాడు, కరుణించేవాడు.] (ఖుర్‌ఆన్ : 60-12) అనే సూక్తి పఠించారు.

దైవప్రవక్త (సల్లం) ఈ సూక్తి పఠించిన తరువాత "మీరీ విషయాలను గురించి నా ముందు ప్రమాణం చేస్తారా?" అని మహిళల్ని ప్రశ్నించారు. అప్పుడు వారిలో ఒక స్త్రీ మాత్రమే చేస్తానని సమాధానమిచ్చింది. మిగిలిన వారంతా ఎలాంటి సమాధానం ఇవ్వకుండా ఉండిపోయారు. "సరే మీరు సదఖా (విరాళాలు) ఇవ్వండి" అన్నారు దైవప్రవక్త(సల్లం). హజ్రత్ బిలాల్ (రజి) తన కండువా తీసి క్రింద పరుస్తూ "నా తల్లిదండ్రుల్ని మీ కోసం సమర్పింతు" అని అన్నారు. అప్పుడు స్త్రీలు తమ ఉంగరాలు, మెట్టెలు తీసి ఆ వస్త్రంలో వేయనారంభించారు.

[సహీహ్ బుఖారీ: 13వ ప్రకరణం - ఈదైన్, 19వ అధ్యాయం - మౌయిజతిల్ ఇమామిన్నిసా (యౌముల్ ఈద్]

506. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఈదుల్ ఫిత్ర్ రోజు దైవప్రవక్త (సల్లం) నిలబడి మొదట నమాజు చేయించారు. ఆ తరువాత ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చారు. ఉపన్యాసం ముగిసిన తరువాత వేదిక దిగి స్త్రీల దగ్గరికి వెళ్ళి వారికి ధర్మబోధన చేశారు. అప్పుడు ఆయన హజ్రత్ బిలాల్ (రజి) చేతిని ఊతగా చేసుకుని నిల్చున్నారు. తరువాత హజ్రత్ బిలాల్ (రజి) వస్త్రం తీసి క్రింద పరిచారు. అందులో స్త్రీలు తమ తమ విరాళాలు (సదఖాలు) వేస్తూపోయారు.

[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 19వ అధ్యాయం - మౌయిజతిల్ ఇమామిన్నిసా యౌముల్ ఈద్]

507. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి), హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి)ల కథనం:- ఈదుల్ ఫిత్ర్,

ఈదుల్ అజ్హా రెండు పండుగల నమాజు కోసం (ప్రవక్త కాలంలో) అజాన్ ఇవ్వడం జరిగేది కాదు.
[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 7వ అధ్యాయం - అల్‌మషి వర్రుకూ బి ఇలల్ ఈద్ .......... బిగైరి అజాన్]

508. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) గారి ఖిలాఫత్ (పాలనా) ప్రారంభ రోజుల్లో హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఆయనకు ఒక సమాచారం పంపుతూ "(దైవప్రవక్త (సల్లం) కాలంలో) ఈదుల్ ఫిత్ర్ నమాజు కోసం అజాన్ ఇచ్చేవారు కాదు. అదీగాక ఈద్ ఖుత్బా (ఉపన్యాసం) నమాజు తరువాత ఇచ్చేవారు" అని తెలియచేశారు.
[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 7వ అధ్యాయం - అల్‌మషి వర్రుకూబి ఇలల్ ఈద్....]

509. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం), హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి)లు ఇద్దరూ, పండుగల నమాజు ఖుత్బా (ఉపన్యాసం)కు ముందే చేసేవారు.
[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 8వ అధ్యాయం - అల్ ఖుత్బ బాదల్ ఈద్]

510. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్హా దినాల్లో దైవప్రవక్త (సల్లం) ఈద్గాకు వెళ్ళి ముందుగా నమాజు చేయించేవారు. ఆ తరువాత నమాజు ముగించగానే బారులు తీరి తమ తమ స్థానాల్లో కూర్చొని ఉన్న ప్రజల ముందు నిలబడి వారికి ధర్మబోధ చేస్తూ మంచి విషయాలను గురించి ఆజ్ఞాపించేవారు. (ఆ సమయంలో) సైన్యాన్ని ఎక్కడికైనా పంపవలసి ఉంటే ఆ ఏర్పాటు చేసేవారు లేదా ఏదైనా ఆజ్ఞ జారీ చేయవలసి ఉంటే ఆ ఆజ్ఞ జారీ చేసేవారు. ఆ తర్వాత తిరిగి (తమ స్థానానికి) వచ్చేవారు.

చాలా కాలం వరకు ప్రజలు ఈ పద్ధతినే అనుసరిస్తూ ఉండేవారు. అయితే మర్వాన్ మదీనా పాలకుడిగా నియమించబడిన తరువాత ఈదుల్ ఫిత్ర్ లేక ఈదుల్ అజ్హా వస్తే నేను మర్వాన్‌తో కలసి నమాజు కోసం ఈద్గాహ్ వెళ్ళాను. అక్కడ చూస్తే కసీర్ బిన్ సల్త్ ఒక వేదిక ఏర్పాటు చేసి ఉంచాడు. మర్వాన్ నమాజుకు ముందుగానే (ఉపన్యాసం ఇవ్వడానికి) ఆ వేదిక ఎక్కడానికి ఉపక్రమించారు. నేను (వెంటనే) అతని అంగవస్త్రం పట్టుకొని లాగాను. కాని అతను తన వస్త్రం నా నుండి విడిపించుకొని వేదిక ఎక్కి నమాజుకు పూర్వమే ఉపన్యాసం ఇచ్చాడు. నేను అతడ్ని విమర్శిస్తూ "మీరు ప్రవక్త సంప్రదాయాన్ని మార్చి వేశారు" అని అన్నాను. దానికతను "అబూ సయీద్! నీవు ఎరిగిన కాలం ఇప్పుడు మారిపోయింది" అన్నారు. "అయ్యో దైవమా! నేను ఎరగని దానికంటే ఎరిగిన విషయం ఎంతో శ్రేష్ఠమైనది" అన్నా నేను. అప్పుడు మర్వాన్ అసలు విషయం చెబుతూ "నమాజు అయిన తరువాత జనం మా మాటలు వినడానికి అట్టే ఇక్కడ కూర్చోరు. అందుచేత మేము నమాజుకు ముందే ఉపన్యాసం మొదలెట్టాము" అని అన్నారు.
[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 6వ అధ్యాయం - అల్‌ఖురూజ్ ఇలల్ ముసల్లా బిగైరి మింబర్]

## 1వ అధ్యాయం - స్త్రీలు ఈద్గాహ్ వెళ్ళి ఖుత్బా వినవచ్చు. అయితే వారు పురుషులకు వేరుగా కూర్చోవాలి

511. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- రెండు పండుగల సందర్భాల్లోనూ బహిష్టు స్త్రీలు, పరదా మహిళలు ఈద్గాహ్‌కు వెళ్ళి ముస్లిం పురుషులతో పాటు దుఆ (వేడుకోలు)లో పాల్గొనాలని మాకు ఆజ్ఞ

ఇవ్వబడింది. అయితే బహిష్టు స్త్రీలు మాత్రం నమాజు చేసే చోటు నుంచి కొంచెం దూరంగా జరిగి కూర్చోవాలని ఆదేశించారు.

(ఒకసారి) ఓ స్త్రీ "దైవప్రవక్తా! ఎవరి దగ్గరైనా దుప్పటి (బురఖా) లేకపోతే ఆమె ఈద్గాహ్‌కు ఎలా వెళ్తుంది?" అని అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) "ఆమె స్నేహితురాలు తన దగ్గరున్న దుప్పట్లలో ఒకటి ఆమెకు ఇవ్వాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 2వ అధ్యాయం - వజూబిస్సలాతి ఫిస్సియాబ్]

## 4వ అధ్యాయం - పండుగ దినాల్లో చెడు విషయాల్లేని ఆటల్లో పాల్గొనవచ్చు

512. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ సారి పండుగ రోజు మా ఇంట్లో ఇద్దరు అన్సార్ బాలికలు బాస్ యుద్ధం గురించి అన్సారులు రచించిన ఒక గేయాన్ని పాడసాగారు. (అంతలో మా నాన్నగారు) హజ్రత్ అబూబకర్ (రజి) వచ్చి "ఏమిటిది, దైవప్రవక్త (సల్లం) ఇంట్లో ఈ పైశాచికపు పాటలు?" అని అరిచారు. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని "అబూబకర్! ప్రతిజాతీ పండుగ జరుపుకుంటుంది. ఈ రోజు మన పండుగ (ఇలా సంతోషంగా పాడుకోవడంలో తప్పులేదు)" అని అన్నారు. ★

[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 3వ అధ్యాయం - సున్నతిల్ ఈదైని లిఅహ్లిల్ ఇస్లాం]

513. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మా ఇంట్లో ఇద్దరు బాలికలు బాస్ యుద్ధగాథ గురించిన ఒక పాట పాడుతుంటే దైవప్రవక్త(సల్లం) ఇంటికి తిరిగొచ్చారు. ఆయన వచ్చి పడక మీద మేను వాల్చి ముఖం అటువైపుకు త్రిప్పుకుని పడుకున్నారు. కాస్సేపటికి మా నాన్న హజ్రత్ అబూబకర్ (రజి) కూడా వచ్చారు. ఆయన వచ్చీరాగానే నా మీద మండిపడుతూ "ఏమిటీ ఈ పైశాచికపు పాటలు?" అందులోనూ దైవప్రవక్త (సల్లం) ముందా?" అని అరిచారు. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని హజ్రత్ అబూబకర్ (రజి) వైపు తిరిగి "అబూబకర్! వాళ్ళను ఏమీ అనకండి" అన్నారు. తరువాత ఆయనపై (వహీ) సూచనగా మైకం కమ్ముకున్నది. నేను వెంటనే ఆ బాలికలను బయటికి వెళ్ళిపొమ్మని సైగ చేశాను. వారు వెళ్ళిపోయారు.

అది పండుగ రోజు, ఆ సందర్భంలోనే కొందరు నీగ్రోలు డాలు, ఈటెలతో తమ ప్రతిభా విశేషాలను ప్రదర్శించసాగారు. నేను కోరానో లేక స్వయంగా దైవప్రవక్త అడిగారో గుర్తు లేదుగాని, "నువ్వు చూడాలనుకుంటున్నావా (ఆ విన్యాసం)" అని అంటే నేను 'ఔను' అన్నాను. అప్పుడు ఆయన నన్ను తన వెనుక నిలబెట్టుకున్నారు! నా చెంప ఆయన చెంపకు ఆని ఉండేలా. దైవప్రవక్త(స) ఆ నీగ్రోలను ఉత్సాహపరుస్తూ "అర్ఫిదా ముద్దు బిడ్డలారా! ఆడండి, ఇంకా ఆడండి" అని చెబుతుండేవారు. చివరికి నేను అలసిపోయాను. దైవప్రవక్త(స) నా పరిస్థితి గమనించి "ఏమిటీ ఇక చాలా?" అని

---

★ పండుగరోజు ఆనందోత్సవాలు జరుపుకోవడం మంచి విషయమేనని ఈ హదీసు భావం. బాలికలు సంతోషంతో పాటలు పాడటాన్ని దైవప్రవక్త(సల్లం) వ్యతిరేకించలేదు; పైగా సమర్థించారు. అందువల్ల కొందరు ధర్మవేత్తలు ఈ హదీసుని ఆధారంగా చేసుకొని పండుగ రోజు యువతులు పాటలు పాడటం, వాటిని ఇతరులు వినడం ధర్మసమ్మతమేనని; అయితే ఆ పాటలు చెడుకు దారి తీసేవిగా ఉండరాదని అన్నారు.

అడిగారు. నేను 'ఊఁ' అన్నాను. "అయితే ఇక (లోపలికి) వెళ్ళిపో" అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 13వ ప్రకరణం - ఈదైన్, 2వ అధ్యాయం - అల్‌హిరాబి వద్దర్ఖి యౌముల్ ఈద్]

514. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- కొందరు నీగ్రోలు దైవప్రవక్త (స) (ఇంటి) సమీపంలో బరిసెలతో తమ ప్రతిభా విశేషాలను ప్రదర్శించసాగారు. అదే సమయంలో హజ్రత్ ఉమర్ (రజి) అటు వైపు వచ్చారు. ఆయన వచ్చీరాగానే (మండిపడుతూ) ఆ నీగ్రోలను కొట్టేందుకు కంకరాళ్ళ కోసం క్రిందకి వంగారు. దైవప్రవక్త(సల్లం) ఆయన వాలకం చూసి "ఉమర్! వాళ్ళను ఏమీ అనకు, వాళ్ళు చేస్తున్న దాన్ని చేయని" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - అల్ జిహాద్ వస్సైర్, 79వ అధ్యాయం - అల్లహూ బిల్ హిరాబి వన హూహ]

# ఇస్తిస్ఖా నమాజు ప్రకరణం

515. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓసారి వర్షం కోసం దైవాన్ని ప్రార్థించినపుడు తమ దుప్పటిని తిరగేసి కప్పుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 15వ ప్రకరణం - ఇస్తిస్ఖా, 4వ అధ్యాయం - తహ్వీల్ రిర్రిదాయి ఫిల్ ఇస్తిస్ఖా]

## 1వ అధ్యాయం - వర్షం కోసం ప్రార్థన చేసేటప్పుడు చేతులు పైకెత్తుట

516. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) వర్షం కోసం ప్రార్థన చేసేటప్పుడు తప్ప, మరే సందర్భంలోనూ ప్రార్థన (దుఆ) చేసేటప్పుడు చేతులు పైకెత్తేవారు కాదు. వర్షం కోసం ప్రార్థన చేసేటప్పుడు ఆయన తన చేతుల్ని చంకలోని తెలుపుదనం కన్పించేటంతగా పైకి ఎత్తేవారు.

[సహీహ్ బుఖారీ : 15వ ప్రకరణం - ఇస్తిస్ఖా, 22వ అధ్యాయం - రఫ్ అల్ ఇమామి యదహూఫిల్ ఇస్తిస్ఖా]

## 2వ అధ్యాయం - వర్షం కోసం దైవాన్ని ప్రార్థించడం

517. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) కాలంలో ఒకసారి కరువు వచ్చింది. అందువల్ల ఒక శుక్రవారం దైవప్రవక్త(సల్లం) జుమా ఖుత్బా (ఉపన్యాసం) ఇస్తుంటే ఒక గ్రామీణుడు లేచి "దైవప్రవక్తా! మా పశుసంపద నాశనమయ్యింది. మా భార్యా పిల్లలు ఆకలితో చస్తున్నారు. మా శ్రేయస్సు కోసం మీరు దైవాన్ని ప్రార్థించండి" అని విన్నవించుకున్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) చేతులు పైకెత్తి దుఆ (ప్రార్థన) చేయడానికి ఉపక్రమించారు.

ఆ సమయాన ఆకాశంలో మచ్చుకు ఒక మబ్బుతునక కూడా లేదు. కాని నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యం! ఆ మరుక్షణమే కొండల్లాంటి మేఘ మాలికలు నలువైపులనుంచీ కమ్ముకురావడం మొదలయింది, అవి పూర్తిగా ఆవరించనంతవరకు దైవప్రవక్త(సల్లం) తమ చేతుల్ని క్రిందికి దించలేదు. దైవప్రవక్త(సల్లం) వేదిక నుండి క్రిందికి దిగారో లేదో ఆయన గడ్డం వెంట్రుకలపై చిటపట చినుకులు పడటం నేను చూశాను. ఆ రోజు రోజంతా వర్షం కురుస్తూనే ఉంది. మరునాడు, ఆ మరుసటి రోజు, ఆ తర్వాత కూడా ఏకధాటిగా కురుస్తూనే పోయింది. ఆ విధంగా చివరికి రెండవ శుక్రవారం వచ్చింది.

మళ్ళీ ఆ గ్రామీణుడే (లేక మరో గ్రామీణుడో) లేచి నిలబడి "దైవప్రవక్తా! మా ఇండ్లు పడిపోయాయి. మా పశుసంపద మునిగిపోయింది. కాస్త మా కోసం దైవాన్ని ప్రార్థించండి" అని విన్నవించుకున్నాడు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) మళ్ళీ చేతులెత్తి "దేవా! మా చుట్టు ప్రక్కల మాత్రమే వర్షం కురిపించు, మా మీద కురిపించకు" అని ప్రార్థించారు. ఈ విధంగా ఆయన ఎటువైపు సూచన చేశారో అటువైపు మేఘాలు విడిపోనారంభించాయి.

(ఇలా మబ్బులు మెల్లిమెల్లిగా విడిపోయి) చివరికి మదీనా పట్టణం (వర్షం కురియని) ఒక వలయంగా మిగిలిపోయింది. ఖినాతా కాలువ ఒక నెల రోజుల పాటు ప్రవహించింది. చుట్టు ప్రక్కల ప్రాంతాల నుండి వచ్చే ప్రతి వ్యక్తి అక్కడ కుంభవృష్టి కురిసిందన్న వార్తలు మోసుకొచ్చేవాడు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - జుమా, 35వ అధ్యాయం - అల్ ఇస్తిస్ఖాయి ఫిల్ ఖుత్బతి యౌముల్ జుముఅ]

## 3వ అధ్యాయం - తుఫాను సూచనలు కనిపిస్తే దేవుని శరణు కోరాలి, సాధారణ వర్షం అయితే సంతోషం వ్యక్తపరచాలి

518. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఆకాశంలో ఏదైనా అసాధారణ వస్తువు చూస్తే, ఉదాహరణకు మబ్బు లేక మెరుపు చూస్తే ఆయన ముఖ కవళికలు మారిపోతాయి. (ఎంతో ఆందోళన చెందుతూ) ఒకసారి ముందుకు, మరొకసారి వెనక్కి అడుగువేస్తారు. ఒకసారి లోపలికి, మరొకసారి బయటికి నడుస్తారు. అయితే వర్షం కురవగానే, ఆయన భయాందోళనలు దూరమయిపోతాయి.

ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి) ప్రవక్త (సల్లం) గారి ఈ పరిస్థితి చూసి కారణం ఏమిటని అడిగితే ఆయన ఇలా సమాధానమిచ్చారు:- ఆద్ జాతి గురించి దివ్యఖుర్ఆన్‌లో వచ్చినట్లు మన మీద కూడా విధివశాత్తు అలాంటి ఆపద ఏదైనా వస్తుందేమోనని నేను భయపడుతున్నాను. ఖుర్ఆన్‌లో (ఆ సంఘటన) ఇలా ప్రస్తావించబడింది; "వారు దాన్ని (మేఘాన్ని) తమ లోయలవైపు రావడం చూసి 'ఈ మేఘం మనకు పుష్కలంగా వర్షం కురిపిస్తుందని' అన్నారు. (సంతోషంతో చంకలు కొట్టుకుంటూ) కాదు. ఇది (వర్షం కాదు) మీరు తొందరపెడుతున్న విషయం (శిక్ష) ఇది. ఇదొక పెనుతుఫాను. (మీ కొరకు) బాధాకరమైన శిక్ష ముంచుకొస్తోంది" (అహ్ఖాఫ్-24)

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాయిల్ ఖల్ఖ్, 5వ అధ్యాయం - మాజాయి ఫీ ఖౌలిహీ వహువల్లజీ అర్సలర్రీహ....]

## 4వ అధ్యాయం - తూర్పు, పడమర గాలులను గురించి ప్రవక్త ప్రవచనం

519. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "తూర్పు గాలి ద్వారా నాకు సహాయం చేయబడింది. పడమర గాలి ద్వారా ఆద్ జాతి నాశనం చేయబడింది."★

[సహీహ్ బుఖారీ : 15వ ప్రకరణం - ఇస్తిస్ఖా, 26వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) నుస్రతిబిస్సబా]

★ తూర్పుగాలి ద్వారా నాకు సహాయం చేయబడింది అంటే, అహ్జాబ్ యుద్ధంలో దేవుని సహాయం లభించిందని అర్థం. ఈ యుద్ధంలో పన్నెండు వేల మంది బహుదైవారాధకులు మదీనా పట్టణాన్ని దిగ్బంధించారు. అప్పుడు ఓ రోజు రాత్రి ఎముకలు కొరికే చలితో పాటు తూర్పు దిక్కు నుంచి తీవ్రమైన ఈదురుగాలులు వీచడంతో వారి శిబిరాలన్నీ నేలమట్టమయ్యాయి. దాంతో వారు ముస్లింలతో యుద్ధం చేయకుండానే వెనుతిరిగి వెళ్ళిపోయారు. అదే విధంగా పూర్వం ఆద్‌జాతి ప్రజలకు హజ్రత్ హూద్ ప్రవక్త (అలైహి)ను తిరస్కరించడంతో వారిపై దైవాగ్రహం విరుచుకుపడింది. దేవుడు పడమర నుండి తీవ్రమైన తుఫాను గాలి పంపి ఆ జాతిని సర్వనాశనం చేశాడు.

# సలాతుల్ కుసూఫ్ ప్రకరణం

## 1వ అధ్యాయం - కుసూఫ్ నమాజు గురించి

520. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) కాలంలో ఓసారి సూర్యగ్రహణం పట్టితే ఆయన (కుసూఫ్) నమాజు చేయించారు. ఆ నమాజులో ఆయన చాలా సేపటిదాకా (ఖుర్ఆన్ పఠిస్తూ) నిలబడ్డారు. రుకూ కూడా సుదీర్ఘంగానే ఉండింది. తరువాత మళ్ళీ చాలా సేపటిదాకా నిల్చున్నారు.అయితే మొదటిసారి కన్నా ఈ సారి కొంచెం తక్కువసేపు నిలబడ్డారు. అలాగే తిరిగి రుకూ చేశారు. అయితే మొదటి రుకూ కన్నా కొంచెం తక్కువసేపు చేశారు. ఆ తరువాత సుదీర్ఘంగా సజ్దా చేశారు. అదే విధంగా ఆయన రెండవ రకాతులో కూడా చేశారు. ఆ తరువాత సలాం చేసి నమాజు పూర్తి చేశారు. ఆ సమయానికి సూర్యుడు పూర్తిగా గ్రహణం వీడాడు.

ఆ తరువాత ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చారు. అందులో ఆయన దైవస్తోత్రం తరువాత ఇలా అన్నారు: "సూర్యచంద్రులిద్దరూ దేవుని (ఔన్నత్యానికి) నిదర్శనాలు. ఎవరో చనిపోవడం వల్లనో, పుట్టడం వల్లనో సూర్యచంద్రగ్రహణాలు పట్టవు. అందువల్ల సూర్యగ్రహణంగాని, చంద్రగ్రహణం గాని పట్టితే మీరు దేవుణ్ణి ప్రార్థించండి. దేవుని మహిమ, ఔన్నత్యాలను కీర్తించండి. నమాజు చేయండి. దానధర్మాలు చేయండి."

ఆ తరువాత దైవప్రవక్త(స) ఇలా అన్నారు: "ముహమ్మద్ అనుచర సమాజం ప్రజలారా! దేవుని దాసుడు లేక దాసి ఎవరైనా వ్యభిచారానికి పాల్పడటం జరిగితే, వారి సిగ్గుమాలిన పని పట్ల అందరికన్నా ఎక్కువ దేవునికే రోషం వస్తుంది. ముహమ్మద్ అనుచర సమాజం ప్రజలారా! దైవసాక్షిగా చెబుతున్నాను. నేను ఎరిగిన విషయాలు మీరు గనుక ఎరిగి ఉంటే మీరు తప్పకుండా తక్కువగా నవ్వుతారు, ఎక్కువగా ఏడుస్తారు."

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 2వ అధ్యాయం - అస్సదఖాతి ఫిల్ కుసూఫ్]

521. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) కాలంలో ఒకసారి సూర్యగ్రహణం పట్టితే, ఆయన మస్జిద్ వెళ్ళారు. ప్రజలు కూడా వెళ్ళి ఆయన వెనక బారులు తీరి నిలబడ్డారు. అప్పుడు దైవప్రవక్త (స) అల్లాహు అక్బర్ అని పలికి (నమాజులో) ఖుర్ఆన్ పఠనం ప్రారంభించారు. సుదీర్ఘ పఠనం గావించారు. ఆ తరువాత అల్లాహు అక్బర్ అని పలికి రుకూలోకి వెళ్ళారు. రుకూలో చాలాసేపు ఉన్నారు. తరువాత సమి అల్లాహులిమన్ హమిదా అని పలుకుతూ పైకి లేచి నిల్చున్నారు. సజ్దాలోకి పోలేదు. మళ్ళీ సుదీర్ఘ పఠనం గావించారు. అయితే మొదటిసారి పఠనం కన్నా ఈ సారి కొంచెం తక్కువ. ఆ తరువాత అల్లాహు అక్బర్ అంటూ రుకూలోకి పోయారు. రుకూలో చాలాసేపు ఉన్నారు. అయితే మొదటి రుకూ కన్నా కొంచెం తక్కువ సేపు ఉన్నారు. ఆ తరువాత సమి అల్లాహులిమన్ హమిదా, రబ్బనా లకల్ హమ్ద్ అని పలికారు. ఆ తరువాత సజ్దా చేశారు. అదే విధంగా

రెండవ రకాతులో కూడా చేశారు. ఇలా మొత్తం నాలుగు రుకూలు, నాలుగు సజ్దాలు చేశారు. ఆయన సలాం చేసి నమాజు ముగించక ముందే గ్రహణం పూర్తిగా వీడిపోయి సూర్యుడు ప్రకాశించసాగాడు. ఆ తరువాత దైవప్రవక్త(స) నిలబడి ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చారు. అందులో దైవస్తోత్రం తరువాత ఇలా అన్నారు: "సూర్యచంద్రులిద్దరూ దేవుని (ఔన్నత్యానికి) నిదర్శనాలు. అంతేగాని ఎవరో చావడం వల్లనో, పుట్టడం వల్లనో (సూర్యచంద్రులకు) గ్రహణం పట్టదు. అందువల్ల మీరు వారిద్దరిలో ఎవరికైనా గ్రహణం పట్టడం చూస్తే వెంటనే నమాజు చేయడానికి (మస్జిదుకు) పరుగెత్తండి."

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 4వ అధ్యాయం - ఖుత్బతిల్ ఇమామి ఫిల్ కుసూఫ్]

522. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒకసారి సూర్యగ్రహణం పట్టితే దైవప్రవక్త(స) (నమాజు చేయడానికి) నిలబడి ఒక సుదీర్ఘమైన సూరా పఠించారు. తరువాత రుకూ చేశారు. సుదీర్ఘమైన రుకూ. రుకూ నుండి లేచి నిలబడి మరొక సూరా పఠించారు. ఆ తరువాత మళ్ళీ రుకూ చేశారు. రుకూ పూర్తి చేసి సజ్దా చేశారు. రెండవ రకాతులో కూడా అంతా ఇలాగే చేశారు. తరువాత నమాజు ముగించి ఇలా ప్రసంగించారు.

"సూర్యచంద్రులు దేవుని నిదర్శనాలలో రెండు నిదర్శనాలు. అందువల్ల మీరు సూర్యచంద్రులకు గ్రహణం పట్టడం చూస్తే (కుసూఫ్) నమాజు చేయండి. దీని ద్వారా దేవుడు మీ కష్టాలు దూరం చేస్తాడు. ఈ రోజు నేను నా నమాజు సందర్భంలో నాకు వాగ్దానం చేయబడిన వాటన్నిటినీ చూశాను. చివరికి నేను స్వర్గవనంలోని ఒక పండ్ల గుత్తిని తీసుకుందామని అనుకుంటున్నట్లు అనుభూతి కూడా చెందాను. అప్పుడు నేను ముందుకు అడుగేయడం మీరు గమనించి ఉంటారు. అలాగే నరకంలోని ఒక భాగం మరొక భాగాన్ని మింగి వేస్తూ ఉండటం కూడా నేను చూశాను. అప్పుడు నేను కాస్త వెనక్కి జరగడం కూడా మీరు గమనించి ఉంటారు. నేను నరకంలో అమ్రొబిన్ లుహ్యాని కూడా చూశాను. అతను (అరేబియాలో) దేవతల పేర ఆంబోతును వదలిపెట్టే ఆచారాన్ని సృష్టించాడు."

[సహీహ్ బుఖారీ : 21వ ప్రకరణం - అల్అమల్ ఫిస్సలాత్, 11వ అధ్యాయం - ఇజన్ ఫలత అద్దాబ్బతు ఫిస్సలాత్]

## 2వ అధ్యాయం - కుసూఫ్ నమాజులో సమాధి శిక్షను గుర్తుకు తెచ్చుకోవడం

523. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓసారి ఒక యూద స్త్రీ (సహాయం) అర్థించడానికి నా దగ్గరకు వచ్చింది. ఆమె నాతో అవి ఇవి మాట్లాడుతూ "దేవుడు మిమ్మల్ని సమాధి శిక్ష నుండి కాపాడుగాక!" అని అన్నది. నేనీ విషయం దైవప్రవక్త(సల్లం) ముందు ప్రస్తావిస్తూ "మానవులకు సమాధిలో కూడా శిక్ష ఉంటుందా?" అని అడిగాను. దానికాయన "(ఔను) దేవుడు ఈ శిక్ష నుండి అందరినీ కాపాడుగాక!" అని అన్నారు.

ఆ తరువాత ఒక రోజు ఉదయం ఆయన ఒంటె ఎక్కి ఎక్కడికో బయలుదేరారు. కాస్సేపటికి సూర్యగ్రహణం పట్టింది. ఆయన 'చాష్త్' వేళకు తిరిగి వచ్చారు. పూరి పాకల వెనకాల నడుస్తూ (మస్జిదుకు చేరుకొని) నమాజు చేయడానికి నిల్చున్నారు. ప్రజలు కూడ వచ్చి ఆయన వెనుక నిలబడ్డారు. దైవప్రవక్త(సల్లం) ఆ నమాజులో సుదీర్ఘ పఠనం గావించారు. తరువాత రుకూ కూడ సుదీర్ఘంగానే చేశారు. రుకూ నుండి లేచి నిలబడి తిరిగి సుదీర్ఘ పఠనం గావించారు. అయితే మొదటి

పతనం కన్నా కొంచెం తక్కువ. మళ్ళీ రుకూ చేశారు. ఈ రుకూ కూడ మొదటి రుకూ కన్నా కొంచెం తక్కువ. తరువాత లేచి నిలబడి సజ్దాలోనికి పోయారు. సజ్దా నుండి లేచి నిలబడి సుదీర్ఘ పఠనం చేశారు. అయితే మొదటి పఠనం కన్నా కాస్త సంగ్రహం చేశారు. ఆ తరువాత సుదీర్ఘమైన రుకూ చేశారు. కాని మొదటి రుకూ కన్నా కాస్త సంక్షిప్తంగా చేశారు. మళ్ళీ సుదీర్ఘ పఠనం గావించారు. ఇది మొదటిదానికన్నా కాస్త తక్కువ. తరువాత రుకూ చేశారు. ఈ రుకూ కూడ మొదటి రుకూల కన్నా కొంచెం సంక్షిప్తం. రుకూ నుండి లేచి నిలబడి సజ్దాలోనికి పోయారు. ఆ తరువాత సలాం చేసి నమాజు ముగించారు. ఆ తరువాత (ఖుత్బాలో) చెప్పవలసిన విషయాలు చెప్పారు. దాని తరువాత ప్రజల్ని ఉద్దేశించి "సమాధి శిక్ష నుండి దేవుడ్ని శరణు కోరండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 7వ అధ్యాయం - అత్తవ్వూజు మిన్ అజాబిల్ ఖుబూరి ఫిల్ కుసూఫ్]

## 3వ అధ్యాయం - కుసూఫ్ నమాజులో దైవప్రవక్త(సల్లం)కు స్వర్గ నరకాలు కన్పించడం

524. హజ్రత్ అస్మా(రజి) కథనం:- నేను ఓసారి హజ్రత్ ఆయిషా (రజి) దగ్గరకు వెళ్ళాను. ఆ సమయంలో ఆమె నమాజు చదువుతూ ఉన్నారు. (నమాజు ముగిసిన తరువాత) నేనామెను "ప్రజలకు ఏమయింది (ఈ వేళ గుమికూడుతున్నారు)?" అని అడిగాను. ఆమె చేత్తో ఆకాశం వైపు చూపించారు. (అప్పుడు సూర్యగ్రహణం పట్టి ఉంది). ఆ తరువాత ప్రజలు (నమాజు కోసం) నిలబడటం కన్పించింది. హజ్రత్ ఆయిషా (రజి) "సుబ్‌హానల్లాహ్"! అన్నారు. నేను (ఆశ్చర్యంతో) "ఏదైనా సూచన ఉందా?" అని అడిగాను. హజ్రత్ ఆయిషా (రజి) ఔనంటూ తల ఊపారు. ఆ తరువాత నేను కూడ నమాజు చేయడానికి నిలబడ్డాను. అది చాలా సుదీర్ఘ పఠనం కావడం వల్ల నాకు కళ్ళు తిరగడం మొదలెట్టింది. అందుచేత నేను నా తల మీద కొంచెం నీళ్ళు చల్లుకున్నాను.

నమాజు ముగిసిన తరువాత దైవప్రవక్త (సల్లం) దైవస్తోత్రం చేసి ఇలా ప్రసంగించారు: "నాకిప్పటి దాకా చూపించబడని వాటన్నిటినీ ఈ రోజు నేనీ స్థలంలో నిలబడి చూశాను. చివరికి స్వర్గ నరకాలు కూడ చూశాను. సమాధిలో పరీక్ష జరుగుతుందని వహీ ద్వారా నాకు తెలియజేయబడింది. అది దజ్జాల్ ఉపద్రవం లాంటి పరీక్ష. లేక ఇంచుమించు అలాంటి పరీక్ష. (హజ్రత్ అస్మా (రజి) ఏమన్నారో హదీసు ఉల్లేఖకునికి సరిగ్గా గుర్తులేదు) (ఆ పరీక్ష ఇలా ఉంటుంది) "ఈ వ్యక్తి (ముహమ్మద్ ప్రవక్త)ని గురించి నీకేమయినా తెలుసా?" అని ప్రశ్నిస్తారు. అతను విశ్వసించినవాడయితే లేక నమ్మినవాడయితే (హజ్రత్ అస్మా(రజి) ఏమన్నారో హదీసు ఉల్లేఖకునికి సరిగ్గా జ్ఞాపకం లేదు) "ఈయన హజ్రత్ ముహమ్మద్ (సల్లం). దేవుని ప్రవక్త. ఈయన మా దగ్గరకు దేవుని సందేశం, స్పష్టమైన నిదర్శనాలు తీసుకువచ్చారు. మేము ఆయన పిలుపును అంగీకరించి ఆయనకు విధేయులమైపోయాము" అని అంటాడు. ఈ విధంగా అతను మూడుసార్లు సమాధానం ఇస్తాడు. ఆ తరువాత "సరే ఇక హాయిగా పడుకో. నువ్వు ఈయన్ని విశ్వసించిన వాడవని మాకు తెలుసు" అని అతనికి చెప్పడం జరుగుతుంది. అదే కపట విశ్వాసి అయితే లేక అనుమానపు రోగి అయితే (హజ్రత్ అస్మా(రజి) ఏమన్నారో హదీసు ఉల్లేఖకునికి సరిగా గుర్తులేదు) "ఈయనెవరో నాకు తెలియదు. జనం చెప్పుకుంటున్నదేదో విని అది మాత్రమే నేను చెప్పాను" అని అంటాడు.

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - అల్ ఇల్మ్ - 24వ అధ్యాయం - మన్ అజాబల్ ఫితయా....]

525. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఓ సారి సూర్యగ్రహణం పట్టితే ఆయన (కుసూఫ్) నమాజు చేయించారు. అందులో ఆయన బఖరా సూరా పఠనమంత సుదీర్ఘ పఠనం గావించారు. తర్వాత సుదీర్ఘమైన రుకూ చేశారు. రుకూ నుండి లేచి నిలబడి తిరిగి సుదీర్ఘ పఠనం గావించారు. అయితే మొదటి పఠనం కన్నా కొంచెం తక్కువ. ఆ తరువాత మళ్ళీ సుదీర్ఘమైన రుకూ చేశారు. ఈ రుకూ కూడ మొదటి రుకూ కన్నా కొంచెం తక్కువ. దాని తరువాత సజ్దా చేశారు. ఆ తరువాత మళ్ళీ లేచి నిలబడి సుదీర్ఘ పఠనం గావించారు. అయితే మొదటి పఠనం కన్నా కాస్త సంగ్రహం. తరువాత మళ్ళీ సుదీర్ఘమైన రుకూ చేశారు. ఈ రుకూ కూడ మొదటి దానికన్నా కాస్త సంక్షిప్తం. ఆ తరువాత లేచి నిలబడి సుదీర్ఘ పఠనం గావించారు. ఈ పఠనం కూడ మొదటి పఠనాల కన్నా కాస్త సంక్షిప్తంగా ఉండింది. తర్వాత మళ్ళీ సుదీర్ఘమైన రుకూ చేశారు. ఇది కూడా గత రుకూల కన్నా కొంచెం తక్కువ. ఆ తరువాత సజ్దా చేశారు. తరువాత సలాం చేసి నమాజు ముగించారు. అప్పటికి సూర్యుడు పూర్తిగా గ్రహణం వీడి ప్రకాశించాడు. ఆ తరువాత ఆయన ఇలా ప్రవచించారు:

"సూర్యచంద్రులిద్దరూ దేవుని నిదర్శనాలలో రెండు నిదర్శనాలు. అంతేగాని ఈ గ్రహణం ఒకరి జీవన్మరణాల కారణంగా పట్టదు. అంచేత మీరెప్పుడైనా గ్రహణం పట్టడం చూస్తే దేవుణ్ణి స్మరించండి. (అంటే నమాజు చేయండి).

అప్పుడు ప్రజలు "దైవప్రవక్తా! మీరు మీ స్థానంలో నిలబడే ఏదో వస్తువుని అందుకున్నట్లు మొము చూశాము. ఆ తరువాత మీరు వెనక్కి జరగడం కూడ మేము గమనించాము" అని అన్నారు. దానికి దైవప్రవక్త(సల్లం) ఇలా సమాధానమిచ్చారు :

"నేను స్వర్గం చూశాను. అందులో నుండి ఒక పండ్ల గుత్తి తీసుకుందామనుకున్నాను. దాన్ని గనక నేనప్పుడు తీసుకొని ఉంటే మీరా పండ్లను ప్రళయం దాకా తింటూనే ఉంటారు (అయిపోయేవి కావు). నాకు నరకం కూడ చూపించబడింది. ఈ రోజు నేను చూసినంతటి భీకర దృశ్యం ఇదివరకెన్నడూ చూడలేదు. నేను నరకంలో స్త్రీలు ఎక్కువమంది ఉండటం చూశాను."

ప్రజలు ఈ మాట విని "దైవప్రవక్తా! దానికి కారణం ఏమిటి?" అని అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "వారి తిరస్కార వైఖరే దానికి కారణం" అని అన్నారు. "ఏమిటి స్త్రీలు దేవుణ్ణి తిరస్కరిస్తారా?" అని అడిగారు ప్రజలు మళ్ళీ. "వారు తమ భర్తలకు కృతఘ్నురాళ్ళయిపోతారు. చేసిన మేలు మరచి ప్రవర్తిస్తారు. మీరు ఆమె పట్ల జీవితాంతం మంచిగా మసలుకున్నాసరే, ఎప్పుడైనా కాస్త మీ వల్ల హెచ్చుతగ్గులు జరిగితే చాలు - నీ వల్ల నా కసలు మేలే జరుగలేదు అంటుంది ఆమె" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 9వ అధ్యాయం - సలాతిల్ కుసూఫి ఫీజమాఅత్]

## 5వ అధ్యాయం - కుసూఫ్ నమాజు కోసం నమాజు సిద్ధంగా ఉందని పిలుపునివ్వడం

526. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఒకసారి సూర్యగ్రహణం పట్టితే "అస్సలాత్ జామిఅ"(నమాజు సిద్ధంగా వుంది) అని ప్రజలను పిలవడం

జరిగింది. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) రెండు రకాతులు నమాజు చేశారు. ప్రతి రకాతులోనూ రెండేసి సార్లు రుకూ చేశారు. తర్వాత సూర్య గ్రహణం వీడేవరకు కూర్చున్నారు. విశ్వాసుల మాతృమూర్తి (హదీసు ఉల్లేఖకుని కథనం ప్రకారం) ఆయిషా (రజి) ఆ విషయం ప్రస్తావిస్తూ "ఆ సజ్దా అంతటి సుదీర్ఘమైన సజ్దాను నేను ఎన్నడూ చూడలేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 8వ అధ్యాయం - తూలిస్సుజూది ఫిల్ కుసూఫ్]

527. హజ్రత్ అబూ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "సూర్యచంద్రగ్రహణాలు ఏ ఒక్కరి మరణం, పుట్టుకలకు కారణభూతం కాజాలవు. సూర్యచంద్రులు దేవుని నిదర్శనాలలో రెండు నిదర్శనాలు. అందువల్ల మీరు సూర్యగ్రహణం గాని, చంద్రగ్రహణం గాని పట్టడం చూస్తే లేచి నమాజు చేయండి."

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 1వ అధ్యాయం - అస్సలాతి ఫీ కుసూఫిష్షమ్స్]

528. హజ్రత్ అబూమూసా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) కాలంలో ఓసారి సూర్యగ్రహణం పట్టితే 'ప్రళయం రాదు కదా' అని ఆయన ఆందోళన చెందుతూ, మస్జిద్‌కు వెళ్ళి (కుసూఫ్) నమాజు చేశారు. అందులో ఖుర్‌ఆన్ పఠనం, రుకూ, సజ్దాలు నేనిదివరకెన్నడూ చూడనంత సుదీర్ఘంగా జరిగాయి. (తర్వాత) దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రసంగించారు. "ఇవి (సూర్యచంద్రగ్రహణాలు) దేవుడు పంపుతున్న నిదర్శనాలు. అంతేగాని ఏ ఒక్కరి చావు పుట్టుకలకు కారణభూతం కాజాలవు. ఈ నిదర్శనాల ద్వారా దేవుడు తన దాసులను భయపెడుతున్నాడు. అందువల్ల మీరు ఇలాంటి నిదర్శనాలేమైనా చూస్తే వెంటనే దేవుని స్మరణ (నమాజు) వైపుకు పరుగెత్తండి, ఆయన్ని వేడుకోండి, పాప మన్నింపు కోరండి."

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 14వ అధ్యాయం - అజ్జిక్రి ఫిల్‌కుసూఫ్]

529. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- సూర్యచంద్రగ్రహణాలు ఏ ఒక్కరి చావు పుట్టుకలకు కారణభూతం కాజాలవు. సూర్యచంద్రులు దేవుని నిదర్శనాలలో రెండు నిదర్శనాలు. అందువల్ల మీరు సూర్యచంద్రగ్రహణాలు చూస్తే నమాజు చేయండి.

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 1వ అధ్యాయం - అస్సలాతు ఫీకుసూఫిష్షమ్]

530. హజ్రత్ ముగైరా బిన్ షాబ(రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఆయన కుమారుడు ఇబ్రాహీం (రజి) చనిపోయిన రోజు సూర్యగ్రహణం పట్టింది. దాంతో జనం 'ఇబ్రాహీం (రజి) చనిపోవడం వల్లనే సూర్యగ్రహణం పట్టిందని' చెప్పుకోసాగారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని " ఏ ఒక్కరి చావు పుట్టుకల కారణంగా సూర్యచంద్రగ్రహణాలు సంభవించవు. మీరొక వేళ సూర్యచంద్రగ్రహణాలు పట్టడం చూస్తే నమాజు చేయండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 16వ ప్రకరణం - కుసూఫ్, 1వ అధ్యాయం - అస్సలాతి ఫీ కుసూఫిష్షమ్స్]

# జనాయెజ్ ప్రకరణం

## 6వ అధ్యాయం - మనిషి చనిపోవడం పట్ల రోదించడం, పెడబొబ్బలు పెట్టడం గురించి

531. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) కుమార్తెలలో ఒకరు, (ఒక వ్యక్తిద్వారా) "నా కొడుకు చావు బ్రతుకుల్లో ఉన్నాడు. మీరు వెంటనే మా ఇంటికి వచ్చేయండి" అని దైవప్రవక్త (స)కు కబురు చేశారు. అయితే దైవప్రవక్త (స) దానికి సమాధానంగా "దేవుడు వెనక్కి తీసుకున్నది ఆయనదే; తాను ప్రసాదించినది కూడా ఆయనదే. ఆయన ప్రతి వస్తువుకూ ఒక గడువు (జీవితకాలం) నిర్ణయించాడు. అందువల్ల (ఈ విషాద సంఘటన పట్ల) నీవు సహనం వహించి పుణ్యాన్ని ఆశించు" అని చెప్పి పంపారు. ప్రవక్త కుమార్తె ప్రమాణం చేసి "మీరు తప్పకుండా రావాలి" అని మళ్ళీ కబురు పంపారు.

దాంతో దైవప్రవక్త (స) హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి), ముఆజ్ బిన్ జబల్ (రజి), అబీబిన్ కాబ్ (రజి), జైద్ బిన్ సాబిత్ (రజి) మరికొందరు సహచరుల్ని వెంట బెట్టుకొని వెళ్ళారు. పిల్లవాణ్ని ప్రవక్త(స) దగ్గరకు తీసుకు వచ్చారు. ఆ పసివాడి ఊపిరి కొట్టుమిట్టాడుతోంది. ఖాళీ అయిపోయిన నీటి తిత్తి మాదిరిగా మారిపోయాడు. ఆ పరిస్థితి చూసి దైవప్రవక్త (స) కంటతడిపెట్టారు.

అప్పుడు హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) (ఆశ్చర్యపోయి చూస్తూ) "దైవప్రవక్తా! ఇదేమిటీ (మీరు దు:ఖిస్తున్నారు)?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) ఇలా అన్నారు: "ఇది దేవుడు తన దాసుల హృదయాల్లో ఉంచిన కారుణ్యం. తోటి మానవుల్ని కరుణించే వారినే దేవుడు కరుణిస్తాడు".

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 33వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) యు అజ్జబుల్ మయ్యితు .....]

532. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)కథనం:- హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) వ్యాధిగ్రస్తులయితే దైవప్రవక్త(స) ఆయన్ని పరామర్శించడానికి వెళ్ళారు. అప్పుడు దైవప్రవక్త(స) వెంట హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి), సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి), అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి)లు కూడా ఉన్నారు. దైవప్రవక్త(స) అక్కడకు చేరుకోగానే ఆ ఇంటి వాళ్ళు ఆయన చుట్టూ మూగారు. అది చూసి దైవప్రవక్త(స) (సందేహిస్తూ) "ఏమిటి ఆయన చనిపోయారా?" అని అడిగారు. దానికి వారు "చనిపోలేదు దైవప్రవక్తా!" అన్నారు. ఆ తరువాత దైవప్రవక్త (స) (రోగి స్థితి చూసి) కంట తడిపెట్టారు. ఆయన్ని చూసి అందరూ దు:ఖించడం మొదలెట్టారు. తరువాత దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు - "వినండి. హృదయావేదన కన్నీళ్ళ వల్ల గాని లేదా నోట దయార్ద్ర పలుకులు వెలువడటం వల్ల గాని దేవుడు మనిషిని శిక్షించడు. అయితే దీని విషయంలో (దైవప్రవక్త నోటి వైపు చూపిస్తూ అన్నారు) మాత్రం (పెడబొబ్బలు పెడితే) దేవుడు తప్పకుండా శిక్షిస్తాడు. కుటుంబ సభ్యులు ఏడ్చినా సరే మృతునికి శిక్ష వుంటుంది.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 54వ అధ్యాయం - అల్ బకాయి ఇన్దల్ మరీజ్]

## 8వ అధ్యాయం - ఆపద ప్రారంభంలో వహించే సహనమే సహనం

533. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఓ రోజు ఒక స్త్రీ సమాధి మీద కూర్చొని ఏడుస్తుంటే, దైవప్రవక్త (సల్లం) అటుగా పోవడం జరిగింది. అపుడు ఆయన ఆ స్త్రీని చూసి "దేవునికి భయపడి కాస్త సహనం వహించు" అని అన్నారు. దానికి ఆ స్త్రీ (ముఖం చిట్లించుకుంటూ) "మీ దారి మీరు వెళ్ళండి, నన్ను నా మానాన వదిలెయ్యండి. నా మీద వచ్చిపడిన ఆపద మీ మీద రాలేదు. అందువల్ల మీరు (నా) బాధను అర్థం చేసుకోలేరు" అని అన్నది.

తరువాత (కొందరు) ఆ స్త్రీకి 'ఆయనగారు దైవప్రవక్త (సల్లం)' అని తెలియజేశారు. అది విని ఆమె (పరుగుపరుగున) దైవప్రవక్త(సల్లం) ఇంటికి వెళ్ళింది. చూస్తే ఆయన వాకిలి ముందు ఒక్క ద్వారపాలకుడు కూడా లేడు. సరే, ఆ మహిళ (దైవప్రవక్త (సల్లం)ను కలుసుకొని) "నేను మిమ్మల్ని గుర్తుపట్టలేకపోయాను (క్షమించండి)" అని అన్నది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఆపద ప్రారంభంలో వహించే సహనమే (అసలు) సహనం"★ అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 32వ అధ్యాయం - జియారతుల్ ఖుబూర్]

## 9వ అధ్యాయం - కుటుంబ సభ్యుల ఏడ్పులు, పెడబొబ్బల వల్ల మృతునికే నష్టం

534. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మనిషి మరణం పట్ల ప్రజలు ఏడ్పులు, పెడబొబ్బలు పెడ్తే అతడ్ని సమాధిలో శిక్షించడం జరుగుతుంది".

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 34వ అధ్యాయం - మా యుఁక్రహు మిననియాహతి అలల్ మయ్యిత్]

535. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) తీవ్రంగా గాయపడటం చూసి హజ్రత్ సుహైబ్ (రజి) "అయ్యో నా సోదరా!" అని ఏడ్వసాగారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) (ఆయనకు ప్రవక్త (సల్లం) ప్రవచనాన్ని గుర్తు చేస్తూ) "బ్రతికున్నవారు ఏడిస్తే చనిపోయినవాడి (ఆత్మ)కి యాతన కలుగుతుందని దైవప్రవక్త(సల్లం) చెప్పిన విషయం నీకు తెలియదా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 33వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) యు అజ్జిబుల్ మయ్యితి.....]

536. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉబైదుల్లా బిన్ అబీములైక కథనం:- మక్కాలో హజ్రత్ ఉస్మాన్ (రజి) గారి కుమార్తె ఒకరు చనిపోతే మేము ఆమె అంత్యక్రియల్లో పాల్గొనడానికి వెళ్ళాము. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి), హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)లు కూడా వచ్చారు. నేను వాళ్ళిద్దరి మధ్య కూర్చున్నాను.

---

★ ప్రవక్త (స) ప్రవచనానికి భావం ఏమిటంటే - నీ వన్న మాటలకు నువ్వు క్షమాపణ చెప్పుకోనవసరం లేదు. నేను స్వవిషయం గురించి ఎవరి మీదా కోపగించుకోను. నా ఇష్టాయిష్టాలన్నీ దైవప్రసన్నత కోసమే పరిమితం. కాకపోతే నువ్వు కష్టసమయంలో సహనం వహించకుండా ఏడ్పులు పెడబొబ్బలు పెట్టి నీకు దక్కే పుణ్యాన్ని పోగొట్టుకున్నావు. ఇది నీ పొరపాటు. నా విషయంలో నీవు చేసిన పొరపాటు క్షమించబడింది. కాని దైవధర్మం విషయంలోనే నీవు పొరబడ్డావు. ఆపద ప్రారంభంలో సహనం వహించి ఉంటే పుణ్యం లభించి ఉండేది. నువ్వలా చేయలేకపోయావు.

(లేక నేను వారిద్దరిలో ఒకరి చెంత కూర్చొని ఉంటే రెండో ఆయన నా ప్రక్కన వచ్చి కూర్చున్నారు - ఉల్లేఖకుని అసలు పదాలేమిటో సరిగా గుర్తులేవు) అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి), హజ్రత్ అమ్ర్ బిన్ ఉస్మాన్ (రజి)తో మాట్లాడుతూ, "మీరీ ఏడ్పును అరికట్టరా? మృతుని కుటుంబ సభ్యుల ఏడ్పు మూలంగా మృతునికి (సమాధిలో) యాతన కలుగుతుందని దైవప్రవక్త(స) సెలవిచ్చారు కదా!" అని అన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఈ మాటలు విని "కొన్ని రకాల ఏడ్పుల మూలంగా (మృతునికి యాతన కలుగుతుంది) అని హజ్రత్ ఉమర్ (రజి) కూడా చెబుతుండేవారు" అని తెలియజేశారు.

ఆ తరువాత ఇబ్నె అబ్బాస్ (రజి) విషయాన్ని వివరిస్తూ ఇలా అన్నారు - నేను హజ్రత్ ఉమర్ (రజి)తో కలసి మక్కా నుండి (మదీనాకు) తిరిగొస్తూ 'బైదా' ప్రదేశానికి చేరుకున్నాము. అప్పుడక్కడ ఓ పెద్ద చెట్టు క్రింద నీడలో కొందరు వాహనదారులు కన్పించారు. హజ్రత్ ఉమర్ (రజి) "వాళ్ళెవరో చూసిరా" అన్నారు నాతో. నేను వెళ్ళి చూస్తే అక్కడ హజ్రత్ సుహైబ్ (రజి) కూడా ఉన్నారు. నేను తిరిగొచ్చి ఈ సంగతి హజ్రత్ ఉమర్ (రజి)కు తెలియజేశాను. ఆయన "ఆయన్ని నా దగ్గరకు పిలుచుకురా" అన్నారు. నేను వెళ్ళి హజ్రత్ సుహైబ్ (రజి)తో "అమీరుల్ మోమినీన్ (ఖలీఫాగారు) పిలుస్తున్నారు. పద!" అన్నాను.

(ఆ తరువాత కొంత కాలానికి) హజ్రత్ ఉమర్ (రజి) గాయపడ్డారు. అప్పుడు హజ్రత్ సుహైబ్ (రజి) "అయ్యో నా సోదరా! అయ్యో నా సోదరా!!" అని ఏడ్వనారంభించారు. హజ్రత్ ఉమర్ (రజి) అది విని "సుహైబ్! నీవు నా పరిస్థితిపై ఏడుస్తున్నావా?! మృతుని కుటుంబ సభ్యుల కొన్ని రకాల ఏడ్పుల మూలంగా మృతునికి (సమాధిలో) యాతన కలుగుతుందని దైవప్రవక్త(స) చెప్పిన విషయం తెలియదా?" అని అన్నారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇంకా ఇలా తెలియజేస్తున్నారు - హజ్రత్ఉమర్ (రజి) చనిపోయిన తరువాత నేనీ హదీసు గురించి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) ముందు ప్రస్తావించాను. ఆమె అది విని "దేవుడు హజ్రత్ ఉమర్ (రజి)ని కరుణించుగాక! దైవసాక్షి ! విశ్వాసిని అతని కుటుంబ సభ్యులు ఏడ్వడం వల్ల దేవుడు శిక్షిస్తాడని దైవప్రవక్త(స) ఎన్నడూ చెప్పలేదు. అవిశ్వాసికి అతని కుటుంబ సభ్యులు ఏడ్వటం వల్ల మరింత యాతనకు గురిచేస్తాడని మాత్రమే దైవప్రవక్త (స) తెలిపారు" అని అన్నారు. ఆ తరువాత హజ్రత్ ఆయిషా (రజి) "కావాలంటే, 'బరువు మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడు' అన్న ఖుర్ఆన్ సూక్తి చూడు చాలు" అని చెప్పారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఈ సందర్భంలో .......... "నవ్వించేవాడు కూడా ఆ దేవుడే, ఏడ్పించేవాడు కూడా ఆ దేవుడే" అని అన్నారు.

ఇబ్నె అబీ మలీక ఇలా అన్నారు :"దైవసాక్షి! ఈ మాటలన్నీ విన్న తరువాత హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మారు మాట్లాడలేదు."

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 33వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) యుఅజ్జిబుల్ మయ్యిత్....]

537. హజ్రత్ ఉర్వా (రహ్మలై) కథనం:- "మృతునికి అతని కుటుంబ సభ్యులు ఏడ్వటం వల్ల సమాధిలో యాతన కలుగుతుంది" అన్న హదీసు మర్ఫూ హదీస్ (ఉల్లేఖనాల పరంపర దైవప్రవక్త (స)

వరకు చేరిన హదీస్) అని హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) అన్నారు. ఈ విషయాన్ని హజ్రత్ ఆయిషా (రజి) ముందు ప్రస్తావించగా ఆమె (దాన్ని ఖండిస్తూ) "దేవుడు ఇబ్నె ఉమర్ (రజి)పై కరుణించుగాక! ఈ విషయంలో ఆయన పొరబడ్డారు. నిజానికి దైవప్రవక్త(స) (అలా చెప్పలేదు.) మృతుడ్ని అతని పాపాల కారణంగా శిక్షిస్తూ ఉండటం జరుగుతుంది. అదే సమయంలో అతని కుటుంబ సభ్యులు శోకాలు తీస్తూ ఉంటారని చెప్పారు" అని అన్నారు.

హజ్రత్ ఆయిషా (రజి)ఇంకా ఇలా తెలియజేశారు: "ఇది హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) భ్రమ మాత్రమే. ఇది ఎలాంటి భ్రమంటే, బద్ర్ (యుద్ధ మైదానంలోని) పాడుబడిన గుంటలో హతులు వేయబడిన తరువాత, దైవప్రవక్త(స) దాని ఒడ్డు మీద నిలబడి చెప్పవలసిన విషయాలు చెప్పిన పిదప, వీరు నా మాటలు వింటున్నారని అన్నారని ఆయన అన్నారు. నిజానికి దైవప్రవక్త(స) (అలా అనలేదు) 'వీరిప్పుడు లోగడ నేను చెబుతూ వచ్చిన విషయాలు నిజమని తప్పకుండా తెలుసుకున్నార'ని మాత్రమే అన్నారు. ఆ తరువాత ఆయన 'నీవు మృతులకు (ఏ విషయమూ) విన్పించలేవు; నీవు సమాధుల్లో పూడ్చి వేయబడిన వారికి (ఏదీ) విన్పించలేవు' అన్న ఖుర్ఆన్ సూక్తులు (నమల్ : 80, ఫాతిర్:22) విన్పించారు."

హజ్రత్ ఉర్వా (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు: ఈ సూక్తుల్ని ప్రస్తావించడంలో హజ్రత్ ఆయిషా (రజి)గారి ఉద్దేశ్యం "ఆ సత్య తిరస్కారులకు నరకంలో స్థానం లభించిన తరువాత ఇక వారికి ఏది విన్పించినా ఎలాంటి ప్రయోజనం లేదు; వారు వినలేరు కూడా"అన్నదే.★

**[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజీ, 8వ అధ్యాయం - ఖతల్ అబీజహల్]**

---

★ ఈ ఉల్లేఖనంలో, దీనికి ముందు పేర్కొన్న (536) ఉల్లేఖనంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మాటతో హజ్రత్ ఆయిషా (రజి) విభేదించారు. దానిపై హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మౌనం వహించారు. అంతమాత్రాన ఆయన చెప్పినది తప్పనడానికి వీల్లేదు. జైన్ బిన్ మునీర్ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) హజ్రత్ ఆయిషా (రజి)తో వివాదం కొనితెచ్చుకోవడం ఇష్టం లేక మౌనం వహించి ఉంటారు.

ఖుర్తబీ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం హజ్రత్ అబ్దుల్లా (రజి) మౌనం వహించడానికి కారణం, తానన్న ఆ మాటలో తనకు అనుమానం కలిగిందని కాదు. ఆయన స్వయంగా ఈ మాట (తన తండ్రి) హజ్రత్ ఉమర్ (రజి) నోట విన్నారు. హదీసులో విషయ వివరణకు అవకాశం ఉండటం వల్ల వాదోపవాదాలకు అది సమయం కాకపోవడం వల్ల ఆయన అప్పుడు మౌనం వహించారు.

ఖతాబి (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం, ఈ రెండు ఉల్లేఖనాలలో ఎలాంటి వైరుధ్యం లేదు గనక హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) చెప్పిన మాట తప్పని ఖండించలేము. హజ్రత్ ఉమర్ (రజి), అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)ల హదీసులో మరో గూఢార్థం ఉండవచ్చు. అంటే, మృతుడు చనిపోయే ముందు అరబ్బుల్లో ఉండే దురాచారం ప్రకారం తన మృతి పట్ల ఏడ్పులు పెడబొబ్బలు పెట్టాలని మరణ శాసనం రాసి ఉంటే, అప్పుడు అతను (సమాధిలో) యాతనలకు గురయ్యే అవకాశం ఉంది. ఈ దురాచారం గురించి పూర్వం కవితలు కూడా వెలువడ్డాయి. ఉదాహరణకు ప్రముఖ కవి తర్ఫాబిన్ మాబుద్ ఒక కవితలో ఇలా పేర్కొన్నాడు : "మాబుద్ కుమారా! నేను చనిపోయినప్పుడు నీవు నా అంతస్తును బట్టి నన్ను తలచుకొని ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టాలి సుమా! అంతేకాదు చొక్కా చించి గుండెలు బాదుకుంటూ మరీ ఏడ్వాలి నువ్వు".

దీన్ని బట్టి మృతుడు స్వయంగా తన మృతిపట్ల ఇలా ఏడ్వాలని మరణ శాసనం రాసిపోతే అతను (సమాధి) యాతనలకు గురవుతాడని అత్యధిక మంది ధర్మవేత్తలు ఈ హదీసును గురించి వ్యాఖ్యానించారు. అయితే మరి కొందరు దీనికి భిన్నంగా వ్యాఖ్యానిస్తూ, మృతుడు వారి ఏడ్పులు, పెడబొబ్బలను వింటాడని, దాని వల్ల అతనికి కష్టం కలుగుతుందని, అతని మనస్సు బాధపడుతుందని అన్నారు. ఈ అభిప్రాయాన్ని ఖాజీ అయాజ్ సమర్థించారు. -నవవీ (రహ్మాలై)

538. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఒక యూద స్త్రీ (సమాధి) ప్రక్కగా వెళ్ళడం జరిగింది. దాని పట్ల (అంటే ఆ స్త్రీ మరణం పట్ల) ఆమె కుటుంబ సభ్యులు శోకాలు తీస్తుంటే (విని) "వీరు (ఇక్కడ) ఏడుస్తున్నారు. (అక్కడ) ఆమెకు సమాధిలో యాతన కలుగుతోంది" అని అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 33వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) యుఅజ్జిబుల్ మయ్యితు.....]

539. హజ్రత్ ముగైరా బిన్ షాబ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "ఎవరి (మరణం) పట్ల శోకాలు తీయడం జరుగుతుందో అతనికి ఆ శోకాలను బట్టి (సమాధిలో) యాతన కలుగుతుంది."

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 34వ అధ్యాయం - మాయుక్రహు మినన్నియాహతి అలల్ మయ్యిత్]

## 10వ అధ్యాయం - మనిషి మరణం పట్ల ఏడ్పులు, పెడబొబ్బలు, పెట్టడం నిషిద్ధం

540. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ జైద్ బిన్ హారిస్ (రజి), హజ్రత్ జాఫర్ బిన్ అబీ తాలిబ్ (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ రవాహ (రజి)లు అమరగతులయ్యారన్న వార్త చేరిన తరువాత దైవప్రవక్త(స) మస్జిదుకు వెళ్ళారు. ఆయన ముఖార విందంపై విషాద ఛాయలు స్పష్టంగా కానరాసాగాయి. నేనా సమయంలో తలుపు సందు నుంచి చూస్తూ ఉంటే ఒకతను వచ్చి "జాఫర్ (రజి) కుటుంబ స్త్రీలు ఆయన మృతి పట్ల శోకతాపాలు తీస్తున్నార"ని తెలియజేశాడు. దైవప్రవక్త(స) అది విని "వెళ్ళి వాళ్ళను (ఏడ్పులు, పెడబొబ్బలు) మానెయ్యమని చెప్పు" అని ఆదేశించారు. అతను వెళ్ళి వచ్చి ఆ స్త్రీలు తన మాట వినడం లేదని చెప్పాడు. దైవప్రవక్త (స) తిరిగి "వెళ్ళి వారిని వారించు" అని అన్నారు. ఆ వ్యక్తి మూడవసారి వెళ్ళొచ్చి "దైవప్రవక్తా! దైవసాక్షి!! ఆ స్త్రీలు ఎంత చెప్పినా వినే స్థితిలో లేరు" అని అన్నారు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇంకా ఇలా తెలియజేస్తున్నారు:- అప్పుడు దైవప్రవక్త(స) "వారి నోట మన్ను కొట్టు" అని అన్నారనుకుంటా. నేనా పరిస్థితి చూసి ఆ వ్యక్తితో "దేవుడు నీ ముక్కుకు మన్ను తగిలించ! నువ్విటు దైవప్రవక్త(స) ఆజ్ఞాపించిన పనీ చేయవు; అటు దైవప్రవక్త(స)ను ఊపిరీ సలుపుకోనూనియ్యవు" అని అన్నాను.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 41వ అధ్యాయం - మన్ జలస ఇన్దల్ ముసీబతి యారపు ఫీహిల్ హుజ్న్]

541. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- మేము ఇస్లాం స్వీకరించేటప్పుడు దైవప్రవక్త(స) మా చేత చేయించిన ప్రమాణంలో మేము (మా బంధువుల మృతి పట్ల) ఏడ్పులు పెడబొబ్బలు పెట్టమన్న విషయం కూడా ఉంది. కాని ఈ వాగ్దానాన్ని ఐదుగురు స్త్రీలు తప్ప ఎవరూ పాటించలేదు. వారు (1) ఉమ్మె సలీం (రజి), (2) ఉమ్మె అలా (రజి), (3) అబూ సబ్రా (రజి) కూతురు, (4) హజ్రత్ ముఅజ్ (రజి) భార్య, (5) మరో ఇద్దరు స్త్రీలు.

ఈ హదీసును ఉల్లేఖించిన వారు ఇలా చెబుతున్నారు - లేక ఉమ్మె అతియా (రజి) ఇలా

చెప్పి ఉంటారు - "(3) అబూసబ్రా (రజి) కూతురు, (4) హజ్రత్ ముఆజ్ (రజి) భార్య (5) మరొక మహిళ. "

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 46వ అధ్యాయం - మాయన్హా అనిన్నొహివల్ బుకాయిజ్జ్రి అన్ జాలిక్]

542. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- దైవప్రవక్త (స) మాచేత బైత్ (ప్రమాణం) చేయించినప్పుడు "వారు దేవునితో పాటు మరెవరినీ ఆయన దైవత్వంలో సాటి కల్పించమని ప్రమాణం చేయడానికి వస్తే....(వారి చేత ప్రమాణం చేయించు)" అన్న ఖుర్ఆన్ సూక్తి పఠించారు. దాంతో పాటు మేము (మా బంధుమిత్రుల) మృతిపట్ల ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టబోమని మాచేత ప్రమాణం చేయించేటప్పుడు ఒక స్త్రీ తన చేతిని వెనక్కి లాక్కొని "ఫలానా స్త్రీ (శోకాలు తీయడంలో) నాతో సహకరించింది. ఇప్పుడు నేనా స్త్రీకి దాని బదులు తీర్చనా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త(సల్లం) ఎలాంటి సమాధానం ఇవ్వలేదు. అప్పుడామె వెళ్ళిపోయింది. తర్వాత ఆమె తిరిగి వస్తే దైవప్రవక్త(సల్లం) ఆమె చేత ప్రమాణం చేయించారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ (ముమ్తహినా సూరా-60), 3వ అధ్యాయం - ఇజాజా అకల్ మూమినాతు యుబాయీనక్]

## 11వ అధ్యాయం - స్త్రీలు శవపేటిక వెంట (శ్మశానానికి) వెళ్ళడం నిషిద్ధం

543. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- మమ్మల్ని (స్త్రీలను) జనాజాల (శవపేటికల) వెంట (శ్మశానానికి) వెళ్ళకుండా వారించటం జరిగేది. అయితే ఈ విషయంలో మరీ అంత తీవ్రవైఖరి అవలంబించేవారు కాదు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 30వ అధ్యాయం - ఇత్తెబాఅన్నిసాయిల్ జనాయెజ్]

## 12వ అధ్యాయం - శవస్నానం

544. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) కుమార్తె ఒకరు చనిపోయినపుడు ఆయన మా దగ్గరికి వచ్చి ఇలా చెప్పారు : "ఆమెను నీటిలో రేగాకులు వేసి మూడు లేక అయిదు సార్లు లేదా అవసరమనుకుంటే అంతకంటే ఎక్కువసార్లు స్నానం చేయించండి. చివరిసారి కర్పూరం కలపాలి" లేక "కొంచెం కర్పూరం కలపాలి" అన్నారు ఆయన - "ఇలా స్నానం చేయించాక నాకు కబురు చేయండి."

మేము(శవానికి స్నానం చేయించి) ఆయనకు కబురు చేశాము. ఆయన (వచ్చి) మాకు తన లుంగీ ఇస్తూ, "ఈ వస్త్రాన్ని ఆమె దేహానికి తాకే విధంగా చుట్టండి"అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 8వ అధ్యాయం - గుస్లిల్‌మయ్యితి వవుజూయిహీ బిల్ మాయి వసిద్రి]

545. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) కుమార్తె, భౌతిక కాయానికి స్నానం చేయిస్తున్నప్పుడు ఆయన మా దగ్గరికి వచ్చి "ఆమెకు నీటిలో రేగాకులు వేసి మూడు లేక అయిదుసార్లు, లేదా (అవసరమనుకుంటే) అంతకంటే ఎక్కువసార్లు స్నానం చేయించండి. చివరిసారి

కర్పూరం ఉపయోగించాలి. ఇలా స్నానం చేయించి నాకు తెలియజేయండి" అని అన్నారు. మేము (అలా) స్నానం చేయించి ఆయనకు తెలియజేశాము. అప్పుడు ఆయన మాకు తన లుంగీ ఇచ్చి "దీన్ని ఆమె శరీరానికి అంటి ఉండేలా చుట్టబెట్టండి" అని చెప్పారు.

ఈ హదీసు ఉల్లేఖకులలో ఒకరైన హజ్రత్ అయ్యూబ్ (రహ్మాలై) ఇలా తెలియజేస్తున్నారు:- నాకు విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ హఫ్సా (రజి) కూడా హజ్రత్ ఉమ్మె అతియా (రజి) నుండి గ్రహించి ముహమ్మద్ (రహ్మాలై) చెప్పినటువంటి హదీసే విన్పించారు. కాకపోతే ఈ రెండింటి మధ్య కాస్త తేడా ఉంది. హజ్రత్ హఫ్సా(రజి) హదీసు ప్రకారం "ఆమెను బేసి సంఖ్యలో (అన్ని సార్లు) స్నానం చేయించండి" అని దైవప్రవక్త (సల్లం) అన్నారు. ఉమ్మె అతియా (రజి) హదీసు ప్రకారం ఆయన "మూడు లేక అయిదు లేక ఏడుసార్లు స్నానం చేయించండి" అని అన్నారు. అదీగాక "కుడివైపు నుండి ప్రారంభించండి; మొదట వుజూ చేయించవలసిన అవయవాలను కడగండి" అని దైవప్రవక్త(సల్లం) చెప్పినట్లు కూడా ఈ హదీసులో ఉంది. పోతే; హజ్రత్ ఉమ్మె అతియా (రజి), తాము ఆమె శిరోజాలు దువ్వి వాటిని మూడు పాయలుగా చేశామని కూడా తెలిపారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 9వ అధ్యాయం - మా యస్తహిబ్బు అఁయ్యుగ్సల విత్రా]

546. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) కుమార్తె (భౌతికకాయం)కు స్నానం చేయిస్తుంటే ఆయన (మమ్మల్ని పిలిచి) "స్నానం కుడివైపు నుండి మొదలు పెట్టండి; మొదట వుజూ చేయవలసిన అవయవాలు కడగండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 11వ అధ్యాయం - మవాజియల్ వుజూయి మినల్ మయ్యత్]

## 13వ అధ్యాయం - శవ వస్త్ర సంస్కారం

547. హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అరత్ (రజి) కథనం:- మేము దైవప్రసన్నత పొందే ఉద్దేశ్యంతో మాత్రమే దైవప్రవక్త (సల్లం) వెంట హిజ్రత్ చేశాము. (అంటే మక్కా నుండి మదీనాకు వలస వచ్చాము) అందువల్ల మాకు దాని పుణ్యఫలం ప్రసాదించడం దేవుని బాధ్యతయిపోయింది. మాలో కొందరు ఇహలోకం వీడి పోయారు. వారు ఇహలోకంలో తమ ప్రతిఫలాన్ని వసూలు చేయలేదు. ఉదాహరణకు (హజ్రత్ ముస్ అబ్ బిన్ ఉమైర్ రజి) ఉహద్ యుద్ధంలో అమరగతి నొందినపుడు ఆయనకు వస్త్ర సంస్కారం జరపడానికి ఒక దుప్పటి తప్ప మరేమీ లభించలేదు. అది కూడా చాలా చిన్న దుప్పటి. దాంతో తలవైపు నుంచి కప్పితే కాళ్ళు బయట ఉండేవి. కాళ్ళ వైపు నుంచి కప్పితే తల బయట ఉండేది. అందువల్ల "తలవైపు నుండి కప్పి కాళ్ళను అజ్ఖర్ (ఒక విధమైన సువాసనగల గడ్డి)తో చుట్టబెట్టండ"ని దైవప్రవక్త(సల్లం) ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 28వ అధ్యాయం - ఇజాలమ్ యజిద్ కఫనన్ ఇల్లా మాయువారి రాసహూ.......]

548. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (భౌతిక కాయం)కు యమన్ దేశంలోని సహూల్ ప్రాంతంలో తయారయిన మూడు తెల్లని వస్త్రాలలో చుట్టడం జరిగింది. ఆయన (భౌతికకాయం)కు చుట్టిన వస్త్రాలలో చొక్కాగాని, తలపాగాగాని లేవు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 19వ అధ్యాయం - అస్సయాబిల్ బైజల్ కఫన్]

## 14వ అధ్యాయం - మృతుని దేహంపై దుప్పటి కప్పడం గురించి

549. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దివంగతులయినపుడు ఆయన (భౌతిక కాయం)పై యమన్‌లో తయారయిన ఒక ఆకుపచ్చ రంగు దుప్పటి కప్పారు.

[సహీహ్ బుఖారీ: 77వ ప్రకరణం - లిబాస్, 18వ అధ్యాయం - అల్ బురూది వల్ హిబరతి వష్షమ్లా]

## 16వ అధ్యాయం - శవాన్ని ఖననం చేయడంలో తొందరచేయాలి

550. దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారని హజ్రత్ అబూహురైరా (రజి) తెలిపారు: మృతదేహాన్ని (శ్మశానానికి) తీసికెళ్ళడంలో తొందర చేయండి. ఎందుకంటే మృతుడు పుణ్యాత్ముడయి ఉంటే అతడ్ని మీరు సత్పర్యవసానం వైపుకు తీసికెళ్తున్నారన్నమాట. ఒకవేళ అతను పాపాత్ముడయి ఉంటే అతనొక చెడుమయం. దాన్ని మీరు మీ భుజాల నుండి దించి వేయడానికి వెళ్తున్నారన్నమాట. (అందువల్ల మృతదేహాన్ని ఎంత త్వరగా శ్మశానానికి చేర్చితే అంత మంచిది).

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 52వ అధ్యాయం - అస్సుర్ అతి బిల్ జనాజా]

## 17వ అధ్యాయం - జనాజా నమాజ్‌లో పాల్గొనడం వల్ల పుణ్యం

551. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "జనాజా (శవ ప్రస్థానం)లో పాల్గొని జనాజా నమాజు అయ్యేవరకు శవంతో పాటు ఉండే వ్యక్తికి ఒక యూనిట్ పుణ్యం లభిస్తుంది. శవఖననం అయ్యే వరకు ఉండే వ్యక్తికి రెండు యూనిట్ల పుణ్యం లభిస్తుంది". రెండు యూనిట్లు అంటే ఏమిటని అడగ్గా 'రెండు పెద్ద కొండల పరిమాణం' అని దైవప్రవక్త (సల్లం) తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 59వ అధ్యాయం - మనిన్ తంజిర హత్తా తద్‌ఫిన్]

552. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- "జనాజా (శవం) వెంట వెళ్ళే వ్యక్తికి ఒక యూనిట్ పుణ్యం లభిస్తుంద"ని హజ్రత్ అబూహురైరా (రజి) చెబుతున్నారు. హజ్రత్ అబూహురైరా (రజి) చాలా హదీసులు విన్పిస్తున్నారు. (ఈ హదీసుని గురించి విచారించగా) హజ్రత్ ఆయిషా (రజి) (దాన్ని) ధృవపరుస్తూ "నేను కూడా దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నాను" అని అన్నారు. నేనీ మాట విని "అయితే మేము చాలా యూనిట్లు వృధా చేసుకున్నాం★" అని అన్నాను.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 58వ అధ్యాయం - ఫజ్లిత్తిబాయిల్ జనాయెజ్]

## 20వ అధ్యాయం - మృతుడ్ని గురించి మంచిగా లేక చెడుగా ప్రస్తావిస్తే?

553. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒకసారి (వీధిలో) ఒక శవపేటికను మోసుకెళ్తుంటే ప్రజలు మృతుని మంచిని గురించి ప్రస్తావిస్తూ అతడ్ని ప్రశంసించారు. దైవప్రవక్త(సల్లం) వారి మాటలు

★ ఈ మాట వినక ముందు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) జనాజా నమాజ్ చేసిన తరువాత వెళ్ళిపోయేవారు. (శ్మశానానికి పోయేవారు కాదు). అందువల్ల ఆయన ఈ హదీసు విని తాను చాలా పుణ్యం పోగొట్టుకున్నానని అన్నారు.

విని "వాజిబ్ (తప్పనిసరి) అయ్యింద"ని అన్నారు. ఆ తర్వాత మరొక శవం వెళ్తుంటే ప్రజలు ఆ మృతుణ్ని గురించి చెడుగా చెప్పుకున్నారు. దైవప్రవక్త (సల్లం) మళ్ళీ వారి మాటలు విని "వాజిబ్ (తప్పనిసరి) అయ్యింద"ని అన్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) విషయం తెలుసుకోవడానికి "'ఏం వాజిబ్ (తప్పనిసరి) అయ్యింది?" అని అడిగారు. "మీరు ప్రశంసించిన వ్యక్తికి స్వర్గ ప్రవేశం వాజిబ్ (తప్పనిసరి) అయ్యింది. మీరు చెడుగా ప్రస్తావించిన రెండవ వ్యక్తికి నరకం వాజిబ్ (తప్పనిసరి) అయ్యింది. ఎందుకంటే మీరు ప్రపంచంలో దేవుని సాక్షులుగా ఉన్నారు" అని సమాధానమిచ్చారు దైవప్రవక్త(సల్లం).★

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 86వ అధ్యాయం - సనాఅన్నాసి అలల్ మయ్యత్]

## 21వ అధ్యాయం - సౌఖ్యాన్ని పొందేవాడు, సౌఖ్యాన్నిచ్చేవాడు అంటే ఎవరు?

554. హజ్రత్ అబూ ఖతాదా రబయీ అన్సారీ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) తన సమీపం నుంచి ఒక శవం పోతుంటే చూసి "సౌఖ్యాన్ని పొందేవాడు లేక సౌఖ్యాన్నిచ్చేవాడు" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త సహచరులు విషయం అర్థంగాక "సౌఖ్యాన్ని పొందేవాడు లేక సౌఖ్యాన్నిచ్చేవాడు అంటే ఏమిటి దైవప్రవక్తా!" అని అడిగారు. దానికి దైవప్రవక్త(సల్లం) సమాధానమిస్తూ "అంటే విశ్వాసి (చనిపోయిన తరువాత) ఇహలోక కష్టాల నుండి విముక్తి పొంది దేవుని కారుణ్యఛాయ (స్వర్గం)లో సౌఖ్యాన్ని పొందుతాడు. పాపాత్ముడు చనిపోవడం వల్ల ప్రజలు, పట్టణం, దేశం, చెట్లు, చతుష్పాదాలు, సర్వానికి అతని కీడు నుండి విముక్తి కలుగుతుంది" అని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 42వ అధ్యాయం - సకరాతుల్ మౌత్]

## 22వ అధ్యాయం - జనాజా నమాజులో తక్బీర్‌లను గురించి

555. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- నజాషీ (రజి) (నీగస్ చక్రవర్తి) ఏ రోజు చనిపోయాడో అదే రోజు ఆయన మరణవార్తను దైవప్రవక్త(సల్లం) మాకు విన్పించి నమాజు చేసే స్థలానికి వెళ్ళిపోయారు. అక్కడ అనుయాయులతో కలసి (జనాజా నమాజు కోసం) పంక్తులు ఏర్పరచి నాలుగు తక్బీర్‌లు పలికారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 4వ అధ్యాయం - అర్రజులియనా ఇలా అహ్లిల్ మయ్యిత్ బినఫ్సిహీ]

556. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- అబిసీనియా చక్రవర్తి హజ్రత్ నజాషీ (రజి) ఏ రోజు చనిపోయారో ఆయన మరణవార్తను దైవప్రవక్త(సల్లం) ఆ రోజే మాకు విన్పించి "మీ సోదరుని కోసం మన్నింపు ప్రార్థన (జనాజా నమాజు) చేయండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 61వ అధ్యాయం - అస్సలాతు అలల్ జనాయిజ్ బిల్‌ముసల్లా వల్ మస్జిద్]

★ ఇక్కడ 'వాజిబ్ అయ్యింది' అంటే ధృవపడిందని అర్థం తీసుకోవాలి. దేవునిపై ఏ విషయం వాజిబ్ కాదు. ఒక వ్యక్తికి పుణ్యఫలం లభించిందంటే అది ఆయన అనుగ్రహం; మరొక వ్యక్తి శిక్షకు గురయ్యాడంటే అది ఆయన ఇచ్చిన న్యాయమైన తీర్పు. ఆయన సర్వశక్తిమంతుడు, స్వయం నిర్ణయాధికారి. ఆయన చేసిన పనికి ఏ ఒక్కడూ ఎందుకూ, ఎలా అని అడగలేడు.

557. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ అస్హమా నజాషీ (రజి) కోసం జనాజా నమాజ్ చేశారు. అందులో ఆయన నాలుగు సార్లు తక్బీర్‌లు పలికారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 65వ అధ్యాయం - అత్తక్బీరి అలల్ జనాజతి అర్బ]

558. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఈ రోజు అబిసీనియాకు చెందిన ఒక పుణ్యాత్ముడు చనిపోయాడు. అతని (మన్నింపు) కోసం జనాజా నమాజ్ చేద్దాం రండి".

హజ్రత్ జాబిర్ (రజి) ఇంకా ఇలా తెలియజేస్తున్నారు:- అప్పుడు మేమంతా బారులు తీరి నిలబడ్డాము. దైవప్రవక్త (సల్లం) జనాజా నమాజు చేయించారు. ఆయన వెనుక జనం అనేక పంక్తులు తీరి నిల్చున్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 55వ అధ్యాయం - అస్సపూఫి అలల్ జనాజా]

## 23వ అధ్యాయం - సమాధి ముందు జనాజా నమాజు చేయడం గురించి

559. హజ్రత్ సులైమాన్ షైబానీ (రహ్మాలై) కథనం ప్రకారం హజ్రత్ షాబి (రహ్మాలై) ఇలా అన్నారు:- "వేరుగా నిర్మించబడిన ఒక సమాధి దగ్గరకు దైవప్రవక్త(సల్లం) వెంట వెళ్ళినటువంటి ఒక వ్యక్తి నాకీ సమాచారం అందజేశాడు. దైవప్రవక్త (సల్లం) అక్కడ జనాజా నమాజు కోసం నాయకత్వం వహించారు. ఆయన వెనుక అందరూ బారులు తీరి నిలబడి జనాజా నమాజు చేశారు.

ఈ హదీసు ఉల్లేఖించిన షైబాని (రహ్మాలై) హజ్రత్ షాబి (రహ్మాలై)ని "అబూ అమ్ర్! ఈ హదీసు మీకు ఎవరు తెలిపారు?" అని అడిగారు. దానికి ఆయన "హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)" అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 161వ అధ్యాయం - ఉజూ అస్సిబ్యాని వమతాయజిబు అలైహిముల్ గుస్ల్]

560. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒక నల్ల వర్ణం పురుషుడు లేక స్త్రీయో - మస్జిద్ సేవ చేస్తూ ఉండేవాడు. అతను చనిపోయినపుడు దైవప్రవక్త (సల్లం)కు అతని మరణవార్త (వెంటనే) అందలేదు. తర్వాత ఒక రోజు ఆయన ఆ మనిషిని జ్ఞాపకం చేయగా అతను చనిపోయాడని చెప్పారు ప్రవక్త అనుచరులు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "ఆ సంగతి నాకెందుకు తెలియజేయలేదు మీరు?" అని అడిగారు. "అతని మరణం అంత పెద్ద సంఘటన కాదనుకొని, దానికి మేమంత ప్రాముఖ్యత నివ్వలేదు. అతని అంతస్తుని మేము తక్కువగా పరిగణించాము" అన్నారు ప్రవక్త సహచరులు. దైవప్రవక్త(సల్లం) అది విని "సరే, నాకతని సమాధి చూపండి" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) అతని సమాధి దగ్గరకు వెళ్ళి అతని కోసం జనాజా నమాజు చేశారు."

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 67వ అధ్యాయం - అస్సలాతి అలల్ ఖబ్రి బాద మాయుద్ఫిన్]

## 24వ అధ్యాయం - జనాజా వస్తుంటే గౌరవసూచకంగా నిలబడాలి

561. హజ్రత్ ఆమిర్ బిన్ రబీయా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "మీరు శవయాత్ర వస్తుండగా చూస్తే నిలబడండి. అది ముందుకు సాగిపోయే వరకు అలాగే నిలబడండి".

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 47వ అధ్యాయం - అల్ ఖియాముల్ జనాజా]

562. హజ్రత్ ఆమిర్ బిన్ రబీయా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- (మీలో) ఎవరైనా శవపేటిక వస్తుండగా చూడటం జరిగితే అతను దాని వెంట వెళ్ళకపోతే (కనీసం) నిలబడిపోవాలి. అతను జనాజా వెనుక ఉండిపోయేవరకూ లేదా జనాజా తన వద్ద నుంచి ముందుకు సాగిపోయే వరకు (హదీసు ఉల్లేఖకునికి అనుమానం వచ్చింది) అలాగే నిలబడిపోవాలి.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 48వ అధ్యాయం - మతయఖ్ అదు ఇజా ఖామలిల్ జనాజా]

563. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా సెలవిచ్చారు:- "మీరు శవపేటిక (జనాజా) వస్తుండగా చూస్తే నిలబడిపోండి. జనాజా వెంట వెళ్ళేవాడు జనాజాను క్రింద పెట్టనంత వరకు కూర్చోరాదు."

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 49వ అధ్యాయం - మన్తబి అజ్జనాజత ఫలాయఖ్అదు హత్తా తూజా]

564. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మా సమీపం నుండి ఒక జనాజా వెళ్తుంటే దైవప్రవక్త(స) దానికి గౌరవసూచకంగా నిలబడిపోయారు. మేము కూడా ఆయనతోపాటు నిలబడిపోయాము. ఆ తరువాత మేము "దైవప్రవక్తా! ఇది యూదుని శవం కదా?" అని అన్నాము. దానికి ఆయన "(ఎవరిదైనా సరే) జనాజా వస్తుండగా చూస్తే నిలబడిపోండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 50వ అధ్యాయం - మన్ఖామ లిజనాజతి యహూదీ]

565. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబీ లైలా (రహ్మాలై) కథనం:- హజ్రత్ సహల్ బిన్ హనీఫ్ (రజి), హజ్రత్ ఖైస్ బిన్ సాద్ (రజి)లు - ఇద్దరూ ఖాదిసియాలో కూర్చొని ఉండగా, అక్కడి ప్రజలు ఒక శవాన్ని మోసుకొని వారి ముందు నుంచి సాగిపోయారు. అప్పుడు వీళ్ళిద్దరు లేచి నిలబడ్డారు. అది చూసి ఎవరో "ఈ జనాజా స్థానిక వ్యక్తిది, అంటే జిమ్మీ (ఈరాన్‌కు చెందిన జోరాస్ట్రియన్)ది" అని అన్నారు. ఇది విని వారిరువురు ఇలా సమాధానమిచ్చారు: "లోగడ ఒకసారి దైవప్రవక్త(స) ముందు నుంచి ఒక యూదుని జనాజా వెళ్ళింది. ఆ మృతుని గౌరవార్థం ఆయన (స) లేచి నిలబడ్డారు. ఇది యూదుని జనాజా కదా! అని ఆయన్ని ప్రశ్నిస్తే యూదునిలో ఉండేది ఆత్మకాదా?" అని ఎదురు ప్రశ్న వేశారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 50వ అధ్యాయం - మన్ఖామ లిజనాజతి యహూదీ]

## 27వ అధ్యాయం - జనాజా నమాజు చేస్తున్నప్పుడు ఇమామ్ భౌతిక కాయానికి ఎటువైపు నిలబడాలి

566. హజ్రత్ సమూరా బిన్ జున్దుబ్ (రజి) కథనం:- నేను ఒకసారి దైవప్రవక్త(స) వెనుక ఒక స్త్రీ జనాజా నమాజు చేశాను. ఆ స్త్రీ ప్రసూతి స్థితిలో ఉండగా చనిపోయింది. దైవప్రవక్త(స) జనాజా నమాజు చేయిస్తున్నప్పుడు శవానికి మధ్య (ఎదురుగా) నిలబడ్డారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 63వ అధ్యాయం - అస్సలాతి అలన్నుఫసాయి ఇజామాతల్ ఫీనిఫాసిహీ]

# జకాత్ ప్రకరణం

567. హ్జ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:- "ఐదు ఊఖియాల ($52^1/2$ తులాల) కన్నా తక్కువ వెండిపై జకాత్ లేదు. ఐదుకంటే తక్కువ ఒంటెలపై కూడా జకాత్ లేదు. అలాగే ఐదు వసఖ్‌ల[1] కన్నా తక్కువ (ఖర్జూరం లేక ధాన్యం)పై కూడా జకాత్ లేదు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 4వ అధ్యాయం - మాఅదీ జకాతుహూ ఫలైస బికన్జ్]

## 2వ అధ్యాయం - బానిసలపై, గుర్రాలపై జకాత్ లేదు

568. హ్జ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:- "ముస్లిం యాజమాన్యంలో ఉన్న గుర్రాలపై, బానిసలపై జకాత్ విధిగా లేదు.[2]"

[సహీహ్ బుఖారీ: 24వ ప్రకరణం - జకాత్, 45వ అధ్యాయం - లైసఅలల్ ముస్లిమి ఫీ ఫరసిహీ సదఖా]

## 3వ అధ్యాయం - జకాత్ చెల్లింపు, జకాత్ నిరాకరణలను గురించి

569. హ్జ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) జకాత్ వసూలు చేయమని ఆదేశించిన తరువాత (ఒకసారి) హ్జ్రత్ ఇబ్నె జమీల్ (రజి)[3], ఖాలిద్ బిన్ వలీద్ (రజి), అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్‌లు జకాత్ చెల్లించడానికి నిరాకరించినట్లు ఆయనకు సమాచారం అందింది. అప్పుడు ఆయన ఇలా అన్నారు: "ఇబ్నె జమీల్ (రజి) గతంలో పేదవానిగా ఉండేవారు. ఇప్పుడు దేవుడు, దైవప్రవక్త(స) అతణ్ని ధనికునిగా చేశారు. (అందుకు అతను వారి పట్ల కృతజ్ఞత చూపడా?) ఖాలిద్ (రజి)ని జకాత్ అడిగి మీరతనిపై అన్యాయానికి పాల్పడుతున్నారు. అతను తన యుద్ధ కవచాన్ని, ఆయుధాల్ని సైతం దైవమార్గంలో అంకితం చేశాడు. పోతే అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ దైవప్రవక్త(స) పినతండ్రి అయినందున ఆయన జకాత్ ఆయనకే సదఖా (దానం) అవుతుంది.

---

(1) వసఖ్ అంటే శాబ్దిక భావం 'బుట్ట లేక తట్ట'. బరువు రీత్యా ఒక వసఖ్ 60 'సా'లకు సమానం. ఒక 'సా' నాలుగు 'ముద్'లు అవుతుంది. ఒక 'ముద్' రెండు 'రతిల్'లకు సమానం. ఒక 'రతిల్' అర్ధ 'సేరు', పావు 'సేరు'లకు సమానం. ఒక 'సేరు' ఎనభై 'తులాల'కు సమానం. ఒక 'ముద్' ఒకటింబావు సేరు అవుతుంది. ఒక 'సా' అయిదు 'సేర్ల'కు సమానం. ఒక వసఖ్ (60 'సా'లు) ఏడున్నర 'మణుగు'లకు సమానం. ఇలా అయిదు 'వసఖ్'లు 37 మణుగుల 20 సేర్లు అవుతాయి.
(గమనిక : ఒక 'తులం' దాదాపు $11^1/2$ గ్రాములు అవుతుంది - అనువాదకుడు)

(2) గుర్రాలపై, బానిసలపై జకాత్ లేదన్న విషయంలో ఎలాంటి అభిప్రాయభేదం లేదు. కాకపోతే అత్యధిక సంఖ్యలో వ్యాపార నిమిత్తం ఉన్నప్పుడు జకాత్ విధిగా చెల్లించాలి. ఇందులో కూడా విభిన్న అభిప్రాయాలు లేవు. అయితే గుర్రాలు వ్యాపార నిమిత్తం కాకపోయినా ఒకటి కంటే ఎక్కువ ఉంటే వాటి జకాత్ విషయంలోనే అభిప్రాయభేదాలున్నాయి.

(3) ఇబ్నె జమీల్ జకాత్‌ని నిరాకరించడానికి అతని దగ్గర ఎలాంటి కారణం లేదు. ఆయన తప్పనిసరిగా జకాత్ చెల్లించాలి. దేవుని పట్ల ఆయన ప్రవక్త పట్ల కృతఘ్నుడయి పోకూడదు.

కాకపోతే అంతే జకాత్ మొత్తం (ఆయన తరపున నేను చెల్లిస్తాను)".★

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం -జకాత్, 49వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (వఫిర్రిఖాబ్)]

## 4వ అధ్యాయం - ఫిత్రా దానం గురించి

570. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఒక 'సా' ఖర్జూర పండ్లుగాని, ఎర్ర గోధుమలు గాని (పేదలకు) ఫిత్రా దానంగా ఇవ్వడం ప్రతి ముస్లిం పురుషునికి, స్త్రీకి విధిగా చేశారు. వారు స్వేచ్ఛాపరులైనా, బానిసలైనా సరే విధిగా చెల్లించాలి.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 71వ అధ్యాయం - సదఖతుల్ ఫిత్రి అలల్ అబ్ది వగైరిహీ మినల్ ముస్లిమీన్]

571. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఫిత్రా దానంగా ఒక 'సా' ఖర్జూర పండ్లుగాని, ఎర్ర గోధుమలు గాని చెల్లించాలని దైవప్రవక్త (స) ఆదేశించారు. (అయితే ఆ తరువాత) ప్రజలు రెండు ముద్‌ల (అర్థ 'సా') తెల్ల గోధుమలను ఒక 'సా' ఎర్ర గోధుమలతో లేదా ఒక 'సా' ఖర్జూర పండ్లతో సమానంగా పరిగణించారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 74వ అధ్యాయం - సదఖతుల్ ఫిత్రి సాఅమ్మిన్ తమ్ర్]

572. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- మేము ఫిత్రా దానంగా ఒక 'సా' భోజనంగాని, ఒక 'సా' ఖర్జూర పండ్లుగాని, ఒక 'సా' ఎర్ర గోధుమలు గాని, ఒక 'సా' జున్నుగాని, ఒక 'సా' ద్రాక్ష పండ్లుగాని ఇచ్చేవాళ్ళము.

[సహీహ్ బుఖారీ 24వ ప్రకరణం - జకాత్, 73వ అధ్యాయం - సదఖతుల్ ఫిత్రి సాఅమ్మిన్ తఆమ్]

573. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) కాలంలో మేము ఫిత్రా దానంగా ఒక 'సా' ఎర్ర గోధుమలు గాని, తెల్ల గోధుమలు గాని, ఖర్జూరపండ్లుగాని, ద్రాక్ష పండ్లుగాని ఇచ్చేవాళ్ళము. అయితే హజ్రత్ ముఆవియా (రజి) పాలనాకాలంలో సిరియా దేశపు ఎర్ర గోధుమలు వచ్చేశాయి. అప్పుడు హజ్రత్ ముఆవియా (రజి) తన అభిప్రాయం వ్యక్తపరుస్తూ "ఈ ఎర్ర గోధుమలు ఒక 'ముద్' ఇతర వస్తువులు రెండు ముద్‌లతో సమానమవుతాయనుకుంటున్నాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 24వ ప్రకరణం - జకాత్, 75వ అధ్యాయం - సాఅమ్మిన్ జబీబ్]

## 6వ అధ్యాయం - జకాత్ ఇవ్వని వారి దుర్గతి

574. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "గుర్రాలు మూడు విధాలుగా ఉంటాయి. కొందరికవి పుణ్యఫలానికి ఉద్దేశించినవి. మరికొందరికి అవి లోపాలను కప్పి పుచ్చేవిగా ఉంటాయి. ఇంకా కొందరికి (నరక) యాతనకు కారణభూతమవుతాయి. దైవమార్గంలో పోరాడేందుకు గుర్రాన్ని పెంచే వ్యక్తికి అది పుణ్యఫలాన్ని ఆర్జించిపెడుతుంది. అతనా గుర్రాన్ని పొడుగాటి త్రాటితో కట్టివేసి ఏదైనా పచ్చిక బైలులోగాని లేదా తోటలోగాని వదలిపెడితే, ఆ త్రాటి పొడవు ఆ పచ్చిక బైలులో లేక తోటలో ఎంత మేరకు విస్తరిస్తుందో అన్ని పుణ్యాలు అతని కర్మల చిట్టాలో వ్రాయబడతాయి. ఒక వేళ ఆ గుర్రం త్రాడు తెంచుకొని ఒకటి రెండు గుట్టలు దూకి వస్తే,

★ సహీహ్ ముస్లింలో వచ్చిన ఉల్లేఖనం ఇలా ఉంది. "ఇక అబ్బాస్ (రజి) గారి విషయానికొస్తే ఆయన జకాత్ బాధ్యత నాపై ఉంది. పైగా నేను ఆయన తరపున అంతకు మరింత చెల్లిస్తాను" అన్నారు దైవప్రవక్త (సల్లం). ఆ తరువాత "ఉమర్! మీకు తెలుసా! చిన్నాయన (లేదా పెదనాన్న) కన్నతండ్రితో సమానం" అన్నారు ఆయన.

దాని లద్ది, దాని గిట్టల గుర్తులు సయితం అతని కోసం పుణ్యాలుగా పరిగణించబడతాయి. అంతేకాదు, ఆ గుర్రానికి దాని యజమాని నీళ్ళు త్రాగించే ఉద్దేశం లేకపోయినా సరే అది తనంతట తాను ఏదైనా నది దగ్గరికెళ్ళి నీళ్ళు త్రాగితే అప్పుడు కూడా అతని ఖాతాలో పుణ్యాలు వ్రాయబడతాయి. దీనికి భిన్నంగా ఎవరైనా ప్రదర్శనా బుద్ధితో, గర్వకారణం కోసం గుర్రాన్ని పెంచుతూ, ఇస్లాం శక్తులకు వ్యతిరేకంగా పోరాడే ఉద్దేశ్యంతో కట్టి ఉంచితే అతని కోసం ఆ గుర్రం పాపఫలానికి కారణభూతమవుతుంది".

ఈ సందర్భంలో దైవప్రవక్త (సల్లం)ను మరి గాడిదను గురించి ఏమిటి అని అడిగితే ఆయన ఇలా సమాధానమిచ్చారు: "ఆ విషయంలో నాపై ఎలాంటి దైవాజ్ఞ అవతరించలేదు. కాకపోతే పాప మన్నింపు రీత్యా ఎంతో సమగ్రమైన అసాధారణ సూక్తి ఒకటి అవతరించింది. అదేమిటంటే-

"ఎవరు అణుమాత్రం సత్కార్యం చేసినా సరే అతను దాన్ని (పరలోకంలో) కళ్ళారా చూసుకుంటాడు. అలాగే మరెవరు అణుమాత్రం పాపకార్యం చేసినా సరే అతను దాన్ని ప్రత్యక్షంగా చూసుకుంటాడు." (దివ్యఖుర్ఆన్ - జిల్‌జాల్ : 7,8)

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్ వస్సైర్, 48వ అధ్యాయం - అల్ ఖైలులి సలాసతి]

## 8వ అధ్యాయం - జకాత్ చెల్లించని వారు కఠినాతి కఠిన శిక్ష చవి చూడవలసి వస్తుంది

575. హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను. అప్పుడాయన కాబా (గోడ) నీడలో కూర్చొని "కాబా ప్రభువు సాక్షి! అందరికంటే ఎక్కువగా వాళ్ళే నష్టపోయేవాళ్ళు. కాబా ప్రభువు సాక్షి!! అందరికంటే ఎక్కువగా వాళ్ళే నష్టపోయే వాళ్ళు" అని అన్నారు. నేను (ఆశ్చర్యపోతూ) "ఏమిటీ, నా పరిస్థితి ఏమిటీ? నాలో అలాంటి దేదయినా కన్పిస్తోందా? (దైవప్రవక్తా!)" అని అడిగాను. ఆ తరువాత నేను దైవప్రవక్త(సల్లం) చెంత వెళ్ళి కూర్చున్నాను. ఆయన తిరిగి అవే మాటలను ఉద్ఘాటించసాగారు. నేను తీవ్రంగా చింతిస్తూ ఉండబట్టలేక "దైవప్రవక్తా నా తల్లిదండ్రులు మీ కోసం అర్పితమవుగాక, ఎవరు వాళ్ళు?" అని అడిగాను మళ్ళీ. అప్పుడాయన సమాధానమిస్తూ, "అత్యధిక సిరిసంపదలు కలవాళ్ళు. అయితే ఈ విధంగా, ఆ విధంగా (అంటే ముందూ, వెనుకా, కుడి, ఎడమల వైపు) దైవమార్గంలో ఖర్చు పెట్టే వాళ్ళు మాత్రం కాదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 83వ ప్రకరణం - ఈమాన్ వనుజూర్, 4వ అధ్యాయం - కైఫ కానత్ యమీనున్నబీ (సల్లం)]

576. హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) కథనం:- నేను (ఓసారి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్తే సరిగ్గా అదే సమయంలో ఆయన "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్షి!" అంటూ లేక "తాను తప్ప వేరే ఆరాధ్యుడు లేనటువంటి శక్తి స్వరూపుని సాక్షి" అంటూ లేక మొత్తం మీద ఆయన ఏదో ఓ రకంగా ప్రమాణం చేస్తూ ఇలా అన్నారు. "ఒంటెలు, ఆవులు లేదా మేకలు కలిగిఉన్న వ్యక్తి వాటి హక్కు (అంటే జకాత్) గనక నెరవేర్చకపోతే ప్రళయదినాన ఆ పశువులు బాగా పెరిగి బలిసిపోయేలా చేసి తీసుకు రాబడతాయి. తర్వాత అవి ఒకదాని తరువాత మరొకటి వరుసగా ఆ

వ్యక్తిని కొమ్ములతో పొడిచి కాళ్ళతో తొక్కివేస్తాయి. చివరి పశువు కూడ పొడిచి, తొక్కి వేసిన తరువాత తిరిగి మొదటి పశువు వచ్చేస్తుంది. ఈ విధంగా ఈ యాతన యావత్తు మానవులను గురించి (పరలోక) తీర్పు ముగిసే దాకా కొనసాగుతుంది".

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 43వ అధ్యాయం - జకాతిల్ బఖర]

## 9వ అధ్యాయం - దాన ధర్మాలకై ప్రేరేపించడం

577. హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) కథనం:- నేనొక రోజు సాయంత్రం దైవప్రవక్త(సల్లం) వెంట మదీనా వెలుపల కంకర నేలపై నడచిపోతుంటే మా ఎదురుగా ఉహద్ పర్వతం వచ్చింది. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు: "అబూజర్! నా దగ్గర ఉహద్ పర్వతమంత బంగారం ఉండి, ఒక రాత్రి లేక మూడు రాత్రులు గడిచినంత కాలంలో అప్పు తీర్చడానికి ఉంచుకునే దీనార్ తప్ప ఆ బంగారంలో ఒక్క దీనార్ కూడ నా దగ్గర ఉండిపోవడం నాకిష్టం లేదు. నేనా సంపదను దైవదాసుల కోసం ఇలా అలా ఖర్చు పెడతాను." దైవప్రవక్త(సల్లం) ఈ మాట అంటూ తన చేతిని అటూ ఇటూ తిప్పి చూపారు.

ఆ తరువాత "అబూజర్ !" అని నన్ను సంబోధించారు. "చెప్పండి దైవప్రవక్తా! నేను మాట వినడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాను నేను. "అలా, ఇలా (దైవమార్గంలో) ధనాన్ని ఖర్చు చేసేవారు తప్ప ఎక్కువ సిరిసంపదలు కలవారే తక్కువ పుణ్యం పొందేవారు"అన్నారు ఆయన. ఆ తరువాత "అబూజర్! ఇక్కడ ఉండు. నేను తిరిగొచ్చేదాకా ఎక్కడికీ వెళ్ళకు" అని చెప్పి ఎక్కడికో వెళ్ళిపోయారు. నాకు కనపడనంత దూరంగా వెళ్ళిపోయారు.

ఆ తర్వాత కాస్సేపటికి ఏదో శబ్దం విన్పించింది. దైవప్రవక్త (సల్లం) ఏదైనా ప్రమాదానికి గురయ్యారేమోనని నేను భయపడ్డాను. అందువల్ల నేను ముందుకు సాగుదామనుకున్నాను. ఇక్కడ్నుంచి ఎక్కడికీ వెళ్ళకు అన్న దైవప్రవక్త(సల్లం) ఆజ్ఞ గుర్తొచ్చి ఆగిపోయాను. (అంతలో దైవప్రవక్త(సల్లం) వచ్చేశారు, రాగానే) "దైవప్రవక్తా! నేనొక విధమైన శబ్దం విని (దురదృష్టవశాత్తు) మీకేమయినా ప్రమాదం సంభవించిందేమోనని భయపడ్డాను. కాని మీ ఆదేశం గుర్తొచ్చి నేను ఇక్కడ్నుంచి కదలలేకపోయాను" అన్నాను నేను.

అప్పుడు ఆయన ఇలా అన్నారు : "ఈ శబ్దం హజ్రత్ జిబ్రీల్ (అలైహి) గారిది. ఆయన నా దగ్గరకు వచ్చి 'మీ అనుచర సమాజంలో దేవునికి ఆయన దైవత్వంలో ఏ మాత్రం ఇతరులను సాటి కల్పించని వ్యక్తి స్వర్గానికి వెళ్తాడు' అని తెలియజేశారు". నేనా మాటలు విని "మరి దైవప్రవక్తా! అతను వ్యభిచారం చేసినా, దొంగతనాలకు పాల్పడినా (స్వర్గానికి వెళ్తాడా)"? అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) "ఔను, వ్యభిచారం చేసినా, దొంగతనాలకు పాల్పడినా సరే" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 79వ ప్రకరణం - ఇస్తీజాన్, 3వ అధ్యాయం - మన్ అజాబ బిలబ్బైక వసాదైక్]

578. హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) కథనం:- నేనొక రోజు రాత్రి (ఇంటి నుంచి) బయలుదేరి చూస్తే, దైవప్రవక్త(సల్లం) ఒంటరిగా ఎక్కడికో వెళ్తున్నారు. ఆయన వెంట ఎవరూ లేరు. బహుశా ఆయన (ఈ సమయంలో) తన వెంట ఎవరినీ తీసుకు వెళ్ళదలచుకోలేదేమో అనుకున్నాను నేను మనసులో. ఈ

ఆలోచనతో నేను (ఆయనకు కనపడకుండా ఉండేందుకు) వెన్నెలను తప్పించి (నీడచాటున) నడవసాగాను. కాని ఆయన వెనుదిరిగి నన్ను చూసి 'ఎవరూ?' అన్నారు. "నేను అబూజర్‌ని. దేవుడు నన్ను మీ కోసం సమర్పించుగాక" అని అన్నాను. ఆయన (వెంటనే) "అబూజర్! వచ్చెయ్యి" అన్నారు. నేను వెళ్ళి ఆయన వెంట (మౌనంగా) నడవసాగాను.

కాస్సేపటికి ఆయన (నిశ్శబ్దాన్ని చీల్చివేస్తూ) ఇలా అన్నారు; "నిజానికి అత్యధిక సిరిసంపదలు కలవారే ప్రళయ దినాన అధములుగా, దరిద్రులుగా ఉండేవారు. అయితే దేవుడు ప్రసాదించిన సిరిసంపదల్ని ఎడమవైపు, కుడివైపు, ముందు వెనకా, సర్వత్రా వెదజల్లుతూ వాటిని సత్కార్యాల కోసం వినియోగించే వాళ్ళు మాత్రం కాదు."

ఆ తరువాత మరి కాస్సేపు ఆయన వెంట నడుస్తూ పోయాను. కాస్సేపటికి ఆయన "ఇక్కడ కూర్చో" అన్నారు. చుట్టు ప్రక్కల రాళ్ళు, రప్పలు పడి ఉండి, మధ్యలో శుభ్రంగా ఉన్న ఒక చదునైన ప్రదేశంలో కూర్చోవలసినదిగా ఆయన నన్ను ఆదేశిస్తూ "నేను తిరిగి వచ్చే వరకూ (ఎక్కడికీ వెళ్ళకుండా) ఇక్కడే కూర్చొని ఉండు" అని అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఆ రాతి నేల మీద నడుస్తూ నాకు కనుమరుగయిపోయి ఎక్కడికో వెళ్ళారు. అక్కడ చాలాసేపు గడిపారు. తర్వాత ఎంతో ఆలస్యంగా వచ్చారు. అలా వస్తూ ఆయన "దొంగతనం చేసినా, వ్యభిచారానికి పాల్పడినా సరే" అన్నారు. ఆయన నాకు దగ్గరగా వచ్చారు. నేనిక ఉండబట్టలేక "దైవప్రవక్తా! దేవుడు నన్ను మీకోసం అంకితమయ్యే భాగ్యం ప్రసాదించుగాక. ఈ రాతి నేల అవల మీరు ఎవరితో మాట్లాడుతున్నారు" అని అడిగాను.

అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా వివరించారు; హజ్రత్ జిబ్రయీల్ (అలైహి)తో. ఆయన ఈ రాతి నేల అవల వచ్చి నన్ను కలుసుకొని "మీ అనుచర సమాజానికి శుభవార్త అందజేయండని చెబుతూ ఒక్క దేవుడ్ని తప్ప మరెవరినీ ఆరాధించకుండా, ఆయనకు (ఆయనశక్తి సామర్థ్యాలలో) మరెవరినీ సాటి కల్పించకుండా జీవితం గడుపుతూ చివరికి అదే స్థితిలో ఎవరైనా చనిపోతే అతను స్వర్గానికి వెళ్తాడు"అని అన్నారు. అప్పుడు నేను "అయితే జిబ్రీల్! అతను దొంగతనం చేసి ఉన్నా, వ్యభిచరించి ఉన్నా (సరే స్వర్గానికి వెళ్తాడా)?" అని అడిగాను. దానికి ఆయన 'ఔన'ని సమాధానమిచ్చారు. నేను మళ్ళీ "ఏమిటి, అతను దొంగతనం, వ్యభిచారం చేసి ఉన్నప్పటికీ (స్వర్గానికి వెళ్తాడా)?" అని అడిగాను. "ఔను (అంతేకాదు) అతను మద్యం సేవించి ఉన్నా సరే" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 13వ అధ్యాయం - అల్ ముక్సరూన హుముల్ మఖ్లూన్]

## 10వ అధ్యాయం - డబ్బు కూడబెట్టే వారికి కఠిన శిక్ష

579. హజ్రత్ అహ్నాఫ్ బిన్ ఖైస్ (రజి) కథనం:- నేనొకసారి ఖురైష్ నాయకుల దగ్గర కూర్చొని ఉన్నప్పుడు ఒక వ్యక్తి వచ్చాడు. అతను ముతక బట్టలు ధరించి ఉన్నాడు. తల వెంట్రుకలు చాలా బిరుసుగా ఉన్నాయి. అతని రూపురేఖలు చూస్తే చాలా మొరటుగా ఉన్నాడు. అతను వారి దగ్గర నిలబడి సలాం చేసి ఇలా అన్నాడు.

"డబ్బు కూడబెట్టే వారికి శుభవార్త చెప్పండి. (దైవదూతలు) నరకాగ్నిలో ఒక రాయిని కాల్చి దాన్ని వారి గుండెల మీద ఉంచుతారు. అది వారి భుజపు టెముకల దగ్గర్నుంచి (దేహాన్ని మాడ్చుతూ) రెండో వైపుకు వచ్చేస్తుంది. ఆ తరువాత దాన్ని వారి భుజపు టెముకల మీద ఉంచుతారు. అది వారి గుండెల నుండి రెండో వైపుకు వచ్చేస్తుంది. ఈ విధంగా ఆ రాయి నిరంతరాయంగా అటూ, ఇటూ తిరుగుతుంటుంది."

ఈ మాటలు చెప్పి ఆ వ్యక్తి (కొంచెం దూరంలో ఉన్న) ఒక స్తంభం దగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు. ఆ వ్యక్తి ఎవరో నాకు తెలియదు. నేనతనితో "మీ మాటలు వారికి కోపాన్ని కలిగించాయనుకుంటున్నాను నేను" అని అన్నాను. దానికా వ్యక్తి "వారు బుద్ధిహీనులు. నాకీ విషయం నా ప్రాణ స్నేహితుడు తెలియజేశారు" అని అన్నాడు. "మీ ప్రాణ స్నేహితుడెవరు?" అని అడిగాను నేను.

అప్పుడా వ్యక్తి ఇలా తెలియజేశాడు: "నా ప్రాణ స్నేహితుడు దైవప్రవక్త(సల్లం). ఆయన నాతో "అబూజర్! నీకా ఉహద్ పర్వతం కన్పిస్తోంది కదూ?" అని అన్నారు. ఈ మాట విని ఇంకా ఎంత పొద్దుందోనని నేను సూర్యుని వైపు చూశాను. ఆయన నన్ను ఏదైనా పని మీద ఎక్కడికైనా పంపదలచుకున్నారేమోనని భావించాను. నేను (వెంటనే ఆలోచన నుంచి తేరుకొని) "కనిపిస్తోంది దైవప్రవక్తా!" అని అన్నాను. "నా దగ్గర ఉహద్ పర్వతమంత బంగారం ఉండి, మూడు వరహాలు తప్ప ఆ బంగారం అంతా ఖర్చు చేయకుండా అట్టి పెట్టుకోవడం నాకు (ఎంతమాత్రం) ఇష్టం లేదు" అని అన్నారు ఆయన. [దైవప్రవక్త (స) గారి ఈ ఉపదేశాన్ని వినిపించిన తరువాత హజ్రత్ అబూజర్ (రజి) ఇలా చెప్పారు]: వీరసలు బుద్ధిహీనులు. ప్రాపంచిక సంపదను కూడబెట్టుకుంటున్నారు. దైవసాక్షిగా చెబుతున్నాను; నేను దేవుడ్ని కలుసుకునే వరకు (అంటే చనిపోయే వరకు) వారిని వారి ప్రాపంచిక సంపద నుండి చిల్లిగవ్వ కూడా అడగను. అలాగే ధర్మం విషయంలో కూడా వారిని నేను ఏ మాటా అడిగి తెలుసుకోను."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 4వ అధ్యాయం - మా అదా జకాతుహూ ఫలైసబికన్జ్]

## 11వ అధ్యాయం - సత్కార్యాల్లో ధన వినియోగం - దాని ప్రతిఫలం

580. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "దేవుడు (నా కోసం) డబ్బు ఖర్చు చేయండి, నేను కూడా మీ కోసం ఖర్చు చేస్తాను" అని అన్నాడు.

"దేవుని చేయి (సకల విధాల సిరిసంపదలతో) నిండుగా ఉంది. దాన్ని రేయింబవళ్ళు నిర్విరామంగా ఖర్చు చేసినా తరగదు".

"దేవుడు భూమ్యాకాశాలను సృష్టించిన దగ్గర్నుంచి ఎంత ఖర్చు చేశాడో మీరెప్పుడైనా ఆలోచించారా? ఇంత ఖర్చు చేసినా ఆయన చేతిలో ఉన్న నిధి నిక్షేపాలలో రవ్వంత కూడా తగ్గలేదు. ఆయన సింహాసనం నీళ్ళ మీద ఉంది. ఆయన చేతిలో త్రాసు (న్యాయం) ఉంది. ఆయన తలచుకుంటే ఎవరి నైనా అధోగతి పాలు చేయగలడు. అలాగే ఆయన తలచుకుంటే ఎవరినైనా ఉచ్ఛస్థాయికి తీసుకు రాగలడు"

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 2వ అధ్యాయం - ఖౌలిహీవకాన అర్షిహీ అలల్ మాయి]

## 13వ అధ్యాయం - ఖర్చు పెట్టే క్రమం - ముందుగా తన కోసం, తరువాత తన భార్యా పిల్లలు, ఆ తరువాత బంధువులు

581. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఒక సహాబీ (ప్రవక్త అనుచరుడు) దగ్గర ఒక బానిస తప్ప మరే సంపదా లేదు. అయినా ఆ స్థితిలో ఆయన ఆ బానిసకు తన తదనంతరం స్వాతంత్ర్యం ప్రసాదించారని దైవప్రవక్త(సల్లం)కు తెలిసింది. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆ బానిసను ఎనిమిదొందల దిర్హమ్‌లకు అమ్మించి ఆపైకాన్ని ఆ సహాబి వద్దకు పంపించారు.

[సహీహ్ బుఖారీ : 93వ ప్రకరణం - అహ్కామ్, 32వ అధ్యాయం - బైయిల్ ఇమామి అలన్నాసి అమ్వాలహుమ్ వ జియా అహుమ్]

## 14వ అధ్యాయం - బంధువులకు దానం, తల్లిదండ్రులు, భార్యా పిల్లల కోసం ధనవ్యయం

582. హజ్రత్ అనస్ (రజి) కథనం:- హజ్రత్ అబూ తల్హా (రజి) మదీనాలోని అన్సార్ ముస్లింలలో కెల్లా గొప్ప ధనికులు. ఆయనకు (అనేక) ఖర్జూర తోటలు ఉండేవి. వాటిలో 'బైర్హా' అనే తోటంటే ఆయనకు ఎంతో ఇష్టం. ఈ తోట మస్జిదెనబవీ ముందు భాగాన ఉండేది. దైవప్రవక్త(సల్లం) ఆ తోటలోకి (తరచుగా) వెళ్తుండేవారు. అక్కడ లభించే మంచినీళ్ళు త్రాగేవారు. "మీకు అత్యంత ప్రీతికరమైన వస్తువుని దైవమార్గంలో ఖర్చు చేయనంత వరకు మీరు పుణ్యస్థాయికి చేరుకోలేరు" అనే ఖుర్‌ఆన్ సూక్తి (ఆలిఇమ్రాన్:92) అవతరించినపుడు హజ్రత్ అబూతల్హా లేచి ఇలా అన్నారు:

"దైవప్రవక్తా! మీకు అత్యంత ప్రీతికరమైన వస్తువుని దైవమార్గంలో ఖర్చు చేయనంతవరకు మీరు పుణ్యస్థాయికి చేరుకోలేరని దేవుడు సెలవిస్తున్నాడు. 'బైర్హా' తోట నాకత్యంత ప్రీతికరమైనది. అంచేత నేనాతోటను దైవమార్గంలో దానం చేస్తున్నాను. దైవం నుండి దాని పుణ్య ఫలాన్ని ఆశిస్తున్నాను. పరలోకంలో అది నా కోసం గొప్ప నిక్షేపంగా తయారవుతుందని నమ్ముతున్నాను. దైపప్రవక్తా! మీరు దైవాజ్ఞ ప్రకారం దాన్ని వినియోగించండి."

హదీసు ఉల్లేఖకుని కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) అప్పుడిలా అన్నారు: "చాలా మంచిది. ఇదెంతో లాభదాయకమైన సంపద. ఇది నిజంగా ఎంతో లాభదాయకమైన సంపద. నీవన్న మాటలన్నీ నేను విన్నాను. అయితే నాదొక సలహా. ఆ తోటను నీ బంధువులకు పంచిపెట్టు".

హజ్రత్ అబూతల్హా(రజి) ఇది విని "దైవప్రవక్తా! నేను మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను" అని అన్నారు. దాని ప్రకారం ఆయన ఆ తోటను తన పెదనాన్న, చిన్నాన్న కొడుకులకు, ఇతర బంధువులకు పంచి వేశారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 44వ అధ్యాయం - అజ్జకాతి అలల్ అఖారిబ్]

583. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- నేనొకసారి ఒక దాసిని బానిసత్వం నుంచి విముక్తి కలిగించాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు. "నీవా దాసిని నీ మేనమామలలో

ఎవరికైనా ఇచ్చి (నీ బంధుప్రేమను వెల్లడించుకొని) ఉంటే నీకెక్కువ పుణ్యఫలం లభించి ఉండేది."

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 16వ అధ్యాయం - బిమ(య్యుబ్దవు బిల్ హదియ్యా]

584. హజ్రత్ అబ్దుల్లా భార్య అయిన హజ్రత్ జైనబ్ (రజి) కథనం:- నేనొక సారి మస్జిదులో దైవప్రవక్త (సల్లం) స్త్రీలకు హితోపదేశం చేస్తుంటే చూశాను. ఆయన వారికి హితోపదేశం చేస్తూ "దానం చేయండి. మీ నగల్లో నుంచయినా సరే (ఏదో ఒకటి) దానం చేయండి" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకుని కథనం ప్రకారం హజ్రత్ జైనబ్ (రజి) తన భర్త కోసం, తన పోషణలో ఉన్న కొందరు అనాథ పిల్లల కోసం సంపద ఖర్చు చేస్తుండేవారు. అందువల్ల ఆమె హజ్రత్ అబ్దుల్లా (రజి) ముందు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "నేను మీ కోసం, నా పోషణలో ఉన్న అనాథ పిల్లల కోసం ఖర్చు చేస్తున్న ధనం దానంగా పరిగణించబడుతుందో లేదో కాస్త దైవప్రవక్త(సల్లం)ని అడిగి తెలుసుకోండి" అని అన్నారు. దానికి హజ్రత్ అబ్దుల్లా (రజి) "నువ్వేపోయి అడిగి తెలుసుకో" అన్నారు.

అప్పుడు నేను దైవప్రవక్త(సల్లం) దగ్గరికి వెళ్ళడానికి బయలుదేరాను. గుమ్మం దగ్గర ఒక అన్సారీ మహిళ కలిసింది. ఆమెకు కూడ ఇదే సమస్య ఎదురయి, ఈ విషయం దైవప్రవక్త(సల్లం)ను అడిగి తెలుసుకోదలచింది. అదే సమయంలో హజ్రత్ బిలాల్ (రజి) మా సమీపం నుండి ఎక్కడికో వెళ్తుంటే మేము ఆయన్ని ఆపి, "నేను నా భర్త కోసం నా పోషణలో ఉన్న అనాథ పిల్లల కోసం వినియోగిస్తున్న ధనం దానం క్రిందికి వస్తుందో లేదో కాస్త మీరు దైవప్రవక్త(సల్లం)ను అడిగి మాకు తెలియజేయండి" అని అన్నాము. అయితే దైవప్రవక్త(సల్లం) దగ్గర మా ప్రస్తావన తేరాదు అని కూడా విన్నవించుకున్నాము.

హజ్రత్ బిలాల్ (రజి) దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళి ఈ విషయం గురించి విచారించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఇలా అడుగుతున్న ఆ స్త్రీలు ఎవరు?" అని అడిగారు, "జైనబ్" అన్నారు హజ్రత్ బిలాల్ (రజి). "ఏ జైనబ్ (రజి)?" అడిగారు దైవప్రవక్త (సల్లం) మళ్ళీ. "అబ్దుల్లా భార్య" చెప్పారు హజ్రత్ బిలాల్ (రజి). "అలాగా! ఆమెకు రెండు విధాల పుణ్యఫలం లభిస్తుంది (అని తెలియజెయ్యి). ఒకటి: బంధుప్రేమకు సంబంధించిన పుణ్యఫలం, రెండు: దానం చేసినందుకు లభించే పుణ్యఫలం" అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 48వ అధ్యాయం - అజ్జకాతి అలజ్జౌజి వల్ యతామ ఫిల్ హజ్ర్]

585. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! నేను అబూ సల్మా పిల్లల కోసం ఖర్చుపెడుతున్న సంపదకు నాకేమయినా పుణ్యఫలం లభిస్తుందా? అదీగాక (వారు నా పిల్లలే కదా!) నేను వారిని అటూ ఇటూ తిరిగి అడుక్కోవడానికి వదిలి పెట్టలేను కూడా" అని అన్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నీవు వారి కోసం చేస్తున్న ఖర్చుకు నీకు (తప్పకుండా) పుణ్యఫలం లభిస్తుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 69వ ప్రకరణం - అన్నఫఖాత్, 14వ అధ్యాయం - వఅలల్ వారిసిమిస్లుజాలిక్]

586. హజ్రత్ అబూ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ఒక

ముస్లిం పుణ్యఫలాపేక్షతో తన కుటుంబ సభ్యుల (శ్రేయస్సు) కోసం ధన వినియోగం చేస్తే, ఆ ధనం అతను చేసే దానమవుతుంది."

[సహీహ్ బుఖారీ : 69వ ప్రకరణం - అన్నఫఖాత్, 15వ అధ్యాయం - ఫజ్లిన్నదఖతి అలల్ అహ్లి]

587. హజ్రత్ అస్మా బిన్తె అబూబకర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) హయాంలో ఓ సారి బహుదైవారాధకురాలిగా ఉండిన నా తల్లి నా దగ్గరకు వచ్చింది. నేనప్పుడు దైవప్రవక్త(సల్లం) ముందు ఆమె సంగతి ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! నా తల్లి (నా దగ్గరకు వచ్చింది) ఆమె ఇంకా ఇస్లాం స్వీకరించలేదు. మరి నేను ఆమెకు ఆర్థిక సహాయం అందజేయడం గాని, ఆమెపట్ల మంచిగా మసలుకోవడం గాని చేయవచ్చా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) "తప్పకుండా చేయవచ్చు. ఆమె నీ తల్లి కదా, ఆమె పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా - 29వ అధ్యాయం - అల్ హదియతుల్ ముష్రికీన్]

## 15వ అధ్యాయం - మృతుని కోసం చేసే దానం అతనికి పుణ్యం చేకూర్చుతుంది

588. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "నా తల్లి అకస్మాత్తుగా చనిపోయింది. మాట్లాడే అవకాశం గనక లభించి ఉంటే ఆమె (తన తరఫున) దానం చేయమని చెప్పి ఉండేది. మరి ఇప్పుడు నేను ఆమె తరఫున ఏదైనా దానం చేస్తే దాని పుణ్యం ఆమెకు చేరుతుందంటారా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(సల్లం) చేరుతుందని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 95వ అధ్యాయం - మౌతిల్ ఫుజా అల్‌బగ్‌తత్]

## 16వ అధ్యాయం - ప్రతి సత్కార్యం దానమే (సదఖాయే)

589. హజ్రత్ అబూ మూసా అష్ అరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తన అనుచరులతో మాట్లాడుతూ "ప్రతి ముస్లిం విధిగా దానం చేయాలి" అన్నారు. అనుచరులు అది విని "మరి ఎవరి దగ్గరైనా దానం చేయడానికి ఏమీలేకపోతే ఎలా?" అని అడిగారు. "అప్పుడు ఆ వ్యక్తి కష్టపడి సంపాదించి తానూ అనుభవించాలి, దాన్ని (పేదలకు) దానం కూడా చేయాలి" అన్నారు దైవప్రవక్త(సల్లం). "ఒకవేళ అలా చేసే శక్తి కూడ లేకపోతే? లేదా అలా కూడ చేయకపోతే?" అని మళ్ళీ అడిగారు అనుయాయులు. "అప్పుడు ఎవరైనా అగత్యపరుడు ఏదైనా ఆపదలో చిక్కుకుంటే అతడ్ని ఆదుకోవాలి" అన్నారు దైవప్రవక్త(సల్లం) . "అది కూడా చేయలేకపోతేనో?" అడిగారు అనుయాయులు తిరిగి. "(అదీ చేయలేకపోతే) మేలు చేయాలని లేక సత్కార్యాలు చేయాలని ఇతరులకు సలహాలివ్వాలి" అన్నారు దైవప్రవక్త (సల్లం). "మరి అదీ చేయలేకపోతే" అడిగారు అనుయాయులు మళ్ళీ. "(అలాంటి పరిస్థితిలో కనీసం) తాను స్వయంగా చెడు పనులు చేయకుండా, ఇతరులకు చెడు తలపెట్టకుండా ఉండాలి. ఇది కూడా దానం క్రిందకే వస్తుంది" అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 33వ అధ్యాయం - కుల్లు మారూఫిన్ సదఖాతున్]

590. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:-

"మానవుని శరీరంలో ఎన్ని కీళ్ళు ఉన్నాయో వాటిలో ప్రతి దానికీ ఒక దానం (సదఖా) విధి అయి ఉంది. ప్రతి రోజు సూర్యోదయమవుతున్నప్పుడు ఇద్దరు వ్యక్తుల మధ్య న్యాయంగా తీర్పు చెప్పడం కూడా దానం క్రిందకే వస్తుంది. ఎవరినైనా తన వాహనం మీద కూర్చోబెట్టుకోవడం లేదా వస్తు సామగ్రి ఏదైనా ఉంటే వాటిని తన వాహనం మీద గమ్యానికి చేర్చడం వంటి సత్కార్యాల ద్వారా ఇతరులకు సహాయ పడటం కూడా దానంగానే పరిగణించబడుతుంది. మంచి మాట పలకడం కూడా దానమే. నమాజు కోసం మస్జిదుకు వెళ్తున్నప్పుడు వేసే ప్రతి అడుగు దానమే. దారిలో జనానికి బాధ కలిగించే వస్తువుని తొలగించడం కూడా దానం క్రిందకే వస్తుంది''.

[సహీహ్ బుఖారీ: 56వ ప్రకరణం - జిహాద్, 128వ అధ్యాయం - మన్ అఖజ బిర్రికాబి వనహూహీ]

## 17వ అధ్యాయం - దానశీలుడు - పిసినారి

591. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలియజేశారు:- "ప్రతి రోజు ఉదయం ప్రజలు నిద్ర నుండి మేల్కొనగానే ఇద్దరు దైవదూతలు అవతరిస్తారు. వారిలో ఒకడు దైవాన్ని ప్రార్థిస్తూ 'దేవా! (దానం) ఇచ్చే వాడికి మరింత (పుణ్యఫలం) ఇవ్వు' అని అంటాడు. రెండో దూత 'దేవా! పిసినారి సంపదను నాశనం చెయ్యి' అని ప్రార్థిస్తాడు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 27వ అధ్యాయం - ఖౌలిల్లాహీ తాలా ఫ అమ్మామన్ ఆతా వత్తఖా వసద్దఖ బిల్ హుస్నా]

## 18వ అధ్యాయం - దానం స్వీకరించే వారెవరూ లభించక ముందే దానం చెయ్యి

592. హజ్రత్ హారిసా బిన్ వహబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "(సిరిసంపదలు పొంగిపొరలే) ఒక కాలం రానున్నది. అప్పుడు దానధర్మాలు చేయడానికి ఒక వ్యక్తి బయలుదేరితే అతనికి దానాన్ని స్వీకరించే వారే లభించరు. అతను ఎవరికి దానం చేయాలన్నా నా కిప్పుడు అవసరమే లేదు. నీవు నిన్న తీసుకొని వచ్చి ఉంటే నేనీ దానాన్ని స్వీకరించేవాడ్ని అని అంటాడు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 9వ అధ్యాయం - అస్సదఖతి ఖబ్లర్రద్]

593. హజ్రత్ అబూమూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ప్రజలకు సిరిసంపదలు పొంగిపొరలే ఒక కాలం ఎదురుకానున్నది. అప్పుడు ఒక వ్యక్తి బంగారం తీసుకొని దాన్ని దానం చేసే ఉద్దేశ్యంతో (వీధుల వెంబడి) తిరుగుతుంటాడు, కాని బంగారం సయితం దానంగా స్వీకరించే వారెవరూ అతనికి దొరకరు. ఆ కాలంలో పురుష జనాభా అత్యల్పంగా స్త్రీ జనాభా అత్యధికంగా ఉంటుంది. అందువల్ల ఒక్కొక్క పురుషుడి వెంట అతని ఆశ్రయం కోరుతూ నలభయ్యేసి మంది స్త్రీలు తిరుగుతుంటారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 9వ అధ్యాయం - అస్సదఖతి ఖబ్లర్రద్]

594. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "మీ దగ్గర సిరిసంపదలు పొంగిపొరిలేటంత అత్యధికంగా వచ్చి పడనంతవరకు ప్రళయం రాదు. అప్పుడు

ప్రజలు ఈ అసాధారణ ధనరాసులతో చికాకు పడుతూ వీటిని ఎవరైనా దానంగా స్వీకరిస్తే బాగుండునని భావిస్తారు (కాని దానం తీసుకునే వాళ్ళే లభించరు). ఒకడు మరొకనికి దానం చేయజూస్తే, అతను తనకు డబ్బవసరమే లేదంటాడు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 9వ అధ్యాయం - అస్సదఖతి ఖబ్లర్రద్]

## 19వ అధ్యాయం - ధర్మ సంపాదన నుండి తీసిన దానం దిన దినాభివృద్ధి అవుతుంది

595. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "దేవుని దగ్గరకు పవిత్ర వస్తువు మాత్రమే చేరుతుంది. అందువల్ల ఎవరైనా తన పవిత్ర సంపాదన నుండి ఒక ఖర్జూరపుటంత దానం చేసినాసరే దేవుడు దాన్ని కుడిచేత్తో స్వీకరిస్తాడు. ఆ తర్వాత మీరు గుర్రపు పిల్లను పెంచి పెద్ద చేసినట్లు ఆయన ఆ దానాన్ని వృద్ధి పరుస్తాడు. అలా వృద్ధి చెందుతూ చివరికది పర్వతం మాదిరిగా పెరిగిపోతుంది."

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 23వ అధ్యాయం - ఖౌలిల్లాహి తాలా - తారుజుల్ మలాయికతు వర్రూహు ఇలై]

## 20వ అధ్యాయం - దానం నరకానికి అడ్డుగోడగా నిలుస్తుంది

596. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- "ఒక ఖర్జూరపు ముక్కయినా సరే దానం చేసి నరకాగ్ని నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 10వ అధ్యాయం - ఇత్తఖున్నార వలౌ బిషిఖ్ఖితమ్రతి]

597. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "అతి త్వరలోనే దేవుడు ప్రళయదినాన మీలోని ప్రతి వ్యక్తితో ప్రత్యక్షంగా మాట్లాడుతాడు. ఆ రోజు దేవునికి, దాసునికి మధ్య ఎలాంటి అనువాదకుడు ఉండడు. దాసుడు తలపైకెత్తి చూస్తాడు. మొదట తన ముందు ఏదీ కన్పించదు. రెండవసారి మళ్ళీ తలపైకెత్తి చూస్తాడు. అప్పుడతని ముందు ఎటు చూసినా అతనికి స్వాగతం చెబుతూ అగ్నే (భగభగమండుతూ) కన్పిస్తుంది. అందువల్ల మీలో ఎవరైనా ఖర్జూరపు ముక్కయినా సరే దానం చేసి నరకం నుండి కాపాడుకోగలిగితే కాపాడుకోవాలి".

హజ్రత్ అదీ (రజి) కథనం ప్రకారమే మరో సందర్భంలో దైవప్రవక్త(సల్లం) నరకాన్ని ప్రస్తావిస్తూ "నరకాగ్ని నుండి కాపాడుకోండి" అన్నారు. ఈ మాట చెప్పి ఆయన ముఖం ఓ ప్రక్కకు తిప్పుకున్నారు. (తాను నరకాగ్నిని ప్రత్యక్షంగా చూస్తున్నట్లు) నరకాగ్ని పట్ల భీతి, అసహ్యతలు వెలిబుచ్చారు. ఆ తరువాత తిరిగి ఆయన "నరకాగ్ని నుండి రక్షించుకోండి" అన్నారు. మళ్ళీ నరకాగ్ని పట్ల భీతి, అసహ్యతలు వెలిబుచ్చుతూ ముఖాన్ని ఓ పక్కకు తిప్పుకున్నారు.

ఈ విధంగా ఆయన మూడుసార్లు చేశారు. చివరికి ఆయన నిజంగానే నరకాగ్ని చూస్తున్నారేమోనని మాకు అనుమానం వచ్చింది. ఆ తరువాత ఆయన ఇలా అన్నారు: "ఓ ఖర్జూరపు ముక్కనయినా సరే దానం చేసి నరకాగ్ని నుండి రక్షించుకోండి. అదీ దొరక్కపోతే ఓ మంచి

మాటయినా పలకండి. నోట ఓ మంచి మాట వెలువడటం కూడా దానం (సదఖా)గానే పరిగణించబడుతుంది".

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 49 వ అధ్యాయం - మన్నూ ఖిషల్ హిసాబి అజాబ్]

## 21వ అధ్యాయం - స్వల్పదానం చేసేవారిని చిన్నచూపు చూడటం, కించపరిచే మాటలనడం నిషిద్ధం

598. హజ్రత్ అబూ మస్వూద్ (రజి) కథనం:- మమ్మల్ని దానం చేయాలని ఆదేశించినపుడు మేము బరువులు మోసి సంపాదన చేసే వాళ్ళము (అందులో నుంచే కొంతదానం చేసే వాళ్ళము). ఒక రోజు హజ్రత్ అబూ అఖీల్ (రజి) తనకు కూలి క్రింద లభించిన అర్ధ 'సా' (తూకం) ఖర్జూర పండ్లను (దానంగా ఇవ్వడానికి) తీసుకు వచ్చారు. మరొక వ్యక్తి అంతకంటే ఎక్కువ తీసుకు వచ్చాడు. అప్పుడు కొందరు కపట విశ్వాసులు (కారుకూతలు కూస్తూ) "దేవునికి అతని (అంటే అబూ అఖీల్ తెచ్చిన) దానం అవసరం లేదు (ఆయన ఇలాంటి అల్పదానాన్ని ఖాతరు చేయడు), రెండవ వ్యక్తి పేరు ప్రతిష్ఠల కోసం (దానం) చేశాడు" అని అన్నారు. ఆ సందర్భంలో ఈ దైవవచనం అవతరించింది:

"మనస్ఫూర్తిగా విశ్వాసులు చేస్తున్న ధన త్యాగాలను గురించి వారు ఎత్తిపొడుస్తూ మాట్లాడుతున్నారు. కష్టపడి చెమటోడ్చి ఎంతో కొంత దైవమార్గంలో దానమిస్తున్న (నిరుపేద) విశ్వాసుల్ని ఎగతాళి చేస్తున్నారు. (అలా ఎకసక్కెం, ఎగతాళి చేస్తున్న ఈ పిసినారుల సంగతి దేవునికి బాగా తెలుసు.) దేవుడే వారిని ఎగతాళి చేస్తున్నాడు. వారి కోసం దుర్భరమైన (నరక) శిక్ష కాచుకొని ఉంది." (ఖుర్ఆన్ - తౌబా:79)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, సూరె తౌబా, 11వ అధ్యాయం - ఖౌలిహీ అల్లజీన యల్మిజూనల్ ముత్తవ్వియీన్]

## 22వ అధ్యాయం - పాలు వాడుకోవడానికి ఇతరులకు ప్రతిఫలాపేక్ష లేకుండా పాడి పశువునివ్వడం

599. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "బాగా పాలిచ్చే ఆరోగ్యవంతమైన ఒంటె ఎంత మంచి కానుక! అలాగే ఉదయం ఒక పాత్ర, సాయంత్రం ఒక పాత్ర పాలిచ్చే ఆరోగ్యవంతమైన మేక కూడా ఎంతో మంచి కానుక!!"

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 35వ అధ్యాయం - ఫజ్లిల్ మనీహ]

## 23వ అధ్యాయం - దానశీలి మరియు పిసినారి ఉపమానం

600. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) పిసినారిని, దానశీలుణ్ణి ఉక్కు కవచాలు ధరించిన ఇద్దరు వ్యక్తులతో పోల్చారు. ఆ కవచాలలో వారిద్దరి చేతులు, వక్షస్థలాలు వారి కంఠాలతో కలిపివేయబడి ఉన్నాయి. వారిలో దానశీలుడు దానం చేయడానికి ప్రయత్నించినపుడు,

అతని కవచం బాగా వదులయిపోయి అతని చేతివ్రేళ్ళ కొనలు సయితం కప్పబడే అంతగా క్రిందికి జారిపోతుంది. మరోవైపు కవచం క్రిందికి జారిపోయి అతని కాలి ముద్రలను కూడా చెరిపి వేస్తోంది. దీనికి భిన్నంగా పిసినారి దానం చేయడానికి ప్రయత్నించినపుడు, అతని కవచం బిగుసుకుపోతుంది. దాని కొండీలు ఎక్కడికక్కడ ఇరుక్కుపోతాయి. (దాంతో అతను తన చేతిని బయటికి తీయలేడు).

హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఈ ఉపమానాన్ని పేర్కొంటూ తన చేతివ్రేళ్ళను తన చొక్కాలోకి దూర్చి దాన్ని వదులు చేయడానికి ప్రయత్నించారు. మీరు గనక చూసి ఉంటే దైవప్రవక్త (సల్లం) తమ చొక్కాను వదులు చేయడానికి ప్రయత్నిస్తున్నారనీ, అయితే అది ఏ మాత్రం వదలుకావటం లేదనీ మీకు స్పష్టంగా తెలిసిపోయేది.

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 9వ అధ్యాయం - జేబుల్ ఖమీసి మిన్ ఇన్ది సద్రి వగైరిహీ]

## 24వ అధ్యాయం - తెలియక అనర్హుడికి దానం చేసినా, పుణ్యఫలం దక్కుతుంది

601. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలిపారు:- ఒక వ్యక్తి తానీ రోజు (రాత్రి) దానం చేస్తానని నిశ్చయించుకొని ఇంటి నుండి బయలుదేరాడు. అయితే అతను (తెలియక) ఒక దొంగకు దానం చేశాడు; మరునాడు ఉదయం జనం ఒక వ్యక్తి రాత్రి ఒక దొంగకు దానం చేశాడని చెప్పుకోసాగారు. ఈ మాట ఆ వ్యక్తి విని "దేవా! సకల స్తోత్రాలకు నీవే అర్హుడివి" అని అన్నాడు. తరువాత అతను తానీ రోజు (రాత్రి) మళ్ళీ దానం చేస్తానని సంకల్పించుకొని ఇంటి నుంచి బయలుదేరాడు. (కాని ఆ రోజు రాత్రి కూడా తెలియక ఒక వ్యభిచారిణి చేతికి ఆ దానం అందించాడు).

మరునాడు ఉదయం జనం మళ్ళీ, ఒక మనిషి రాత్రి ఒక వ్యభిచారిణికి దానం చేశాడని గుసగుసలాడుకున్నారు. అది విని ఆ వ్యక్తి "దేవా! సకల స్తోత్రాలకు నీవే అర్హుడివి. నా దానం వ్యభిచారిణి చేతికి చిక్కింది" అని అన్నాడు. ఆ తరువాత తానీ రోజు (రాత్రి) మళ్ళీ దానం చేస్తానని నిర్ణయించుకొని బయలుదేరాడు. అయితే (ఆ రోజు కూడా) అతను దానం ఒక ధనికుడి చేతిలో పెట్టాడు.

మరునాడు ఉదయం ప్రజల్లో, ఒకతను రాత్రి ఒక ధనికుడికి దానం చేశాడని గుసగుసలు బయలుదేరాయి. ఆ సంగతి తెలిసి "దేవా! సకల స్తోత్రాలకు నీవే అర్హుడివి. నా దానం ఒక సారి ఒక దొంగకు, మరొకసారి ఒక వ్యభిచారిణికి దొరికిపోయింది. ఇప్పుడేమో ధనికునికి చిక్కింది. దేవా! ఏమిటీ వైపరీత్యం!!" అని అన్నాడు. ఆ తరువాత (రాత్రి) ఒక వ్యక్తి కలలో కన్పించి ఇలా అన్నాడు:

"(నీ దానం స్వీకరించబడింది) దొంగ చేతికి లభించిన దానం వల్ల ఆ దొంగ (త్వరలోనే) దొంగతనాలు మానేయవచ్చు. వ్యభిచారిణికి దొరికిన దానం వల్ల ఆ వ్యభిచారిణి తన వ్యభిచార వృత్తిని వదలిపెట్టవచ్చు. అలాగే ధనికుడికి లభించిన దానం వల్ల ఆ ధనికుడు సిగ్గుపడి తనకు దేవుడు ప్రసాదించిన సంపదలో కొంత భాగం దైవమార్గంలో వినియోగించవచ్చు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 14వ అధ్యాయం - ఇజా తసద్దఖ అలాగనీ వహు లాయాలం]

## 25వ అధ్యాయం - కోశాధికారి నిజాయితీ వ్యవహారం, భర్త అనుమతితో అర్ధాంగి చేసే దానం

602. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "తన యజమాని ఆజ్ఞలను అమలు పరిచే నిజాయితీ పరుడైన ముస్లిం కోశాధికారి కూడా దానం (సదఖా)

చేసేవాడిగా పరిగణించబడతాడు. (అంటే అతనిక్కూడ దానం చేసినంత పుణ్యం లభిస్తుందన్న మాట)" లేదా మరికొన్ని సందర్భాలలో దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "ఆజ్ఞాపించినంత మేరకు, ఆజ్ఞాపించబడిన వ్యక్తికి మాత్రమే (ఏ మాత్రం కొరత చేయకుండా) పూర్తిగా, సంతోషంగా ఇచ్చివేసే నిజాయితీ పరుడైన ముస్లిం కోశాధికారి కూడా దానం చేసేవాడిగా పరిగణించబడతాడు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 25వ అధ్యాయం - అజ్రిల్ ఖాదిమి ఇజా తసద్దఖ బిఅమ్రి సాహిబి హీ గైరి ముఫ్సిద్]

603. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:- "గృహిణి తన ఇంట్లో ఉండే ఆహార సామగ్రిలో నుంచి ఏదైనా కొంత దానం చేస్తే ఆమెకు దాని పుణ్యఫలం లభిస్తుంది. కారణం, ఆమె స్వయంగా ఆ ధర్మ కార్యం చేయడమే. కాకపోతే ఆమె సంకల్పం మంచిదయి ఉండాలి. (భర్త ఆస్తికి) నష్టం కలిగించేదిగా ఉండకూడదు. పోతే సంపాదన ఆమె భర్తదయినందున (ఆమె చేసే దానం వల్ల) అతనిక్కూడా పుణ్యఫలం ప్రాప్తమవుతుంది. అలాగే కోశాధికారి తన యజమాని ఆస్తి నుండి (అతని అనుమతితో, నిజాయితీగా) ఏదైనా ఖర్చు చేస్తే అతనిక్కూడా దాని పుణ్యఫలం లభిస్తుంది. వీరంతా ఒకరి పుణ్యఫలాన్ని మరొకరు ఏ మాత్రం తగ్గించరు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 17వ అధ్యాయం - మన్ అమర ఖాదిమహూ బిస్సదఖతి వలం యునావలు బినఫ్సిహీ]

604. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "భర్త ఇంటి దగ్గర ఉండే రోజుల్లో భార్య అతని అనుమతి లేకుండా (నఫిల్) ఉపవాసం పాటించకూడదు."★

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 83వ అధ్యాయం - సౌముల్ మర్అతి బిఇజ్ని జౌజహా తతూఆ]

605. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు:- "భార్య తన భర్త అనుమతి లేకుండా అతని సంపాదన నుండి (కొంత) అతని పిల్లల కోసం, అతని బంధుమిత్రుల కోసం ఖర్చు చేస్తే ఆమె భర్తకు అర్ధపుణ్యం లభిస్తుంది."

[సహీహ్ బుఖారీ : 69వ ప్రకరణం - అన్నఫఖాత్, 5వ అధ్యాయం - నుఫఖతిల్ మర్ అతి ఇజాగాబు అన్హా జౌజహా]

## 27వ అధ్యాయం - దానధర్మాలతో పాటు ఇతర పుణ్యకార్యాలు చేసేవాడు

606. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలిపారు:- "ఎవరైనా దైవమార్గంలో (ఒకటికి బదులు) రెండు వస్తువులు ఇస్తే (మరణానంతరం) అలాంటి వ్యక్తిని (దైవదూతలు) స్వర్గ ద్వారం నుండి పిలుస్తూ "దైవదాసుడా! ఇక్కడికి వచ్చెయ్యి. ఈ ద్వారం బాగుంది" అని అంటారు. నమాజు చేసే వ్యక్తి అయితే అతడ్ని ప్రార్థనా ద్వారం నుండి పిలుస్తారు. ధర్మపోరాటం (జిహాద్) చేసే వ్యక్తి అయితే అతడ్ని ధర్మపోరాటపు ద్వారం నుండి పిలుస్తారు. ఉపవాసాలు పాటించే వాడయితే అతడ్ని ఉపవాస ద్వారం నుండి పిలుస్తారు. దానధర్మాలు చేసేవాడయితే అతడ్ని దాన ద్వారం నుండి పిలుస్తారు."

★ ఈ సంకలనంలో హదీసు మూలం బుఖారీ గ్రంథం నుండి విషయసూచిక ముస్లిం గ్రంథం నుండి తీసుకోవడం వల్ల ఇక్కడ పేర్కొన్న ఈ హదీసు దీని ప్రకరణంతో సంబంధం లేని హదీసుగా కన్పిస్తోంది. మూలగ్రంథాలు రెండూ పరిశీలించిన తరువాతనే కారణం అర్థమవుతుంది. - అనువాదకుడు

హజ్రత్ అబూ బకర్ (రజి) ఈ మాటలు విని "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం! అన్ని ద్వారాల నుండి పిలువబడే వ్యక్తి కూడా ఉంటాడా? ఇలా అన్ని ద్వారాల నుండి పిలువబడే వ్యక్తి ఎలాంటి కర్మలు చేయవలసి ఉంటుంది?" అని అడిగారు. దీనికి దైవప్రవక్త (స) సమాధానమిస్తూ "మీరు అలాంటి వారిలోని వారే అవుతారని నాకు నమ్మకం ఉంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 4వ అధ్యాయం - అర్రయ్యాను లిస్సాయిమీన్]

607. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రబోధించారు:- "ఎవరైనా దైవమార్గంలో (ఒకటికి బదులు) రెండు వస్తువులు ఇస్తే, (మరణానంతరం) అలాంటి వ్యక్తిని స్వర్గంలోని ప్రతి ద్వారపాలకుడు ఆహ్వానిస్తూ 'ఓ మానవా! ఇటు వైపు వచ్చెయ్యి' అని అంటాడు."

హజ్రత్ అబూ బకర్ (రజి) ఈ మాటలు విని "దైవప్రవక్తా! అలాంటి వ్యక్తికయితే ఇక భయమే లేదు. (కోరిన ద్వారం గుండా నిరభ్యంతరంగా స్వర్గంలో ప్రవేశించవచ్చు)" అని అన్నారు. (ఆ తరువాత) దైవప్రవక్త(స) మాట్లాడుతూ "మీరు కూడా అలాంటి వ్యక్తులలో ఉంటారని నేను నమ్ముతున్నాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్ వస్సైర్, 37వ అధ్యాయం - ఫజ్లున్నుఫఖా ఫీ సబీలిల్లాహ్]

## 28వ అధ్యాయం - సంపద పంపిణీ ప్రశంసనీయం, కూడబెట్టడం గర్హనీయం

608. హజ్రత్ అస్మా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా బోధించారు:- "(దైవమార్గంలో ఉదారంగా) ఖర్చు పెట్టు. లెక్కపెట్టకు. లెక్కపెట్టి ఇస్తే దేవుడు కూడా నీకు లెక్కపెట్టి మరీ ఇస్తాడు. (అంటే నీ పట్ల ఉదారంగా వ్యవహరించడు). అలాగే కూడ బెట్టి ఉంచకు. అలా చేస్తే దేవుడు కూడా (పుణ్యఫలాన్ని నీకు ప్రసాదించకుండా) ఆపి ఉంచుతాడు."

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 15వ అధ్యాయం - హిబ తిల్ మర్ అతి బిగైరి జౌజిహా]

## 29వ అధ్యాయం - దానంగాను, పారితోషికంగాని ఎంత చిన్న వస్తువైనా దాన్ని అల్పమైనదిగా భావించకూడదు

609. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా హితోపదేశం చేశారు:- "ముస్లిం మహిళల్లారా! మీలో ఏ ఒక్కరూ తమ పొరుగింటి స్త్రీలను కించపరచకూడదు. వారొకవేళ (పారితోషికంగా) మీకు ఒక మేక గిట్ట పంపినా సరే (దాన్ని) గౌరవించి స్వీకరించండి. నిరాకరించి వారిని కించపరచకండి."★

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా; 1వ అధ్యాయం - అల్‌హిబా వ ఫజ్లిహా...]

## 30వ అధ్యాయం - గుప్తదానం - దాని ప్రాముఖ్యత

610. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:-"దేవుని (కారుణ్య)

★ ఇక్కడ మేక గిట్ట అంటే అత్యల్ప వస్తువని అర్థం. కనుక పారితోషికం ఇచ్చేవారు ఇంతటి అల్ప వస్తువు ఎలా ఇవ్వాలని అనుకోకూడదని, స్వీకరించేవారు దాన్ని విలువలేని అల్పవస్తువని భావించకుండా సంతోషంగా స్వీకరించి కృతజ్ఞత చెప్పాలని ఈ హదీసు బోధిస్తోంది.

ఛాయ తప్ప మరెలాంటి ఛాయ లభించని (ప్రళయ) దినాన దేవుడు ఏడుగురు వ్యక్తులను తన నీడ పట్టున ఆశ్రయమిస్తాడు. వారిలో (1) న్యాయంగా పాలన చేసే పరిపాలకుడు; (2) తన యౌవన జీవితం (వ్యర్థకార్యకలాపాల్లో గడపకుండా అంతిమ శ్వాస వరకూ) దైవారాధనలో గడిపిన యువకుడు; (3) మనసంతా మస్జిదులోనే ఉండేటటువంటి వ్యక్తి (అంటే ఉద్యోగం, వ్యాపారం తదితర ప్రపంచ వ్యవహారాల్లో నిమగ్నుడయిపోయినా ధ్యాసంతా మస్జిదు వైపు ఉండేటటువంటి మనిషన్న మాట), (4) కేవలం దైవప్రసన్నత కోసం పరస్పరం అభిమానించుకునే, దైవప్రసన్నత కోసమే పరస్పరం కలుసుకొని విడిపోయే ఇద్దరు వ్యక్తులు; (5) అంతస్తు, అందచందాలు గల స్త్రీ అసభ్యకార్యానికి పిలిచినప్పుడు, తాను దైవానికి భయపడుతున్నానంటూ ఆమె కోరికను తిరస్కరించిన వ్యక్తి; (6) కుడి చేత్తో ఇచ్చింది ఎడమచేతికి సయితం తెలియనంత గోప్యంగా దానధర్మాలు చేసిన వ్యక్తి; (7) ఏకాంతంలో దైవాన్ని తలచుకొని కంట తడి పెట్టే వ్యక్తి.''

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 36వ అధ్యాయం - మన్ జలస ఫిల్ మస్జిది యన్తజిరుస్సలాతి వ ఫజ్లిల్ మసాజిద్]

## 31వ అధ్యాయం - ఆరోగ్య స్థితిలో ఎక్కువ ధనాశ కలిగి ఉన్నప్పుడు చేసే దానమే అత్యంత శ్రేష్ఠమైనది

611. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒకతను దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి ''దైవప్రవక్తా! ఎవరి దానధర్మాల పుణ్యఫలం అందరికంటే అధికంగా ఉంటుంది?'' అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) ఇలా సమాధానమిచ్చారు:

''నీవు ఆరోగ్యంగా ఉండి, అత్యధిక ధనాశ కలిగి ఉన్న రోజుల్లో (ఖర్చు చేస్తే) పేదవాణ్ణయిపోతానన్న భయంతో పాటు ధనికుడయిపోవాలన్న కోరిక కలిగి ఉన్నప్పటికీ చేసే దానం అత్యంత శ్రేష్ఠమైనది. కనుక దానం చేయడంలో నీవు అంత్యకాలం దాపురించే దాకా వేచి ఉండకు. ప్రాణం కంఠంలోకి వచ్చి కొన ఊపిరితో కొట్టుకునే స్థితి వచ్చినప్పుడు నేను ఫలానా వ్యక్తికి అంతిస్తాను, ఫలానా మనిషికి ఇంతిస్తాను అని చెబితే ఎలాంటి ప్రయోజనం ఉండదు. ఇప్పుడది ఫలానా, ఫలానా వారిదయిపోయినట్లే (నీవిచ్చేదేమీ లేదు).''

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 11వ అధ్యాయం - అయ్ అస్సదఖ అఫ్జల్]

## 32వ అధ్యాయం - ఇచ్చే చేయి ఎప్పుడూ పైనే, పుచ్చుకునే చేయి ఎప్పుడూ క్రిందనే

612. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) వేదిక మీద ప్రసంగిస్తూ ''దానం చేయడం, (భిక్షం) అడగటం, అడగకపోవడం గురించి ప్రస్తావించారు. ఆ సందర్భంలో ఆయన ''క్రింది చేయికంటే పైచేయి ఎంతో శ్రేష్ఠమైనది. పై చేయి అంటే ఇచ్చే, ఖర్చు పెట్టే చేయి. క్రింది చేయి అంటే అడిగి తీసుకునే చేయి'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 18వ అధ్యాయం - లా సదఖత ఇల్లా అన్ జహ్రిగ్నీ]

613. హజ్రత్ హకీం బిన్ హిజామ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- ''క్రింది

చేయి కంటే పై చేయి శ్రేష్ఠమైనది. మొదట మీ పోషణలో ఉన్న వారికి దానం చేయండి. దానమిచ్చిన తరువాత కూడా మనిషి ధనవంతుడిగా ఉండిపోతే అలాంటి వ్యక్తి చేసే దానమే ఎంతో శ్రేష్ఠమైనది. (దానం) అర్థించడం మానుకున్న వ్యక్తికి దేవుడు దేవురించే అవమానం నుండి కాపాడుతాడు. దాన స్వీకారాన్ని లక్ష్యపెట్టకుండా మసలుకునే వాడికి దేవుడు కలిమిని ప్రసాదిస్తాడు.''

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 18వ అధ్యాయం - లా సదఖత ఇల్లా అన్ జహ్రిగ్నీ]

614. హజ్రత్ హకీమ్ బిన్ హిజామ్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(స)ను (కొంతధనం) అడిగితే ఆయన ఇచ్చివేశారు. నేను (అది చాలక) మళ్ళీ అడిగాను. దైవప్రవక్త(స) నాకు మరికొంత ప్రసాదించారు. నేను (తృప్తి చెందక) మళ్ళీ అడిగాను. ఆయన నాకు మరికాస్త ప్రసాదించి ఇలా అన్నారు: "హకీమ్! ఈ ప్రాపంచిక సంపద (పైకి) ఎంతో పచ్చపచ్చగా మధురంగా ఉండవచ్చు. కాని దాన్ని ఆత్మ సంతృప్తితో తీసుకునే వ్యక్తికి అందులో శుభం కలుగుతుంది. అత్యాశతో అడిగే వాడికి అందులో ఎలాంటి శుభం ఉండదు. అతను ఎంత తిన్నా కడుపునిండని వ్యక్తిలాంటివాడు. (గుర్తుంచుకో) ఇచ్చే చేయి పుచ్చుకునే చేయి కంటే ఎంతో శ్రేష్ఠమైనది.''

అప్పుడు హజ్రత్ హకీం (రజి) ఇలా అన్నారు: "దైవప్రవక్తా! మిమ్మల్ని సత్యాన్నిచ్చి పంపిన ఆ ప్రభువు సాక్షిగా చెబుతున్నాను. నేనీ క్షణం నుంచి ఇహలోకం వీడిపోయే వరకు ఏ వస్తువు కోసం ఎవరి ముందూ చేయిజాపను.''

అందువల్ల హజ్రత్ అబూ బకర్ (రజి) తన పాలనాకాలంలో (ధనధాన్యాలు) ఇవ్వడానికి హజ్రత్ హకీం (రజి)ని ఎన్నిసార్లు పిలిపించినా ఆయన వెళ్ళి (వాటిని) స్వీకరించడానికి నిరాకరించేవారు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) కూడా (తన పాలనా కాలంలో ధనధాన్యాలు) ఇవ్వడానికి హజ్రత్ హకీం (రజి)ని అనేకసార్లు పిలిపించారు. కాని హజ్రత్ హకీం (రజి) ఆయన దగ్గర్నుంచి కూడా స్వీకరించడానికి నిరాకరించేవారు. దాంతో హజ్రత్ ఉమర్ (రజి) ఓ రోజు ప్రజలను సంబోధిస్తూ "ముస్లింలారా! నేను యుద్ధప్రాప్తి నుండి హజ్రత్ హకీం (రజి)కు రావలసిన భాగాన్ని తీసి ఆయనకు ఇవ్వబోతున్నప్పుడల్లా ఆయన దాన్ని స్వీకరించడానికి నిరాకరిస్తున్నారు. దీనికి సాక్షులుగా నేను మిమ్మల్ని నిలబెడుతున్నాను'' అని అన్నారు.

ఈ విధంగా హజ్రత్ హకీం (రజి) దైవప్రవక్త(స) నుండి దానం స్వీకరించిన నాటి నుండి చనిపోయే రోజు వరకూ ఎన్నడూ ఎవరి నుండీ, ఎలాంటి వస్తువూ తీసుకోలేదు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 50వ అధ్యాయం - అల్ ఇస్తిఅఫాఫి అనిల్ మస్ అల]

## 33వ అధ్యాయం - భిక్షాటన గురించి....

615. హజ్రత్ ముఆవియా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ఉపదేశించారు:- "దేవుడు ఎవరి శ్రేయస్సు కోరుకుంటాడో అతనికి ధర్మావగాహనా శక్తిని ప్రసాదిస్తాడు. నేను (సంపద) పంపిణీ చేసేవాణ్ణి మాత్రమే. ప్రసాదించేవాడు దేవుడు. (గుర్తుంచుకోండి) ఈ (ముస్లిం) సమాజం సత్య ధర్మంపై స్థిరంగా ఉంటుంది. (ఇలా సత్యధర్మంపై స్థిరంగా ఉన్నంత కాలం) వారికి వారి విరోధులు

ప్రళయం వచ్చే దాకా ఎలాంటి నష్టం కలిగించలేరు.(1)
[సహీహ్ బుఖారీ: 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 13వ అధ్యాయం - మన్‌యురిదిల్లాహు బిహీ ఖైరన్ యుఫఖ్ఖిహు ఫిద్దీన్]

## 34వ అధ్యాయం - దరిద్రుడిగా కన్పించని నిరుపేద

616. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : "నిరుపేద అంటే వీధుల వెంబడి తిరుగుతూ ఒకటి రెండు ముద్దలు లేక ఒకటి రెండు ఖర్జూరపు పండ్లు అడుక్కునేవాడు కాదు. సిసలైన నిరుపేద అంటే ఇతరుల్ని అర్థించనవసరం లేనంత ఆర్థిక స్థోమత లేనివాడు. అటు దానం చేయడానికి ప్రజల దృష్టిలో అతనంత పేదవాడిగా కూడా కన్పించడు. పైగా అతను ప్రజల ముందు దేబిరిస్తూ తిరగడు." (2)

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 53వ అధ్యాయం - ఖౌలిల్లాహి తాలా లాయస్ అలూనన్నాస ఇల్ హీఫా]

## 35వ అధ్యాయం - భిక్షాటన అవాంఛనీయమైన చర్య

617. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా హితోపదేశం చేశారు:- "ఎల్లప్పుడూ ప్రజల దగ్గర అడుక్కుంటూ ఉండేవాడు ప్రళయదినాన ముఖాన ఒక్క మాంసపు తునకైనా లేనివాడై (వికృత ముఖాకృతితో) వస్తాడు."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 52వ అధ్యాయం - మన్‌సఅలన్నాస తకస్సురా]

618. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "లోకుల దగ్గర ముష్టెత్తడం కన్నా (అడవి నుండి) కట్టెల మోపు మోసుకొచ్చి అమ్ముకుని తినడం మనిషికి ఎంతో మేలు. వారు (దానం చేసేవారు) అతనికి ఏదైనా (దానం) ఇవ్వవచ్చు లేదా ఇవ్వడానికి నిరాకరించనూ వచ్చు."

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 15వ అధ్యాయం - కస్బుర్రజులి వ వఅమలిహీ బియదిహీ]

## 37వ అధ్యాయం - అర్థింపు, అత్యాశలు లేని పక్షంలో ఎవరైనా దానం చేస్తే దాన్ని స్వీకరించవచ్చు

619. హజ్రత్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) నాకేదయినా ప్రసాదిస్తున్నప్పుడు "దీన్ని అతని కివ్వండి. నా కంటే అతనికి దీని అవసరం ఎక్కువగా ఉంది" అని అనేవాణ్ని నేను. ఈ విషయం

---

(1) ఈ సంకలనంలో హదీసు మూలం బుఖారీ గ్రంథం నుండి, విషయ సూచిక ముస్లిం గ్రంథం నుండి తీసుకోవడం వల్ల ఇక్కడ పేర్కొన్న హదీసు ఈ ప్రకరణంతో సంబంధం లేని హదీసుగా కనిపిస్తోంది. ఈ హదీసు గురించి సహీహ్ ముస్లింలో అదనంగా ఇలా ఉంది: "నేను కోశాధికారిని మాత్రమే. నా అంతట నేను ఎవరికైనా సంతోషంగా ఏదైనా ఇస్తే అందులో శుభం ఉంటుంది. అడిగి వేధించే వాడికి ఇస్తే, అతను ఎంత తిన్నా కడుపు నిండని వాడులాంటి వాడవుతాడు."

(2) దివ్యఖుర్‌ఆన్‌లోని "ఈ జకాత్ నిధులు నిరుపేదలకు, కనీస అవసరాలు సయితం తీరని వారికి..... " (9:60) అనే సూక్తిలో 'మిస్కీన్' అనే పదం వచ్చింది. దీన్నే ఇక్కడ ఈ హదీసు విశదీకరిస్తోంది.

గురించి (ఓ రోజు) దైవప్రవక్త (స) ప్రస్తావిస్తూ "అత్యాశకు పోకుండా ఉండి, అర్థించకుండానే మీకేదయినా సంపద లభిస్తే నిరభ్యంతరంగా తీసుకోండి. అలా లభించకపోతే దాన్ని గురించి పట్టించుకోకండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 51వ అధ్యాయం - మన్ అతాహుల్లాహు షైఅమ్మిన్ గైరి మస్ అలతి వల అష్రాఫి నఫ్సిన్]

## 38వ అధ్యాయం - ప్రాపంచిక వ్యామోహం గర్హనీయం

620. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "రెండు విషయాల్లో వృద్ధుని మనస్సు కూడా యువ మనస్సయిపోతుంది. ఒకటి, ప్రాపంచిక వ్యామోహం. రెండు, చాలా కాలం బ్రతకాలన్న కోరిక".

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 5వ అధ్యాయం - మన్ బలగ సిత్తీన సనతా....]

621. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రబోధించారు:- "మానవుడు ఒకవైపు వృద్ధుడైపోతూ ఉంటే, మరో వైపు అతనిలో రెండు విషయాలు అధికమవుతూ ఉంటాయి. ఒకటి:- ధనవ్యామోహం. రెండు: దీర్ఘాయుష్షు పట్ల కోరిక."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 5వ అధ్యాయం - మన్ బలగ సిత్తీన సనతా......]

## 39వ అధ్యాయం - మానవునికి బంగారు లోయలు రెండు లభించినా మూడో దానికోసం అర్రులు చాచుతాడు

622. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలిపారు:- "ఈ మానవుడికి బంగారంతో నిండిన ఒక అరణ్యం లభించినా సరే, అలాంటి మరో అరణ్యం దొరికితే బాగుండునని భావిస్తాడు. అతని కడుపు (సమాధి) మట్టితో మాత్రమే నిండుతుంది. అయితే ప్రాపంచిక వ్యామోహం విడనాడి దేవుని వైపుకు మరలితే అలాంటి వ్యక్తిని దేవుడు మన్నిస్తాడు. అతని ప్రాయశ్చిత్తాన్ని స్వీకరిస్తాడు. (అతనికి ఆత్మ సంతృప్తి భాగ్యం ప్రసాదిస్తాడు.)

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్; 10వ అధ్యాయం - మా యత్తఖా మిన్ ఫిత్నతిల్ మాల్]

623. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "మానవునికి సిరిసంపదలతో నిండిన ఓ పెద్ద అరణ్యం లభించినప్పటికీ, అలాంటి మరో అరణ్యం దొరికితే బాగుండునని భావిస్తాడు. అతని పేరాశ కడుపు (సమాధి) మట్టితో మాత్రమే నిండుతుంది. అయితే ప్రాపంచిక వ్యామోహం వదలి పశ్చాత్తాప హృదయంతో దేవుని వైపుకు మరలితే అలాంటి వ్యక్తిని దేవుడు మన్నిస్తాడు. అతని పశ్చాత్తాపాన్ని స్వీకరిస్తాడు (అతనికి ఆత్మ సంతృప్తి భాగ్యం ప్రసాదిస్తాడు.)"

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 10వ అధ్యాయం - మాయత్తఖా మిన్ ఫిత్నతిల్ మాల్]

## 40వ అధ్యాయం - శ్రీమంతుడంటే సిరిసంపదలున్నవాడు కాదు

624. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు:- "అత్యధిక సిరిసంపదలతో కలిమి రాదు. నిజమైన కలిమి ఆత్మ సంతృప్తి వల్లనే ఒనగూడుతుంది."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 15వ అధ్యాయం - అల్ గినా గినన్నఫ్స్]

## 41వ అధ్యాయం - ప్రాపంచిక సిరిసంపదల సౌందర్యం ఒక మాయ మాత్రమే

625. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఓసారి మాతో మాట్లాడుతూ, "మీ విషయంలో నాకు భూశుభాలను గురించి ఎక్కువ భయంగా ఉంది" అని అన్నారు. అప్పుడు ఒకతను "భూశుభాలు అంటే ఏమిటీ" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) "భూశుభాలు అంటే ప్రాపంచిక సిరిసంపదలు" అని సమాధానమిచ్చారు. అప్పుడు మరొకతను "మంచి నుండి చెడు జనిస్తుందా?" అని అడిగాడు.

ఈ మాట విని దైవప్రవక్త(స) మౌనంగా ఉండిపోయారు. అలా చాలా సేపు ఉన్నారు. దాంతో మాకు దైవప్రవక్త (స)పై వహీ అవతరిస్తుందేమోనని అనుమానం వచ్చింది. ఆ తరువాత దైవప్రవక్త (స) నుదుటికి పట్టిన చెమట తుడుచుకుంటూ "ప్రశ్న అడిగిన ఆ వ్యక్తి ఎక్కడున్నాడు?" అని అడిగారు. అప్పుడావ్యక్తి "నేను ఇక్కడే ఉన్నానండీ" అన్నాడు.

హజ్రత్ అబూ సయీద్ (రజి) ఇంకా ఇలా తెలుపుతున్నారు: అప్పుడు మేము పరిస్థితి గ్రహించి ఆ వ్యక్తిని ప్రశంసించసాగాము. సరే, ఆ తరువాత దైవప్రవక్త(స) ఈ విధంగా అన్నారు:

"మంచి విషయం వల్ల ఎప్పుడూ మంచే జరుగుతుంది. అయితే ఈ ప్రాపంచిక సంపద (పైకి) తళుకు బెళుకులతో కళకళలాడుతూ, రుచిల్లో ఎంతో మధురంగా ఉంటుంది. వర్షాకాలంలో ఏపుగా పెరిగి నయనానందకరంగా ఉండే పచ్చికను గనక పశువు మితిమీరి మేస్తే (అజీర్తితో) దాని పొట్ట ఉబ్బిపోతుంది. దాంతో అది చావనయినా చస్తుంది లేదా చావు దరిదాపులకైనా చేరుతుంది. దీనికి భిన్నంగా ఆ పశువు కాస్త మితంగా పచ్చిక మేసి, కడుపు నిండగానే ఎండలో కెళ్ళి నిలబడి నెమరు వేసి, మలమూత్ర విసర్జన తరువాత తిరిగొచ్చి మేస్తుంటే (నష్టమేమీ ఉండదు.) ఈ ప్రాపంచిక ఐశ్వర్యం కూడా అలాంటిదే. ఇది పైకి ఎంతో ఆకర్షవంతంగా, రుచిలో మధురంగా ఉంటుంది. అందువల్ల దీన్ని (అవసరమైనంత మేరకు) ధర్మయుక్తంగా సంపాదించి ధర్మయుక్తంగా వినియోగించాలి. అప్పుడే అది మనిషికి సత్ఫలాన్నిస్తుంది. దానికి బదులు అధర్మంగా, అక్రమంగా తనకు లభించవలసిన దానికంటే ఎక్కువ సంపాదించి తినేవాడు, ఎంత తిన్నా కడుపునిండని వాడితో సమానుడవుతాడు."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 7వ అధ్యాయం - మా యుహ్జరు మిన్ జహ్రతిద్దున్యా వత్తనాఫుసి ఫీహా]

626. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఒకరోజు దైవప్రవక్త(స) వేదికపై కూర్చొని ఉన్నారు. మేమంతా ఆయన చుట్టూ చేరి కూర్చున్నాము. అప్పుడు ఆయన మాట్లాడుతూ "నేను ఇహలోకం వీడిపోయిన తరువాత మీరు ప్రాపంచిక వ్యామోహంలో పడిపోతారేమోనని మీ గురించి నాకు

భయంగా ఉంది. ప్రాపంచిక సిరిసంపదలు (వెల్లువలా) మీ ముందుకు వచ్చి పడతాయి" అని అన్నారు.

ఆ సందర్భంలో ఒక వ్యక్తి లేచి "అయితే దైవప్రవక్తా! మంచి వల్ల చెడు కూడా జనిస్తుందా?" అని అడిగాడు. దైవప్రవక్త(స) ఈ మాట విని మౌనంగా ఉండిపోయారు. అప్పుడు కొందరు ఆ వ్యక్తిని నిందిస్తూ "నువ్వెందుకు అలాంటి ప్రశ్న అడిగావు. దాని వల్ల దైవప్రవక్త(స) సమాధానం ఇవ్వకుండా మౌనంగా ఉండిపోయారు చూడు" అని అన్నారు.

దైవప్రవక్త(స) మౌనంగా ఉండిపోవడం చూసి ఆయనపై 'వహీ' అవతరిస్తుందేమోనని అనుకున్నాము మేము మనసులో. కాస్సేపటికి ఆయన ముఖమ్మీది చెమట తుడుచుకుంటూ "ప్రశ్న అడిగినవాడు ఎక్కడున్నాడు?" అని అడిగారు అతని ప్రశ్న తనకు నచ్చినట్లుగా. తరువాత ఆయన ఇలా అన్నారు: "నిజమే. మంచి నుండి చెడు పుట్టదనడంలో ఎలాంటి సందేహం లేదు. కాని వసంత రుతువులో మొలచే వృక్ష సంపద సాధారణంగా పశువుల్ని హతమార్చుతుంది. లేదా చావుకు దగ్గరగా చేర్చుతుంది. అయితే కడుపు నిండా తిన్న తరువాత ఎండలో వెళ్ళి (నిలబడి) నెమరువేసి, మలమూత్ర విసర్జన తరువాత తిరిగొచ్చి మళ్ళీ బాగా మేసే పశువులకు అలాంటి ప్రమాదం ఉండదు. ఈ ప్రాపంచిక సిరిసంపదలు కూడా ఎంతో ఆకర్షవంతంగా, పచ్చపచ్చగా రుచిలో ఎంతో మధురంగా ఉంటాయి.★ నిరుపేదలకు, అనాధలకు, బాటసారులకు దానం చేసే ముస్లింలకు మాత్రమే ఈ సిరిసంపదలు మేలు చేర్చుతాయి."

లేదా చివర్లో దైవప్రవక్త (స) ఇలా అన్నారు (హదీసు ఉల్లేఖకునికి ఇక్కడ సరిగా గుర్తులేదు). "ప్రాపంచిక సిరిసంపదల్ని అధర్మంగా, అక్రమంగా ఆర్జించేవాడు ఎంత తిన్నా కడుపు నిండని వ్యక్తిలాంటివాడు. ప్రళయదినాన అలాంటి వ్యక్తికి వ్యతిరేకంగా (అతను సంపాదించిన) ఈ ధనమే సాక్ష్యమిస్తుంది."

**[సహీహ్ బుఖారీ: 24వ ప్రకరణం - జకాత్, 47వ అధ్యాయం - అస్సదఖతి అలల్ యతామా]**

## 42వ అధ్యాయం - ముష్టెత్తకుండా లేమిలో సహనం వహించడం

627. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- కొందరు అన్సార్ ముస్లింలు దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి కొంత ధనం అర్థించారు. దైవప్రవక్త(స) వారికి ఇచ్చారు. కాని వారు మళ్ళీ అడిగారు. దైవప్రవక్త (స) రెండోసారి కూడా ఇచ్చారు. ఇలా ఇస్తూపోయారు, చివరికి ఆయన దగ్గర ఉన్నదంతా హరించుకుపోయింది. అప్పుడు ఆయన ఇలా అన్నారు:

---

★ ఇమాం నవవీ (రహ్మలై) తన 'ముస్లిం వ్యాఖ్యాన గ్రంథం'లో ఈ హదీసు భావాన్ని ఇలా వివరించారు:- "మీకు లభించే ప్రాపంచిక పటాటోపం, తళుకు బెళుకుల్లో ఎలాంటి శ్రేయస్సు లేదు. పైగా అందులో పరీక్ష ప్రమాదం ఉంది. అంటే దీని పర్యవసానం పేరాశ, ప్రగల్భాలు, అలజడి, అరాచకాల రూపంలో బహిర్గతమవుతుంది. మనిషి ప్రాపంచిక భోగ భాగ్యాల్లో మునిగిపోతే పరలోకాన్ని మరిచిపోతాడు. వర్షాకాలంలో మితిమీరిన పచ్చిక తిన్నపశువు పొట్ట ఉబ్బి చచ్చిపోతుంది. ఈ ప్రాపంచిక సిరిసంపదలు కూడా వర్షాకాలంలో పెరిగిన పచ్చికలానయనానందకరంగా ఉండి మానవుల్ని ఆకర్షించుకుంటాయి. వారిని మాటి మాటికి ఊరిస్తూ చపలచిత్తుల్ని చేస్తాయి. చివరికి అవి వారి పరలోక జీవితాన్ని సర్వనాశనం చేస్తాయి. అయితే ఆత్మసంతృప్తితో వాటిని అవసరమైన మేరకు మాత్రమే వాడుకునే వారికి ఎలాంటి హాని జరగదు."

"నా దగ్గరున్న ధన సంపద (ఎంతైనా) మీ కివ్వడానికి నాకెలాంటి అభ్యంతరం లేదు. మీకు ఇవ్వకుండా నేను ఏదీ దాచుకోను. కాని (ఒక విషయం గుర్తుంచుకోండి) దానం అడగకుండా ఉండే వాడికి దేవుడు అలాంటి పరిస్థితి రాకుండా కాపాడుతాడు. నిరపేక్షా వైఖరిని అవలంబించేవాడికి దేవుడు అక్కరలేనంతగా ప్రసాదిస్తాడు. సహనం వహించే వాడికి సహనశక్తి ప్రసాదిస్తాడు. (దైవానుగ్రహాలలో) సహనానికి మించిన మహాభాగ్యం లేదు."

[సహీహ్ బుఖారీ: 24వ ప్రకరణం - జకాత్, 50వ అధ్యాయం - అల్ ఇస్తిఫాఫి అనిల్ మస్అల]

## 43వ అధ్యాయం - ఆత్మ తృప్తితో మెలగటం, అవసరమైన మేరకే అర్థించటం

628. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రార్థించారు:- "దేవా! ముహమ్మద్ సంతతికి అవసరమయిన మేరకు (మాత్రమే) ఆహారం తదితర సామగ్రిని అనుగ్రహించు."

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 17వ అధ్యాయం - కైఫకాన ఐషున్నబీ (స) వ అస్హాబిహీ వతఖిల్లీ హిమ్ మినద్దున్యా]

## 44వ అధ్యాయం - అనాగరికంగా, కటువుగా అడుక్కునేవాడు

629. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- నేనొక రోజు దైవప్రవక్త(స)తో కలసి నడుస్తున్నాను. ఆ సమయంలో ఆయన నజ్రాన్ కండువా కప్పుకొని ఉన్నారు. దాని అంచులు లావుగా ఉండేవి. దారిలో ఓ పల్లెవాసి కలసి దైవప్రవక్త (కండువా)ను పట్టి గట్టిగా లాగాడు. అలా గట్టిగా లాగడం వల్ల ప్రవక్త(స) భుజం మీద కండువా అంచులు గీరుకుపోయి ఆ ప్రదేశం కందిపోయింది. పల్లెవాసి అంతటితో ఊరుకోక (కటువుగా) మాట్లాడుతూ "మీకు దేవుడిచ్చిన సొమ్ములో నుంచి నాక్కొంచెం ఇప్పించలేరా!" అని అన్నాడు. దైవప్రవక్త(స) అతని వైపు తిరిగి చూసి చిరునవ్వు నవ్వుతూ అతనికి కొంత ధనం ఇవ్వమని (అనుచరుల్ని) ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 19వ అధ్యాయం - మాకానన్నబియ్యు.....]

630. హజ్రత్ మిస్వర్ బిన్ మఖ్రమా (రజి) కథనం:- ఓసారి దైవప్రవక్త(స) చొక్కాలు పంచారు. (మా నాన్న) మఖ్రమా (రజి)కు ఒక్క చొక్కా కూడా దొరకలేదు. అప్పుడాయన నాతో "బాబూ! నువ్వు నాతో పాటు రా. దైవప్రవక్త(స) దగ్గరికి వెళ్దాం" అని అన్నారు. నేను ఆయన వెంట వెళ్ళాను. అక్కడకు చేరుకున్న తరువాత "నువ్వు లోపలికి వెళ్ళి ఆయన్ని పిలుచుకురా" అన్నారు ఆయన. నేను వెళ్ళి దైవప్రవక్త(స)కు విషయం తెలియజేశాను. దైవప్రవక్త(స) బయటికి వచ్చారు. ఆ సమయంలో ఆయన పంచిన చొక్కాలలో ఒక చొక్కా ధరించి ఉన్నారు. దైవప్రవక్త(స) మా నాన్నతో "ఇదిగో నేనీ చొక్కా నీ కోసం దాచి ఉంచాను" అని అన్నారు. ( ఆ చొక్కా ఇచ్చిన తరువాత) దైవప్రవక్త(స) మఖ్రమా (రజి) వైపు చూసి, "మఖ్రమా ఇప్పుడు సంతోషంగా ఉన్నాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 19వ అధ్యాయం - కైఫ యుఖ్బజుల్ అబ్దు వల్ మతావు]

## 45వ అధ్యాయం - విశ్వాస బలహీనులకు దానం చేయడం

631. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం:- నేను ఓ రోజు దైవప్రవక్త(స) సన్నిధిలో కూర్చొని ఉండగా ఆయన కొందరికి (పైకం) పంచి బెట్టారు. అయితే నా దృష్టిలో అందరికంటే మంచివాడైన ఒక వ్యక్తికి మాత్రం ఏమీ ఇవ్వలేదు. అప్పుడు నేను లేచి దైవప్రవక్త(స) సమీపానికెళ్ళి "ఫలానా వ్యక్తి విషయంలో మీరిలా ఎందుకు ప్రవర్తించారు? దైవసాక్షి! నా దృష్టిలో మాత్రం అతను మోమిన్ (విశ్వాసి)" అని అన్నాను మామూలు ధోరణిలో. దానికి దైవప్రవక్త(స) "ఏమిటి మోమినా? ముస్లిమా?" అని అడిగారు.

దాంతో నేను కాస్సేపు మౌనంగా ఉండిపోయాను. కాని అతడ్ని గురించి నేనెరిగిన (మంచి) విషయాలు నన్ను మరోసారి నోరు విప్పడానికి ప్రేరేపించాయి. "దైవప్రవక్తా! ఫలానా వ్యక్తికి మీరు ఎందుకు ఇవ్వలేదో నాకర్థం కావడం లేదు. దైవసాక్షి! నా దృష్టిలో అతను (మంచి) విశ్వాసి" అని అన్నాను నేను మళ్ళీ. దానికి దైవప్రవక్త(స) "మోమినా, ముస్లిమా?" అని అడిగారు తిరిగి. ఈ మాట విని నేను కాస్సేపు మిన్నకుండిపోయాను. కాని అతడ్ని గురించి నేనెరిగిన విషయాలు నన్ను మరోసారి అడిగేందుకు పురిగొల్పాయి. "దైవప్రవక్తా! మీరు ఫలానా వ్యక్తికి ఎందుకివ్వలేదు. దైవసాక్షి! నా దృష్టిలో అతను (మంచి) విశ్వాసి" అని అన్నాను నేను మళ్ళీ. దైవప్రవక్త(స) తిరిగి "అతను మోమినా లేక ముస్లిమా?" అని అడిగారు. ఆ తరువాత ఆయన ఇలా ప్రవచించారు.

"నేను కొన్ని సందర్భాలలో ఒక వ్యక్తికి ఇస్తాను. అయితే (నా నుండి ఏదీ అందుకోని) మరో వ్యక్తి నా కెంతో ప్రియమైన వాడయి ఉంటాడు. నేనిలా (ఒకనికిచ్చి మరొకనికి ఇవ్వకపోతే) అతను ఇస్లాం ధర్మాన్నే వదలిపెట్టవచ్చు. లేదా అతని నోట వెలువడరాని మాట వెలువడి (తత్పర్యవసానంగా) అతడ్ని బొక్క బోర్లా నరకంలో పడవేయవచ్చు. ఈ భయం వల్లనే నేనిలాంటి వైఖరి అవలంబించవలసి వచ్చింది."

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 53వ అధ్యాయం - ఖౌలిల్లాహి తాలా (లాయస్ అలూనన్నాసిల్‌హాఫా)]

## 46వ అధ్యాయం - కొత్తగా విశ్వసించిన వారికి (ధనం) ఇవ్వడం, దృఢ విశ్వాసులకు ఇవ్వకపోవడం

632. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- యుద్ధం చేయకుండానే దైవప్రవక్త(స)కు దేవుడు హవాజన్ తెగవారి సిరిసంపదల నుండి పెద్ద ఎత్తున యుద్ధ ప్రాప్తిని ఇప్పించాడు. అప్పుడు దైవప్రవక్త (స) ఖురైష్ తెగకు చెందిన కొందరు ముస్లింలకు వందేసి ఒంటెలు ఇవ్వసాగారు. అది చూసి కొందరు అన్సార్ ముస్లింలు (అసూయపడుతూ) "దేవుడు దైవప్రవక్త(స)ను క్షమించుగాక! ఈయనగారు ఖురైషీయులకు మాత్రం (విశాల హృదయంతో యుద్ధప్రాప్తిని పుష్కలంగా) ఇచ్చి వేస్తున్నారు. కాని మా ఖడ్గాల నుండి ఖురైషీయుల రక్తం ఇంకా కారుతున్నప్పటికీ మమ్మల్ని విస్మరించారు" అని అన్నారు.

కొందరు వీరి మాటల్ని దైవప్రవక్త(స) చెవిలో వేశారు. అప్పుడు దైవప్రవక్త(స) అన్సార్ ముస్లింలను పిలిపించి ఒక తోలు గుడారంలో వారిని సమావేశపరిచారు. ఆ సమావేశానికి అన్సార్ ముస్లింలను తప్ప మరెవరినీ పిలువలేదు.

అందరూ సమావేశమయిన తరువాత దైవప్రవక్త(స) వారి దగ్గరకు వచ్చి “మీరేదో అన్నారని విన్నాను. ఏమిటీ సంగతి?” అని అడిగారు.

వారిలో కొందరు విజ్ఞులు ముందుకు వచ్చి ఇలా అన్నారు: “దైవప్రవక్తా! మాలో బుద్ధిజ్ఞానం కలవాళ్ళెవరూ ఎలాంటి మాట అనలేదు. కొందరు కుర్రవాళ్ళు (ముందూ వెనుకా ఆలోచించకుండా వాగుతూ) 'దేవుడు దైవప్రవక్త(స)ను క్షమించుగాక, ఈయనగారు ఖురైషీయులకు మాత్రం (విశాల మనస్సుతో యుద్ధ సొత్తు పుష్కలంగా) ఇచ్చి వేస్తున్నారు. కాని మా ఖడ్గాల నుండి ఖురైషీయుల రక్తం ఇంకా కారుతున్నప్పటికీ మమ్మల్ని విస్మరించారు' అని అన్నారు”.

దైవప్రవక్త(స) ఈ మాటలు విని ఇలా అన్నారు: “నిజమే. మొన్నటి దాకా అవిశ్వాసులుగా ఉండి ఈ మధ్యనే కొత్తగా ఇస్లాం స్వీకరించిన వారికి నేను (యుద్ధప్రాప్తి) ఇస్తున్నమాట నిజమే. కాని ఇతరులు ధనధాన్యాలు (నా నుండి) తీసికెళ్ళితే, మీరు ఏకంగా నన్నే మీ ఇండ్లకు తీసికెళ్ళడం మీకు సంతోషంగా లేదా? (వినండి) దైవసాక్షిగా చెబుతున్నాను. ఇతరులు (నా నుండి) తమ ఇండ్లకు తీసికెళ్ళే డబ్బూ దస్కం కంటే మీరు తీసికెళ్ళే ఐశ్వర్యం ఎంతో విలువైనది.”

అన్సార్ ముస్లింలు ఈ మాటలు విని “ఎందుకు లేదు? ఇది మాకందరికీ తప్పకుండా సంతోషకరమైన విషయమే” అన్నారు (ముక్తకంఠంతో).

ఆ తరువాత దైవప్రవక్త(స) ఇలా చెప్పారు: “(అన్సార్ ముస్లింలారా!) నా (ఇహలోక నిష్క్రమణ) తరువాత సమీప భవిష్యత్తులో మీరు ఇంతకంటే కఠినమైన సంఘటనల్ని ఎదుర్కోవలసి వస్తుంది. అప్పుడు మీకంటే ఇతరులకు అత్యధిక ప్రాధాన్యత నివ్వడం జరుగుతుంది. అలాంటి సందర్భాలలో మీరు దేవుని దగ్గరకు చేరుకొని, కౌసర్ సరస్సు దగ్గర దైవప్రవక్త (స)ను కలుసుకునే వరకూ సహనంతో వ్యవహరించండి.”

'అయితే మేము ఆ మేరకు సహనం పాటించలేకపోయాము' అని హజ్రత్ అనస్ (రజి) అభిప్రాయపడ్డారు.

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖమ్స్, 19వ అధ్యాయం-మాకాన నబీ (స) యాతియల్ ముఅల్లఫతిల్ ఖులూబుహుమ్ వ గైరుహుమ్ మినల్ ఖమ్సి నహ్ విహీ]

633. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) అన్సార్ ముస్లింలను పిలిపించారు. (అందరూ వచ్చిన తరువాత) “మీలో అన్సారేతర ముస్లింలెవరైనా ఉన్నారా?” అని అడిగారు. దానికి వారు “మా మేనల్లుడు ఒకరు తప్ప మరెవరూ లేరు” అని తెలిపారు. దైవప్రవక్త (స) ఈ మాట విని “ఒక కుటుంబానికి చెందిన మేనల్లుడు కూడా వారికి చెందిన వ్యక్తిగానే పరిగణించబడతాడు” అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్; 14వ అధ్యాయం -ఇబ్ను ఉఖ్తిల్ ఖౌమి వ మౌలిల్ ఖౌమి మిన్హుమ్]

634. హజ్రత్ అనస్ (రజి) కథనం:- మక్కా జయించబడిన కాలంలో (యుద్ధప్రాప్తిలో నుంచి) ఖురైషీయులకు ఇవ్వబడగా అప్పుడు అన్సారులలో కొందరు (కుర్రవాళ్ళు అసూయతో ఉడికిపోతూ) “దైవసాక్షి! మా ఖడ్గాల నుండి ఖురైషీయుల రక్తం ఇంకా కారుతూనే ఉంది. అయినా మేము సాధించిన

యుద్ధప్రాప్తి ఖురైషీయులకు పంచబడుతోంది. ఎంత విచిత్రకరమైన విషయమిది!!" అని అన్సారు.

ఈ సంగతి తెలిసి దైవప్రవక్త(స) వెంటనే అన్సార్ ముస్లింలను పిలిపించారు. అప్పుడు ఆయన "మీ గురించి నేనొక మాట విన్నాను. అది నిజమేనా?" అని అడిగారు. వారు అబద్ధం చెప్పే మనుషులు కారు. అందువల్ల వారు (నిజాన్ని ఒప్పుకుంటూ) "మీరు విన్న సంగతి నిజమే" అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) ఇలా అన్నారు:

"ఇతరులు తమ ఇండ్లకు యుద్ధసొత్తు తీసికెళ్తే మీరు ఏకంగా నన్నే మీ ఇండ్లకు తీసికెళ్ళడం మీకు సంతోషకరమైన విషయం కాదా? వినండి, అన్సార్ ముస్లింలు ఏఏ లోయల్లో, కనుమల్లో నడిస్తే నేను కూడా ఆయా లోయల్లో, కనుమల్లో నడుస్తాను."

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 1వ అధ్యాయం - మనాఖిబుల్ అన్సార్]

635. హజ్రత్ అనస్ (రజి) కథనం:- హునైన్ యుద్ధంలో హవాజిన్ తెగవాళ్ళు పోటీకి దిగినప్పుడు దైవప్రవక్త(స) వెంట పదివేల మంది యోధులు ఉన్నారు. వారితో పాటు మక్కా పట్టణానికి చెందిన నవ ముస్లింలు కూడా ఉన్నారు. అయితే ఆ తరువాత వారు వెనక్కి పారిపోయారు. అప్పుడు దైవప్రవక్త(స) అన్సార్ ముస్లింలను పిలుస్తూ "అన్సార్ ముస్లింలారా!" అని అన్నారు. దానికి వారు "మేం ఇక్కడ ఉన్నాం దైవప్రవక్తా! మీకు సహాయపడేందుకు మీ దగ్గరే సర్వసన్నద్ధంగా ఉన్నాం" అని అన్నారు. ఆ తరువాత దైవప్రవక్త(స) తన వాహనం మీద నుంచి క్రింద దిగి "నేను దేవుని దాసుడ్ని, ఆయన సందేశహరుడ్ని" అని అన్నారు. చివరికి (ఆ యుద్ధంలో) బహుదైవారాధకులు ఓడిపోయారు.

ఆ తరువాత దైవప్రవక్త(స) మక్కా నవ ముస్లింలకు, ముహాజిర్ ముస్లింలకు (పెద్ద ఎత్తున) యుద్ధప్రాప్తిని పంచిపెట్టారు. అయితే అన్సార్ ముస్లింలకు ఏమీ ఇవ్వలేదు. అప్పుడు అన్సార్ ముస్లింలు (కొందరు అసంతృప్తిని వెలిబుచ్చే) మాటలు పలికారు. దైవప్రవక్త(స) వారిని పిలిపించి ఒక గుడారంలో సమావేశపరిచారు. ఆ తరువాత వారిని సంబోధిస్తూ ఇలా అన్నారు: "ఇతరులు ఒంటెలు, మేకలు తీసికెళ్తే, మీరు దైవప్రవక్త(స)ను తీసికెళ్ళతారు. ఇది మీకు సంతోషకరం కాదా! ఇతరులు ఒక లోయలో నడుస్తూ, అన్సార్ ముస్లింలు (కఠినమైన) కొండ కనుమల్లో నడుస్తూ ఉంటే, నేను అన్సారులు నడిచే కనుమ దారినే ఎంచుకుంటాను."

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 56వ అధ్యాయం - గజ్వతుత్తాయెఫ్]

636. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ బిన్ ఆసిమ్ (రజి) కథనం:- హునైన్ యుద్ధంలో దేవుడు తన ప్రవక్త(స)కు (పెద్ద ఎత్తున) యుద్ధప్రాప్తిని ప్రసాదించాడు. అప్పుడు దైవప్రవక్త(స) నవ ముస్లింల (మక్కా ఖురైషీయుల) హృదయాలను ఆకట్టుకోవడానికి వారికి యుద్ధప్రాప్తిని పంచిపెట్టారు. కాని అన్సార్ ముస్లింలకు ఏమీ ఇవ్వలేదు. ఇతరులకు లభించినది తమకు లభించకపోవడంతో అన్సార్ ముస్లింలు ఎంతో బాధపడ్డారు. అప్పుడు దైవప్రవక్త(స) వారిని సంబోధిస్తూ ఇలా అన్నారు:

"అన్సార్ ముస్లింలారా! మీరు ఒకప్పుడు మార్గభ్రష్టులయి ఉన్నారు; దేవుడు మీకు నా ద్వారా సన్మార్గం చూపలేదా? మీరు విభిన్న వర్గాలుగా చీలి ఉన్నారు; దేవుడు నా ద్వారా మీలో పరస్పరం ఐకమత్యం, ప్రేమాభిమానాలు కలిగించలేదా? మీరు పేదవాళ్ళుగా ఉండేవాళ్ళు; దేవుడు నా

మూలంగా మిమ్మల్ని ఐశ్వర్యవంతుల్ని చేశాడు. ఇది యదార్థం కాదా?''

దైవప్రవక (స) అడిగిన ప్రతి మాటకు అన్సార్ ముస్లింలు సమాధానమిస్తూ, "ఆ దేవుడు, దైవప్రవక్త(స) మా కెంతో మేలు చేశారు'' అని అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త(స) ఇలా అన్నారు: "మీరు కావాలనుకుంటే - మీరు మా దగ్గరికి ఇలాంటి (గత్యంతరం లేని) పరిస్థితుల్లో వచ్చి మా పంచన చేరారు - అని కూడా అనవచ్చు. ఇతరులు (తమ ఇండ్లకు) ఒంటెలు, మేకలు తీసికెళ్తుంటే మీరు ఏకంగా దైవప్రవక్తనే మీ ఇండ్లకు తీసికెళ్ళడం మీకు సంతోషకరమైన విషయం కాదా? హిజ్రత్ (వలస) గనక లేకుండా ఉండినట్లయితే నేను అన్సార్ వర్గంలోనే ఒక సభ్యుడినై ఉండేవాడ్ని. ఇతరులు ఒక లోయలో (లేదా) ఒక కనుమ గుండా నడుస్తూ, అన్సార్ ముస్లింలు మరో లోయలో (లేక) మరో కనుమ గుండా నడుస్తుంటే, నేను అన్సారులు నడిచే లోయలో (లేక) కనుమ గుండానే నడుస్తాను. అన్సార్ ముస్లిం దేహానికి అంటి ఉండే వస్త్రం లాంటివాడు. ఇతరులుపైన ధరించే వస్త్రం (ఉత్తరీయం) లాంటి వాళ్ళు. గుర్తుంచుకోండి. నేను ఇహలోకం వీడిపోయిన తరువాత మీరు అనేక ఆటుపోటులకు గురికావలసి వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో మీరు చనిపోయి 'కౌసర్' కోనేటి దగ్గర నన్ను కలుసుకునే వరకు సహనం వహించాలి.''

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 56వ అధ్యాయం - గజ్వతిత్తాయెఫ్]

637. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- హునైన్ యుద్ధం ముగిసిన తరువాత దైవప్రవక్త (స) యుద్ధప్రాప్తి పంచుతూ కొందరికి ఇతరుల కంటే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. అఖ్రా బిన్ హాబిస్ (రజి)కు వంద ఒంటెలు ఇచ్చారు. ఉయీనా (రజి)కు కూడా వంద ఒంటెలు ఇచ్చారు. ఇతర అరబ్ నాయకులక్కూడా భారీ ఎత్తున సంపద ప్రసాదించారు. ఈ విధంగా దైవప్రవక్త(స) యుద్ధప్రాప్తి పంపిణీ విషయంలో వారికి అత్యధిక ప్రాధాన్యత నిచ్చినట్లు అన్పించింది. దాంతో ఒకతను తీవ్రంగా స్పందిస్తూ "దైవసాక్షి! ఈ పంపిణీలో న్యాయాన్ని పాటించలేదు. దైవప్రసన్నతను కూడా దృష్టిలో పెట్టుకోలేదు'' అని అన్నాడు.

నేనప్పుడు "ఈ మాటను నేను దైవప్రవక్త(స)కు తప్పకుండా చేరవేస్తాను'' అని అన్నాను. అన్నట్లుగానే నేను (వెంటనే) దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి ఆయనకీ విషయం తెలియజేశాను. దైవప్రవక్త(స) ఈ మాట విని "దేవుడు, దైవప్రవక్త(స)లే న్యాయం పాటించకపోతే ఇంకెవరు పాటిస్తారు? దేవుడు హజ్రత్ మూసా (అలైహి)ను కరుణించుగాక. ఆయనకు ఇంతకంటే కూడా ఎక్కువ బాధలు కలిగించారు. అయినప్పటికీ ఆయన సహనం వహించారు'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖమ్స్, 19వ అధ్యాయం - మాకానన్నబీ (స) యూతిల్ ముఅల్లఫతిల్ ఖులూబుహుమ్...]

## 47వ అధ్యాయం - ఖార్జీల ప్రస్తావన - వారి అలవాట్లు, అభిరుచులు

638. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఓసారి 'జారానా' అనే చోట యుద్ధప్రాప్తిని (యోధులకు) పంచుతుంటే ఒక వ్యక్తి ముందుకు వచ్చి "న్యాయం పాటించండి'' అని

అన్నాడు. దానికి దైవప్రవక్త(సల్లం) నొచ్చుకుంటూ "నువ్వొట్టి దౌర్భాగ్యుడిలా ఉన్నావు. నేను న్యాయం పాటించకపోతే ఇంకెవరు పాటిస్తారు?" ★అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖమ్స్, 15వ అధ్యాయం - వమినద్దలీలి అలా అనిల్ ఖమ్స్ అన్నవాయి బిల్ ముస్లిమీన్]

639. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- హజ్రత్ అలీ (రజి) దైవప్రవక్త(సల్లం) సన్నిధికి కొంత బంగారం పంపారు. దైవప్రవక్త(సల్లం) దాన్ని నలుగురు వ్యక్తులకు పంచి పెట్టారు. ఆ నలుగురు : (1) అఖ్రాబిన్ హాబిస్ అల్ హన్జలి (రజి). ఈయన ఆ తర్వాత మజాషియి అనే పేరుతో పిలువబడ్డారు; (2) ఉయీనా బిన్ బదర్ ఫజారీ (రజి), (3) జైద్‌తాయి (రజి), ఈయన ఆ తరువాత బనీ నబ్హాన్ (తెగ)లో కలసిపోయారు, (4) అల్ఖమ బిన్ అలాసా ఆమిరీ (రజి), ఈయన ఆ తరువాత బనీ కిలాబ్ (తెగ)లో కలసిపోయారు. అప్పుడు ఖురైషీయులు, అన్సారీలు ముఖం చిట్లించుకొని "మీరు నజద్ వారికి ఇచ్చి మమ్మల్ని విస్మరించారు" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "వారి హృదయాల్లో ఇస్లాం పట్ల (మరింత) ప్రేమాభిమానాలు జనిస్తాయన్న ఆశతోనే నేను వారికి ఇచ్చాను" అని అన్నారు. అయితే మరొక వ్యక్తి ముందుకు వచ్చాడు, అతని కళ్ళు లోపలికి పీక్కుపోయి ఉన్నాయి, చెంపలు ఉబ్బెత్తుగా ఉన్నాయి, ఎత్తైన నుదురు, గుబురు గడ్డం, తల పూర్తిగా గొరిగి ఉంది. అతను ముందుకు వచ్చి "ముహమ్మద్ (సల్లం)! కాస్త దేవునికి భయపడండి" అని అన్నాడు. దైవప్రవక్త(సల్లం) ఆ మాటకు స్పందిస్తూ ఇలా అన్నారు:

"ఏమిటీ, నేనే దేవునికి విధేయత చూపకపోతే మరెవరు చూపుతారు? దేవుడు నన్ను భూవాసుల కోసం అమీన్ (నిజాయితీపరుని)గా చేసి పంపాడు. నువ్వు నన్ను అమీన్ (నిజాయితిపరుని)గా విశ్వసించడం లేదా?"

ఆ తరువాత ఒక వ్యక్తి, నా దృష్టిలో ఖాలిద్ బిన్ వలీద్ (రజి) లేచి అతడ్ని హతమార్చడానికి తనను అనుమతించవలసిందిగా దైవప్రవక్త(సల్లం)ను అడిగారు. అయితే దైవప్రవక్త(సల్లం) ఆయన్ని ఆ పని నుండి వారించారు.

చివరికి ఆ వ్యక్తి వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోగానే దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు: "ఇతని సంతతి నుండి కొందరు పుడ్తారు;" లేక దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు. "ఇతని (మరణం) తరువాత కొందరు పుడ్తారు. వారు ఖుర్ఆన్ పఠిస్తారు గాని, అది వారి కంఠం నుంచి క్రిందికి (హృదయంలోకి) దిగదు. వేట జంతువు (శరీరం) నుండి బాణం బయటకి దూసుకుపోయినట్లు వీరు (సత్య) ధర్మం నుండి బయటికి వెళ్ళిపోతారు. (అంటే ధర్మభ్రష్టులయిపోతారన్నమాట). అంతేకాదు, ఇస్లాంను ప్రేమించే ముస్లింలను సంహరిస్తారు. విగ్రహారాధకుల జోలికి మాత్రం పోరు. వీరు గనక నా చేతికి చిక్కితే ఆద్ జాతి హతమార్చబడినట్లు నేను వారిని (నామరూపాల్లేకుండా) సంహరిస్తాను."

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 6వ అధ్యాయం - ఖౌలిల్లాహితాలా వ ఇలా ఆదిన్ ఇఖాహుమ్ హూద్]

★ దీనికి మరో అర్థం కూడా ఇలా ఉండవచ్చు. నీవు నన్ను దైవప్రవక్తగా విశ్వసించి ఉండికూడా నేను అన్యాయానికి పాల్పడతానని ఎలా అనుకున్నావు? ఒకవేళ నిజంగా నేను అన్యాయపరుణ్ణయి ఉంటే నీకు నా దగ్గర ఎలాంటి స్థానమే ఉండదు. అప్పుడు నీ అంతటి దౌర్భాగ్యుడు మరొకడు ఉండడు.

640. హ్రజత్ అబూ సయీద్ ఖుదరీ కథనం:- హ్రజత్ అలీ (రజి) యమన్ ప్రాంతం నుండి దైవప్రవక్త(సల్లం) సన్నిధికి తుమ్మ బెరడుతో రంగరించబడిన తోలు సంచిలో కొంత బంగారం పంపించారు. అదింకా మట్టి నుండి వేరు చేయబడని (ముడి) ఖనిజం. దైవప్రవక్త(సల్లం) దాన్ని నలుగురు వ్యక్తులకు పంచారు. వారు (1) ఉయీనా బిన్ బదర్ (రజి), (2) అఖ్రా బిన్ హాబిస్ (రజి), (3) జైద్ అల్ ఖీల్ (రజి) (4) నాల్గవ వ్యక్తి అల్ఖమా (రజి) లేదా ఆమిర్ బిన్ తుఫైల్. అప్పుడు ప్రవక్త అనుయాయుల్లో ఒకతను (ఈ పంపిణీ వ్యవహారాన్ని విమర్శిస్తూ) "ఈ బంగారం స్వీకరించడానికి వారి కంటే మేమే ఎక్కువ హక్కుదారులం" అని అన్నాడు.

నేనీ మాటను దైవప్రవక్త (సల్లం)కు చేరవేశాను. . దైవప్రవక్త(సల్లం) అది విని (ఆ వ్యక్తిని ఉద్దేశించి) "నీవు నన్ను అమీన్ (నిజాయితీపరుని)గా భావించడం లేదా? ఆకాశాలలో ఉన్న దాని విషయంలో నేను అమీన్ (నిజాయితీపరుణ్ణి)ని. నా దగ్గరకు ఉదయం, సాయంత్రం ఆకాశం నుండి 'వహీ' వస్తుంది " అని అన్నారు.

ఆ తర్వాత మరొక వ్యక్తి లేచాడు. అతని కళ్ళు రెండూ లోపలికి పీక్కుపోయి ఉన్నాయి. చెంపలు వాచి ఉన్నాయి. నుదురు ఎత్తుగా ఉంది. గడ్డం గుబురుగా ఉంది. తల నున్నగా గొరిగి ఉంది. లుంగీ ఎత్తి కట్టుకుని ఉన్నాడు. అతను లేచి "దైవప్రవక్తా! కాస్త దేవునికి భయపడండి" అన్నాడు. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలకు (తీవ్రంగా స్పందిస్తూ) "నీపాడుగాను! భూవాసులందరికెల్లా దైవానికి భయపడే అర్హత నాకే ఎక్కువవుందన్న సంగతి నీకు తెలియదా?" అని అన్నారు. ఈ మాటలు విన్న తర్వాత ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

ఆ సందర్భంలో హ్రజత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) కల్పించుకుంటూ "దైవప్రవక్తా! నేనితణ్ణి చంపేయనా?" అని అన్నారు. "వద్దు. అతను ఎప్పుడయినా నమాజు చేస్తూ ఉండవచ్చు" అన్నారు దైవప్రవక్త(సల్లం). "నమాజు చేసే వారిలో చాలా మంది తమ అంతరంగాల్లో లేని విషయాలను తమ నోట వెలిబుచ్చుతుంటారు" అన్నారు హ్రజత్ ఖాలిద్ (రజి). "(నిజమే కావచ్చు) కాని ప్రజల హృదయాల్లోని మాటల్ని త్రవ్వి తీయమని లేక వారి పొట్టలు చీల్చి చూడమని నాకు ఆజ్ఞ ఇవ్వబడలేదు" అన్నారు దైవప్రవక్త(సల్లం).

తరువాత ఆయన ఆ వ్యక్తి వైపు చూస్తే అతను వెనుతిరిగి వెళ్తూ ఉండటం కన్పించింది. అప్పుడాయన ఇలా అన్నారు. "ఆ వ్యక్తి సంతతి నుండి (ధర్మం పట్ల ఏ మాత్రం ఆసక్తి లేనివారు) జన్మిస్తారు. వారు దివ్య ఖుర్ఆన్ని బాగానే పఠిస్తారు. కాని అది వారి కంఠం నుంచి క్రిందికి దిగదు. వేట జంతువు (దేహం) నుండి బాణం దూసుకుపోయినట్లు వారు ధర్మం నుండి బయటకి వెళ్ళిపోతారు."

హ్రజత్ అబూసయీద్ (రజి) ఇలా అంటున్నారు:- దైవప్రవక్త(సల్లం) ఈ విషయం కూడా చెప్పి ఉన్నారని నేను భావిస్తున్నాను. "వీరు గనక నా చేతికి చిక్కితే సమూద్ జాతి హతమార్చబడినట్లు వీరిని నేను (నామరూపాల్లేకుండా) సంహరిస్తాను."

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 61వ అధ్యాయం - బాసిఅలీబిన్ అబీతాలిబ్ అలైహిస్సలాము వ ఖాలిదిబ్నిల్ వలీద్ (రజి) ఇలల్ యమని ఖబల్ హజ్జతుల్‌విదా]

641. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "మీలో నుంచి ఒక వర్గం (ఇస్లాం నుండి) బయటికి వెళ్తుంది. మీ నమాజుల సమక్షంలో వారి నమాజుల్ని, మీ ఉపవాసాల సమక్షంలో వారి ఉపవాసాలను, మీ సత్కార్యాల సమక్షంలో వారి సత్కార్యాలను మీరు నీచమైనవిగా భావిస్తారు. వారు ఖుర్ఆన్ పఠిస్తారు గాని, అది వారి కంఠం నుండి క్రిందకు దిగదు (అంటే వారు దాన్ని అర్థం చేసుకుంటూ చదవరు). వేట జంతువు (శరీరం) నుండి బాణం బయటికి పోయినట్లు వారు ధర్మం నుండి బయటికి వెళ్తారు (మార్గభ్రష్టులవుతారు).

వేటగాడు ఓసారి బాణం మొన పైకి దృష్టి సారిస్తాడు. అక్కడ అతనికేమీ కన్పించదు, తర్వాత బాణం కర్రను చూస్తాడు. అక్కడ కూడా ఏమీ కన్పించదు. తిరిగి అతడు బాణం ఈకల్ని చూస్తాడు. అక్కడా ఏమీ కన్పించదు. అయితే బాణం చివరి భాగాన ఏదో (రక్తపు మరక) ఉన్నట్లు అనుమానం కలుగుతుంది."

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 36వ అధ్యాయం - మన్రాయా బిఖిరీఅతిల్ ఖుర్ఆని ఔతాకుల్ బిహీ అవ్ ఫఖ్రబ]

642. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(సల్లం) సన్నిధిలో ఉండగా దైవప్రవక్త(సల్లం) కొంత ధనం పంచిపెట్టసాగారు. అంతలో బనీతమీమ్ తెగకు చెందిన జుల్‌ఖువైసర్ అనే వ్యక్తి దగ్గరికి వచ్చి "(దైవప్రవక్తా! న్యాయంగా వ్యవహరించండి" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) (తీవ్రంగా స్పందిస్తూ) "నీపాడుగాను! నేనే న్యాయంగా వ్యవహరించకపోతే ఇంకెవరు న్యాయంగా వ్యవహరిస్తారు? నేను గనక న్యాయంగా వ్యవహరించక అన్యాయానికి పాల్పడితే నువ్వు కూడా పరాభవానికి లోనయ్యేవాడివే".

ఆ సందర్భంలో హజ్రత్ ఉమర్ (రజి) లేచి "దైవప్రవక్తా! నాకు అనుమతి నివ్వండి, ఇతని తల ఖండించి వేస్తాను" అని అన్నారు. దానికి దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా అన్నారు: "పోనివ్వండి. అతని లాంటి వాళ్ళు కొందరు (రాబోయే కాలంలో) ఉండవచ్చు. మీ నమాజులు, ఉపవాసాల సమక్షంలో వారి నమాజుల్ని, ఉపవాసాల్ని మీరు నీచమైనవిగా భావిస్తారు. వారు ఖుర్ఆన్ పఠిస్తారు గాని, అది వారి కంఠం నుండి క్రిందికి దిగదు. (అంటే దాని ప్రభావం వారి జీవితంపై ఏ మాత్రం పడదు). వేటగాడి నుండి బాణం వెడలినట్లే వారు ధర్మం నుండి బయటికి వెళ్తారు. (అంటే మార్గభ్రష్టులవుతారు).

వేటగాడు ఓసారి బాణం ములికి వైపు దృష్టి సారిస్తాడు. అక్కడ అతనికేమీ కన్పించదు. తర్వాత అతడు బాణం కర్రను చూస్తాడు. అక్కడ కూడ ఏమి కన్పించదు. తర్వాత అతడు బాణం ఈకల్ని చూస్తాడు. అక్కడా ఏమీ కన్పించదు. నిజానికి ఆ బాణం వేటజంతువు రక్తమాంసాల గుండా బయటికి వస్తుంది (అందువల్ల ఆ బాణానికి రక్తపు మరకలు అంటి ఉండాలి). వారిని కనుక్కోవడానికి కొన్ని గుర్తులున్నాయి. వారిలో ఒక నల్లవాడు ఉంటాడు. అతని భుజమొకటి స్త్రీ వక్షోజంలా లేక మాంసపు ముద్దలా కదులుతూ ఉంటుంది. (ముస్లిం) ప్రజానీకంలో విభేదాలు పొడసూపి చీలిపోయినపుడు వారు బయల్పడతారు."

హజ్రత్ అబూసయీద్ (రజి) ఇలా అంటున్నారు:- దైవసాక్షిగా చెబుతున్నాను, నేనీ హదీసును

స్వయంగా దైవప్రవక్త(సల్లం) నోట విన్నాను. హజ్రత్ అలీ(రజి) ఆ మనుషులతో యుద్ధం చేశారని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను. అప్పుడు నేను ఆయనతో పాటే ఉన్నాను. (యుద్ధం ముగిసిన తరువాత) అతడ్ని వెతకమని ఆయన ఆజ్ఞాపించారు. అతడ్ని వెతకి పట్టుకొచ్చిన తరువాత నేనతడ్ని (ఆపాదమస్తకం) చూశాను. అచ్చం దైవప్రవక్త (సల్లం) చెప్పినట్లే అతని రూపు ఆకారాలు ఉన్నాయి.

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతున్నబువ్వతి ఫిల్ ఇస్లాం]

## 48వ అధ్యాయం –- ఖార్జీల వధింపుకై ఆదేశం, ప్రోత్సాహం

643. హజ్రత్ అలీ (రజి) కథనం:- నేను మీకు ఎప్పుడైనా దైవప్రవక్త(సల్లం) ప్రవచనం విన్పించాలంటే ఎంతో భయమేస్తుంది. ప్రవక్త ప్రవచనం పేరుతో ఆయన (స)కు అసత్య ప్రవచనం ఆపాదించడం కంటే నేను ఆకాశం నుండి అమాంతం నేలమీద పడిపోవడమే నాకెంతో ఇష్టం. అయితే మన పరస్పర సంబంధాలను గురించి మాత్రం ఒక విషయం గుర్తుంచుకోవాలి. యుద్ధంలో వ్యూహ రచన చేయబడుతుంది. 'ఉద్దేశ్యపూర్వకంగా కొన్ని విషయాలు బహిర్గతం చేయబడవు. అంతగా అవసరమనుకుంటే వాటిని మరో విధంగా - పరోక్షంగా - ప్రస్తావించవలసి వస్తుంది.

నేను దైవప్రవక్త(స) నోట ఈ ప్రవచనం విన్నాను - "అంత్యకాలంలో కొందరు పుట్టుకొస్తారు; వారు నవయువకులు, అల్పబుద్ధి గలవారై ఉంటారు. వారు పైకి ఎంతో తియ్యటి మాటలు చెబుతారు. కాని (వారు ధర్మవ్యతిరేకులు) వేట జంతువు (శరీరం) నుండి బాణం బయటికి పోయినట్లుగానే వారు దైవధర్మం వదలి బయటికి వెళ్ళిపోతారు. వారి విశ్వాసం వారి కంఠాల నుండి క్రిందికి దిగదు. అందువల్ల అలాంటివారు ఎక్కడ కన్పిస్తే అక్కడ మీరు వాళ్ళని హతమార్చండి. వారిని హతమార్చడం ప్రళయదినాన పుణ్యఫలానికి కారణభూతమవుతుంది."

[సహీహ్ బుఖారీ : 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతున్నబువ్వత్ ఫిల్ ఇస్లాం]

## 49వ అధ్యాయం - ఖార్జీ మత వర్గం మానవులందరిలో కెల్లా నీచమైన వర్గం

644. హజ్రత్ యుసీర్ బిన్ ఉమర్ (రహ్మలై) కథనం:- నేను హజ్రత్ సహెల్ బిన్ హునైఫ్ (రజి)ని ఖార్జీలను గురించి అడుగుతూ, 'మీరు ఖార్జీల విషయంలో దైవప్రవక్త(స) నోట ఏదైనా ప్రవచనం విన్నారా?' అన్నాను. దానికి హజ్రత్ సహెల్ (రజి) సమాధానమిస్తూ, విన్నాను. దైవప్రవక్త(స) తమ చేతిని ఇరాఖ్ వైపు సూచిస్తూ ఇలా అన్నారు: "అటు నుండి ఒక వర్గం బయలుదేరుతుంది. వారు ఖుర్‌ఆన్ పఠిస్తారు గాని, అది వారి కంఠం నుండి క్రిందికి దిగదు. వేట జంతువు (శరీరం) నుండి బాణం బయటికి పోయినట్లే వారు దైవధర్మం వదలి బయటికి వెళ్ళిపోతారు.

[సహీహ్ బుఖారీ : 88వ ప్రకరణం - ఇస్తితా బతిల్ ముర్తిదీన్, 7వ అధ్యాయం - మన్తరక ఖితాలల్ ఖవారిజ్]

## 50వ అధ్యాయం - దైవప్రవక్త(స), ఆయన సంతానం, బనీ హాషిం, బనీ అబ్దుల్ ముత్తలిబ్‌లకు జకాత్ స్వీకారం నిషిద్ధం

645. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఖర్జూరాలు కోసే కాలంలో ప్రజలు (జకాత్ క్రింద) ఖర్జూర

పండ్లు తీసుకొని దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చేవారు. ఒకరు ఒకటి, మరొకరు మరొకటి తీసుకొస్తారు. ఈ విధంగా పెద్ద ఎత్తున ఖర్జూర పండ్ల రాసి అవుతుంది. ఒకసారి హజ్రత్ హసన్ (రజి) హజ్రత్ హుసైన్ (రజి) అలాంటి ఖర్జూర పండ్లతో ఆడుకోసాగారు. అలా ఆడుకుంటూ వారిద్దరిలో ఒక బాలుడు ఓ ఖర్జూర పండు తీసుకొని నోట్లో వేసుకున్నాడు. దైవప్రవక్త(స) అది చూసి వెంటనే ఆ పిల్లవాడి నోటి నుంచి దాన్ని బయటికి తీయించారు. ఆ తరువాత ఆయన ఆ బాలుడ్ని ఉద్దేశించి "ముహమ్మద్ కుటుంబీకులు సదఖా (దానం) వస్తువుల్ని తినరని నీకు తెలియదా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 57వ అధ్యాయం - అఖ్జి, సదఖతిత్తమర్ ఇన్దసిరామిన్నఖ్ల్]

646. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "నేను ఇంటికెళ్ళి చూస్తే ఒక్కోసారి నా పడకమీద కొన్ని ఖర్జూరపండ్లు పడి ఉండటం కన్పిస్తుంది. నేను వాటిని తిందామని చేతిలోకి తీసుకుంటాను. కాని అవి సదఖాకు (దానానికి) సంబంధించినవేమోనన్న భయంతో వాటిని తిరిగి అక్కడే పడవేస్తాను."

[సహీహ్ బుఖారీ : 45వ ప్రకరణం - లుఖ్తా, 6వ అధ్యాయం - ఇజా వజద తమ్రతన్ పిత్తరీఖ్]

647. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త(స)కు దారిలో ఓ ఖర్జూర పండు పడి ఉండటం కన్పించింది. ఆయన దాన్ని చూసి "ఇది దానానికి సంబంధించిన పండు కాదని తెలిస్తే నేను దీన్ని నిరభ్యంతరంగా తింటాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - అల్‌బుయూ, 4వ అధ్యాయం - మాయత నజ్జహూ మినష్షుబహాత్]

## 52వ అధ్యాయం - దైవప్రవక్త(స), ఆయన సంతతి కానుకలు స్వీకరించడం ధర్మ సమ్మతమే

648. హజ్రత్ అనస్ (రజి)కథనం:- హజ్రత్ బరీరా (రజి)కు దానంగా లభించిన మాంసం దైవప్రవక్త(స)కు ఇవ్వబడింది. ఆ సందర్భంలో దైవప్రవక్త(స) మాట్లాడుతూ "ఈ మాంసం బరీరా (రజి) కయితే దానమవుతుంది. కాని ఈ మాంసం (బరీరా (రజి) మాకు సమర్పించినందున ఇది) మా కొరకు కానుకవుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 62వ అధ్యాయం - ఇజా తహ్వ్వలతిస్సదఖా]

649. హజ్రత్ ఉమ్మె అతియా అన్సారియా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) ఇంటికి వచ్చి "నీ దగ్గర ఏదైనా తినటానికి ఉందా" అని అడిగారు. దానికామె "లేదండీ! అయితే కాస్తంత మేక మాంసం మటుకు ఉంది. ఇది మీరు నసీబా (ఉమ్మె అతియా)కు దానంగా పంపిన మాంసమే. దాన్ని ఆమె తిరిగి మనకే పంపింది" అని అన్నారు. దైవప్రవక్త(స) ఈ మాట విని "దానం మటుకు తన స్థానానికి చేరుకున్నది" అన్నారు.

[సహీహ్ బుఖారీ : 24వ ప్రకరణం - జకాత్, 62వ అధ్యాయం - ఇజా తహ్వ్వలతిస్సదఖా]

## 53వ అధ్యాయం - దైవప్రవక్త(స) కానుకనయితే స్వీకరిస్తారు, దానాన్ని స్వీకరించరు

650. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స)కు ఎవరైనా ఆహార పదార్థాలు సమర్పిస్తున్నప్పుడు "ఇది దానంగా ఇస్తున్నావా లేక కానుకగా ఇస్తున్నావా?" అని అడుగుతారు దైవప్రవక్త(స) ఆ వ్యక్తిని. అతను గనక ఆ వస్తువుని దానంగా ఇస్తున్నానని చెబితే దైవప్రవక్త(స) తన అనుచరుల్ని ఉద్దేశించి "దీన్ని మీరు తినండి" అనంటారు, ఆయన మాత్రం దాన్ని ముట్టరు. ఒకవేళ అతను ఆ వస్తువుని కానుకగా ఇస్తున్నానని అంటే మాత్రం దైవప్రవక్త(స) దాన్ని స్వీకరించి, ఇతరుల్ని కూడా కలుపుకొని తింటారు.

[సహీహ్ బుఖారీ :51వ ప్రకరణం - హిబా, 7వ అధ్యాయం -ఖుబూలిల్‌హదీయా]

## 54వ అధ్యాయం - దానం ఇచ్చే వ్యక్తిని ఆశీర్వదించడం

651. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబూ ఔఫా (రజి) కథనం:- ప్రజలు దైవప్రవక్త(స) సన్నిధిలో ఏదైనా దానం సమర్పిస్తున్నప్పుడు, దైవప్రవక్త(స) వారిని ఆశీర్వదిస్తూ "దేవా! ఫలానా కుటుంబంపై కారుణ్యం కురిపించు" అని ప్రార్థించేవారు. ఒకసారి మానాన్న అబూ ఔఫా (రజి) దానం తెచ్చిస్తే దైవప్రవక్త(స) ఆయన్ని దీవిస్తూ "దేవా! అబూ ఔఫా (రజి) సంతతిపై కారుణ్యం కురిపించు" అని ప్రార్థించారు.

[సహీహ్ బుఖారీ :24వ ప్రకరణం - జకాత్, 64వ అధ్యాయం - సలాతుల్ ఇమామి వ దుఆయిహీ లిసాహిబిస్సదఖా]

# ఉపవాస ప్రకరణం

## 1వ అధ్యాయం - రమజాన్ నెల ఘనత

652. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "రమజాన్ నెల రాగానే స్వర్గ ద్వారాలు తెరవబడతాయి; నరక ద్వారాలు మూసివేయబడతాయి. దాంతో పాటు దుష్టశక్తులకు సంకెళ్ళు పడతాయి."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 5వ అధ్యాయం - హల్ యుఖాలు రమజాను అవ్షహ్రు రమజాన్]

## 2వ అధ్యాయం - నెలవంక కన్పించగానే ఉపవాసాలు విధిగా పాటించాలి; నెలవంక దర్శనంతో ఈదుల్ ఫిత్ర్ (పండుగ) అవుతుంది

653. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి రమజాన్ గురించి ప్రస్తావిస్తూ "నెలవంక కన్పించనంతవరకు ఉపవాసాలు పాటించకండి. అలాగే (తిరిగి) నెలవంక కన్పించనంత వరకు ఉపవాస విరమణ (పండుగ) చేయకండి. ఒకవేళ ఆకాశం మేఘావృతమయి ఉంటే ఆ నెల ముప్ఫై రోజులు పూర్తిగా ఉపవాసాలు ఉండండి." (అంటే ఆ నెల 29 రోజులు ఉపవాసముండి 29వ రోజున సాయంత్రం మబ్బు మూలంగా నెలవంక కన్పించకపోతే ముప్ఫైయ్యోరోజు కూడా ఉపవాసం పాటించి ముప్ఫయి రోజాల సంఖ్య పూర్తి చేయాలన్నమాట).

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 11వ అధ్యాయం - ఖౌలిన్నబీ(సల్లం) ఇజారయ్‌తుముల్ హిలాలు ఖుసూము]

654. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "నెల అంటే ఇన్ని, ఇన్ని, ఇన్ని (పది, పది, పదిరోజులు) అంటే ముప్ఫయిరోజులు ఒక నెల అవుతుంది. అలాగే నెల అంటే ఇన్ని, ఇన్ని, ఇన్ని (పది, పది, తొమ్మిది రోజులు) అంటే 29 రోజులు (కూడా) నెల అవుతుంది."

ఒకసారి దైవప్రవక్త (సల్లం) ముప్ఫయిరోజులు (చేతివ్రేళ్ళతో చూపిస్తూ) లెక్కపెట్టి చూపారు. మరొకసారి 29 రోజులు లెక్కపెట్టి చూపారు.

[సహీహ్ బుఖారీ: 68వ ప్రకరణం - తలాఖ్, 25వ అధ్యాయం - అల్ ఆన్. ఖాలల్లాహు తాలా వల్లజీన యుర్మూన అజ్వాజహుమ్]

655. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా చెప్పారు:- "మనం చదువు రాని వాళ్ళము. మనకు వ్రాయడం రాదు, లెక్కలూ రావు. నెల ఇన్ని రోజులు, ఇన్ని రోజులు అవుతుంది". దైవప్రవక్త(సల్లం) తమ చేత్తో ఒకసారి 29, మరొకసారి 30 లెక్కపెట్టి చూపారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 13వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) లానక్తుబు వలా నహ్‌సిబ్]

656. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- దానిని (చంద్రుడ్ని) చూసి ఉపవాసాలు పాటించండి. దానిని (చంద్రుడ్ని) చూసే ఉపవాస విరమణ (ఈదుల్ ఫిత్ర్) చేయండి. ఆకాశం మేఘావృతమయి చంద్రుడు కన్పించకపోతే షాబాన్ నెల ముప్ఫయి రోజులు నిండనివ్వండి. ★

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 11వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) ఇజారఅయితుముల్ హిలాల్ ఖుసూమూ]

## 3వ అధ్యాయం - రమజాన్ నెలకు ఒకటి, రెండు రోజులు ముందుగా ఉపవాసముండరాదు

657. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు:- "రమజాన్ నెల ప్రారంభం కావడానికి ఒకటి, రెండు రోజులు ముందుగా ఎవరూ ఉపవాసం పాటించకూడదు. ఒకవేళ ఎవరైనా ఆ తేదీల్లో ఎల్లప్పుడూ (ప్రతియేడూ) ఉపవాసాలు పాటిస్తూ ఉంటే అలాంటి వ్యక్తి ఈ తేదీల్లో ఉపవాసం పాటించవచ్చు."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 14వ అధ్యాయం - లా యతఖద్దమన్న రమజాన బిసౌమి యౌమ్ వలా యౌమీన్]

## 4వ అధ్యాయం - 29 రోజుల నెల కూడా ఉంటుంది

658. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- దైవప్రవక్త(స) తమ భార్యలలో కొందరి దగ్గరకు ఒక నెల దాకా వెళ్ళనని ప్రమాణం చేసి నిశ్చయించుకున్నారు. అలా ఇరవై తొమ్మిది రోజులు గడిచాయి. ఉదయం లేక సాయంత్రం ఆయన తన భార్యల దగ్గరికి వెళ్ళారు. ఆ సందర్భంలో అనుచరులు ఆయనతో మాట్లాడుతూ "దైవప్రవక్తా! మీరు ఒక నెల వరకు మీ భార్యల దగ్గరకు పోనని ప్రమాణం చేశారు కదా (మరిప్పుడు 29 రోజులే గడిచాయి)" అని అన్నారు. దానికి దైవప్రవక్త(స) "ఇరవై తొమ్మిది రోజులలో కూడా నెల అవుతుంది" అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ: 67వ ప్రకరణం - నికాహ్, 92వ అధ్యాయం - హజ్రతున్నబీ (స) నిసాఅహు ఫీగైరి బయూతిహిన్]

## 7వ అధ్యాయం - పండుగలు ఉండే రెండు నెలలు విలువైనవే

659. హజ్రత్ అబూ బకర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:- "రమజాన్, జిల్‌హజ్జ్

---

★ అంటే షాబాన్ నెల 29వ తేదీ సాయంత్రం మబ్బు పట్టి ఉంటే 30వ తేది కూడా వదిలేసి ఉపవాసాలు ప్రారంభించండి అని అర్థం. అదే విధంగా రమజాన్ నెల 29వ తేది సాయంత్రం మబ్బుపట్టి చంద్రుడు కన్పించకపోతే 30వ తేదీ కూడా ఉపవాసం పాటించి పండగ జరుపుకోండని భావం.

పండుగలు ఉండే రెండు నెలలు (ఎట్టి స్థితిలోనూ విలువలో) అల్పమైనవిగా ఉండవు."★

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 12వ అధ్యాయం - షహ్రా ఈదిన్ లాయన్ ఖుసాన్]

## 8వ అధ్యాయం - ఉపవాసవ్రతం, ఉషోదయం నుండి మొదలవుతుంది

660. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) కథనం:- (ఖుర్ఆన్‌లో) "నడిరేయి నలుపు తగ్గి, తొలి జాము తెలుపు దారం కనబడే వరకు" (2:187) అనే సూక్తి అవతరించినప్పుడు నేను ఒక నల్ల దారం, ఒక తెల్ల దారం తీసుకొని వాటిని నా తలగడ క్రింద పెట్టుకున్నాను. కాని రాత్రివేళ చీకటిలో చూస్తే అవి నాకు కన్పించలేదు. ఉదయం కాగానే దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి విషయం తెలిపాను. దైవప్రవక్త(స) అది విని "వాటి అర్థం రాత్రి నలుపు, పగటి తెలుపు అని గ్రహించాలి (దారాలు కాదు)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 16వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా కులూ వష్రబూ హత్తాయుతబయ్యనలకుమ్]

661. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- "వకులూ వష్రబూ హత్తాయత బయ్యన లకుముల్ ఖైతుల్ అబ్‌యజుమినల్ ఖైతిల్ అస్వది" అనే సూక్తి (2:187) అవతరించింది. ఇంకా 'మినల్ ఫజ్ర్' అవతరించలేదు. అప్పుడు (మాలో) కొందరు ఉపవాసం ఉండేందుకు (సహరీవేళ తెలుసుకునేందుకు) తమ కాళ్ళకు ఒక నల్లదారం, ఒక తెల్లదారం కట్టుకొని, ఆ దారాలు స్పష్టంగా కన్పించేవరకు (రాత్రివేళ నిస్సంకోచంగా) తింటూ ఉండేవారు. తరువాత దేవుడు మినల్ ఫజ్ర్ సూక్తి అవతరింపజేశాడు. దాంతో వారికి ఈ సూక్తి అర్థం పగలు-రేయి అని తెలిసింది.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 16వ అధ్యాయం - ఖౌలిల్లాహితాలా వకులూ వష్రబూ హత్తాయత బయ్యన లకుమ్]

662. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "రాత్రివేళ బిలాల్ (రజి) అజాన్ ఇస్తుంటారు. అందుచేత మీరు (ఆయన అజాన్ గురించి పట్టించుకోకుండా) ఇబ్నె ఉమ్మె మక్తూమ్ తిరిగి అజాన్ ఇచ్చే వరకు నిరభ్యంతరంగా తినవచ్చు, తాగవచ్చు."

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 11వ అధ్యాయం - అజానిల్ ఆమా ఇజాకానలహూ మయ్యఖ్బిరుహూ]

663. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ బిలాల్ (రజి) (అర్థ)రాత్రివేళ ఇంకా ఉండగానే (రమజాన్ నెలలో) అజాన్ ఇస్తుంటారు. అందువల్ల హజ్రత్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజి) అజాన్

---

★ ఈ హదీసుపై వివిధ ధర్మవేత్తలు విభిన్న రకాలుగా వ్యాఖ్యానించారు. కొందరి అభిప్రాయం ప్రకారం, ఒకే సంవత్సరంలో ఈ రెండు నెలలు 29 రోజుల మాసాలుగా ఉండవని, వాటిలో ఒకటి 29 రోజుల నెలయితే రెండవది తప్పకుండా 30 రోజుల నెల అయి ఉంటుందని ఈ హదీసు భావం. మరికొందరి అభిప్రాయం ప్రకారం, పుణ్యార్జనరీత్యా ఈ రెండు నెలలు సమానమేనని, ఒకటి తక్కువ మరొకటి ఎక్కువ కాదని అర్థం. ఉదాహరణకు రమజాన్ నెలలో పుణ్యార్జనకై ఉపవాసవ్రతాలుంటే, జిల్‌హజ్జ్ నెలలో హజ్ నియమాలుంటాయన్నమాట. కాని ఈ అభిప్రాయాలన్నీ బలహీనమైనవి. 29 రోజుల నెలయినా, 30 రోజుల నెలయినా ఈ రెండు మాసాల పుణ్యం ఎట్టి స్థితిలోనూ తగ్గదు. నెలలో ఒకతేది తగ్గిపోయినంత మాత్రాన పుణ్యంలో కొరత రాదు. [హజ్రత్ నవవీ రహ్మాలై]

ఇచ్చేవరకు నిస్సంకోచంగా తినండి, త్రాగండని దైవప్రవక్త(స) అన్నారు. ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజి) ఫజ్ర్ వేళ అయ్యేదాకా అజాన్ ఇచ్చేవారు కాదు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 17వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) లాయమ్నాకుమ్ మిన్ సహూరికుం అజాన్ బిలాల్]

664. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "తహజ్జుద్ నమాజ్ చేస్తూ ఉండేవాళ్ళు (భోజనానికి) వచ్చేందుకు, నిద్రిస్తున్న వాళ్ళు మేల్కొనేందుకు వీలుగా బిలాల్ (రజి) రాత్రివేళ అజాన్ ఇస్తుంటారు. అందువల్ల ఆయన అజాన్ విని ఎవరూ సహరీ భోజనం తినడం మానివేయనవసరం లేదు. ఆయన ఇచ్చే అజాన్ విని ఉషోదయమయిందని గాని, లేక తెల్లవారిపోయిందని గాని ఏ ఒక్కరూ భావించకూడదు."

దైవప్రవక్త (స) ఇలా చెబుతూ తమ చేతివ్రేళ్ళతో సూచించారు. మొదటి వాటిని పైకి ఎత్తారు. తరువాత క్రిందికి దించారు. అంటే ఈ విధంగా (తెలుపు) వ్యాపించే వరకు అని అర్థం.

[సహీహ్ బుఖారీ : 10వ ప్రకరణం - అజాన్, 13వ అధ్యాయం - అల్‌అజాన్ ఖబ్లల్ ఫజ్ర్]

## 9వ అధ్యాయం - సహ్‌రీ తినడం అభిలషణీయం. సహ్‌రీ ఆలస్యంగా, ఇఫ్తార్ తొందరగా చేయాలి

665. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:- "సహ్‌రీ భోజనం చేయడం శుభానికి కారణభూతమవుతుంది. అందువల్ల మీరు సహ్‌రీ భోజనం చేయండి."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 20వ అధ్యాయం - బరకతిస్సుహూరి మిన్‌గైరి యుజాబ్]

666. హజ్రత్ అనస్ (రజి) కథనం:- హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) తాను దైవప్రవక్త(స)తో కలసి సహ్‌రీ భోజనం చేసినట్లు, భోజనం చేసిన తరువాత అందరూ నమాజ్ చేయడానికి వెళ్ళినట్లు నాకు తెలిపారు. అప్పుడు నేను "సహ్‌రీ, నమాజ్‌ల మధ్య ఎంత విరామం ఉండింది?" అని అడిగాను. దానికి హజ్రత్ జైద్ (రజి) "దాదాపు యాభై లేక అరవై ఆయత్‌లు (ఖుర్‌ఆన్ సూక్తులు) పఠించేటంత సమయం" అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 9వ ప్రకరణం - మవాఖియతుస్సలాత్, 27వ అధ్యాయం - వఖ్తుల్ ఫజ్ర్]

667. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "ప్రజలు ఇఫ్తార్ (ఉపవాస విరమణ) త్వరగా చేస్తున్నంత కాలం మంచికి కట్టుబడి ఉంటారు."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 45వ అధ్యాయం - తాజీలిల్ ఇఫ్తార్]

## 10వ అధ్యాయం - ఉపవాసవ్రతం ముగిసే సమయం

668. హజ్రత్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఈ విధంగా ప్రవచించారు:- "రాత్రి ఇటు (తూర్పు) వైపుకు వచ్చి, పగలు అటు (పశ్చిమం) వైపుకు వెళ్ళి సూర్యుడు (పూర్తిగా) అస్తమించినప్పుడు ఉపవాస విరమణ (ఇఫ్తార్) సమయం అవుతుంది."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 43వ అధ్యాయం - మతాయహిల్లు ఫిత్రుస్సాయిమ్]

669. హజ్రత్ ఇబ్నె అబీ ఔఫా (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(స)తో కలసి ప్రయాణం చేస్తున్నాము. (అది రమజాన్ నెల. సూర్యుడు అస్తమించగానే) దైవప్రవక్త(స) ఒకతడ్ని ఉద్దేశించి "దిగు. దిగి నా కోసం సత్తుపిండి తీసిపెట్టు" అని అన్నారు. అతను ఈ మాట విని "దైవప్రవక్తా! సూర్యరశ్మి ఇంకా మిగిలి ఉంది కదా?" అన్నారు. "దిగు. దిగి నా కోసం సత్తుపిండి తీసిపెట్టు" అన్నారు దైవప్రవక్త(స) మరలా. "దైవప్రవక్తా! సూర్యరశ్మి ఇంకా ఉంది కదా?" అన్నాడు అతను తిరిగి. దైవప్రవక్త(స) మూడవసారి కూడా "దిగు, దిగి నా కోసం సత్తుపిండి తీసిపెట్టు" అన్నారు. అప్పుడు ఆ వ్యక్తి వాహనం నుండి దిగి దైవప్రవక్త(స) కోసం సత్తుపిండి తీసి నీటిలో నానబెట్టి సిద్ధం చేశాడు. దైవప్రవక్త(స) దాన్ని తాగారు. ఆ తరువాత ఆయన తన చేతిని అటు (తూర్పు) వైపు సూచిస్తూ "చూడు. అటువైపు నుంచి చీకటి ముసురుకురావడం చూడగానే ఉపవాసవ్రతాన్ని విరమించండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 33వ అధ్యాయం - అస్సౌమి ఫిస్సఫరి వల్ ఇఫ్తార్]

## 11వ అధ్యాయం - నిర్విరామంగా ఉపవాసాలు పాటించడం నిషిద్ధం

670. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- నిర్విరామంగా ఉపవాసాలు పాటించకూడదని దైవప్రవక్త(స) మమ్మల్ని ఆదేశించారు. అప్పుడు ఆయన అనుచరులు "మరి మీరు నిర్విరామంగా ఉపవాసాలు పాటిస్తున్నారే?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) (నా సంగతి వేరు) "నేను మీలాంటి వాడ్ని కాదు. నాకు తినిపించడం, త్రాగించడం జరుగుతుంది" ★ అని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 48వ అధ్యాయం -అల్‌వసాలి వమన్ ఖాల లైసఫిల్లైలి సియామ్]

671. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) మమ్మల్ని నిర్విరామ ఉపవాసాలు పాటించడాన్ని వారించినప్పుడు అనుయాయులలో ఒకతను "దైవప్రవక్తా! మీరు నిర్విరామంగా ఉపవాసాలు ఉంటున్నారు కదా మరి?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "మీలో నాలాంటివాడు ఎవరున్నారో కాస్త ఆలోచించండి. నా ప్రభువు నాకు రాత్రంతా తినిపిస్తూ త్రాగిస్తూ (ఆధ్యాత్మిక) పారవశ్యాన్ని ప్రసాదిస్తున్నాడు" అని అన్నారు.

ఇంత చెప్పినప్పటికీ జనం నిర్విరామ ఉపవాసాలు ఉండటం మానలేకపోయారు. అప్పుడు దైవప్రవక్త(స) కూడా వారితో పాటు విరామం లేకుండా ఉపవాసాలు పాటించడం ప్రారంభించారు. ఒకటి రెండు రోజులు గడచిన తరువాత (రమజాన్) నెలవంక కన్పించింది. అప్పుడు దైవప్రవక్త(స) "నెలవంక గనక కన్పించి ఉండకపోతే నేను మరికొన్ని రోజుల పాటు ఇలాగే నిర్విరామంగా ఉపవాసాలు ఉండేవాడ్ని" అని అన్నారు. దైవప్రవక్త(స) వారించినప్పటికీ వారు మానుకోనందున

---

★ ఇమామ్ ఇబ్నె ఖయ్యూమ్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం తినిపించడం, త్రాగించడం అంటే - "దేవుడు నాకు తన దివ్యజ్ఞానాన్ని ప్రసాదిస్తూ నా మనోమస్తిష్కాలను జ్యోతిర్మయం చేస్తున్నాడు. ఈ ఉపవాస వ్రతాల సందర్భంగా నాలో అనిర్వచనీయమైన పరవశం మధురానుభూతులు కలుగుతాయి. దేవుని సన్నిధాన సాక్షాత్కారాలు లభిస్తాయి.

ఆయన ఇంకా ఇలా రాస్తున్నారు; 'ఇందులో విచిత్రమేమీ లేదు. దైవసామీప్యం పట్ల శ్రద్ధాశక్తులున్న వ్యక్తి సాధారణ అనుభవం ద్వారా కూడా భక్తి మాధుర్యాన్ని చవిచూడగలడు. ఆత్మకు, అంతరంగానికి కావాల్సిన ఆహారం లభించిందని గ్రహించిన మనిషి పాశవిక పదార్థాల కోసం ఎన్నడూ వెంపర్లాడడు. అంతేకాదు, అతను ప్రాపంచిక వ్యామోహాన్ని త్యజించి ఆధ్యాత్మిక వికాస సాధనలోనే తాదాత్మ్యం చెందుతాడు.

వారిని శిక్షించడానికా అన్నట్లు ఆయన ఈ విధంగా హెచ్చరించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 49వ అధ్యాయం - అత్తన్కీలి లిమనక్సరల్ విసాల్]

672. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా బోధించారు: "నిర్విరామంగా ఉపవాసాలు ఎన్నటికీ పాటించకండి". ఆయన ఈ మాట రెండుసార్లు చెప్పారు. అప్పుడు ప్రవక్త అనుచరులు "మరి మీరు నిర్విరామ ఉపవాసాలు ఉంటున్నారు కదా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "నా ప్రభువు నాకు రాత్రంతా తినిపిస్తూ, త్రాగిస్తూ (ఆధ్యాత్మిక) పారవశ్యాన్ని కలిగిస్తున్నాడు. మీరు (అలా చేయకండి) మీ శక్తి మేరకు మాత్రమే సత్కార్యాల ఆచరణకై శ్రమించండి" అని ఉపదేశించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 49వ అధ్యాయం - అత్తన్కీలి లిమనక్సరల్‌విసాల్]

673. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి నెల చివరి రోజుల్లో నిర్విరామ ఉపవాసాలు పాటిస్తే, ఆయనతో పాటు ఆయన అనుచరులు కూడా కొందరు నిర్విరామ ఉపవాసాలు పాటించడం ప్రారంభించారు. దైవప్రవక్త(స) ఈ సంగతి తెలిసి "ఈ నెల గనక మరింత దీర్ఘంగా ఉంటే వీరు హద్దు మీరడం మానుకునేలా (అంటే నిర్విరామ ఉపవాసాలతో ఢీలా పడిపోయేలా) నేను మరికొన్ని రోజులు ఇలాగే విరామం లేకుండా ఉపవాసాలు పాటించేవాడ్ని. నేను మీలాంటి వాడ్ని కాను (నా సంగతే వేరు). నా ప్రభువు నాకు ఎల్లవేళలా తినిపిస్తూ, త్రాగిస్తూ ఉంటాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 94వ ప్రకరణం - అత్తమన్నీ, 9వ అధ్యాయం - మాయజూజ మినలల్లూ]

674. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) నిర్విరామ ఉపవాసాలు పాటించకండని వారించినప్పుడు ఆయన అనుచరులు "మరి మీరు నిర్విరామ ఉపవాసాలు పాటిస్తున్నారు కదా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త(స) "నేను మీలాంటివాడ్ని కాను. నా ప్రభువు నాకు తినిపిస్తున్నాడు, త్రాగిస్తున్నాడు కూడా" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 48వ అధ్యాయం - అల్‌విసాలి వమన్ ఖాల లైసఫిల్లైలిస్సియామ్]

## 12వ అధ్యాయం - ఉపవాసముండి లైంగికోద్రేకం లేకుండా ముద్దాడవచ్చు

675. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఉపవాసముండి తన భార్యలలో కొందరిని ముద్దుపెట్టుకునేవారు. హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాట చెప్పి పకాలున నవ్వారు (ఆ భార్య తానే అయినట్లు).

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 24వ అధ్యాయం - ఖుబ్లతిస్సాయెమ్]

676. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఉపవాస స్థితిలో (తమ భార్యలను) ఆలింగనం, ముద్దాడటం చేసుకునేవారు. ఆయన మానవులందరిలోకెల్లా ఎంతో లైంగిక నిగ్రహ శక్తి గలవారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 23వ అధ్యాయం - అల్ ముబాషిరతిస్సాయమ్]

## 13వ అధ్యాయం - తెల్లారే దాక లైంగిక అశుద్ధావస్థలో ఉన్నా ఉపవాస వ్రతానికి భంగం రాదు

677. హజ్రత్ అబూ బకర్ బిన్ అబ్దుర్రహ్మాన్ బిన్ హారిస్ బిన్ హెష్షామ్ కథనం ప్రకారం హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)లు ఇలా తెలిపారు:- దైవప్రవక్త(స) తమ భార్యలలో ఒకర్ని కలుసుకొని (ఒక్కోసారి) ఆ రాత్రి తెల్లారేదాకా లైంగిక అశుద్ధావస్థలోనే గడిపేవారు. ఆ తరువాత (ఉషోదయం వేళ) స్నానం చేసి ఉపవాసం ఉండేవారు.

(ఆ కాలంలో మదీనా గవర్నర్‌గా ఉండిన) మర్వాన్ ఈ మాట అబ్దుర్రహ్మాన్ బిన్ హారిస్ (రజి) నోట విని "దేవుని కోసం ఈ విషయం హజ్రత్ అబూ హురైరా(రజి) దగ్గర తప్పకుండా ప్రస్తావించండి" అని అన్నారు. మర్వాన్ పలుకులు అబ్దుర్రహ్మాన్ (రజి)కు నచ్చలేదు. అయితే కాకతాళీయంగా ఓసారి మేమంతా 'జుల్‌హులైఫా' అనే చోట కలుసుకున్నాం. అక్కడ హజ్రత్ అబూహురైరా (రజి) గారి భూములు ఉన్నాయి. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ (రజి) అప్పుడు హజ్రత్ అబూహురైరా (రజి)తో ఇలా అన్నారు: "నేనొక మాట మీ దగ్గర ప్రస్తావించదలిచాను. మర్వాన్ గనక 'దేవుని కోసం' అని చెప్పకపోయి ఉంటే నేనీ విషయాన్ని మీ ముందు ప్రస్తావించేవాడ్ని కాదు" అని అన్నారు. తరువాత ఆయన హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)లు చెప్పిన సంగతి హజ్రత్ అబూ హురైరా (రజి) ముందు ప్రస్తావించారు. హజ్రత్ అబూ హురైరా (రజి) అది విని "ఫజల్ బిన్ అబ్బాస్ (రజి) ఈ విషయాన్ని నాకు ఈ విధంగానే విన్పించారు. దీన్ని గురించి నాకంటే ఆయనకే బాగా తెలుసు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 22వ అధ్యాయం - అస్సాయెమ్ యుసుబహ్‌జుంబన్]

## 14వ అధ్యాయం - ఉపవాసి పగటి వేళ సంభోగించడం నిషిద్ధం

678. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒకతను దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి (తనను గురించే చెప్పుకుంటూ) "ఈ నీచుడు రమజాన్ (ఉపవాస స్థితి)లో తన భార్యతో సంభోగించాడు"అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) "అయితే నీవు ఒక బానిసకు స్వేచ్ఛనివ్వగలవా?" అని అడిగారు. దానికా వ్యక్తి "ఇవ్వలేను" అన్నాడు. "మరి నీవు ఎడతెరిపి లేకుండా రెండు నెలల పాటు ఉపవాసముండగలవా?" అని అడిగారు దైవప్రవక్త(స). దానికి ఆ వ్యక్తి "ఉండలేను" అని సమాధానమిచ్చాడు. "పోనీ, అరవై మంది నిరుపేదలకు అన్నదానం చేయగలవా?" అని అడిగారు దైవప్రవక్త(స)మళ్ళీ. ఆ వ్యక్తి "అదీ చేయలేను" అన్నాడు.

ఆ తరువాత కాస్సేపటికి దైవప్రవక్త(స) దగ్గరకు ఎవరో ఓ ఖర్జూరపండ్ల తట్ట తెచ్చారు. దైవప్రవక్త (స) దాన్ని ఆ వ్యక్తికి చూపిస్తూ "వీటిని తీసుకెళ్ళి నీ వైపున నిరుపేదలకు దానం చెయ్యి" అని అన్నారు. అందుకావ్యక్తి "ఎలా దానం చెయ్యగలను? మదీనా పట్టణం ఇరువైపులా ఉన్న రాతినేల ప్రదేశాల్లో మాకన్నా దరిద్రులు మరెవరూ లేరు" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) "సరే, నువ్వే తీసుకెళ్ళి నీ కుటుంబానికి తినిపించు" అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 31వ అధ్యాయం - అల్ జామివు ఫీరమజాన హల్ యుతఅము అహ్‌లహు మినల్ కఫ్ఫారతి ఇజాకానూ మహావీజ్]

679. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓసారి ఒకతను మస్జిదులో దైవప్రవక్త(స) దగ్గరికి వచ్చి "నేను (నరకాగ్నిలో) కాలిపోయాను" అన్నాడు. దైవప్రవక్త(స) అతని మాటలు విని "ఎలా కాలిపోయావు?" అని అడిగారు. అప్పుడా వ్యక్తి "నేను రమజాన్ (ఉపవాసస్థితి)లో నా భార్యతో సంభోగించాను" అని తెలిపాడు. "అయితే (పాపపరిహారంగా) దానం చెయ్యి" అన్నారు దైవప్రవక్త(స). దానికా వ్యక్తి "దానం చెయ్యడానికి నా దగ్గర చిల్లిగవ్వకూడా లేదు" అని అన్నాడు.

ఆ తరువాత అతను (దూరంగా ఓ చోట) కూర్చున్నాడు. కాస్సేపటికి ఒకతను గాడిద మీద ఆహార సామగ్రి పెట్టుకొని దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చాడు. ( ఈ హదీసు ఉల్లేఖించిన హజ్రత్ అబ్దుర్రహ్మాన్ ఆ సామానేమిటో తనకు తెలియదని అన్నారు.) అప్పుడు దైవప్రవక్త(స), "ఆ కాలిపోయిన వాడు ఎక్కడున్నాడు?" అని అడిగారు. ఆ వ్యక్తి వెంటనే "నేనిక్కడే ఉన్నానండీ!" అన్నాడు. "ఇదిగో వీటిని తీసికెళ్ళి (పాపపరిహారంగా) నిరుపేదలకు దానం చెయ్యి" అని చెప్పారు దైవప్రవక్త(స). "ఏమిటీ! నాకంటే నిరుపేదలకు దానం చెయ్యాలా!! (మా కంటే నిష్టదరిద్రులు ఎవరున్నారు ఈ ఊళ్ళో?) మా ఇంట్లో తింటానికి ఒక మెతుకైనా లేదు" అన్నాడతను. దైవప్రవక్త(స) ఈ మాటలు విని "సరే, నువ్వే పట్టుకెళ్ళి తిను" అన్నారు.

[సహీహ్ బుఖారీ : 86వ ప్రకరణం - హుదూద్, 26వ అధ్యాయం - మన్ అసాబుజంబన్ దూనల్ హద్దిఫ అఖ్బరల్ ఇమామ్]

## 15వ అధ్యాయం - ప్రయాణం రెండు మజిలీలకు మించితే బాటసారి ఉపవాసం విధిగా పాటించనవసరం లేదు

680. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఓసారి రమజాన్ నెలలో మక్కా పట్టణానికి బయలుదేరారు. బయలుదేరే సమయంలో ఆయన ఉపవాసం ఉన్నారు. అయితే కదీద్★ అనే ప్రాంతానికి చేరుకున్న తరువాత ఆయన ఉపవాసాన్ని విరమించారు. ఆయనతో పాటు ఇతరులు (అనుచరులు) కూడా ఉపవాస విరమణ చేశారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 34వ అధ్యాయం - ఇజాసామ అయ్యామన్ మిర్రమజాన్]

681. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి ప్రయాణం చేస్తూ ఒక చోట ఒక జన సమూహాన్ని చూశారు. ఆ జనం ఒక వ్యక్తికి ఎండ తగలకుండా నీడ పట్టసాగారు. అప్పుడు దైవప్రవక్త(స) "ఏమిటిదీ?" అని అడిగారు. దానికి ప్రజలు "ఇతను ఉపవాసం ఉన్నాడండీ" అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) "ప్రయాణావస్థలో ఉన్నప్పుడు ఉపవాసముండటం సత్కార్యం అన్పించుకోదు" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 36వ అధ్యాయం - ఖౌలిన్నబీ (స) లిమన్ జుల్లిల అలైహి వష్తద్దల్ హర్రు లైస మినల్ బిర్రిస్సౌము ఫిస్సఫర్]

---

★ 'కదీద్' అనేది ఒక ప్రాంతం పేరు. ఈ ప్రాంతం మదీనా నుండి ఏడు మజిలీల (అంటే దాదాపు 42 మైళ్ళు) దూరంలో ఉంది. అక్కడ్నుంచి మక్కా పట్టణం రెండు మజిలీల దూరంలో ఉంటుంది. ఈ ప్రాంతంలో ఒక సెలయేరు కూడా ఉంది.

682. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(స)తో కలసి ప్రయాణం చేస్తున్నాము. ఆ ప్రయాణంలో ఉపవాసమున్నవారు ఉపవాసం లేనివారికి, ఉపవాసం లేని వారు ఉపవాసం ఉన్నవారికి (ఉపవాస విషయంలో) ఎలాంటి అభ్యంతరం చెప్పలేదు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 37వ అధ్యాయం - లమ్‌యయిబ్ అస్ హాబున్నబీ (సల్లం) బాజుహుమ్ బాజన్ ఫిస్సౌమి వల్ ఇఫ్తార్]

## 16వ అధ్యాయం - ప్రయాణావస్థలో ఉపవాసం పాటించకుండా పని చేయడమే ఎక్కువ పుణ్యప్రదం

683. హజ్రత్ అనస్ (రజి) కథనం:- మేమొకసారి (ప్రయాణంలో) దైవప్రవక్త(సల్లం) వెంట ఉన్నాము. మాలో (ఎండ తగలకుండా) పైన దుప్పటి పరచుకున్న వాడికి అందరికంటే ఎక్కువ నీడ లభించింది. ఉపవాసం ఉన్నవాళ్ళు ఎలాంటి పనులు చేయలేదు. ఉపవాసం లేనివాళ్ళు మాత్రం ఒంటెలకు నీళ్ళు త్రాగించడం, వాటిని ఇతర పనులకు ఉపయోగించడం, (గుడారాలు వేయడం) మొదలైన ఎన్నో సేవలు చేశారు. దైవప్రవక్త(సల్లం) ఈ స్థితిని చూసి "ఈ రోజు ఉపవాసం లేనివాళ్ళు (అత్యధిక) పుణ్యాన్ని ఆర్జించారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్ వస్సైర్, 70వ అధ్యాయం - ఫజ్లిల్ ఖిద్మతి ఫిల్ గజ్వ]

## 17వ అధ్యాయం - ప్రయాణావస్థలో ఉపవాసం ఉండవచ్చు, ఉండకపోవచ్చు కూడా

684. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హమ్జా బిన్ అమ్ర్ సల్మా(రజి) దైవప్రవక్త(సల్లం)ని "ప్రయాణావస్థలో నేను ఉపవాసం పాటించనా?" అని అడిగారు. ఈయన అత్యధిక ఉపవాసాలు పాటించేవారు. దైవప్రవక్త(సల్లం) అతని మాటలు విని, "అది నీ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంది. ఉపవాసం ఉండవచ్చు, ఉండకపోవచ్చు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 33వ అధ్యాయం - అస్సౌమి ఫిస్సఫరి వల్ ఇఫ్తార్]

685. హజ్రత్ అబూదర్దా (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(సల్లం)తో కలసి (ఓ ప్రాంతానికి) ప్రయాణమయ్యాము. ఎండ తీక్షణమయిపోయింది. జనం ఎండవేడికి తాళలేక తలలపై చేతులు పెట్టుకునేవారు. మాలో దైవప్రవక్త(సల్లం), ఇబ్నె రవాహా(రజి)లు తప్ప ఎవరూ ఉపవాసం ఉండలేదు.

[సహీహ్ బుఖారీ, 30వ ప్రకరణం-సౌమ్, 35వ అధ్యాయం - హద్దసనా అబ్దుల్లాహ్ బిన్ యూసుఫ్]

## 18వ అధ్యాయం - అరఫాత్‌లో ఆగినపుడు హాజీలు ఉపవాసం ఉండకపోవడం అభిలషణీయం

686. హజ్రత్ ఉమ్ముల్ ఫజల్ బిన్తె హారిస్ (రజి) కథనం:- అరఫాత్‌లో ఆగే రోజున కొందరు వ్యక్తులు 'ఈ రోజు దైవప్రవక్త(సల్లం) ఉపవాసం ఉన్నారా లేదా' అనే విషయం గురించి నా ఎదుట పరస్పరం భేదాభిప్రాయాలు వ్యక్తపరచుకున్నారు. దైవప్రవక్త(సల్లం) ఈ రోజు ఉపవాసం ఉన్నారని కొందరంటే,

ఆయన ఈ రోజు ఉపవాసం లేరని మరికొందరు అన్నారు. ఆ తరువాత నేను దైవప్రవక్త(సల్లం) దగ్గరకు ఒక గిన్నెడు పాలు పంపించాను. ఆ సమయంలో దైవప్రవక్త(సల్లం) (అరఫాత్ మైదానంలో) ఒంటె మీద కూర్చొని వఖూఫ్ చేసి (అంటే ఆగి) ఉన్నారు. నేను పంపిన ఆ పాలను ఆయన త్రాగారు.

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 88వ అధ్యాయం - అల్ వఖూఫి అలద్దాబ్బతి బిఅరఫా]

687. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూన (రజి) కథనం:- అరఫా రోజు జనానికి దైవప్రవక్త(స) ఉపవాసం ఉన్నారో లేదోనన్న అనుమానం వచ్చింది. (ఆ అనుమానం తీర్చడానికి) నేను దైవప్రవక్త(స) దగ్గరకు ఓ గిన్నెడు పాలు పంపాను. ఆ సమయంలో ఆయన అరఫాత్‌లో ఆగి ఉన్నారు. ఆయన ఆ పాలను ప్రజల సమక్షంలోనే త్రాగారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 65వ అధ్యాయం - సౌమి అరఫా]

## 19వ అధ్యాయం - ఆషూరా రోజు (ముహర్రం పదో తేది) ఉపవాసం

688. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- అజ్ఞానకాలంలో ఖురైషులు 'ఆషూరా' రోజున ఉపవాసం పాటించేవారు. అందువల్ల దైవప్రవక్త(స) కూడా ఆ రోజు ఉపవాసం ఉండాలని ప్రజలను ఆదేశించారు. అయితే రమజాన్ ఉపవాసాలు ఫర్జ్(విధి) అయినప్పుడు దైవప్రవక్త(స) ఆషూరా ఉపవాసాన్ని గురించి ప్రస్తావిస్తూ "ఆషూరా రోజు ఇష్టమయినవాళ్ళు ఉపవాసం పాటించవచ్చు, ఇష్టం లేని వాళ్ళు దాన్ని వదిలేయవచ్చు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 30వ ప్రకరణం - సౌమ్, 1వ అధ్యాయం - ఉజూబి సౌమి రమజాన్]

689. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- అజ్ఞాన కాలంలో ప్రజలు ఆషూరా రోజు ఉపవాసం ఉండేవారు. అయితే రమజాన్ ఉపవాసాలు విధిగా చేయబడినప్పుడు "ఇష్టమున్న వాళ్ళు ఆషూరా రోజు ఉపవాసం ఉండవచ్చు. ఇష్టం లేని వాళ్ళు మానెయ్యవచ్చు" అని చెప్పారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ - బఖరా సూరా: 24వ అధ్యాయం - యాఅయ్యుహల్లజీన ఆమనూకుతిబ అలైకుముస్సియామ్]

690. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ హదీసు:- ఓ రోజు హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) దగ్గరకు అష్అత్ బిన్ ఖైస్ (రహ్మాలై) వచ్చారు. ఆ సమయంలో హజ్రత్ అబ్దుల్లా (రజి) భోజనం చేస్తున్నారు. అష్అత్ (రహ్మాలై) మాట్లాడుతూ "ఈ రోజు ఆషూరా రోజు" అన్నారు. దానికి హజ్రత్ అబ్దుల్లా (రజి) సమాధానమిస్తూ "రమజాన్ ఉపవాసాలు విధిగా చేయబడక పూర్వం జనం ఆషూరా రోజు ఉపవాసం పాటించేవారు. రమజాన్ ఉపవాసాలు విధిగా చేయబడిన తరువాత (జనం) ఆషూరా ఉపవాసం వదిలేశారు. రండి, మీరు కూడా భోజనం చేయండి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, బఖరా సూరా; 24వ అధ్యాయం - యాఅయ్యుహల్లజీన ఆమనూ కుతిబ అలైకుమ్]

691. హజ్రత్ హమీద్ బిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ముఆవియా బిన్ అబూ సుఫ్యాన్ (రజి) హజ్ యాత్ర చేసిన సంవత్సరం (ఓ రోజు) వేదిక ఎక్కి ఆషూరా రోజు గురించి ఇలా

మాట్లాడుతుండగా నేను విన్నాను: "మదీనా వాసులారా! మీ ధర్మవేత్తలు ఎక్కడున్నారు? నేను దైవప్రవక్త(స) నోట ఈ ప్రవచనం విన్నాను - ఈ రోజు ఆషూరా రోజు. ఈ రోజు విధిగా ఉపవాసం పాటించనవసరం లేదు. అయినా నేను ఈ రోజు ఉపవాసం ఉన్నాను. మీ కిష్టమయితే ఉపవాసం ఉండవచ్చు, లేకపోతే మానెయ్యవచ్చు."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 69వ అధ్యాయం - సియామి యౌమె ఆషూరా]

692. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) మదీనాకు(వలస) వచ్చినప్పుడు ఆయన (మదీనా) యూదులు ఆషూరా రోజు ఉపవాసం పాటించడం చూశారు. అప్పుడు ఆయన "ఈ ఉపవాసం ఏమిటి?" అని అడిగారు వాళ్ళను. దానికి వారు సమాధానమిస్తూ "ఈ రోజు సుదినం. ఈ దినమే దేవుడు ఇస్రాయీల్ సంతతిని వారి శత్రువుల బారి నుండి విముక్తి కలిగించాడు. అంచేత మూసా (అలైహి) ఈ దినమే ఉపవాసం పాటించారు" అని అన్నారు. ఈ కారణంగానే దైవప్రవక్త(స) ఆషూరా రోజు స్వయంగా ఉపవాసం ఉండి, ఇతరుల్ని కూడా ఆ రోజు ఉపవాసం ఉండాలని ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 69వ అధ్యాయం - సియామి యౌమి ఆషూరా]

693. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- ఆషూరా రోజు యూదుల పర్వదినం. అందువల్ల ఆ రోజు ముస్లింలు కూడా ఉపవాసం పాటించాలని దైవప్రవక్త(స) ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ: 30వ ప్రకరణం - సౌమ్, 69వ అధ్యాయం - సియామి యౌమి ఆషూరా]

694. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఆషూరా రోజు, రమజాన్ నెల తప్ప మరే రోజుకు, మరే నెలకు, ఇతర రోజులకు, ఇతర నెలలకన్నా ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం నేను చూడలేదు.

[సహీహ్ బుఖారీ - 30వ ప్రకరణం - సౌమ్, 69వ అధ్యాయం - సియామి యౌమి ఆషూరా]

## 21వ అధ్యాయం - ఆషూరా రోజు ఏదైనా కాస్త తింటే ఇక ఆ రోజు మిగిలిన సమయంలో ఏమీ తినరాదు

695. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఆషూరా రోజు ఒక వ్యక్తిని ఈ విధంగా చాటింపు వేయమని పంపించారు: "ఈ రోజు ఎవరైనా ఏదైనా కాస్త తిని ఉంటే వారా రోజు మిగిలిన సమయాన్ని (మరేమీ తినకుండా) గడపాలి" లేక ఈ విధంగా చాటింపు వేయించారు: "మిగిలిన సమయం ఉపవాసం పాటించాలి. ఇంత వరకు ఏమీ తినని వారు ఇప్పుడిక మరేమీ తినకుండా (ఉపవాసం) ఉండాలి".

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 21వ అధ్యాయం - ఇజా నవాబిన్నహారి సౌమా]

696. హజ్రత్ రబీ బిన్తె మవూజ్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఆషూరా రోజు ఉదయం వేళ అన్సార్ వాడలకు ఇలా ఒక ఆజ్ఞ పంపించారు; "ఈ రోజు ఉపవాసం లేనివారు కూడా మిగిలిన దినం (ఏమీ తినకుండా) పూర్తి చేయాలి (గడపాలి). ఉపవాసం ఉంటానని సంకల్పించుకున్నవారు (తప్పకుండా) ఉపవాసం ఉండాలి".

"ఈ ఆజ్ఞ జారీ అయిన దగ్గర్నుంచి మేమంతా ఆషూరా రోజు ఉపవాసం పాటించేవాళ్ళము. మా పిల్లల చేత కూడ ఉపవాసం పాటింపజేసేవాళ్ళము. పిల్లలు ఆడుకోవటానికి మేము ఉన్ని బొమ్మలు తయారు చేసి ఇచ్చేవాళ్ళము. ఏ పిల్లవాడైనా అన్నం పెట్టమని మారాము చేస్తే మేమతనికి ఉపవాసవిరమణ సమయం అయ్యే వరకు ఆడుకునేందుకు బొమ్మలు ఇచ్చేవాళ్ళము".

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 47వ అధ్యాయం - సౌమిస్సిబ్యాన్]

## 22వ అధ్యాయం - ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్హా రోజుల్లో ఉపవాసం నిషిద్ధం

697. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం:- ఈ రెండు రోజుల్లో ఉపవాసం పాటించడాన్ని దైవప్రవక్త(సల్లం) వారించారు. ఒకటి, మీరు రమజాన్ ఉపవాసాలు పూర్తి చేసిన తర్వాత వచ్చే ఫిత్రా దినం. రెండు, మీరు ఖుర్బానీ మాంసం తినే దినం.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 66వ అధ్యాయం - సౌమి యౌముల్ ఫిత్ర్]

698. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజు, ఈదుల్ అజ్హా (బక్రీదు పండుగ) రోజు ఉపవాసం పాటించడాన్ని దైవప్రవక్త(సల్లం) నిషేధించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 66వ అధ్యాయం - సౌమి యౌముల్ ఫిత్ర్]

699. హజ్రత్ జియాద్ బిన్ జుబైర్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) దగ్గరకి ఒక వ్యక్తి వచ్చి "ఒకతను ఓ ప్రత్యేక దినం ఉపవాసం ఉంటానని మొక్కుబడి చేసుకున్నాడు" అని అన్నాడు. ఆ వ్యక్తి సోమవారం అని చెప్పి ఉంటాడు - యాదృచ్ఛికంగా ఆ రోజు పండుగ రోజయిపోయింది. హజ్రత్ ఉమర్(రజి) అతనికి సమాధానమిస్తూ "దేవుడు తన కోసం (దాసులు) చేసే మొక్కుబడిని నెరవేర్చాలని ఆదేశించాడు. అయితే దైవప్రవక్త(సల్లం) ఆ రోజు (పండుగ రోజు) ఉపవాసం పాటించకూడదని అన్నారు" అని తెలిపారు.*

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 67వ అధ్యాయం - అస్సౌమి యౌమున్నహ్ర్]

## 24వ అధ్యాయం - కేవలం శుక్రవారమే ఉపవాసముండటం అవాంఛనీయం

700. హజ్రత్ ముహమ్మద్ బిన్ అబ్బాద్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి)తో

---

★ హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) విషయంలోని రెండు కోణాలను వివరించి, నిర్ణయం తీసుకునే బాధ్యత ప్రశ్నించే వ్యక్తికి వదిలేశారు. ఇలాంటి వ్యవహారాల్లో సమస్య పరిష్కారం కోసం ఊహా, అంచనా యత్నాలకు అనుమతి ఉన్నప్పటికీ ఈ మహనీయులు ఖుర్‌ఆన్, ప్రవక్త సంప్రదాయాల్లో ఏ మాత్రం ఎక్కువగాని, తక్కువగాని చేయడాన్ని సహించరు. ఇది వారి అత్యున్నత దైవభీతిపరాయణతకు ఓ మచ్చుతునకని చెప్పవచ్చు. పండుగ రోజు ఉపవాసముండటం 'ఏకీకృత సమ్మతి'తో నిషేధిత విషయంగా పరిగణించబడింది. మొక్కుబడి ఉపవాసమైనా, ఖజా ఉపవాసమైనా, ఐచ్ఛిక ఉపవాసమైనా, ప్రాయశ్చిత్త ఉపవాసమైనా, మరే విధమైన ఉపవాసమైనా సరే పండుగ రోజు దాన్ని పాటించడం నిషిద్ధం.

అయితే పండుగ రోజే ఉపవాసముంటానని ఎవరైనా మొక్కుబడి చేసుకుంటే, ఇమామ్ షాఫయి (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం అలాంటి మొక్కుబడి చెల్లనే చెల్లదు. దానికి ప్రాయశ్చిత్తం, పాపపరిహారాల ప్రశ్న కూడా తలెత్తదు. ఖజా ఉపవాసం కూడా పాటించనవసరం లేదు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం మొక్కుబడి తప్పనిసరిగా తీర్చవలసి ఉంటుంది. అందువల్ల ఖజా ఉపవాసం విధిగా పాటించాలి. ఒకవేళ ఆ రోజు (అంటే పండుగ రోజు) ఉపవాసముంటే మొక్కుబడి మాత్రం తీరిపోతుంది. కాని నిషేధిత పనికి పాల్పడినందుకు ఆ వ్యక్తి పాపాత్ముడయి పోతాడు.

"శుక్రవారం ఉపవాసం ఉండకూడదని దైవప్రవక్త(సల్లం) చెప్పారా?" అని అన్నాను. దానికి ఆయన "ఔనన్నారు."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 63వ అధ్యాయం - సౌమి యౌముల్ జుముఅ]

701. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "శుక్రవారం నాడు ఏ ఒక్కరూ ఉపవాసం ఉండకూడదు. ఉపవాసం ఉండదలచుకునేవారు దానికి ఒక రోజు ముందో లేక వెనుకో ఉపవాసం ఉండవచ్చు".

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 63వ అధ్యాయం - సౌమి యౌముల్ జుముఅ]

## 25వ అధ్యాయం - "వఅలల్లజీన యుతీఖూనహూఫిద్యా" అనే సూక్తి రద్దయింది

702. హజ్రత్ సలమా బిన్ అక్వా(రజి) కథనం:- (దివ్యఖుర్ఆన్‌లో) "ఉపవాసం పాటించగలవారు (పాటించని పక్షంలో) ఫిదియా (పరిహారం) చెల్లించాలి. ఒకరోజు ఉపవాసానికి పరిహారంగా ఒక నిరుపేదకు అన్నదానం చేయాలి" (2:184) అనే సూక్తి అవతరించినపుడు ఉపవాసం ఉండదలచుకోని వారు ఫిదియా చెల్లించేవారు. చివరికి "కనుక ఇక నుండి ఈ నెల (రమజాన్)ను గాంచేవారు ఈ నెల రోజులు విధిగా ఉపవాసం పాటించాలి" అనే సూక్తి అవతరించింది. ఇది దాని ముందు సూక్తిని రద్దు చేసింది.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ బఖరా సూరా, 26వ అధ్యాయం - ఫమన్ షహద మిన్కుముష్షహ్ర]

## 26వ అధ్యాయం - రమజాన్‌లో ఉండలేని ఉపవాసాలు షాబాన్ నెలలో పాటించాలి

703. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నాకు రమజాన్ ఉపవాసాలు 'ఖజా' అయి మిగిలి ఉండేవి. వాటిని నేను (రాబోయే) షాబాన్ నెలలో (మాత్రమే) పాటించగలిగేదాన్ని.*

[సహీహ్ బుఖారీ: 30వ ప్రకరణం - సౌమ్, 40వ అధ్యాయం - మతాయుఖ్జా ఖజావు రమజాన్]

## 27వ అధ్యాయం - మృతుని తరఫున ఖజా రోజాలు పాటించటం

704. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "ఎవరైనా చనిపోయి, అతను విధిగా పాటించవలసిన కొన్ని ఉపవాసాలు మిగిలిపోయి ఉంటే వాటిని అతని తరఫున అతని వారసుడు పాటించాలి."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 42వ అధ్యాయం - మమ్మాతవ అలైహిసౌమ్]

705. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) దగ్గరికి ఒక వ్యక్తి వచ్చి "దైవప్రవక్తా! నా తల్లి చనిపోయింది. ఆమె విధిగా పాటించవలసిన కొన్ని ఉపవాసాలు మిగిలి ఉన్నాయి. మరి నేను ఈ ఉపవాసాలను ఆమె తరఫున ఖజా ఉపవాసాలుగా పాటించనా?" అని

---

★ ఖజా ఉపవాసాలు వెంటనే పాటించనవసరం లేదు. ఆలస్యంగా సంవత్సరంలో ఎప్పుడైనా వాటిని పాటించవచ్చు. ఇలా చేయడం దైవప్రవక్త(సల్లం) హయాంలో ధర్మసమ్మతమైన విషయమే.

అడిగాడు. దానికి దైవప్రవక్త(సల్లం) "ఆ....పాటించు" అన్నారు. ఇంకా ఇలా అన్నారు. "దేవుని రుణం తప్పకుండా తీర్చాలి".★

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 42వ అధ్యాయం - మమ్మాతవ అలైహి సౌమ్]

## 29వ అధ్యాయం - ఉపవాసకుడు నోరు పారేసుకోరాదు

706. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- "ఉపవాసము ఒక డాలు వంటిది. (కాబట్టి) ఉపవాసి అశ్లీలమైన పలుకులు పలకడం గానీ, మూర్ఖుల్లా, అజ్ఞానుల్లా ప్రవర్తించడం గాని చేయకూడదు. ఎవరైనా అతనితో జగడానికి దిగితే లేదా దూషిస్తే అతనావ్యక్తితో తాను ఉపవాసం ఉన్నానని రెండుసార్లు చెప్పాలి."

(ఆయన ఇంకా ఇలా అన్నారు:) "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యంగా చెబుతున్నాను, ఉపవాసి నోటి వాసన దేవుని దృష్టిలో కస్తూరి సువాసన కన్నా ఎంతో శ్రేష్ఠమయినది. దేవుడు ఇలా అంటున్నాడు - ఉపవాసి నా (ప్రసన్నత) కోసం ఆహారపానీయాలు, లైంగిక వాంఛలు త్యజిస్తున్నాడు. ఉపవాసం ప్రత్యేకంగా నా కోసం పాటించబడుతుంది. అందువల్ల స్వయంగా నేనే దాని పుణ్యఫలాన్ని (ఉపవాసికి) ప్రసాదిస్తాను. ఒక సత్కార్యానికి పదింతల పుణ్యం లభిస్తుంది".

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 2వ అధ్యాయం - ఫజ్లిస్సౌమ్]

## 30వ ప్రకరణం - ఉపవాసం ఔన్నత్యం

707. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "దేవుడు ఈ విధంగా తెలియజేస్తున్నాడు. మానవుడు చేసే సత్కార్యాలన్నీ తన కోసమే ఉన్నాయి. అయితే ఉపవాసం సంగతి అలా కాదు. ఉపవాసం నా కోసం ప్రత్యేకంగా పాటించబడుతుంది. అందువల్ల నేను స్వయంగా దానికి ప్రతిఫలం ప్రసాదిస్తాను - ఉపవాసం ఒక డాలు వంటిది. మీలో ఎవరైనా ఉపవాసం పాటిస్తే వారు అశ్లీలపు పలుకులు పలకరాదు, పోట్లాటల్లో దిగకూడదు; ఎవరైనా దూషిస్తే లేక జగడానికి దిగితే అలాంటి వ్యక్తితో తాము ఉపవాసం పాటిస్తున్నామని చెప్పాలి."

"ఎవరి అధీనంలో ముహమ్మద్ (సల్లం) ప్రాణం ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్ష్యం! ఉపవాసకుడి నోటి వాసన దేవుని దృష్టిలో కస్తూరి సువాసన కంటే ఎంతో శ్రేష్ఠమయినది. ఉపవాసి రెండు సందర్భాల్లో అమితానందం పొందుతాడు. ఒకటి : ఉపవాసం విరమిస్తున్నప్పుడు. రెండు: తన ప్రభువును సందర్శించినపుడు ఉపవాస పుణ్యఫలం చూసి".

[సహీహ్ బుఖారీ: 30వ ప్రకరణం - సౌమ్, 9వ అధ్యాయం - హల్ యఖూలు ఇన్నీ సాయిమున్ ఇజాసితుమ్?]

708. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:-

★ ముస్లిం గ్రంథంలో ఈ ఉల్లేఖనం ఈ విధంగా ఉంది: "నీ తల్లి మీద అప్పు తీర్చే బాధ్యత ఉంటే దాన్ని నీవు తీర్చవా?" అని ప్రశ్నించారు దైవప్రవక్త(సల్లం). దానికా వ్యక్తి "తీర్చుతాను" అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "అయితే దేవుని రుణం తీర్చే బాధ్యత అంతకంటే ముఖ్యమైనది" అని అన్నారు.

"స్వర్గంలో 'రయ్యాన్' అనే ఒక ద్వారం ఉంది. ప్రళయదినాన ఉపవాసకులు మాత్రమే ఆ ద్వారం గుండా (స్వర్గంలో) ప్రవేశిస్తారు. వారు తప్ప మరెవరూ ఆ ద్వారంలో ప్రవేశించలేరు. 'ఉపవాసకులు ఎక్కడున్నారు?' అని పిలుస్తారు (దైవదూతలు). అప్పుడు ఉపవాసకులంతా లేచి నిలబడతారు. (తర్వాత వారాద్వారం గుండా స్వర్గంలో ప్రవేశిస్తారు) వారు తప్ప మరెవ్వరూ ఆ ద్వారంలో ప్రవేశించలేరు. ఉపవాసకులంతా (స్వర్గంలో) ప్రవేశించిన తర్వాత ఆ ద్వారం మూసివేయబడుతుంది. ఇక ఎవరూ (ఆ ద్వారంలో) ప్రవేశించలేరు".

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 4వ అధ్యాయం - అర్రయ్యాని లిస్సాయిమీన్]

## 31వ అధ్యాయం - దైవయోధుని ఉపవాసం ఘనత

709. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "దైవమార్గంలో పోరాడుతూ ఒక రోజు ఉపవాసం పాటించే వ్యక్తిని దేవుడు నరకానికి డెబ్భై యేండ్ల (ప్రయాణం) మేరకు దూరంగా ఉంచుతాడు".

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్‌వస్సైర్, 36వ అధ్యాయం - ఫజ్లుస్సౌమి ఫీసబీలిల్లాహ్]

## 33వ అధ్యాయం - మరచిపోయి తినడం, త్రాగడం వల్ల ఉపవాసం భంగం కాదు

710. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "ఉపవాసి మరిచిపోయి ఏదైనా తింటే, త్రాగితే (ఆ తరువాత మరేమీ తినకుండా, త్రాగకుండా) ఆ రోజు ఉపవాసాన్ని పూర్తి చేయాలి. ఎందుకంటే దేవుడు అతన్ని తినిపించాడు, త్రాపించాడు గనక."★

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 26వ అధ్యాయం - అస్సామమి ఇజా అకుల వష్‌రబ నాసియా]

## 34వ అధ్యాయం - దైవప్రవక్త వారి నఫిల్ రోజాలు (ఐచ్ఛిక ఉపవాసాలు)

711. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఉపవాసాలు పాటించడం మొదలు పెడితే ఆగకుండా వరుసగా పాటిస్తూనే ఉండేవారు. ఈ పద్ధతి చూస్తుంటే ఇక ఆయన ఉపవాసాలు విరమించరేమోననిపిస్తుండేది మాకు. అలాగే ఆయన ఉపవాసాలుండటం మానేస్తే (చాలా రోజుల దాకా ఇదే స్థితి కొనసాగేది) చివరికి మేము ఇక ఆయన ఉపవాసాలు పాటించరేమోనని భావించేవాళ్ళము. అదీగాక ఒక్క రమజాన్ నెల తప్పిస్తే మరే నెల కూడా ఆయన పూర్తి నెల రోజులు ఉపవాసం ఉండే

★ ఉపవాసముండి మతిమరుపుతో ఏదైనా తింటే, త్రాగితే లేదా సంభోగిస్తే ఉపవాస వ్రతం భంగం కాదని అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం. ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై), ఇమామ్ షాఫయి (రహ్మలై), దావూద్ జాహిరి (రహ్మలై), రబీఅ (రహ్మలై) ప్రభృతుల అభిప్రాయం కూడా ఇదే. ఇమామ్ మాలిక్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఉపవాస వ్రతం నెరవేరదు. కాని తరువాత ఖజా ఉపవాసం పాటించవలసి ఉంటుంది. ప్రాయశ్చిత్తం (కప్ఫారా) మాత్రం ఉండదు. అతా (రహ్మలై), ఔజాయి (రహ్మలై), లైస్ (రహ్మలై)ల అభిప్రాయం ప్రకారం సంభోగం జరిగితే ఖజా ఉపవాసం తప్పనిసరిగా పాటించాలి. ఆహార పానీయాలు సేవిస్తే మాత్రం ఖజా ఉపవాసం పాటించనవసరం లేదు. ఇమామ్ అహ్మద్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం సంభోగం జరిగిన పక్షంలో ఖజా ఉపవాసం పాటించడమే కాక, కప్ఫారా కూడా చెల్లించవలసి ఉంటుంది. ఆహార పానీయాల విషయంలో మాత్రం ఖజా ఉపవాసం గాని, కప్ఫారా గాని ఉండదు. ఏమయినప్పటికీ ఈ హదీసులో అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయమే సరయినదన్న భావం స్ఫురిస్తోంది. - నవవీ (రహ్మలై)

వారు కాదు. అలాగే ఒక్క షాబాన్ నెలలో తప్ప మరే నెలలో కూడా ఆయన ఎక్కువ ఉపవాసాలు పాటించినట్లు నేను చూడలేదు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 52వ అధ్యాయం - సౌమిషాబాన్]

712. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) షాబాన్ నెలలో తప్ప మరే నెలలో కూడా ఎక్కువ (నఫిల్) ఉపవాసాలు పాటించేవారు కాదు. షాబాన్‌లో ఆయన పూర్తి నెల రోజులు ఉపవాసం పాటించేవారు.

దైవప్రవక్త(సల్లం) (ప్రజల ఆచరణాశక్తి గురించి ప్రస్తావిస్తూ) "మీరు చేయగలిగిన సత్కార్యమే చేస్తూ ఉండండి. మీరే ఆరాధన, సత్కార్యాలు చేస్తూ అలసిపోతారు గాని దేవుడు మాత్రం (మీ సత్కార్యాలకు) పుణ్యాన్ని ప్రసాదించడంలో ఎన్నటికీ అలసిపోడు" అని అన్నారు. సంఖ్య, పరిమాణాల్లో ఎంత చిన్నదయినాసరే నిరంతరం, నిరాఘాటంగా చేసే నమాజ్ మాత్రమే దైవప్రవక్త(సల్లం)కు అత్యంత ప్రీతికరమైన ప్రార్థన."

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 52వ అధ్యాయం - సౌమిషాబాన్]

713. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) రమజాన్ నెల తప్ప మరే నెల కూడా పూర్తి నెలరోజులు ఉపవాసం ఉండేవారు కాదు. ఆయన ఉపవాసం పాటించడం మొదలుపెడితే అలా రోజుల తరబడి నిర్విరామంగా పాటిస్తూనే ఉంటారు. జనం ఈ పరిస్థితి చూసి "దైవసాక్షి! ఇక ఈయన ఉపవాసవ్రతం మాననే మానరు" అని భావించేవారు. అదే విధంగా దైవప్రవక్త(సల్లం) ఉపవాస వ్రతం విరమిస్తే (అలా చాలా రోజులు గడచిపోతాయి) జనం ఆ పరిస్థితిని చూసి "దైవసాక్షి! ఇక ఈయన ఉపవాసాలు ఉండరు" అని తలచేవారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 53వ అధ్యాయం - మాయజ్కురు ఫీ సౌమిన్నబీ (సల్లం) వ ఇఫ్తార్]

## 35వ అధ్యాయం - నష్టం కలిగే ప్రమాదముంటే నిరంతరాయంగా ఉపవాసాలు పాటించకూడదు

714. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- నేను జీవితాంతం పగలంతా ఉపవాసముంటూ రాత్రంతా ఆరాధనలో గడుపుతుంటానని శపథం చేశాను. ఈ సంగతి దైవప్రవక్త(సల్లం)కు తెలిసి "ఏమిటీ నువ్విలా చేస్తానని శపథం చేశావా?" అని అడిగారు. నేను (ఈ విషయాన్ని అంగీకరిస్తూ) "నా తల్లిదండ్రులు మీకై అర్పితమవుగాక! నేనిలా చేశాను" అని అన్నాను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) (నాకు హితబోధ చేస్తూ) "ఇది నీవల్ల సాధ్యమయ్యే పనికాదు నీవు కొన్నాళ్ళపాటు ఉపవాసాలు పాటించు, మరి కొన్నాళ్ళ పాటు వాటిని మానెయ్యి. అలాగే రాత్రిపూట ఆరాధన కూడా చెయ్యి, నిద్ర కూడా పో. ప్రతినెలా మూడు రోజులు ఉపవాసం ఉండు(చాలు). ఒక్క సత్కార్యానికి పదింతల పుణ్యం లభిస్తుంది. ( ఈ లెక్కన మూడు రోజుల ఉపవాసానికి ముప్పై రోజుల ఉపవాస పుణ్యం లభిస్తుంది). ఇలా చేస్తే ఎల్లప్పుడూ ఉపవాసం పాటిస్తున్నట్లే లెక్క" అని అన్నారు.

నేనీ మాటలు విని "నాకు ఇంతకంటే ఎక్కువ శక్తి ఉంది (ఇంక ఎక్కువ రోజులు ఉపవాసం

ఉండగలను)'' అని అన్నాను. ''అయితే ఒక రోజు ఉపవాసం ఉండి రెండు రోజులు మానెయ్యి'' అన్నారు దైవప్రవక్త(స). ''నాకు ఇంతకంటే కూడా ఎక్కువ శక్తి ఉంది'' అన్నానేను. ''సరే, ఒక రోజు విడిచి ఒక రోజు ఉపవాసం పాటించు. హజ్రత్ దావూద్ (అలైహి) పాటించే ఉపవాస విధానం కూడా ఇదే. ఇదే అన్నిటికంటే ఉత్తమ పద్ధతి''' చెప్పారు దైవప్రవక్త(స). ''నాకు ఇంతకంటే కూడా ఎక్కువ శక్తి ఉంది'' అన్నా నేను మళ్ళీ. దానికి దైవప్రవక్త(స) ''దీనికి మించిన మంచి పద్ధతే లేదు'' అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 56వ అధ్యాయం - సౌముద్దహ్ర్]

715. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) నన్ను పిలిచి ''నీవు పగలంతా ఉపవాసముంటూ, రాత్రిళ్ళు తెల్లారే దాకా ఆరాధనలో గడుపుతున్నావట నిజమేనా?'' అని అడిగారు. నేను ''నిజమే దైవప్రవక్తా! ఇలా చేస్తున్నాను'' అని అన్నాను.

''సరే ఇక ముందు అలా చేయకు. ఉపవాసం పాటించు, దాన్ని మధ్యమధ్యలో మానివేస్తూ (కూడా) ఉండు. అలాగే రాత్రివేళల్లో ఆరాధన కూడా చెయ్యి, (కాస్సేపు) నిద్రకూడా పో. నీ మీద నీ శరీరానికి కూడా హక్కు ఉంది, నీ కళ్ళకు కూడా హక్కు ఉంది, నీ భార్యకు కూడా హక్కు ఉంది, నీ అతిథికి కూడా హక్కు ఉంది. (ఇలా నీవు అందరి హక్కులు నెరవేర్చవలసి ఉంది.) అందుచేత ప్రతినెలా మూడు రోజుల ఉపవాసం ఉండు, చాలు. ప్రతి సత్కార్యానికి పదింతల పుణ్యం లభిస్తుంది. (దాని ప్రకారం మూడు రోజుల ఉపవాసానికి ముప్ఫైరోజుల ఉపవాసానికి లభించే పుణ్యం లభిస్తుంది.) ఇలా చేస్తే ఎల్లప్పుడూ ఉపవాసం పాటిస్తున్నట్లే లెక్క'' అన్నారు దైవప్రవక్త(స).

కాని నేను కఠోర సాధనకు అలవడ్డాను. అందువల్ల నేను ''దైవప్రవక్తా! నాలో ఇంతకంటే ఎక్కువ శక్తి ఉందని భావిస్తున్నాను'' అని అన్నాను. ''అయితే దైవప్రవక్త హజ్రత్ దావూద్ (అలైహి) పాటించిన విధంగా ఉపవాసాలు పాటించు. దానికి మించి ఉపవాసాలుండకు'' అన్నారు దైవప్రవక్త(స). ''దైవప్రవక్త హజ్రత్ దావూద్ (అలైహి) ఉపవాసాలు ఎలా పాటించారు?'' అని అడిగాను నేను. ''ఆయన ఒక రోజు ఉపవాసం ఉండేవారు. మరొక రోజు మానేసేవారు (అంటే రోజు విడిచి రోజు ఉపవాసం ఉండేవారు)'' అన్నారు దైవప్రవక్త(స).

హజ్రత్ అబ్దుల్లా వృద్ధులయిన తరువాత ''అయ్యో! నేను దైవప్రవక్త(స) ఇచ్చిన సౌకర్యాన్ని వినియోగించుకొని ఉంటే ఎంత బాగుండేది!!'' అని అంటూ ఉండేవారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 55వ అధ్యాయం - హఖ్ఖుల్ జిస్మి ఫిస్సౌమ్]

716. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- ఓసారి దైవప్రవక్త(స) నాతో ''ఖుర్ఆన్‌ని ఒక నెల రోజుల్లో పూర్తి చేయి'' అన్నారు. నేనందుకు ''నాలో ఇంతకంటే ఎక్కువ (పఠన) శక్తి ఉందని భావిస్తున్నాను'' అని అన్నా. చివరికి దైవప్రవక్త (స) ''సరే ఏడు రోజుల్లో ఓ సారి ఖుర్ఆన్ (పఠనము)ను పూర్తి చేయి. ఈ హద్దును మాత్రం మీరకు'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయెలె ఖుర్ఆన్, 34వ అధ్యాయం - ఫీకమ్ యుఖ్రవుల్ ఖుర్ఆన్]

717. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఓ రోజు నాకిలా బోధించారు:- ''అబ్దుల్లా! నీవు ఫలానా వ్యక్తిలా చేయకు. అతను మొదట్లో రాత్రివేళ మేల్కొని ప్రార్థన చేస్తుండేవాడు. కాని ఆ తరువాత (కొన్నాళ్ళకు) రాత్రివేళ మేల్కొనడాన్ని వదిలేశాడు.''

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 19వ అధ్యాయం - మాయుక్రహు మన్ తర్కి ఖియామిల్లైలి లిమన్ కాన యఖూము]

718. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- నేను నిర్విరామంగా (అంటే ప్రతి రోజూ) ఉపవాసం ఉంటున్నానని, (ప్రతిరోజూ) రాత్రంతా మేల్కొని నమాజు చేస్తున్నానని దైవప్రవక్త(స)కు తెలిసింది. అప్పుడు ఆయన నన్ను పిలిపించి లేక నేనే స్వయంగా ఆయన్ని కలుసుకున్నప్పుడు ఇలా ఉపదేశించారు:

"నువ్వు ఒక్క రోజు కూడా వదలిపెట్టకుండా ప్రతిరోజూ ఉపవాసం ఉంటున్నావనీ, రాత్రి తెల్లవార్లూ నమాజులో గడుపుతున్నావని తెలిసింది నాకు. (ఇది మంచి పద్ధతి కాదు. దానికి బదులు) ఇలా చెయ్యి - ఉపవాసాలు పాటించు. అయితే అప్పుడప్పుడు నాగాలు కూడా చేస్తూ ఉండు. అలాగే రాత్రి వేళల్లో మేల్కొని నమాజు కూడా చెయ్యి. దాంతోపాటు (కాస్సేపు) నిద్ర కూడా పో. నీ మీద నీ కళ్ళకు (భద్రత) కూడా హక్కు ఉంది; నీ ప్రాణ రక్షణ బాధ్యత కూడా నీపై ఉంది. నీ మీద నీ భార్యా పిల్లల హక్కులు కూడా ఉన్నాయి."

నేనీ మాటలు విని "నాలో ఈ బాధ్యతలన్నీ నిర్వహించగల శక్తి ఉంది" అన్నాను. "అయితే హజ్రత్ దావూద్ (అలైహి) పాటించినట్లు ఉపవాసాలు పాటించు" అని అన్నారు దైవప్రవక్త(స). "ఆయన ఎలా పాటించేవారు?" అని అడిగాను నేను. "హజ్రత్ దావూద్ (అలైహి) ఒక రోజు ఉపవాసం ఉండేవారు; మరొకరోజు విడిచిపెట్టేవారు. శత్రువుల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు ఆయన ఏ మాత్రం వెనుకంజ వేసేవారు కాదు" అన్నారు దైవప్రవక్త(స). నేనప్పుడు "దైవప్రవక్తా! నాలో అంతటి ధైర్యం, పరాక్రమం ఎక్కడున్నాయి?" అని అన్నాను.

(ఈ హదీసు ఉల్లేఖించిన) హజ్రత్ అతా (రహ్మాలై), ఇలా అంటున్నారు: "హజ్రత్ అబ్దుల్లా (రజి) ప్రతి రోజూ ఉపవాసం పాటించే విషయాన్ని ఎలా ప్రస్తావించారో నాకయితే తెలియదు. ప్రతి రోజూ ఉపవాసం పాటించేవాడు అసలు ఉపవాసం పాటించనట్లే అవుతుందని దైవప్రవక్త(స) రెండు సార్లు చెప్పినట్లు ఆయన తెలిపారు."

**[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 57వ అధ్యాయం - హఖ్ఖుల్ అహ్లి ఫిస్సౌమ్]**

719 . హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) నన్ను పిలిపించి "నీవు ప్రతి రోజూ ఉపవాసం ఉంటున్నావట; రాత్రి తెల్లవార్లూ నఫిల్ ప్రార్థనలు చేస్తున్నావట, నిజమేనా?" అని అడిగారు. నేను నిజమే నన్నాను. అప్పుడు దైవప్రవక్త(స) ఇలా ఉపదేశించారు: "అలా చేయకు. అలా చేయడం వల్ల నీ కళ్ళు లోపలికి పీక్కుపోతాయి; శరీరం చిక్కిపోతుంది. ఎల్లప్పుడూ ఉపవాసం ఉండేవాడు అసలు ఉపవాసం లేనట్లే లెక్క. (నెలకు) మూడు రోజులు ఉపవాసం ఉంటే చాలు, ప్రతి రోజూ ఉన్నట్లే పరిగణించబడుతుంది."

నేనీ మాటలు విని "నాలో ఇంతకంటే ఎక్కువ ఉపవాసాలుండే శక్తి ఉంది" అన్నాను. దానికి దైవప్రవక్త(స) "అయితే హజ్రత్ దావూద్ (అలైహి) ఉన్నట్లు ఉపవాసాలుండు. ఆయన ఒక రోజు ఉంటే ఒక రోజు ఉండేవారు కాదు. (ఈ కారణంగానే) ఆయన శత్రువుల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు ఏ మాత్రం వెనుకంజ వేసేవారు కాదు" అని ఉపదేశించారు.

**[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 59వ అధ్యాయం - సౌమి దావూద్ (అలైహి)]**

720. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) నాతో ఇలా అన్నారు:- "దేవునికి అన్నిటికంటే ఎక్కువ ప్రీతికరమైన నమాజ్ హజ్రత్ దావూద్ (అలైహి) చేసే నమాజే. దేవునికి

అత్యంత ప్రీతికరమైన ఉపవాసం కూడా హజ్రత్ దావూద్ (అలైహి) పాటించే ఉపవాసమే. హజ్రత్ దావూద్ (అలైహి) అర్ధరాత్రి వరకు పడుకునేవారు. ఆ తరువాత లేచి మూడోవంతు రాత్రి ఆరాధనలో నిమగ్నులయి ఉండేవారు. తిరిగి ఆరోవంతు రాత్రి నిద్రలో గడిపేవారు. అలాగే ఆయన ఒక రోజు ఉపవాసముండి ఒక రోజు మానేసేవారు."

[సహీహ్ బుఖారీ : 19వ ప్రకరణం - తహజ్జుద్, 7వ అధ్యాయం - మన్నామ ఇన్దస్సహర్]

721. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ముందు నా ఉపవాస వ్రతాలను గురించి ప్రస్తావన వచ్చినప్పుడు ఆయన నా దగ్గరికి (మా ఇంటికి) వచ్చారు. నేను దైవప్రవక్త(స) కూర్చోవడానికి ఖర్జూరపు చెట్టు బెరడుతో నిండిన ఒక తోలు పరుపును పరిచాను. కాని ఆయన నేల మీదే కూర్చున్నారు. తోలు పరుపు నాకు, ఆయనకు మధ్య ఉండిపోయింది.

తరువాత ఆయన విషయం ప్రస్తావిస్తూ "నువ్వు ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసం పాటిస్తే సరిపోదా?" అని అడిగారు. "దైవప్రవక్తా! (నేను ఇంతకంటే ఎక్కువ రోజులు ఉపవాసం ఉండగలను)" అన్నాను నేను.

"అయితే ప్రతి నెలా ఐదు రోజులు ఉపవాసం ఉండు" అన్నారు ఆయన (స). నేను తిరిగి "దైవప్రవక్తా! (ఇంతకంటే ఎక్కువ రోజులే ఉండగలను)" అన్నాను.

"అయితే ఏడు రోజులు ఉండు" అన్నారు ఆయన. నేను "దైవప్రవక్తా! (అవి కూడా చాలవు నాకు)" అన్నాను.

"పోనీ తొమ్మిది రోజులు ఉండు" అన్నారు ఆయన. నేను మళ్ళీ "(ఇవి కూడా చాలవు) దైవప్రవక్తా!" అన్నాను.

"సరే పదకొండు రోజులు ఉండు" అన్నారు ఆయన. (నేను ఇవి కూడా చాలవన్నట్లు తల తిప్పాను).

అప్పుడు ఆయన "దావూద్ (అలైహి) పాటించే ఉపవాసాలకు మించిన ఉపవాసాలు లేవు. ఆయన (ప్రతినెలా) అర్ధమాసం ఉపవాసాలు ఉంటారు. కనుక నీవు కూడా రోజు విడిచి రోజు ఉపవాసం ఉండు" అని బోధించారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 59వ అధ్యాయం - సౌమి దావూద్ (అలైహి)]

## 37వ అధ్యాయం - షాబాన్ నెల చివరి రోజుల్లో ఉపవాసం పాటించడం

722. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసేన్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) నన్ను అడిగారు లేక మరెవరినో అడిగారు. ఇమ్రాన్ (రజి) వింటున్నారు. (ఈ హదీసు ఉల్లేఖించిన వ్యక్తికి ఇక్కడ అనుమానం వచ్చింది) "ఓ ఫలానా! ఈ నెల చివర్లో నీవు కొన్ని రోజులు ఉపవాసం పాటించలేదా?" అన్నారు దైవప్రవక్త(స). - హదీసు ఉల్లేఖకుని కథనం దైవప్రవక్త(స) రమజాన్★ నెలను దృష్టిలో పెట్టుకొని ఈ నెల అన్నారని

★ ఇక్కడ ఉల్లేఖకుడు పొరపాటు వల్లనో, మరుపు వల్లనో 'రమజాన్' పదాన్ని ప్రయోగించి ఉంటారు. ఈ హదీసే బుఖారీ గ్రంథంలో మరో చోట వేరే ఆధారాలతో ఉల్లేఖించబడింది. అందులో రమజాన్‌కు బదులు 'షాబాన్' అనే పదం ప్రయోగించబడింది. ఈ సంభాషణ జరిగేటప్పుడు రమజాన్ నెల ముగిసే సమయం ఆసన్నమయి ఉండవచ్చు. అందువల్ల రమజాన్ ఉపవాసాలు ముగిసిపోగానే షవ్వాల్ నెలలో రెండు రోజులు ఉపవాసం పాటించాలన్నది ఈ హదీసు అంతరార్థం కావచ్చు. - అనువాదకుడు

హజ్రత్ ఇమ్రాన్ చెప్పి ఉంటారని నా అనుమానం. దానికా వ్యక్తి "(పాటించ)లేదు దైవప్రవక్తా!" అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (స) "(రమజాన్ నెల గడచిపోయి) నీవు ఉపవాసాలను విరమించడం జరిగితే రెండు రోజులు ఉపవాసం పాటించు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 62వ అధ్యాయం - అస్సౌమి ఆఖిరష్షహ్రి]

## 40వ అధ్యాయం - లైలతుల్ ఖద్ర్ ఘనత, దాని అన్వేషణకై ప్రోత్సాహం

723. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ప్రవక్త అనుచరుల (రజి)లో చాలామందికి, మహారేయి రమజాన్ నెల చివరి ఏడు తేదీలలో ఒక రాత్రి అని కలలో చూపడం జరిగింది. దైవప్రవక్త(స) ఆ విషయాన్ని ప్రస్తావిస్తూ "రమజాన్ నెల చివరి ఏడు రాత్రుల విషయంలో మీ కలలన్నీ ఒకే విధంగా ఉన్నాయి. కనుక మహారాత్రిని అన్వేషించదలచినవారు రమజాన్ నెల చివరి ఏడు రాత్రులలో అన్వేషించాలి" అని ఉపదేశించారు.

[సహీహ్ బుఖారీ : 32వ ప్రకరణం - ఫజ్లిలైలతుల్ ఖద్ర్, 2వ అధ్యాయం - ఇల్తిమాసిలైలతుల్ ఖద్రి ఫిస్సబ్ యిల్ అవాఖిర్]

724. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- మేము రమజాన్ నెల మధ్య దశకంలో దైవప్రవక్త(స) తో పాటు 'ఏతెకాఫ్' కూర్చున్నాము. తరువాత దైవప్రవక్త(స) ఇరవయ్యో తేదీ ఉదయం (ఏతెకాఫ్ నుండి) బయటికి వచ్చి ఉపన్యాసం ఇచ్చారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ ఇలా అన్నారు:

"నాకు మహారేయి గురించి (కచ్చితమైన) సమాచారం అందజేయబడింది. అయితే ఆ తరువాత ఆ విషయాన్ని నేను మరచిపోయేలా చేయబడింది. కనుక మీరు చివరి దశకంలోని బేసి సంఖ్యగల రాత్రిళ్ళలో దాన్ని వెతకండి. అదీగాక నేను నీటిలో, బురదలో సాష్టాంగం చేస్తున్నట్లు కూడా (కలలో) చూశాను. అందువల్ల నాతో పాటు ఏతెకాఫ్ చేసిన వారంతా తిరిగి వచ్చేయాలి. (ఇంకా అప్పుడే ఏతెకాఫ్ నిష్ఠ ముగించకూడదు.)"

అప్పుడు మేము తిరిగొచ్చాము. ఆ సమయంలో ఆకాశంలో ఒక మబ్బు తునక కూడా లేదు. ఆ తరువాత (చూస్తుండగానే) ఆకాశం మేఘావృతమయింది. ఉరుములు విన్పించాయి. చివరికి ఖర్జూరపు మట్టలతో కప్పబడిన మస్జిదు కప్పు కారడం మొదలెట్టింది. (మస్జిదు నేలంతా బురదయిపోయింది) తరువాత నేను, దైవప్రవక్త (స) నీటిలో, బురదలో సాష్టాంగం చేస్తుండగా చూశాను. ఆ స్థితిలో ఆయన నుదుటికి బురద అంటుకోవడం కూడా నేను చూశాను.

[సహీహ్ బుఖారీ : 32వ ప్రకరణం - ఫజ్లిలైలతుల్ ఖద్ర్, 2వ అధ్యాయం - ఇల్తి మాసిలైలతిల్ ఖద్రి ఫిస్సబ్ యిల్ అవాఖిర్]

725. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల మధ్య దశకంలో ఏతెకాఫ్ (తపోనిష్ఠ)లో కూర్చుంటారు. తరువాత ఇరవయ్యో తేదీ సాయంత్రం గడచిపోయి 21వ తేదీ రాగానే (నిష్ఠ వదలి) ఇంటికి వెళ్ళి పోతారు. ఆయనతో పాటు ఏతెకాఫ్‌లో కూర్చునేవారు కూడా తమ తమ ఇండ్లకు వెళ్ళిపోతారు. తరువాత దైవప్రవక్త(స) మరొక రమజాన్‌లో లోగడ ఇంటికి వెళ్ళిపోయే రాత్రి కూడా ఏతెకాఫ్‌లో కూర్చున్నారు. ఆ రోజు ఉపన్యాసం చేశారు. దైవానికిష్టమైనదేదో ఆయన ప్రజలకు విన్పించిన తరువాత ఇలా అన్నారు :

"(సాధారణంగా) నేనీ (రెండవ) దశకంలో ఏతెకాఫ్‌లో కూర్చుంటూ ఉండేవాడ్ని. తరువాత చివరి దశకంలో ఏతెకాఫ్ చేయాలని నాకు ఆదేశమయింది. కనుక ఈసారి నాతో పాటు ఏతెకాఫ్‌లో ఉన్న వారంతా తమ తమ స్థానాల్లోనే ఏతెకాఫ్‌లో ఉండిపోవాలి. నాకు స్వప్నంలో లైలతుల్ ఖద్ర్ (మహారేయి)ని చూపించడం జరిగింది. అయితే ఆ తరువాత నేను దాన్ని మరచిపోయేలా చేయడం జరిగింది. కనుక మీరిప్పుడు దాన్ని చివరి దశకంలోని బేసి సంఖ్య గల (21, 23, 25, 27, 29) రాత్రిళ్ళలో అన్వేషించండి. అదీగాక నేను నీటిలో, బురదలో సాష్టాంగం చేసినట్లుగా కూడా (కల)గన్నాను."

అదే రాత్రి వర్షం కురిసింది. దైవప్రవక్త(స) నమాజు చేస్తున్న చోట మస్జిదులో (నీరు) కారింది. అది ఇరవై ఒకటో తేదీ రాత్రి. అప్పుడు నేను (దైవప్రవక్త కలలో గన్న) ఆ దృశ్యం కళ్ళారా జూశాను - దైవప్రవక్త(స) ఫజ్ర్ నమాజు ముగించారు. నేను ఆయన వైపు దృష్టి సారించాను. చూస్తే ఆయన నుదుటికి నీరు, బురద అంటుకొని ఉండటం కన్పించింది.

[సహీహ్ బుఖారీ : 32వ ప్రకరణం - ఫజ్లి లైలతుల్ ఖద్ర్, 3వ అధ్యాయం- తుహర్రి లైలతుల్ ఖద్రి ఫిల్ వత్రి మినల్ అష్రిల్ అవాఖిర్]

726. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల చివరి దశకంలో ఏతెకాఫ్ (తపోనిష్ఠ)లో కూర్చునేవారు. (ఈ విషయాన్ని గురించి మాట్లాడుతూ) "లైలతుల్ ఖద్ర్ (మహారాత్రి)ని రమజాన్ నెల చివరి పదిరోజుల్లో (రాత్రుళ్ళలో) అన్వేషించండి" అని ఉపదేశించేవారు ఆయన (స).

[సహీహ్ బుఖారీ : 32వ ప్రకరణం - ఫజ్లి లైలతుల్ ఖద్ర్, 3వ అధ్యాయం - తుహర్రి లైలతుల్ ఖద్రి ఫిల్ వత్రి మినల్ అష్రిల్ అవాఖిర్]

# ఏతెకాఫ్ ప్రకరణం

## 1వ అధ్యాయం - రమజాన్ నెల చివరి దశకంలో ఏతెకాఫ్

727. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల చివరి దశకంలో ఏతెకాఫ్ (తపోనిష్ఠ)లో కూర్చునేవారు.

[సహీహ్ బుఖారీ: 33వ ప్రకరణం - ఏతెకాఫ్, 1వ అధ్యాయం - అల్ ఏతెకాఫి ఫిల్ అష్రిల్ అవాఖిర్]

728. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల చివరి దశకంలో ఏతెకాఫ్‌లో కూర్చునేవారు. ఇలా చేస్తూ చివరికి ఆయన ఈ లోకం వీడిపోయారు. ఆ తరువాత ఆయన భార్యలు ఏతెకాఫ్‌లో కూర్చునేవారు.

[సహీహ్ బుఖారీ : 33వ ప్రకరణం : ఏతెకాఫ్, 1వ అధ్యాయం - అల్ ఏతెకాఫి ఫిల్ అష్రిల్ అవాఖిర్]

## 2వ అధ్యాయం - ఏతెకాఫ్ చేసేవాడు తన స్థానంలో ఎప్పుడు ప్రవేశించాలి?

729. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల చివరి దశకంలో ఏతెకాఫ్‌లో కూర్చునేవారు. నేను ఆయన కోసం ఒక గుడారం వేసేదాన్ని. ఆయన ఫజ్ర్ నమాజ్ చేసి ఆ గుడారంలో ప్రవేశించేవారు.

తరువాత (ఓ రోజు) హజ్రత్ హఫ్సా (రజి) తనను కూడా ఓ గుడారం వేసుకోవడానికి అనుమతివ్వమని అడిగితే హజ్రత్ ఆయిషా(రజి) అందుకు అనుమతించారు. హజ్రత్ హఫ్సా (రజి) గుడారం వేసుకున్నారు. ఆ తరువాత హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి), హజ్రత్ హఫ్సా (రజి) గుడారం చూసి ఆమె కూడా ఒక గుడారం వేసుకున్నారు.

మరునాడు ఉదయం దైవప్రవక్త(స) వచ్చి చూస్తే అనేక గుడారాలు కన్పించాయి. ఆయన (ఆశ్చర్యంతో) "ఏమిటీ ఇదంతా?" అని అడిగారు. అసలు విషయం ఆయనకు తెలియజేశారు. దైవప్రవక్త(స) అది విని "ఇలా గుడారాలు నిర్మించడం సత్కార్యం అనుకున్నారా?" అని అడిగారు. అందువల్ల ఆయన ఆ నెల ఏతెకాఫ్‌లో కూర్చోలేదు. ఆ తరువాత షవ్వాల్ నెలలో పది రోజులు ఏతెకాఫ్ పాటించారు.

[సహీహ్ బుఖారీ : 33వ ప్రకరణం - ఏతెకాఫ్, 6వ అధ్యాయం - ఏతెకాఫిన్నిసా]

## 3వ అధ్యాయం - రమజాన్ నెల చివరి దశకంలో అత్యధిక సమయం ఆరాధనలో గడపాలి

730. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) రమజాన్ నెల చివరి దశకం రాగానే ఆరాధనల్ని ముమ్మరం చేస్తారు. రాత్రివేళ జాగరణ చేస్తారు. తన ఇంటి వాళ్ళను కూడా మేల్కొలుపుతారు.

[సహీహ్ బుఖారీ : 32వ ప్రకరణం - ఫజ్లిలైలతుల్ ఖద్ర్, 5వ అధ్యాయం - అల్ అమలి ఫిల్ అష్రిల్ అవాఖిర్ మిన్ రమజాన్]

# హజ్ ప్రకరణం

## 1వ అధ్యాయం - ఇహ్రాం (దీక్ష) బూనిన తరువాత చేయవలసిన, చేయకూడని పనులు

731. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరకు వచ్చి, "దైవప్రవక్తా! ఇహ్రాం (దీక్ష) బూనడానికి మనిషి ఎలాంటి దుస్తులు ధరించాలి?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(స) ఇలా సమాధానమిచ్చారు: "చొక్కా, పైజామా, వాన ఉడుపు (రైన్‌కోట్) ధరించకూడదు. తలపాగా కట్టుకోకూడదు. మేజోళ్ళు తొడగరాదు. పాదరక్షలు లేని వాళ్ళు మేజోళ్ళు ధరించవచ్చు గాని, వాటిని చీలమండలం నుండి క్రింది భాగం వరకు కత్తిరించివేయాలి. అలాగే కాషాయ వస్త్రాలు, కుంకుమపువ్వు రంగు బట్టలు కూడా ధరించకూడదు. (ఇవి తప్ప కుట్టులేని తెల్ల బట్టలు కట్టుకోవచ్చు')'.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 21వ అధ్యాయం - మాలాయల్బసుల్ ముహ్‌రిము మినస్సియాబ్]

732. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) అరఫాత్ ప్రదేశంలో ప్రసంగం చేస్తూ "పాదరక్షలు లేనివారు మేజోళ్ళు ధరించాలి; లుంగీలేని వాళ్ళు పైజామా ధరించాలి" అని ఉపదేశిస్తుండగా నేను విన్నాను.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 15వ అధ్యాయం - లుబ్సిల్ ఖుఫ్ఫైనిలిల్ ముహ్‌రిమి ఇజాకుమ్]

733. హజ్రత్ యాలా (రజి) కథనం:- నేను ఓ రోజు హజ్రత్ ఉమర్ (రజి)తో "దైవప్రవక్త(స)పై వహీ అవతరిస్తున్నప్పుడు నాకు చెప్పండి, నేనా స్థితి ఎలా ఉంటుందో చూస్తాను" అని అన్నాను. ఓసారి దైవప్రవక్త (స) జియిర్రానా (ప్రాంతం)లో విడిది చేశారు. ఆ సమయంలో ఆయన అనుచరులు కూడా వెంట ఉన్నారు. అప్పుడు ఒక వ్యక్తి వచ్చి "దైవప్రవక్తా! ఒకతను ఉమ్రా (కాబా దర్శనం) కోసం దీక్ష బూనాడు. అతని శరీరం, బట్టలు సువాసనలతో నిండిపోయాయి. అలాంటి వ్యక్తి గురించి మీ అభిప్రాయం ఏమిటి" అని అడిగారు.

దైవప్రవక్త (స) ఈ మాటలు విని క్షణం పాటు మౌనంగా ఉండిపోయారు. (అంటే) ఆయనపై వహీ అవతరించసాగింది. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) నన్ను సైగ చేశారు. నేను దైవప్రవక్త (సల్లం) సమీపానికి వెళ్ళాను. కొందరు సహచరులు దైవప్రవక్త(సల్లం) తలపై గాలిలో ఒక వస్త్రం పరచి ఆయనకు ఎండ తగలకుండా పట్టుకొని ఉన్నారు. నేనా వస్త్రం క్రిందికి తలపోనిచ్చి తొంగి చూసాను. దైవప్రవక్త(స) ముఖపద్మం క్రమంగా ఎరుపెక్కసాగింది. ఒక విధమైన గురక శబ్దం మొదలయింది. కాస్సేపటి తరువాత ఈ పరిస్థితి తొలగిపోయింది.

అప్పుడు దైవప్రవక్త(స) తలపైకెత్తి "ఉమ్రా గురించి అడిగిన వ్యక్తి ఎక్కడున్నాడు?" అని అడిగారు. ఆ వ్యక్తిని పిలవడం జరిగింది. దైవప్రవక్త(సల్లం) అతడ్ని చూసి "నీ శరీరానికి పూసుకున్న సువాసనను మూడుసార్లు కడిగెయ్యి. (సువాసన పూయబడ్డ) దుస్తులు తీసెయ్యి. మిగతాదంతా హజ్ చేసినట్లే ఉమ్రాలో కూడా చేయవచ్చు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 17వ అధ్యాయం - గుస్లిల్ ఖలూఖి సలాస మర్రాతిమ్మినస్సియాబ్]

## 2వ అధ్యాయం - హజ్, ఉమ్రాల యాత్రారంభ ప్రదేశాలు (మీఖాత్)

734. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) మదీనా వాసుల కోసం "జుల్ హులైఫా"ను, సిరియా వాసుల కోసం "హుజ్ఫా"ను, నజద్ వాసుల కోసం 'ఖర్నుల్ మనాజిల్'ని, యమన్ వాసుల కోసం 'యలమ్‌లమ్'ని యాత్రారంభ ప్రదేశాలు (మీఖాత్)గా నిర్ణయించారు. ఈ ప్రాంతాల్లో నివసించే వారికి ఇతర ప్రాంతాల నుండి వచ్చే వారికి కూడా ఇవే యాత్రారంభ ప్రదేశాలు. హజ్ లేక ఉమ్రా యాత్ర కోసం ఈ ప్రదేశాల గుండా వెళ్ళే వారిక్కూడా ఇవే యాత్రారంభ ప్రదేశాలు. ఈ యాత్రారంభ ప్రదేశాలలో నివసించేవారు తమ తమ ఇండ్లలో నుండే దీక్ష (ఇహ్రాం) బూని బయలుదేరాలి. అలాగే మక్కా ప్రజలు కూడా మక్కా నుండి దీక్షబూని బయలుదేరవలసి ఉంటుంది.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 9వ అధ్యాయం - ముహల్లి అహ్లిషామ్]

735. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "మదీనా ప్రజలు 'జుల్‌హులైఫా'లో దీక్ష (ఇహ్రాం) బూనాలి, సిరియా ప్రజలు 'హుజ్ఫా'లో, నజద్ ప్రజలు 'ఖర్న్'లో దీక్ష (ఇహ్రాం) బూనాలి. యమన్ ప్రజలు 'యలమ్‌లమ్'లో దీక్ష బూనాలి" అని కూడా దైవప్రవక్త (సల్లం) చెప్పినట్లు తనకు తెలిసిందని హజ్రత్ అబ్దుల్లా (రజి) అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 8వ అధ్యాయం - మీఖాతి అహ్లిల్ మదీనతి వలా యుహిల్లూ]

## 3వ అధ్యాయం - 'లబ్బైక్' చెప్పవలసిన వేళ విధానం

736. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) 'లబ్బైక్' ఈ విధంగా చెప్పేవారు. "లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్, లబ్బైక్ లాషరీక లక లబ్బైక్, ఇన్నల్ హమ్ద వన్నీమత లకవల్ ముల్క్ లాషరీకలక్. (నేను వచ్చాను ప్రభూ! నీ సన్నిధికి వచ్చాను. నేను వచ్చాను. నీకు మరెవరూ సాటిలేరు. నేను నీ సన్నిధికి వచ్చాను. నిస్సందేహంగా సకల విధాల ప్రశంసలు నీకే తగి ఉన్నాయి. సమస్త భాగ్యాలు నీవే. రాజ్యం కూడా నీదే. నీకు మరెవరూ సాటిలేరు.)"

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 26వ అధ్యాయం - అత్తల్బియా]

## 4వ అధ్యాయం - మదీనా వాసులు జుల్‌హులైఫా మస్జిదులో దీక్ష బూని బయలుదేరాలి

737. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఎప్పుడు దీక్ష బూనినా మస్జిద్ వద్దనే దీక్ష బూనుతారు. మస్జిద్ అంటే జుల్‌హులైఫా మస్జిదన్నమాట.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 20వ అధ్యాయం - అల్ ఇహ్‌లాలి ఇన్ద మస్జిది జిల్‌హులైఫా]

## 5వ అధ్యాయం - ఒంటె లేచినప్పటి నుంచి "లబ్బైక్" అని చెప్పాలి

738. హజ్రత్ ఉబైద్ బిన్ జరీహ్ (రహ్మాలై) కథనం:- నేనొకసారి హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)తో మాట్లాడుతూ "అబూ అబ్దుర్రహ్మాన్! మీ సహచరులెవరూ చెప్పనటువంటి నాలుగు విషయాలు మీరు చెబుతుండగా నేను విన్నాను" అని అన్నాను. ఆయన "ఆ విషయాలేమిటి ఇబ్నె జరీహ్?" అని అడిగారు. "ఒకటి మీరు కాబా (ప్రదక్షిణ)లో యమానీ మూలలు రెంటిని మాత్రమే తాకడం నేను

గమనించాను. రెండు: మీరు 'సిబ్తీ' అనబడే ఒక విధమైన పాదరక్షలు ధరించడం చూశాను. మూడు: మీరు (గడ్డం లేక వస్త్రానికి) పసుపుపచ్చ రంగు వేసుకోవడం చూశాను. నాలుగు: మక్కాలో ప్రజలు నెలవంక చూడగానే ఇహ్రాం పూని లబ్బైక్ చెప్పడం ప్రారంభించగా, మీరు మాత్రం తర్వియా రోజు (జిల్ హజ్జ్ ఎనిమిదవ తేదీ)కు ముందు ఇహ్రాం పూనడం గాని లబ్బైక్ చెప్పడం గాని చేయరు."

దీనికి హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా సమాధానమిచ్చారు: "కాబా మూలల విషయానికొస్తే, నేను ఈ రెండు యమానీ మూలలనే దైవప్రవక్త(స) తాకుతూ ఉండగా చూశాను. పాదరక్షలను గురించి చెప్పాలంటే, నేను ఇలాంటి వెంట్రుకలు లేని పాదరక్షలనే దైవప్రవక్త(స) తొడగడాన్ని చూశాను. ఆయన వాటిని ధరించి అలాగే వుజూ చేసేవారు. నాకూ ఇలాంటి పాదరక్షలు ధరించడం అంటేనే ఎక్కువ ఇష్టం. పసుపు పచ్చ రంగు వాడటం గురించి చెప్పాలంటే, దైవప్రవక్త(స) ఇలాంటి రంగు వాడటం నేను చూశాను. అందుచేత నాకూ ఈ రంగు వాడటం అంటే ఎంతో ఇష్టం. పోతే ఇహ్రాం పూనడం, లబ్బైక్ చెప్పడం గురించి, దైవప్రవక్త(స) తాను ఎక్కిన ఒంటె పైకి లేచే వరకూ ఇహ్రాం బూని లబ్బైక్ చెప్పేవారు కాదు. (ఆయన్ని) చూసే నేనూ ఇలా చేస్తున్నాను)."

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ, 30వ అధ్యాయం - గుస్లిర్రజ్‌లైని ఫిన్నాలైని వలా యమ్సహు అలన్నాలీన్]

## 7వ అధ్యాయం - ఇహ్రాం (దీక్ష) పూనేటప్పుడు సువాసన పూసుకోవడం ధర్మసమ్మతమే

739. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఇహ్రాం పూనేటప్పుడు నేనాయన (శరీరం, బట్టల)కు సువాసన పూసేదాన్ని. అలాగే ఆయన ఇహ్రాం విరమించదలచినప్పుడు కాబా ప్రదక్షిణకు ముందే నేనాయనకు సువాసన పూసేదాన్ని.★

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 18వ అధ్యాయం- అత్తీబి ఇన్దల్ ఇహ్రాం]

740. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) పాపిట సుగంధ పరిమళం పల్ల ఏర్పడిన కాంతి ఆయన ఇహ్రాం (దీక్ష) స్థితిలో ఉన్నప్పుడు కూడా నాకు గోచరిస్తుండేది.

[సహీహ్ బుఖారీ: 5వ ప్రకరణం - గుసుల్, 14వ అధ్యాయం - మన్‌తతయ్యిబిసుమ్మగ్ తసల వబఖియ]

741. హజ్రత్ ముహమ్మద్ బిన్ మున్తషిర్ (రహ్మాలై) కథనం:- "ఉదయం వేళ నా దేహం నుండి సువాసన వస్తుండగా ఆ స్థితిలో ఇహ్రాం (దీక్ష) పూనడం నాకు నచ్చదు" అన్న హజ్రత్ ఉమర్ (రజి) గారి మాటను నేను హజ్రత్ ఆయిషా (రజి)గారి ముంపు ప్రస్తావించి అడిగాను (దీన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటని). దానికి హజ్రత్ ఆయిషా (రజి) ఇలా సమాధానమిచ్చారు: "నేను దైవప్రవక్త(స)కు

---

★ అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం 'ఇహ్రామ్' (దీక్ష) పూనక ముందు సువాసన వాడటం అభిలషణీయం. (ముస్తహబ్). అయితే ఆ తరువాత ఈ సువాసన బట్టల మీద మిగిలి ఉండకూడదు. ఇహ్రాం స్థితిలో కూడా ఒంటిపై లేదా బట్టలపై సువాసన మిగిలి ఉంటే దాన్ని కడిగి వేయాలని హజ్రత్ యాలా (రజి) చెప్పిన ఒక హదీసు ద్వారా తెలుస్తోంది. ఇహ్రాం (దీక్ష) విరమించకముందు 'రమీ', 'జుమ్రా' నియమాలు పాటించిన తరువాత సువాసన వాడవచ్చు. అయితే 'ఇజాఫా తవ్వాఫ్' చేయడానికి పూర్వమే సువాసన పూసుకోవచ్చు. క్షవరం (హలఖ్) చేసుకోవచ్చు. అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఇలా చేయడం ధర్మసమ్మతమే.

ఇహ్రాం (దీక్ష) పూనకముందే సువాసన పూశాను. ఆ స్థితిలో ఆయన తన భార్యల్ని కలుసుకోవడానికి వెళ్ళారు. తెల్లవారగానే ఆయన ఇహ్రాం (దీక్ష) పూనారు."

[సహీహ్ బుఖారీ : 5వ ప్రకరణం - గుసుల్, 14వ అధ్యాయం - మన్ తతయ్యబి సుమ్మగ్ తసల వబఖియ అస్రుత్తీబ్]

## 8వ అధ్యాయం - ఇహ్రాం కట్టిన తరువాత వేటాడటం నిషిద్ధం

742. హజ్రత్ సాబ్ బిన్ జసామాలైసి(రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) అబ్వా లేదా వద్దాన్ అనే చోట విడిది చేసి ఉన్నప్పుడు నేను వెళ్ళి ఒక అడవి గాడిదను ఆయనకు కానుకగా సమర్పించుకున్నాను. కాని ఆయన దాన్ని నాకు తిరిగి ఇచ్చివేశారు. అయితే ఆయన నా ముఖంలో విచార ఛాయలు చూసి "ప్రస్తుతం నేను ఇహ్రాం (దీక్ష)లో ఉన్నాను. అందువల్ల నేను దీన్ని నీకు తిరిగి ఇచ్చివేశాను (ఏమనుకోకు)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 28వ ప్రకరణం - జజావుస్సైద్, 6వ అధ్యాయం - ఇజా అహ్దీ లిల్ ముహ్రిమి హిమారన్ వహ్షియా....]

743. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- మేము దైవప్రవక్త(సల్లం)తో కలసి 'ఖాహ' అనే ప్రాంతానికి చేరుకున్నాము. మాలో కొంతమంది ఇహ్రాం (దీక్ష) పూని ఉన్నారు. మరి కొందరు ఇహ్రాంలో లేరు. నా సహచరులు కొందరు ఏదో వస్తువును ఒకరికొకరు చూపించుకోవడం గమనించి నేను కూడా అదేమిటో చూద్దామని తలపైకెత్తి అటు దృష్టి సారించాను. చూస్తే అదొక కంచర గాడిద (నేను వెంటనే దాన్ని వేటాడేందుకు ఒక ఈటె, ఒక చంద్రకోల తీసుకొని గుర్రం ఎక్కాను. అయితే) చంద్రకోల చేతి నుండి జారి క్రింద పడిపోయింది. (నేను నా స్నేహితులతో కాస్త చంద్రకోల తీసి అందించమని అన్నాను).* దానికి వారు మేము ఇహ్రాం (దీక్ష)లో ఉన్నాము. అందుచేత మేము నీకు ఎలాంటి సహాయం చేయలేమని అన్నారు.

అప్పుడు నేనే గుర్రం దిగి చంద్రకోల తీసుకున్నాను. ఆ తరువాత నేను ఓ గట్టు వెనుక నుంచి కంచర గాడిద సమీపానికి చేరుకున్నాను. వెంటనే (ఈటెతో) దాన్ని గాయపరచి ఎత్తి నా స్నేహితుల దగ్గరకి తీసుకెళ్ళాను. వారిలో కొందరు దాన్ని తినవచ్చని అన్నారు. మరి కొందరు తినకూడదన్నారు. దాంతో నేను (విషయం తెలుసుకోవడానికి) దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను. ఆయన మా ముందు నడుస్తున్నారు. నేనీ వేట జంతువుని గురించి అడిగాను. దానికి దైవప్రవక్త(సల్లం). సమాధానమిస్తూ "దాన్ని (నిరభ్యంతరంగా) తినవచ్చు అది హలాల్ (ధర్మసమ్మతమైన) జంతువే" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 4వ అధ్యాయం - లాయుఈనుల్ ముహ్రిముల్ హలాల్ ఫీ ఖత్లెస్సైద్]

---

★ ఈ ఉల్లేఖనంలో ఎక్కడో ఒకటి రెండు వాక్యాలు తప్పిపోయినట్లు అనిపిస్తోంది. ఎందుకంటే 'సహీహ్ ముస్లిం'లో ఆ ఉల్లేఖనం ఈ విధంగా ఉంది; "అప్పుడు నేను గుర్రం మీద జీనుకట్టి ఎక్కి ఈటె తీసుకొని బయలుదేరాను. అయితే చంద్రకోల చేతి నుండి జారిక్రిందపడిపోయింది. నేను నా మిత్రులతో కాస్త చంద్రకోలు తీసి అందించండని అన్నాను. దానికి వారు "మేము, నీకు ఎలాంటి సహాయం చేయలేము...." అని అన్నారు.

744. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబూ ఖతాదా (రహ్మలై) కథనం:- హుదైబియా ఒడంబడిక జరిగిన యేడు మా నాన్నగారు కూడా ఆ ప్రయాణంలో ఉన్నారు. ఆయన స్నేహితులు ఇహ్రాం (దీక్ష) పూని ఉన్నారు. కాని మా నాన్న ఇహ్రాం (దీక్ష)లో లేరు. శత్రువులు తమతో (ముస్లింలతో) యుద్ధం చేయదలచినట్లు (దైవప్రవక్త(సల్లం))కు సమాచారం అందింది. అందువల్ల ఆయన (సల్లం) బయలుదేరారు.

హజ్రత్ అబూఖతాదా (రజి) కథనం:- "నేను కూడా అప్పుడు ప్రవక్త అనుచరుల వెంట ఉన్నాను. అకస్మాత్తుగా వారు ఒకరినొకరు చూసుకుని నవ్వుకోసాగారు. నేను విశేషం ఏమిటోనని తలపైకెత్తి చూస్తే కొద్ది దూరంలో ఒక కంచరగాడిద కన్పించింది. నేను వెంటనే (అటుగా వెళ్ళి) దాని మీద దాడి చేశాను. దాన్ని ఈటెతో గాయపరచి నిరోధించాను. తర్వాత నా స్నేహితుల సహాయం కోరాము. కాని వారు నాకు సహాయపడేందుకు నిరాకరించారు. చివరికి మేమంతా దాని మాంసం తిన్నాము.

(ఈ పనివల్ల మేము ప్రయాణంలో వెనుకబడ్డాము. అందువల్ల) దైవప్రవక్త(సల్లం) నుండి మేము దారి తప్పి వేరయి పోతామేమోనని భయపడ్డాము. నేను వెంటనే దైవప్రవక్త(సల్లం)ను వెతకడానికి బయలుదేరాను. గుర్రాన్ని ఒక్కోసారి వేగంగా, ఒక్కోసారి నెమ్మదిగా తోలుతూ వెళ్ళాను. అర్ధరాత్రి సమయంలో నాకు గిఫారి తెగ మనిషి ఒకతను తారసపడ్డాడు. నేనతడ్ని నీకు మన దైవప్రవక్త(సల్లం) ఎక్కడయినా తారసపడ్డారా? అని అడిగాను. దానికా వ్యక్తి "ఆయన నాకు తాహీన్ ప్రాంతంలో కన్పించారు. అక్కడ మధ్యాహ్నం విశ్రాంతి తీసుకోదలిచారు" అని తెలియజేశాడు.

నేను (చివరికి) దైవప్రవక్త(సల్లం) సన్నిధికి చేరుకొని "దైవప్రవక్తా! మీ అనుయాయులు మీకు సలాం చెప్పారు. దారిలో ఎక్కడయినా శత్రువు ఎదురయి మిమ్మల్ని మా నుండి వేరు చేస్తాడేమోనని వారు భయపడుతున్నారు. అందువల్ల వారు వచ్చి చేరే వరకు (ఇక్కడే) కాస్త వేచి ఉండండి" అని అన్నాను. ఆ తరువాత నేను వేట జంతువు ప్రస్తావన తీసుకొస్తూ "దైవప్రవక్తా! నేనొక కంచర గాడిదను వేటాడాను. దాని మాంసం నా దగ్గర ఇంకా కొద్దిగా మిగిలి ఉంది" అని విన్నవించుకున్నాను. దైవప్రవక్త(సల్లం) ఈ మాట విని 'మీరు (అందరూ) తినండి' అన్నారు ప్రజలతో. వారప్పుడు ఇహ్రాం (దీక్ష)లో ఉన్నారు. "

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 2వ అధ్యాయం - ఇజా సాదల్ హలాలు ఫఅహ్ దాలిల్ ముహ్రిమ్]

745. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓసారి హజ్ యాత్రకు బయలుదేరారు. ఆయన అనుచరులు కూడా వెంట ఉన్నారు. తర్వాత (కొంచెం దూరం ప్రయాణం చేసిన తరువాత) ఒక వర్గాన్ని రెండవ దిశకు మళ్ళించారు. ఆ వర్గంలో హజ్రత్ అబూ ఖతాదా (రజి)కూడా ఉన్నారు. వారిని రెండవ దిశకు మళ్ళిస్తూ "సముద్రతీర మార్గాన నడవండి. ముందుకెళ్ళిన తరువాత మనమందరం తిరిగి కలుసుకుందాం" అని ఆదేశించారు దైవప్రవక్త(సల్లం).

అలా ఈ వర్గం వాళ్ళు సముద్రతీర మార్గాన ప్రయాణం సాగించారు. తిరిగి వచ్చిన తరువాత అందరూ ఇహ్రాం (దీక్ష) పూనారు. అబూ ఖతాదా (రజి) మటుకు ఇహ్రాం పూనలేదు. కొంతదూరం ప్రయాణం సాగిన తరువాత దారిలో వారికి కంచరగాడిదలు కన్పించాయి. అబూఖతాదా (రజి) వాటిపై దాడి చేసి ఒకదాన్ని వేటాడారు. స్నేహితులందరూ (వాహనాలు) దిగి దాని మాంసం కొంత తిన్నారు. ఆ సందర్భంలో కొందరు మాట్లాడుతూ "మనం ఇహ్రాం (దీక్ష)లో ఉండి వేట పశువు మాంసం

తినవచ్చా?" అని అడిగారు. అందువల్ల మేము మిగిలిన మాంసాన్ని తీసిపెట్టాము.

ఆ తర్వాత వారు దైవప్రవక్త (సల్లం) సన్నిధికెళ్ళి ఇలా అన్నారు. "దైవప్రవక్తా! అబూ ఖతాదా (రజి) తప్ప మేమంతా ఇహ్రాం (దీక్ష) పూనాము. తర్వాత మాకు కొన్ని కంచరగాడిదలు కన్పించాయి. అబూ ఖతాదా (రజి) వాటిపై దాడి చేసి వాటిలో ఒకదాన్ని పడగొట్టారు. మేము మా (వాహనాలు) దిగి ఆ మాంసంలో కొంత భాగాన్ని తిన్నాము. అంతలో మేము ఇహ్రాం (దీక్ష)లో ఉండి వేట జంతువు మాంసం తినవచ్చా? అన్న సందేహం కలిగింది. దాంతో మేము మిగతా మాంసాన్ని ముట్టకుండా ఇక్కడికి పట్టుకొచ్చాము".

దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని "మీలో ఎవరైనా ఆ కంచరగాడిదలపై దాడి చేయమని చెప్పారా? లేక వేటాడే విషయం గురించి (కనీసం) సూచన చేశారా?" అని అడిగారు. అందుకు వారు లేదన్నారు. "అయితే మిగతా మాంసం (నిస్సంకోచంగా) తినండి" అన్నారు దైవప్రవక్త(సల్లం).

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 5వ అధ్యాయం - లాయుషీరుల్ మహ్రాము ఇలస్సైదిలకీ యస్తాదహుల్ హలాల్]

## 9వ అధ్యాయం - కాబా గృహం పరిధిలో, పరిధి వెలుపల ఎలాంటి ప్రాణులను చంపవచ్చు?

746. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "అయిదు రకాల ప్రాణులు హానికరమైనవి. అవి: కాకి, గద్ద, తేలు, ఎలుక, కరిచే కుక్క. వీటిని కాబా గృహం పరిధిలో కూడా చంపవచ్చు".

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 7వ అధ్యాయం - మాయఖ్తులుల్ మహ్రామి మినద్దవ్వాబ్]

747. హజ్రత్ హఫ్సా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలిపారు:- కాకి, గద్ద, తేలు, ఎలుక, కరిచే కుక్క ఈ అయిదు రకాల ప్రాణుల్ని చంపడం వల్ల ఎలాంటి నష్టం (పాపం) లేదు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 7వ అధ్యాయం-మాయఖ్తులుల్ మహ్రామి మినద్దవ్వాబ్]

748. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:- "అయిదు రకాల ప్రాణుల్ని ఇహ్రాం (దీక్ష)లో ఉండి చంపినా పాపం లేదు."

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 7వ అధ్యాయం - మాయఖ్తులుల్ మహ్రామి మినద్దవ్వాబ్]

## 10వ అధ్యాయం - హజ్ దీక్ష పూనినవాడు తలనొప్పి వస్తే తలవెంట్రుకలు గొరిగించుకోవచ్చు

749. హజ్రత్ కాబ్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) నాతో "బహుశా నీ తలలోని పేలు నిన్ను బాధపెడుతున్నాయనుకుంటా" అని అన్నారు. నేను "ఔను దైవప్రవక్తా!" అన్నాను. అప్పుడు ఆయన "అయితే తలవెంట్రుకలు గొరిగించుకో ( దానికి పరిహారంగా) మూడు రోజులు ఉపవాసం పాటించు

లేదా ఆరుగురు పేదలకు అన్నదానం చెయ్యి లేదా ఒక మేకను బలివ్వు'' అని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 27వ ప్రకరణం - ముహస్సిర్, 5వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా ఫమన్ కాన మిన్‌కుమ్ మరీజా....]

750. హజ్రత్ అబ్దుల్లా బిన్ మాఖిల్ (రహ్మలై) కథనం:- నేనా మస్జిదులో (అంటే కూఫా మస్జిదులో) హజ్రత్ కాబ్ బిన్ ఉజ్రా (రజి) గారి దగ్గర కూర్చున్నాను. అప్పుడు నేను "ఫిద్యతుమ్మిన్ సియామ్" అనే సూక్తి గురించి అడిగాను. దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు. కొందరు నన్ను దైవప్రవక్త(స) సన్నిధికి తీసికెళ్ళారు. ఆ సమయంలో నా తలలోని పేలు ముఖం దాకా వచ్చి తిరుగుతున్నాయి. దైవప్రవక్త(స) ఇది గమనించి "నువ్వింతగా (పేలతో) బాధ పడుతున్నావని నాకు తెలియదు. సరే, నీవు ఒక మేకను బలివ్వగలవా" అని అడిగారు. నేను ఇవ్వలేనన్నాను. "పోనీ మూడు రోజులు ఉపవాసం పాటించు లేదా ఆరుగురు పేదలకు అన్నదానం చెయ్యి. అంటే ఒక్కొక్క నిరుపేదకు అర్ధ 'సా' గోధుమల లెక్కన అన్నదానం చేయాలి. ఇక నీ తల గొరిగించుకో" అన్నారు దైవప్రవక్త(స). ఈ సూక్తి ప్రత్యేకంగా నా విషయంలో అవతరించింది. అయితే ఇది మీ అందరికీ కూడా వర్తించే సాధారణ ఆజ్ఞ.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ - బఖరా సూరా, 32వ అధ్యాయం - ఖౌలిహీ ఫమన్ కాన మిన్కుమ్ మరీజా....]

## 11వ అధ్యాయం - ఇహ్రాం (దీక్ష)లో ఉండి శస్త్ర చికిత్స చేయించుకోవచ్చు

751. హజ్రత్ ఇబ్నె బుహైన (రజి) కథనం:- 'లహీజమల్' అనే ప్రాంతంలో దైవప్రవక్త(స) ఇహ్రాం (దీక్ష)లో ఉండి తల మధ్య భాగాన శస్త్ర చికిత్స చేయించుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 11వ అధ్యాయం - అల్ హజామతిల్ ముహ్రిమ్]

## 13వ అధ్యాయం - ఇహ్రాం (దీక్ష)లో ఉండి తలను, దేహాన్ని కడగవచ్చు

752. హజ్రత్ అబ్దుల్లా బిన్ హునైన్ (రహ్మలై) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి), హజ్రత్ మసూద్ బిన్ మఖ్రమా (రజి)లు అబ్వా అనే ప్రాంతంలో ఉండగా ఇహ్రాం స్థితిలో స్నానం చేయడం గురించి వారిద్దరి మధ్య భేదాభిప్రాయం వచ్చింది. "ఇహ్రాం స్థితిలో తలంటుకోవచ్చ"ని హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) అన్నారు. కాని "ఇహ్రాం స్థితిలో యాత్రికుడు తలంటుకోకూడద"ని హజ్రత్ మసూద్ బిన్ మఖ్రమా (రజి) వాదించారు. అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) నన్ను హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) దగ్గరకు పంపించారు.

నేను హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) దగ్గరకు వెళ్ళాను. ఆ సమయంలో ఆయన రెండు నూతి కర్రల మధ్య ఒక వస్త్రం తెరగా చేసుకొని స్నానం చేస్తున్నారు. నేను వెళ్ళి ఆయనకు సలాం చేశాను. ఆయన 'ఎవర'ని అడిగారు. "నేను అబ్దుల్లా బిన్ హునైన్‌ని. దైవప్రవక్త(స) ఇహ్రాం (దీక్ష)లో ఉండి తల స్నానం ఎలా చేస్తారో తెలుసుకురమ్మని నన్ను హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)గారు పంపించారు" అని అన్నాను.

అప్పుడు హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) (తెరగా కట్టిన) వస్త్రాన్ని కొంచెం క్రిందికి లాగి

పట్టుకోగా ఆయన శిరస్సు నాకు కన్పించసాగింది. ఆ తరువాత ఆయన తన తలపై నీరు పోస్తున్న వ్యక్తితో "నీళ్ళు పోయి" అని చెప్పారు. ఆ వ్యక్తి ఆయన తలపై నీళ్ళు పోశాడు. అప్పుడు హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) చేతులతో తల రుద్దుకున్నారు. మొదట చేతుల్ని తల ముందు భాగాన, తరువాత వెనుక భాగాన తిప్పుతూ రుద్దుకున్నారు. అలా చేసి "దైవప్రవక్త(స) ఈ విధంగానే చేస్తుంటే నేను చూశాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 14వ అధ్యాయం - అల్ఇగ్తి సాలిలిల్ ముహ్రిమ్]

## 14వ అధ్యాయం - ఇహ్రాం స్థితిలో యాత్రికుడు చనిపోతే ఏం చేయాలి?

753. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ఒక వ్యక్తి అర్ఫా రోజు వఖూఫ్ (లేచి ఉండు) స్థితిలో ఉండి హఠాత్తుగా ఒంటె మీద నుంచి జారిపడ్డాడు. అతని మెడ ఎముక విరగడంతో (అక్కడికక్కడే) చనిపోయాడు. అప్పుడు దైవప్రవక్త(స) "అతని భౌతిక కాయానికి రేగాకులు కలిపిన నీళ్ళతో స్నానం చేయించి రెండు వస్త్రాలతో చుట్టండి. శవానికి సువాసన పూయకండి. ముఖం (వస్త్రంతో) కప్పకుండా అలాగే బయట ఉంచండి. ఇతను ప్రళయదినాన లబ్బైక్ అంటూ లేస్తాడు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 20వ అధ్యాయం - అల్ కఫని ఫీ సౌబైన్]

## 15వ అధ్యాయం - జబ్బు పడితే లేదా మరేదైనా అవాంతర పరిస్థితి ఎదురైతే దీక్ష విరమిస్తానని సంకల్పించుకుని దీక్ష పూనవచ్చు

754. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు హజ్రత్ జిబా బిన్తె జుబైర్ (రజి) దగ్గరకు వెళ్ళి "బహుశా నీవు హజ్ యాత్ర చేయడానికి సంకల్పించుకున్నావనుకుంటా" అని అన్నారు. దానికామె "ఔనండీ! దైవసాక్షి (నేను హజ్ చేయాలనే నిర్ణయించుకున్నాను). కాని తరచుగా జబ్బున పడుతున్నాను. (ఏం చేయను?") అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆమెకు ఇలా సలహా ఇచ్చారు. "ఒక షరతు మీద హజ్ చేయి. (ఇహ్రాం పూనేటపుడు) దేవా! నీవు నన్ను ఎప్పుడు నిరోధిస్తావో అప్పుడు నేను ఇహ్రాం (దీక్ష) విరమిస్తాను అని దైవంతో చెప్పుకో". ఈమె హజ్రత్ మిఖ్దాద్ బిన్ అస్వద్ (రజి) భార్య.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం -నికాహ్, 15వ అధ్యాయం - అల్ కఫా ఫిద్దీన్]

## 17వ అధ్యాయం - ఇహ్రాం పద్ధతులు - హజ్‌లోని మూడు విధులు: ఇఫ్రాద్, తమ్తూ, ఖిరాన్

755. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్) సమయంలో మేము దైవప్రవక్త(సల్లం) బయలుదేరినపుడు, మొదట మేము ఉమ్రాయాత్ర సంకల్పంతో మాత్రమే దీక్ష బూని తల్బియా (లబ్బైక్ పలుకులు) చెప్పాము. ఆ తరువాత ఖుర్బానీ పశువు వున్నవారు హజ్, ఉమ్రా రెండూ నిర్వహిస్తామని సంకల్పించుకొని తల్బియా చెప్పండని దైవప్రవక్త(సల్లం) మమ్మల్ని ఆదేశించారు.

పైగా ఈ రెండు ఆచారాలను పూర్తి చేయనిదే దీక్ష విరమించకండని కూడా ఆయన ఆజ్ఞాపించారు.

ఆ తరువాత మేము మక్కా చేరుకున్నాము. అయితే నేను రుతుమతి అవడం వల్ల కాబా ప్రదక్షిణ చేయలేకపోయాను. సఫా, మర్వా కొండల మధ్య 'సయీ' (పరుగెత్తడం) కూడా చేయలేకపోయాను. "నా పరిస్థితి ఇలా ఉంది ఏం చేయను?" అంటూ దైవప్రవక్త(సల్లం)ను అడిగాను. దానికి ఆయన పరిష్కార మార్గం చూపుతూ "శిరోజాలు (జడ) విప్పి దువ్వెనతో తలదువ్వుకో. ఉమ్రా సంగతి వదిలేసి హజ్ దీక్ష మాత్రమే పూను" అని అన్నారు.

మేమంతా హజ్ విధి నిర్వహించిన తరువాత దైవప్రవక్త(సల్లం) నన్ను (సోదరుడు) అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి) వెంట 'తన్ఈమ్' ప్రాంతానికి పంపించారు. అక్కడి నుంచి నేను (దీక్షబూని బయలుదేరి) ఉమ్రా చేశాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) మాట్లాడుతూ "ఇది నీ నుండి తప్పిపోయిన ఉమ్రాకు ప్రత్యామ్నాయపు ఉమ్రా అవుతుంది" అని అన్నారు. ఉమ్రా దీక్ష పూనినవారు కాబా ప్రదక్షిణ చేసి, సఫా, మర్వా కొండల మధ్య 'సయీ' ఆచారం పాటించి దీక్ష విరమించారు. ఆ తరువాత 'మినా' నుండి తిరిగొచ్చి మరో ప్రదక్షిణ చేశారు. హజ్, ఉమ్రాలు రెండింటిని కలిపేసినవారు ఒక్క ప్రదక్షిణ మాత్రమే చేశారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 31వ అధ్యాయం - కైఫతుహిల్లుల్ హాయిజ వన్నుఫ్సా]

756. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్) సమయంలో మేము దైవప్రవక్త(సల్లం) వెంట బయలుదేరాము. అప్పుడు కొందరు ఉమ్రా సంకల్పంతో ఇహ్రాం (దీక్ష) పూనారు. మరి కొందరు హజ్ సంకల్పంతో దీక్ష బూనారు. ఇలా మేము మక్కా చేరుకున్నాక దైవప్రవక్త (సల్లం) మమ్మల్నీ విధంగా ఆజ్ఞాపించారు, "ఖుర్బానీ (బలి) పశువును వెంట తీసుకురాకుండా కేవలం ఉమ్రా దీక్ష పూనిన వారు దీక్షను విరమించాలి. ఉమ్రా దీక్షను పూని బలిపశువును కూడా వెంట తీసుకొచ్చిన వారు ఆ పశువును బలి ఇవ్వనంత వరకు దీక్ష విరమించకూడదు. అలాగే హజ్ దీక్ష పూని లబ్బైక్ పలికినవారు తమ హజ్ (యాత్ర) ను పూర్తి చేయాలి".

నేను ఆ రోజుల్లో రుతుమతి అయి ఉన్నాను. ఇలా అరఫాలో విడిది చేసే రోజు (జిల్‌హజ్ తొమ్మిదో తేదీ) వరకు నేను రుతుమతిగానే ఉండిపోయాను. నేను ఉమ్రా దీక్ష మాత్రమే పూని ఉన్నాను. అంచేత నేను నా శిరోజాలు (జడ) విప్పి శుభ్రంగా దువ్వుకొని ఉమ్రా దీక్ష వదిలి హజ్ దీక్ష పూనవలసిందిగా దైవప్రవక్త(సల్లం)నన్ను ఆదేశించారు. నేను అలాగే చేసి హజ్ విధి నెరవేర్చాను. ఆ తరువాత దైవప్రవక్త(సల్లం) నన్ను (నా సోదరుడు) అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి) వెంట 'తన్ఈమ్' ప్రాంతానికి పంపిస్తూ అక్కడ ఉమ్రా దీక్ష పూనవలసిందిగా ఆజ్ఞాపించారు. ఇలా నేను వదిలి పెట్టిన ఉమ్రాకు బదులు ఉమ్రా చేయాలని ఆయన అన్నారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 18వ అధ్యాయం - కైఫతహిల్లుల్ హాయిజు బిల్ హజ్జి వల్ ఉమ్రా]

757. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేము (మక్కా) బయలుదేరాము. హజ్‌యాత్ర చేయడానికి వెళ్తున్నామని భావించాము. అయితే 'సరిఫ్' ప్రాంతానికి చేరుకునేటప్పటికి నేను రుతుమతి అయ్యాను. దాంతో నాకు దుఃఖం ముంచుకొచ్చింది. అప్పుడు దైవప్రవక్త(సల్లం) నా దగ్గరకొచ్చి నేను దుఃఖిస్తూ ఉండటం చూసి "ఏమయింది (ఏడుస్తున్నావు)? రుతుమతి అయ్యావా?" అని అడిగారు. నేను

'ఔనండి' అన్నాను. "ఇది దేవుడు స్త్రీల నొసట రాసిన రాత (దీన్నుండి ఎవరూ తప్పించుకోలేరు) అందువల్ల నువ్విప్పుడు కాబా ప్రదక్షిణ తప్ప హాజీలు పాటించే మిగతా ఆచారాలన్నీ పాటించు" అని చెప్పారు దైవప్రవక్త(సల్లం). ఆయన తన భార్యల తరపున ఒక ఆవును బలి ఇచ్చారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 1వ అధ్యాయం - కైఫకాన బద్‌యిల్ హైజ్]

758. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేము హజ్ నెలల్లో హజ్ దీక్ష పూని, హజ్ మర్యాదలు పాటిస్తూ (మదీనా నుండి) బయలుదేరాము. అలా మేము 'సరిఫ్' ప్రాంతానికి చేరుకొని విడిది చేశాము. అప్పుడు దైవప్రవక్త(సల్లం) తమ అనుచరుల్ని ఇలా ఆదేశించారు. "ఖుర్బానీ పశువును వెంట తెచ్చుకున్నవారు 'ఉమ్రా' చేయదలచుకుంటే ఉమ్రా చేయవచ్చు. కాని ఖుర్బానీ పశువును తీసుకురాని వారు అలా చేయకూడదు. (వారు హజ్ తప్పకుండా చేయాలి)."

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం ) నా దగ్గరకు వచ్చారు. నేనప్పుడు ఏడుస్తూ ఉండటం చూసి "ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగారు. "మీరు మీ అనుచరులతో చెప్పిన మాటలు నేను విన్నాను. కాని నేను ఉమ్రా చేయలేని పరిస్థితికి లోనయ్యాను" అన్నాను నేను. దానికి దైవప్రవక్త(సల్లం) "ఏమయింది?" అని అడిగారు. నేను నమాజు చేసే స్థితిలో (కూడా) లేను (అంటే రుతుమతి అయ్యాను)" అని అన్నాను.

అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా చెప్పారు: "దాని వల్ల నీకెలాంటి నష్టం ఉండదులే. మొత్తానికి నువ్వు ఆదం కూతురు అనిపించుకున్నావు. ఆదం కుమార్తెలందరికీ రాయబడిన రాతే నీకు రాయబడింది (అంటే రుతుస్రావం అనేది స్త్రీలకు దేవుడు నిర్ణయించిన ప్రకృతి ధర్మం. దాన్నుండి ఏ స్త్రీ తప్పించుకోజాలదు). అందువల్ల ప్రస్తుత పరిస్థితిలో నీవు హజ్ విధి నిర్వహించుకో. తర్వాత దేవుడు నీకు 'ఉమ్రా' చేసే భాగ్యం కూడా ప్రసాదించవచ్చు."

నేను అదే స్థితిలో ఉన్నాను. చివరికి మేము 'మినా' నుండి బయలుదేరి 'ముహస్సబ్'కు చేరుకున్నాము. అప్పుడు దైవప్రవక్త(సల్లం) (నా సోదరుడు) అబ్దుర్రహ్మాన్ (రజి)ని పిలిపించి "నీ సోదరిని ఉమ్రా దీక్ష పూనడానికి వీలుగా కాబా పరిధి నుంచి బయటికి తీసికెళ్ళు. తర్వాత మీరిద్దరు (కాబా) ప్రదక్షిణలు పూర్తి చేసుకొని తిరిగి ఇక్కడికే చేరుకోవాలి. నేను మీ కోసం ఇక్కడే వేచి ఉంటాను" అని చెప్పారు.

ఆ విధంగా మేము (నిర్దేశిత ఆచారాలన్నీ) పూర్తి చేసి అర్ధరాత్రి సమయానికి చేరుకున్నాము. దైవప్రవక్త(సల్లం) మమ్మల్ని చూసి "మీరిద్దరూ నిర్ణీత ఆచారాలన్నీ పాటించి వచ్చారా?" అని అడిగారు. పాటించి వచ్చామని నేను అన్నాను. ఆ తరువాత ఆయన అనుచరులందరూ (మదీనా) బయలుదేరవలసిందిగా ప్రకటన చేయించారు. దాంతో అందరూ తిరుగు ప్రయాణమయ్యారు. ఫజ్ర్ నమాజ్‌కు పూర్వం రాత్రే (వీడ్కోలు) ప్రదక్షిణ చేసిన వారు కూడా వచ్చి చేరారు. ఇలా అందరూ మదీనా తిరుగుముఖం పట్టారు.

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం-ఉమ్రా, 9వ అధ్యాయం - అల్ మోతమరి ఇజాతాఫ తవ్వాఫుల్ ఉమ్రతి సుమ్మ ఖరజహల్ యుజ్‌జి ఉహూ తవాఫిల్ విదా]

759. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) వెంట (మదీనా నుండి) బయలుదేరాము. హజ్ చేయడానికే వెళ్తున్నామని అందరూ భావించారు. కాని మక్కా చేరుకొని కాబా ప్రదక్షిణ చేసిన తరువాత "ఖుర్బానీ పశువు వెంట తీసుకురాని వారు దీక్ష విరమించాల"ని దైవప్రవక్త(సల్లం) ఆజ్ఞాపించారు. అందుచేత ఖుర్బానీ పశువును వెంట తీసుకురానివారు దీక్ష విరమించారు. అలాగే ప్రవక్త భార్యల దగ్గర కూడా బలిపశువులు లేనందున వారు కూడా దీక్ష విరమించారు. నేను రుతుమతి అయిన కారణంగా కాబా ప్రదక్షిణ కూడా చేయలేకపోయాను.

తర్వాత (మేము) 'ముహస్సబ్' ప్రాంతంలో రాత్రివేళ విడిది చేసినపుడు నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! జనమంతా హజ్, ఉమ్రా రెండూ జరిపి తిరుగు ప్రయాణమయితే నాకు మాత్రం హజ్ భాగ్యం ఒక్కటే దక్కుతుంది మరి" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) నా మాటలు విని "ఏమిటి! మనం మక్కా చేరుకున్నప్పుడు నువ్వు కాబా ప్రదక్షిణ చేయలేదా?" అని అడిగారు. నేను 'లేద'న్నాను. "సరే, నీవు నీ సోదరుని వెంట 'తన్ఈమ్' ప్రాంతానికెళ్ళి అక్కడ ఉమ్రా దీక్ష పూను. తర్వాత (నిర్ణీత ఆచారాలన్నీ) పూర్తి చేసి ఫలానా చోట మాతో వచ్చి చేరుకో" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(అదే సందర్భంలో) హజ్రత్ సఫియా (రజి) కూడ మాట్లాడుతూ "మీరంతా ఆగిపోవడానికి నేను కారణమవుతానేమోనని భావిస్తున్నాను. (అంటే హజ్రత్ సఫియా (రజి) కూడా రుతుమతి అయ్యారన్న మాట. వీడ్కోలు ప్రదక్షిణ మూలంగా అందరూ ఆగిపోవలసి వస్తుందేమోనని ఆమె భావించారు) దైవప్రవక్త (సల్లం) ఆమె మాటలు విని "సిగతరగ! ఏమిటీ! నువ్వు యౌమున్నహర్ ప్రదక్షిణ చెయ్యలేదా?" అని ప్రశ్నించారు. దానికామె "ఆ ప్రదక్షిణ మాత్రం చేశాను" అన్నారు. "అయితే ఇక నష్టమేమీ లేదు. నువ్వు మాతో పాటే బయలుదేరవచ్చు" అన్నారు దైవప్రవక్త(సల్లం).

హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) మక్కా నుండి (మదీనా దిశగా) బయలుదేరి మెరక ప్రదేశం ఎక్కుతుండగా, నేను మక్కా పల్లపు ప్రదేశంలో దిగుతూ ఆయన్ను కలుసుకున్నాను. లేదా (ఇక్కడ ఉల్లేఖకునికి అనుమానం వచ్చింది) ఆయన దిగుతూ ఉంటే నేను ఎక్కుతూ ఉన్నాను.

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - హజ్, 34వ అధ్యాయం - అత్తమత ఇవల్ ఇఖాని వల్ ఇఫాది జిల్‌హజ్]

760. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి)ని వాహనం మీద వెనుక కూర్చొబెట్టుకొని 'తన్ఈమ్' ప్రాంతానికి తీసుకెళ్ళమని, అక్కడ ఆమె ఉమ్రా దీక్ష పూని ఉమ్రా చేసి వస్తుందని దైవప్రవక్త (సల్లం) నన్ను ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 7వ అధ్యాయం - ఉమ్రతిత్తన్ఈమ్]

761. హజ్రత్ అతా (రహ్మాలై) కథనం:- హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కొందరు వ్యక్తుల ముందు ఇలా చెబుతుండగా నేను విన్నాను - "మేము (అంటే ప్రవక్త అనుచరులం) హజ్ దీక్ష మాత్రమే పూనాము. దాంతోపాటు ఉమ్రా కూడా చేస్తామని సంకల్పించుకోలేదు".

హజ్రత్ జాబిర్ (రజి) ఇంకా ఇలా చెప్పారు: దైవప్రవక్త(సల్లం) జిల్‌హజ్ నాల్గో తేదీ ఉదయం (మక్కా) వచ్చారు. మేము,ఆయన దగ్గరికి వచ్చినపుడు మమ్మల్ని దీక్ష విరమించమని ఆదేశించారు ఆయన. "దీక్ష విరమించి (మీమీ) స్త్రీల దగ్గరకు వెళ్ళండి" అని అన్నారాయన. ఆయన వారిపై ఈ

విషయాన్ని ఫర్జ్ చేయలేదు (విధించలేదు). దీక్ష విరమించిన తరువాత స్త్రీల దగ్గరకు వెళ్ళడం ధర్మసమ్మతం చేశారు. "అర్ఫా నియమం పాటించడానికి ఇంకా అయిదు రోజులు మాత్రమే మిగిలి ఉండగా ఇప్పుడా (మేము స్త్రీల దగ్గరకు వెళ్ళాల్సింది?)" అని అనుయాయులు చెప్పుకుంటున్న మాట దైవప్రవక్త(సల్లం)కు తెలిసింది. అయినప్పటికీ మేము (మా) స్త్రీలను కలుసుకోవాలని ఆయన ఆజ్ఞాపించారు. అంటే మేము మా నుండి మర్మాంగ ధాతువు ఓడుతున్న స్థితిలో అర్ఫా ఆచారం పాటించడానికి పోవాలన్నట్లుగా ఆయన చెప్పారు.

హజ్రత్ జాబిర్ (రజి) తన చేతిని ఊపి చూపిస్తూ, 'ఈ విధంగా' అని అన్నారు. ఈ సంగతి తెలియగానే దైవప్రవక్త(సల్లం) లేచి నిలబడి "నేను మీ అందరికన్నా ఎక్కువ దైవభీతిపరుణ్ణని, మీ అందరికన్నా ఎక్కువ సద్వర్తనుడిని, సత్యసంధుణ్ణని మీకు బాగా తెలుసు. నా దగ్గర గనక బలి పశువు లేకపోయి ఉంటే నేను కూడా మీలాగే దీక్ష విరమించేవాణ్ణి. కనుక మీరు (ఇప్పటికైనా విషయం గ్రహించి) దీక్ష విరమించండి. తర్వాత తెలిసిన ఆజ్ఞ నాకు ముందుగానే తెలిసి ఉంటే నేనసలు బలిపశువుని వెంట బెట్టుకుని వచ్చి ఉండేవాణ్ణి కాను" అని అన్నారు.

"అందువల్ల మేము దైవప్రవక్త(సల్లం) ఉపదేశం విని ఆయన ఆజ్ఞను సంతోషంగా శిరసావహిస్తూ దీక్ష విరమించాము" అన్నారు హజ్రత్ జాబిర్ (రజి).

**[సహీహ్ బుఖారీ: 96వ ప్రకరణం - అల్ ఏతెసామ్, 27వ అధ్యాయం - నహ్యిన్నబీ (సల్లం) అలత్తహ్రీమి ఇల్లా మాతారఫ అబాహితుహ్]**

762. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ అలీ (రజి)ని దీక్ష విరమించకూడదని ఆదేశించారు. విషయం ఏమిటంటే హజ్రత్ అలీ (రజి) యమన్ నుండి యుద్ధప్రాప్తి తీసుకొని వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆయన్ని "అలీ! నీవు దీక్షపూనేటప్పుడు ఏమని సంకల్పించుకున్నావు" అని అడిగారు. దానికి హజ్రత్ అలీ (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త(సల్లం) ఎలాంటి దీక్ష పూనారో నేనూ అలాంటి దీక్ష పూనుతానని సంకల్పించుకున్నాను" అని అన్నారు. దైవప్రవక్త(సల్లం) ఈమాటలు విని "అయితే నువ్వు నీ దీక్షపై స్థిరంగా ఉండి పశుత్యాగం కూడ చెయ్యి" అని ఉపదేశించారు. (అంటే దైవ ప్రవక్త(సల్లం)తో పాటు హజ్రత్ అలీ (రజి) కూడా వెంట బలి పశువును తీసుకురావడం వల్ల దీక్ష విరమించకూడదు. బలిపశువులు తీసుకురాని ఇతరులు దీక్ష విరమించాలని దైవప్రవక్త(సల్లం) ఇచ్చిన ఆజ్ఞ ఇక్కడ హజ్రత్ అలీ (రజి)కి వర్తించదు).

హజ్రత్ జాబిర్ (రజి) ఇంకా ఇలా తెలియజేస్తున్నారు:- దైవప్రవక్త(సల్లం) కోసం కూడా హజ్రత్ అలీ (రజి) యే బలిపశువుని తీసుకువచ్చారు.

**[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 61వ అధ్యాయం - బేస్ అలీబిన్ అబీతాలిబ్ (అలైహి)]**

763. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఆయన అనుచరులు (రజి) హజ్ చేస్తామని సంకల్పించుకొని ఇహ్రాం (దీక్ష) పూనారు. వారిలో దైవప్రవక్త (సల్లం) దగ్గర, హజ్రత్ తల్హా(రజి) దగ్గర తప్ప మరెవరి దగ్గరా బలిపశువులు లేవు. హజ్రత్ అలీ (రజి) యమన్ నుండి వచ్చారు. ఆయన దగ్గర కూడా బలిపశువు ఉంది. హజ్రత్ అలీ (రజి) తన దీక్ష ఉద్దేశాన్ని తెలుపుతూ "నేను దీక్ష పూనేటప్పుడు దైవప్రవక్త (సల్లం) దీక్ష ఎలాంటిదో నా దీక్ష కూడ అలాంటిదే ఉంటుందని

సంకల్పించుకున్నాను'' అని అన్నారు. ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని ఇలా ఆదేశించారు. "బలిపశువులు కలిగి ఉన్న వాళ్ళు తప్ప మిగిలిన వారంతా తమ దీక్షను హజ్ దీక్షకు బదులు ఉమ్రా దీక్షగా పరిగణించి కాబా ప్రదక్షిణ చేయాలి. ఆ తరువాతే దీక్ష విరమించి శిరోజాలు కత్తిరించుకోవాలి.''

అప్పుడు ప్రవక్త అనుచరులు కొందరు (ఈ విషయంపై వ్యాఖ్యానిస్తూ) "అంటే మనం మర్మాంగధాతువు ఓడుతున్న స్థితిలో 'మినా' చేరుకోవాలన్నమాట''! అని అన్నారు. ఈ సంగతి తెలిసి దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు, "నాకు తరువాత ఇవ్వబడిన ఆజ్ఞ ముందుగా తెలిసి ఉంటే నేను కూడా నా వెంట బలిపశువును తీసుకు వచ్చేవాడ్ని కాను. నా దగ్గర బలిపశువు లేకుండా ఉంటే నేను కూడా దీక్ష విరమించేవాణ్ణి.''

(ఆ సందర్భంలోనే) విశ్వాసుల మాతృమూర్తి ఆయిషా (రజి) రుతుమతి అయ్యారు. అందువల్ల ఆమె కాబా ప్రదక్షిణ చేయలేకపోయారు. మిగిలిన హజ్ ఆచారాలన్ని పాటించారు. ఆ స్థితి తొలగిపోయిన తరువాత ఆమె కాబా ప్రదక్షిణ చేశారు. అప్పుడు ఆమె దైవప్రవక్త (సల్లం)తో "దైవప్రవక్తా! మీరంతా హజ్, ఉమ్రా రెండు చేసి వెళ్తారు. నేనేమో హజ్ మాత్రమే చేయాలి మరి?'' అని అన్నారు. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని (ఆమె సోదరుడు) హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి)తో "నీవు ఆయిషా (రజి) వెంట 'తన్ఈమ్' ప్రాంతానికి వెళ్ళు'' అని అన్నారు. ఈ విధంగా హజ్రత్ ఆయిషా (రజి) హజ్ తర్వాత ఉమ్రా చేశారు, (అయితే) జిల్‌హజ్ నెలలోనే చేశారు.

దైవప్రవక్త (సల్లం) ఉఖ్బా (ప్రదేశం)లో జుమ్రా మీద రమీ చేస్తుండగా (అంటే కంకర్రాళ్ళు విసురుతుండగా) హజ్రత్ సురాఖా బిన్ మాలిక్ బిన్ జాషమ్ (రజి) ఆయన దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! (హజ్ దీక్షను ఉమ్రా దీక్షగా మార్చుకోవడం, ఉమ్రా నిర్వహించి దీక్ష విరమించడం, హజ్ దినాలలో ఉమ్రా నిర్వహించడం అనే) ఈ అనుమతి మా కోసం మాత్రమే ప్రత్యేకమా?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త(సల్లం) "లేదు, ఇది అందరి కోసం ఎల్లకాలం ఉంటుంది'' అన్నారు.

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 6వ అధ్యాయం - ఉమ్ర తిత్రన్ఈమ్]

## 21వ అధ్యాయం - అరఫాత్ మైదానంలో ఆగడం గురించి దైవాజ్ఞ

764. హజ్రత్ ఉర్వా (రహ్మలై) కథనం:- అజ్ఞాన కాలంలో 'హుమ్స్' ప్రజలు తప్ప మిగతా జనమంతా నగ్నంగా కాబా ప్రదక్షిణ చేసేవారు. హుమ్స్ అంటే ఖురైషులు, వారి సంతానం అని అర్థం. వారు పుణ్యఫలాపేక్షతో ప్రజలకు బట్టలు ఇచ్చేవారు. పురుషులు పురుషులకు, స్త్రీలు స్త్రీలకు తమ బట్టలు ఇచ్చేవారు. 'హుమ్స్' నుండి బట్టలు పొందని వారు నగ్నంగానే ప్రదక్షిణ చేసేవారు. అదీగాక ఆనాడు 'హుమ్స్' తప్ప మిగిలిన ప్రజలంతా అరఫాత్ మైదానానిక్కూడా వెళ్ళి వచ్చేవారు. 'హుమ్స్' మాత్రం 'ముజ్దల్ఫా' వరకే వెళ్ళి తిరిగొచ్చేవారు. హజ్రత్ ఆయిషా (రజి) ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "సుమ్మ అఫీజూ మిన్ హైసు అఫాజన్నాస్ (ప్రజలు ఎక్కడి దాకా వెళ్ళి తిరిగొస్తారో మీరు కూడా అక్కడి దాకా వెళ్ళి తిరిగొచ్చేయండి) అనే దైవసూక్తి (2:199) 'హుమ్స్' గురించే అవతరించింది. వారు పూర్వం ముజ్దల్ఫా నుండే తిరిగొచ్చేవారు. అంచేత అరఫాత్, వరకు వెళ్ళి రావాలని వారిని (ఈ సూక్తిలో) ఆదేశించడం జరిగింది'' అని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 91వ అధ్యాయం - అల్ వఖూఫి బిఅరఫా]

765. హజ్రత్ జుబైర్ బిన్ ముత్అమ్ (రజి) కథనం:- ఓసారి నా ఒంటె తప్పిపోయింది. నేను దాన్ని అరఫా రోజు వెతకడానికి బయలుదేరితే, దైవప్రవక్త (సల్లం) నాకు అరఫాత్‌లో కన్పించారు. నేను మనసులో "వీరు 'హుమ్స్'కు చెందినవారు కదా! ఏమయింది వీరికి ఈ రోజు ఇక్కడికి వచ్చారు!" అని అనుకున్నాను. (ఖురైషీయులు ముజ్దల్ఫా దాటి ముందుకు వెళ్లరు. అలాంటిది దైవప్రవక్త(సల్లం) ఈ రోజు అరఫాత్‌లో కన్పించడం వల్ల ఈయన ఆశ్చర్యపోయారు].

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 91వ అధ్యాయం - అల్‌వఖూఫి బి అరఫా]

## 22వ అధ్యాయం - దీక్ష విరమణ అనుమతి రద్దు, ఎలా సంకల్పించుకుంటే అలాగే ఆచారాలు పాటించాలి

766. హజ్రత్ అబూమూసా (రజి) కథనం:- నేనొకరోజు దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన 'బత్హా' ప్రదేశంలో ఉన్నారు. ఆయన నన్ను (చూడగానే) "హజ్ చేశావా నువ్వు?" అని అడిగారు. నేను చేశానని చెప్పాను. "అయితే ఏ సంకల్పంతో ఇహ్రాం (దీక్ష) పూనావు?" అడిగారు ఆయన మళ్ళీ. "దైవప్రవక్త(సల్లం) సంకల్పమే నా సంకల్పం అని సంకల్పించుకున్నాను" అని చెప్పాను నేను. "మంచిపని చేశావు, ఇక వెళ్ళు (మిగిలిన ఆచారాలు పాటించు)" అన్నారు ఆయన.

ఆ తరువాత నేను వెళ్ళి కాబా ప్రదక్షిణ, సఫా-మర్వా కొండల మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేశాను. ఆ తరువాత నేను బనీఖైస్ తెగకు చెందిన ఒక స్త్రీ దగ్గరకు వెళ్ళాను. ఆమె నా తలలో పేలు చూసి తీసింది. ఆ తరువాత నేను హజ్ దీక్ష పూనాను. హజ్రత్ ఉమర్ (రజి) గారి పాలనా కాలం వరకు నేను (హజ్ ఆచారాలు) ఇలాగే పాటించాలని ప్రజలతో చెబుతుండేవాడ్ని. హజ్రత్ ఉమర్ (రజి) ఖలీఫా అయిన తరువాత నేను ఆయన ముందు ఈ విషయం ప్రస్తావించాను. అప్పుడు ఆయన ఇలా అన్నారు. "మనం గనక దివ్యఖుర్ఆన్ ప్రకారం నడుచుకుంటే అది మనల్ని హజ్, ఉమ్రా రెండూ చేయాలని ఆదేశిస్తుంది. దైవప్రవక్త(సల్లం) సంప్రదాయం ప్రకారం నడుచుకుంటే, ఆయన కూడా బలిపశువు తన స్థానానికి చేరనంతవరకు దీక్ష విరమించలేదని మనం గ్రహిస్తాము."

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 125వ అధ్యాయం - అజ్జబీహ్ ఖబ్లల్ హల్ఖ్]

## 23వ అధ్యాయం - తమత్తా (ఏకకాలంలో హజ్, ఉమ్రాలు చేయడం) ధర్మ సమ్మతమే

767. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) ఇలా అన్నారు:- దివ్యఖుర్ఆన్‌లో 'తమత్తా' ఆజ్ఞ అవతరించింది. (అప్పుడు) మేము దైవప్రవక్త (సల్లం)తో పాటు 'తమత్తా' చేశాము. ఆ తర్వాత ఖుర్ఆన్‌లో ఈ ఆజ్ఞ నిషేధించబడినట్లు ఎలాంటి ఆదేశం అవతరించలేదు. దైవప్రవక్త (సల్లం) కూడా

ఇహలోకం వీడిపోయే వరకు మమ్మల్ని ఇలా చేయడం గురించి వారించలేదు. ఇప్పుడిక ఎవరైనా(1) దీన్ని వారిస్తుంటే అది అతనిష్టం. (మనమేం చేయగలం?)

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 2. సూరతుల్ బఖరా, 33వ అధ్యాయం - ఫమన్ తమత్త బిల్ ఉమ్రతి ఇలల్ హజ్]

## 24వ అధ్యాయం - తమత్తా (ఒకేసారి హజ్, ఉమ్రాలు) చేసేవారు పశువుని బలివ్వాలి, ఆ స్తోమత లేనివాళ్ళు పది రోజులు ఉపవాసముండాలి

768. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్) సందర్భంలో 'ఉమ్రా'ని హజ్‌తో కలిపేశారు. ఖుర్బానీ (పశుత్యాగం) చేశారు. బలిపశువుని 'జుల్‌హులైఫా' నుండి తమ వెంట తీసుకెళ్ళారు. ఆయన మొట్టమొదట ఉమ్రా దీక్ష పూని 'లబ్బైక్' పలికారు. ఆ తరువాత హజ్ (దీక్షపూని) లబ్బైక్ పలికారు. అప్పుడు ప్రజలు కూడా ఆయన్ని అనుసరిస్తూ 'ఉమ్రా'ని హజ్‌తో కలిపేసి 'తమత్తా'(2) చేశారు. కొందరు తమ వెంట బలిపశువుల్ని తెచ్చుకున్నారు. మరికొందరు బలిపశువుల్ని తెచ్చుకోలేదు.

దైవప్రపక్త (సల్లం) మక్కా వచ్చినపుడు ఇలా ఉపదేశించారు: "బలిపశువుల్ని వెంట తెచ్చుకున్నవారు ఇహ్రాం (దీక్ష) విరమించకూడదు. అదీగాక హజ్ (నిర్వహణ) ముగించనంతవరకు ఇహ్రాం స్థితిలో నిషేధించబడిన విషయాలు వారికి ధర్మసమ్మతం కాలేవు. పోతే బలిపశువుల్ని వెంట తెచ్చుకోనివారు కాబా ప్రదక్షిణ, సఫా-మర్వా కొండల మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేసి, శిరోజాలు కత్తిరించుకొని దీక్ష విరమించాలి. ఆ తర్వాత హజ్ దీక్షపూని 'లబ్బైక్' పలకాలి. పశువు బలి చేసే స్తోమత లేనివారు హజ్ దినాలలో మూడు రోజులు ఇంటికెళ్ళిన తరువాత మరో ఏడు రోజులు ఉపవాసం పాటించాలి."

దైవప్రవక్త (సల్లం) మక్కాలో ప్రవేశించి (ముందుగా) కాబా ప్రదక్షిణ చేశారు. మొట్ట మొదట 'హజ్రె అస్వద్' (నల్లరాయి)ని ముద్దాడారు. తర్వాత భుజాలు ఎగిరేస్తూ వడివడిగా నడుస్తూ మూడు చుట్లు తిరిగారు. అంటే రమల్ ఆచారం పాటించారు. మిగిలిన నాలుగు చుట్లు మామూలుగానే నడుస్తూ తిరిగారు. ఈ విధంగా కాబా ప్రదక్షిణలు ముగించిన తరువాత 'మఖామె ఇబ్రాహీం' దగ్గర రెండు రకాతులు నమాజు చేశారు. నమాజు ముగించి సఫా కొండ దగ్గరకు వెళ్ళారు. సఫా-మర్వా

---

(1) ఇక్కడ ఎవరైనా అంటే మూడవ ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ (రజి) అని అర్థం. ఆయన 'తమత్తా' నియమం పాటించడాన్ని వారిస్తుండేవారు.

(2) ఈ హదీసు ద్వారా ఒక విషయం స్పష్టంగా తెలుస్తోంది. 'తమత్తా' అంటే 'ఫిక్‌హ్' పరిభాషలో తీసుకున్న భావం కాకుండా "హజ్, ఉమ్రాలను ఒకేయాత్ర (ప్రయాణం)లో పాటించడానికి సౌకర్యం పొందడం" అని అర్థం. (ఇది మూఢకాలంలో ధర్మసమ్మతంగా లేదు) ఉమ్రా చేసి (ఇహ్రాం) దీక్ష విరమించినా ఖుర్బానీ పశువులు వెంట తెచ్చుకోనివారు చేసినట్లు పారిభాషిక 'తమత్తా' చేసినా, ఖిరాన్ చేసినా, అంటే ఉమ్రా పూర్తయ్యాక కూడా దీక్ష విరమించకపోయినా, దైవప్రవక్త(సల్లం)తో పాటు బలిపశువులు వెంట తెచ్చుకున్నవారు చేసినట్లు హజ్, ఉమ్రాలు రెండింటినీ ముగించి దీక్ష విరమించినా - ఇవన్నీ ప్రవక్త అనుచరుల దృష్టిలో 'తమత్తా'గ్గానే పరిగణించబడ్డాయి. ధర్మవేత్తల దృష్టిలో మాత్రం ఈ రెండు నియమాలు 'తమత్తా' 'ఖిరాన్'లు గా పరిగణించబడ్డాయి.

కొండల మధ్య ఏడుసార్లు 'సయీ' (పరుగెత్తడం) చేశారు. హజ్ (విధి) ముగించి, జిల్‌హజ్ పదో తేదీన పశుబలి ఇవ్వనంత వరకు ఆయన ఇహ్రాం (దీక్ష) విరమించలేదు. అలాగే ఇహ్రాం స్థితిలో నిషేధించబడిన ఏ విషయాన్నీ తన కోసం ధర్మసమ్మతం చేసుకోలేదు. ఈ విధంగానే దైవప్రవక్త (సల్లం) ఆచరించారు. బలిపశువుల్ని తమ వెంట తెచ్చుకున్నవారు కూడా ఇలాగే ఆచరించారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 104వ అధ్యాయం - మన్ సాఖల్ బుద్న మాహూ]

769. హజ్రత్ ఉర్వా (రహ్మాలై) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఆయన అనుచరులు (రజి) 'ఉమ్రా'ని హజ్‌తో కలిపి 'తమత్తా' చేయడం గురించి (పై హదీసులో పేర్కొన్నట్లు) హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) చెప్పిన వివరాలే హజ్రత్ ఆయిషా (రజి) కూడా చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 104వ అధ్యాయం - మన్ సాఖల్ బుద్న మాహూ]

## 25వ అధ్యాయం - ఇఫ్రాద్ హజ్ చేసేవాళ్ళు ఇహ్రాం (దీక్ష) విరమించినపుడే ఖిరాన్ హజ్ చేసే వాళ్ళు కూడా ఇహ్రాం విరమించాలి

770. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ హఫ్సా (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! ప్రజలు 'ఉమ్రా' నిర్వహించి దీక్ష విరమిస్తే, మీరు 'ఉమ్రా'ని నిర్వహించిన తరువాత కూడా దీక్ష విరమించలేదు. కారణం ఏమిటీ?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(స) సమాధానమిస్తూ "నేను నా శిరోజాలను (పెరుగుదలకై) వదిలేశాను. అదీగాక నా బలిపశువు మెడలో పట్టా వేసి ఉంచాను. అందువల్ల పశు బలి ఇవ్వనంతవరకు నేను దీక్ష విరమించలేను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 34వ అధ్యాయం - అత్తమత్తా వల్ ఇఖ్రాని వల్ ఇఫ్రాది బిల్ హజ్]

## 26వ అధ్యాయం - కాబాకు వెళ్ళే దారిలో ఆటంకాలు ఎదురైతే దీక్ష విరమించవచ్చు

771. అబ్దుల్లా బిన్ ఉమర్ హదీసు:- అరాచకం, అల్లర్ల కాలంలో (క్రూరపాలకుడైన హజ్జాజ్ బిన్ యూసుఫ్ హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి)తో యుద్ధం చేయడానికి మక్కా మీద దండెత్తిన రోజుల్లో) హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉమ్రా చేసే ఉద్దేశ్యంతో దీక్షపూని మక్కా బయలుదేరారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ "మనల్ని మక్కా పోకుండా నిరోధించడం జరిగితే మనం గతంలో దైవప్రవక్త(స) అనుసరణలో ఎలా చేశామో ఇప్పుడూ అలాగే చేద్దాం" అని అన్నారు. హుదైబియా ఒడంబడిక సందర్భంలో దైవప్రవక్త(స) ఉమ్రా దీక్ష పూనారు. అందువల్ల ఇప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా ఉమ్రా దీక్ష పూనారు. ఆయన ఈ విషయాన్ని నిశితంగా ఆలోచించి "హజ్, ఉమ్రా వ్యవహారాలు ఒకే విధమైనవి" అని అన్నారు. ఆయన తన అనుచరులతో మాట్లాడుతూ "ఇలాంటి సందర్భాల్లో హజ్, ఉమ్రాలు చేయడంలో ఎలాంటి తేడా లేదు. అందువల్ల నేను మిమ్మల్ని సాక్షులుగా నిలబెట్టి ఉమ్రాతో పాటు హజ్ కూడా చేయాలని నిర్ణయించుకున్నాను" అని అన్నారు. ఆ తరువాత ఆయన హజ్, ఉమ్రాలు రెండింటికీ ఒకేసారి ప్రదక్షిణ చేశారు. అదే సరిపోతుందని భావించారు. ఆ తరువాత పశుబలి (ఖుర్బాని) ఇచ్చారు.

[సహీహ్ బుఖారీ : 27వ ప్రకరణం - ముహ్సిర్, 4వ అధ్యాయం - మన్ ఖాలలైస అలల్ ముహ్సిర్ బదల్]

772. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి)పై హజ్జాజ్ బిన్ యూసుఫ్ దాడి చేయడానికి (మక్కా) వస్తున్న సంవత్సరం హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) హజ్ చేయడానికి సంకల్పించుకున్నారు. అప్పుడు కొందరు (మిత్రులు) "ప్రజల మధ్య యుద్ధం జరగనున్నది. మిమ్మల్ని కాబా గృహం చేరుకోకుండా (శత్రువులు) అడ్డుకునే ప్రమాదం ఉంది" అని అన్నారు. దానికి ఆయన (రజి) "మీకు దైవప్రవక్త (స) ఎంతో ఆదర్శప్రాయులు. (అహ్జాబ్:21)" అన్న ఖుర్ఆన్ సూక్తిని ప్రస్తావించి "నేనిప్పుడు దైవప్రవక్త(స) ఎలా చేశారో అలాగే చేస్తాను. నేను ఉమ్రా యాత్రను నా మీద విధించుకున్నాను. దీనికి మీరే సాక్షులు" అని అన్నారు. ఆ తరువాత ఆయన హజ్ యాత్రకు బయలుదేరారు.

అలా హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) బయలుదేరి 'బైదా' ప్రదేశం చేరుకున్న తరువాత "హజ్, ఉమ్రాలను గురించి ఒకే విధమైన ఆజ్ఞ ఉంది. అందువల్ల నేను 'ఉమ్రా'తో పాటు హజ్ కూడా నా మీద విధించుకున్నాను. దీనికి మీరే సాక్షులు" అని అన్నారు. ఆయన బలిపశువును కూడా తన వెంట పెట్టుకున్నారు. దాన్ని ఆయన 'ఖుదైద్' ప్రాంతంలో కొన్నారు. అంతకు మించి ఆయన ఏ పనీ చేయలేదు. పశుత్యాగం చేయలేదు. ఇహ్రాం (దీక్ష) స్థితిలో నిషేధించబడిన విషయాలను ధర్మసమ్మతం కూడా చేసుకోలేదు. తల గొరిగించుకోలేదు, శిరోజాలు కత్తిరించుకోలేదు. ఆ తరువాతనే (సంప్రదాయం ప్రకారం) జిల్ హజ్ పదో తేదీన పశు బలి ఇచ్చి తలగొరిగించుకున్నారు. ఆయన తాను చేసిన కాబా ప్రదక్షిణ హజ్, ఉమ్రాలు రెండింటికీ సరిపోతాయని భావించారు. దైవప్రవక్త(స) ఇలాగే చేశారని ఆయన అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 77వ అధ్యాయం - తవాఫిల్ ఖారిన్]

## 27వ అధ్యాయం - హజ్, ఉమ్రాలు కలిపి లేదా విడివిడిగా చేయడం గురించి

773. హజ్రత్ బకర్ (రహ్మలై) కథనం:- దైవప్రవక్త(స) హజ్, ఉమ్రాలు రెండింటికీ ఒకే ఇహ్రాం (దీక్ష) పూనారని హజ్రత్ అనస్ (రజి) తెలియజేసిన విషయాన్ని నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ముందు ప్రస్తావించాను. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) అది విని ఇలా అన్నారు :

"దైవప్రవక్త (స) మొదట హజ్ దీక్ష పూనారు. మేము కూడా ఆయనతో పాటు హజ్ దీక్ష పూనాము. ఆ తరువాత మేము మక్కా చేరుకుంటే 'బలిపశువులు తీసుకురానివాళ్ళు హజ్‌ని ఉమ్రాగా మార్చుకోవాల'ని దైవప్రవక్త(స) ఆదేశించారు. దైవప్రవక్త(స) దగ్గర బలిపశువు ఉండింది. హజ్రత్ అలీ (రజి) యమన్ ప్రాంతం నుండి హజ్ చేయడానికి వచ్చారు. అప్పుడు దైవప్రవక్త(స) ఆయన్ని "నీవు దీక్ష పూనేటప్పుడు ఏమని సంకల్పించుకున్నావు? నీ ఇంటివాళ్లూ, మా వెంట ఉన్నారు కదా!" అని అడిగారు. దానికి హజ్రత్ అలీ (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త(స) దీక్షే నా దీక్ష కూడా అని సంకల్పించుకున్నాను" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) "అయితే నువ్వు అదే దీక్షలో ఉండు. మన (ఉభయుల) దగ్గర బలిపశువులు ఉన్నాయి. (వాటిని బలి ఇచ్చిన తరువాతనే మనం దీక్ష విరమించగలం)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 61వ అధ్యాయం - బాస్ అలీ బిన్ అబీ తాలిబ్ (రజి) వ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) ఇలల్ యమని ఖబ్లి హజ్జతిల్ విదా]

## 28వ అధ్యాయం - హజ్ దీక్ష పూని మక్కా వచ్చినవాళ్ళు ఎన్ని ప్రదక్షిణలు చేయాలి?

774. హజ్రత్ అమ్ర్ బిన్ దీనార్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)తో మాట్లాడుతూ "ఒకవేళ ఎవరైనా కాబా ప్రదక్షిణ మాత్రమే చేసి సఫా, మర్వా (కొండల) మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేయకపోతే అతను (దీక్ష విరమించి) తన భార్యతో సంభోగించవచ్చా?" అని అడిగాను. దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు. "దైవప్రవక్త (సల్లం) మక్కా వెళ్ళి ఏడు చుట్లు కాబా ప్రదక్షిణ చేసి 'మఖామె ఇబ్రాహీం' దగ్గర రెండు రకాతులు నమాజు చేశారు. ఆయన సఫా, మర్వా (కొండ)ల మధ్య 'సయీ' కూడా చేశారు. మనకు దైవప్రవక్త(సల్లం) విధానమే ఎంతో ఆదర్శనీయం, అనుసరణీయం".

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 30వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా వత్త ఖిజూ మిమ్మ ఖామి ఇబ్రాహీమ ముసల్లా]

## 29వ అధ్యాయం - తవాఫ్, సయీ చేసినవాడు ఇహ్రాం స్థితిలోనే ఉండాలా?

775. ముహమ్మద్ బిన్ అబ్దుర్రహ్మాన్ బిన్ నౌఫిల్ ఖురషి(రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ (రజి)ను హజ్ నియమాలను గురించి అడిగితే ఆయన ఇలా సమాధానమిచ్చారు: హజ్రత్ ఆయిషా (రజి) నాకు హజ్ గురించి తెలుపుతూ దైవప్రవక్త (సల్లం) మక్కా చేరుకుని మొట్టమొదట ఉజూ చేసి కాబా ప్రదక్షిణ చేశారనీ, దాన్ని ఉమ్రాగా మార్చలేదని (అంటే దీక్ష విరమించలేదని) అన్నారు.

ఆ తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) హజ్ చేశారు. ఆయన కూడా ముందుగా కాబా ప్రదక్షిణ చేశారు. హజ్‌ని ఉమ్రాగా మార్చలేదు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) కూడా అలాగే చేశారు. ఆ తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) కూడా హజ్ చేస్తుండగా నేను చూశాను. ఆయన కూడా మొట్టమొదట కాబా ప్రదక్షిణ చేశారు గాని హజ్‌ని ఉమ్రాగా మార్చలేదు. ఆ తర్వాత హజ్రత్ ముఆవియా (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)లు కూడా అలాగే చేశారు.

నేనొకసారి మా నాన్న హజ్రత్ జుబైర్ బిన్ అవ్వామ్ (రజి)తో కలిసి హజ్ చేశాను. ఆయన కూడా అన్నిటికంటే ముందుగా చేసిన పని అదే, కాబా ప్రదక్షిణ చేశారు. అంతేగాని హజ్‌ని ఉమ్రాగా మార్చలేదు. అంతేకాదు ముహాజిర్, అన్సారుల్లో కూడా అనేకమందిని ఇలాగే హజ్ చేయడం చూశాను. వారిలో ఏ ఒక్కరూ హజ్‌ని ఉమ్రాగా మార్చలేదు. నేను అందరికంటే చివర్లో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)ని కూడా ఈ విధంగానే హజ్ చేయడం గమనించాను. ఆయన కూడా హజ్‌ని ఉమ్రాగా మార్చలేదు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మీ మధ్య ఉన్నారు కదా! ఆయన్నెందుకు అడగరు దీన్ని గురించి? గతంలో ఉన్న (పెద్ద) వాళ్ళను కూడా మీరు అడగలేదు. వారంతా మక్కాలో ప్రవేశించగానే అన్నిటికంటే ముందు కాబా ప్రదక్షిణే చేసేవారు. దీక్ష (ఇహ్రాం) విరమించేవారు కాదు. నేను మా అమ్మ (హజ్రత్ అస్మా (రజి)ను, మా పిన్నమ్మ (హజ్రత్ ఆయిషా (రజి))ను కూడా హజ్ చేస్తుండగా చూశాను. వారిద్దరు కూడా మక్కాలో ప్రవేశించిన తర్వాత మొట్టమొదట చేసిన పని కాబా ప్రదక్షిణ చేయడమే. దీక్ష (ఇహ్రాం) మటుకు విరమించేవాళ్ళు కాదు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 78వ అధ్యాయం - అత్తవ్వాఫి అలల్ వుజూ]

776. హజ్రత్ అస్మా బిన్తె అబీబకర్ (రజి) సేవకుడు హజ్రత్ అబ్దుల్లా (రహ్మాలై) కథనం:- హజ్రత్ అస్మా(రజి) హుజూన్ (కొండ) ప్రక్కగా పోతునప్పుడల్లా ఇలా చెబుతుంటే నేను విన్నాను: "దేవుడు ముహమ్మద్ (సల్లం)పై తన కరుణామృతాన్ని చిలికించుగాక! ఆయనతో పాటు మేము (హజ్ యాత్రకు బయలుదేరినపుడు) ఈ ప్రదేశంలోనే దిగేవారము. ఆ కాలంలో మేము (సన్నగా) తేలికగా ఉండేవాళ్ళము. మా దగ్గర వాహనాలు తక్కువగా ఉండేవి. ఆహార పదార్థాలు కూడా తక్కువే. నేను, నా చెల్లెలు హజ్రత్ (ఆయిషా-రజి), హజ్రత్ జుబైర్ (రజి), ఇంకా ఫలానా ఫలానా వాళ్ళు 'ఉమ్రా' చేశాము. (మొదట) మేము కాబా ప్రదక్షిణ చేసి ఇహ్రాం (దీక్ష) విరమించాము. తర్వాత సాయంత్రం వేళ హజ్ కోసం దీక్ష పూనాము."

[సహీహ్ బుఖారీ:26వ ప్రకరణం - ఉమ్రా, 11వ అధ్యాయం - మతాయహిల్లుల్ ఉమ్రా]

## 31వ అధ్యాయం - హజ్ నెలల్లో 'ఉమ్రా' చేయడం ధర్మసమ్మతమే

777. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం), ఆయన అనుచరులు (రజి) జిల్‌హజ్ నాలగవ తేదీ ఉదయం హజ్ దీక్షపూని 'లబ్బైక్' అంటూ మక్కాలో ప్రవేశించారు. ఆ తరువాత ఆయన "బలి పశువుల్ని వెంట తెచ్చుకున్నవారు తప్ప మిగిలినవారంతా హజ్‌ని 'ఉమ్రా'గా మార్చు కోవాలని" ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 3వ అధ్యాయం-కమ్ అఖామన్నబియ్యు (సల్లం) ఫిల్ హజ్జ్]

778. హజ్రత్ అబూ జుమ్రా నసర్ బిన్ ఇమ్రాన్ జబ్‌యీ (రహ్మాలై) కథనం:- నేనొకసారి 'తమత్తా' హజ్ (అంటే హజ్, ఉమ్రా ఏకకాలంలో నిర్వహించడం) చేస్తే, కొందరు నన్ను అలా చేయకూడదని వారించారు. అందువల్ల నేను వాస్తవం ఏమిటో తెలుసుకోవడానికి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)ను అడిగాను. ఆయన తమత్తా హజ్ చేయమని ఆదేశించారు. ఆ తర్వాత నేను ఒక కలగన్నాను. అందులో నాతో ఎవరో "నీ హజ్ స్వీకరించబడింది. నీ ఉమ్రా కూడా స్వీకరించబడింది" అని అన్నారు. నేనీ కల గురించి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) దగ్గర ప్రస్తావించాను. దానిపై ఆయన "ఇదే దైవప్రవక్త(సల్లం) సంప్రదాయం" అని అన్నారు. ఆ తరువాత ఆయన "నా దగ్గర ఉండిపో, నా ఆస్తిలో కొంత నీకిస్తాను" అని అన్నారు.

ఈ హదీసును ఉల్లేఖించిన హజ్రత్ షేబా (రహ్మాలై) ఆ సందర్భంలో "ఆయన మీకు ధనం ఇస్తానని ఎందుకు అన్నారు?" అని అడిగారు. దానికి హజ్రత్ అబూ జుమ్రా (రహ్మాలై) "నేను ఇలా కలలో చూడటం వల్ల " అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 34వ అధ్యాయం - అత్తమత్తువల్ఇఖ్రాని వల్ ఇఫ్రాది బిల్‌హజ్]

## 32వ అధ్యాయం - బలిపశువు మెడలో దండ వేయడం, దీక్ష పూనేటపుడు దాని మూపురం చీల్చడం

779. హజ్రత్ ఇబ్నె జరీహ్ (రహ్మాలై) కథనం:- ఎవరైనా కాబా ప్రదక్షిణ చేస్తే ఇక అతని ఇహ్రాం (దీక్ష) ముగిసినట్లే అని హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) చెప్పిన మాటను నాకు హజ్రత్ అతా (రహ్మాలై)

తెలియజేశారు. నేను 'హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) చెప్పిన ఈ మాటకు ఆధారం ఏమిటి?' అని అడిగాను. దానికి హజ్రత్ అతా (రహ్మలై) సమాధానమిస్తూ "దివ్యఖుర్ఆన్‌లో -వాటి(ని బలి ఇచ్చే) స్థలం ఆ ప్రాచీన గృహం (కాబా) దగ్గరే (హజ్:33)" అనే సూక్తే దీనికి ఆధారం. ఈ సూక్తి ఆధారంగానే దైవప్రవక్త (సల్లం) 'వీడ్కోలు హజ్' సందర్భంలో 'ఇహ్రాం (దీక్ష) విరమించండ'ని అనుచరుల్ని ఆదేశించారు. నేనప్పుడు "ఈ ఆజ్ఞను ఆయన అరఫాత్‌లో నిరీక్షించిన తరువాత ఇచ్చారు కదా?" అని అన్నాను. "హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) అభిప్రాయం ప్రకారం ఇది నిరీక్షణకు ముందు, నిరీక్షణకు తర్వాత - రెండింటికీ వర్తిస్తుంది" అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 77వ అధ్యాయం - హజ్జతుల్ విదా]

## 33వ అధ్యాయం - ఉమ్రా స్థితిలో శిరోజాలు కత్తిరించుకోవడం

780. హజ్రత్ ముఆవియా (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) తల వెంట్రుకల్ని కత్తెరతో కత్తిరించాను.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 127వ అధ్యాయం - అల్‌హల్ఖి వత్తఖ్సీరి ఇన్దల్ ఇహ్‌లాల్]

## 34వ అధ్యాయం - దైవప్రవక్త(సల్లం) వారి ఇహ్రామ్ బలిపశువులను గురించి

781. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ అలీ (రజి) యమన్ నుండి (మక్కాలో) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆయన్ని "నీవు ఇహ్రాం (దీక్ష) పూనేటపుడు ఏమని సంకల్పించుకున్నావు?" అని అడిగారు. దానికి హజ్రత్ అలీ (రజి) "దైవప్రవక్త(సల్లం) ఎలాంటి దీక్ష వహించారో నా దీక్ష కూడా అలాంటిదే ఉంటుందని సంకల్పించుకున్నాను" అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు. "నా దగ్గర బలిపశువు లేకపోయి ఉంటే నేనూ (ఇతరుల్లాగా ఉమ్రా చేసి) దీక్ష విరమించేవాణ్ణి★(కనుక నీవు కూడ నన్ను అనుసరించు)".

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 32వ అధ్యాయం - మన్ అహ్లై ఫీజిమ్నన్నబీ (సల్లం) కాహిలాలిన్నబీ]

## 35వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) ఎప్పుడు ఎన్ని ఉమ్రాలు చేశారు?

782. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) మొత్తం నాలుగుసార్లు ఉమ్రాలు చేశారు. ఒక్క ఉమ్రా తప్ప మిగిలిన ఉమ్రాలన్నీ జీఖఅద నెలలో చేశారు. ఆ ఒక్క ఉమ్రా హజ్‌తో పాటు చేశారు. ఒక ఉమ్రా హుదైబియా ఒడంబడిక జరిగిన సంవత్సరం చేశారు. రెండవ ఉమ్రా ఆ తరువాత సంవత్సరం చేశారు. మూడవ ఉమ్రా 'జిఇర్రానా' ప్రాంతంలో హునైన్ యుద్ధప్రాప్తిని యోధులకు పంచిపెట్టి వచ్చిన తరువాత చేశారు. నాల్గవ ఉమ్రా హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్)తో పాటు చేశారు.

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 3వ అధ్యాయం - కమ్‌ఏతమరన్నబీ (సల్లం)]

---

★ అంటే, బలిపశువు నా దగ్గర ఉండటం వల్ల నేను దీక్ష విరమించలేదు. నీవు కూడా నాలాగే సంకల్పించుకున్నావు గనక నీవు కూడా దీక్ష విరమించలేవు.

783. హజ్రత్ అబూ ఇస్‌హాఖ్ (రహ్మాలై) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఎన్ని యుద్ధాలు చేశారని హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి)ని ఒకరు అడిగారు. దానికి ఆయన పందొమ్మిది అని సమాధానమిచ్చారు. మీరు దైవప్రవక్త (సల్లం)తో పాటు ఎన్ని యు ధ్ధాలలో పాల్గొన్నారని మళ్ళీ అడిగారు. పదిహేడు అని హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) చెప్పారు. వాటిలో మొట్టమొదటిది ఏది అని మళ్ళీ అడిగారు. దానికి ఆయన 'ఉసైరా' యుద్ధం అన్నారు. (లేదా ఉషైర్ యుద్ధం అన్నారు)★ (హదీసు ఉల్లేఖకునికి పేరు సరిగా గుర్తు లేదు).

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజీ, 1వ అధ్యాయం - గజ్వతిల్ ఉషైరతి అవ్ ఉసైరా]

784. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) పంధొమ్మిది దండయాత్రలు జరిపారు. (మక్కా నుండి మదీనాకు) వలస వచ్చి తరువాత ఒక్క హజ్ అంటే హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్) మాత్రమే చేశారు. ఆ తర్వాత ఆయన మరెలాంటి హజ్ చేయలేదు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 77వ అధ్యాయం - హజ్జతుల్ విదా]

785. హజ్రత్ ముజాహిద్ (రహ్మాలై) ఇలా తెలిపారు:- నేను, ఉర్వాబిన్ జుబైర్ (రహ్మాలై) కలిసి మస్జిద్‌కు వెళ్ళాము. చూస్తే హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) హజ్రత్ ఆయిషా (రజి)గారి కుటీరం దగ్గర కూర్చొని ఉన్నారు. కొంతమంది మస్జిద్‌లో 'చాష్త్ నమాజ్' చేస్తున్నారు. మేము హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)ని "వారు చేస్తున్న నమాజు ఏమిటి?" అని అడిగాము. దానికాయన "అది బిద్ అత్ (ధర్మంలో లేని కొత్త విషయం)" అని అన్నారు. ఆ తరువాత మేము "దైవప్రవక్త(సల్లం) మొత్తం ఎన్ని సార్లు ఉమ్రా చేశారు?" అని అడిగాము. హజ్రత్ అబ్దుల్లా (రజి) సమాధానమిస్తూ "నాలుగు సార్లు చేశారు. వాటిలో ఒకసారి ఆయన రజబ్ నెలలో చేశారు" అని అన్నారు. మేము ఆయన మాటలను ఖండించడం బావుండదని మౌనంగా ఉండిపోయాము.

అదే సమయంలో విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) పల్లు తోముకుంటున్న శబ్దం విన్పించింది. దాన్ని బట్టి హజ్రత్ ఉర్వా (రహ్మాలై)గారు, ఆమె కుటీరంలోనే ఉన్నారని భావించి "అమ్మా! ఓ విశ్వాసుల మాతృమూర్తీ!! హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ (అబ్దుల్లాబిన్ ఉమర్) ఏమన్నారో మీరు విన్నారా?" అని అడిగాను. "ఏమన్నారేమిటి?" అని అడిగారు ఆమె... "దైవప్రవక్త(సల్లం) చేసిన నాలుగు ఉమ్రాలలో ఒకటి రజబ్ నెలలో ఉందట!" అన్నారు హజ్రత్ ఉర్వా (రహ్మాలై). హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాట విని ఇలా అన్నారు: "దేవుడు అబూ అబ్దుర్రహ్మాన్‌పై దయచూపుగాక! దైవప్రవక్త(సల్లం) నిర్వహించిన ఉమ్రాలన్నిటిలోనూ ఇబ్నె ఉమర్ (రజి) దైవప్రవక్త(సల్లం)తో పాటు ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) రజబ్ నెలలో ఏ ఒక్క ఉమ్రా చేయలేదు."

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 3వ అధ్యాయం - కమ్ ఏతమరన్నబీ (సల్లం)]

## 36వ అధ్యాయం - రమజాన్ నెలలో చేసే ఉమ్రా అత్యంత పుణ్యప్రదం

786. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒక అన్సార్ స్త్రీతో మాట్లాడుతూ "హజ్ కోసం మాతో పాటు బయలుదేరడానికి నీకు ఏ విషయం అడ్డు వచ్చింది?" అని అడిగారు.

★ ఇదొక ప్రదేశం పేరు. దైవప్రవక్త(సల్లం) మక్కా నుండి సిరియా వెళ్ళిన ఖురైష్ వర్తక బిడారాన్ని వెతుకుతూ ఈ ప్రదేశం దాకా వెళ్ళారు. ఆ తర్వాత కొన్నాళ్ళకే బదర్ యుద్ధం జరిగింది.

దానికామె ఇలా అన్నారు "మా దగ్గర నీళ్ళు మోసే ఒంటెలు రెండు ఉన్నాయి. వాటిలో ఒక దానిపై అబూపులాన్, ఆయన కొడుకు (అంటే తన భర్త, తన కొడుకు) ఎక్కి (హజ్ చేయడానికి మక్కా) వెళ్ళారు. రెండవ దాన్ని మేము నీళ్ళు మోయడానికి వాడుకుంటున్నాము." దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "సరే, నువ్వు రమజాన్ నెలలో ఉమ్రా నిర్వహించు. రమజాన్‌లో నిర్వహించే ఉమ్రాకు హజ్ చేసినంత పుణ్యం లభిస్తుంది" అని అన్నారు.[1]

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 4వ అధ్యాయం - ఉమ్రతి ఫీరమజాన్]

## 37వ అధ్యాయం - మక్కాలోకి మెరక ప్రదేశం నుండి ప్రవేశించి పల్లపు ప్రదేశం గుండా బయటికి వెళ్ళాలి

787. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మదీనా నుండి బయటికి వెళ్ళదలచినపుడు షజరా మార్గాన[2] బయటికి వెళ్తారు. తిరిగి పట్టణం లోనికి ప్రవేశించేటపుడు ముఅర్రస్ దారి గుండా వస్తారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 15వ అధ్యాయం - ఖురూజిన్నబీ (సల్లం) అలత్తరీఖిష్షజర]

788. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- మహనీయ ముహమ్మద్ (సల్లం) మక్కాలో ప్రవేశించినపుడు ఎత్తైన గుట్టల గుండా ప్రవేశించేవారు. మక్కా నుండి వెడలేటప్పుడు పల్లపు గుట్టల మీదుగా వెడలేవారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్; 40వ అధ్యాయం - మన్ అయిన యద్‌ఖులు మక్కా]

789. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మక్కాలో ప్రవేశించేటపుడు మెరక ప్రదేశం నుండి వస్తారు. మక్కా నుండి బయటికి వెళ్ళేటప్పుడు పల్లపు ప్రదేశం నుండి బయలుదేరుతారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 41వ అధ్యాయం - మన్ ఐన యుఖ్రిజు మిమ్మక్కా]

790. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మక్కా జయించబడిన సంవత్సరం మక్కా పట్టణంలోకి 'కదా' [3] వైపు నుండి ప్రవేశించారు. తిరిగి 'కదా' వైపు నుండే బయటికి వెళ్ళిపోయారు. ఈ ప్రదేశం మక్కా మెరక ప్రాంతం వైపున్నది.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 41వ అధ్యాయం - మన్ఐన యుఖ్రిజు మిమ్మక్కా]

---

(1) రమజాన్ నెలలో ఉమ్రా చేస్తే హజ్ విధి నిర్వహించినట్లు దీని అర్థం కాదు. ఉమ్రా సంప్రదాయాన్ని ప్రోత్సహించడానికి మాత్రమే దైవప్రవక్త (సల్లం) అతిశయోక్తిగా ఇలా అన్నారని తైబీ (రహ్మాలై) అభిప్రాయపడ్డారు.

(2) 'షజరా మార్గం' అంటే జుల్‌హులైఫా మస్జిద్ వైపు నుండి పోయే మార్గం అని అర్థం. 'ముఅర్రస్' దారి అంటే, జుల్‌హులైఫా మస్జిద్ నుండి పల్లపు ప్రదేశం వైపుకు వెళ్ళే దారి అని అర్థం. బాటసారులు రాత్రివేళ ప్రయాణం చేసి తెల్లవారుజామున 'ముఅర్రస్'లో విడిది చేస్తారు.

(3) 'కదా' అనేది మక్కా ఎగువ ప్రాంతంలో ఉన్న ఒక కొండ పేరు. దైవప్రవక్త(సల్లం) అటువైపు నుండే మక్కాలో ప్రవేశించేవారు. నిజానికి మక్కా దిగువ ప్రాంతం నుండి యమన్‌కు పోయేదారిలో ఉన్న కొండను 'కదా' అంటారు. కాని ఉల్లేఖనంలో మాత్రం అది మక్కా ఎగువ ప్రాంతంలో ఉన్నట్లు చెప్పబడింది. బహుశా ఇక్కడ ఉల్లేఖకులు పొరపాటు పడి ఉంటారు. (-సంకలనకర్త)

## 38వ అధ్యాయం - మక్కాలో ప్రవేశించే ముందు 'జీతువా'లో రాత్రి గడిపి . . . .

791. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రాత్రి వేళ 'జీతువా' ప్రదేశంలో గడిపి, మరునాడు ఉదయం మక్కాలో ప్రవేశించారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా ఇలాగే చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 39వ అధ్యాయం - దుఖూల మక్క నహార(వ్వలైలా]

792. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) 'జీతువా' ప్రదేశంలో దిగి రాత్రివేళ అక్కడే గడిపే వారు. (మరునాడు) ఉదయం మక్కా వెళ్ళి ఫజ్ర్ నమాజ్ చేసేవారు. ఆయన ఈ నమాజును కఠినమైన ఓ గుట్టమీద చేసేవారు. అయితే ఆ ప్రదేశంలో నిర్మించబడిన మస్జిద్‌లో కాక దానికి కాస్త దిగువ భాగాన ఉన్న ఒక పెద్దగుట్ట మీద చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 89వ అధ్యాయం - అల్‌మసాజిదిల్లతి అలాతర్ఖిల్ మదీనతివల్ మవాజల్లతీ సల్ ఫీహన్నబీ]

793. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- మహాప్రవక్త (సల్లం) కాబా వైపున గల పెద్ద కొండకు మరియు తన (సల్లం)కు మధ్యన ఉన్న కొండవైపుకు అభిముఖులయ్యారు. అంటే ఆయన (సల్లం) ప్రస్తుతం గుట్టకు ప్రక్కగా నిర్మితమై ఉన్న మస్జిద్‌ను ఎడమవైపున వదిలారు. వాస్తవానికి మహాప్రవక్త (సల్లం) నమాజ్ చేసే స్థలం నల్ల గుట్టకు దిగువన ఉంది. మీరు ఆ నల్లని గుట్టకు ఇంచుమించు పది బారులు దూరాన - ఆ కొండకు అభిముఖమై నమాజ్ చేయండి. అది మీకు - కాబా గృహానికి మధ్య భాగాన వస్తుంది.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - అస్సలాత్, 89వ అధ్యాయం - అల్ మసాజిదిల్లతీ....]

## 39వ అధ్యాయం - ఉమ్రా ప్రదక్షిణల్లోనూ, హజ్ మొదటి ప్రదక్షిణలోనూ 'రమల్' చేయడం అభిలషణీయం

794. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాబా గృహం చుట్టూ మొదటి విడత ప్రదక్షిణ చేస్తున్నప్పుడు చిన్న చిన్న అడుగులతో వడివడిగా నడుస్తూ మూడు చుట్లు తిరుగుతారు. ఆ తర్వాత నాలుగు ప్రదక్షిణలు సాధారణ వేగంతో నడచి చేస్తారు. సఫా, మర్వా (కొండ)ల మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేస్తున్నప్పుడు లోయ పల్లపు ప్రదేశంలో పరుగెత్తేవారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 63వ అధ్యాయం - మన్ తాఫ బిల్ బైతి ఇజా ఖదిమ మక్కా....]

795. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం), ఆయన అనుచరులు మక్కా వచ్చినపుడు (అక్కడి) విగ్రహారాధకులు (వారిని విమర్శిస్తూ) "పాపం వీళ్ళు ఎలా వస్తున్నారో చూడండి, యస్రిబ్ (మదీనా) జ్వరం వీళ్ళను బక్కచిక్కిపోయేలా చేసింది" అని అన్నారు. ఆ తరువాత దైవప్రవక్త(సల్లం) తన అనుచరుల్ని సంబోధిస్తూ "కాబా ప్రదక్షిణ చేస్తున్నప్పుడు మొదట మూడు చుట్లలో 'రమల్' చేయండి (అంటే గట్టిగా అడుగులేస్తూ వడివడిగా నడవండి) మరి రెండు రుకున్‌ల మధ్య సాధారణ నడకతో నడవండి" అని ఆదేశించారు.

దైవప్రవక్త(సల్లం) తన అనుచరుల్ని మొత్తం ప్రదక్షిణలలో 'రమల్' చేయమని ఆదేశించలేదు. వారికి సౌకర్యం కల్పించే ఉద్దేశ్యంతో ఇలా చేయమని ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 55వ అధ్యాయం - కైఫకాన బద్ ఇర్రమల్]

796. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ముస్లింలు బలహీనులు కాలేదు, బలవంతులుగానే ఉన్నారని విగ్రహారాధకులు చూసి గ్రహించాలన్న ఉద్దేశ్యంతోనే దైవప్రవక్త (సల్లం) కాబా ప్రదక్షిణ చేస్తున్నప్పుడు, సఫా - మర్వా (కొండ)ల మధ్య 'సయీ' చేస్తున్నప్పుడు వడిగా నడవాలని (తన అనుయాయుల్ని) ఆదేశించారు.(1)

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 80వ అధ్యాయం - మాజాఅ ఫిస్సయీ బైనస్సఫా వల్ మర్వా]

## 40వ అధ్యాయం - ప్రదక్షిణ చేస్తున్నప్పుడు రెండు యమనీ మూలలను ముద్దాడటం మంచిది

797. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఈ రెండు (యమనీ) మూలలను ముద్దాడటం చూసినప్పటి నుండి నేను వాటిని ముద్దాడటం (మొదలెట్టాను) మానలేదు. పరిస్థితి కఠినంగా ఉన్నా, సౌకర్యంగా ఉన్నా సరే మానలేదు. (2)

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 57వ అధ్యాయం - అర్రమలి ఫిల్ హజ్జివల్ ఉమ్రా]

798. హజ్రత్ అబూషాషా (రహ్మాలై) కథనం:- "కాబా గృహానికి చెందిన ఏ వస్తువునయినా ఎవరు అభిమానించకుండా ఉంటారు? హజ్రత్ ముఆవియా (రజి) అయితే కాబా మూలలన్నిటినీ ముద్దాడుతారు" అని అన్నాను నేను. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఈ మాటలు విని "ఆ రెండు (షామీ) మూలలను ముద్దాడరాదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 59వ అధ్యాయం - మల్లమ్ యస్తలిమ ఇల్లా అర్రుక్ నైనిల్ యమానీన్]

## 41వ అధ్యాయం - ప్రదక్షిణ చేస్తున్నప్పుడు హజరె అస్వద్‌ను (నల్లరాయిని) ముద్దాడటం మంచిది

799. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) ఒకసారి కాబా గోడలో అమర్చబడిన నల్లరాయి దగ్గరకు వెళ్ళి

(1) హజ్ పరిభాషలో వడివడిగా నడవడాన్ని 'రమల్' అంటారు. ఇది ఒకప్పుడు తాత్కాలికంగా ఇవ్వబడిన ఆదేశం. ఇప్పుడు రమల్ చేయనవసరం లేదు. ఇది సున్నత్ కూడా కాదు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) అభిప్రాయం కూడా ఇదే. (-నవవీ - రహ్మాలై)

(2) కాబా గృహం నాలుగు మూలలు కలిగి ఉన్న ఒక ఎత్తయిన భవనం. ఈ నాలుగు మూలల్లో రెండు యమన్ దేశం దిశగా ఉన్నాయి. ఆ రెండింటిని 'యమానీన్' అంటారు. మిగిలిన రెండు మూలలు సిరియా దేశం దిశగా ఉన్నాయి. వీటిని 'షామియీన్' అంటారు. యమనీ మూలల్లో నుండి ఒక దానిలో 'హజ్రె అస్వద్' (నల్లరాయి) ప్రతిష్ఠించబడి ఉంది. దీన్ని యాత్రికులు ముద్దాడతారు, తాకుతారు. రెండవ యమనీ మూలను కేవలం స్పర్శిస్తారు. షామీ మూలలను ముద్దాడటం గాని, స్పర్శించటం గాని చేయరు. దానిక్కారణం ఈ రెండు మూలలు హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహి) వేసిన అసలు పునాదులపై నిర్మించబడలేదు. 'హతీం' మాత్రం హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహి) నిర్మించిన అసలు కట్టడంలోని భాగమే. అందువల్ల యాత్రికులు కాబా ప్రదక్షిణ చేస్తున్నప్పుడు 'హతీమ్' కూడా ప్రదక్షిణ పరిధిలోకి వచ్చేందుకు దాని వెలుపల నుండి తవాఫ్ (ప్రదక్షిణ) చేస్తారు.

దాన్ని ముద్దాడారు. ఆ తరువాత దాన్ని సంబోధిస్తూ "నీవు ఎలాంటి లాభం గాని, నష్టం గాని కలిగించలేని ఒక రాయి మాత్రమేనని నాకు తెలుసు. దైవప్రవక్త(సల్లం) నిన్ను ముద్దాడుతుండగా నేను చూడకపోయి ఉంటే నేను కూడా నిన్ను ఎన్నటికీ ముద్దాడేవాణ్ణి కాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 50వ అధ్యాయం - మాజుకిర ఫిల్ హజ్రె అస్వద్]

## 42వ అధ్యాయం - వాహనమెక్కి ప్రదక్షిణ చేయడం, బెత్తం సూచిస్తూ నల్లరాయిని ముద్దాడటం ధర్మసమ్మతమే

800. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వీడ్కోలు హజ్ సమయంలో ఒంటె ఎక్కి కాబా ప్రదక్షిణ చేశారు; నల్లరాయిని బెత్తంతో తాకి ముద్దాడారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 85వ అధ్యాయం - ఇస్తిలామిర్రుక్ని బిల్ మహ్జన్]

801. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం)తో నేను జబ్బుపడ్డానని కాలినడకన ప్రదక్షిణ చేయలేనని చెప్పాను. అప్పుడాయన "అయితే నీవు వాహనమెక్కి అందరికంటే వెనుక ఉండి ప్రదక్షిణ చెయ్యి" అని అన్నారు. నేను అలాగే (ఒంటె ఎక్కి) ప్రదక్షిణ చేశాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) కాబా గృహానికి ఒకవైపు నిల్చొని నమాజులో "వత్తూరి వకితాబిన్ మస్తూర్" అనే సూరా పఠిస్తూ ఉన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 78వ అధ్యాయం - ఇద్ఖాలిల్ బయీరి ఫిల్ మస్జిదిలిల్ ఇలతి]

## 43వ అధ్యాయం-సఫా, మర్వా కొండల మధ్య 'సయీ' చేయనిదే హజ్ విధి నెరవేరదు

802. హజ్రత్ ఉర్వా (రహ్మలై) కథనం:- నేను చిన్న వయస్సులో ఉన్నప్పుడు ఓ రోజు దైవప్రవక్త(సల్లం) సతీమణి హజ్రత్ ఆయిషా (రజి) ముంగ[illegible] దివ్యఖుర్ఆన్‌లోని "నిస్సందేహంగా సఫా, మర్వాలు దేవుని సూచనలు, కనుక హజ్ (కాబా యాత్ర) గాని, ఉమ్రాగాని చేసేవారు ఈ రెండు కొండల మధ్య సయీ (పరుగెత్తడం) చేస్తే ఎలాంటి తప్పులేదు, (2:158) అనే సూక్తిని ప్రస్తావించి, దీన్ని బట్టి ఆ రెండు కొండల మధ్య 'సయీ' చేయకపోయినా తప్పు లేదని నేను భావిస్తున్నాను, మరి మీరేమంటారు?" అని అడిగాను. దానికి ఆయిషా (రజి) ఇలా అన్నారు. "కాదు, ఎంత మాత్రం కాదు. ఒకవేళ నీ అభిప్రాయమే సరయినదయితే ఈ సూక్తి 'ఈ రెండు కొండల మధ్య సయీ చేయకపోతే ఎలాంటి దోషం లేదు' అని ఉండేది."

అసలు విషయం ఏమిటంటే ఈ సూక్తి అన్సారుల విషయంలో అవతరించింది. మదీనా అన్సారులు అజ్ఞానకాలంలో ఖుదైద్‌కు ఎదురుగా ప్రతిష్ఠించబడిన (మనాత్ అనే) విగ్రహం పేర దీక్ష వహించి లబ్బైక్ అని నినదించేవారు; సఫా-మర్వాల మధ్య సయీ (పరుగెత్తడం) చేయడం తప్పుగా భావించేవారు. అయితే ఇస్లాం కాలం వచ్చిన తరువాత వారు ఆ విషయాన్ని గురించి దైవప్రవక్త(స)ను అడిగితే "నిస్సందేహంగా సఫా, మర్వాలు దేవుని సూచనలు....."అనే సూక్తి అవతరించింది.

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 10వ అధ్యాయం- యఫ్ అలు ఫిల్ ఉమ్రతి మాయఫ్ అలు ఫిల్ హజ్]

803. హజ్రత్ ఉర్వా (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ ఆయిషా (రజి) ముందు దివ్య ఖుర్ఆన్‌లోని "నిస్సందేహంగా సఫా, మర్వాలు దేవుని సూచనలు. కనుక హజ్ లేక ఉమ్రా చేసేవారు ఈ రెండు కొండల మధ్య సయీ చేస్తే ఎలాంటి తప్పులేదు" (2:158) అనే సూక్తిని ప్రస్తావించి దీని అర్థం ఏమిటని అడిగాను. "దీని బాహ్యార్థాన్ని బట్టి ఆ రెండు కొండల మధ్య 'సయీ' చేయకపోయినా తప్పులేదని తెలుస్తోంది" అని అన్నాను. దానికి హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అన్నారు: "బాబు! నువ్వు చాలా అసమంజసమైన మాటన్నావు. నువ్వు చెప్పినదే దీని అసలు అర్థమయి ఉంటే ఈ సూక్తి 'ఈ రెండు కొండల మధ్య సయీ చేయకపోతే ఎలాంటి తప్పులేదు' అని ఉండేది."

అసలు విషయం ఏమిటంటే ఈ సూక్తి అన్సారుల విషయంలో అవతరించింది. వీరు ఇస్లాం స్వీకరించక ముందు 'మనాత్' విగ్రహం పేరిట దీక్ష వహించి 'లబ్బైక్' అని నినదించేవారు. ముషల్లిల్ అనే చోట జనం దీన్ని పూజిస్తూ ఉండేవారు. మనాత్ పేరిట దీక్ష పూనిన వాళ్ళు సఫా-మర్వాల మధ్య 'సయీ' చేయడాన్ని తప్పుగా భావించేవారు. ఆ తరువాత వారు ముస్లిములయిపోయారు. అప్పుడు వారు ఈ విషయాన్ని దైవప్రవక్త(స) ముందు ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! మేము అజ్ఞాన కాలంలో సఫా, మర్వాల మధ్య 'సయీ' చేయడం తప్పుగా భావించేవాళ్ళము, వాటి దరిదాపులకే వెళ్ళేవాళ్ళము కాము. (మరి ఇలా చేయవచ్చా)?" అని అడిగారు. అప్పుడు దేవుడు "నిస్సందేహంగా సఫా, మర్వాలు దేవుని సూచనలు ....." అనే సూక్తి అవతరింపజేశాడు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అన్నారు: "సఫా-మర్వా కొండల మధ్య 'సయీ' చేయడం విధిగా (వాజిబ్) చేశారు దైవప్రవక్త(స). అందువల్ల వాటి మధ్య 'సయీ' చేయడం మానెయ్యడానికి ఎవరికీ అనుమతి లేదు."

(ఈ హదీసు ఉల్లేఖకుడు) హజ్రత్ జుహ్రీ (రహ్మాలై) కథనం:- తరువాత నేనీ ఉల్లేఖనాన్ని అబూబకర్ బిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) ముందు ప్రస్తావిస్తే ఆయన ఇలా వ్యాఖ్యానించారు. "నిజమే. ఇది జ్ఞానంతో కూడిన గొప్ప విషయం అనడంలో ఎలాంటి సందేహం లేదు. కాని నేనీ విషయాన్ని ఎవరి నోటా వినలేదు. పైగా హజ్రత్ ఆయిషా (రజి) చెప్పిన దానికి భిన్నంగా నేను కొందరు పండితుల ద్వారా మరొక విషయం విన్నాను. వారు మనాత్ విగ్రహం పేరిట దీక్ష పూనడంతో పాటు సఫా, మర్వా కొండల మధ్య 'సయీ' కూడా చేసేవారు. ఆ తరువాత (వారు ముస్లిములయిపోయారు) దేవుడు దివ్యఖుర్ఆన్‌లో కాబా ప్రదక్షిణ గురించి మాత్రమే ప్రస్తావించి సఫా-మర్వాల మధ్య 'సయీ' చేయడం గురించి ప్రస్తావించలేదు. అందువల్ల వారు దైవప్రవక్త(స)ను వివరణ కోరుతూ "దైవప్రవక్తా! మేము (అజ్ఞాన కాలంలో) సఫా, మర్వాల మధ్య 'సయీ' చేసేవారము. కాని దేవుడు ఖుర్ఆన్‌లో కాబా ప్రదక్షిణ గురించి మాత్రమే ప్రస్తావించి, సఫా-మర్వాల మధ్య 'సయీ' చేయడం గురించి ప్రస్తావించలేదు. ఇప్పుడు మేము సఫా-మర్వాల మధ్య 'సయీ' చేస్తే తప్పా?" అని అడిగారు. దానికి సమాధానంగా దేవుడు "నిస్సందేహంగా సఫా,మర్వాలు దేవుని సూచనలు......" అనే సూక్తిని అవతరింపజేశాడు.

హజ్రత్ అబూబకర్ బిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) ఇంకా ఇలా అన్నారు: "నేను (హజ్రత్ ఆయిషా(రజి) చెప్పిన విషయం నీ ద్వారా) విన్న తరువాత ఈ సూక్తి ఉభయవర్గాలను గురించి అవతరించినట్లు అన్పిస్తోంది. అజ్ఞాన కాలంలో సఫా-మర్వాల మధ్య 'సయీ' చేయడం తప్పుగా

భావించేవర్గం గురించి, అజ్ఞానకాలంలో సఫా - మర్వాల మధ్య 'సయీ' చేసే వర్గం గురించి కూడా. వీరు ముస్లిం అయిన తరువాత, దేవుడు ఖుర్‌ఆన్‌లో కాబా ప్రదక్షిణ మాత్రమే ప్రస్తావించి, సఫా - మర్వాల మధ్య సయీ చేయడం ప్రస్తావించకపోవడం వల్ల సఫా - మర్వాల మధ్య 'సయీ' చేయడం తప్పుగా భావించసాగారు. అప్పుడు ఖుర్‌ఆన్‌లో సఫా-మర్వాల మధ్య 'సయీ' చేయడం గురించిన విషయం కూడా అవతరించింది."

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 79వ అధ్యాయం - వజా బిస్సఫా వల్ మర్వత వజుయిల మిన్ షఆయిరిల్లాహ్]

804. హజ్రత్ ఆసిమ్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి)తో మాట్లాడుతూ మీరు (అన్సారులు) సఫా-మర్వాల మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేయడం తప్పుగా భావించేవారు. దానికి హజ్రత్ అనస్ (రజి) సమాధానమిస్తూ ఇలా అన్నారు: "ఔను. ఇది అజ్ఞాన కాలంలో ఒక ఆచారంగా ఉండేది. చివరికి దేవుడు ఈ సూక్తి అవతరింపజేశాడు- "నిస్సందేహంగా సఫా, మర్వాలు దేవుని సూచనలు కనుక కాబాలో హజ్ లేక ఉమ్రా చేసేవారు ఈ రెండు కొండల మధ్య 'సయీ' (పరుగెత్తడం) చేయడంలో ఎలాంటి తప్పులేదు." (2:158)

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 80వ అధ్యాయం- మాజా అఫిస్సయీ బైన స్సఫావల్ మర్వా]

## 45వ అధ్యాయం - 'లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్' అని బిగ్గరగా నిర్విరామంగా చెప్పాలి

805. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ సేవకుడు హజ్రత్ కురైబ్ (రహ్మాలై) కథనం ప్రకారం హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) ఇలా తెలియజేస్తున్నారు:- "నేను దైవప్రవక్త(సల్లం) ఒంటె మీద ఆయన వెనుక కూర్చొని అరఫాత్ నుండి బయలుదేరాను. ముజ్దల్ఫా ప్రాంతానికి ముందు ఎడమ వైపున కనుమ సమీపానికి చేరుకున్న తరువాత దైవప్రవక్త(సల్లం) ఒంటెను కూర్చోబెట్టి (దిగి) మూత్ర విసర్జన చేసి వచ్చారు. నేను నీళ్ళు తెచ్చి పెట్టాను. ఆయన దాంతో వుజూ చేశారు. అప్పుడు నేను "దైవప్రవక్తా! మనం ఇక్కడ నమాజ్ చేద్దామా?" అని అన్నాను. దానిక దైవప్రవక్త(సల్లం) "ఇంకాస్త ముందుకెళ్ళి నమాజు చేద్దాం" అని అన్నారు. దైవప్రవక్త(సల్లం) తిరిగి ఒంటె ఎక్కి ముజ్దల్ఫా చేరుకున్నారు. అక్కడ (దిగి) ఆయన నమాజు చేశారు. మరునాడు ఉదయం (పదో తేదీన) ఆయన వెంట ఫజల్ బిన్ అబ్బాస్ (రజి) బయలు దేరారు."

హజ్రత్ కురైబ్ (రహ్మాలై) ఇలా అంటున్నారు:- హజ్రత్ ఫజల్ బిన్ అబ్బాస్ (రజి) చెప్పిన విషయాన్ని హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) నాకిలా తెలియజేశారు; "దైవప్రవక్త (సల్లం) నిరంతరాయంగా 'లబ్బైక్' అని చెబుతూ చివరికి 'జుమ్రాయెఉఖ్బా' (కంకర్రాళ్ళు విసిరే) ప్రదేశానికి చేరుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 93వ అధ్యాయం - అన్నుజూలి బైన అరఫత వజమా]

## 46వ అధ్యాయం - అర్ఫారోజు అరఫాత్ నుండి మినా వెళ్తూ లబ్బైక్ చెప్పాలి

806. హజ్రత్ ముహమ్మద్ బిన్ అబీబకర్ సఖీఫ్ (రహ్మలై) కథనం:- నేను హజ్రత్ అనస్ (రజి) వెంట 'మినా' నుండి అరఫాత్ వెళ్తూ "మీరు దైవప్రవక్త(సల్లం) హయాంలో లబ్బైక్ ఎలా చెప్పేవారు?" అని అడిగాను ఆయన్ని. దానికి ఆయన సమాధానమిస్తూ "(ఆనాడు) ఒకడు లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్ అని నినదిస్తే దానికి ఎవరూ అభ్యంతరం చెప్పేవారు కాదు. అలాగే మరొకడు (అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ అని) తక్బీర్ చెబితే దానికీ ఎవరూ అభ్యంతరం చెప్పేవారు కాదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 13వ ప్రకరణం - ఈదైన్, 12వ అధ్యాయం - అత్తక్బీరు అయ్యామ మినా]

## 47వ అధ్యాయం - అరఫాత్ నుండి ముజ్దల్ఫాకు తిరిగి రావడం, ఆ రాత్రి మగ్రిబ్, ఇషాలు కలిపి చేయడం

807. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) అరఫాత్ నుండి ముజ్దల్ఫాకు తిరుగు ముఖం పట్టారు. అలా ఒక కనుమ దగ్గరకు చేరుకున్న తరువాత (ఒంటె) దిగి మూత్ర విసర్జన చేశారు. తర్వాత వుజూ చేశారు. అప్పుడు నేను "దైవప్రవక్తా! నమాజు చేద్దామా?" అన్నాను. "నమాజు ముందుకెళ్ళి చేద్దాం" అన్నారు ఆయన. అందుచేత మళ్ళీ (ఒంటె) ఎక్కి బయలుదేరారు. అక్కడ్నుంచి ముజ్దల్ఫా చేరుకున్నారు. ముజ్దల్ఫా చేరుకున్న తరువాత పరిపూర్ణమైన వుజూ చేశారు. ఆ తరువాత నమాజ్ గురించి పిలుపు నిస్తే ఆయన మగ్రిబ్ నమాజు చేశారు. ఆ తర్వాత ఎక్కడ ఉన్న వాళ్ళు అక్కడే తమ తమ ఒంటెలను కూర్చోబెట్టారు. ఇషా నమాజు కోసం పిలుపు నివ్వడం జరిగింది. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇషా నమాజు చేశారు. ఈ రెండు నమాజుల మధ్య మరేలాంటి (సున్నత్ వగైరా) నమాజు చేయలేదు.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం, వుజూ, 6వ అధ్యాయం - ఇస్బాగిల్ వుజూ]

808. హజ్రత్ ఉర్వా (రహ్మలై) కథనం:- నేను ఓ రోజు హజ్రత్ ఉసామా (రజి) దగ్గర కూర్చొని ఉండగా ఆయనతో ఒక వ్యక్తి మాట్లాడుతూ, "దైవప్రవక్త (సల్లం) వీడ్కోలు హజ్ సందర్భంలో అరఫాత్ నుండి ముజ్దల్ఫాకు తిరిగి వస్తున్నప్పుడు ఎంత వేగంగా నడిచారు?" అని ప్రశ్నించారు. దానికి హజ్రత్ ఉసామా (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త(సల్లం) కొంతదూరం మామూలు వేగంతో నడిచారు. ఆ తర్వాత అవకాశం కన్పించగానే నడక వేగాన్ని పెంచారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 92వ అధ్యాయం - అస్సైరి ఇజాదఫామిన్ అరఫా]

809. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ(రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వీడ్కోలు హజ్ సందర్భంలో 'ముజ్దల్ఫా'లో మగ్రిబ్, ఇషా నమాజులు కలిపి చేశారు ఒకేసారి.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 96వ అధ్యాయం-మన్ జమాబైన హుమా వలమ్ యతతవ్వా]

810. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఎక్కడికైనా ప్రయాణమయితే మగ్రిబ్ ఇషా నమాజులు కలిపి ఒకేసారి చేసేవారు.★

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తక్సీరుస్సలాత్, 13వ అధ్యాయం - అల్ జమా ఫిస్సఫరి బైనల్ మగ్రిబి వల్ ఇషా]

---

★ ఇక్కడ 'కలిపి' అంటే ఆలస్యంగా కలిపి అని అర్థం. అంటే మగ్రిబ్ వేళ అంతంలో, ఇషావేళ ప్రారంభంలో ఇలా చేస్తారని భావం. అందువల్ల చూడటానికి ఈ రెండు నమాజులు ఏకకాలంలో చేస్తున్నట్లు గోచరిస్తాయి.

## 48వ అధ్యాయం - పశుబలి ఇచ్చేరోజు 'ముజ్దల్ఫా'లో ఫజ్ర్ నమాజ్ పెందలాడ చేయటం గురించి

811. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రెండు నమాజులు తప్ప ఏ నమాజూ వేళ తప్పి చేయడం నేను చూడలేదు. ఒకటి (ముజ్దల్ఫాలో) మగ్రిబ్, ఇషా నమాజులు కలిపి ఏకకాలంలో చేశారు. రెండు; (ముజ్దల్ఫాలోనే) ఫజ్ర్ నమాజు వేళకు ముందే చేశారు.★

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 99వ అధ్యాయం - మతా యుసల్లిల్ ఫజ్ర బిజమా]

## 49వ అధ్యాయం - బలహీనుల్ని ముజ్దల్ఫా నుండి మినాకు తెల్లవారు జామునే పంపాలి

812. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేము ముజ్దల్ఫా లో దిగిన తరువాత హజ్రత్ సౌదా (రజి) జన సమూహం ఎక్కువ కాకముందే తనను 'మినా' వెళ్ళిపోవడానికి అనుమతించవలసిందిగా దైవప్రవక్త (సల్లం)ను అడిగారు. హజ్రత్ సౌదా(రజి) కాస్త భారీకాయంతో నెమ్మదిగా నడిచే మనిషి. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆమెకు (ముందే వెళ్ళిపోవటానికి) అనుమతి ఇచ్చారు. ఆమె జన సమూహం పెరగకముందే బయలుదేరి వెళ్ళారు. మేము తెల్లారిందాకా ఆగిపోయాము. తర్వాత దైవప్రవక్త(సల్లం) (జనంతోపాటు) బయలుదేరినపుడు మేము బయలుదేరాము. అప్పుడు నాకు తెలిసొచ్చింది - హజ్రత్ సౌదా (రజి)లా నేను కూడా అనుమతి తీసుకొని ఉంటే నేను (దైవప్రవక్తతో ఉండటం వల్ల) సంతోషించిన దానికంటే ఎంతో బాగుండేదని.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - అల్‌హజ్, 98వ అధ్యాయం - మన్ ఖద్దమ జాఫతహు అహ్లిహీ బిలైల్]

813. హజ్రత్ అస్మా (రజి) సేవకుడు అబ్దుల్లా (రహ్మలై) కథనం:- హజ్రత్ అస్మా (రజి) ముజ్దల్ఫాలో బస చేసినపుడు రాత్రి ఒక జాము పొద్దు వరకు నమాజు చేసి ఆ తరువాత "బాబూ! చంద్రుడు అస్తమించాడా?" అని అడిగారు నన్ను. నేను 'ఇంకా లేద'న్నాను. ఆమె తిరిగి నమాజులో లీనమయిపోయి మరో జాము పొద్దువరకు ఉండిపోయారు. ఆ తర్వాత మళ్ళీ "చంద్రుడు అస్తమించాడా?" అని అడిగారు. నేను 'అస్తమించాడ'న్నాను. అప్పుడామె "అయితే ఇక బయలుదేరుదాం పద" అన్నారు.

అలా మేము బయలుదేరి నడవసాగాము. చివరికి 'మినా' చేరుకున్నాక ఆమె జమ్రా మీద కంకర్రాళ్ళు విసిరారు. తర్వాత తను (మినాలో) బస చేసిన చోటుకు తిరిగొచ్చి ఫజ్ర్ నమాజు చేశారు. నేనప్పుడు ఆమెతో "అమ్మగారూ! మనం చాలా చీకటి ఉండగానే బయలుదేరి వచ్చాము" అని అన్నాను. దానికామె "బాబూ! దైవప్రవక్త (సల్లం) (ఇలాంటి వేళలోనే) స్త్రీలకు (బయలుదేరే) అనుమతినిచ్చారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 98వ అధ్యాయం - మన్ ఖద్దమ జాఫతహు అహ్లిహీ బిలైల్]

814. హజ్రత్ అబ్దుల్లాబిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ముజ్దల్ఫాలో కొందరిని వారిని

---

★ వేళకు ముందే (లేక నిర్ణీత సమయానికి ముందు) అంటే, ఫజ్ర్ వేళ ఇంకా లేదన్నంత చీకటి ఉండే పెందలాడ అని అర్థం.

కుటుంబసభ్యుల్లోని బలహీనుల (అంటే స్త్రీలను, పిల్లల)తో పాటు రాత్రివేళ చాలా పెందలాడే (మినా) పంపివేశారు. అలా పంపబడిన వారిలో నేనూ ఒకడ్ని.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 98వ అధ్యాయం - మన్‌ఖద్దమ జాఫతహ అహ్లిహీ బిలైల్]

815. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) (ముజ్దల్ఫా లో ఆగిన రాత్రి) తన కుటుంబంలోని బలహీనుల్ని ముందుగానే పంపివేసేవారు. వారు 'మష్ అరిల్ హరాం'లో ఆగి అక్కడ ఆ రాత్రి కోరుకున్నంత సేపు దైవధ్యానంలో నిమగ్నులయిపోయేవారు. ఆ తర్వాత ఇమామ్ 'వఖూఫ్' చేసి తిరుగు ముఖం పట్టక ముందే వారు అక్కడ్నుంచి (మినాకు) బయలుదేరేవారు. అయితే వారిలో కొందరు ఫజర్ నమాజు వేళకు మినా వచ్చి నమాజు చేస్తే మరికొందరు నమాజు ముగిసిన తరువాత 'మినా' చేరుకునేవారు. మినా చేరుకోగానే వారు జమ్రాపై కంకర్రాళ్ళు విసిరేవారు. దైవప్రవక్త(సల్లం) బలహీనుల విషయంలో ఇలా (ముజ్దల్ఫా నుండి పెందలాడే బయలుదేరడానికి) అనుమతి ఇచ్చారని హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) చెప్పేవారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 98వ అధ్యాయం - మన్ ఖద్దమ జాఫతహ అహ్లిహీబిలైల్]

## 50వ అధ్యాయం - జమ్రాయె ఉఖ్బాపై కంకర్రాళ్ళు విసిరే పద్ధతి

816. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ యజీద్ (రహ్మలై) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) లోయ దిగువ భాగాన నిల్చొని కంకర్రాళ్ళు విసురుతుంటే, "అబూ అబ్దుర్రహ్మాన్ (అబ్దుల్లా బిన్ మస్‌వూద్)! కొందరు ఎగువ భాగాన నిల్చొని కంకర్రాళ్ళు విసురుతున్నారు కదా?" అని అడిగాను నేను. అప్పుడాయన "దైవత్వంలో మరెవరూ సాటిలేని ఆ ఏకేశ్వరుని సాక్షి! (హజ్ నియమాలున్న) బఖరా సూరా ఎవరిపై అవతరించిందో ఆ మహనీయుడు ఈ చోటునే నిలబడి కంకర్రాళ్ళు విసిరారు"★ అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 135వ అధ్యాయం - రమిల్ జమారి మిన్ బత్నిల్ వాది]

817. హజ్రత్ ఆమష్ (రహ్మలై) కథనం:- నేనొకరోజు హజ్జాజ్ (బిన్‌యూసుఫ్) ఇలా చెబుతుండగా విన్నాను - "బఖరా (ఆవు) ప్రస్తావన ఉన్న సూరా, ఆలి ఇమ్రాన్ (ఇమ్రాన్ సంతతి) ప్రస్తావన ఉన్న సూరా, నిసా (స్త్రీలు) ప్రస్తావన ఉన్న సూరా మొదలగు సూరాలన్నింటి గురించి అనాలి (గాని, బఖరా సూరా, ఆలి ఇమ్రాన్ సూరా, నిసా సూరా అని అనకూడదు)".

హజ్జాజ్ అన్న ఈ మాటలను నేను ఇబ్రాహీం నఖ్‌యీ (రహ్మలై) ముందు ప్రస్తావిస్తే ఆయన ఇలా అన్నారు. "నాకు అబ్దుర్రహ్మాన్ బిన్ యజీద్ (రహ్మలై) ఈ విధంగా తెలిపారు - "నేను జమ్రాయె ఉఖ్బా మీద కంకర్రాళ్ళు విసురుతున్నప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కూడా వెంట

---

★ హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) ఇక్కడ ప్రత్యేకంగా 'బఖరా' సూరా అవతరణను గురించి ప్రస్తావించడానికి కారణం హజ్ నియమాలు ఎక్కువగా ఈ సూరాలోనే ఉండటమే. ముఖ్యంగా "రమీజమ్రా" (జమ్రాపై కంకర్రాళ్ళు విసరడం) గురించి విశేషాలున్నాయి. అందువల్ల ఆయన హజ్ నియమాలకు సంబంధించిన దైవాజ్ఞలు అనే భావంలో బఖరా సూరా అవతరణను ప్రస్తావించారు. దైవప్రవక్త (సల్లం) ఈ ప్రదేశంలోనే నిల్చొని కంకర్రాళ్ళు విసిరారు. అందువల్ల ఈ విషయంలో ప్రవక్త సంప్రదాయాన్ని పాటించడమే ముస్లింల విద్యుక్త ధర్మం.

ఉన్నారు. ఆయన జుమ్రాపై కంకర్రాళ్ళు విసరడానికి లోయ దిగువ భాగాన దిగి, చెట్టు ప్రక్కన నిలబడి జుమ్రాపై ఏడు కంకర్రాళ్ళు విసిరి కొట్టారు. ప్రతి కంకర్రాయి విసిరేటప్పుడు అల్లాహు అక్బర్.... అల్లాహు అక్బర్ అంటూ నినదించేవారు". ఇంకా ఆయన ఇలా అన్నారు:- "దైవత్వంలో ఎలాంటి సాటిలేని ఏకేశ్వరుని సాక్షి! బఖరా సూరా ఎవరిపై అవతరించిందో ఆ మహనీయుడు ఈ చోటునే నిలబడి జుమ్రాపై కంకర్రాళ్ళు విసిరారు."(1)

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 138వ అధ్యాయం - యుకబ్బిరు మాకుల్లి హసా]

## 55వ అధ్యాయం - శిరోజాలు కత్తిరించుకోవడం ధర్మసమ్మతమే కాని గొరిగించుకోవడం ఇంకా మంచిది

818. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తమ వీడ్కోలు హజ్ ఆచారంలో తలనీలాలు (పూర్తిగా) తీయించారు.

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 127వ అధ్యాయం - అల్‌హల్ఖి వత్తఖ్సీరి ఇన్దల్ ఇహ్‌లాల్]

819. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దేవుడ్ని వేడుకుంటూ "దేవా! (హజ్ సందర్భంలో) తల గొరిగించుకునేవారిని కరుణించు" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! వెంట్రుకలు కత్తిరించుకునే వారి కోసం కూడా దేవుడ్ని ప్రార్థించండి" అని అడిగారు. అయితే దైవప్రవక్త(సల్లం) తిరిగి ఆ వాక్యాన్నే ఉచ్చరిస్తూ "దేవా! తల గొరిగించుకునే వారిని కరుణించు" అని అన్నారు. అనుచరులు మళ్ళీ "దైవప్రవక్తా! వెంట్రుకలు కత్తిరించుకునే వారి కోసం కూడా ప్రార్థన చేయండి" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దేవా! శిరోజాలు కత్తిరించుకునే వారిని కూడా కరుణించు" అని ప్రార్థించారు."(2)

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 127వ అధ్యాయం - అల్‌హల్ఖి వత్తఖ్సీరి ఇన్దల్ ఇహ్‌లాల్]

820. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి (హజ్ సందర్భంలో) "దేవా! తల గొరిగించుకునే వారి పాపాలను క్షమించు" అని ప్రార్థించారు. అప్పుడు అనుచరులు "శిరోజాలు కత్తిరించుకునే వారి కోసం కూడా (ప్రార్థించండి)" అని అన్నారు. అయితే దైవప్రవక్త (సల్లం) అదే వాక్యాన్ని రెండోసారి కూడా ఉద్ఘాటించారు. అనుచరులు మళ్ళీ "శిరోజాలు కత్తిరించుకునే వారి కోసం కూడా (ప్రార్థించండి)" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) మూడుసార్లు తల గొరిగించుకునే వారిని

---

(1) హజ్జాజ్ చెప్పిన క్రమంలో సూరాలను ప్రస్తావించడం తప్పని ఇక్కడ ఉల్లేఖకుడు నిరూపించదలచినట్లు తెలుస్తోంది. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) 'బఖరా సూరా' అని మాత్రమే అన్నారు గాని, బఖరా (ఆవు) ప్రస్తావన ఉన్న సూరా అని అనలేదు. ఈ సందర్భంలో ఆయన జుమ్రాపై కంకర్రాళ్ళు విసిరే నియమాన్ని తెలుపుతూ దైవప్రవక్త(సల్లం) ఈ చోటునే నిలబడి కంకర్రాళ్ళు విసిరారని అన్నారు.

(2) దైవప్రవక్త (సల్లం) ఈ వేడుకోలును కొన్ని ఉల్లేఖనాల ప్రకారం వీడ్కోలు హజ్ యాత్ర సందర్భంగా చేశారు; మరికొన్ని ఉల్లేఖనాల ప్రకారం హుదైబియా ఒప్పందం జరిగిన సమయంలో చేశారు. ఆయన హుదైబియాలోనే హజ్ దీక్ష విరమించారు. ఈ రెండు సందర్భాల్లోనూ ఇలా ప్రార్థించి ఉండవచ్చని కూడా ఊహించడానికి అవకాశం ఉంది. ఈ ఉల్లేఖనాల ద్వారా తల గొరిగించుకోవడం మంచిదని తెలుస్తోంది.

మన్నించమని దైవాన్ని ప్రార్థించారు. (అనుచరులు ప్రతిసారీ శిరోజాలు కత్తిరించుకునే వారి కోసం కూడా ప్రార్థించమని అడిగారు) చివరికి దైవప్రవక్త (సల్లం) "దేవా! శిరోజాలు కత్తిరించుకునే వారి పాపాలను కూడా క్షమించు" అని ప్రార్థించారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - 127వ అధ్యాయం - అల్‌హల్ఖి వత్తఖ్సీరి ఇన్దల్ ఇహ్‌లాల్]

## 56వ అధ్యాయం - ఖుర్బానీ (బలిచ్చే) రోజు మొదట 'రమీ' చేయాలి, ఆ తర్వాత ఖుర్బానీ ఇచ్చి తల గొరిగించుకోవాలి

821. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (హజ్ విధి నెరవేర్చిన తరువాత) తల గొరికించుకున్నప్పుడు ఆయన తలనీలాలు తీసుకున్న మొట్టమొదటి వ్యక్తి హజ్రత్ అబూ తల్హా(రజి)యే.

[సహీహ్ బుఖారీ : 4వ ప్రకరణం - వుజూ , 33వ అధ్యాయం - అల్ మాఇల్లజీ యుగ్సలు బిహీ]

## 57వ అధ్యాయం - ఖుర్బానీ ఇవ్వక ముందు తల గొరిగించుకోవడం, రమీ చేయడానికి ముందు ఖుర్బానీ ఇవ్వడం ధర్మసమ్మతమే

822. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) వీడ్కోలు హజ్ సందర్భంలో ప్రజలను కలుసుకునే ఉద్దేశ్యంతో 'మినా'లో (కొద్దిసేపు) ఆగారు. ప్రజలు వచ్చి హజ్ ఆచారాలను గురించి అడగసాగారు. ఒక వ్యక్తి వచ్చి "నేను మర్చిపోయి ఖుర్బానీ ఇవ్వడానికి ముందే తల గొరిగించుకున్నాను" అని అన్నాడు. దానికి దైవప్రవక్త(సల్లం) "ఫరవాలేదు, ఇప్పుడిచ్చుకో ఖుర్బానీ" అని అన్నారు. మరొకడు వచ్చి "నేను మరచిపోయి రమీ (రాళ్ళు విసరడం) చేయడానికి ముందే ఖుర్బానీ ఇచ్చాను" అని అన్నాడు. దానికీ దైవప్రవక్త (సల్లం) "ఫరవాలేదు, ఇప్పుడు చెయ్యి రమీ" అని అన్నారు. ఇలా చాలా మంది (నిర్ణీత సమయంలో చేయవలసిన పనిని పొరపాటున) ముందు చేశామనో, తరువాత చేశామనో చెప్పి పరిష్కారం అడిగారు. దైవప్రవక్త(సల్లం) వారందరికీ "ఫరవాలేదు, ఇప్పుడు చేసుకో" అనే సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - అల్ ఇల్మ్, 23వ అధ్యాయం - అల్ ఫతాయా వహువ వాఖిఫున్ అలా దాబ్బతి వగైరిహా]

823. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ఖుర్బానీ ఇవ్వడం, తల గొరిగించుకోవడం, కంకర్రాళ్ళు విసరడం (మరచిపోయి) ముందుగానో, తరువాతనో చేయడం గురించి జనం అడిగినపుడు దైవప్రవక్త(సల్లం) వారికి 'ఫరవాలేదని' సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 130వ అధ్యాయం - ఇజారమీ బాదమా అమ్సా అవ్ హలఖ్]

## 58వ అధ్యాయం - ఖుర్బానీ రోజు సందర్భనా ప్రదక్షిణ చేయడం అభిలషణీయం

824. హజ్రత్ అబ్దుల్ అజీజ్ బిన్ రఫీ (రహ్మలై) కథనం:- నేనొక రోజు హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి)తో మాట్లాడుతూ "మీరు దైవప్రవక్త(సల్లం) చేస్తున్నప్పుడు చూసిన పనులను గురించి మీకేమయినా

గుర్తుంటే నాకు తెలియజేయండి. ఉదాహరణకు దైవప్రవక్త(సల్లం) జిల్‌హజ్ ఎనిమిదో తేదీన జుహర్, అసర్ నమాజులు ఎక్కడ చేశారు?'' అని అడిగాను. హజ్రత్ అనస్ (రజి) దానికి 'మినాలో' అని సమాధానమిచ్చారు. తర్వాత నేను, ''మినా నుండి బయలుదేరిన రోజు ఆయన (సల్లం) అసర్ నమాజు ఎక్కడ చేశారు?'' అని అడిగాను. దానికి ఆయన 'ముహస్సబ్‌లో' అని చెప్పి ''మీ నాయకులు చేసినట్లు మీరు చేయండి'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 83వ అధ్యాయం - ఐన యుసల్లి అజ్జుహ్‌ర యౌమిత్తర్వియా]

## 59వ అధ్యాయం - బయలుదేరే రోజు ముహస్సబ్‌లో దిగడం, నమాజు చేయడం అభిలషణీయం.

825. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఈ (ముహస్సబ్) ప్రదేశం ఒక విడిది స్థలం మాత్రమే. ఈ ప్రదేశం నుండి బయలుదేరడం సులభమని భావించి దైవప్రవక్త(సల్లం) ఇక్కడ దిగారు. ఈ ప్రదేశం అంటే 'ముహస్సబ్' అని ఆయన భావం.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 147వ అధ్యాయం - అల్ ముహస్సబ్]

826. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ముహస్సబ్‌లో బస చేయడం హజ్ నియమాల క్రిందికి రాదు. ఇది దైవప్రవక్త (సల్లం) బస చేసిన చోటు మాత్రమే.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం -హజ్, 147వ అధ్యాయం - అల్ ముహస్సబ్]

827. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) జిల్‌హజ్ 10వ తేదీన 'మినా'లో ఉన్నప్పుడు (అనుచరులతో మాట్లాడుతూ) ''మనం రేపు* బనీ కనాన కొండ దిగువ (ముహస్సబ్)లో దిగుదాం'' అని అన్నారు. ఈ ప్రాంతంలో బనీ కనాన తెగవాళ్ళు అవిశ్వాస స్థితిలో ప్రమాణం చేసి పరస్పరం ఒక అంగీకారానికి వచ్చారు. బనీ హాషిం, బనీ అబ్దుల్ ముత్తలిబ్ లేక బనీ ముత్తలిబ్ తెగ వాళ్ళు దైవప్రవక్త(సల్లం)ను గనక తమకు అప్పగించకపోతే వాళ్ళతో తాము వివాహ సంబంధాలు, వ్యాపార లావాదేవీలు పెట్టుకోకూడదని నిర్ణయించుకొన్నారు వారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 45వ అధ్యాయం - నుజూలిన్నబీ (సల్లం) మక్కా]

## 60వ అధ్యాయం - తష్రీఖ్ దినాలలో (జిల్ హజ్ 9 నుండి 13 వరకు) రాత్రివేళ తప్పనిసరిగా మినాలో గడపాలి

828. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ (రజి) దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి, ''హాజీలకు జమ్ జమ్ నీళ్ళు సరఫరా చేసేందుకు వీలుగా తనను మినా

---

★ ఇక్కడ 'రేపు' అంటే జిల్‌హజ్ 13వ తేదీన అని అర్థం. దైవప్రవక్త (సల్లం) పదవ తేదీన ఈ మాట అన్నారు. దీన్ని బట్టి రేపు అంటే 11వ తేదీ కావాలి. కాని 'ముహస్సబ్ దినం' 13వ తేదీన పాటిస్తారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఇక్కడ 'రేపు' అన్నారంటే కచ్చితంగా రేపే అని అర్థం తీసుకోనవసరం లేదు. రేపు అంటే ఎల్లుండి కూడా కావచ్చు, కొన్నాళ్ళ తర్వాత కూడా కావచ్చు.

రాత్రుల్ని (అంటే జిల్ హజ్ 11, 12, 13 తేదీల రాత్రుల్ని) మక్కాలో గడపడానికి అనుమతించవలసిందిగా కోరారు. దైవప్రవక్త (స) ఆయనకు అనుమతి ఇచ్చారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 75వ అధ్యాయం - సిఖాయతిల్ హజ్జ్]

## 61వ అధ్యాయం - ఖుర్బానీ మాంసం, చర్మం, ముడతలు అన్నీ దానం చేయాలి

829. హజ్రత్ అలీ (రజి) కథనం:- ఖుర్బానీ వేసే సమయంలో తన ఒంటెలను కనిపెట్టుకొని ఉండి, వాటి మాంసం, చర్మం తదితర భాగాలన్నీ (పేదలకు) పంచెయ్యాలని దైవప్రవక్త(స) నన్ను ఆదేశించారు. అదీగాక మాంసం కోసిన వ్యక్తికి అందులో ఏ వస్తువునూ కూలీ కింద ఇవ్వవద్దని కూడా ఆయన నన్ను ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 121వ అధ్యాయం - యుత సద్ధఖు బిజులీదిల్ హదీ]

## 63వ అధ్యాయం - ఒంటెను కట్టివేసి నిలబెట్టి జిబహ్ చేయాలి

830. హజ్రత్ జియాద్ బిన్ జుబైర్ (రహ్మాలై) కథనం:- ఒక వ్యక్తి ఒంటెను కూర్చోబెట్టి జిబహ్ చేయబోతుంటే, హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) అతని దగ్గరకు వెళ్ళి "దాన్ని లేపి నిలబెట్టి (తాడుతో) కట్టివేసి జిబహ్ చెయ్యి, ఇదే హజ్రత్ ముహమ్మద్ (స) సంప్రదాయం" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 118వ అధ్యాయం - నహ్రిల్ ఇబిలి ముఖయ్యదా]

## 64వ అధ్యాయం - హజ్‌కు పోలేని వ్యక్తి బలి పశువు మెడలో పేనిన దండ వేసి కాబాకు పంపవచ్చు

831. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) గారి ఒంటెల కోసం నేను దండలు పేని వాటి మెడలలో కట్టాను. వాటి మూపురాలను చీల్చి గుర్తులు వేశాను. ఆ విధంగా వాటిని బలిపశువులుగా చేసి ఖుర్బానీ కోసం కాబా వైపుకు పంపివేశాను. అయితే దైవప్రవక్త(స) ఈ ఖుర్బానీ కారణంగా ఇంతకు ముందు ఆయనపై ధర్మసమ్మతమైన ఏ విషయమూ నిషేధించబడలేదు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 106వ అధ్యాయం - మన్ అష్అర వ ఖలద బిజిల్ హులైఫా]

832. జియాద్ బిన్ అబీ సుఫ్యాన్ ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి)కు ఒక ఉత్తరం వ్రాశారు. అందులో ఆయన హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మాటలను ప్రస్తావిస్తూ "ఖుర్బానీ పశువును కాబా దగ్గరకు పంపే వ్యక్తికి ఖుర్బానీ ఆచారం పూర్తయ్యే వరకూ హాజీకి నిషిద్ధమయ్యే విషయాలన్నీ నిషిద్ధమయిపోతాయని ఇబ్నె అబ్బాస్ (రజి) అన్నారు. ఇది నిజమేనా?" అని అడిగారు. దానికి హజ్రత్ ఆయిషా (రజి) ఇలా సమాధానమిచ్చారు :

"ఇబ్నె అబ్బాస్ (రజి) చెప్పిన మాట సరైంది కాదు. నేను స్వయంగా నా చేతులతో ప్రవక్త (స) గారి ఖుర్బానీ ఒంటెల కోసం దండలు పేని నా చేతులతోనే వాటిని ఆ ఒంటెల మెడలలో వేశాను. తరువాత వాటిని నేనే మా నాన్నగారి వెంట (కాబా గృహానికి) పంపివేశాను. కాని బలిపశువుల్ని జిబహ్

చేసే వరకు దైవం ధర్మసమ్మతం చేసిన విషయాల్లో ఏ ఒక్కదాన్ని దైవప్రవక్త(స) తన కోసం నిషేధించుకోలేదు.''

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 109వ అధ్యాయం - మన్ ఖలదల్ ఖలాఇద బియదిహీ]

## 65వ అధ్యాయం - అవసరమయితే ఖుర్బానీ పశువులపై ఎక్కి ప్రయాణం చేయవచ్చు

833. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి ఒంటెను తోలుకొని వెళ్తుంటే దైవప్రవక్త(స) చూసి అతడ్ని ఒంటె మీద ఎక్కమని అన్నారు. అతను (తిరిగి చూసి) ''ఇది ఖుర్బానీ ఒంటె'' అన్నాడు. దైవప్రవక్త(స) మళ్ళీ ''దాని మీద ఎక్కు'' అన్నారు. అతను తిరిగి ''ఇది ఖుర్బానీ ఒంటె'' అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) ''నీ పాడుగాను! దాని మీద ఎక్కెయ్యి'' అన్నారు. దైవప్రవక్త(స) ఈ మాట రెండు లేక మూడుసార్లు అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం- హజ్, 103వ అధ్యాయం - రకూ బిల్ బద్న్]

834. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఒక వ్యక్తి ఒంటెను తోలుకొని వెళ్తుంటే చూసి ''దాని మీద ఎక్కు'' అన్నారు. దానికా వ్యక్తి ''ఇది ఖుర్బానీ ఒంటె'' అన్నాడు. దైవప్రవక్త(స) తిరిగి ''దాని మీద ఎక్కు'' అన్నారు. అతను మళ్ళీ ''ఇది ఖుర్బానీ ఒంటె'' అన్నాడు. దైవప్రవక్త(స) మళ్ళీ ''దాని మీద ఎక్కెయ్యి'' అన్నారు. ఇలా ఈ సంభాషణ మూడుసార్లు జరిగింది.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 103వ అధ్యాయం - రకూ బిల్ బద్న్]

## 67వ అధ్యాయం - వీడ్కోలు ప్రదక్షిణ చేయడం తప్పనిసరి. అయితే రుతుమతికి మినహాయింపు ఉంది

835. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ప్రజలు హజ్‌లో తమ చివరి ఆచారంగా కాబా గృహాన్ని సందర్శించాలని (అంటే కాబా ప్రదక్షిణ చేయాలని )ఆజ్ఞ ఉంది. అయితే రుతుస్రావం వస్తున్న స్త్రీలకు ఈ ఆజ్ఞ నుండి మినహాయింపు ఉంది.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 144వ అధ్యాయం - తవాఫిల్ విదా]

836. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను దైవప్రవక్త(స)తో ''దైవప్రవక్తా! సఫియా బిన్తె హుయ్యి (రజి) బహిష్టు అయి ఉంది'' అని తెలిపాను. దానికి దైవప్రవక్త(స) ''మనం ఆగిపోవడానికి ఈమె కారకురాలవుతుందేమో!'' అని అన్నారు. ఆ తరువాత ''ఆమె మీ అందరితో పాటు ఏదైనా ఒకసారి కాబా ప్రదక్షిణ చేయలేదా?'' అని అడిగారు. ''ఎందుకు చెయ్యలేదు, చేసింది (సందర్శనా ప్రదక్షిణ)'' అన్నా నేను. అప్పుడు దైవప్రవక్త(స) ''అయితే ఇక పరవాలేదు. మనం బయలు దేరవచ్చు'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 27వ అధ్యాయం - అల్ మర్ అతి తహైజు బాదల్ ఇఫాజా]

837. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- మేము (మినా నుండి) బయలుదేరే రోజు సఫియా (రజి)

బహిష్టు అయ్యింది. దాంతో ఆమె "మీరందరూ ఆగిపోవడానికి నేను కారకురాలవుతానేమోనని భావిస్తున్నాను" అని అన్నది. దైవప్రవక్త(స) ఈ మాట విని "సిగతరగ! జిల్ హజ్ పదో తేదీన ఆమె ప్రదక్షిణ చేయలేదా?" అని అడిగారు. 'చేసింది' అన్నాము మేము. "అయితే అందరితో పాటు ఆమెను కూడా బయలుదేరమని చెప్పండి" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 151వ అధ్యాయం - అల్ ఇద్‌లాజి మినల్ ముహస్సబ్]

## 68వ అధ్యాయం - కాబా గృహంలో ప్రవేశించడం, అక్కడ నమాజు చేయడం, దాని వివిధ మూలల్లో దుఆ చేయడం అభిలషణీయం

838. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఉసామా బిన్ జైద్ (రజి), బిలాల్ (రజి), ఉస్మాన్ బిన్ తల్హా (రజి) ప్రభృతులు కాబాలో ప్రవేశించారు. హజ్రత్ ఉస్మాన్ బిన్ తల్హా (రజి) లోపలి నుంచి తలుపులు మూసేశారు. కొద్దిసేపు ఉండిన తరువాత బయటికి వచ్చారు. అప్పుడు నేను హజ్రత్ బిలాల్ (రజి)ని "కాబా లోపల దైవప్రవక్త(స) ఏం చేశారు?" అని అడిగాను. దానికాయన ఇలా సమాధానమిచ్చారు: "దైవప్రవక్త(స) లోపలికెళ్ళిన తరువాత ఒక స్తంభం తనకు ఎడమవైపున, మరొక స్తంభం తనకు కుడివైపున, మూడు స్తంభాలు తనకు వెనుకవైపు ఉండేలా చూసుకొని నమాజు చేశారు." ఆ కాలంలో కాబా (గర్భగుడి) ఆరు స్తంభాల మీద నెలకొని ఉండేది. ( ఈ లెక్కన ఒక స్తంభం దైవప్రవక్త(స)కు ముందు వైపున ఉండి ఉంటుంది.)

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 96వ అధ్యాయం - అస్సలాతి బైనస్సవారీ ఫీ జమాఅత్]

839. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) కాబా (గర్భగుడి)లో ప్రవేశించినపుడు, ఆయన దాని అన్ని మూలల్లోను దుఆ చేశారు, నమాజు నెరవేర్చారు. ఆ తరువాత బయటికి వచ్చి కాబా (గర్భగుడి)కి ఎదురుగా నిలబడి రెండు రకాతులు నమాజ్ చేశారు. అప్పుడు ఆయన (తన అనుచరులతో) "ఇదే ఖిబ్లా (ఆరాధనా కేంద్రం)" అన్నారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 30వ అధ్యాయం - ఖౌలిల్లాహి తాలా వత్తఖిజూ మిమ్మఖామి ఇబ్రాహీమ ముసల్లా]

840. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఉమ్రా చేసినపుడు (మొదట) కాబా ప్రదక్షిణ చేశారు. ఆ తరువాత 'మఖామె ఇబ్రాహీం' వెనుక నిలబడి రెండు రకాతులు నమాజు చేశారు. ఆ సమయంలో ఆయన వెనుక ఒక తెరగా కొందరు వ్యక్తులు నిల్చున్నారు. హజ్రత్ అబ్దుల్లా (రజి)ని ఒకతను "దైవప్రవక్త (సల్లం) కాబా లోపల ప్రవేశించారా?" అని అడిగాడు. దానికాయన 'లేద'ని సమాధానమిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 53వ అధ్యాయం - మన్‌లమ్ యద్ ఖులిల్ కాబా]

## 69వ అధ్యాయం - కాబా గృహాన్ని పడగొట్టి తిరిగి నిర్మించడం

841. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) నాతో ఇలా అన్నారు "మీ జాతి వాళ్ళు ఇప్పుడిప్పుడే అవిశ్వాస దురవస్థ నుండి బయటపడి కొత్తగా ఇస్లాం ధర్మంలో ప్రవేశించి ఉండకపోతే

నేను కాబా గృహాన్ని పడగొట్టి ఇబ్రాహీం (అలైహి) గారి పునాదులపై పునర్నిర్మించే వాడ్ని. ఖురైషీయులు దాని కట్టడాన్ని తగ్గించివేశారు. నేను దాని ప్రస్తుత ద్వారానికి ఎదురుగా వెనుక వైపు మరొక ద్వారాన్ని పెట్టి ఉండేవాడ్ని.''

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 42వ అధ్యాయం - ఫజ్లి మక్క వ బనియానుహా]

842. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) నాతో ఇలా అన్నారు; "చూశావా నువ్వు, నీ జాతి వాళ్ళు కాబాను ఎలా పునర్నిర్మించారో? ఇబ్రాహీం (అలైహి) వేసిన పునాదుల్ని వదిలేసి (లోపలికి కుదించి) కట్టడాన్ని చిన్నదిగా చేసేశారు." నేనీ మాట విని "అయితే దైవప్రవక్తా! మీరు (తర్వాత) దీన్ని ఇబ్రాహీం (అలైహి) పునాదుల ప్రకారం తిరిగి నిర్మించరా?" అని అడిగాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "మీ జాతి వాళ్ళు అవిశ్వాస దురవస్థ నుండి ఇప్పుడిప్పుడే బయటపడి ఇస్లాంలో ప్రవేశించి ఉండకపోతే నేను దీన్నిలా తప్పకుండా పునర్నిర్మించేవాడ్ని" అని అన్నారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఈ మాట విని "హజ్రత్ ఆయిషా (రజి) ఈ సంగతి దైవప్రవక్త(సల్లం) నోట తప్పకుండా విని ఉంటారు. అందువల్లనే ఆయన నల్లరాయికి రెండు వైపులున్న మూలలను ముద్దాడటం మానేశారు. కాబా గర్భగుడిని ఇబ్రాహీం (అలైహి) వేసిన పునాదులపై నుండి లేపి కట్టలేదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 42వ అధ్యాయం - ఫజ్లి మక్క వ బున్యానుహా]

## 70వ అధ్యాయం - కాబా గోడలు, తలుపులను గురించి

843. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)ను "పాతగోడ (హతీం) కాబా లోని భాగమేనా?" అని అడిగాను. దానికాయన ఔనన్నారు. "మరి వీళ్ళు దాన్ని కాబా (కట్టడం)లో ఎందుకు కలిపివేయలేదు?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(సల్లం) "నీ జాతి వాళ్ల దగ్గర అప్పుడు డబ్బు తక్కువగా ఉండింది" అని చెప్పారు. నేను మళ్ళీ "సరే కాబా తలుపులు అంత ఎత్తు ఎందుకు ఉంచారు?" అని అడిగాను.

అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు; "నీ జాతి వాళ్ళు తమకు ఇష్టమయిన వాళ్ళను లోపలికి రానిచ్చి, ఇష్టం లేనివాళ్ళను బయటే ఉంచడానికి (తలుపులు ఇలా ఎత్తుగా ఉండేలా ఏర్పాటు చేశారు). నీ జాతివాళ్ళు ఇప్పుడిప్పుడే అవిశ్వాస దురవస్థ నుండి బయటపడ్డారు. వాళ్ళు సహించరన్న భయం నాకు లేకపోతే నేను పాతగోడను కాబా గర్భగుడిలో కలిపేసి, కాబా తలుపులు నేలకు సమానంగా క్రిందికి, ఉండేలా చేసేవాడ్ని."

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 42వ అధ్యాయం - ఫజ్లి మక్క వ బున్యానుహా]

## 71వ అధ్యాయం - హజ్ చేయలేని వారి తరపున మరొకరు హజ్ చేయవచ్చు

844. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- (వీడ్కోలు హజ్ సమయంలో) ఫజల్ బిన్ అబ్బాస్ (రజి) దైవప్రవక్త(సల్లం) వెనుక ఒంటెపై కూర్చొన్నారు. అంతలో ఖస్అమ్ తెగకు చెందిన ఒక స్త్రీ వచ్చింది. ఫజల్ ఆమె వైపుకు చూడసాగారు. ఆ స్త్రీ కూడా అతని వైపు చూడసాగింది. దైవప్రవక్త(సల్లం)

ఫజల్ ముఖాన్ని మాటిమాటికీ వేరొకవైపుకు తిప్పసాగారు. తర్వాత ఆ స్త్రీ దైవప్రవక్త(సల్లం)ను ఉద్దేశించి "దైవప్రవక్తా! మా నాన్నగారు చాలా వృద్ధులయిపోయారు. వాహనం మీద సరిగా కూర్చొనే స్థితిలో కూడా లేరు. అలాంటి స్థితిలో దేవుడు హజ్ యాత్రను తన దాసులపై విధిగా చేశాడు. అందుచేత మా నాన్నగారి తరఫున నేను హజ్ చేయవచ్చా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త(సల్లం) చేయవచ్చని చెప్పారు. ఈ సంఘటన వీడ్కోలు హజ్ సమయంలో జరిగింది.

[సహీహ్ బుఖారీ: 25వ ప్రకరణం - హజ్, 1వ అధ్యాయం - వజూబిల్ హజ్జి వ ఫజ్లిహీ]

845. హజ్రత్ ఫజల్ బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వీడ్కోలు హజ్ చేసిన యేడు ఖస్అమ్ తెగకు చెందిన ఒక స్త్రీ ఆయన సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! దేవుడు మానవులకు హజ్ యాత్రను విధిగా చేశాడు. కాని మా నాన్న వాహనం మీద సరిగా కూర్చోవడానికి క్కూడా శక్తిలేనంతగా వృద్ధులయిపోయారు. ఈ స్థితిలో హజ్ విధించబడింది. అందువల్ల నేను మా నాన్నగారి తరఫున హజ్ చేస్తే ఆ విధి నెరవేరుతుందా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త(సల్లం) నెరవేరుతుందని చెప్పారు.

[సహీహ్‌బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 23వ అధ్యాయం - అల్‌హజ్జి అమ్మి లాయస్తతీవుస్సు బూత్..]

## 73వ అధ్యాయం - జీవితంలో ఒకసారి హజ్ చేయడం విధి

846. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "నేను విషయాన్ని ఎంతవరకు తెలియజేస్తానో దాంతో మీరు తృప్తి చెందండి, వివరాలకు పోయి అనవసరమైన ప్రశ్నలు వేయకండి. మీకు పూర్వం ఉండిన సమాజాలు (జాతులు) తమ ప్రవక్తలను రకరకాల ప్రశ్నలు అడిగి వారితో విభేదించడం వల్లనే నాశనమయ్యాయి. అందువల్ల నేను మిమ్మల్ని ఏ విషయాన్నుంచయినా వారిస్తే మీరు దాన్ని మానుకోండి. అలాగే నేనేదయినా చేయమని మిమ్మల్ని ఆదేశిస్తే మీరు మీ శక్తి మేరకు దాన్ని శిరసావహించండి. ★

[సహీహ్ బుఖారీ : 96వ ప్రకరణం - అల్‌ఏతెసామ్, 2వ అధ్యాయం - అల్ ఇఖ్తిదాబి సునని్రసూల్]

## 74వ అధ్యాయం - స్త్రీలు ఎక్కడికి ప్రయాణమయినా మహ్రం పురుషుల వెంట పోవాలి

847. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు:- "స్త్రీ కనీసం మూడు రోజుల పాటు సాగే ప్రయాణంలో మహ్రం పురుషులు (తండ్రి, సోదరుడు, కొడుకు, మనవడు, తాత, భర్త వంటి సన్నిహితులు) వెంట లేకుండా ప్రయాణం చేయకూడదు."

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తుఖ్సీరుస్సలాత్, 4వ అధ్యాయం - ఫీకమ్ యఖ్సురుస్సలాత్]

★ హదీసు మూలం 'సహీహ్ బుఖారీ' నుండి, విషయసూచిక 'సహీహ్ ముస్లిం' నుం[illegible]తీసుకోవడం వల్ల ఈ హదీసు దానిపై ఉన్న శీర్షికకు అనుగుణంగా లేదు. సహీహ్ ముస్లింలో ఈ హదీసులోని విషయంతో పాటు పూర్తి ఉల్లేఖనం ఇలా ఉంది:- దైవప్రవక్త(సల్లం) ఉపన్యాసమిస్తూ "ప్రజలారా! మీకు హజ్ యాత్ర విధి (ఫర్జ్)గా చేయబడింది. అందువల్ల మీరు హజ్‌యాత్ర జరపండి" అని అన్నారు. ఒక వ్యక్తి ఈ మాట విని "దైవప్రవక్తా! హజ్ ప్రతి యేడూ చేయడం విధియా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త(సల్లం) సమాధానం ఇవ్వకుండా మౌనంగా ఉండిపోయారు. ఆ వ్యక్తి ఈ ప్రశ్న మూడుసార్లు అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నేను ఔనంటే మీకు ప్రతి యేడూ హజ్ విధి అవుతుంది. కాని మీరు దాన్ని పాటించలేకపోవచ్చు" అని అన్నారు. ఆ తర్వాత బుఖారీలో పేర్కొన్న పై విషయం ప్రస్తావించారు.

848. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(సల్లం) దగ్గర నాలుగు విషయాలు విన్నాను. అవి నాకు బాగా నచ్చాయి... ఒకటి: స్త్రీ భర్తగాని, మహ్రం పురుషుడుగాని వెంట లేకుండా రెండు రోజుల ప్రయాణం చేయకూడదు... రెండు: మస్జిదుల్ హరాం(కాబా), నా మస్జిద్ (మస్జిదె నబవి), మస్జిదుల్ అఖ్సా-ఈ మూడు మస్జిదులు తప్ప మరే చోటుకూ సందర్శించే సంకల్పంతో వెళ్ళకూడదు."

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 26వ అధ్యాయం - హజ్జిన్నిసా.]

849. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "దేవునిపై, ప్రళయదినంపై విశ్వాసమున్న ఏ స్త్రీకీ తన వెంట మహ్రం (వివాహ నిషేధిత) పురుషుడు లేకుండా ఒక పగలు, ఒకరాత్రి పట్టే ప్రయాణం చేయడం ధర్మసమ్మతం కాదు."

[సహీహ్ బుఖారీ : 18వ ప్రకరణం - తఖ్సీరుస్సలాత్, 4వ అధ్యాయం - ఫీకమ్ యఖ్సురుస్సలాత్]

850. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుండగా విన్నాను, "ఏ పురుషుడూ 'నామహ్రం' (వివాహ నిషేధితం కాని) స్త్రీతో పాటు ఒంటరిగా కూర్చోకూడదు. అలాగే ఏ స్త్రీ కూడా మహ్రం (వివాహ నిషేధిత) పురుషుడు తోడు లేకుండా ఒంటరిగా ప్రయాణం చేయకూడదు."

ఒక వ్యక్తి ఈ మాటలు విని లేచి "దైవప్రవక్తా! నేను ఫలానా యుద్ధంలో పాల్గొనడానికి నా పేరు వ్రాయించాను. నా భార్య హజ్ యాత్రకు వెళ్తోంది మరి?" అని అన్నాడు. దానిపై దైవప్రవక్త (సల్లం) "నీవు కూడా వెళ్ళి నీ భార్యతో కలసి హజ్ నిర్వహించు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 140వ అధ్యాయం - మన్ అక్తతబ్ ఫీజైషిన్ ఫఖరజత్ ఇమ్రాత హాజత]

## 76వ అధ్యాయం - హజ్ యాత్ర నుండి లేదా మరే ప్రాంతం నుండయినా తిరుగు ప్రయాణమయినపుడు చేసే దుఆ (ప్రార్థన)

851. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఏదేని యుద్ధం నుండి లేదా హజ్ లేక ఉమ్రా యాత్ర నుండి తిరుగు ప్రయాణమయినపుడు ప్రతి గుట్ట, మిట్ట దాటుతూ "అల్లాహు అక్బర్" అని మూడుసార్లు అంటారు. ఆ తర్వాత ఈ విధంగా దైవాన్ని ప్రార్థిస్తారు:

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లాషరీక లహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్, ఆయిబూన తాయిబూన ఆబిదూన లిరబ్బినా హామిదూన సదఖల్లహు వాదహూ వనసర అబ్దహూ వహజమల్ అహ్‌జాబ వహ్‌దహూ".

(అర్థం:- అల్లా తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు మరెవరూ సాటిలేరు. సమస్త సామ్రాజ్యం, సార్వభౌమత్వాలు ఆయనవే. సకల విధాల స్తోత్రాలు, ప్రశంసలు ఆయనకే శోభిస్తాయి. ఆయన అణువణువుపై శక్తి, అధికారం కలిగి ఉన్నాడు. మేము అన్ని విధాల చెడుల్ని, దైవేతర శక్తుల్ని వదిలేసి ఆయన వైపుకే తరలి వస్తున్నాము. ఆయన్ని మాత్రమే ఆరాధిస్తున్నాము. అనుక్షణం ఆయన్నే స్తుతిస్తున్నాము. దేవుడు తన వాగ్దానాన్ని నెరవేర్చాడు. తన దాసునికి సహాయం

చేశాడు. (శత్రు) సేనలన్నిటినీ ఆయనే ఓడించాడు.)

[సహీహ్ బుఖారీ : 80వ ప్రకరణం - అద్దావాత్, 52వ అధ్యాయం - అద్దుఆవు ఇజా అరాద స్సఫర్ ఔరజయి]

## 77వ అధ్యాయం - హజ్, ఉమ్రా యాత్రల నుండి తిరుగు ప్రయాణమయినపుడు చివరి రోజు రాత్రి జుల్‌హులైఫాలో దిగి విశ్రాంతి తీసుకోవడం

852. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) జుల్ హులైఫా ప్రాంతంలోని కంకర నేలపై తమ ఒంటెను కూర్చోబెట్టారు. అక్కడ (దిగి) నమాజు చేశారు.

హదీసు ఉల్లేఖకుని కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా ఇలాగే చేసేవారు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 14వ అధ్యాయం - హద్దసనా అబ్దుల్లా బిన్ యూసుఫ్]

853. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) జుల్‌హులైఫా లోయ మధ్య "ముఅర్రస్"★ అనే విడిది స్థలంలో బస చేశారు. ఆ రోజు ఆయనకు కలలో తాను విడిది చేసిన ప్రదేశాన్ని చూపించడం జరిగింది. ఆ కలలో (ఎవరో మాట్లాడుతూ) "ఇప్పుడు నీవు శుభప్రదమయిన కంకరనేలపై బస చేసి వున్నావు" అని అన్నారు.

(హదీసు ఉల్లేఖకుడు మూసా బిన్ ఉఖ్బా ఇలా తెలియజేస్తున్నారు:) హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఏ విధంగా దైవప్రవక్త(సల్లం) దిగిన ప్రదేశాన్ని అన్వేషించి తన ఒంటెను కూర్చోబెట్టేవారో, హజ్రత్ సాలమ్ (రహ్మలై) కూడా మాతో పాటు ఆ ప్రదేశాన్ని అన్వేషించి తన ఒంటెను కూర్చోబెట్టారు. ఈ ప్రదేశం బతన్ లోయలో నిర్మించబడిన మస్జిద్‌కు దిగువ భాగంలో ఉంది. బతన్ లోయ బాటసారులు బస చేసే ప్రదేశానికి, రహదారికి మధ్య ఉంది.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 16వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) అల్ అతీఖు వాది ముబారక్]

## 78వ అధ్యాయం - బహుదైవారాధకులు కాబా యాత్ర చేయకూడదు, నగ్నంగా కాబా ప్రదక్షిణ చేయకూడదు

854. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్)కు పూర్వం జరిగిన హజ్‌లో దైవప్రవక్త(సల్లం) హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి)ని హజ్ నాయకునిగా నియమించారు. ఆ హజ్ సందర్భంలో బలి దినాన (జిల్ హజ్ పదో తేదీన), "తస్మాత్ జాగ్రత్త! వచ్చే యేడాది నుండి బహుదైవారాధకులెవరూ హజ్ నిర్వహించకూడదని, నగ్నంగా ఎవరూ కాబా ప్రదక్షిణ చేయకూడదని" ప్రకటించేందుకు హజ్రత్ అబూబకర్ (రజి) కొందరిని పంపారు. అలా పంపబడిన వారిలో నేను ఉన్నాను.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 67వ అధ్యాయం - లా యతూఫు బిల్ బైతి ఉర్యానువ్వలా యహజ్జు ముష్రిక్]

---

★ బాటసారులు రాత్రంతా ప్రయాణం చేసి తెల్లవారుజామున విడిది చేసి విశ్రాంతి తీసుకునే ప్రదేశాన్ని 'ముఅర్రస్' అంటారు. ముఅర్రస్ అంటే శాబ్దిక భావం కూడా అదే. అంటే దైవప్రవక్త(సల్లం) రాత్రి తెల్లవారుజామున (ఫజ్ర్ వేళకు ముందు) ఈ ప్రదేశంలోనే విడిది చేసేవారు.

## 79వ అధ్యాయం - హజ్, ఉమ్రాయొమెఅర్ఫాల ఘనత

855. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా ఒక ఉమ్రా తరువాత మరొక ఉమ్రా చేస్తే, ఆ రెండు ఉమ్రాల మధ్య కాలంలో అతని వల్ల జరిగిన పాపాలకు రెండవ ఉమ్రా 'పరిహారం' (కప్ఫారా) అవుతుంది. మబ్రూర్.★ (ఆమోద ముద్రపడిన) హజ్‌కు ప్రతిఫలం స్వర్గం తప్ప మరేమీ లేదు."

[సహీహ్ బుఖారీ : 26వ ప్రకరణం - ఉమ్రా, 1వ అధ్యాయం - వజూబుల్ ఉమ్రతి వ ఫజ్లుహా]

856. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక (సల్లం) ఇలా అన్నారు:- "ఎవరు ఈ ఆలయ సందర్శనార్థం ఇక్కడకు వచ్చి, ఎలాంటి అశ్లీల చేష్టలకు, పోకిరి పలుకులకు, ఇతర పాప కార్యాలకు పాల్పడకుండా హజ్ విధి నిర్వహించి తిరిగి వెళ్ళిపోతాడో అతను ఈ రోజే తన తల్లి గర్భం నుంచి పుట్టిన వాడిలా పరమ పవిత్రుడయిపోతాడు".

[సహీహ్ బుఖారీ: 27వ ప్రకరణం - ముహ్‌సిర్, 9వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా-ఫలారఫస్]

## 80వ అధ్యాయం - హాజీలు మక్కా వాసుల ఇండ్లలో విడిది చేయడం గురించి

857. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం:- నేను (హజ్ సందర్భంగా) దైవప్రవక్త (సల్లం)ను "మక్కాలో మీరు ఎక్కడ విడిది చేస్తారు? మీ ఇంట్లోనే విడిది చేస్తారా?" అని అడిగాను. దానికి ఆయన మా కోసం (అబూ తాలిబ్ కొడుకు) అఖీల్ (రజి) ఏదైనా ఇల్లు లేదా వాడ వదలిపెట్టాడా (వెళ్ళి అక్కడ విడిది చేయడానికి)?" అని అన్నారు.

అబూ తాలిబ్ కొడుకులు అఖీల్, తాలిబ్‌లు అప్పటికి ఇంకా అవిశ్వాసులుగానే ఉండి మక్కాలోనే నివసిస్తున్నారు. అందువల్ల తండ్రి ఆస్తి వాళ్ళిద్దరికి మాత్రమే దక్కింది. మిగిలిన ఇద్దరు కొడుకులు హజ్రత్ జాఫర్ (రజి), హజ్రత్ అలీ (రజి)లు ముస్లిములయిపోయి (ఆ తరువాత మదీనాకు వలసపోయి) నందున వారు తండ్రి ఆస్తి నుండి ఏమీ తీసుకోలేదు.

[సహీహ్ బుఖారీ : 25వ ప్రకరణం - హజ్, 44వ అధ్యాయం - తౌరీసి దూరి మక్క వబైయిహా వషరాయిహా]

## 81వ అధ్యాయం - ముహాజిర్‌లు (కాందిశీకులు) హజ్, ఉమ్రాల తరువాత మక్కాలో మూడు రోజులుండవచ్చు

858. హజ్రత్ ఇలా బిన్ హజ్రమి (రజి) ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:-

"మినా నుండి తిరిగొచ్చిన తరువాత చేసే ప్రదక్షిణ అనంతరం ముహాజిర్‌లు (కాందిశీకులు) మక్కాలో మూడు రోజులు ఉండవచ్చు."

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 47వ అధ్యాయం - ఇఖామతుల్ ముహాజిర్....]

---

★ 'మబ్రూర్ హజ్' అంటే (దేవునిచే) స్వీకరించబడిన హజ్ అని శాబ్దిక అర్థం. అంటే ఎలాంటి పాపాలు, పొరపాట్లు జరగకుండా నిర్దేశిత నియమాలు కచ్చితంగా పాటించబడే శ్రేష్ఠమైన హజ్ అని భావం. ప్రదర్శనా బుద్ధి, ప్రచారవాంఛ, పేరు ప్రతిష్టల కాంక్ష మొదలైన చెడులకు తావీయని హజ్‌ని కూడా 'మబ్రూర్ హజ్' అనవచ్చు.

## 82వ అధ్యాయం - మక్కా నగర గౌరవం దృష్ట్యా వేటాడటం, వృక్షజాతిని నరకడం నిషిద్ధం

859. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) మక్కా జయించబడిన రోజు అనుచరుల్ని ఉద్దేశించి ఇలా ప్రసంగించారు. "ఇక మీదట (మక్కా నుండి) హిజ్రత్ చేయటం (అంటే వలసపోవడం) తప్పనిసరి కాదు. అయితే జిహాద్,★ సంకల్పం మటుకు మిగిలి ఉంటాయి. కనుక జిహాద్ కోసం పిలుపు వస్తే మీరు తప్పకుండా బయలుదేరండి. ఈ (మక్కా) పట్టణం గౌరవ ప్రదమయినది. దేవుడు భూమ్యాకాశాలను సృష్టించిన రోజు నుండే దీన్ని గౌవరప్రదమయిన క్షేత్రంగా నిర్ణయించాడు. అందువల్ల ఈ పట్టణం దేవుని ఆజ్ఞతో ప్రళయం దాకా గౌరవ ప్రదమైన క్షేత్రంగానే పరిగణించబడుతుంది.

ఇక్కడ నాకు పూర్వం కూడా యుద్ధం చేయడం ఎవరికీ ధర్మసమ్మతంగా లేదు. నాక్కూడా ఇక్కడ దినంలో కొన్ని క్షణాలు మాత్రమే యుద్ధం చేసే అనుమతి లభించింది. ఇప్పుడీ పట్టణం మళ్ళీ పూర్వం లాగే దైవాజ్ఞతో గౌరవప్రదమైన పుణ్యక్షేత్రంగా మారిపోయింది. అందువల్ల ఇక్కడ ఓ చెట్టు ముల్లు సయితం విరిచేయకూడదు. జంతువుల్ని వేటాడడం, తరమడం చేయకూడదు. నేలమీద పడిపోయిన వస్తువును ఎవరూ తీసుకోకూడదు. కాకపోతే దాన్ని దాని యజమానికి అప్పగించే ఉద్దేశ్యంతో తీసుకోవచ్చు. ఇక్కడ గడ్డీ, గరికా కూడా పీకి వేయకూడదు".

హజ్రత్ అబ్బాస్ (రజి) ఆ సందర్భంలో జోక్యం చేసుకుంటూ "దైవప్రవక్తా! (మక్కా పరిసర ప్రాంతాల్లో దొరికే) గరిక, కమ్మరులకు స్వర్ణకారులకు, ఇండ్లలో ఉపయోగపడుతుంది కదా! మరి దీనికి మినహాయింపు ఉందా?" అని అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "ఆ.... దానికి మినహాయింపు ఉంది" అన్నారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 10వ అధ్యాయం - లాయహిల్లుల్ ఖితాలు బిమక్కా]

860. హజ్రత్ అబూషురీహ్ (రజి) కథనం:- అమ్ర్ బిన్ సయీద్ (హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ -రజికు వ్యతిరేకంగా) మక్కాపై దాడి చేయడానికి సైన్యాన్ని పంపబోతున్నప్పుడు హజ్రత్ అబూషురై (రజి) అతనితో ఇలా అన్నారు "నాయకా! మక్కా జయించబడిన మరునాడు దైవప్రవక్త (సల్లం) నిలబడి ప్రవచించిన హదీస్‌ని మీకు విన్పించడానికి నాకు అనుమతి ఇవ్వండి. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ప్రవచిస్తుండగా నేను కళ్ళారా ఆయన్ని చూశాను. ఆయన ప్రవచనాన్ని చెవులారా విన్నాను. నా మనస్సు దాన్ని భద్రపరిచింది.

దైవప్రవక్త (సల్లం) మొదట దేవుని స్తోత్రం చేశారు. ఆ తరువాత ఇలా ప్రవచించారు - "దేవుడు

---

★ దారుల్ హరబ్ నుండి దారుల్ ఇస్లాం వైపుకు హిజ్రత్ చేయటమనేది ప్రళయం దాకా ఉంటుందన్న విషయంలో ధర్మవేత్తల మధ్య ఏకీభావం ఉంది. అందువల్ల ఇక్కడ 'హిజ్రత్ లేదు' అంటే మక్కా నుండి హిజ్రత్ సమాప్తం అయిందని మాత్రమే అర్థం. అయితే దైవమార్గంలో జిహాద్, ఇతర సత్కార్యాలు చేయడం వల్ల హిజ్రత్‌కు లభించే పుణ్యమే లభిస్తుందని ఈ హదీసులో స్ఫురిస్తోంది. "ఈ పట్టణం గౌరవప్రదమైనది. దేవుడు భూమ్యాకాశాలను సృష్టించిన రోజు నుండీ దీన్ని గౌరవప్రదమైన క్షేత్రంగా చేశాడు" అని అంటే అనాది నుండే ఇది గౌరవపవిత్రతల క్షేత్రంగా ఉన్నప్పటికీ ఆ విషయం హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కాలం నుండే ఆచరణలోనికి వచ్చింది. మక్కాలో యుద్ధం చేయడం నిషిద్ధం. అయితే అక్కడి పాలకుడు షరీఅత్ ఆజ్ఞలను పాటించకుండా అన్యాయపరుడయినపుడు అతనితో తప్పకుండా యుద్ధం చేయవచ్చు.

మక్కా పట్టణాన్ని గౌరవప్రదమయిన పుణ్యక్షేత్రంగా నిర్ణయించాడు. దానికి గౌరవప్రదమయిన స్థానం మానవులు ఇవ్వలేదు. కనుక దేవుడ్ని, పరలోక తీర్పుదినాన్ని విశ్వసించిన వారెవరికీ మక్కా నేలపై రక్తం చిందించడం, చెట్లు నరకడం ధర్మసమ్మతం కాదు. ఒకవేళ ఎవరైనా అక్కడ దైవప్రవక్త(సల్లం) యుద్ధం చేశారు కదా అని కుంటిసాకు చెబుతూ, అవసరమయినపుడు యుద్ధం చేయడానికి అనుమతి ఉందని అంటే అలాంటి వారికి దేవుడు దాన్ని ఒక విశేష వ్యవహారంగా పరిగణించి అక్కడ యుద్ధం చేయడానికి నాకు అనుమతి ఇచ్చాడని చెప్పండి. అంతేగాని మీకు అనుమతి ఇవ్వలేదు. నాకయినా ఒక రోజులో కొన్ని క్షణాలు మాత్రమే దేవుడు అనుమతినిచ్చాడు. ఆ తర్వాత మక్కాకు తిరిగి దాని గౌరవప్రదమైన స్థానం ప్రసాదించి, పూర్వస్థితిని పునరుద్ధరించాడు. నిన్నటిలాగే ఈ రోజు కూడా ఇది గౌరవప్రదమైన పుణ్యక్షేత్రమే". దైవప్రవక్త (సల్లం) ఈ ప్రసంగం చేసిన తర్వాత "ఇప్పుడిక్కడ గుమికూడిన వారు ఈ విషయాలను ఇక్కడ లేని వారికి అందజేయాలి" అని అన్నారు.

(ఈ హదీసు విన్పిస్తున్నప్పుడు ఒక వ్యక్తి) అయితే దీనికి అమ్ర్ బిన్ సయీద్ ఏం సమాధానమిచ్చారు? అని ప్రశ్నించాడు. దానికి అబూషురై (రజి) ఇలా అన్నారు; "అమ్ర్ నాతో ఈ విధంగా అన్నారు - 'అబూషురై! మీ కంటే నాకు బాగా తెలుసు. (మక్కా) పుణ్యక్షేత్రం దుర్మార్గులకు, దోపిడీ దొంగలకు, హంతకులకు ఆశ్రయం ఇవ్వదు' అని అన్నారు."

[సహీహ్ బుఖారీ : 3వ ప్రకరణం - ఇల్మ్, 37వ అధ్యాయం - లియు బల్లిగిల్ షాహిదుల్ గాయిబ్]

861. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దేవుడు తన ప్రవక్త (సల్లం)కు మక్కాపై విజయం ప్రసాదించిన తర్వాత, దైవప్రవక్త(సల్లం) ప్రజల ముందు నిలబడి మొదట దైవస్తోత్రం చేశారు. ఆ తరువాత ఇలా ప్రసంగించారు.

"దేవుడు ఏనుగుల వాళ్ళను మక్కాలో ప్రవేశించకుండా అడ్డుకున్నాడు. తన ప్రవక్తకు, విశ్వాసులకు దాన్ని అధీనం చేశాడు. నాకు పూర్వం ఎవరికీ మక్కాలో రక్తం చిందించడం ధర్మసమ్మతం చేయబడలేదు. ఇప్పుడు నాకయినా ఒక రోజులో కొన్ని క్షణాలు మాత్రమే ధర్మసమ్మతం చేయబడింది. ఇక ముందు ఎవరికీ ఇక్కడ రక్తం చిందించడం ధర్మసమ్మతం కాజాలదు. వేట కోసం జంతువుల్ని తరమడం గాని, చివరికి ఒక చెట్టు ముల్లును సయితం విరిచేయడంగాని ఎవరికీ ధర్మసమ్మతం కాదు. అదీగాక ఈ పట్టణంలో నేలమీద పడిపోయిన వస్తువుని కూడా ఎవరూ ఎత్తి తీసుకోవడానికి వీలులేదు. కాకపోతే ఆ వస్తువును దాని యజమానికి అప్పగించే ఉద్దేశ్యంతో అయితే అలా చేయవచ్చు. ఎవరి బంధువయినా హత్య చేయబడితే అతనికి హంతకుడి నుండి రక్తపరిహారం వసూలు చేయడానికి లేదా ప్రతీకారంగా హంతకుడ్ని హతమార్చించడానికి హక్కు ఉంది."

ఈ సందర్భంలో హజ్రత్ అబ్బుల్లా బిన్ అబ్బాస్ (రజి) మాట్లాడుతూ "దైవప్రవక్తా! (మక్కా పరిసర ప్రాంతంలో దొరికే) గరికను కోయడానికి మాకు అనుమతి ఇవ్వండి. దాన్ని మేము సమాధులలో ఉపయోగిస్తాము; మా ఇండ్లలో కూడా ఉపయోగపడ్తుంది" అని అన్నారు. దానికి దైవప్రవక్త(స) "సరే, దానికి అనుమతి ఉంది" అని అన్నారు. ఆ తరువాత యమన్ నివాసి అయిన హజ్రత్ అబూషాహ్ (రజి) లేచి "దైవప్రవక్తా! ఈ విషయాలు నాకు రాసివ్వండి" అని విన్నవించుకున్నారు. దైవప్రవక్త (స) ఒక అనుచరుడ్ని ఉద్దేశించి "అబూషాహ్‌కు రాసివ్వు" అని ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ : 45వ ప్రకరణం - అల్లుఖ్తా, 7వ అధ్యాయం - కైఫ తఅర్రఫు లుఖ్తతు అహ్లి మక్కా]

## 84వ అధ్యాయం - మక్కాలో హజ్ దీక్ష పూనకుండా ప్రవేశించవచ్చు

862. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- మక్కా జయించబడిన తరువాత దైవప్రవక్త(స) మక్కాలో ప్రవేశించారు. అప్పుడు ఆయన శిరస్త్రాణం ధరించి ఉన్నారు. శిరస్త్రాణం తీసివేసే సమయంలో ఒక వ్యక్తి వచ్చి ఇబ్నె ఖతల్* కాబా తెర పట్టుకొని నిలబడ్డాడు అని చెప్పాడు. దైవప్రవక్త(స) అతడ్ని వధించమని ఆజ్ఞాపించారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 18వ అధ్యాయం - దుఖూలిల్ హరమి వమక్కా బిగైరి ఇహ్రాం]

## 85వ అధ్యాయం - మదీనా ఔన్నత్యం, దానికి శుభాలు కలగాలని దైవప్రవక్త (స) వేడుకోవడం

863. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా అన్నారు:-

"హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) మక్కాను నిషిద్ధ (పుణ్య) క్షేత్రంగా నిర్ణయించి, దాని (శుభశ్రేయాల) కోసం దైవాన్ని ప్రార్థించారు. ఏ విధంగా హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) మక్కాను నిషిద్ధ క్షేత్రంగా నిర్ణయించి దాని (శుభశ్రేయాల) కోసం దైవాన్ని ప్రార్థించారో, అదే విధంగా నేను మదీనాను నిషిద్ధ క్షేత్రంగా నిర్ణయించి, దాని త్రాసులో, కొలపాత్రలో శుభం ప్రసాదించమని దైవాన్ని ప్రార్థించాను."

[ సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - అల్‌బుయూ, 53వ అధ్యాయం - బర్కతిసాయిన్నబీ (స) వ ముద్‌హిమ్]

864. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓ రోజు హజ్రత్ అబూ తల్హా (రజి)తో "నీ కుమారుల్లో నాకు సేవ చేయగలిగే అబ్బాయి ఎవరైనా ఉంటే చూడు"అని అన్నారు. అప్పుడు హజ్రత్ అబూ తల్హా (రజి) నన్ను తన వాహనం మీద వెనుక కూర్చోబెట్టుకొని (దైవప్రవక్త(స) సన్నిధికి) తీసికెళ్ళారు. ఆ రోజు నుండి నేను దైవప్రవక్త (స) సేవలో నిమగ్నుడనయిపోయాను.

దైవప్రవక్త (స) వాహనం మీద నుండి క్రిందికి దిగేటప్పుడు తరచుగా ఇలా ప్రార్థించేవారు - "దేవా! నేను దుఃఖం, విచారం, శక్తి సామర్థ్యాలు కోల్పోవడం, పని దొంగతనం, పిసినారితనం, పిరికితనం, రుణబాధ, ప్రజల ఒత్తిడి నుండి నీ శరణు కోరుతున్నాను."

ఆ రోజు నుండి (ప్రయాణావస్థలో) నేను దైవప్రవక్త(స)కు సేవ చేస్తూ ఉన్నాను. చివరికి మేము ఖైబర్ నుండి తిరిగొచ్చాము. దైవప్రవక్త(స) (ఖైబర్ యుద్ధంలో పట్టుబడిన హజ్రత్) సఫియా (రజి)ను తీసుకొని వచ్చారు. ఆయన ఆమెను తన కోసం ప్రత్యేకించుకున్నారు. (దారిలో) ఆయన తన వాహనం వెనుక ఒక దుప్పటి పరుస్తుంటే చూశాను. ఆ తరువాత ఆయన (హజ్రత్) సఫియా (రజి)ను తన వెనుక (వాహనం మీద) కూర్చోబెట్టుకున్నారు.

---

★ ఈ దుష్టుడు దైవప్రవక్త(సల్లం)ను కించపరిచే గేయాలను వ్రాసి తన దాసీల చేత పాడించేవాడు (ఇలా అతను ఇస్లాం పట్ల, దైవప్రవక్త(సల్లం) పట్ల ఉన్న తన అక్కసును వెళ్ళబుచ్చుకునేవాడు.)

ఆ విధంగా మేము సహ్బా ప్రాంతానికి చేరుకున్నాము. అక్కడ దైవప్రవక్త(స) 'హైస్'★(అనే ఓ ప్రత్యేక వంటకం ) తయారు చేయించి ఒక చర్మ వస్త్రం మీద పెట్టించారు. ఆ తరువాత నన్ను జనాన్ని పిలుచుకు రమ్మని చెప్పారు. నేను వెళ్ళి జనాన్ని పిలుచుకు వచ్చాను. వారంతా ఈ ఆహారాన్ని తిన్నారు. ఇది దైవప్రవక్త(స) హజ్రత్ సఫియా (రజి)ను వివాహమాడిన సందర్భంగా ఏర్పాటు చేసిన వలీమా (విందు) భోజనం.

ఆ తరువాత అక్కడ్నుంచి మళ్ళీ బయలుదేరాము. కాస్సేపటికి దైవప్రవక్త (సల్లం) దూరాన ఉహద్ పర్వతాన్ని చూసి "ఈ పర్వతం నన్ను అభిమానిస్తోంది; నేను దీన్ని అభిమానిస్తున్నాను" అని అన్నారు. చివరికి మదీనా పట్టణం సమీపానికి చేరుకున్నాము. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రార్థించారు "దేవా! హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) మక్కాను గౌరవప్రదమైన పుణ్యక్షేత్రంగా నిర్ణయించినట్లే నేను మదీనా కొండలు రెండింటికీ మధ్య ఉన్న ప్రాంతాన్ని గౌరవప్రదమైన పుణ్యక్షేత్రంగా నిర్ణయిస్తున్నాను. దేవా! మదీనా వాసుల త్రాసులో, కొలపాత్రలో సమృద్ధిని ప్రసాదించు."

[సహీహ్ బుఖారీ : 70వ ప్రకరణం - అల్ అత్ఆమ - 28వ అధ్యాయం - అల్‌హైస్]

865. హజ్రత్ ఆసిమ్ (రహ్మాలై) కథనం:- నేనొకరోజు హజ్రత్ అనస్ (రజి)ను 'దైవప్రవక్త(సల్లం) మదీనాకు సరిహద్దులు ఏమైనా నిర్ణయించారా?" అని అడిగాను. దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు. "నిర్ణయించారు- ఫలానా ప్రదేశం నుండి ఫలానా ప్రదేశం వరకు గల ప్రాంతంలో చెట్లు కూడా నరకకూడదని, ఇక్కడ ఎవరైనా బిద్అత్ (ధర్మంలో లేని కొత్త విషయం) సృష్టిస్తే అతనిపై దేవుని, దైవప్రవక్తల, మానవుల అభిశాపం పడుతుందని ఆయన ఒక ఉత్తర్వు జారీ చేశారు."

తనకు మూసా బిన్ అనస్ (రహ్మాలై) అందజేసిన సమాచారం ప్రకారం హజ్రత్ అనస్ (రజి) "బిద్అత్ సృష్టించిన వాడికి లేదా ఏదైనా నేరానికి పాల్పడిన వాడికి ఆశ్రయమిచ్చే వ్యక్తి" అని అన్నారని ఆసిమ్ (రజి) తెలిపారు.

[సహీహ్ బుఖారీ : 96వ ప్రకరణం - ఏతెసామ్, 6వ అధ్యాయం - ఇస్మిమన్ ఆవా ముహ్‌దిసా]

866. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) "దేవా! వారి కొలమానాల్లో శుభాన్ని కలిగించు, వారి త్రాసుల్లో కొలపాత్రలలో కూడా శుభాన్ని ప్రసాదించు" అని ప్రార్థించారు. ఈ విధంగా దైవప్రవక్త (సల్లం) మదీనా వాసుల శ్రేయస్సు కోసం ప్రార్థన చేశారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - అల్‌బుయూ, 53వ అధ్యాయం - బరకతిస్సాయిస్ బీ (సల్లం) వ ముద్‌హిమ్]

867. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "దేవా! మక్కా (ప్రజల)కు నీవు ప్రసాదించిన శుభానికి రెట్టింపు శుభాన్ని మదీనా (ప్రజల)కు ప్రసాదించు".

[సహీహ్ బుఖారీ: 29వ ప్రకరణం - ఫజాయెలె మదీనా, 10వ అధ్యాయం - అల్‌మదీనతి తన్ఫిల్ ఖుబస్]

868. హజ్రత్ యజీద్ తైమియ్య (రహ్మాలై) కథనం:- హజ్రత్ అలీ (రజి) కాల్చిన ఇటుకలతో కట్టిన వేదిక (మెంబర్)పై నిలబడి ప్రసంగిస్తున్నారు. అప్పుడు ఆయన దగ్గర ఒక ఖడ్గం ఉంది. దానికి ఓ చిరు

★ ఖర్జూరాలు, జున్ను, నెయ్యి కలిపి దంచి అంబలిలా తయారు చేసే ఒక విధమైన వంటకం. ఒక్కోసారి ఇందులో గోధుమ పిండి కూడా కలుపుతారు.

పుస్తకం వ్రేలాడదీయబడింది. హజ్రత్ అలీ (రజి) ప్రసంగిస్తూ; "దైవసాక్షిగా చెబుతున్నాను. మన దగ్గర చదవడానికి దైవగ్రంథం (ఖుర్ఆన్) లేదా ఈ చిరుపుస్తకం తప్ప మరేమీ లేదు" అని అన్నారు. ఆ తర్వాత ఆ చిరుపుస్తకాన్ని తెరిచారు. అందులో ఒంటెల వయస్సు ప్రస్తావన ఉంది. (అంటే రక్త పరిహారం, జకాత్‌ల క్రింద ఇవ్వవలసిన ఒంటెల సంఖ్య వాటి వయస్సులు అందులో పేర్కొనబడ్డాయి.) ఇంకా అందులో ఈ విధంగా వ్రాయబడి వుంది:

"మదీనా సరిహద్దు అయిన ఐర్ కొండ నుండి ఇక్కడి (సౌర్ కొండ) దాకా గల నేల నిషిద్ధ ప్రదేశంగా నిర్ణయించబడింది; అందువల్ల ఇక్కడ (మదీనాలో) ఎవరైనా ఇస్లాంలో కొత్త పోకడలు సృష్టిస్తే అతడ్ని దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు, పైగా అతను పాటించే ఫర్జ్★ ఆరాధనగాని, నఫిల్ ఆరాధనగాని స్వీకరించబడదు. మాటకు కట్టుబడి ఉండటం, ఇతరులకు ఆశ్రయమివ్వడం ముస్లింల ఉమ్మడి బాధ్యత. ఒక సాధారణ ముస్లిం కూడా ఇతరులకు (అంటే ముస్లిమేతరునికి) ఆశ్రయమిస్తే దాన్ని గౌరవించడం జరుగుతుంది. అందువల్ల ఒక ముస్లిం (ఎవరికైనా) ఆశ్రయమిస్తానని వాగ్దానం చేసినపుడు, అతని వాగ్దానాన్ని కాలరాసే చర్యకు ఎవరైనా పాల్పడితే అలాంటి వ్యక్తిని దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు. దేవుడు అతని ఫర్జ్ ఆరాధనల్ని స్వీకరించడు; నఫిల్ ఆరాధనల్ని స్వీకరించడు. అలాగే ఎవరైనా తన యజమానుల అనుమతి లేకుండా ఏదైనా జాతితో స్నేహ ఒప్పందం చేసుకుంటే అలాంటి వ్యక్తిని కూడా దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు. దేవుడు అతని ఫర్జ్, నఫిల్ ఆరాధనలు వేటినీ స్వీకరించడు".

[సహీహ్ బుఖారీ : 96వ ప్రకరణం - ఏతెసామ్, 5వ అధ్యాయం - మా యుక్రహు మినత్తాముఖి వ తనాజు]

869. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- రెండు రాతి మైదానాలలోని మదీనా నేల నిషిద్ధ భూభాగంగా నిర్ణయించబడిందని దైవప్రవక్త(సల్లం) పేర్కొన్నారు. అందువల్ల మదీనాలో ఏదైనా జింక (పచ్చిక) మేస్తూ ఉండటం గనక చూస్తే నేను దాన్ని అదిలించను, భయపెట్టను.

[సహీహ్ బుఖారీ : 29వ ప్రకరణం - ఫజాయలె మదీనా, 4వ అధ్యాయం - లాబతియల్ మదీనా]

## 86వ అధ్యాయం - మదీనాలో స్థిరపడటం, అక్కడ కష్టాలు సహించడం వల్ల లభించే పుణ్యఫలం

870. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఓసారి ఇలా ప్రార్థించారు:- "దేవా! నీవు మక్కా పట్ల మాలో ప్రేమాభిమానాలు కలిగించినట్లు మదీనా పట్ల కూడా మా హృదయాల్లో ప్రేమాభిమానాలు జనింపజెయ్యి. అంతకంటే ఎక్కువ ప్రేమాభిమానాలే జనింపజెయ్యి. మదీనాలోని

---

★ మూలభాషలో వచ్చిన పదాలను బట్టి ఒక అర్థంపైన అనువాదం లోనిది అయితే, మరొక అర్థం ఇది కూడా కావచ్చు; "అతను పశ్చాత్తాపంతో చేసిన వేడుకోలును దేవుడు స్వీకరించడు, అతను పాప పరిహారం ఇచ్చుకున్నా ప్రాణం దక్కించుకోలేడు".

ప్రజలకు వచ్చే జ్వరాన్ని (ఈజిప్టులోని) జుహ్ఫా★కు తరలించు. దేవా! మా త్రాసుల్లో, కొలపాత్రల్లో శుభాభివృద్ధుల్ని ప్రసాదించు."

[సహీహ్ బుఖారీ: 80వ ప్రకరణం - దావాత్, 43వ అధ్యాయం - అద్దువావు యర్ఫువుల్ వబా]

## 87వ అధ్యాయం - ప్లేగు వ్యాధి, దజ్జాల్ ఉపద్రవం నుండి మదీనాకు రక్షణ

871. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "మదీనా ద్వారాల దగ్గర దైవదూతలు కాచుకొని ఉంటారు. అందువల్ల ఈ పట్నం లోపలికి ప్లేగు వ్యాధి ప్రవేశించజాలదు; దజ్జాల్ కూడా అడుగుపెట్టలేడు."

[సహీహ్ బుఖారీ : 29వ ప్రకరణం - ఫజాయెలె మదీనా, 9వ అధ్యాయం - లాయద్ ఖులుద్దజ్జాలుల్ మదీనా]

## 88వ అధ్యాయం - మదీనా దుర్మార్గుల్ని బయటికి తీసివేస్తుంది

872. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "ఇతర పట్టణాలను తనలో ఇముడ్చుకునే పట్టణానికి వలస పోవలసినదిగా నాకు ఆజ్ఞ అయింది. జనం దాన్ని 'యస్రిబ్' అంటారు. కాని దాని అసలు పేరు మదీనా. కొలిమి ఇనుముకు పట్టిన తుప్పును తొలగించి శుద్ధి చేసినట్లే మదీనా మనుషుల్ని వడపోస్తుంది".

[సహీహ్ బుఖారీ: 29వ ప్రకరణం - ఫజాయలె మదీనా, 2వ అధ్యాయం - ఫజ్లిల్ మదీనా]

873. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఒక పల్లెవాసి ఇస్లాం ధర్మాన్ని అనుసరిస్తానని దైవప్రవక్త(సల్లం) ముందు ప్రమాణం చేశాడు. ఆ తర్వాత మదీనాలో నివసిస్తూ ఉంటే ఓసారి అతనికి తీవ్రమైన జ్వరం వచ్చింది. దాంతో అతను దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నన్ను ప్రమాణం (బైత్) నుండి విముక్తి కలిగించండి" అని అన్నాడు. కాని దైవప్రవక్త (సల్లం) నిరాకరించారు. అతను మరోసారి వచ్చి తనను ప్రమాణం నుండి విముక్తి కలిగించమని దైవప్రవక్త(సల్లం)ను వేడుకున్నాడు. దైవప్రవక్త (సల్లం) మళ్ళీ నిరాకరించారు. ఆ వ్యక్తి తిరిగి మూడోసారి వచ్చి తనను ప్రమాణం నుండి విముక్తి కలిగించమని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) మళ్ళీ నిరాకరించారు. అప్పుడా వ్యక్తి మదీనా వదిలిపెట్టి (చెప్పాపెట్టకుండా) వెళ్ళిపోయాడు. దానిపై దైవప్రవక్త (సల్లం) వ్యాఖ్యానిస్తూ "మదీనా ఒక కొలిమి లాంటిది. మురికి, మలినాలను బయటికి విసిరివేస్తుంది. పరిశుద్ధమైన వాటినే ఏరి తన దగ్గర ఉంచుకుంటుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 93వ ప్రకరణం - అహ్‌కామ్, 47వ అధ్యాయం - మన్ బాయ మసుమ్మస్తఖాలల్ బైత్]

874. హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఈ

---

★ (1) దైవప్రవక్త (సల్లం) చేసిన ప్రార్థనతో మదీనాలోని జ్వరం అంతమయిపోయింది. ఆ జ్వరం అక్కడ్నుంచి తరలిపోయి జుహ్ఫా వాసులకు చుట్టుకుంది. ఇది దైవప్రవక్త (సల్లం) మహిమ. ఈనాడు కూడా జుహ్ఫా నీరు త్రాగితే జ్వరం వస్తుంది.

(2) త్రాసుల్లో, కొలపాత్రల్లో శుభాలు అంటే ధాన్యం, పండ్లు, ఇతర జీవితావసర వస్తువుల్లో శుభాలు శ్రేయోవికాసాలను ప్రసాదించమని అర్థం.

పట్టణం (మదీనా) పరిశుద్ధమయినది. అగ్ని (ముడి) వెండిలోని మలినాన్ని తొలగించినట్లు ఇది మురికి, మలినాలను తీసి బయటకు విసిరి పడేస్తుంది."
[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 4-నిసాసూరా: 15వ అధ్యాయం-ఫమాలకుమ్ ఫిల్ మునాఫిఖీన ఫీ అతైన్]

## 89వ అధ్యాయం - మదీనా వాసులకు కీడు తలపెట్టదలచే వాడ్ని దేవుడు కరగబెడ్తాడు

875. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "మదీనా వాసుల్ని మోసగించే వాడ్ని దేవుడు నీరు ఉప్పును కరగించినట్లు కరగబెడ్తాడు."
[సహీహ్ బుఖారీ : 29వ ప్రకరణం - ఫజాయెలె మదీనా, 7వ అధ్యాయం - ఇస్మిమన్ కాద అహ్లిల్ మదీనా]

## 90వ అధ్యాయం - వివిధ పట్టణాలు వశమైనపుడు మదీనాలో స్థిర నివాసం ఏర్పరచుకోవాలని ప్రవక్త హితవు

876. హజ్రత్ సుఫ్యాన్ బిన్ అబీ జహీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "యమన్ జయించబడిన తరువాత కొందరు వ్యక్తులు ఒంటెల్ని తోలుకుంటూ వచ్చి తమ కుటుంబ సభ్యుల్ని, తమ మాటలు విన్న వారిని తీసుకొని (మదీనా నుండి) వెళ్ళిపోతారు. నిజానికి మదీనా వారికెంతో శ్రేష్టమయినదిగా ఉంటుంది. ఆ సంగతి వారు గ్రహిస్తే ఎంత బాగుంటుంది! అలాగే సిరియా జయించబడిన తరువాత కూడా కొందరు వ్యక్తులు ఒంటెల్ని తోలుకుంటూ వచ్చి తమ భార్యా పిల్లల్ని, తమ మాటలు విన్న వారిని తీసుకొని (మదీనా నుండి) వెళ్ళిపోతారు. మదీనా తమకు ఎంత శ్రేష్టమయిన స్థలమో వారు తెలుసుకుంటే ఎంత బాగుంటుంది! అదే విధంగా ఇరాఖ్ జయించబడిన తరువాత కూడా కొందరు వ్యక్తులు పశువుల్ని తోలుకుంటూ వచ్చి మదీనా నుండి తమ భార్యా పిల్లల్ని తమ మాటలు విన్న వారిని తీసికెళ్తారు. మదీనా తమకెంత శ్రేష్టమయిన స్థలమో వారు అర్థం చేసుకుంటే ఎంత బాగుండు!"
[సహీహ్ బుఖారీ : 29వ ప్రకరణం - ఫజాయెలె మదీనా, 5వ అధ్యాయం - మన్ రగిబ అనిల్ మదీనా]

## 91వ అధ్యాయం - మదీనా వాసులు మదీనా వదలివెళ్ళే సమయం వస్తుంది - ప్రవక్త భవిష్యత్ ప్రకటన

877. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలిపారు:- "ఒక కాలం రానున్నది. అప్పుడు మదీనా ఎంతో ఉచ్ఛస్థితిలోఉంటుంది, అయినప్పటికీ ప్రజలు దీన్ని వదిలిపెట్టి వేరే చోట్లకు తరలి వెళ్తారు. చివరికి ఇక్కడ జంతువులు పక్షులు మాత్రమే మిగిలి ఉంటాయి. ఆ తర్వాత 'మజీనా' నుండి ఇద్దరు పశుకాపర్లు తమ మేకల్ని తోలుకెళ్ళేందుకు మదీనా వస్తారు. కాని మదీనాలో వారికి క్రూర జంతువులు మాత్రమే కన్పిస్తాయి. ఆ తరువాత వారు 'సనియ్యతల్ విదా' వరకు చేరుకొని బొక్క బోర్లా పడిపోతారు (ప్రళయం ముంచుకొచ్చిందా అన్నట్లు)."
[సహీహ్ బుఖారీ: 29వ ప్రకరణం - ఫజాయెలె మదీనా, 5వ అధ్యాయం - మన్ రగిబ అనిల్ మదీనా]

## 92వ అధ్యాయం - దివ్య సమాధికి, దివ్యవేదికకు మధ్య గల భూభాగం స్వర్గవనాలలో ఒక వనమవుతుంది

878. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ అల్ మాజనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలిపారు:- "నా ఇంటికి (అంటే సమాధికి), మెంబర్ (వేదిక)కు మధ్య గల చోటు స్వర్గవనాలలో ఒక వనమవుతుంది."

[సహీహ్ బుఖారీ : 20వ ప్రకరణం - ఫజ్లుస్సలాతి ఫీమస్జిది మక్కా వల్ మదీనా, 5వ అధ్యాయం - ఫజల్ మాబైన్]

879. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "నా ఇంటికి మెంబర్ (వేదిక)కు మధ్య ఒక వనం ఉంది. అది స్వర్గవనాలలో ఒకటి. నా వేదిక నా (కౌసర్) సరస్సుపై ఉంది".

[సహీహ్ బుఖారీ : 20వ ప్రకరణం - ఫజ్లు స్సలాతిఫీమస్జిద్... 5వ అధ్యాయం - ఫజల్ మాబైనుల్ ఖబ్ర్ వల్ మింబర్]

## 93వ అధ్యాయం - ఉహద్ పర్వతాన్ని మేము ప్రేమిస్తున్నాము, ఉహద్ మమ్మల్ని ప్రేమిస్తోంది

880. హజ్రత్ అబూ హమీద్ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి తబూక్ పోరాటం నుండి తిరిగి వస్తున్నాము. మేము మదీనా పట్నం సమీపానికి చేరుకున్నప్పుడు దైవప్రవక్త (సల్లం) దాని వైపు చూపిస్తూ "ఇది తాబ (అంటే మదీనా) అది (ఉహద్) పర్వతం. ఆ పర్వతం మమ్మల్ని ప్రేమిస్తోంది. మేము దాన్ని ప్రేమిస్తున్నాము" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 81వ అధ్యాయం - హద్దసనా యహ్యాబిన్ బకీర్]

## 94వ అధ్యాయం - మక్కా, మదీనా మస్జిదుల్లో చేసే నమాజు ఘనత

881. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "నా మస్జిద్ (అంటే మస్జిదె నబవి)లో చేసే ఒక నమాజు కాబా మస్జిద్ తప్ప ఇతర యావత్తు మస్జిద్‌లలో చేసే వేయి నమాజుల కంటే కూడా ఎంతో శ్రేష్ఠమయినది."

[సహీహ్ బుఖారీ : 20వ ప్రకరణం - ఫజ్లిస్సలాతి ఫీమస్జిద్ మక్కావ మదీనా, 1వ అధ్యాయం - ఫజ్లిస్సలాతి ఫీ మస్జిద్]

## 95వ అధ్యాయం - మూడు మస్జిద్‌లు తప్ప ఇతర పుణ్యస్థలాల దర్శనార్థం ప్రయాణ సంకల్పం నిషిద్ధం

882. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మూడు మస్జిద్‌ల దర్శనం కోసం తప్ప మరే పుణ్య స్థల దర్శనం కోసమూ ప్రయాణం చేయకూడదు

(1) మస్జిదుల్ హరాం (మక్కాలోని కాబా మస్జిద్), (2) మస్జిదె నబవి (మదీనాలోని ప్రవక్త మస్జిద్), (3) బైతుల్ మఖ్దిస్‌లోని మస్జిదె అఖ్సా.

[సహీహ్ బుఖారీ : 20వ ప్రకరణం - ఫజ్లిస్సలాతి ఫీ మస్జిద్ మక్కా వ మదీనా - 1వ అధ్యాయం - ఫజ్లిస్సలాతి ఫీమస్జిద్]

## 97వ అధ్యాయం - ఖుబా మస్జిద్ ఘనత, అక్కడ చేసే నమాజు పుణ్యం

883. హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక్కోసారి కాలినడకన, మరొక్కసారి వాహనం మీద ఖుబా మస్జిద్‌కు వస్తుండేవారు.★

[సహీహ్ బుఖారీ : 20వ ప్రకరణం - ఫజ్లిస్సలాతి ఫీమస్జిదిమక్కవల్ మదీనా, 4వ అధ్యాయం- ఇత్యాని మస్జిదె ఖుబా మాషయా అవ్ రాకిబ]

★ 'ఖుబా' మదీనా నుండి దక్షిణ దిక్కున దాదాపు రెండు మైళ్ళ దూరంలో ఉన్న ఒక ప్రదేశం.

# నికాహ్ ప్రకరణం

884. హజ్రత్ అల్ఖమా (రహ్మలై) కథనం:- నేనొక రోజు హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) తో కలసి వెళ్తుంటే మినా (ప్రదేశం)లో హజ్రత్ ఉస్మాన్ (రజి) తారసపడ్డారు. ఆయన అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి)తో "అబూ అబ్దుర్రహ్మాన్! నేను మీతో కాస్త (విడిగా) మాట్లాడవలసి ఉంది" అని అన్నారు. ఆ తరువాత వారిద్దరు ప్రక్కకు వెళ్ళి మాట్లాడుకోసాగారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) మాట్లాడుతూ "అబూ అబ్దుర్రహ్మాన్! మీకు మీ యుక్త వయస్సునాటి రోజులు జ్ఞాపకం వచ్చేలా నేను మీకు ఒక కన్యతో పెళ్ళి చేయాలనుకుంటున్నాను, మీకు ఇష్టమేనా?" అని అడిగారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) తనకు దాని అవసరం లేదని భావించారు. అందువల్ల ఆయన నన్ను సైగ చేసి అటు రమ్మని పిలిచారు. నేను దగ్గరికి వెళ్ళాను. అప్పుడు ఆయన హజ్రత్ ఉస్మాన్ (రజి)ని ఉద్దేశించి ఇలా అన్నారు: మీరు ఈ మాట అన్నారు గనక నేను మీకు దైవప్రవక్త(సల్లం) ప్రవచనం ఒకటి వినిపిస్తాను. ఆయన ఈ విధంగా అన్నారు - "యువకుల్లారా! మీలో వివాహం చేసుకునే శక్తి, స్తోమత గలవారు వివాహం చేసుకోవాలి. ఆ శక్తి స్తోమత లేనివారు ఉపవాస వ్రతం పాటించాలి. ఉపవాసం కామ వాంఛను అదుపులో ఉంచుతుంది."

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 2వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) మనిస్తతా అమిన్కుముల్ బా అతఫల్ యతజవ్వజ్]

885. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఓ సారి ముగ్గురు వ్యక్తులు ప్రవక్త(స) భార్యల (రజి) ఇండ్ల దగ్గరకు వచ్చి దైవప్రవక్త(స) ఆరాధనా స్థితి గురించి అడిగారు. దాన్ని గురించి తెలుసుకున్న తరువాత వారు ప్రవక్త ఆరాధనను స్వల్పమయినదిగా భావించి, "ప్రవక్త (స) ఆరాధనకు, మన ఆరాధనకు పోలికేమిటి? దైవప్రవక్త(స) యొక్క భూత భవిష్యత్ కాలాల పొరపాట్లన్నీ మన్నించ బడ్డాయి" అని చెప్పుకున్నారు. అందువల్ల వారిలో ఒకడు "నేనిక నుండి ఎల్లప్పుడూ రాత్రి తెల్లవార్లూ మేల్కొని నమాజు చేస్తూ ఉంటాను" అని అన్నాడు. రెండవ వ్యక్తి మాట్లాడుతూ "నేనిక నుండి ప్రతి రోజూ ఉపవాసం ఉంటాను. ఒక్క రోజు కూడా నాగా చేయను" అని అన్నాడు. మూడవ వ్యక్తి తన నిర్ణయం తెలుపుతూ "నేనిక నుంచి స్త్రీల జోలికే పోను. ఎప్పటికీ పెళ్ళే చేసుకోను (దైవారాధనకే నా జీవితం అంకితం)" అని అన్నాడు.

అంతలో దైవప్రవక్త(స) అక్కడికి వచ్చారు. వారు చెప్పుకున్న మాటలు విని ఇలా అన్నారు: "ఏమిటీ, మీరేనా ఈ మాటలు అంటున్నది? వినండి, నేను మీ అందరికంటే ఎక్కువ దేవునికి భయపడేవాడ్ని. మీ అందరికంటే ఎక్కువ దైవభీతి పరాయణుడ్ని అయినప్పటికీ నేను ఉపవాసాలు పాటిస్తున్నాను. వాటిని వదిలేస్తున్నాను కూడా. అలాగే రాత్రిళ్ళు నమాజు చేస్తున్నాను. నిద్ర కూడ పోతున్నాను; స్త్రీలను వివాహం కూడా చేసుకుంటున్నాను. గుర్తుంచుకోండి! నా సంప్రదాయాన్ని విడనాడే వాడితో నా కెలాంటి సంబంధం లేదు (అతను అసలు ముస్లిమే కాదు)".

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 1వ అధ్యాయం - అత్తర్గీబి ఫిన్నికాహ్]

886. హ్జరత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) హ్జరత్ ఉస్మాన్ బిన్ మజ్వూన్ (రజి)ని బ్రహ్మచర్యం (వివాహం చేసుకోకుండా ఉండటం) నుండి వారించారు. దైవప్రవక్త(సల్లం) గనక ఆయన్ని వివాహం చేసుకోకుండా ఉండేందుకు అనుమతించి ఉంటే మేమంతా (కామవాంఛను అణచిపెట్టే పద్ధతుల్ని అవలంబించి) నపుంసకులుగా ఉండటానికి ఇష్టపడేవాళ్ళము.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 8వ అధ్యాయం - మాయక్రహ మినత్తబితలి వల్ ఖసా]

## 2వ అధ్యాయం - తాత్కాలిక వివాహం శాశ్వతంగా నిషేధించబడింది

887. హ్జరత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- మేమొకసారి దైవప్రవక్త(సల్లం)తో కలసి యుద్ధంలో పాల్గొన్నాము. అప్పుడు మా వెంట స్త్రీలు లేరు. అందువల్ల మేము దైవప్రవక్త(సల్లం)ని "మేము నపుంసకులుగా తయారు కావచ్చా?" అని అడిగాము. దానికాయన నిరాకరించి, నపుంసకులుగా కావడాన్ని వారించారు. అయితే ఆ తర్వాత ఆయన మాకు అనుమతి ఇస్తూ "కట్టుబట్టలకు బదులుగా స్త్రీని ఒక నిర్ణీత గడువు కోసం తాత్కాలికంగా వివాహం చేసుకోవచ్చు" అని అన్నారు.

హ్జరత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) ఆ తర్వాత ఈ ఖుర్ఆన్ సూక్తి పఠించారు. "విశ్వాసులారా! దేవుడు మీ కొరకు ధర్మసమ్మతం చేసిన పరిశుద్ధ వస్తువుల్ని నిషేధించుకోకండి" (5:87)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ - అల్‌మాయిదా సూరా; 9వ అధ్యాయం - లాతుహర్రిమూ తయ్యిబాత్]

888. హ్జరత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి), హ్జరత్ సల్మా బిన్ అకూ (రజి)ల కథనం:- ఒక యుద్ధంలో మేము సైన్యం వెంట ఉన్నాము. దైవప్రవక్త(సల్లం) మా దగ్గరికి వచ్చి "మీకు తాత్కాలిక వివాహం★ చేసుకోడానికి అనుమతి ఇవ్వబడింది. కనుక మీరు తాత్కాలిక వివాహం చేసుకోవచ్చు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 31వ అధ్యాయం - నహ్యియిన్నబీ (సల్లం) అన్నికాహిల్ ముతా ఆఖిరా]

889. హ్జరత్ అలీ బిన్ అబీ తాలిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) స్త్రీలను తాత్కాలికంగా పెళ్ళి చేసుకోవడాన్ని, పెంపుడు గాడిద మాంసం తినడాన్ని ఖైబర్ దండయాత్ర రోజు నిషేధించారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్]

## 3వ అధ్యాయం - సోదరుని కుమార్తె, సోదరి కుమార్తె, మేనత్త, పిన్నమ్మలు, ఏకకాలంలో ఒకరి వివాహబంధంలో ఉండటం నిషిద్ధం.

890. హ్జరత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "ఏ స్త్రీ కూడా తన పిన్ని లేక మేనత్తతో కలసి వివాహబంధంలో ఉండరాదు".

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 27వ అధ్యాయం - లాతున్కహుల్ మర్అతు అలా ఉమ్మతిహా]

---

★ తాత్కాలిక వివాహ (ముతా) లక్ష్యం లైంగికానందం పొందడమే గాని, సంతానం, ఇతరమైన లేక ప్రయోజనాలు పొందడం ఎంత మాత్రం కాదు. ఈ పద్ధతి ప్రారంభ కాలంలో ధర్మసమ్మతమై ఉండేది. అదైనా విధిలేని పరిస్థితిలో మాత్రమే ధర్మసమ్మతం. కాని ఆ తర్వాత ఇది శాశ్వతంగా నిషేధించబడింది. అలాగే పెంపుడు గాడిద మాంసం తినడం కూడా ప్రారంభంలో ధర్మసమ్మతమై ఉండింది. ఆ తర్వాత నిషేధించారు.

## 4వ అధ్యాయం - ఇహ్రాం'స్థితిలో వివాహమాడటం నిషిద్ధం, వివాహ సందేశమివ్వడం మక్రూహ్

891. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) హజ్రత్ మైమూన (రజి)ని పెళ్ళి చేసుకునేటప్పుడు ఆయన ఇహ్రాం స్థితిలో ఉన్నారు. [1]

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 12వ అధ్యాయం - తజ్వీజుల్ ముహ్రిమ్]

## 5వ అధ్యాయం - ఒకరు ఒక చోట వివాహ సందేశం పంపినప్పుడు అక్కడికి మరొకరు పంపరాదు

892. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒక వ్యక్తి ఒక చోట బేరం చేస్తున్నప్పుడు మరొక వ్యక్తి అతనికి పోటీగా అక్కడ బేరం చేయడాన్ని దైవప్రవక్త(స) వారించారు. అలాగే ఒక ముస్లిం ఒక చోట వివాహ సందేశం పంపినప్పుడు మరొక ముస్లిం తన తోటి ముస్లిం సోదరునికి పోటీగా అక్కడికి తన వైపునా వివాహ సందేశం పంపడాన్ని కూడా దైవప్రవక్త (స) వారించారు. అయితే మొదటి ముస్లిం తన ఉద్దేశ్యాన్ని మానుకుంటే లేదా రెండవ వ్యక్తికి అనుమతి ఇస్తే మాత్రం ఆ రెండవ వ్యక్తి అలా చేయవచ్చు .

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 45వ అధ్యాయం - లా యఖ్తుబు అలా ఖుత్బతి అఖీ]

## 6వ అధ్యాయం - పరస్పర మార్పిడి వివాహం అధర్మం, అక్రమం

893. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- పరస్పర మార్పిడి వివాహం (షిగార్ నికాహ్) చేసుకోవడాన్ని దైవప్రవక్త(స) వ్యతిరేకించారు. పరస్పర మార్పిడి వివాహం అంటే ఒక వ్యక్తి మహర్ ఇచ్చి పుచ్చుకోవడాలు లేకుండా మరొకరి కుమార్తెని చేసుకునే షరతుపై తన కుమార్తెని అతనికిచ్చి పెళ్ళి చేయడం అన్నమాట.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 27వ అధ్యాయం - అష్షిగార్]

## 7వ అధ్యాయం - వివాహ సమయంలో నిర్ణీత షరతులు నెరవేర్చాలి

894. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "మీరు ఏ షరతులపై స్త్రీలను (కలుసుకునేందుకు) ధర్మ సమ్మతం చేసుకున్నారో అవే నెరవేర్చడానికి అన్నిటికంటే ఎక్కువ యోగ్యమైన షరతులు". [2]

[సహీహ్ బుఖారీ : 54వ ప్రకరణం - షురూత్, 6వ అధ్యాయం – అష్షురూతి ఫిల్ మహ్రి ఇన్ద అఖ్దతిన్నికాహ్]

---

(1) హదీసు శీర్షికకూ - హదీసులోని అంశానికి పొంతన లేనట్టుంది. దీనికి కారణమేమిటంటే ఈ హదీసులను సేకరించిన సంకలనకర్త ముత్తఫకున్ అలైహి హదీసులను మాత్రమే సేకరించారు. అందుచేత ఈ శీర్షిక క్రింద 'సహీహ్ ముస్లిం'లో ఉన్న ఇతర హదీసులను ఇక్కడ పొందుపరచే అవకాశం సంకలనకర్తకు లభించి ఉండదు. తత్కారణంగా పాఠకులకు ఈ హదీసు ప్రశ్నార్థకంగా మిగిలిపోయింది. - అనువాదకుడు

(2) అంటే, వివాహ సమయంలో నిర్ణయించబడిన (మహర్ వంటి) ధర్మషరతులను నెరవేర్చాలి అని అర్థం. ధర్మసమ్మతం కాని, పనికిమాలిన షరతులు ఈ ఆజ్ఞ పరిధిలోకి రావు.

## 8వ అధ్యాయం - అమ్మాయి మౌనమే ఆమె వివాహాంగీకారం

895. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- “వితంతువు లేక విడాకులు పొందిన స్త్రీ నోటి మాట ద్వారా తన సమ్మతి తెలియజేయనంతవరకు ఆమె వివాహం కాజాలదు. అలాగే కన్య తన ఆమోదం తెలుపనంతవరకు ఆమె వివాహం కూడా కాజాలదు”.

ప్రవక్త అనుచరులు (రజి) ఈ మాట విని “ఎలాంటి ఆమోదం?” అని అడిగారు. “ఆమె నిరాకరించకుండా మౌనం దాల్చడమే ఆమె ఆమోదం అవుతుంది” అని అన్నారు దైవప్రవక్త(సల్లం).

[సహీహ్ బుఖారీ: 67వ ప్రకరణం-నికాహ్, 41వ అధ్యాయం - లాయన్కిహుల్ అబు వగైరుహుల్ బాకిరా వస్సైబ్]

896. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త(సల్లం)తో మాట్లాడుతూ “దైవప్రవక్తా! స్త్రీల వివాహం విషయంలో వారి అంగీకారం తీసుకోవడం అవసరమా?” అని అడిగాను. దానికి దైవప్రవక్త(సల్లం) ఔనన్నారు. నేను మళ్ళీ “కన్నె పిల్లను అడిగితే ఆమె సిగ్గుపడిపోయి మౌనంగా ఉండిపోతుంది కదా?” అని అన్నాను. “ఆమె మౌనమే ఆమె అంగీకారం” అన్నారు దైవప్రవక్త(సల్లం).

[సహీహ్ బుఖారీ: 89వ ప్రకరణం - ఇక్రాహ్, 3వ అధ్యాయం - లాయజూజు నికాహుల్ ముక్రుహ్]

## 9వ అధ్యాయం - తండ్రి యుక్తవయస్సు రాని తన కూతురి పెళ్ళి చెయ్యవచ్చు

897. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను ఆరేండ్ల వయస్సులో ఉన్నప్పుడు దైవప్రవక్త (సల్లం)తో నా వివాహం అయింది. ఆ తర్వాత మేము మదీనా వచ్చి ‘బనీహారిస్ బిన్ ఖజ్రజ్’ తెగ(వాడ)లో స్థిరపడిపోయాము. ఇక్కడకు వచ్చిన తర్వాత నాకు జ్వరం వచ్చింది. ఈ జ్వరంతో నా శిరోజాలు రాలిపోయాయి. తర్వాత కొన్నాళ్ళకు శిరోజాలు మళ్ళీ రాసాగాయి. చెవుల దాకా వెంట్రుకలు పూర్తిగా వచ్చేశాయి. ఆ తర్వాత ఓ రోజు నేను నా చెలికత్తెలతో ఊయల ఊగుతూ ఉంటే మా అమ్మ ‘ఉమ్మెరూమాన్’ దగ్గరకు వచ్చి నన్ను పిలిచింది. నేను ఆమె దగ్గరకు వెళ్ళాను. ఆమె నా నుండి ఏం కోరుతుందో నాకప్పట్లో ఏమీ అర్థం కాలేదు.

ఆమె నా చేయి పట్టుకొని నన్ను ఇంటి ద్వారం దగ్గర నిలబెట్టింది. అప్పుడు నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎక్కువయిపోయాయి. చివరికి ఎలాగో (క్రమంగా) సాధారణ స్థితికి చేరుకున్నాను. మా అమ్మ చేతిలో కొంచెం నీళ్ళు తీసుకొని నా ముఖాన్ని, తలను శుభ్రపరచి నన్ను ఇంట్లోకి తీసికెళ్ళింది. లోపల నాకు కొందరు అన్సార్ స్త్రీలు కన్పించారు. వాళ్ళు నన్ను చూడగానే “శుభాలతో ప్రవేశించు. దేవుడు నిన్ను సౌభాగ్యవతి చేయుగాక!” అని అన్నారు. తర్వాత మా అమ్మ నన్ను వాళ్ళకప్పగించింది. వారు నన్ను చక్కగా సింగారించారు. కొంచెం పొద్దెక్కిన తరువాత దైవప్రవక్త (సల్లం) (ఎక్కడి నుంచో) వచ్చారు. (వెంటనే) మా అమ్మ నన్ను ఆయనకు అప్పగించింది. నేనప్పుడు (పరిస్థితి అర్థంకాక) ఆశ్చర్య చకితురాలయ్యాను. అప్పుడు నా వయస్సు తొమ్మిదేండ్లు.

[సహీహ్ బుఖారీ : 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 44వ అధ్యాయం - తజ్వీజున్నబీ (సల్లం) - ఆయిషా (రజి)]

## 12వ అధ్యాయం - మహర్ (ఖుర్‌ఆన్ బోధన, ఉక్కు ఉంగరం లాంటివి కూడా మహర్ క్రిందికి వస్తాయి)

898. హజ్రత్ సహెల్ బిన్ సాదె సాది (రజి) కథనం:- ఒక స్త్రీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నన్ను నేను మీకు అంకితం (హిబా) చేసుకోవడానికి మీ దగ్గరకు వచ్చాను" అని అన్నది. దైవప్రవక్త (సల్లం) ఓసారి ఆమెను ఆపాదమస్తకం చూసి తల క్రిందికి దించుకున్నారు. దాంతో ఆ స్త్రీ తనను గురించి దైవప్రవక్త(సల్లం) ఎలాంటి నిర్ణయం తీసుకోలేదని భావించి (ఓ ప్రక్కకు వెళ్ళి కూర్చున్నది. అప్పుడు ప్రవక్త అనుచరుల (రజి)లో ఒకతను లేచి "దైవప్రవక్తా! ఆమె మీ కవసరం లేకపోతే నాకిచ్చి వివాహం చేయించండి" అని అన్నారు. దైవప్రవక్త(సల్లం) ఈ మాట విని, "నీ దగ్గర (మహర్ ఇవ్వడానికి) ఏదైనా ఉందా?" అని అడిగారు. దానికావ్యక్తి "దైవసాక్షిగా చెబుతున్నాను. నా దగ్గర చిల్లిగవ్వ కూడా లేదు దైవప్రవక్తా!" అని అన్నాడు. "నీ యింటికెళ్ళి చూడు ఏదైనా దొరుకుతుందేమో" అన్నారు దైవప్రవక్త (సల్లం).

అతను ఇంటికి వెళ్ళి వచ్చి "దైవసాక్షి! నాకు ఇంట్లో కూడా ఏమీ దొరకలేదు దైవప్రవక్తా!" అని అన్నాడు. "కాస్త జాగ్రత్తగా వెతికి చూడు. ఒక ఇనుప ఉంగరం దొరికినా చాలు" అన్నారు దైవప్రవక్త(సల్లం). మళ్ళీ అతను మరొకసారి ఇంటి కెళ్ళాడు. తిరిగొచ్చి "దైవసాక్షి! ఇనుప ఉంగరం కూడా లేదు దైవప్రవక్తా! నేను కట్టుకున్న ఈ లుంగీ మాత్రమే ఉంది. ఇందులో నుంచే సగం చించి (మహర్‌గా) ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను" అని అన్నాడు. అతని దగ్గర కనీసం ఒక దుప్పటి కూడా లేదు. దైవప్రవక్త (సల్లం) అతని మాటలు విని "అది ఆమెకు ఏ మూలకు వస్తుంది? ఆ లుంగీని నువ్వు కట్టుకుంటే ఆమె (వంటి)పై ఏమీ ఉండదు, ఆమెకు కట్టుకోవడానికి ఇస్తే నీ (వంటి)పై ఏమీ ఉండదు" అని అన్నారు.

ఈ మాటలు విని ఆ వ్యక్తి (మారు మాట్లాడకుండా) కూర్చున్నాడు. అలా చాలా సేపు కూర్చున్నాడు. తర్వాత లేచాడు. (వెళ్ళిపోవడానికి) అతను వెనక్కి తిరిగి వెళ్ళిపోవడం చూసి దైవప్రవక్త (సల్లం) అతడ్ని పిలిపించారు. అతను తిరిగి వచ్చిన తర్వాత "నీకు ఖుర్‌ఆన్ ఏమైనా గుర్తున్నదా?" అని అడిగారు. దానికా వ్యక్తి తనకు ఫలానా ఫలానా సూరాలు (అధ్యాయాలు) గుర్తున్నాయని చెబుతూ కొన్ని సూరాల పేర్లు తెలియజేశాడు. "మరి ఆ సూరాలను నీ జ్ఞాపకశక్తితో పఠించగలవా?" దైవప్రవక్త (సల్లం) అడిగారు..... అతను పఠించగలనని అన్నాడు. "అయితే నీకు గుర్తున్న ఖుర్‌ఆన్ (సూరాల)కు బదులు (అంటే వాటిని ఆమెకు నేర్పాలి) నేను ఈమెను నీకప్పగిస్తున్నాను (పెళ్ళి చేసుకోవడానికి); తీసికెళ్ళు" అన్నారు దైవప్రవక్త(సల్లం).

[సహీహ్ బుఖారీ : 66వ ప్రకరణం - ఫజాయెలె ఖుర్‌ఆన్, 22వ అధ్యాయం - అల్ ఖిర్‌అతి అన్ జహ్రి ఖల్బ్]

899. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఓ రోజు హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) (బట్టల)పై పసుపుపచ్చ రంగు చిహ్నాలు చూసి, "ఏమిటీ చిహ్నాలు?" అని అడిగారు. దానికి హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) సమాధానమిస్తూ "నేను ఖర్జూరపు విత్తనమంత బంగారాన్ని మహర్‌గా నిర్ణయించి ఒక స్త్రీని వివాహమాడాను" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆయన్ని

ఆశీర్వదిస్తూ "దేవుడు నీకు శుభం కలిగించుగాక! అయితే ఒక మేకను కోసయినా సరే వలిమా విందు తప్పకుండా చెయ్యి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 56వ అధ్యాయం - కైఫయుద్ ఆలిల్ ముతజౌజ్]

## 13వ అధ్యాయం - బానిస మహిళకు స్వాతంత్ర్యమిచ్చి ఆమెను వివాహమాడితే లభించే పుణ్యం

900. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) ఖైబర్ మీద దాడి చేయడానికి వెళ్ళినపుడు మేము ఖైబర్ సమీపంలో ఒక చోట వేకువ జామున ఫజ్ర్ నమాజు చేశాము. ఆ తర్వాత దైవప్రవక్త(సల్లం) ఒంటె నెక్కారు. హజ్రత్ అబూతల్హా(రజి) కూడా ఒంటె ఎక్కారు. నేను హజ్రత్ అబూతల్హా (రజి) వెనుక (ఒంటెపై) కూర్చున్నాను. దైవప్రవక్త (సల్లం) ఖైబర్ వీధుల గుండా వెళ్తుంటే నా మోకాలు ఆయన తొడకు తాకింది. దైవప్రవక్త(సల్లం) లుంగీ (గాలికి) తొడమీది నుంచి కాస్త పక్కకు తొలిగింది. ఆయన తొడ తెలుపుదనం నాకు కన్పించసాగింది.

దైవప్రవక్త (సల్లం) ఖైబర్ పట్టణంలో ప్రవేశించగానే "అల్లాహ్ అందరికంటే గొప్పవాడు. ఖైబర్ (ప్రజల) కు వినాశం దాపురించింది. మేమేదయినా జాతి ముంగిటకు వెళ్ళి దిగితే ఇక ఆ జాతి ప్రజలకు వినాశం మూడినట్లే" అని అన్నారు. ఈ విధంగా ఆయన మూడుసార్లు అన్నారు.

ఆ సమయంలో (యూద ) ప్రజలు దైనందిన కార్యకలాపాల్లో నిమగ్నులయి ఉన్నారు. వారు దైవప్రవక్తను, ఆయన సైన్యాన్ని హఠాత్తుగా చూసి "ముహమ్మద్(సల్లం) వచ్చేశారు. ఆయన వెనుక సైన్యం ఉంది" అని అన్నారు (గుండెలు బాదుకుంటూ).

ఆ తర్వాత మేము ఖడ్గ శక్తితో ఖైబర్ని జయించాము. యుద్ధ ఖైదీలను ఒక చోట సమీకరించాము. అప్పుడు హజ్రత్ దిహ్యాకల్బీ (రజి) వచ్చి "దైవప్రవక్తా! యుద్ధ ఖైదీలలో ఒక మహిళా ఖైదీని నాకూ ప్రసాదించండి" అని విన్నవించుకున్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "సరే వెళ్ళి ఒక మహిళా ఖైదీని తీసుకో" అన్నారు. అప్పుడు హజ్రత్ దిహ్యా(రజి) వెళ్ళి సఫియా బిన్తె హుయ్యి (రజి)ని తీసుకున్నారు. అంతలో ఒకతను వచ్చి "దైవప్రవక్తా! మీరు దిహ్యా(రజి)కు సఫియా బిన్తె హుయ్యి (రజి)ని ప్రసాదించారు. కాని ఆమె బనీ ఖురైజా, బనీ నజార్ తెగలు రెండింటికీ నాయకురాలు. అలాంటి స్త్రీ మీకు తప్ప మరెవరికీ యోగ్యురాలు కాజాలదు" అని అన్నాడు.

దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "అయితే దిహ్యా(రజి)ను సఫియా (రజి)ను ఇద్దర్ని పిలుచుకురండి" అని అన్నారు. దైవప్రవక్త(సల్లం) హజ్రత్ సఫియా (రజి)ను ఓ సారి చూసి, దిహ్యా(రజి)తో "నీవు ఖైదీలలో నుండి మరో మహిళా ఖైదీని తీసుకో" అని చెప్పారు. ఆ తర్వాత దైవప్రవక్త(సల్లం) హజ్రత్ సఫియా (రజి)ను బానిసత్వం నుండి విముక్తి కలిగించి వివాహం చేసుకున్నారు.

హదీసు ఉల్లేఖకుడు హజ్రత్ సాబిత్ (రహ్మాలై) ఈ సందర్భాన్ని పురస్కరించుకొని, "అబూహమ్జా (అనస్)! దైవ ప్రవక్త (సల్లం) హజ్రత్ సఫియా (రజి)కు మహర్ ఎంత నిర్ణయించారు?" అని అడిగారు.

దానికి హజ్రత్ అనస్ (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త(సల్లం) ఆమెకిచ్చిన స్వాతంత్ర్యమే ఆమె మహర్" అని అన్నారు.

హజ్రత్ అనస్ (రజి) ఇలా అంటున్నారు:- తిరుగు ప్రయాణంలో మేమింకా దారిలో ఉండగానే హజ్రత్ ఉమ్మె సలీం (రజి) హజ్రత్ సఫియా (రజి)ను సింగారించి రాత్రి వేళ దైవప్రవక్త (స) సన్నిధికి పంపారు. ఉదయం ఆయన పెళ్ళికొడుకుగా తయారయ్యారు. ఆ తరువాత దైవప్రవక్త(స) తన అనుచరుల్ని ఉద్దేశించి "మీ దగ్గర (ఆహార వస్తువులు) ఏమేమి ఉన్నాయో తీసుకురండి" అని ఆజ్ఞాపించారు. వారు తీసుకు వచ్చారు. (నేల మీద) ఓ చర్మ వస్త్రాన్ని పరిచారు. కొందరు ఖర్జూర పండ్లు, మరి కొందరు నెయ్యి (ఇలా రకరకాల వస్తువులు) తెచ్చి (దానిపై) పెట్టసాగారు. [ఇక్కడ హదీసు ఉల్లేఖకుడు "నా అభిప్రాయం ప్రకారం హజ్రత్ అనస్ (రజి) సత్తుపిండి గురించి కూడా ప్రస్తావించారు" అని అన్నాడు.] ఆ తరువాత అందరూ కలసి (ఖర్జూర పండ్లు, జున్ను, నెయ్యి మొదలైన వాటిని దంచి) హైస్ (అనే ఒక విధమైన వంటకం) తయారు చేశాము. ఇది దైవప్రవక్త (స) ఇచ్చిన వలీమా విందు.

**[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 12వ అధ్యాయం - మాయుజ్కరు ఫిల్ ఫఖిజ్]**

901. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "ఎవరి దగ్గరైనా ఒక మహిళా బానిస ఉండి, అతనామెను బాగా పోషించి, ఆమె పట్ల మంచిగా ప్రవర్తించి, ఆమెను బానిసత్వం నుంచి విముక్తి కలిగించి పెళ్ళి చేసుకుంటే అలాంటి దానికి రెట్టింపు పుణ్యం లభిస్తుంది. (పోషించి స్వాతంత్ర్యం ప్రసాదించినందుకు, ఆపై ఆమెను వివాహమాడినందుకు.)"

**[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - ఇత్ఖ్, 14వ అధ్యాయం - ఫజ్లిమిన్ అద్దబ జారియతహూ వ అల్లమహా]**

## 14వ అధ్యాయం - హజ్రత్ జైనబ్ (రజి) వివాహం పరదా ఆజ్ఞ, వలీమా విందు

902. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) తన భార్యలలో హజ్రత్ జైనబ్ (రజి)గారి వలీమా విందు చేసినట్లు మరెవరి వలీమా విందూ చేయలేదు. అప్పుడు ఆయన ఒక మేకను కోసి (మాంసం, రొట్టెలతో) విందు చేశారు.

**[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 68వ అధ్యాయం - అల్ వలీమ వలవ్ బిషాత్]**

903. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త(స) హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి)ని వివాహమాడినప్పుడు ప్రజలకు విందు ఏర్పాటు చేశారు. భోజనాలయిన తరువాత అందరూ పరస్పరం (ఇష్టాగోష్ఠిగా) మాట్లాడుకోసాగారు. దైవప్రవక్త(స) ఇంట్లోకి వెళ్ళామనుకుంటుంటే, వాళ్ళు ఎంత సేపటికీ ముచ్చట్లు ముగించేలా కనపడలేదు. చివరికి ఆయన ఇక లాభం లేదని భావించి మెల్లిగా సమావేశం నుండి లేచి (బయటికి) వెళ్ళిపోయారు. దైవప్రవక్త(స) లేచి వెళ్ళిపోగానే అందరూ జారుకున్నారు. కాని ముగ్గురు మాత్రం అలాగే కూర్చొని ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) బయటకెళ్ళి వచ్చి చూస్తే ఆ ముగ్గురు ఇంకా అక్కడే కూర్చొని ఉన్నారు. ఆ తరువాత కాస్సేపటికి వాళ్ళు కూడా వెళ్ళిపోయారు. నేను దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళి అందరూ వెళ్ళి పోయారని తెలియజేశాను. అప్పుడు ఆయన లోపలికి వెళ్ళిపోయారు.

ఆ సమయంలో నేను కూడా లోపలికి వెళ్ళామనుకున్నాను. కాని వెంటనే దైవప్రవక్త(స) తెర దించివేశారు. ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది - "విశ్వాసులారా! దైవప్రవక్త(స) ఇంట్లోకి అనుమతి లేకుండా ప్రవేశించకండి......" (ఖుర్‌ఆన్-33:53)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 33 - అహ్జాబ్‌సూరా- 8వ అధ్యాయం - ఖౌలిహీ లా తద్ ఖులూ బుయూతన్నబీ]

904. హజ్రత్ అనస్ (రజి) కథనం:- పరదా సూక్తుల సంగతి అందరి కంటే నాకే బాగా తెలుసు. దీని గురించి ఉబైబిన్‌కాబ్ (రజి) నన్ను అడుగుతుండేవారు. దైవప్రవక్త(సల్లం) హజ్రత్ జైనబ్ బిన్తె జహష్(రజి)ను వివాహమాడారు. ఈ పెళ్ళి మదీనాలో జరిగింది. ఆ రాత్రి గడచిపోయి ఉదయం పొద్దెక్కిన తరువాత దైవప్రవక్త(సల్లం) ప్రజలను విందు భోజనానికి పిలిచారు. ప్రజలు భోంచేసి వెళ్ళి పోయాక కూడా కొందరు వ్యక్తులు ఇంకా అలాగే దైవప్రవక్త(సల్లం) దగ్గర (ఇంటిముందు) తిష్ఠ వేసి ఉన్నారు. దైవప్రవక్త(సల్లం) ఈ పరిస్థితి చూసి లేచి నిలబడ్డారు. ఆయన హజ్రత్ ఆయిషా (రజి) గారి ఇంటి ద్వారం దాకా వెళ్ళారు. నేను కూడ ఆయన వెంట వెళ్ళాను. దైవప్రవక్త(సల్లం) ఈ పాటికి వారు వెళ్ళిపోయి ఉంటారని భావించారు. ఆయన, నేను తిరిగొచ్చి చూస్తే వాళ్ళంతా ఇంకా అక్కడే కూర్చుని ఉన్నారు. దాంతో మేమిద్దరం మళ్ళీ హజ్రత్ ఆయిషా (రజి) గారి ఇంటి ద్వారం దాకా వెళ్ళి వచ్చాము. అప్పుడు వారు వెళ్ళిపోవడానికి లేచి నిలబడ్డారు. దైవప్రవక్త(సల్లం) తనకు, నాకూ మధ్య అడ్డుగా తెర దించేశారు. ఆ సందర్భంలో పరదా సూక్తులు అవతరించాయి.

[సహీహ్ బుఖారీ : 70వ ప్రకరణం - అత్ అమ, 59వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (ఫఇజాతయిమ్ తుమ్ ఫన్ తషిరూ)]

905. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (నా తల్లి) హజ్రత్ ఉమ్మె సలీం (రజి) ఇంటి సమీపం నుండి పోయినప్పుడల్లా ఆమె దగ్గరికి వెళ్ళి సలాం చేసేవారు.

దైవప్రవక్త (సల్లం) హజ్రత్ జైనబ్ (రజి)ను వివాహమాడినపుడు (నా తల్లి) హజ్రత్ ఉమ్మెసలీం (రజి) నాతో మాట్లాడుతూ "ఈ రోజు మనం దైవప్రవక్త (సల్లం)కు ఏదైనా కానుక పంపితే బాగుంటుంది" అని అన్నారు. నేనామె మాటలను సమర్థిస్తూ "తప్పకుండా పంపిద్దాం" అన్నాను. ఆ తర్వాత ఆమె కొన్ని ఖర్జూర పండ్లు, నెయ్యి, జున్ను కలిపి ఒక రాతికుండలో వేసి హల్వాలాంటి ఒక విధమైన మిఠాయి తయారు చేసి నా చేతికిచ్చారు. దాన్ని తీసుకొని నేను దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను. దైవప్రవక్త(సల్లం) దాన్నక్కడ పెట్టమని చెప్పి, కొందరి పేర్లు పేర్కొంటూ వారందర్నీ పిలుచుకు రమ్మని నన్ను పురమాయించారు. అంతేకాకుండా ఇంకెవరైనా నాకు తారసపడితే వాళ్ళను కూడా పిలుచుకు రమ్మని చెప్పారు. నేను దైవప్రవక్త(సల్లం) ఆజ్ఞను శిరసావహించాను. నేను వారందరికీ చెప్పి తిరిగొచ్చి చూస్తే ఏముంది, ప్రవక్త ఇల్లు ఆహ్వానితులతో నిండిపోయింది.

అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఆ మిఠాయి ఉన్న పాత్రపై చెయ్యి పెట్టి దేవుడు తలచిన కొన్ని వాక్యాలేమిటో ఉచ్ఛరించారు. తర్వాత విడతకు పది మంది చొప్పున ఆహ్వానితులను పిలుస్తూ బిస్మిల్లా అని (దేవుని పేరు) ఉచ్ఛరించి, ముందువైపు నుండి తినండని చెప్పారు. ఈ విధంగా అందరూ తిని లేచారు. వారిలో చాలా మంది వెళ్ళిపోయారు కూడా. కాని కొందరు ఇంకా అక్కడే తిష్ఠవేసి పిచ్చాపాటి మాట్లాడుకోసాగారు. ఈ ధోరణి నచ్చక నేను మనసులో మథనపడసాగాను. దైవప్రవక్త(సల్లం)

(వాళ్ళను పొమ్మని నేరుగా చెప్పలేక) అక్కడ్నుంచి లేచి తన ఇతర భార్యల ఇండ్ల వైపుకు బయలుదేరారు. నేను కూడ కాస్సేపటికి ఆయన వెనకాల బయలుదేరాను. (వాళ్ళు వెళ్ళిపోవడం చూసి) దాంతో వాళ్ళు వెళ్ళిపోయారని తెలియజేశాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) తిరిగొచ్చి ఇంట్లోకి వెళ్ళిపోయి (ద్వారం) తెర దించివేశారు. నేనింకా అక్కడ ఉండగానే లోపల దైవప్రవక్త (సల్లం) ఈ క్రింది సూక్తులు పఠించారు:

"విశ్వాసులారా! అనుమతి లేకుండా ప్రవక్త ఇండ్లలో ప్రవేశించకండి. భోజన సమయంలో అక్కడ తారట్లాడుతూ ఉండకండి. మిమ్మల్ని ఒకవేళ భోజనానికి ఆహ్వానిస్తే మీరు తప్పకుండా వెళ్ళండి. అయితే భోజనాలు అవగానే లేచి వెళ్ళిపోండి. అంతేగాని కబుర్లు చెప్పుకుంటూ (అక్కడే గంటల తరబడి తిష్టవేసి) కూర్చోకండి. అలా చేస్తే దైవప్రవక్త(సల్లం) మనస్సుకు బాధకలుగుతుంది. కాని ఆయన మొహమాటంతో మిమ్మల్ని వెళ్ళమని చెప్పలేడు. దేవుడు మాత్రం వాస్తవం చెప్పడానికి మొహమాటపడడు". [అహ్జాబ్ : 53]

హజ్రత్ అనస్ (రజి) కథనం:- నేను పదేళ్ళ పాటు దైవప్రవక్త(సల్లం) సేవలో గడిపాను.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 64వ అధ్యాయం - అల్ హద్యతు లిల్ఉరూస్]

## 15వ అధ్యాయం - విందు ఆహ్వానాన్ని అంగీకరించాలి

906. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరినైనా వలీమా విందుకు ఆహ్వానిస్తే అతను తప్పకుండా ఆ విందుకు వెళ్ళాలి".

[సహీహ్ బుఖారీ: 67వ ప్రకరణం - నికాహ్ , 71వ అధ్యాయం - హఖ్ఖి ఇజాబతిల్ వలీమతి వద్దావా]

907. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- పేదలను విస్మరించి ధనికుల్ని ఆహ్వానించే వలీమా విందు అత్యంత నీచమైనది. వలీమా విందుకు ఆహ్వానిస్తే వెళ్ళనివాడు దేవునికి, దైవప్రవక్త (సల్లం)కు అవిధేయుడయినట్లే.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం -నికాహ్, మన్ తరకద్దావతఫఖద్ అసల్లాహు వ రసూలుహ్]

## 16వ అధ్యాయం - మూడు విడాకుల తర్వాత ఆ స్త్రీని అతను తిరిగి వివాహం చేసుకోవాలంటే?

908. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ రిఫా ఖర్జీ (రజి) గారి (మాజీ) భార్య ఓ రోజు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నేను రిఫా (రజి) గారి మాజీ భార్యను, ఆయన నాకు మూడు విడాకులు ఇచ్చి వేశారు. ఆ తర్వాత నేను హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ జుబైర్ (రజి) గారిని వివాహమాడాను. కాని ఏం లాభం? ఆయన దగ్గర గుడ్డ కుచ్చులాంటి వస్తువు తప్ప మరెలాంటి విలువైన వస్తువు లేదు" అని అన్నది. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని "అయితే నువ్వు మళ్ళీ రిఫా దగ్గరికి పోవాలనుకుంటున్నావా? కాని నువ్వు అబ్దుర్రహ్మాన్‌ని, అబ్దుర్రహ్మాన్ నిన్ను ఆస్వాదించనంతవరకు ఇది సాధ్యం కాదు" అని అన్నారు.

ఆ సమయంలో హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉన్నారు. హజ్రత్ ఖాలిద్ బిన్ సయీద్ బిన్ ఆస్ (రజి) లోపల రావడానికి అనుమతి కోసం ఎదురు చూడసాగారు. తర్వాత ఖాలిద్ బిన్ సయీద్ బిన్ ఆస్ (రజి) హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరకి వచ్చి "వింటున్నారా ఈవిడగారు దైవప్రవక్త(సల్లం)తో ఎలాంటి విషయం బిగ్గరగా మాట్లాడుతున్నదో (దైవప్రవక్త ముందు ఇలా సిగ్గు విడిచి మాట్లాడుతుంటే ఆమెను మీరు ఎందుకు వారించరు?)" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 52వ ప్రకరణం - అష్షహాదాత్, 3వ అధ్యాయం - షహాదతిల్ ముఖ్తబీ]

909. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒక వ్యక్తి తన భార్యకు (మూడుసార్లు) విడాకులిస్తే ఆమె మరొక వ్యక్తిని వివాహమాడింది. కాని అతను కూడా విడాకులివ్వడంతో ఈ విషయాన్ని కొందరు దైవప్రవక్త (సల్లం) దృష్టికి తెచ్చి "ఆ స్త్రీ తన మొదటి భర్తను తిరిగి వివాహమాడటం ధర్మసమ్మత మేనా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "కాదు ఆమె మొదటి భర్తలా ఈ భర్త కూడా ఆమెను అనుభవించనంతవరకు ఆమె తిరిగి ఆయన్ని వివాహమాడటం ధర్మసమ్మతం కాదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 4వ అధ్యాయం - మన్ అజాజ తలాఖస్సలాస్]

## 17వ అధ్యాయం - సంభోగానికి ముందు దైవాన్ని ఇలా వేడుకోవాలి

910. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "భార్యతో సంభోగం జరిపే ముందు బిస్మిల్లాహి అల్లాహుమ్మ జన్నిబ్ నష్షయితాన వ జన్నిబిష్షయితాన మా రజఖ్తనా. (దేవుని పేరుతో. దేవా! మమ్మల్ని షైతాన్ కీడు నుండి రక్షించు, నీవు మాకు ప్రసాదించే సంతానం దగ్గరికి షైతాన్ రాకుండా వాడ్ని దూరంగా ఉంచు) అని వేడుకోవాలి. ఇలా వేడుకుంటే అప్పుడు విధివ్రాత ప్రకారం ఆమె గర్భం దాల్చుతుంది. ఆ తర్వాత సంతానం కలిగితే, అలాంటి సంతానానికి షైతాన్ ఎన్నడూ కీడు తలపెట్టలేడు".

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 66వ అధ్యాయం - మాయఖూలు ర్రజ్లు ఇజా అతా అహ్లహూ]

## 18వ అధ్యాయం - సంభోగం ఎలా జరిపినా ధర్మసమ్మతమే

911. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- భార్యతో వెనుక నుండి సంభోగిస్తే పిల్లలు అవిటివారుగా పుడ్తారని యూదులు అంటుండేవారు. దానికి సమాధానంగా (దివ్యఖుర్ఆన్‌లో) ఈ సూక్తి అవతరించింది. "మీ స్త్రీలు మీకు పంటపొలాలు లాంటివారు. మీ పొలాల్లోకి మీరు తలచుకున్న విధంగా ప్రవేశించవచ్చు"★ (2:223)

[సహీహ్ బుఖారీ: 65వ ప్రకరణం - తఫ్సీర్, 2 : బఖరా, 39వ అధ్యాయం - నిసాఅకుమ్ హర్సుల్లకుమ్]

---

★ దేవుడు స్త్రీని ప్రకృతిపరంగా పురుషుని కోసం విలాస వస్తువుగా సృష్టించలేదు. ఆయన భార్యాభర్తల అనుబంధాన్ని రైతుకు, వ్యవసాయ క్షేత్రానికున్న సంబంధంతో పోల్చాడు. రైతు తన పొలానికి కేవలం వినోదం, షికార్ల కోసం గాక పంటను పండించడానికి వెళ్తాడు. అందువల్ల మానవ సంతతి రైతు కూడా తన మానవతా సేద్యభూమికి మానవ సంతతిని ఉత్పత్తి చేయడానికి వెళ్ళాలి. దైవధర్మం మీరు మీ పొలంలో వ్యవసాయం ఏ విధంగా చేస్తున్నారనే విషయాన్ని చర్చించదు. అది మీరు మీ సేద్యభూమికే వెళ్ళండని, దాని ద్వారా (మానవతా) పంటను పండించమని మాత్రమే మనల్ని కోరుతుంది.

## 19వ అధ్యాయం - స్త్రీ తన భర్త కోరికను నిరాకరించరాదు

912. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా సెలవిచ్చారు:- "స్త్రీ తన భర్త పడక వదిలి అతని నుండి వేరయి రాత్రి గడిపితే, ఆమె అతని దగ్గరకు తిరిగి రానంతవరకు దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు."

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 85వ అధ్యాయం - ఇజాబాతతిల్ మరాతు ముహాజిరతన్ ఫరాష జౌజిహా]

## 21వ అధ్యాయం - స్ఖలన సమయంలో వీర్యాన్ని బయట పడేయటం గురించి

913. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలిసి 'బనీముస్తలిఖ్'తో యుద్ధానికై బయలుదేరాము. (విజయం సాధించిన తరువాత) యుద్ధంలో కొందరు అరబ్బు స్త్రీలు మా చేతికి యుద్ధ ఖైదీలుగా చిక్కారు. అప్పుడు మాలో తీవ్రమైన స్త్రీ వాంఛ కలిగింది. ఇంతకు ముందు నుండే మా భార్యలకు దూరంగా ఉండటం మాకు చాలా బాధగా ఉండేది. అందుచేత మేమా సమయంలో వారితో వీర్యం లోనికి పోకుండా సంభోగించాలనుకున్నాము. కాని దైవప్రవక్త(సల్లం) మా మధ్య ఉన్నారు కదా, ఆయన అనుమతి లేకుండా ఈ పని చేయడం బాగుండదని భావించి దాన్ని గురించి ఆయన్ని సంప్రదించాము. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ఇలా అన్నారు; "మీరలాంటి వీర్యరహిత సంభోగానికి పాల్పడకపోతే వచ్చే నష్టమేమిటి? విధి వ్రాత ప్రకారం ప్రళయం దాకా పుట్టవలసిన ఆత్మలు ఎలాగూ పుట్టి తీరుతాయి. (మీ ఈ నిరోధక చర్యల వల్ల మానవోత్పత్తి ఆగిపోయే ప్రసక్తే లేదు)".

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజీ, 32వ అధ్యాయం - గజ్వా బనీ ముస్తలిఖ్]

914. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- కొందరు మహిళా ఖైదీలు మా చేతికి చిక్కినపుడు మేము వారితో వీర్యరహిత సంభోగం చేయదలచుకున్నాము. కాని దీన్ని గురించి (అలా చేయవచ్చో లేదో తెలుసుకోవడానికి) మేము దైవప్రవక్త(సల్లం)ను సంప్రదించాము. అది విని దైవప్రవక్త(సల్లం) 'ఇలా మీరు చేస్తూనే ఉంటారు' అని మూడుసార్లు అన్నారు. ఆ తర్వాత "మీరు ఏం చేసినా సరే విధివ్రాత ప్రకారం ప్రళయం వరకూ పుట్టవలసిన జీవులు ఎలాగూ పుట్టి తీరుతారు"అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 96వ అధ్యాయం - అజల్]

915. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- ఖుర్ఆన్ అవతరిస్తున్న కాలంలో మేము వీర్యరహిత సంభోగం చేస్తుండే వాళ్ళము. (దేవుడు ఈ పనిని నిషేధించదలచుకుంటే నిషేధించి ఉండేవాడు కాని అలా చేయలేదు).

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 96వ అధ్యాయం - అజల్]

---

★ స్ఖలన సమయంలో వీర్యాన్ని బయట పడేయటాన్ని 'అజల్' అంటారు. పై ఉల్లేఖనాలలో 'అజల్' చేయడానికి అనివార్య పరిస్థితిలో అనుమతి ఉన్నప్పటికీ దాన్ని అసహ్యకరమైన చేష్టగానే పరిగణించటం జరిగింది. దైవప్రవక్త(సల్లం) ఈ చేష్టపై తన అయిష్టత వ్యక్తపరుస్తూ "ఇలా మీరు చేస్తూ ఉన్నప్పటికీ, పుట్టవలసిన వాడు ఎలాగూ పుట్టి తీరుతాడు" అని అన్నారు.

# స్తన్య సంబంధిత ప్రకరణం

## 1వ అధ్యాయం - స్తన్య సంబంధం వల్ల కూడా రక్త సంబంధం వలె బంధుత్వం ఏర్పడుతుంది

916. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ రోజు దైవప్రవక్త(సల్లం) నా దగ్గర (ఇంట్లో) ఉన్నప్పుడు బయట నుంచి ఒక వ్యక్తి మాటలు విన్పించాయి. అతను హజ్రత్ హఫ్సా (రజి) ఇంట్లో ప్రవేశించడానికి ఆమె అనుమతి కోరుతున్నారు. అప్పుడు నేను దైవప్రవక్త(సల్లం)తో "దైవప్రవక్తా! బహుశా ఆయన హజ్రత్ హఫ్సా(రజి) గారి స్తన్య సంబంధపు పినతండ్రి కావచ్చనుకుంటా. ఆయన మీ ఇంట్లోకి (అంటే హఫ్సా ఇంట్లోకి) రావడానికి అనుమతి కోరుతున్నారు" అని అన్నాను. దానికి దైవప్రవక్త(సల్లం) "(ఔనౌను) ఈయన ఫలానా వ్యక్తి హఫ్సా(రజి)కు స్తన్య సంబంధపు పినతండ్రి అవుతాడు" అని అన్నారు. అప్పుడు నేను "అయితే నాకు స్తన్య సంబంధపు పినతండ్రి అయిన ఫలానా వ్యక్తి బ్రతికి ఉంటే ఆయన కూడా నా ముందుకు (పరదా లేకుండా) రావచ్చా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త సమాధానమిస్తూ "రావచ్చు. అనువంశిక బంధుత్వం వల్ల ప్రత్యేక బంధువులు ఎలా వివాహ నిషిద్ధులు (మహ్రం) అవుతారో అలాగే స్తన్య సంబంధం వల్ల ఏర్పడిన బంధువులు కూడా వివాహ నిషిద్ధులు (మహ్రం) అవుతారు" అని తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 52వ ప్రకరణం - షహాదాత్, 7వ అధ్యాయం - అష్షహాదతి అలల్ అన్సాబి వర్రజాయి]

917. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ రోజు అబుల్ ఖయీస్ సోదరుడగు అఫ్లహ్ (రజి) మా ఇంట్లోకి రావడానికి నా అనుమతి కోరారు. ఇది పరదా ఆదేశం అవతరించిన నాటి సంగతి. అందువల్ల నేను దైవప్రవక్త(సల్లం) నుండి అనుమతి తీసుకోకుండా ఆయన్ని లోపలికి రావడానికి అనుమతించకూడదని భావించాను. నాకు స్తన్యం ఇచ్చిన వారు ఆయన సోదరుడు అబుల్ ఖయీస్ కాదు; అబుల్ ఖయీస్ భార్య మాత్రమే ఇచ్చింది (అంటే స్తన్య బంధుత్వం అబుల్ ఖయీస్ వంశం వల్ల కాకుండా ఆయన భార్య వల్ల ఏర్పడింది) అన్నాను. ఆ తరువాత కాస్సేపటికి దైవప్రవక్త (సల్లం) రానే వచ్చారు. అప్పుడు నేనీ విషయాన్ని ఆయన దృష్టికి తెస్తూ "దైవప్రవక్తా! అబుల్ ఖయీస్ సోదరుడు అఫ్లహ్ ఇంట్లోకి రావడానికి నన్ను అనుమతి అడిగాడు, కాని మీ నుండి అనుమతి తీసుకోనంత వరకు నేను అనుమతి ఇవ్వలేనన్నాను అతనితో" అని అన్నాను.

దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "నీ పినతండ్రిని లోపలికి రావడానికి అనుమతించకుండా నీకు ఏ విషయం నిరోధించింది?" అని అన్నారు. దానికి నేను "దైవప్రవక్తా! నాకా పురుషుడు పాలు త్రాగించలేదు. ఆయన భార్య మాత్రమే నాకు పాలు త్రాగించింది" అని అన్నాను. అప్పుడు దైవప్రవక్త (చిరుకోపంతో) "నీ చేతులు మట్టిలో కలిసిపోను! ఆయన్ని రావటానికి అనుమతించు. ఆయన నీకు పినతండ్రి అవుతారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 33 - అహ్జాబ్ సూరా - 9వ అధ్యాయం - ఇన్ తుబ్దూ]

918. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ అఫ్లహ్ లోపలికి రావడానికి అనుమతి అడిగితే నేనాయనకు అనుమతి ఇవ్వలేదు. అప్పుడాయన "ఏమిటి, నీవు నా ముందు కూడా పరదా పాటిస్తున్నావా?! నేను నీ చిన్నాయనమ్మా!!" అని అన్నారు. నేను 'ఎలా!' అని అడిగాను. "నీకు నా సోదరుడి భార్య స్తన్యమిచ్చింది. ఆమెలో ఆ పాలు నా సోదరుడి వల్లనే పడ్డాయి" అన్నారు ఆయన. ఆ తరువాత నేను దీన్ని గురించి దైవప్రవక్త(స)ను అడిగితే "అఫ్లహ్ చెప్పింది నిజమే. ఆయన్ని లోపలికి రావడానికి అనుమతించు" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 52వ ప్రకరణం - షహాదాత్, 7వ అధ్యాయం - అష్షహాదతి అలల్ అన్సాబి వర్రిజా అల్ ముస్తఫైజ్]

## 3వ అధ్యాయం - స్తన్య సంబంధ సోదరుని కుమార్తెను వివాహమాడటం నిషిద్ధం

919. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (స) హజ్రత్ హమ్జా (రజి) కుమార్తె గురించి మాట్లాడుతూ "ఆమెను నేను వివాహమాడటం ధర్మసమ్మతం కాదు. ఆమె నా స్తన్య సంబంధ సోదరుని కుమార్తె. స్తన్య సంబంధం వల్ల (ఒకే స్త్రీ పాలు త్రాగిన) వారంతా బంధువులయిపోతారు. అనువంశిక బంధుత్వం వల్ల ఏ విధంగా నిషేధం ఏర్పడుతుందో వారి మధ్య కూడా పరస్పర వివాహం నిషిద్ధమవుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ: 52వ ప్రకరణం - షహాదాత్, 7వ అధ్యాయం - అష్షహాదతి అలల్ అన్సాబివర్రిజా అల్ ముస్తఫైజ్]

## 4వ అధ్యాయం - భార్యకు మొదటి భర్త వల్ల కలిగిన కుమార్తెను, భార్య సోదరీని వివాహమాడటం నిషిద్ధం

920. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె హబీబా (రజి) కథనం:- నేనొకరోజు దైవప్రవక్త(స)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! (నా సోదరి) అబూ సుఫ్యాన్ కూతురంటే మీ కిష్టమేనా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త(స) "ఎందుకు, అయితే నన్నేం చేయమంటావు?" అని ప్రశ్నించారు. "ఏం చేయడమేమిటి; మీరామెను పెళ్ళి చేసుకోండి" అన్నాను నేను. "అయితే నేనామెను చేసుకోవడం నీ కిష్టమేనా?" అడిగారు దైవప్రవక్త(స). "నేనొక్క దాన్నేనా మీకు భార్యగా ఉన్నది? ఇంకెవరూ లేరా? కాకపోతే మీ భార్యలలో నాతో పాటు నా చెల్లెలు కూడా ఉంటే బాగుంటుందని భావిస్తున్నాను" అన్నాను నేను.

దైవప్రవక్త(స) ఈ మాట విని "నేనామెను చేసుకోవడం ధర్మసమ్మతం (హలాల్) కాదు" అని అన్నారు. "మీరు మరొక స్త్రీని చేసుకోవడానికి వివాహ సందేశం పంపారని విన్నాను" అన్నానేను.

"ఉమ్మె సల్మా (రజి) కుమార్తె దుర్రను గురించేనా నువ్వు చెబుతున్నది?" అడిగారు ఆయన. నేను 'ఔనండీ' అన్నాను. "ఆమె (నా భార్య మాజీ భర్త వల్ల కలిగిన కుమార్తె కాకుండా ఉన్నా సరే నేనామెను చేసుకోవడం ధర్మసమ్మతం కాదు. ఎందుకంటే, నాకు, ఆమె నాన్నకు సౌబియా (రజి) పాలు పట్టింది. ( ఈ విధంగా ఆమె నాకు స్తన్య సంబంధమైన కూతురు వరసవుతుంది) మీరిక ముందు మీ (మాజీ భర్తల వల్ల మీకు కలిగిన) కుమార్తెలు, సోదరీలను గురించి నా ముందు (వివాహ) ప్రస్తావన తీసుకురాకండి" అన్నారు దైవప్రవక్త(స).

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 25వ అధ్యాయం - వరబాయి బుకుముల్లతి ఫీ హుజూరికుమ్]

## 8వ అధ్యాయం - ఆకలి తీర్చడానికి పట్టే పాల వల్లనే స్తన్య సంబంధిత వరస ఏర్పడుతుంది

921. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఓసారి నా దగ్గరికి (ఇంటికి) వచ్చినప్పుడు ఒకతను నా దగ్గర కూర్చొని ఉన్నాడు. దైవప్రవక్త(స) అతడ్ని చూసి "ఆయిషా ఇతనెవరూ?" అని అడిగారు. దానికి నేను "ఇతను నా స్తన్య సంబంధ సోదరుడు" అని చెప్పాను. అప్పుడు దైవప్రవక్త(స) "ఆయిషా నిజంగా ఎవరు సోదరుడో సరిగా పరికించి చూసుకోవాలి. ఎందుకంటే పసితనంలో ఆకలి తీర్చడానికి పట్టే పాల వల్ల మాత్రమే స్తన్య సంబంధిత వరస ఏర్పడుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 52వ ప్రకరణం - షహాదాత్, 7వ అధ్యాయం - అష్షహాదతి అలల్ అన్సాబి వర్రజా అల్ ముస్తఫైజ్]

## 10వ అధ్యాయం - భార్య లేక బానిస కలిగి ఉన్న వాడిదే సంతానమవుతుంది

922. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి)కు, హజ్రత్ అబ్ద్ బిన్ జమా (రజి)కు మధ్య ఒక బాలుని విషయంలో తగాదా వచ్చింది. అప్పుడు హజ్రత్ సాద్ (రజి) దైవప్రవక్త(స) ముందు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! ఈ బాలుడు నా సోదరుడు ఉత్బాబిన్ అబీ వఖాస్ గారి కుమారుడు. ఈ పిల్లవాడు తన కొడుకని ఆయన స్వయంగా నా ముందు అంగీకరించాడు. కావాలంటే మీరు ఈ బాలుడ్ని (నా సోదరుని రూపురేఖలతో) పోల్చి చూడండి" అని అన్నారు.

ఆ తరువాత అబ్ద్ బిన్ జమా (రజి) మాట్లాడుతూ "దైవప్రవక్తా! ఈ బాలుడు నాకు తమ్ముడవుతాడు; నా తండ్రి పడకపై ఆయన దాసీ కడుపున పుట్టాడు" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త(స) సాద్ చెప్పిన సాక్ష్యం ప్రకారం చూస్తే ఆ బాలుడు అచ్చం ఉత్బాను పోలి ఉన్నట్లు కన్పించాడు.

అయినప్పటికీ దైవప్రవక్త(స) (సాద్‌కు వ్యతిరేకంగా తీర్పు ఇస్తూ "అబ్ద్! ఇతను నీవాడు(నీ తమ్ముడే). (చట్టం ప్రకారం) ఎవరి భార్య లేక దాసీ పడకపై సంతానం జన్మిస్తుందో అది అతని సంతానమే అవుతుంది. వ్యభిచారికి మిగిలేది రాళ్ళే (అంటే రాళ్ళ శిక్ష)" అని అన్నారు. ఆ తరువాత ఆయన (తన భార్య) హజ్రత్ సౌదా (రజి)ని సంబోధిస్తూ "సౌదా బిన్తె జమా! ఈ బాలుని ముందు నువ్వు పరదా పాటించు" అని చెప్పారు. అందువల్ల హజ్రత్ సౌదా(రజి) ఆనాటి నుండి మరెన్నడూ అతని ముందు (పరదా లేకుండా) రాలేదు.

[సహీహ్. బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 100వ అధ్యాయం- షరాయిల్ మమ్లూకు మినల్ హరబి]

923. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "ఎవరి పడకపై సంతానం జన్మిస్తుందో అది అతని సంతానమే అవుతుంది."★

[సహీహ్ బుఖారీ : 85వ ప్రకరణం - ఫరాయెజ్, 18వ అధ్యాయం - అల్ వలదిల్ ఫిరాషి హుర్రతన్ కానత్ అవామా]

---

★ అరబ్బులో 'పడక' (ఫిరాష్) అనే పదం సాధారణంగా మగవానితో సమాగమం జరిపిన స్త్రీని ఉద్దేశించి చెప్పబడుతుంది. అంటే భార్య లేక చట్ట బద్ధంగా సంక్రమించిన బానిసరాలు అని భావం. - (అనువాదకుడు)

## 11వ అధ్యాయం - పిల్లల సంబంధం విషయంలో శరీరాకృతిని బట్టి నిర్ణయం తీసుకోవడం

924. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒక రోజు దైవప్రవక్త (స) అత్యంత సంతోషంతో నా దగ్గరకు వచ్చి ఇలా అన్నారు - "ఆయిషా! ఈ సంగతి నీకు తెలుసా? ముజజ్జజ్ ముద్లిజీ★ వచ్చినప్పుడు ఉసామా (రజి), జైద్ (రజి)లు ఇద్దరూ ఒకే దుప్పటి కప్పుకొని పడుకొని ఉన్నారు. వారిద్దరి ముఖాలు దుప్పటిలో కప్పబడి ఉన్నాయి. కాని కాళ్ళు మాత్రం బయట ఉన్నాయి. ఆ స్థితిలో వాళ్ళను చూసి 'వీరిద్దరి కాళ్ళు చూస్తుంటే ఒకరి కాళ్ళు మరొకరి నుండి వచ్చినట్లు కన్పిస్తున్నాయి' అని అన్నాడు".

[సహీహ్ బుఖారీ : 85వ ప్రకరణం - ఫరాయెజ్, 31వ అధ్యాయం - అల్‌ఖాయెఫ్]

## 12వ అధ్యాయం - పెళ్ళయిన పిదప పడుచు భార్య దగ్గర ఎన్ని రోజులు, పునర్వివాహిత దగ్గర ఎన్ని రోజులు ఉండాలి

925. హజ్రత్ అనస్ (రజి) కథనం:- 'ఎవరైనా పునర్వివాహితురాలైన భార్య ఉండగా కన్యను చేసుకుంటే ఆ పడచు భార్య దగ్గర అతను ఏడు రోజులు గడిపి ఆ తర్వాత భార్యలందరి మధ్య సమానంగా వంతులవారీని పాటించాలి. ఒకవేళ కన్య అయిన భార్య ఉండగా, వితంతువునో లేక విడాకులు పొందిన స్త్రీనో చేసుకుంటే, ఆ భార్య దగ్గర మూడురోజులు గడిపి ఆ తర్వాత భార్యల నడుమ సమానంగా వంతుల వారీని పాటించాలి. ఇది ప్రవక్త సంప్రదాయం.

[సహీహ్ బుఖారీ: 67వ ప్రకరణం - నికాహ్, 101వ అధ్యాయం - ఇజా తజవ్వజుస్సయ్యిబ్ అలల్ బాకిర్]

## 13వ అధ్యాయం - ఒక్కొక్క భార్యకు ఒక్కొక్క రోజు (పగలు, రాత్రి) కేటాయించాలి

926. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ప్రారంభంలో నేను తమను తాము దైవప్రవక్త (సల్లం)కు కానుకగా సమర్పించుకునే స్త్రీలను అసహ్యించుకుంటూ అది సిగ్గు చేటయిన విషయమని భావించేదాన్ని. స్త్రీ ఈ విధంగా తనను తాను (పురుషునికి) కానుకగా సమర్పించుకోవడం సమంజసమేనా అని ఆలోచించేదాన్ని. అయితే ఆ తర్వాత దేవుడు ఈ సూక్తిని అవతరింపజేశాడు - "(ప్రవక్తా!) నీ భార్యలలో నీ కిష్టమయిన వారిని నీతో పాటు ఉంచుకోవడానికి, నీ కిష్టంలేని వారిని నీ నుండి వేరు చేయడానికి నీకు పూర్తి అధికారం ఇవ్వబడుతోంది. అలాగే వేరు చేసిన భార్యలను తిరిగి నీ దగ్గరకు రప్పించుకోవడానికి కూడా నీకు అధికారం ఉంది. నీవు ఈ విధంగా చేయడంలో ఎలాంటి తప్పులేదు." (అహ్‌జాబ్ : 51)

ఈ సూక్తి అవతరించినపుడు నేను దైవప్రవక్త(సల్లం)తో "నేను గమనిస్తున్నాను, మీరు కోరుకున్నదల్లా మీ ప్రభువు వెంటనే ఆమోదిస్తున్నాడు" అని అన్నాను.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 33 - అహ్జాబ్ సూరా, 7వ అధ్యాయం - తుర్జీమన్తషా]

---

★ ఇతను అరేబియాలో ఓ సుప్రసిద్ధ అవయవ సాముద్రికుడు.

## 14వ అధ్యాయం - స్త్రీ తన వంతును తన సవతికి కానుకగా సమర్పించుకోవచ్చు

927. హజ్రత్ అతా (రహ్మాలై) కథనం:- మేము 'సరిఫ్' అనే ప్రాంతంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)తో కలిసి హజ్రత్ మైమూన (రజి) గారి జనాజా (అంత్యక్రియలు)లో పాల్గొన్నాము. ఆ సందర్భంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇలా అన్నారు: "ఈమె దైవప్రవక్త (సల్లం) గారి సతీమణి. కనుక మీరు ఈమె శవపేటికను ఎత్తుకొని మోసేటప్పుడు ఎంతో గౌరవ మర్యాదలతో వ్యవహరించాలి. దాన్ని అటూ ఇటూ ఊపకుండా జాగ్రత్తగా ఎత్తుకొని నిదానంగా మోసుకెళ్ళాలి". దైవప్రవక్త(సల్లం)కు ఏకకాలంలో తొమ్మిది మంది భార్యలు ఉన్నారు, వారిలో ఎనిమిది మందికి ఆయన వంతుల్ని నిర్ణయించారు. ఒక భార్య (హజ్రత్ సౌదా-రజి)కు వంతు నిర్ణయించలేదు. (కారణం హజ్రత్ సౌదా(రజి) వయస్సు మీద పడటం వల్ల తన వంతును హజ్రత్ ఆయిషా (రజి)కు కానుకగా ఇచ్చేశారు.)

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 4వ అధ్యాయం - కస్రతున్నిసా]

## 15వ అధ్యాయం - ధర్మపరాయణురాలైన స్త్రీని వివాహమాడటమే అత్యంత శ్రేయస్కరం

928. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "స్త్రీని సాధారణంగా నాలుగు విషయాల ప్రాతిపదికగా వివాహమాడుతారు. (1) ఆమె సిరి సంపదలు చూసి చేసుకుంటారు. (2) ఆమె కుటుంబం, వంశాలను చూసి చేసుకుంటారు. (3) ఆమె అందచందాలు చూసి చేసుకుంటారు. (4) ఆమె ధర్మపరాయణతను చూసి చేసుకుంటారు. కనుక మీరు ధర్మపరాయణురాలైన స్త్రీ ద్వారా సాఫల్యం పొందండి. లేకుంటే మీ చేతులకు మట్టి అంటుకుంటుంది. (చివరికి మీకు పశ్చాత్తాపమే మిగులుతుంది)."

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 15వ అధ్యాయం - అల్ అక్ఫాయి ఫిద్దీన్]

## 16వ అధ్యాయం - కన్యను చేసుకోవడమే మంచిది

929. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా(రజి) కథనం:- నేను వివాహం చేసుకున్నప్పుడు దైవప్రవక్త(సల్లం) "నీవు ఎలాంటి స్త్రీని వివాహమాడావు?" అని అడిగారు. నేను 'పునర్వివాహితను' చేసుకున్నానని చెప్పాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "కన్యను చేసుకోవడంలో నీకే విషయం అడ్డు వచ్చింది? కన్యను చేసుకుంటే ఆమెతో నీవు ఆడుకుంటూ ఆనందం అనుభవించవచ్చు కదా!" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకులలో ఒకరు ఈ హదీసుని గురించి అమ్ర్ బిన్ దీనార్ (రహ్మాలై) ముందు ప్రస్తావించినపుడు ఆయన ఇలా అన్నారు:- నేను హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) నోట దైవప్రవక్త (సల్లం) అన్న ఈ మాటలు విన్నాను. అవి ఇలా ఉన్నాయి - "నీవు కన్యను ఎందుకు చేసుకోలేదు? కన్యను చేసుకొని ఉంటే ఆమెతో నీవు సరదాగా ఆడుకుంటూ ఆనందం అనుభవించవచ్చు కదా!"

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 10వ అధ్యాయం - తజ్వీజుస్సయ్యిబాత్]

930. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:-మా నాన్నగారు చనిపోతూ ఏడుగురు లేక తొమ్మిది మంది ఆడపిల్లలను వదిలివెళ్ళారు. అందువల్ల నేను పునర్వివాహితను వివాహమాడాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "జాబిర్! నువ్వు పెళ్ళి చేసుకున్నావా?" అని అడిగారు. నేను చేసుకున్నానని చెప్పాను. "అయితే కన్యను చేసుకున్నావా? లేక పునర్వివాహితను చేసుకున్నావా?" అని అడిగారు ఆయన మళ్ళీ. నేను పునర్వివాహితను చేసుకున్నానని చెప్పాను. "కన్యను ఎందుకు చేసుకోలేదు? కన్యను చేసుకుంటే నీవు ఆమెతో, ఆమె నీతో ఆడుకుంటూ, నీవు ఆమెను, ఆమె నిన్ను నవ్విస్తూ ఆనందంగా గడపవచ్చు కదా!" అన్నారు దైవప్రవక్త(సల్లం). "మా నాన్న అబ్దుల్లా (రజి)గారు చనిపోతూ (చిన్న చిన్న) ఆడపిల్లలను వదలి వెళ్ళారు. నేను ఆయనలా అనుభవం లేని పడుచు పిల్లను తీసుకురావడం బాగుండదని భావించాను. అందువల్ల ఈ పిల్లలను (అంటే నా చెల్లెళ్ళను) పెంచి పోషిస్తూ తగిన విద్యాబుద్ధులు గరపగలిగే స్త్రీని పెళ్ళి చేసుకున్నాను" అని వివరించాను నేను. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని "దేవుడు నీకు శుభం కలిగించుగాక" అన్నారు. లేక ["నీకు మేలు చేకూర్చుగాక"] "నీవు చాలా మంచి పని చేశావు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 69వ ప్రకరణం - అన్నుఫ్ఖాత్, 12వ అధ్యాయం - ఔనుల్ మరాతి జౌజహా ఫీవలదిహీ]

931. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త(సల్లం)తో పాటు ఒక దండయాత్రలో పాల్గొన్నాను. యుద్ధం నుండి తిరిగి వస్తున్నప్పుడు నేను నిదానంగా నడిచే ఒక ఒంటెపై ముందుగానే బయలుదేరాను. (కొంచెం దూరం పోయేటప్పటికి) నా వెనకాల ఒక రౌతు వస్తూ నన్ను కలుసుకున్నాడు. నేను వెనక్కి తిరిగి చూసి ఆశ్చర్యచకితుణ్ణయ్యాను. నా ముందు దైవప్రవక్త (సల్లం) నిలబడివున్నారు. ఆయన నన్ను చూడగానే "నువ్వు అంత తొందరగా ఎందుకు బయలుదేరావు?" అని అడిగారు. "నేను కొత్తగా పెళ్ళి చేసుకున్నానండీ!" అన్నాను నేను. "అయితే కన్యను చేసుకున్నావా లేక పునర్వివాహితను చేసుకున్నావా?" అని అడిగారు ఆయన. నేను పునర్వివాహితను చేసుకున్నానని చెప్పాను. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "నీవు కన్యను ఎందుకు చేసుకోలేదు? కన్యను చేసుకుంటే నీవు ఆమెతో, ఆమె నీతో ఆడుకుంటూ ఆనందంగా గడపవచ్చు కదా!" అని అన్నారు.

చివరికి మేము మదీనా చేరుకున్నాము. మేము ఎవరి ఇండ్లకు వారు వెళ్ళిపోబోతుంటే దైవప్రవక్త(సల్లం) మమ్మల్ని పిలిచి ఇలా అన్నారు; "ఆగండి. (అప్పుడే వెళ్ళ వద్దు) రాత్రి బాగా చీకటి పడిన తర్వాత అంటే ఇషా (నమాజు) వేళ అయిన తర్వాత ఇండ్లకు వెళ్ళండి. ఇలా ఆలస్యంగా వెళ్తే శిరోజాలు విరబూసుకొని ఉన్న స్త్రీలు చక్కగా తల దువ్వుకొని జడవేసుకుంటారు. భర్తలు దగ్గరలేని కారణంగా కొందరు స్త్రీలు నాభి క్రింది రోమాలను వదిలేసి ఉంటే వాటిని శుభ్రంగా తొలగించుకుంటారు".

ఈ హదీసులోనే దైవప్రవక్త(సల్లం) హజ్రత్ జాబిర్ (రజి)తో ఇలా అన్నారు:- "జాబిర్! ఇప్పుడిక నీవు రమించి పిల్లల్ని పుట్టించాలి."

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 121వ అధ్యాయం - తలబుల్ వలద్]

932. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో పాటు ఒక దండయాత్రలో పాల్గొన్నాను. (తిరిగి వస్తున్నప్పుడు) నా ఒంటె బాగా అలసిపోయింది. అందువల్ల నేను వెనకబడిపోయాను. దైవప్రవక్త(సల్లం) నా దగ్గరికి వచ్చి "జాబిర్!" అని పిలిచారు. నేను "ఆ" అన్నాను. ఆయన "ఏమిటీ

పరిస్థితి?" అని అడిగారు. "నా ఒంటె అలసిపోవడం వల్ల ఆలస్యమయి నేను వెనకబడిపోయాను" అని చెప్పాను నేను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) (ఒంటె నుంచి దిగి) తన దగ్గరున్న వంకర కర్రను నా ఒంటె మెడ మీద వేసి లాగి "ఇక ఎక్కు" అన్నారు. నేనప్పుడు ఎక్కగానే అది వేగం పుంజుకుంది. దైవప్రవక్త(ఒంటె) కంటే ముందుకు పోకుండా ఉండేందుకు నేను దాన్ని నిరోధించేవాడ్ని.

తర్వాత దైవప్రవక్త(సల్లం) మాట్లాడుతూ "నువ్వు పెళ్ళి చేసుకున్నావా?" అని అడిగారు. నేను చేసుకున్నానని చెప్పాను. "అయితే కన్యను చేసుకున్నావా? పునర్వివాహితను చేసుకున్నావా?" అని అడిగారు ఆయన. నేను "కన్యను కాదు పునర్వివాహితనే చేసుకున్నానని" చెప్పాను. "కన్యను ఎందుకు చేసుకోలేదు? కన్యను చేసుకుని ఉంటే నీవు ఆమెతో, ఆమె నీతో ఆడుకుంటూ ఆనందంగా గడపవచ్చు కదా!?" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). "కాని నాకు చాలా మంది (పసి వయస్కులయిన) చెల్లెళ్ళు ఉన్నారు. అందువల్ల వాళ్ళను పెంచి పోషిస్తూ, వాళ్ళకు తలదువ్వి జడలు వేస్తూ సరిగా చూసుకునే స్త్రీ అయితే బాగుంటుందని చేసుకున్నాను" అన్నాను నేను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) "సరే ఇప్పుడు నీవు ఇంటికి వెళ్తున్నావుకదా, వెళ్ళి రతి క్రీడ పట్ల ఏ మాత్రం విముఖత చూపరాదు సుమా!" అని హెచ్చరించారు. ఆ తర్వాత "నాకీ ఒంటెను అమ్ముతావా?" అని అడిగారు. నేను అమ్ముతానండీ అన్నాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక ఊఖియా వెండి ధరకు నా ఒంటెను కొన్నారు. ఆ తర్వాత ఆయన నాకంటే ముందే (మదీనా) చేరుకున్నారు. నేను మరుసటి రోజు చేరుకున్నాను. నేను మస్జిదులో ప్రవేశిస్తుంటే దైవప్రవక్త (సల్లం) నాకు ముఖద్వారం దగ్గర కన్పించి "ఇప్పుడు చేరుకున్నావా?" అని అడిగారు. నేను ఔనండీ! అన్నాను. "సరే, ఒంటెను ఇక్కడే కట్టేసి మస్జిదులోకి వెళ్ళి రెండు రకాతులు నమాజు చేసుకో" అన్నారు ఆయన.

నేను లోపలికి వెళ్ళి రెండు రకాతులు నమాజు చేశాను. అంతలో దైవప్రవక్త (సల్లం) హజ్రత్ బిలాల్ (రజి)ని పిలిచి, ఒక ఊఖియా వెండి తూచి నాకివ్వమని చెప్పారు. హజ్రత్ బిలాల్ (రజి) నా కోసం వెండి తూచారు. కొంచెం ఎక్కువే తూచారు. నేను దాన్ని తీసుకొని బయలుదేరాను. అలా నేను వెనక్కి తిరిగానో లేదో "జాబిర్‌ని పిలవండి" అన్నారు దైవప్రవక్త(సల్లం). (నా గుండె గుభేలుమన్నది) దైవప్రవక్త (సల్లం) నా ఒంటెను నాకు తిరిగిస్తారేమోనని భావించాను. ఆ ఒంటె అంటే నాకు అసహ్యం వేసింది. దైవప్రవక్త (సల్లం) నన్ను ఉద్దేశించి "నీ ఒంటెను తీసికెళ్ళు; దాని పైకం కూడా నువ్వే ఉంచుకో" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 34వ అధ్యాయం - షరాయిద్దవాబ్]

## 18వ అధ్యాయం - స్త్రీల పట్ల సత్ప్రవర్తన

933. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "స్త్రీ ప్రక్కటెముక లాంటిది. మీరు ఆమెను సరిచేయడానికి ప్రయత్నిస్తే విరిగిపోతుంది. మీరామె ద్వారా ప్రయోజనం పొందదలచుకుంటే ప్రయోజనం పొందండి. ఆమెలో ఉన్న వక్రత మాత్రం అలాగే ఉంటుంది."

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 79వ అధ్యాయం - అల్‌ముదారతి మఅన్నిసా]

934. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "దేవుడ్ని, పరలోకాన్ని విశ్వసిస్తున్నవాడు తన పొరుగువారికి ఏ మాత్రం కష్టం కలిగించకూడదు. "మీరు స్త్రీల పట్ల మృదువుగా వ్యవహరించండి. స్త్రీలు ప్రక్కటెముకలతో సృజించబడ్డారు. ప్రక్కటెముకలలో కూడా అన్నిటికంటే ఎక్కువ వంకరగా ఉండే పై ఎముకతో సృజించబడ్డారు. (1) మీరు దాన్ని సరి చేయడానికి ప్రయత్నిస్తే విరిగిపోతుంది. ఒకవేళ దాన్ని దాని మానాన వదిలేస్తే అది ఎల్లప్పుడూ వంకరగానే ఉంటుంది. అందువల్ల మీరు స్త్రీలతో మంచిగా (మృదువుగా) మసలుకోండి".

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 80వ అధ్యాయం - అల్‌వసాతిన్ బిన్నిసా]

935. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "ప్రపంచంలో ఇస్రాయీల్ సంతతి గనక (యూదులు) లేకుంటే మాంసం కుళ్ళిపోయేది కాదు.(2) హజ్రత్ హవ్వా (అలైహి)యే గనక లేకుంటే ఏ స్త్రీ కూడా తన భర్తకు ద్రోహం తలపెట్టేది కాదు."(3)

**[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 1వ అధ్యాయం - ఖలఖ ఆదమ సలవాతిల్లాహి అలైహి వ జుర్రియ్యాతిహీ]**

---

(1) మొట్టమొదట స్త్రీని తొలిమానవుడు ఆదం (అలైహి) ప్రక్కటెముకల నుండి సృష్టించడం జరిగిందన్న విషయాన్ని ఇది సూచిస్తుంది. స్త్రీని ప్రక్కటెముకతో పోల్చడంలోని ఉద్దేశ్యం, సహజ సిద్ధమైన ఆమె శారీరక మానసిక తత్వానికి, ఆమె స్వాభావిక లక్షణాలకు అనుగుణంగా ఆమె పట్ల నేర్పుతో వ్యవహరించాలన్నదే. ఆమె పట్ల అతికరకుగా ప్రవర్తించకూడదు. అలా అని ఆమెను ఆమె మానాన వదిలిపెట్టడం కూడా మంచిది కాదు. మొత్తం మీద పురుషుల సత్ప్రవర్తన మీదనే స్త్రీల (నైతిక, సామాజిక) వికాసం ఆధారపడి ఉంటుందని ఈ హదీసు తెలియజేస్తోంది. - సంకలనకర్త

(2) 'మాంసం కుళ్ళేది కాదు' అని హదీసులో అనబడింది కదూ! హజ్రత్ ఖతాదా (రజి) ఉల్లేఖనం ప్రకారం బనీ ఇస్రాయీల్ (ఇస్రాయీల్ వంశీయులు) 'సల్వా' మాంసాన్ని పేరాశతో పోగుచేసి పెట్టుకునేవారు. ఇలా చేయరాదని వారించినప్పటికీ వారు మానుకోలేదు. పర్యవసానంగా ఆ మాంసం కుళ్ళిపోయింది. మాంసం కుళ్ళటం అనేది కూడా అప్పటి నుండే మొదలయింది.

(3) ఇక హవ్వా గారి సంగతి. ఆమె గారు హజ్రత్ ఆదం (అలైహిస్సలాం)ని నిషిద్ధ వృక్షం యొక్క పండు తినేందుకు ప్రోత్సహించింది. ఈ 'గుణం' ఆదం సంతతికి కూడా వారసత్వంగా సంక్రమించింది. అంతకు మించి ఇక్కడ 'ద్రోహం' అంటే విపరీతార్థం ఏమీలేదు.

# తలాఖ్ ప్రకరణం

## 1వ అధ్యాయం - భార్యకు బహిష్టు స్థితిలో విడాకులివ్వడం నిషిద్ధం

936. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) కాలంలో నేను నా భార్యకు బహిష్టు స్థితిలో విడాకులిచ్చాను. ఆ విషయంలో (నా తండ్రి) హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను విచారిస్తే ఆయన ఇలా అన్నారు - అబ్దుల్లా (రజి)కు ఆ విడాకుల్ని ఉపసంహరించుకోమని చెప్పేయి. అతని భార్య బహిష్టు ఆగిపోయి పరిశుద్ధం అయ్యేవరకు ఆమెను తన దగ్గర ఆపి ఉంచాలి. తిరిగి ఆమె బహిష్టు అయి, తిరిగి పరిశుద్ధమయిన తర్వాత అతను కావాలనుకుంటే ఆమెను (తన దాంపత్యంలో) ఆపి ఉంచవచ్చు లేదా విడాకులివ్వవచ్చు. అయితే అప్పటిదాకా అతను ఆమెను తాకరాదు. ఇదే విడాకుల గడువు. దీని ప్రకారమే దేవుడు స్త్రీలకు విడాకులివ్వాలని ఆజ్ఞాపించాడు.

[సహీహ్ బుఖారీ: 68వ ప్రకరణం - తలాఖ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి యా అయ్యుహన్న బియ్యు ఇజాతల్లఖ్‌తుమ్]

937. హజ్రత్ యూనుస్ బిన్ జుబైర్ (రహ్మలై) కథనం:- నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)ని బహిష్టు స్థితిలో విడాకులిచ్చేయడం గురించి అడిగితే ఆయన ఇలా అన్నారు - ఉమర్ కొడుకు కూడా తన భార్యకు బహిష్టు స్థితిలో విడాకులిచ్చాడు. దాని గురించి హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్త(సల్లం)ను విచారిస్తే "అబ్దుల్లా బిన్ ఉమర్‌కు విడాకుల్ని ఉపసంహరించుకోమని ఆజ్ఞాపించు" అని చెప్పారు. అంతేకాకుండా ఇద్దత్ (గడువు) ప్రారంభమైనపుడు ఆమెకు తిరిగి విడాకులివ్వాలని ఆయన తెలియజేశారు.

అప్పుడు నేను హజ్రత్ అబ్దుల్లా (రజి)ని "మరి ఆ (బహిష్టులో ఇచ్చిన) విడాకులు విడాకుల క్రిందికి వస్తాయా?" అని అడిగాను. దానికి ఆయన "ఎందుకు రావు? ఒకవేళ ఎవరైనా గత్యంతరం లేని స్థితిలో లేదా బుద్ధి గడ్డి తినడం వల్ల విడాకులిస్తే అవి విడాకులుగా పరిగణించబడవా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 45వ అధ్యాయం - మురాజాతిల్ హాయిజ్]

## 3వ అధ్యాయం - విడాకులిచ్చే ఉద్దేశ్యం లేకుండా ఎవరైనా తన భార్యతో 'నీవు నా కొరకు నిషిద్ధం' అంటే......?

938. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- "ఎవరైనా తన భార్యకు, 'నీవు నా కోసం నిషిద్ధం' అని అంటే అతను పాపపరిహారం (కఫ్ఫారా) చెల్లించుకోవలసి ఉంటుంది. ఆ తర్వాత ఆయన ఈ సూక్తి పఠించారు- "నిస్సందేహంగా దైవప్రవక్త(సల్లం) మీకెంతో ఆదర్శనీయులు'. (దివ్యఖుర్‌ఆన్ -అహ్‌జాబ్:21)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం -66, తహ్రీం సూరా, 1వ అధ్యాయం - యా అయ్యుహన్నబియ్యు లిమ తుహర్రిము మా అహల్లలక]

939. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి) దగ్గర (ఇంట్లో)ఆగి తేనె సేవించేవారు. ఓ రోజు నేను, హజ్రత్ హఫ్సా (రజి) కలసి పరస్పరం కూడ బలుక్కున్నాము. దైవప్రవక్త (సల్లం) మనిద్దరిలో ఎవరి ఇంటికి వచ్చినా "మీ దగ్గర మగాఫీర్ (ఒక విధమైన జిగురు పదార్థం. రుచిలో తియ్యగానే ఉంటుంది. కాని దాని వాసన రోత పుట్టిస్తుంది. ఆ జిగురుపై వాలిన తేనెటీగలు ఉత్పత్తి చేసే తేనెలో కూడా ఆ వాసన ప్రభావం ఉంటుంది.) వాసన వస్తోంది, మీరేమైనా మగాఫీర్ తిన్నారా?" అని అడుగుదాం అని చెప్పుకున్నాం. దాని ప్రకారం దైవప్రవక్త(సల్లం) మా ఇద్దరిలో ఒకరి దగ్గరకు వచ్చినపుడు ఆమె ఈమాటే అన్నది. దైవప్రవక్త(సల్లం) అది విని, "తినలేదు. నేను జైనబ్ (రజి) దగ్గర తేనె సేవించాను. సరే ఇక నుండి నేను ఎన్నటికీ తేనె సేవించను" అని అన్నారు. ఆ సందర్భంలో ఈ సూక్తులు అవతరించాయి.

"ప్రవక్తా! దేవుడు నీ (ముస్లింల) కోసం ధర్మసమ్మతం చేసిన దాన్ని నీవు ఎందుకు నిషేధించుకుంటావు? (ఇలా చేసి) నీవు నీ భార్యలను సంతోషపెట్టదలిచావా? (సరే, జరిగిందేదో జరిగిపోయింది). దేవుడు క్షమాశాలి, దయామయుడు. ఆయన మీ కోసం మీ ప్రమాణాల పరిపూర్తి నుండి బయటపడేందుకు ఒక పద్ధతి నిర్ణయించాడు.* దేవుడు మీ రక్షకుడు. ఆయన సర్వం తెలిసినవాడు, ఎంతో వివేకవంతుడు"

"ప్రవక్త తన భార్యలలో ఒక భార్యతో రహస్యంగా ఒక మాటన్నారు: తర్వాత ఆ రహస్యాన్ని ఆమె (మరొకరి ముందు) బహిర్గతం చేసింది. ఆ సంగతి దేవుడు వెంటనే తన ప్రవక్తకు తెలియజేశాడు. అప్పుడు దైవప్రవక్త (ఆ భార్యకు) ఆ విషయమై కాస్త మందలించారు. మరికాస్త సడలింపుల వైఖరిని ప్రదర్శించారు. ఆ తర్వాత ఈ (రహస్యం బయట పడిన) సంగతి ప్రస్తావించినపుడు ఆమె (ఆశ్చర్యపోయి) "మీకీ సంగతి ఎవరు తెలియజేశారు?" అని అడిగింది. దానికి దైవప్రవక్త "సర్వం ఎరిగినవాడు, బాగా తెలిసినవాడు నాకు తెలియజేశాడు" అని అన్నారు.

"(ప్రవక్త సతీమణులారా!) మీరిద్దరి హృదయాలు గాడి తప్పాయి. కనుక పశ్చాత్తాపంతో దైవాన్ని క్షమాపణ కోరుకోండి (అందులోనే మీ శ్రేయస్సు ఉంది)". (దివ్య ఖుర్ఆన్ -66:1-4)

ఇందులో 'మీరిద్దరూ' అంటే హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ హఫ్సా (రజి) అని అర్థం. రహస్యం అంటే "తినలేదు. నేను జైనబ్ దగ్గర తేనె సేవించాను" అని దైవప్రవక్త (సల్లం) చెప్పిన మాట.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - అత్తలాఖ్, 8వ అధ్యాయం - లిమ తుహర్రిము మా అహల్లల్లాహులక్]

940. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు తేనె, తీపి అంటే ఎంతో ఇష్టం. ఆయన సాధారణంగా అసర్ నమాజు తర్వాత తన భార్యల దగ్గరికి వెళ్తుంటారు. వారిలో ఒకరికి కాస్త సన్నిహితంగా ఉండేవారు. ఓ రోజు ఆయన యధాప్రకారం హజ్రత్ హఫ్సా (రజి) ఇంటికి వెళ్ళారు. అయితే ఆ రోజు ఆయన అక్కడ కొంచెం ఎక్కువ సేపు గడిపారు. అందుచేత నాలో అసూయ కలిగింది. తర్వాత నేను విషయం ఏమిటని విచారిస్తే, హజ్రత్ హఫ్సా(రజి)కు ఆమె తెగకు చెందిన

---

* ప్రమాణ భంగానికి పరిహారంగా పదిమంది పేదలకు రెండు పూటలు (సాధారణ) భోజనం పెట్టాలి. లేదా పదిమంది పేదలకు వస్త్రదానం చేయాలి. లేదా ఒక బానిసకు స్వాతంత్ర్యం ఇవ్వాలి. ఒక వేళ వీటినిచ్చే స్తోమత లేకపోతే మూడు రోజులు ఉపవాసం పాటించాలి.

ఒకావిడ ఓ తోలుతిత్తిలో తేనె పంపిందని తెలిసింది. అందులో కొంత తేనె దైవప్రవక్త (సల్లం)కు ఇచ్చింది. అందువల్ల (ఇక ముందు దైవప్రవక్త తేనె సేవించకుండా ఉండేందుకుగాను) ఈ విషయంలో ఏదో ఒక ఎత్తుగడ వేయాలని నేను నిర్ణయించుకున్నాను.

అలా నిర్ణయానికి వచ్చిన తరువాత నేను హజ్రత్ సౌదా బిన్తె జమా (రజి) ఇంటికి వెళ్ళి "దైవప్రవక్త(సల్లం) నీ దగ్గరకు వచ్చినపుడు, నీకు దగ్గరగా వస్తే ఇలా చెప్పు 'మీరు మగాఫీర్ (ఒక విధమైన తియ్యటి జిగురు) తిన్నారా?' అని అడుగు. ఆయన తప్పకుండా తినలేదంటారు. అప్పుడు నువ్వు 'మరి మీ దగ్గర వస్తున్న ఈ వాసనేమిటి?' అని చెప్పు. అప్పుడాయన 'నాకు హఫ్సా(రజి) తేనె ఇస్తే సేవించాను' అని తప్పకుండా అంటారు. ఆ తర్వాత నీవు ఆయనతో 'తేనెటీగ మకరందాన్ని జుర్రుకోవడానికి బహుశా ఉర్ఫుత్ చెట్టు (మగాఫిర్ అనే జిగురు గల చెట్టు) మీద వాలి ఉంటుంది' అని చెప్పాలి. నేను కూడా ఇలాగే చెబుతాను. సఫియా! నువ్వు కూడా ఇలాగే చెప్పు" అని అన్నాను.

(ఈ విధంగా మేము పథకం చేసుకొని దాన్ని ఆచరణలో పెట్టాము) ఆ తర్వాత హజ్రత్ సౌదా (రజి) (విషయం తెలియజేస్తూ! దైవప్రవక్త (సల్లం) నా ఇంట్లో అడుగుపెట్టగానే నేను నీకు భయపడి నీవు చెప్పమన్న మాటలు చెప్పాలనుకున్నాను అని అన్నది. మొత్తం మీద దైవప్రవక్త(సల్లం) హజ్రత్ సౌదా (రజి) దగ్గరకు వచ్చినపుడు 'దైవప్రవక్తా! మీరు మగాఫిర్ తిన్నారా?' అని అడిగిందామె. దానికి దైవప్రవక్త (సల్లం) 'తినలేద'న్నారు. మరి మీ దగ్గర నాకు వస్తున్న ఈ వాసనేమిటి? అని అడిగిందామె. "హఫ్సా(రజి) నాకు తేనె ఇచ్చింది సేవించడానికి" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). "ఆ తేనెటీగ బహుశా ఉర్ఫుత్ చెట్టు (పువ్వు)ను జుర్రుకొని ఉంటుంది" అని అన్నారు హజ్రత్ సౌదా (రజి).

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) నా దగ్గరకు వస్తే నేను కూడ ఈ మాటలే అన్నాను. (తత్ఫలితంగా ఆయన తన వైఖరి మార్చుకున్నారు.) తర్వాత ఆయన హజ్రత్ హఫ్సా(రజి) ఇంటికి వెళ్ళినపుడు "(దైవప్రవక్తా! మీకు తేనె తెమ్మంటారా?" అని అడిగిందామె. దానికి దైవప్రవక్త (సల్లం) "నాకిప్పుడు దాని అవసరం లేదు" అని అన్నారు.

ఈ సంఘటన జరిగిన తరువాత హజ్రత్ సౌదా (రజి) నాతో మాట్లాడుతూ "అయ్యో! మనం దైవప్రవక్త(సల్లం)ను తేనె సేవించకుండా చేశామే"! అని అన్నది. నేను "ఇక మాట్లాడకు" అన్నాను.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - అత్తలాఖ్, 8వ అధ్యాయం - లిమ తుహర్రిమూ మా అహల్లల్లాహు లక్]

## 4వ అధ్యాయం - విడాకులిచ్చే ఉద్దేశ్యం లేనంతవరకు భార్యకు ఇంట్లో నుండి వెళ్ళిపోయే అధికారం ఇచ్చినంత మాత్రాన అది విడాకుల క్రిందికి రాదు

941. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దేవుడు తన ప్రవక్త(సల్లం)ను 'ఇహపరలోకాల్లో ఏదో ఒక దాన్ని ఎంచుకోవడానికి నీ భార్యలకు అధికారమివ్వు' అని ఆదేశించాడు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) ముందుగా నా దగ్గరికొచ్చి మాట్లాడుతూ "నేను నీతో ఒక మాట అంటాను. కానీ ఈ విషయంలో నీవు తొందరపడి ఏదీ చెయ్యకు. నీ తల్లిదండ్రులను సంప్రదించకుండా నువ్వు ఏ నిర్ణయం తీసుకోకు" అని అన్నారు.

నా తల్లిదండ్రులు దైవప్రవక్త(సల్లం) నుండి విడిపొమ్మని ఎలాంటి పరిస్థితిలోనూ సలహా

ఇవ్వరని ఆయనకు నమ్మకం ఉంది. అందువల్ల ఆయన ఈ విధంగా చెప్పిన తర్వాత దేవుడు ఇలా అన్నాడని ఈ (క్రింది) సూక్తి విన్పించారు:

"ప్రవక్తా! నీ భార్యలతో ఇలా చెప్పెయ్యి - మీరొక వేళ ఇహలోకాన్ని, అందులోని తళుకు బెళుకుల్ని కోరుకుంటుంటే, రండి, నేను మీకు ఎంతో కొంత ఇచ్చి మంచిగా సాగనంపుతాను. దానికి బదులు మీరు దేవుణ్ణి, ఆయన ప్రవక్తను, పరలోక గృహాన్ని కోరుకుంటే ఒక విషయాన్ని గుర్తు పెట్టుకోండి. మీలో సజ్జనుల కోసం దేవుడు గొప్ప పుణ్యఫలాన్ని సిద్ధం చేసి ఉంచాడు."

నేనీ సూక్తి విన్న తర్వాత "ఇందులో నా తల్లి దండ్రుల్ని సలహా అడగవలసినటువంటి ముఖ్య విషయం ఏముందని? నేను దేవుణ్ణి, దైవప్రవక్త(సల్లం)ను, పరలోక గృహాన్ని మాత్రమే కోరుకుంటున్నాను" అని అన్నాను దైవప్రవక్త(సల్లం)తో.

ఆ తర్వాత ప్రవక్త భార్యలందరూ (రజి) నేనిచ్చిన సమాధానమే ఇచ్చారు.

**[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - తఫ్సీర్, 33 - అహ్జాబ్ సూరా, 5వ అధ్యాయం - వ ఇన్ కన]**

942. హజ్రత్ ముఆజ్ (రహ్మలై) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి) యిలా తెలిపారు "(దేవుడు తన ప్రవక్తను ఉద్దేశించి) 'నీ భార్యలలో నీవు కోరుకున్న వారిని నీతో పాటు ఉంచుకోవడానికి, నీవు కోరిన వారిని నీ నుండి వేరు చేయడానికి, నీవు కోరిన వారిని వేరుపరచిన మీదట తిరిగి నీ వద్దకు రప్పించుకోవటానికి నీకు అధికారం ఇవ్వబడుతోంది. ఈ విషయంలో నీపై ఎలాంటి నిందలేదు' అన్న ఆయతును అవతరింపజేశాడు. ఈ సూక్తి అవతరించిన తరువాత దైవప్రవక్త (సల్లం) మాలో ఎవరో ఒక భార్య వంతు వచ్చిన రోజు మరో భార్య దగ్గర ఉండటానికి అనుమతి అడిగేవారు".

హజ్రత్ ముఆజ్ (రహ్మలై) ఇలా అంటున్నారు. నేను హజ్రత్ ఆయిషా (రజి)ను, "అప్పుడు మీరేమని సమాధానమిచ్చారు?" అని అడిగాను. అందుకామె ఇలా అన్నారు. నేను "దైవప్రవక్త (సల్లం)తో 'దైవప్రవక్తా! నాకా అధికారం ఇస్తే, మీ సాంగత్య భాగ్యాన్ని మరొక స్త్రీకి సమర్పించాలని నేను ఎన్నటికీ కోరుకోను' అని అంటుండేదాన్ని".

**[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 33 - అహ్జాబ్ సూరా, 7వ అధ్యాయం - తుర్జీమన్ తషావుమిన్ హున్న]**

943. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) మాకు (ఆయన నుండి విడాకులు తీసుకోవడానికి లేదా తీసుకోకపోవడానికి) అధికారం ఇచ్చినపుడు మేము దేవుణ్ణి, దైవప్రవక్తనే కోరుకున్నాము. ఆ అధికారం లభించిన తరువాత ఆయన మా విషయంలో (విడాకులు మొదలైన) ఎలాంటి ఆలోచనకు తావీయలేదు.

**[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 5వ అధ్యాయం - మన్ ఖయ్యరిన్నిసా]**

## 5వ అధ్యాయం - భార్యకు దూరంగా ఉంటానని ప్రమాణం చేయడం గురించి

944. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేను ఓ సూక్తిని గురించి ఒక సంవత్సరం నుండి హజ్రత్ ఉమర్ (రజి)ని అడిగి తెలుసుకోవాలని అనుకుంటూ ఉండేవాణ్ణి. కాని ఆయన వ్యక్తిత్వంలోని గాంభీర్యతకు భయపడి అడగలేకపోయేవాణ్ణి. చివరికి ఆయన హజ్ యాత్రకు బయలుదేరితే నేను కూడా ఆయన వెంట వెళ్ళాను. తిరుగు ప్రయాణంలో ఒక చోట హజ్రత్ ఉమర్ (రజి) ఒంటె దిగి

(మూత్ర విసర్జన కోసం) దారి పక్కన గల పీలూ చెట్ల చాటుకు పోయారు. నేను ఆయన కోసం నిరీక్షిస్తూ ఆగిపోయాను. కాస్సేపటికి ఆయన పని ముగించుకొని వచ్చారు. (మేము తిరిగి బయలుదేరాము).

అప్పుడు నేను ఆయనతో పాటు నడుస్తూ "దైవప్రవక్త భార్యలలో ఇద్దరు ఒక విషయంలో పరస్పరం సంప్రదించుకొని ఏకాభిప్రాయానికి వచ్చారు కదా, ఆ ఇద్దరు ఎవరు?" అని అడిగాను. దానికి హజ్రత్ ఉమర్ (రజి) "హజ్రత్ హఫ్సా (రజి), హజ్రత్ ఆయిషా (రజి)" అని అన్నారు. ఆ తర్వాత నేను హజ్రత్ ఉమర్ (రజి)తో "దైవసాక్షిగా చెబుతున్నాను, నేనీ విషయం గురించి మిమ్మల్ని ఒక సంవత్సరం నుంచి అడగాలని అనుకుంటూ ఉండేవాడ్ని. కాని మీ గంభీర వ్యక్తిత్వానికి భయపడి అడగలేకపోయాను" అని అన్నాను. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "ఇక ముందు అలా చేయకు. ఏదైనా విషయం నాకు తెలుసని నీవు భావిస్తే నన్ను తప్పకుండా అడుగు. నాకు తెలిసి ఉంటే నీకు తెలియజేస్తాను" అని అన్నారు.

ఆ తర్వాత ఆయన (విషయాన్ని వివరిస్తూ) ఇలా అన్నారు:- అజ్ఞాన కాలంలో మాకు స్త్రీల వాస్తవస్థానం ఏమిటో బొత్తిగా తెలియదు. చివరికి దేవుడు స్త్రీలను గురించి అవతరింపజేయవలసిన ఆజ్ఞలేమిటో అవతరింపజేశాడు. వారికి రావలసిన హక్కు లేమిటో ఇప్పించాడు - ఓ రోజు నేను ఏదో నా పని విషయంలో దీర్ఘంగా ఆలోచిస్తుంటే, నా భార్య వచ్చి 'మీరిలా చేస్తే బాగుంటుంది, అలా చేస్తే బాగుంటుంది' అని అన్నది. నేను (మండిపడుతూ) "నీకిలా మాట్లాడే అధికారం ఎవరిచ్చారు? అసలు నువ్విక్కడికెందుకొచ్చావు? నేను చేయదలచుకున్న పనిలో నువ్వెందుకు అనవసరంగా తలదూర్చబోతావు?" అని అన్నాను. దానికామె ఇలా అన్నది --"ఉమర్! మీ ధోరణి చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతోంది. మిమ్మల్నెవరూ ఏ విషయంలోనూ ప్రశ్నించకూడదని, అసలు మీ ముందు నిలబడి ఎవరూ మాట్లాడకూడదని మీరు కోరుకుంటున్నారు. కాని మీ కూతురేమో దైవప్రవక్త(స)ను ప్రశ్నిస్తుంది, సమాధానం రాబడ్తుంది. ఒక్కోసారి పరిస్థితి చాలా తీవ్రంగా మారి ఆ రోజంతా ఎడమోహం పెడమొహంగా తయారవుతోంది పరిస్థితి.

హజ్రత్ ఉమర్ (రజి) కథనం:- నేనీమాట విని తక్షణమే నా దుప్పటి తీసుకొని లేచి నిలబడ్డాను. సరాసరి (నా కూతురు) హఫ్సా(రజి) ఇంటికి వెళ్ళి "అమ్మాయ్! నువ్వు దైవప్రవక్త(స) ఎదురు తిరుగుతున్నావా? నీ మాటలవల్ల (ఒక్కోసారి) ఆయన అలిగి రోజంతా ముభావంగా ఉండటం కూడా జరుగుతున్నదా?" అని అడిగాను. దానికామె "దైవసాక్షి! మేము ఆయన్ని ప్రశ్నిస్తుంటాము, సమాధానం రాబడ్తుంటాము కూడా" అని అన్నది. "(అమ్మాయ్!) బాగా గుర్తుంచుకో (పరలోక పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి). నేను నిన్ను దేవుని శిక్ష గురించి, దైవప్రవక్త(స) ఆగ్రహం గురించి హెచ్చరిస్తున్నాను. (నీ వైఖరి మార్చుకోకపోతే నాశనమవుతావు!) ఏ స్త్రీ తన అందాన్ని, ప్రవక్త ప్రేమను చూసుకొని మురిసిపోతున్నదో ఆమెను చూసి నువ్వు మోసపోకూడదు" అని చెప్పాను నేను.

ఆ తరువాత నేను హఫ్సా (రజి) ఇంటి నుండి బయలుదేరి, నేరుగా హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) ఇంటికి చేరుకున్నాను. ఆమె నాకు బంధువు కూడా అవుతుంది. నేనామెతో కూడా ఈ విషయం గురించి మాట్లాడాను. హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) నా మాటలు విని (ఒకింత కోపం వెలిబుచ్చుతూ) "నీ ధోరణి చాలా వింతగా ఉంది. నువ్వు ప్రతి విషయంలోనూ జోక్యం చేసుకుంటున్నావు. చివరికి

నువ్విప్పుడు దైవప్రవక్త(స) భార్యల వ్యవహారంలో కూడా తలదూర్చడానికి సిద్ధమయ్యావన్నమాట" అని అన్నది. ఆమె తీవ్ర స్వరంతో పలికిన వాడి మాటలు నా నోటికి తాళం వేశాయి. నా కోపం చల్లబడిపోయింది. అక్కడ్నుంచి నేను (మారు మాట్లాడకుండా) వెళ్ళిపోయాను.

ఆ రోజుల్లో నా పొరుగులో ఒక అన్సారీ స్నేహితుడుండేవాడు. నేను దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళలేకపోయినప్పుడు అతను అక్కడి సమాచారమంతా సేకరించి నాకు విన్పించేవాడు. అతను వెళ్ళనప్పుడు నేను సమాచారం సేకరించి అతనికి విన్పించేవాడ్ని. ఆ రోజుల్లోనే గస్సాన్ ప్రాంతానికి చెందిన ఒక రాజు గురించిన భయం మమ్మల్ని పట్టి పీడించసాగింది. అతను మాపై దాడి చేయడానికి సమాయత్తమవుతున్నాడన్న వార్త (కార్చిచ్చులా) ప్రాకిపోవడంతో మేము అనుక్షణం ప్రాణాలు అరచేతిలో పట్టుకొని బిక్కుబిక్కు మంటూ ఉండేవాళ్ళం. ఓ రోజు ఉన్నట్టుండి హఠాత్తుగా అన్సారీ మిత్రుడు వచ్చి మా ఇంటి తలుపులు దబా దబా తడ్తూ 'తెరవండీ, తెరవండీ' అంటూ అరిచాడు. నేను (కంగారు పడుతూ బయటికి వచ్చి) "ఏమిటీ గస్సాన్ రాజు వచ్చేశాడా?" అని అడిగాను. "లేదు, అంతకంటే పెద్ద ఘోరమే జరిగిపోయింది. దైవప్రవక్త(స) గారు తమ భార్యల నుండి వేరయి పోయారు" అన్నాడతను. "హఫ్సా (రజి), ఆయిషా (రజి)ల ముక్కుకు మన్ను తగల! (ఇదంతా వాళ్ళిద్దరి నిర్వాకమే)". నా నోట (అప్రయత్నంగా) ఈ మాటలు వెలువడ్డాయి.

ఆ తరువాత నేను (ఆదరాబాదరాగా) బట్టలు వేసుకొని ఇంటి నుంచి బయలుదేరాను. చివరికి నేను దైవప్రవక్త(స) సన్నిధికి చేరుకున్నాను. విచారిస్తే ఆయన పైఅంతస్తులో ఉన్నారని తెలిసింది. పైకి ఎక్కడానికి అక్కడ ఒక నిచ్చెన ఉంది. ఆ నిచ్చెన మీద ప్రవక్తగారి నీగ్రో బానిస నిల్చున్నాడు. నేనతనితో "ఖత్తాబ్ కొడుకు ఉమర్ వచ్చాడని ఆయనకు చెప్పు" అని అన్నాను. అలా నాకు దైవప్రవక్త(స) తన దగ్గరికి రావడానికి అనుమతిచ్చారు.

నేను జరిగిన వృత్తాంతమంతా దైవప్రవక్త(స)కు విన్పించాను. చివర్లో నేను ఉమ్మె సల్మా (రజి) సంగతి విన్పించినప్పుడు ఆయన చిరునవ్వు చిందించారు. ఆ సమయంలో ఆయన ఒక చాప మీద పడుకొని ఉన్నారు. ఆ చాపకు, ఆయన దేహానికి మధ్య ఎలాంటి అడ్డు (పడక) లేదు. కాకపోతే తల క్రింద ఖర్జూరపు బెరడుతో నిండిన ఒక తోలు తలగడ మాత్రం ఉంది. ఆయన కాళ్ళ దగ్గర 'సలమ్' ★ ఆకుల కుప్ప ఉంది. తలగడ వైపు ముడిచర్మాలు కొన్ని వ్రేలాడదీసి ఉన్నాయి. ఆయన ఒంటి మీద చాప (ఈనెల) గుర్తులు పడి వున్నాయి. వాటిని చూడగానే నాకు దుఃఖం ముంచుకొచ్చింది. దైవప్రవక్త (సల్లం) నా వైపు చూసి, "ఎందుకు దుఃఖిస్తున్నావు?" అని అడిగారు. "దైవప్రవక్తా! ఈరాన్, రోము చక్రవర్తులు భోగభాగ్యాల్లో తేలియాడుతూ ఉంటే, మీరు దైవప్రవక్త (సల్లం) అయి ఉండి కూడా ఈ (దైన్య) స్థితిలో ఉండటమా?" అన్నాను నేను (కళ్ళు తుడుచుకుంటూ). దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "వాళ్ళకు క్షణభంగురమైన ఇహలోకం మాత్రమే ఉంటే, మనకు [శాశ్వత సుఖాన్నిచ్చే] పరలోకం ఉంది. ఈ విషయం మీకు సంతోషం కలిగించడం లేదా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 66 - తహ్రీం సూరా, 2వ అధ్యాయం - తబ్తగీ మర్జాత అజ్వాజిక]

---

★ అరేబియాలో ఇది ఒక రకమైన చెట్టు పేరు. దీని ఆకులు చర్మం పదును చేయడానికి ఉపయోగపడతాయి.

945. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త(సల్లం) భార్యలలో ఇద్దరి గురించి "మీరిద్దరు పశ్చాత్తాప హృదయంతో దేవుడ్ని క్షమాపణ కోరుకోండి. (అందులోనే మీ శ్రేయస్సు ఉంది)" అన్న దైవసూక్తి (66:4) అవతరించింది కదా! దాని గురించి నేను హజ్రత్ ఉమర్ (రజి)ని చాలా కాలం నుంచి అడుగుదామనుకుంటూ ఉండేవాడ్ని. (కాని అవకాశం లభించలేదు.) చివరికి హజ్రత్ ఉమర్ (రజి) హజ్ యాత్రకు వెళ్తుంటే నేను కూడ ఆయన వెంట బయలుదేరాను. (తిరుగు) ప్రయాణంలో ఒకచోట ఆయన దారి ప్రక్కన ఒక వైపుకు వెళ్ళారు. నేను కూడా నీళ్ళ తిత్తి తీసుకొని అటువైపు వెళ్ళాను. అక్కడ ఆయన (మూత్రవిసర్జన) పని ముగించుకొని వెనక్కి వచ్చేశారు. అప్పుడు నేను తోలుతిత్తితో ఆయన చేతులపై నీళ్ళుపోస్తే ఆయన వుజూ చేసుకున్నారు.

నేనీ అవకాశాన్ని ఉపయోగించుకుంటూ "అమీరుల్ మోమినీన్! ప్రవక్త భార్యలను గురించి "మీరిద్దరు పశ్చాత్తాపంతో దేవుడ్ని క్షమాపణ కోరుకోండి' అని అవతరించిన దైవసూక్తిలో 'ఇద్దరు స్త్రీలు' ఎవరూ?" అని అడిగాను. హజ్రత్ ఉమర్ (రజి) (నా వైపు వింతగా చూస్తూ) "ఇబ్నె అబ్బాస్! నీ ధోరణి చాలా ఆశ్చర్యకరంగా ఉంది. (ఇన్నాళ్ళ నుంచి నన్నీ విషయం ఎందుకు అడగలేదు?) వారిద్దరూ హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ హఫ్సా(రజి)" అని అన్నారు.

ఆ తర్వాత హజ్రత్ ఉమర్ (రజి) విషయాన్ని వివరంగా చెబుతూ ఇలా అన్నారు - నేను, నా పొరుగింటి అన్సారీ మిత్రుడు ఇద్దరం 'బనీ ఉమయ్యా బిన్ జైద్' వాడలో నివసిస్తూ ఉండేవాళ్ళము. బనీ ఉమయ్యా తెగ మదీనా శివార్లలో ఉండేది. మేమిద్దరం వంతుల వారీగా ఒకరి తరువాత మరొకరు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్తుండేవాళ్ళము. అంటే ఒక రోజు నేను వేళ్తే మరొక రోజు అతను వెళ్ళేవాడన్నమాట. నేను వెళ్ళొచ్చినప్పుడు ఆ రోజు జరిగిన ప్రవక్త (సల్లం) దివ్యసందేశం అవతరించడం వగైరా విశేషాలన్నీ అతనికి తెలియజేసేవాణ్ణి. అలాగే అతను ప్రవక్త దగ్గరకి వెళ్ళొస్తే ఆనాటి విశేషాలు తెచ్చి నాకు విన్పించేవాడు.

(పూర్వం) మా ఖురైష్ తెగ పురుషులు స్త్రీలపై ఆధిక్యత కలిగి ఉండేవారు. (అంటే మాది పురుషాధిక్యతా సమాజమన్న మాట). అయితే మేము (మదీనాలో) అన్సార్ల దగ్గరికి వచ్చి చూస్తే ఇక్కడ పురుషులపై స్త్రీలు ఆధిక్యత కలిగి ఉన్నారు. మేమిక్కడికి వచ్చిన తర్వాత మా స్త్రీలు కూడా అన్సారీ స్త్రీల వైఖరిని అనుసరించడం ప్రారంభించారు. ఓ రోజు ఒక విషయంలో నేను నా భార్యను గద్దిస్తే ఆమె నాకు ఎదురు సమాధానమిచ్చింది. దాంతో నేను (ఒళ్ళుమండిపోయి) కోపాన్ని వెళ్ళగక్కాను. అది విని ఆమె ఇలా అన్నది: "నా సమాధానం విని మీరెందుకు అంత కోపగించుకుంటారు? కాని దైవసాక్షిగా చెబుతున్నాను. దైవప్రవక్త(సల్లం)కు ఆయన భార్యలు కూడా ఎదురు సమాధానాలిస్తుంటారు. ఒక్కోసారి వారిలో ఒక భార్య అయితే ప్రవక్త(సల్లం) మీద అలిగి ఒక పగలు రాత్రీ ముభావంగా ఉండిపోతుంది (తెలుసా?)"

ఈ మాట విని నేను చాలా ఆందోళన పడ్డాను. "ప్రవక్త భార్యలలో ఎవరైనా ఇలా ప్రవర్తించారంటే ఆమె ఘోర నష్టంలో పడిపోయినట్లే" అన్నాను నేను.

ఆ తర్వాత నేను (వెంటనే) బట్టలు వేసుకొని బయలుదేరాను. నేను (మా వాడ గుట్టలు) దిగి మొదట హఫ్సా (రజి) ఇంటికెళ్ళాను. నేను (పోయి పోగానే) "మీలో ఎవరో ఒకరు (అప్పుడప్పుడు) ప్రవక్త

(సల్లం) మీద అలిగి ఒక రోజంతా ముభావంగా ఉంటారట నిజమేనా?'' అని అడిగాను. ఆమె నిజమే అన్నది. “అయితే మీకు వినాశం దాపురించింది. దైవప్రవక్త (సల్లం) ఆగ్రహం వల్ల దేవుని ఆగ్రహానికి గురయి నాశనమవుతారన్న భయం మీలో కాస్తయినా లేదా? (అమ్మాయ్!) జాగ్రత్త! దైవప్రవక్త (సల్లం)ను, అది కావాలి ఇది కావాలి అంటూ ఎక్కువగా కోరకు. అలాగే ఆయనతో వితండవాదానికి దిగకు. ఆయన మీద అలిగి కూర్చోకు. నీకేదయినా కావాలంటే నన్నడుగు (నేనిస్తాను. అంతేగాని దైవప్రవక్తను చీటికి మాటికీ వేధించకు). ఒక విషయం గుర్తుపెట్టుకో. నీ పొరుగు స్త్రీ (అంటే నీ సవతి హజ్రత్ ఆయిషా -రజి) నీ కంటే ఎంతో అందమైనది. పైగా ఆమె అంటే దైవప్రవక్తకు చాలా ఇష్టం. అందువల్ల (ఆమె ఏది చేసినా చెల్లుతుంది) నువ్వు ఆమెను చూసి మోసపోకు'' అన్నాను నేను.

ఆ రోజుల్లో గస్సాన్ రాజు గుర్రాలకు నాడాలు వేయిస్తూ సకల విధాల ఆయుధాలతో మాపై యుద్ధానికి సమాయత్తమవుతున్నాడని విని మేము దాన్ని గురించే తరచుగా చెప్పుకుంటూ ఉండేవాళ్ళము. తర్వాత ఓ రోజు నా స్నేహితుడు తన వంతు ప్రకారం దైవప్రవక్త సన్నిధికి వెళ్ళి ఇషా (నమాజు) వేళకు తిరిగొచ్చాడు. వచ్చీ రాగానే అతను మా ఇంటి తలుపులు దబదబా బాదుతూ “లోపల ఎవరైనా ఉన్నారా?'' అని అరిచాడు. నేను కంగారు పడుతూ ఒక్క ఉదుటున బయటికి వచ్చాను. అతను (నన్ను చూడగానే) “ఈ రోజు పెద్ద ఘోరం జరిగిపోయింది'' అన్నాడు. నేను (ఆత్రుతతో) “ఏం జరిగింది? గస్సాన్ రాజు వచ్చేశాడా?'' అని అడిగాను. “లేదు. అంతకంటే కూడా పెద్ద ఘోరం జరిగిపోయింది. దైవప్రవక్త(సల్లం) తమ భార్యలకు విడాకులిచ్చేశారు'' అన్నాడతను. నేనీ మాట వినగానే “హఫ్సా (రజి) నాశనమయిపోయింది! ఇలాంటిదేదో జరుగుతుందని నేను ముందే ఊహించాను'' అని అన్నాను.

ఆ తర్వాత (మరునాడు ఉదయం) నేను బట్టలు వేసుకొని వెళ్ళి దైవప్రవక్త (సల్లం)తో కలసి ఫజ్ర్ నమాజు చేశాను. నమాజయిన తరువాత దైవప్రవక్త(సల్లం)పై అంతస్తులోకి వెళ్ళి కూర్చొన్నారు. అందరికీ వేరయి ఒంటరిగా కూర్చొన్నారు. అదే సమయంలో నేను హఫ్సా(రజి) ఇంటికి వెళ్ళాను. చూస్తే ఆమె ఏడుస్తూ కూర్చున్నది. “ఎందుకు ఏడుస్తున్నావు? ఈనాటి సంఘటన గురించి నేను నిన్ను ముందే హెచ్చరించలేదా? దైవప్రవక్త (సల్లం) మీ కందరికీ విడాకులిచ్చేశారట నిజమేనా?'' అని అడిగాను నేను. “నాకేమీ తెలియదు. ఆయన అందరినీ వదిలేసి పై అంతస్తులో ఒంటరిగా కూర్చొన్నారని మాత్రం తెలుసు'' అన్నది ఆమె.

నేను అక్కడ్నుంచి బయలుదేరి మస్జిదులోని వేదిక దగ్గరకు వెళ్ళాను. అక్కడ జనం గుమిగూడి ఉన్నారు. వారిలో కొందరు రోదిస్తున్నారు. నేను వాళ్ళ దగ్గర కొంచెం సేపు కూర్చున్నాను (ఏమీ పాలుపోక). కాని నాలో ఆందోళన, ఆత్రుతలు ఎక్కువయిపోవడంతో నేను లేచి దైవప్రవక్త(సల్లం) కూర్చొని ఉన్న పై అంతస్తు దగ్గరికి వెళ్ళాను. అక్కడ (కాపలాదారునిగా) ఒక నీగ్రో బాలుడు ఉన్నాడు. నేనతనితో “ఉమర్ (పైకి) రావడానికి అనుమతి అడిగిరా''అని అన్నారు. అతను వెళ్ళి వచ్చి “నేను మీ పేరు ప్రస్తావించి దైవప్రవక్త (సల్లం)ను అనుమతి అడిగాను. కాని ఆయన ఏ మాటా చెప్పకుండా మౌనంగా ఉండిపోయారు'' అని చెప్పాడు.

నేను తిరిగి మస్జిదులో వేదిక చుట్టూ మూగి ఉన్న జనం దగ్గరికొచ్చి కూర్చున్నాను. అయితే కాస్సేపటి తర్వాత నాలో ఆందోళన, ఆత్రుతలు అధికమవడంతో నేను మళ్ళీ ఆ నీగ్రో బాలుడి దగ్గరికెళ్ళి “వెళ్ళి ఉమర్ కోసం అనుమతి అడిగిరా''అన్నాను. అతను (పైకి) వెళ్ళి వచ్చి “నేను

దైవప్రవక్త(సల్లం) ముందు మీ సంగతి ప్రస్తావించాను. కాని ఆయన ఎలాంటి సమాధానం ఇవ్వలేదు" అని అన్నాడు. నేను తిరిగొచ్చి వేదిక చుట్టూ గుమిగూడిన జనం దగ్గర కూర్చున్నాను. కాని కాస్సేపటికి నాలో ఆందోళన, ఆత్రుతలు మరింత ఎక్కువయిపోయాయి. అందువల్ల నేను మళ్ళీ ఆ బాలుడి దగ్గరి కెళ్ళి "వెళ్ళి ఉమర్ కోసం అనుమతి అడిగిరా" అని చెప్పాను. అతను వెళ్ళొచ్చి "నేను దైవప్రవక్త(సల్లం) ముందు మీ సంగతి ప్రస్తావించాను. కాని ఆయన సమాధానం ఇవ్వకుండా మౌనంగా ఉండిపోయారు" అని అన్నాడు.

నేను (చేసేదేమీ లేక కాళ్ళీడ్చుకుంటూ) వెనక్కి తిరిగాను. కాని అంతలోనే ఆ బాలుడు నన్ను కేకవేస్తూ "రండి, రండి. దైవప్రవక్త (సల్లం) మిమ్మల్ని రావడానికి అనుమతించారు, రండి" అని అన్నాడు. అది విని నేను వెళ్ళాను. లోపలికెళ్ళి చూస్తే దైవప్రవక్త(సల్లం) ఓ గోనె చాప మీద పడుకొని ఉన్నారు. ఆ చాపమీద ఓ గుడ్డ పడక కూడా లేదు. చాప ఈనెల గుర్తులు ఆయన శరీరం మీద స్పష్టంగా కనిపిస్తున్నాయి. తలక్రింద ఖర్జూరపు బెరడుతో నిండిన ఒక తోలు దిండు ఉంది.

నేను సలాం చేసి నిల్చొని ఉండే "దైవప్రవక్తా! మీరు మీ భార్యలకు విడాకులిచ్చారా?" అని అడిగాను. ఆయన తలపైకెత్తి నావైపు చూస్తూ లేదన్నారు. ఈ మాట విని నేను (తృప్తిగా ఊపిరి పీల్చుకుంటూ) "అల్లాహు అక్బర్ (దేవుడు గొప్పవాడు)" అన్నాను. ఆ తర్వాత నేను అలా నిలబడే ఆవేదనాపూరిత వాతావరణాన్ని దూరం చేయడానికి "దైవప్రవక్తా! కాస్త నావైపు చూడండి. మనం ఖురైష్ వంశస్థులం ఒకప్పుడు స్త్రీల మీద ఆధిక్యత కలిగి ఉండేవాళ్ళము. కాని మనం మదీనా వచ్చాక మన స్త్రీలు మనమీదే పెత్తనం చెలాయించడం మొదలెట్టారు" అని అన్నాను. ఈ మాట విని దైవప్రవక్త(సల్లం) చిరునవ్వు చిందించారు. ఆ తర్వాత నేను "దైవప్రవక్తా! కాస్త నా వైపు దృష్టి సారించండి. నేను హఫ్సా(రజి) ఇంటిక్కూడ వెళ్ళొచ్చాను. ఆమెతో 'నీ సవతి ఆయిషా (రజి) ను చూసి మోసపోకు; ఆమె నీకంటే అందమైనదే కాకుండా, అందరికంటే ఎక్కువ ఆమెనే దైవప్రవక్త(సల్లం) ప్రేమిస్తున్నారు' అని చెప్పాను" అని అన్నాను. దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని మరోసారి చిరునవ్వు నవ్వారు.

ఈ విధంగా ప్రవక్త ముఖారవిందం విప్పారడం చూసి నేను (నిశ్చింతగా) కూర్చున్నాను. నేను మరోసారి తలపైకెత్తి గదిలో నలువైపుల కలియజూశాను. కాని నాకక్కడ చెప్పుకోదగ్గ వస్తువేమీ కన్పించలేదు. కాకపోతే ఒక చోట మూడు చర్మాలు (వ్రేలాడుతూ) కన్పించాయి. వాటిని చూసి "దైవప్రవక్తా! మీ అనుచర సమాజానికి భోగభాగ్యాలు ప్రసాదించమని దేవుడ్ని ప్రార్థించండి. రోమన్లు, పార్సీలు అల్లాహ్‌ను ఆరాధించకపోయినా అన్ని రకాల భోగభాగ్యాలతో ఎలా తులతూగుతున్నారో చూడండి. వారికి పెద్ద ఎత్తున ప్రాపంచిక సిరులు ప్రసాదించబడ్డాయి (మనకా అదృష్టం లేదా?)" అని అన్నాను.

దైవప్రవక్త(సల్లం) ఈ మాటలు విని దిండుకానుకొని కూర్చున్నవారల్లా ఒక్కసారిగా వదిలి నిటారుగా కూర్చొన్నారు. "ఖత్తాబ్ పుత్రుడా! నువ్వు ఈ విధంగా ఆలోచిస్తున్నావా? ఈ జాతులకు ఐహిక జీవితంలోనే తమకు ప్రియమైన సంపదలన్నీ ఇవ్వబడ్డాయి (పరలోకంలో వారికి ఎలాంటి సుఖాలు ఉండవు)" అన్నారు ఆయన (వత్తి పలుకుతూ). నేను (వెంటనే నా తప్పు తెలుసుకొని) "దైవప్రవక్తా! నా తప్పు క్షమించమని దేవుడ్ని ప్రార్థించండి" అని అన్నాను.

దైవప్రవక్త (సల్లం) తమ భార్యలకు ఇరవై తొమ్మిది రోజుల (రాత్రుల) పాటు వేరుగా ఉండిపోయారు. దీనిక్కారణం హజ్రత్ ఆయిషా (రజి)కు హఫ్సా (రజి) తెలిపిన విషయమే. దీని వల్ల దైవప్రవక్త (సల్లం) ఎంతో ఆవేదనకు గురయి "నేను ఒక నెల దాకా వాళ్ళ దగ్గరకి పోను" అని అన్నారు. అయితే ఈ నిర్ణయాన్ని దేవుడు నిరసించాడు.

ఇలా ఇరవైతొమ్మిది రాత్రులు గడిచిన తర్వాత దైవప్రవక్త (సల్లం) అందరికంటే ముందుగా హజ్రత్ ఆయిషా (రజి) దగ్గరకి వెళ్ళారు. ఆ సందర్భంలో హజ్రత్ ఆయిషా (రజి) "మీరు ఒక నెల దాకా మా దగ్గరకు రానని ఒట్టేసుకున్నారుగా. (మరి అప్పుడే వచ్చారేమిటీ)! నేను ఒక్కొక్క రోజును లెక్కపెడ్తూ ఉన్నాను" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఇరవై తొమ్మిది రోజుల నెల కూడ ఉంటుంది. ఈ నెల ఇరవై తొమ్మిది రోజుల నెలే మరి" అని అన్నారు.

ఆ తర్వాత హజ్రత్ ఆయిషా ఇలా తెలియజేశారు - "ఆ తర్వాత దేవుడు (అహ్జాబ్ సూరాలో) 'తఖ్యీర్'(1) సూక్తిని అవతరింపజేశాడు. అప్పుడు కూడా దైవప్రవక్త(సల్లం) అందరికంటే ముందు నా దగ్గరికే వచ్చి దాన్ని గురించి నా అభిప్రాయం అడిగారు. నేను మిమ్మల్నే కోరుకుంటున్నానని నా అభిప్రాయం తెలియజేశాను. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) మిగిలిన భార్యల దగ్గర క్కూడ వెళ్ళి వారి అభిప్రాయాలు అడిగారు. అప్పుడు వారు కూడా నేనిచ్చిన సమాధానమే ఇచ్చారు".

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 83వ అధ్యాయం - మౌ ఇజతిర్రజులిబ్ నతహూ]

## 6వ అధ్యాయం - మూడు తలాఖులు ఇవ్వబడిన స్త్రీ భరణానికి అర్హురాలు కాదు

946. హజ్రత్ ఖాసిమ్ బిన్ ముహమ్మద్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి), హజ్రత్ ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)ను గురించి మాట్లాడుతూ "ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)కు ఏమయింది, ఆమె దేవునికి భయపడదా?" అని అన్నారు. అంటే హజ్రత్ ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)గారు విడాకులు పొందిన స్త్రీకి (భర్త) ఇంట్లో ఉండేందుకుగాని, (అతని నుండి) భరణం పొందేందుకు గాని హక్కులేదని అంటారేమిటీ; ఆమె దేవునికి భయపడదా? అని హజ్రత్ ఆయిషా (రజి) గారి మాటల భావం."(2)

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 41వ అధ్యాయం - ఖిస్సతు ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)]

---

(1) తఖ్యిర్ సూక్తి ఖుర్ఆన్‌లో ఈ విధంగా ఉంది. (ప్రవక్తా!) నీ భార్యలకు ఇలా చెప్పెయ్యి - "ఒక వేళ మీరు ప్రాపంచిక జీవితాన్ని, దాని తళుకు బెళుకుల్ని (మాత్రమే) కోరుతున్నట్లయితే రండి, నేను మీకు ఎంతో కొంత ఇచ్చి మంచిగా సాగనంపుతాను. అలా కాకుండా మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోకాన్ని (కూడా) కోరుతున్నట్లయితే, తెలుసుకోండి - మీలో పుణ్యవతుల కోసం అల్లాహ్ గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు". (33:28,29)

(2) ఫాతిమా బిన్తె ఖైస్ (రజి) విడాకులు పొందిన తరువాత మాజీ భర్త ఇంట్లో గాకుండా వేరే ఇంట్లో 'ఇద్దత్' గడపాలని దైవప్రవక్త (సల్లం) ఆమెను ఆజ్ఞాపించారు. ఇది సాధారణ ఆజ్ఞ కాదు, గత్యంతరం లేని పరిస్థితిలో ఇవ్వబడిన ఆజ్ఞ. ఈ సంగతి ఆమెకు తెలుసు. అయితే ఆమె కారణం చెప్పకుండా వేరే ఇంట్లో 'ఇద్దత్' గడిపేందుకు తనకు దైవప్రవక్త (సల్లం) అనుమతించారని అన్నారు. ఈమె గాథ సహీహ్ ముస్లిం, తలాఖ్ ప్రకరణంలోని 48వ హదీసులో ఈ విధంగా ఉంది:-

అబూబకర్ బిన్ జహమ్ (రహ్మాలై) కథనం ప్రకారం ఫాతిమా బిన్తె ఖైస్ (రజి) ఆయనకు ఇలా వివరించారు - నా భర్త అబూ ఉమర్ బిన్ హఫ్స్ (రజి) నాకు విడాకులిచ్చారు. ఆ సందర్భంలో ఆయన నా కోసం అయిదు 'సా'ల ఎత్తు ఖర్జూరపండ్లు, మరో అయిదు 'సా'ల ఎత్తు గోధుమలు పంపించారు. అప్పుడు నేను, "నా మనోవర్తి(నుఫ్కా) ఇంతేనా? నా ఇద్దత్ గడువును మీ ఇంట్లో గడపకూడదా" అని అడిగాను. దానికాయన లేదన్నారు. ఆ తర్వాత నేను నా దుస్తుల్ని సర్దుకొని దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళాను.

947. హజ్రత్ ఖాసిం బిన్ ముహమ్మద్ (రహ్మలై) కథనం:- హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ (రజి) హజ్రత్ ఆయిషా (రజి)తో మాట్లాడుతూ "మీరు హకమ్ కుమార్తె గురించి విన్నారా? ఆమెకు భర్త (మూడుసార్లు) తలాఖ్ ఇచ్చేస్తే (ఇద్దత్ గడువు తీరక ముందే) ఆమె ఆ ఇంట్లో ఉండకుండా ఎక్కడికో వెళ్ళి పోయింది?" అని అన్నారు. దానికి హజ్రత్ ఆయిషా (రజి) "ఆమె తప్పు చేసింది" అన్నారు. తర్వాత హజ్రత్ ఉర్వా (రహ్మలై) "మీరు ఫాతిమా బిన్తె ఖైస్ (రజి) చెబుతున్న మాటలు వినలేదా?" అని అన్నారు. "ఫాతిమా (రజి) అలా చెప్పడం సమంజసంగా లేదు"(2) అన్నారు హజ్రత్ ఆయిషా (రజి).

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 41వ అధ్యాయం - ఖిస్సతు ఫాతిమా బిన్తె ఖైస్ (రజి)]

## 8వ అధ్యాయం - ప్రసవించిన తర్వాత ఇద్దత్ (గడువు) తీరిపోతుంది

948. హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్లా (రహ్మలై) కథనం:- హజ్రత్ సబియా బిన్తె హారిస్ (రజి) హజ్రత్ సాద్ బిన్ ఖౌలా (రజి) గారి భార్య. హజ్రత్ సాద్ (రజి) 'బనీ ఆమిర్ బిన్ లోయి' తెగకు చెందిన వ్యక్తి. ఆయనకు బదర్ యుద్ధంలో పాల్గొనే భాగ్యం లభించింది. అయితే ఆయన హజ్జతుల్ విదా (వీడ్కోలు హజ్) సందర్భంలో చనిపోయారు. హజ్రత్ సాద్ (రజి) చనిపోయేటప్పుడు ఆయన భార్య సబియా (రజి) గర్భవతిగా ఉన్నారు. ఆయన మరణించిన కొన్నాళ్ళకే ఆమె ప్రసవించారు. ప్రసవమైల నుండి బయట పడగానే ఆమె రెండో సంబంధం కోసం అందంగా సింగారించుకోవడం ప్రారంభించారు.

ఆ రోజుల్లో 'బనీ అబ్దుద్దార్' తెగకు చెందిన హజ్రత్ అబుస్సనా బిల్ బిన్ బాకక్ (రజి) ఆమె దగ్గరకు వచ్చి "ఏమిటీ నీవు అప్పుడే అలంకరించుకొని కూర్చున్నావు! రెండవ సంబంధం రావాలనా! నీవు నిజంగా (రెండవ) పెళ్ళి చేసుకోదలిచావా? కాని దైవసాక్షిగా చెబుతున్నాను. నాలుగు నెలల పది రోజుల (ఇద్దత్) గడువు తీరే దాకా నీవు పెళ్ళి చేసుకోవడానికి ఏమాత్రం వీల్లేదు" అని అన్నారు.

ఆ తర్వాత హజ్రత్ సబియా (రజి) ఇలా తెలియజేస్తున్నారు; నేనీ మాట వినగానే అదే రోజు సాయంత్రం (నిండుగా) దుస్తులు ధరించి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. ఆయన ముందు విషయం ప్రస్తావించి సమాధానం అడిగాను. దైవప్రవక్త(సల్లం) ఇది విని, నేను ప్రసవించగానే నా ఇద్దత్ (గడువు) తీరిపోయిందని, (రెండవ) పెళ్ళి చేసుకోవచ్చని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 10వ అధ్యాయం - హద్దసనా అబ్దుల్లాహ్ బిన్ ముహమ్మదిల్ జూఫి]

---

దైవప్రవక్త (సల్లం) (నా మాటలు విని) "నీకు ఎన్ని తలాఖులు ఇచ్చాడు?" అని అడిగారు. నేను 'మూడ'ని చెప్పాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు. "అయితే అతను నిజమే అన్నాడు. నీకు మనోవర్తి లభించదు. నువ్వొక పని చెయ్యి. నీ ఇద్దత్ దినాలు నీ పెద్దనాన్న కొడుకు అయిన ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజి) ఇంట్లో గడుపు. అతను అంధుడు కదా! నువ్వక్కడ నీ బట్టలు కూడా మార్చుకోవచ్చు. ఇలాగే నీ ఇద్దత్ కాలం ముగిసిన తర్వాత నాకు మళ్ళీ విషయం తెలియజెయ్యి."

ఫాతిమా (రజి) కథనం:- ఆ రోజుల్లో నాకు అనేకమంది వివాహ సందేశం పంపారు. అలాంటి వారిలో ముఆవియా (రజి), అబూ జహీమ్ (రజి) కూడా ఉన్నారు. ఈ విషయం దైవప్రవక్త (సల్లం) దృష్టికి తీసికెళ్తే ఆయన నాకిలా సలహా ఇచ్చారు - "ముఆవియా(రజి) చాలా పేదవాడు. అబూ జహీమ్ (రజి) విషయానికొస్తే అతను భార్యలను కొడతాడని లేక వారిపట్ల కఠినంగా ప్రవర్తిస్తాడని తెలిసింది. లేక అలాంటివే మరేవో మాటలు ప్రచారంలో ఉన్నాయి. అందువల్ల నువ్వు ఉసామా బిన్ జైద్ (రజి)ని పెళ్ళి చేసుకో." - సంకలనకర్త.

★ అంటే విడాకులు పొందిన స్త్రీకి వసతి, మనోవర్తులు పొందే అధికారం లేదని, ఆమె వేరే చోటు నివసించవచ్చు. హజ్రత్ ఫాతిమా (రజి) అన్న మాటలు.

949. హజ్రత్ అబూసల్మా (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) దగ్గరకు ఒక వ్యక్తి వచ్చి "భర్త చనిపోయిన నలభై రోజుల తరువాత బిడ్డను కన్న స్త్రీ గురించి (ఆమె ఇద్దత్ గడువు తీరిందో లేదో) నాకు తెలియజేయండి" అని అన్నాడు. ఆ సమయంలో అక్కడ హజ్రత్ అబూహురైరా (రజి) కూడా ఉన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఆ వ్యక్తి ప్రశ్నకు సమాధానమిస్తూ 'రెండు గడువుల్లో ఏ గడువు మొదట పూర్తి అవుతుందో దాని ప్రకారం ఇద్దత్ (గడువు) తీరిపోతుంది' అని అన్నారు. నేనప్పుడు "గర్భవతి గడువు ఆమె ప్రసవించే దాకా ఉంటుంది" అన్న దైవసూక్తి (తలాఖ్-4) విన్పించాను.

హజ్రత్ అబూహురైరా (రజి) కూడా నన్ను సమర్థిస్తూ "నేను నా సోదరుడి కుమారుని పక్షాన ఉన్నాను" అని అన్నారు. అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఈ సమస్యను గురించి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)ని అడిగి రమ్మని తన బానిస కురైబ్ (రహ్మాలై)ని పంపించారు. దానికి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) ఇలా సమాధానమిచ్చారు:-

"సబియా (రజి) భర్త (సాద్ బిన్ ఖౌలా) అమరగతి నొందినపుడు ఆమె గర్భవతిగా ఉండింది. భర్త మరణించిన నలభై రోజుల తరువాత ఆమె ప్రసవించింది. ఆ తర్వాత ఆమెకు (రెండో) పెళ్ళి సంబంధాలు రాసాగాయి. కనుక దైవప్రవక్త(సల్లం) ఆమెకు వివాహం చేసుకునేందుకు అనుమతి ఇచ్చారు. ఆమెను వివాహమాడేందుకు ముందుకొచ్చిన వారిలో అబుస్సనా బిల్ (రజి) కూడా ఉన్నారు."

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్ - 65 - తలాఖ్ సూరా, 2వ అధ్యాయం - వఉవ్‌లాతిల్ అహ్మాల్]

## 9వ అధ్యాయం - భర్త చనిపోయిన స్త్రీ శోకాన్ని పాటించడం విధి. ఇతరులు మూడు రోజులకు మించి శోకాన్ని పాటించడం ధర్మసమ్మతం కాదు

950. హజ్రత్ జైనబ్ బిన్తె అబీ సల్మా (రజి) కథనం:- విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె హబీబా (రజి)గారి తండ్రి హజ్రత్ అబూ సుఫ్యాన్ (రజి) చనిపోయినపుడు నేను (సంతాపం ప్రకటించడానికి) ఆమె దగ్గరకు వెళ్ళాను. అప్పుడు హజ్రత్ ఉమ్మె హబీబా (రజి) ఒక విధమైన ఎరుపురంగు సువాసన తెప్పించారు. ఆమె దాన్ని ఒక బాలికకు పూశారు. ఆ తర్వాత ఆ చేతిని తన చెంపలకు రాసుకుంటూ "దైవసాక్షి! నాకు సువాసన అవసరం లేదు. ఇప్పుడేదో కాస్త ఇలా రాసుకుంటున్నానంటే దానిక్కారణం దైవప్రవక్త(సల్లం) ఇచ్చిన ఆదేశమే. దైవాన్ని, పరలోకాన్ని విశ్వసిస్తున్న ఏ స్త్రీ కూడా తన భర్త మరణం పట్ల తప్ప మరెవరి మృతిపట్ల కూడా మూడు రోజులకు మించి శోకాన్ని పాటించడం ధర్మసమ్మతం కాదనీ, భర్త చనిపోతే నాలుగు నెలల పదిరోజులు (శోకం పాటిస్తూ) విధిగా ఇద్దత్ (గడువు) పాటించాలని ఆయన అన్నారు" అని తెలిపారు.

తర్వాత నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి)గారి సోదరుడు చనిపోయినపుడు ఆమె ఇంటిక్కూడా (సంతాపం ప్రకటించడానికి) వెళ్ళాను. ఆమె కూడా సువాసన తెప్పించి, కాస్త వంటికి రాసుకొని ఇలా అన్నారు. "దైవసాక్షి! నాకు సువాసన పూసుకోవాల్సిన అవసరం లేదు. దైవప్రవక్త(స) వేదిక ఎక్కి 'దైవాన్ని, పరలోకాన్ని విశ్వసిస్తున్న ఏ స్త్రీ కూడా తన భర్త తప్ప ఇతరులు

చనిపోతే మూడు రోజులకు మించి శోకం పాటించడం ధర్మ సమ్మతం కాదని, భర్త చనిపోతే మాత్రం విధిగా నాలుగు నెలల పదిరోజులు ఇద్దత్ (గడువు) కాలం గడపవలసి ఉంటుంద'ని చెబుతుంటే విన్నాను."

నేను హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) చెప్పిన ఈ విషయం కూడా విన్నాను. ఒక స్త్రీ దైవప్రవక్త(స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నా కూతురి భర్త చనిపోయాడు. ఇప్పుడామె కళ్ళ జబ్బుతో బాధపడుతుంది. మరి నేను ఆమె కళ్ళకు సుర్మా పెట్టవచ్చా?" అని అడిగింది. దైవప్రవక్త(స) 'పెట్టకూడద'ని అన్నారు. ఆ స్త్రీ ఇలా రెండు మూడు సార్లు అడిగింది. ప్రతిసారీ దైవప్రవక్త (స) పెట్టకూడదనే చెప్పారు. ఆ తరువాత ఇలా అన్నారు - "అజ్ఞానకాలంలో మీ ఆడవాళ్ళకు (భర్త చనిపోతే) పూర్తిగా ఒక సంవత్సరం గడచిన తరువాతే పెంటికలు పారేసే అనుమతి లభించేది. కాని ఇప్పుడు నీ కూతురు నాలుగు నెలల పదిరోజులు మాత్రమే ఇద్దత్ (గడువు) కాలం గడపవలసి వస్తుంది. (ఈ మాత్రం గడువు కూడా తీరకముందే సింగారానికి సిద్ధమవుతే ఎలా?)"

హజ్రత్ జైనబ్ బిన్తె సల్మా (రజి) నోట ఈ హదీసు విన్న హజ్రత్ హమీద్ (రహ్మలై) "పూర్తి సంవత్సరం గడచిన తరువాత పెంటికలు పారేయడం అంటే ఏమిటి?" అని అడిగారు హజ్రత్ జైనబ్ (రజి)ని. దానికి ఆమె ఇలా సమాధానమిచ్చారు: "అజ్ఞాన కాలంలో ఏ స్త్రీ భర్త అయినా చనిపోతే ఆ స్త్రీని పక్షిగూడులాంటి ఓ ఇరుకైన చీకటి గదిలో ఉంచేవారు. అందులోనే ఆమె ఉంటుంది. ఆమె చింపిరి గుడ్డలు కట్టుకోవలసి వచ్చేది. సువాసన వస్తువుల్ని తాకడానిక్కూడా వీల్లేదు. ఈ విధంగా ఆమె ఆ చీకటి గదిలో సంవత్సరం పాటు (నికృష్ట జీవితం) గడపవలసి వచ్చేది. ఆ తరువాత గాడిదనో, మేకనో లేదా ఏదైనా పక్షినో ఆమె దగ్గరికి తెస్తారు. ఆమె దాన్ని ముట్టుకొని తన గడువుని విరమిస్తుంది. స్త్రీలు తమ గడువు విరమించడానికి ఉపయోగించిన జంతువులేవీ సాధారణంగా జీవించి ఉండవు. చాలా వరకు చనిపోతాయి. ఆ తరువాత ఆ స్త్రీ ఆ గది నుండి బయటకి వస్తుంది. అప్పుడు ఆమెకు ఒక (మేక) పెంటిక ఇవ్వబడుతుంది. ఆమె దాన్ని తీసుకొని విసిరిపారేస్తుంది. ఆ తరువాతే ఆమెకు సువాసన పూసుకోవడానికి లేదా అలంకరణ చేసుకోవడానికి అనుమతి లభిస్తుంది."

(ఈ హదీసు ఉల్లేఖించిన వారిలో ఒకరైన) హజ్రత్ మాలిక్ (రహలై)ని ఒకతను "గడువును విరమించడం అంటే ఏమిటి?" అని అడిగాడు. దానికి హజ్రత్ మాలిక్ (రహ్మలై) "స్త్రీ ఆ జంతువుని తన శరీరంతో రుద్దుతుంది (గడువుని విరమించడమంటే అదే)" అని సమాధానమిచ్చారు.

**[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 46వ అధ్యాయం - తుహిద్దుల్ ముతవఫ్ఫీ అన్హా జౌజహా అర్బతుష్షహర వ అష్రా]**

951. హజ్రత్ ఉమ్మె అతియా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో స్త్రీలు భర్త తప్ప ఇతరులు చనిపోతే మూడు రోజులకు మించి శోకాన్ని పాటించకూడదని మాపై ఆంక్ష విధించారు. భర్త చనిపోయిన స్త్రీ మాత్రం నాలుగు నెలల పదిరోజులు గడువుకాలం పూర్తి చేయాలని ఆదేశించారు. ఆ గడువు రోజుల్లో మేము సుర్మా పెట్టుకోవడానికి, సువాసన పూసుకోవటానికి వీల్లేదు. అంతేకాదు, అద్దకపు యమన్ వస్త్రాలు మినహా మరెలాంటి రంగు బట్టలు కట్టుకోవడం కూడా నిషిద్ధమే. కాకపోతే రుతుక్రమం ముగిసి స్నానం చేసినప్పుడు కుస్త్ అజ్ఫార్ (అరేబియాలో దొరికే ఒక విధమైన పరిమళం) ను మాత్రం కొద్దిగా పూసుకోవచ్చు.

**[సహీహ్ బుఖారీ : 6వ ప్రకరణం - హైజ్, 12వ అధ్యాయం - అత్తయ్యి బిల్ మర్అతు ఇన్దగుస్లిహా అనిల్ ముహైజ్]**

# శాప ప్రకరణం

952. హజ్రత్ సహెల్ బిన్ సాద్ సాది (రజి) కథనం:- హజ్రత్ ఆసిమ్ బిన్ అదీ అన్సారీ (రజి) దగ్గరకు హజ్రత్ ఉవైమిర్ అజ్లానీ (రజి) వచ్చి ఇలా అన్నారు: "ఆసిమ్! ఎవరైనా తన భార్య పక్కలో మరో (పరాయి) వ్యక్తి ఉండటం చూస్తే, మీరు ప్రతీకారం (ఖిసాస్)గా చంపినట్లు అతనా వ్యక్తిని చంపవచ్చా చెప్పండి. లేకపోతే అతనేం చేయాలి? ఆసిమ్! మీరు నా కోసం ఈ సమస్యను గురించి దైవప్రవక్త (సల్లం)ను అడిగి చెప్పండి". అప్పుడు హజ్రత్ ఆసిమ్ (రజి) ఈ సమస్యను దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించి పరిష్కారం అడిగారు. అయితే ఈ విషయమై హజ్రత్ ఆసిమ్ (రజి) అడిగిన ప్రశ్నలు దైవప్రవక్త(సల్లం)కు నచ్చలేదు. దానిపై దైవప్రవక్త (సల్లం) వ్యక్తపరచిన మాటలు విని హజ్రత్ ఆసిమ్ (రజి) ముఖం చిన్నబుచ్చుకున్నారు.

ఆ తర్వాత ఆయన ఇంటికి తిరిగొచ్చారు. హజ్రత్ ఉవైమిర్ (రజి) ఆయన్ని చూసి "ఆసిమ్! దైవప్రవక్త (సల్లం) ఏమన్నారు?" అని అడిగారు. "నువ్వు నన్ను లేనిపోని వ్యవహారంలో ఇరికించావు. దైవప్రవక్త (సల్లం) నేనడిగిన ప్రశ్న విని అయిష్టత వ్యక్తపరిచారు" అన్నారు హజ్రత్ ఆసిమ్ (రజి). హజ్రత్ ఉవైమిర్ (రజి) అది విని "దైవసాక్షి! నేనీ సమస్య గురించి దైవప్రవక్త(సల్లం)ను తప్పకుండా అడుగుతాను" అని అన్నారు. ఈ మాట చెప్పి ఆయన దైవప్రవక్త(సల్లం) సన్నిధికి వెళ్ళిపోయారు.

దైవప్రవక్త (సల్లం) ప్రజల మధ్య కొలువు తీరి కూర్చున్నారు. హజ్రత్ ఉవైమిర్ (రజి) ఆయన దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! ఒక వేళ ఎవరైనా తన భార్య పక్కలో పరాయి వ్యక్తిని చూస్తే ఏం చేయాలో చెప్పండి. అతనా వ్యక్తిని చంపవచ్చా? చంపివేస్తే చట్టం ప్రతీకారం (ఖిసాస్)గా తిరిగి అతడ్ని చంపివేస్తుందా? లేకుంటే ఇలాంటి స్థితిలో అతనేం చేయాలి?" అని అడిగారు. దైవప్రవక్త (సల్లం) ఈ ప్రశ్నలు విని "దేవుడు నీ గురించి, నీ భార్య గురించి ఆజ్ఞ అవతరింపజేశాడు. వెళ్ళి నీ భార్యను ఇక్కడికి పిలుచుకురా" అన్నారు.

హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- వాళ్ళిద్దరు (దైవప్రవక్త సన్నిధికి వచ్చి) పరస్పరం 'లిఆన్'★ (శాప ప్రమాణం) చేసుకున్నారు. ఆ సమయంలో అందరితో పాటు నేను కూడా దైవప్రవక్త(సల్లం) సన్నిధిలో కూర్చొని ఉన్నాను. ఆ తర్వాత హజ్రత్ ఉవైమిర్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను సంబోధిస్తూ "దైవప్రవక్తా! నేనిప్పుడు ఆమెను భార్యగా స్వీకరించానంటే, దానర్థం నేనామెపై అపనింద మోపానన్న మాట" అని అన్నారు. అందుచేత ఆయన ఈ విషయంలో దైవప్రవక్త(సల్లం) నుంచి మరో ఆజ్ఞ కోసం ఎదురు చూడకుండా వెంటనే తన భార్యకు మూడు విడాకులు ఇచ్చేశారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 4వ అధ్యాయం - మన్ అజాజ తలాఖుస్సలాస్]

---

★ 'లిఆన్' అనేది అసలు పదం. 'లిఆన్' అంటే పరస్పరం శపించుకోవడం అని శాబ్దిక అర్థం. షరీఅత్ పరిభాషలో "భర్త తన భార్యపై అక్రమ సంబంధపు నింద మోపి సాక్షులను తీసుకురాలేని పక్షంలో, ఆ భార్యాభర్తలు న్యాయాధికారి సమక్షంలో కొన్ని ప్రత్యేక మాటల ద్వారా సాక్ష్యం పలకడాన్ని 'లిఆన్' అంటారు. ఈ మాటల చివర్లో "సాక్ష్యం పలికే ఈ వ్యక్తి అబద్ధమాడి ఉంటే అతని లేక ఆమెపై దేవుని శాపం పడుగాక!" అనే వాక్యం ఉంటుంది. ఆ తరువాత భార్యాభర్తలు శాశ్వతంగా విడిపోతారు. ఇక ముందెన్నడూ వారిద్దరు పరస్పరం వివాహమాడలేరు.

953. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) పరస్పరం 'లిఆన్' (దూషణ ప్రమాణం) చేసుకున్న వారితో "ఇప్పుడు మీరిద్దరి లెక్క దేవుని చేతిలో ఉంది. మీరిద్దరిలో ఒకరు అబద్ధాల కోరున్నారు" అని అన్నారు. (ఆ తర్వాత ఆయన పురుష ముద్దాయిని ఉద్దేశించి) "ఇప్పుడు నీకు ఈమెతో ఎలాంటి సంబంధం లేదు" అని అన్నారు. ఆ వ్యక్తి "దైవప్రవక్తా! మరి నా సొమ్ము (మహర్) సంగతేమిటి?" అన్నాడు. "ఇప్పుడు నీకు ఎలాంటి సొమ్ము లభించదు. నువ్వు మోపిన నింద నిజమయితే నీవిచ్చిన సొమ్ముకు బదులుగా ఆమె దగ్గర నీవు దాంపత్య సుఖాన్ని అనుభవించావు. ఒకవేళ నువ్వు అపనింద మోపి ఉంటే ఆ సొమ్ము వాపసు తీసుకోవడానికి నీకు అసలే హక్కు లేదు' ' అని తీర్పిచ్చారు దైవప్రవక్త(సల్లం).

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 53వ అధ్యాయం - అల్‌ముత్ అతిల్లతి లమ్ యుఫ్రజ్‌లహా]

954. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక పురుషుని చేత, అతని భార్య చేత పరస్పరం 'లిఆన్' (దూషణ ప్రమాణం) చేయించారు. పురుషుడు ఆ సందర్భంలో పిల్లవాడు తనవాడు కాదని నిరాకరించాడు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) పిల్లవాడ్ని తల్లికి చెందినవాడిగా పరిగణించారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 35వ అధ్యాయం - యల్ హఖుల్ వలదు బిల్ ములాయినా]

955. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ముందు 'లిఆన్' (దూషణ ప్రమాణం) ప్రస్తావన వచ్చినపుడు హజ్రత్ ఆసిమ్ బిన్ అదీ (రజి) ఆ విషయంలో కొన్ని మాటలు చెప్పి వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఆయన దగ్గరికి ఆయన తెగకు చెందిన ఒకతను వచ్చి "నేను నా భార్య పక్కలో ఎవరో ఓ పరాయి వ్యక్తి ఉండటం చూశాను" అని తెలిపాడు. దానికి హజ్రత్ ఆసిమ్ (రజి) "నేనీ వ్యవహారంలో ఇంతకు ముందే నా నోట వెలువడిన మాటల కారణంగా ఇరుకున పడ్డాను" అని చెప్పి ఆ వ్యక్తిని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసుకెళ్ళారు.

అప్పుడు ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) ముందు తన భార్య పక్కలో తాను చూసిన పరాయి మనిషిని గురించి వివరాలు తెలిపాడు. అతను ఎర్రగా, బక్కపలచగా, సరళమైన శిరోజాలతో ఉన్నాడు. అతను తన భార్య పక్కలో చూశానని ఆరోపించిన అపరిచిత వ్యక్తి కండలు తిరిగి భారీ కాయంతో బొద్దుగా, చామనఛాయలో ఉన్నాడు. దైవప్రవక్త (సల్లం), "దేవా! నీవే ఈ వ్యవహారంలో వాస్తవాన్ని బట్టబయలు చేయాలి" అని ప్రార్థించారు. చివరికి ఆ స్త్రీ పిల్లవాడ్ని కనగానే నిజం బయటపడింది. పిల్లవాడిలో ఆమె భర్త ఆరోపించిన వ్యక్తి పోలికలే ఉన్నాయి. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆ స్త్రీ పురుషుల (భార్యభర్తల) చేత పరస్పరం 'లిఆన్' (దూషణ ప్రమాణం) చేయించారు.

ఈ హదీసు సమావేశంలో కూర్చొన్న ఒక వ్యక్తి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)ని ఉద్దేశించి "దైవప్రవక్త (సల్లం) ఒక స్త్రీ విషయంలో, సాక్షులు లేకుండా ఎవరికైనా రాళ్ళు రువ్వే శిక్ష విధించవలసి వస్తే తానీ స్త్రీకి రాళ్ళు రువ్వే శిక్ష విధిస్తానని అన్నారు కదా! ఆ స్త్రీ ఈమేనా?" అని అడిగాడు. దానికి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) "కాదు. ఆమె మరో స్త్రీ. ఇస్లాం హయాంలో కూడా ఆమె బహిరంగంగా వ్యభిచారం చేస్తుండేది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 31వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) లౌకున్తు రజిమన్ బిగైరి బయ్యినా]

956. హజ్రత్ ముగీరా బిన్ షేబా (రజి) కథనం:- హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) ఒకసారి ఇలా అన్నారు. "నేను నా భార్య పక్కలో పరాయి వ్యక్తిని గనక చూస్తే, అతడ్ని ఎలాంటి పరిస్థితిలోనూ క్షమించను. అతడ్ని తప్పకుండా చంపివేస్తాను." హజ్రత్ సాద్ (రజి) పలికిన ఈ పలుకులు దైవప్రవక్త(సల్లం)కు తెలిసి ఆయన ఈ విధంగా వ్యాఖ్యానించారు -

"మీరు సాద్ (రజి) పౌరుషం పట్ల ఆశ్చర్యపోతున్నారా? దైవసాక్షి! నేను అంతకంటే ఎక్కువ పౌరుషం కలవాడ్ని. దేవుడు నాకంటే ఎక్కువ పౌరుషం కలవాడు. దేవుడు తనకున్న ఈ పౌరుషం వల్లనే ఆయన అన్ని రకాల అశ్లీల విషయాల్ని అవి బహిరంగమైనవయినా లేదా రహస్యమైనవయినా సరే - నిషేధించాడు. కారణం లేకుండా దేవుడు ఏ పనీ చేయడు. ఈ విషయంలో ఆయన్ని మించిన వారెవరూ లేరు. అందువల్లనే ఆయన తన ప్రవక్తలను(పుణ్యాత్ములను) శుభవార్త అందజేసేవారిగా, (పాపాత్ములకు దైవశిక్షను గురించి) భయపెట్టే వారిగా నియమించి పంపాడు. దేవుని మించిన ప్రశంసపాత్రుడు మరెవరూ లేరు. అందువల్లనే ఆయన (తనను స్తుతించే వారికి) స్వర్గ ప్రవేశం గురించి వాగ్దానం చేశాడు."

[సహీహ్ బుఖారీ : 97వ ప్రకరణం - తౌహీద్, 20వ అధ్యాయం - ఖౌలిన్నబీ (సల్లం) లాషఖ్స అగ్‌మర్ మినల్లాహ్]

957. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నాకొక మగపిల్లవాడు పుట్టాడు. కాని నల్లగా ఉన్నాడు, నేను ఎర్రగా ఉన్నాను. (ఇది ఎలా సంభవం)?" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "నీ దగ్గర ఒంటెలున్నాయా?" అని అడిగారు. అతను 'ఉన్నాయి' అన్నాడు. "అయితే అవి ఏ రంగులో ఉన్నాయి?" అడిగారు దైవప్రవక్త (సల్లం) మళ్ళీ. "ఎర్ర రంగులో ఉన్నాయి" అన్నాడతను. "వాటిలో ఏదైనా బూడిద రంగు ఒంటెలు కూడా ఉన్నాయా?" అని అడిగారు దైవప్రవక్త(సల్లం). "బూడిద రంగువి కూడా ఉన్నాయి" అన్నాడతను. "మరి ఈ బూడిద రంగు ఒంటెలు ఎక్కడ్నుంచి వచ్చాయి?" ప్రశ్నించారు దైవప్రవక్త (సల్లం). "వాటికి వాటి తాత ముత్తాతలలో ఎవరి రంగయినా వచ్చి ఉంటుంది" సమాధానమిచ్చాడు ఆ వ్యక్తి. "అదే విధంగా నీ కొడుక్కు కూడా అతని తాత ముత్తాతలలో ఎవరి రంగయినా వచ్చి ఉంటుంది కదా!" అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 26వ అధ్యాయం - ఇజాఅరజబిన ఫిల్ వలద్]

# బానిస విమోచనా ప్రకరణం

958. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా ఉమ్మడి యాజమాన్యం క్రింద ఉన్న బానిసకు తన భాగం మేరకు స్వేచ్ఛ నివ్వదలచినపుడు అతని దగ్గర బానిస విమోచనానికి కావలసిన మిగతా ధర అంత పైకం గనక ఉంటే, బానిస ధరను న్యాయవంతంగా నిర్ణయించి ఇతర భాగస్వాములకు రావలసిన మొత్తాన్ని అతనే తన పైకం నుండి చెల్లించి ఆ బానిసకు పూర్తిగా విముక్తి కలిగించాలి. అలా చేయలేకపోతే అతను బానిసకు ఏ మేరకు స్వాతంత్ర్యం ఇస్తాడో ఆ మేరకు ఆ బానిస స్వేచ్ఛాపరుడవుతాడు."

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 4వ అధ్యాయం - ఇజా ఇత్ఖ్ అబ్దమ్ బైనస్ నైన్]

## 1వ అధ్యాయం - బానిస కూలినాలి చేసి ఆ డబ్బుతో తన ధర చెల్లించి స్వేచ్ఛ పొందవచ్చు

959. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఒకవేళ ఎవరైనా ఉమ్మడి యాజమాన్యం క్రింద బానిసకు తన భాగం మేరకు స్వేచ్ఛనివ్వదలిస్తే అతను తన సంపద నుండి మిగతా ధర కూడా (ఇతర వాటాదారులకు) చెల్లించి ఆ బానిసకు పూర్తిగా విముక్తి కలిగించాలి. అతని దగ్గర అంత పైకం లేకపోతే, బానిస ధరను న్యాయవంతంగా నిర్ణయించి, కూలినాలి ద్వారా సంపాదించి మిగతా పైకాన్ని చెల్లించి పూర్తిగా స్వేచ్ఛాపరుడయ్యేందుకు బానిసకు వీలు కల్పించాలి. అయితే ఈ విషయంలో బానిసపై ఎలాంటి ఒత్తిడి తీసుకురాకూడదు."(1)

[సహీహ్ బుఖారీ : 47వ ప్రకరణం - షిర్కత్, 5వ అధ్యాయం - తఖ్వీముల్ అష్యాయి బైన షురా్కా]

## 2వ అధ్యాయం - 'విలా' (స్వేచ్ఛాపరుడైన బానిస) విముక్తి కలిగించిన వారి కొరకే

960. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ బరీరా (రజి) నా దగ్గరకు వచ్చి "ముకాతబత్"(2) (బానిస ఒప్పందం)లో నా సహాయాన్ని అర్థించింది. ఆమె అప్పటిదాకా ఒప్పందానికి సంబంధించిన నిర్ణీతపైకాన్ని చెల్లించలేకపోయింది. అప్పుడు నేను ఆమెతో "నీ యజమానులతో మాట్లాడు. వారు గనక ఒప్పుకుంటే

---

(1) ఉదాహరణకు:- జైద్, ఉమర్‌లు ఒక బానిసలో సగం సగం వాటాదారులుగా ఉన్నారు. జైద్ తన వాటా మేరకు బానిసకు విముక్తి కలిగించిన పక్షంలో అతను ఉమర్ వాటాను కూడా చెల్లించి బానిసను పూర్తిగా స్వేచ్ఛాపరుడిగా చేయాలి. ఒకవేళ జైద్ దగ్గర అంత డబ్బులేకపోతే బానిసకు సమంజసమైన ధర నిర్ణయించి, అతనితో 'నీవు కూలినాలి చేసుకొని మిగతా సగం ధరను స్వయంగా చెల్లించి పూర్తి స్వాతంత్ర్యం సంపాదించుకో" అని చెప్పాలి. అయితే ఈ విషయాన్ని బానిస ఇష్టాయిష్టాలకు వదిలెయ్యాలి. అతనిపై ఎలాంటి ఒత్తిడి తీసుకు రాకూడదు.

(2) బానిస కూలినాలి చేసి తన నిర్ణీత ధరకు సమానమైన పైకం సంపాదించి యజమానికి చెల్లించాలని, యజమాని దాన్ని స్వీకరించి అతడ్ని బానిసత్వం నుండి విముక్తి కలిగించాలని వారిద్దరి మధ్య ఒప్పందం జరుగుతుంది. దీన్నే "ముకాతబత్" అంటారు. ఆ ఒప్పందంలోని యజమాని, బానిస ఇద్దర్నీ "ముకాతిబ్"గా వ్యవహరిస్తారు.

నేను నీ బానిస ఒప్పందం పైకం చెల్లించడానికి సిద్ధంగా ఉన్నాను. అయితే నీ 'విలా'★ హక్కు నాకు చెందాలని చెప్పు" అని అన్నాను.

హజ్రత్ బరీరా (రజి) వెళ్ళి ఈ విషయాన్ని తన యజమానులకు విన్పించింది. కాని వారు అందుకు అంగీకరించకుండా "హజ్రత్ ఆయిషా (రజి)గారు పుణ్యఫలాపేక్షతో నీ దాస్య ఒప్పందం పైకం చెల్లించదలచుకుంటే చెల్లించుకోమను. కాని నీ 'విలా' హక్కు మాకు దక్కాలి" అని అన్నారు.

ఈ సంగతి నేను దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించాను. అప్పుడాయన "నీ వామెను కొని స్వతంత్రురాలిని చెయ్యి. బానిస విముక్తి కలిగించిన వారిదే 'విలా' హక్కు అవుతుంది" అని అన్నారు.

ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) మస్జిదులో నిల్చొని ప్రసంగిస్తూ "జనం దైవ గ్రంథంలో లేని షరతులు విధిస్తున్నారు, ఏమయింది వారికి? ఎవరైనా దైవగ్రంథంలో లేని షరతులు గనక విధిస్తే అవి ఏ మాత్రం చెల్లవు. అలాంటి వంద షరతులు విధించినా సరే ప్రయోజనం లేదు. దేవుడు అనుమతించిన షరతులు మాత్రమే సరయినవి, పటిష్టమైనవి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 50వ ప్రకరణం - ముకాతిబ్, 2వ అధ్యాయం - మాయజూజ మిన్ షురూతిల్ ముకాతిబ్]

961. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ బరీరా (రజి) వ్యవహారం కారణంగా మూడు చట్టాలు ఉనికిలోని వచ్చాయి. ఒకటి: ఆమె స్వతంత్రురాలయిపోతే ఆమెకు తన వివాహ బంధం కొనసాగించడానికి లేదా త్రెంచి వేయడానికి అధికారం ఇవ్వబడింది. రెండు: దైవప్రవక్త (సల్లం) ఈ విషయంలో బానిసకు స్వేచ్ఛనిచ్చిన వారికే 'విలా' హక్కు ఉంటుందని తీర్పు ఇచ్చారు. మూడు: దైవప్రవక్త (సల్లం) నా ఇంటికి వచ్చినపుడు కుండలో మాంసం కుతకుత ఉడకసాగింది. అయితే ఆయన ముందు రొట్టె, ఇంట్లో వండిన మామూలు కూర మాత్రమే ఉంచాను. దైవప్రవక్త (సల్లం) అది చూసి "కుండలో మాంసం కూర ఉడకడం నేను చూడలేదనుకున్నావా?" అని అన్నారు. "అది ఉందండీ! కాని అది బరీరా (రజి)కు ఎవరో దానంగా ఇచ్చిన మాంసం. మీరు దానం స్వీకరించరు కదా!" అన్నాను నేను. దానికి దైవప్రవక్త (సల్లం) "దానం ఆమె కోసం, కాని ఇప్పుడిది (ఆమె తరఫున మనకు లభించింది కనుక) మనకు కానుక అవుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 14వ అధ్యాయం - లాయకూన బైవుల్ అమత తలాఖా]

## 3వ అధ్యాయం - 'విలా'ను అమ్మడం, ఇతరులకు కానుకగా కట్టబెట్టడం నిషిద్ధం

962. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) 'విలా' (స్వేచ్ఛాపరుడయిన బానిస)ను అమ్మివేయడాన్ని, ఇతరులకు కానుకగా కట్టబెట్టడాన్ని నిషేధించారు.

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 10వ అధ్యాయం - బైవుల్ విలా వ హిబ]

---

★ 'విలా' అంటే స్వేచ్ఛ పొందిన బానిసపై స్వేచ్ఛ ప్రసాదించిన బానిసకు లభించే షరీఅత్ పరమైన హక్కు అని అర్థం. అంటే స్వాతంత్ర్యం ప్రసాదించినవాడు స్వాతంత్ర్యం పొందిన వ్యక్తికి (అతని మరణానంతరం అతని ఆస్తికి) వారసుడు అవుతాడన్నమాట. అసలు 'విలా' అంటే సహాయం, స్నేహం, ప్రేమ, బంధుత్వం వగైరా శాబ్దిక అర్థాలున్నాయి. అయితే ఈ పదం బానిసకు స్వేచ్ఛనిచ్చే వ్యవహారానికి మాత్రమే ప్రత్యేకించబడింది.

## 4వ అధ్యాయం - స్వేచ్ఛ ప్రసాదించిన వారిని కాకుండా ఇతరుల్ని సంరక్షకులుగా చేసుకోవడం నిషిద్ధం

963. హజ్రత్ అలీ (రజి) కాల్చిన ఇటుకలతో కట్టిన వేదిక (మెంబర్)పై నిలబడి ప్రసంగిస్తున్నారు. అప్పుడు ఆయన దగ్గర ఒక ఖడ్గం ఉంది. దానికి ఓ చిరుపుస్తకం వ్రేలాడదీయబడి ఉంది. హజ్రత్ అలీ (రజి) ప్రసంగిస్తూ "దైవసాక్షిగా చెబుతున్నాను. మన దగ్గర చదవడానికి దైవగ్రంథం (ఖుర్‌ఆన్) లేదా ఈ చిరు పుస్తకం తప్ప మరేమీ లేదు" అని అన్నారు. ఆ తర్వాత ఆ చిరు పుస్తకాన్ని తెరిచారు. అందులో ఒంటెల వయస్సుల ప్రస్తావన ఉంది. (అంటే రక్తపరిహారం, జకాత్‌ల క్రింద ఇవ్వవలసిన ఒంటెల సంఖ్య, వాటి వయస్సులు అందులో పేర్కొనబడ్డాయి) ఇంకా అందులో ఈ విధంగా రాయబడి ఉంది.

"మదీనా సరిహద్దు అయిన ఐర్ కొండ నుండి ఇక్కడి (అంటే సౌర్ కొండ) దాకా గల నేల నిషిద్ధ ప్రదేశంగా నిర్ణయించబడింది. అందువల్ల ఇక్కడ (మదీనా) ఎవరైతే ఇస్లాంలో లేని కొత్త మత సంప్రదాయాన్ని పాటిస్తాడో అతడ్ని దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు. పైగా అతని ఫర్జ్ ఆరాధన గాని, నఫిల్ ఆరాధన గాని స్వీకరించబడదు.★ మాటకు కట్టుబడి ఉండటం, ఇతరులకు ఆశ్రయమివ్వడం ముస్లింల ఉమ్మడి బాధ్యత. ఒక సాధారణ ముస్లిం కూడా ఇతరులకు (అంటే ముస్లిమేతరులకు) ఆశ్రయమిస్తే దాన్ని గౌరవించడం జరుగుతుంది. అందువల్ల ఒక ముస్లిం (ఎవరికైనా) ఆశ్రయమిస్తానని వాగ్దానం చేసినపుడు, అతని వాగ్దానాన్ని కాలరాసే చర్యకు ఎవరైనా పాల్పడితే అలాంటి వ్యక్తిని దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు. దేవుడు అతని ఫర్జ్ ఆరాధనల్ని స్వీకరించడు. నఫిల్ ఆరాధనల్ని స్వీకరించడు. అలాగే ఎవరైనా తన యజమానుల అనుమతి లేకుండా ఏదైనా జాతితో తన సంరక్షణ కోసం ఒప్పందం చేసుకుంటే అలాంటి వ్యక్తిని కూడా దేవుడు, దైవదూతలు, యావత్తు మానవులు శపిస్తారు. దేవుడు అతని ఫర్జ్, నఫిల్ ఆరాధనల్లో వేటినీ స్వీకరించడు."

[సహీహ్ బుఖారీ : 96వ ప్రకరణం - ఏతెసామ్, 5వ అధ్యాయం - మాయుక్రహు మినత్తాముఖి వతనాజ ఫిల్ ఇల్మ్]

## 5వ అధ్యాయం - బానిసకు స్వేచ్ఛనిస్తే లభించే పుణ్యం, ఆ సత్కార్యం ఘనత

964. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా వ్యక్తి ముస్లిం (స్త్రీ లేక పురుషునికి) దాస్య విముక్తి కలిగిస్తే ఆ బానిసకున్న ప్రతి అవయవానికి బదులుగా దేవుడు ఆ స్వేచ్ఛా ప్రదాతకు నరకం నుంచి విముక్తి కలిగిస్తాడు".

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 1వ అధ్యాయం - మాజాఫిల్ ఇత్ఖి వఫజ్లిహీ]

---

★ మూలభాషలో వచ్చిన పదాలను బట్టి ఒక అర్థంపైన అనువాదంలోనిది అయితే, మరొక అర్థం ఇది కూడా కావచ్చు. "దేవుడు అతను పశ్చాత్తాపంతో చేసిన వేడుకోలును స్వీకరించడు, అతను పాప పరిహారం ఇచ్చుకున్నా ప్రాణం దక్కించుకోలేడు."

# వాణిజ్య ప్రకరణం

## 1వ అధ్యాయం - అస్పష్ట విధానాల ద్వారా వ్యాపారం చేయడం అక్రమం

965. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (స) వస్తువుని చేత్తో తాకడం ద్వారా, చేతిలోకి తీసుకొని విసరి వేయడం ద్వారా వ్యాపార నిర్ధారణ చేయడాన్ని నిషేధించారు.[1]

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 63వ అధ్యాయం - బైఉల్ మనాబిజా ]

966. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- రెండు ఉపవాసాలను రెండు రకాల క్రయ విక్రయాలను (దైవప్రవక్త(స) కాలంలో) వారించడం[2] జరుగుతుండేది. ఒకటి; ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్హా దినాలలో ఉపవాసం పాటించడం. రెండు; తాకడం, తీసుకొని విసరడంల ద్వారా వ్యాపారం చేయడం.

[సహీహ్ బుఖారీ : 30వ ప్రకరణం - సౌమ్, 67వ అధ్యాయం - అస్సౌమి యౌమున్నహ్ర్]

967. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (స) రెండు రకాల వస్త్ర ధారణల నుండి (ముస్లింలను) వారించారు. అలాగే అమ్మకం కొనుగోళ్ళ వ్యవహారంలో వస్తువుని చేత్తో తాకడం, విసరి వేయడం ద్వారా వ్యాపార నిర్ధారణ చేయడం నుండి కూడా వారించారు.

తాకి నిర్ధారణ చేయడమంటే ఒక వ్యక్తి రాత్రి గాని, పగలు గాని రెండవ వ్యక్తికి చెందిన వస్త్రాన్ని అటూ ఇటూ తిప్పి చూడకుండా కేవలం చేత్తో తాకి కొనుగోలు ఒప్పందానికి రావడం అన్నమాట. విసరి నిర్ధారణ చేయడమంటే పరికించకుండా, (నోటి మాటలతో) అంగీకారం తెలుపకుండా ఒక వ్యక్తి తన వస్త్రాన్ని రెండవ వ్యక్తి వైపుకు విసరడం, రెండవ వ్యక్తి తన వస్త్రాన్ని మొదటి వ్యక్తి వైపు విసరడం ద్వారా వ్యాపార ఒప్పందానికి రావడం అన్నమాట.

నిషేధించిన రెండు రకాల వస్త్రధారణల విషయానికి వస్తే అందులో ఒకటి, వస్త్రాన్ని ఒక భుజం (నగ్నంగా) వదలి, రెండవ భుజం మీదుగా వేసుకొని కట్టుకోవడం. రెండవ పద్ధతి, ముందు వైపు నుంచి మర్మావయం కన్పించేలా వస్త్రం చుట్టుకొని కూర్చోవడం.

[సహీహ్ బుఖారీ : 77వ ప్రకరణం - లిబాస్, 20వ అధ్యాయం - ఇష్తిమాలిస్సమా]

---

(1) ఇక్కడ మూలభాషలో "ములామస; మునాబజ" అనే పదాలు వచ్చాయి. ఇవి రెండూ వ్యాపార నిర్ధారణ కోసం పూర్వం అరేబియాలో వాడే పదాలు. (1) నీవు గనక నా వస్త్రాన్ని తాకితే బేరం కుదిరినట్లే అని అమ్మకందారుడు కొనుగోలుదారుడుతో అంటాడు. దీన్ని "ములామస" వ్యాపారం అంటారు. ఈ వ్యాపారంలో కొనుగోలుదారుడు బట్ట నాణ్యతను పూర్తిగా పరిశీలించడానికి వీల్లేదు. (2) రెండో వ్యాపార విధానంలో అమ్మకందారుడు ఈ వస్త్రాన్ని వంద రూపాయలకు నీ వైపు విసురుతున్నానంటాడు. కొనుగోలుదారుడు దానికి అంగీకరించి ఆ వస్త్రాన్ని పట్టుకుంటాడు. దాంతో బేరం అయిపోయినట్లే. దీన్ని "మునాబస" అంటారు. ఈ రెండు వ్యాపార విధానాలను దైవప్రవక్త(సల్లం) నిషేధించారు.

(2) వారించడం అంటే ఇక్కడ 'నిషేధించడం' అని అర్థం. అంటే ఇలా చేయడం హరాం (నిషిద్ధం) అని భావించబడేది.

## 3వ అధ్యాయం - పశుపిల్లను తల్లి కడుపులో ఉండగానే కొనడం నిషిద్ధం

968. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఒంటె కడుపులో ఉన్న ఒంటె పిల్లను అమ్మి వేయడాన్ని నిషేధించారు. ఈ విధమైన వ్యాపారం అజ్ఞాన కాలంలో ఉండేది. (అనాడు) ఒక వ్యక్తి (ఉనికిలోకే రాని ఒక) ఒంటెను కొనే ముందు అమ్మే వాడితో ఒప్పందం చేసుకుంటూ "సూడి ఒంటె కడుపులో ఉన్న పిల్ల (బయటికొచ్చి) పెరిగి పెద్దదయి ఈనాలి" అని మాట్లాడుకుంటాడు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 61వ అధ్యాయం - బైయిల్ గరరి వ హబ్లిల్ హబ్లా]

## 4వ అధ్యాయం - బేరం మీద బేరం చేయడం, కొనే ఉద్దేశ్యం లేకుండా ధర పెంచడం, మోసం చేయడానికి పొదుగులో పాలను ఆపి ఉంచడం నిషిద్ధం

969. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ఆదేశించారు :-

"ఒక ముస్లిం తన తోటి ముస్లిం సోదరుడు బేరం చేస్తుంటే అతని బేరం మీద బేరం చేయకూడదు".

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 58వ అధ్యాయం - లా యబీవు అలా బైయి అఖీహి వలా యసూమ్]

970. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:-

"పశువులు, వాహనాలపై సరుకులు తెస్తున్నవారు మార్కెట్‌కు చేరుకోకముందే మీరుఎదురేగి వారిని కలుసుకోకండి. ఇతరులు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు గురించి మీరు బేరం చేయకండి. కొనే ఉద్దేశ్యం లేకుండా (ఇతరుల్ని మోసగించడానికి) పాట పాడి ధరలు పెంచకండి. పట్టణవాసి బయట నుండి వచ్చే (గ్రామీణ) వ్యక్తి దగ్గరి సరుకును అమ్మకూడదు. మేక పొదుగులో పాలను ఆపి ఉంచకూడదు. ఒకవేళ ఎవరైనా (మోసపోయి) అలాంటి పశువును కొన్న పక్షంలో, పాలు పితుక్కున్న తరువాత ఆ మేకను ఇష్టమయితే ఉంచుకోవడానికి, ఇష్టం లేకపోతే ఒక 'సా' ఎత్తు ఖర్జూర పండ్లిచ్చి వాపసు చేయడానికి అతనికి హక్కుంది".

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 64వ అధ్యాయం - అన్న హిలిల్ బాయి అన్‌ల్లా యుహఫ్ఫిలల్ ఇబ్లిల్...]

971. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త(స) ఈ క్రింది పనులు చేయకూడదని వారించారు: (ఒకటి) వ్యాపార సరుకులు తెచ్చే వాణిజ్య ఒప్పందాలకు ఎదురేగి వారితో మాట్లాడటం. (రెండు) పట్టణ (స్థానిక) వ్యక్తి గ్రామీణుని దగ్గరున్న సరుకును (అత్యధిక లాభాలకు అమ్ముకోవడానికి) కొనడం. (మూడు) స్త్రీ తాను పెళ్ళి చేసుకోదలచిన పురుషునికి అతను తన మొదటి భార్యకు విడాకులివ్వాలని షరతు విధించడం. (నాలుగు) ఒక ముస్లిం తన తోటి ముస్లిం సోదరుడు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు కోసం పోటాపోటీగా బేరం చేయడం. (ఐదు) కొనే ఉద్దేశ్యం లేకుండా వస్తువు ధరను (పాటపాడి) పెంచేయడం. (ఆరు) కొనుగోలుదారుడ్ని ఎక్కువ పాలిచ్చే పశువని భ్రమింపజేయడానికి పశువు పొదుగులో పాలు ఆపి ఉంచడం.

[సహీహ్ బుఖారీ : 54వ ప్రకరణం - షురూత్, 11వ అధ్యాయం - అష్షురూతి ఫిత్తలాఖ్]

## 5వ అధ్యాయం - పట్టణం వెలుపలి కెళ్ళి వాణిజ్య బృందాల దగ్గర సరుకు కొనడం నిషిద్ధం

972. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- పాలు పితకనందున పెద్ద పొదుగున్న మేకని భ్రమపడి ఎవరైనా దాన్ని కొన్న తరువాత (మోసం గ్రహించి) వాపసు చేయదలచుకుంటే అతనా మేకతో పాటు ఒక 'సా' ఎత్తు ఖర్జూర పండ్లు కూడా (మేక యజమానికి) ఇచ్చి వేయవలసి ఉంటుంది. పోతే పట్టణం వెలుపల వాణిజ్య బృందాలకు ఎదురేగి వారి దగ్గర సరుకు కొనడాన్ని దైవప్రవక్త(సల్లం) వ్యతిరేకించారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 64వ అధ్యాయం - అన్నహిలిల్ బాయి అల్లా యుహఫ్ఫిలల్ ఇబ్లి....]

## 6వ అధ్యాయం - స్థానికుడు (పట్టణవాసి) గ్రామస్థుని సరుకు కొని (అమ్మడం) నిషిద్ధం

973. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "మీరు అమ్మకంలో అత్యధిక లాభాలు గడించే ఉద్దేశంతో పట్టణం వెలుపలికెళ్ళి వర్తక బిడారాలను ముందుగా వెళ్ళి కలుసుకోకండి. పట్టణవాసి బయట నుండి సరుకులతో వచ్చే గ్రామీణుని సరుకు అమ్మకూడదు."

ఈ హదీసుని ఉల్లేఖించినవారు హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)ని "పట్టణవాసి గ్రామీణుని కొరకు సరుకు అమ్మడం అంటే ఏమిటి?" అని అడిగారు. దానికి ఆయన "అంటే దళారిగా మారకూడదని అర్థం" అన్నారు.

[సహీహ్ బుఖారీ: 34వ ప్రకరణం - బుయూ, 68వ అధ్యాయం - హల్‌యబీవు హాజిరుల్లిబాద్ బిగైరి అజ్రిన్ వహల్]

974. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- స్థానిక వ్యక్తి బయట నుండి వచ్చేవారి సరుకును (దళారిగామారి) అమ్మకూడదని మాకు ఆజ్ఞాపించబడింది.★

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 70వ అధ్యాయం - లాయబీవు హాజిరుల్లి బాదిన్ బిస్సమ్సరా]

---

★ ఈ హదీసుల ద్వారా దళారితనం హరాం (నిషిద్ధం) అని స్పష్టంగా తెలుస్తోంది. సలఫీ ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం, బయట నుంచి వచ్చే వ్యాపారస్థుని వాణిజ్య సామగ్రిని ఎక్కువ ధరకు అమ్మే ఉద్దేశ్యంతో తీసుకొని తన దగ్గర ఉంచుకుంటే అది అక్రమ చర్య (హరాం) అవుతుంది. అయితే ఆ వస్తువులు ప్రజలకు అప్పుడు అవసరం లేకపోతే అతనా వ్యాపార సామగ్రిని తన దగ్గర పెట్టుకొని ప్రజలకు అవసరమొచ్చినప్పుడు అమ్మవచ్చు. ఇందులో తప్పులేదు. అయితే ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై), ముజాహిద్ (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం, బయట నుంచి వచ్చిన వ్యాపారస్థుడి వర్తక సామగ్రిని స్థానికుడు అమ్మి పెట్టడం ధర్మసమ్మతమే. ఈ వ్యవహారం బయట నుండి వచ్చిన వ్యాపారి పట్ల స్థానికుడి సత్ప్రవర్తన క్రిందికి వస్తుంది. ఇలాంటి వ్యాపార వ్యవహారం అక్రమం, అధర్మం అని పేర్కొన్న హదీసులు వీరిద్దరి దృష్టిలో వీగిపోయినట్లే. నిజం దేవునికే ఎరుక.

- నవవీ (రహ్మాలై).

## 8వ అధ్యాయం - కొన్న వస్తువుని స్వాధీనం చేసుకోకముందే మరొకనికి అమ్మడం ధర్మ సమ్మతం కాదు

975. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:-- దైవప్రవక్త (సల్లం) ధాన్యం, అపరాలను గురించి వాటిని (అమ్మకందారుడి నుండి) స్వాధీనం చేసుకోకముందే (మరొకనికి) అమ్మకూడదని ఆంక్ష విధించారు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉద్దేశ్యంలో ఈ ఆజ్ఞ ఇలాంటి వస్తువులకు మాత్రమే గాని అన్ని వస్తువులకు వర్తించదు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 55వ అధ్యాయం - బైఇత్తఆమిఖబ్ల అయ్యుఖ్బజ్]

976. హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ధాన్యం లేక అపరాలను కొన్న తరువాత వాటిని స్వాధీనం చేసుకోనంతవరకు మరొకరికి అమ్మకూడదు."★

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 51వ అధ్యాయం - అల్‌కైలి అలల్ బాయి వల్ మాతి]

977. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ప్రజలు పెద్ద మార్కెట్‌లో సరుకు కొని అక్కడ ఒక చోట వాటిని అమ్మేవారు. దైవప్రవక్త(సల్లం) సరుకును అదే చోట అమ్మకూడదని, దాన్ని తీసికెళ్ళి వేరే చోట అమ్ముకోవాలని ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 72వ అధ్యాయం - మున్తహ అత్తలఖీ ]

## 10వ అధ్యాయం - కొనేవాడు, అమ్మేవాడు వ్యాపార సమావేశంలో ఉన్నంత వరకు వ్యాపార వ్యవహారాన్ని కొనసాగించడానికి లేదా రద్దు పరచడానికి వారికి హక్కుంది

978. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- కొనేవారు, అమ్మేవారు ఇద్దరూ వ్యాపారం జరుగుతున్న చోట ఉన్నంతవరకు వారికి వ్యాపార వ్యవహారాన్ని కొనసాగించడానికి లేదా రద్దు పరచడానికి హక్కుంది. అయితే హక్కుకు సంబంధించిన షరతు ఏదైనా పెడితే ఆ షరతును బట్టి హక్కుంటుంది.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 44వ అధ్యాయం - అల్‌బయ్యుఆనిబిల్ ఖియారి మాలమ్]

979. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రవచించారు:- "కొన్నవాడు, అమ్మినవాడు వ్యాపార వ్యవహారం జరిగిన చోట కలిసి ఉన్నంతవరకు వారికి వ్యాపార వ్యవహారం ఖాయపరచడానికి లేదా రద్దు చేయడానికి హక్కు ఉంటుంది. లేదా దాన్ని ఖాయపరచడానికి

---

★ ఇమామ్ షాఫయి (రహ్మాలై) ప్రకారం ఒక్క ధాన్యం, అపరాలే కాదు స్థిర, చర వస్తువులన్నీ స్వాధీనంలోకి తీసుకోకముందే అమ్మడం ధర్మ సమ్మతం కాదు. అయితే ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం భూమి, ఇల్లు, తోట మొదలైన స్థిరాస్తులు స్వాధీనం చేసుకోవడానికి ముందే అమ్మడం ధర్మ సమ్మతమే. ఎక్కువ మంది ధర్మవేత్తలు ఈ అభిప్రాయాన్నే సమర్థించారు.

లేదా రద్దు పరచడానికి ఒకరికొకరు అధికారం ఇచ్చుకోవచ్చు. ఆ తర్వాత వారిద్దరు వ్యాపార వ్యవహారాన్ని అమలు పరచడానికి అంగీకరిస్తే అప్పుడు కూడా ఆ వ్యవహారం ఖాయమయిపోతుంది. ఒకవేళ వారిద్దరు వ్యాపార వ్యవహారం జరుపుకున్న తరువాత పరస్పరం విడిపోతూ ఇద్దరిలో ఏ ఒక్కరూ సరుకును మానుకునే విషయం ప్రస్తావించకపోతే అప్పుడు కూడా వ్యాపార వ్యవహారం ఖాయమయిపోతుంది (ఇక దాన్ని రద్దు చేసే హక్కు ఉండదు)".

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 45వ అధ్యాయం - ఇజాఖైర అహదుహుమా సాహిబ బాదల్ బైయి వజిబల్‌బై]

## 11వ అధ్యాయం - వ్యాపారంలో నిజం చెప్పడం, నిజమైన మాట పలకడం గురించి

980. హజ్రత్ హకీం బిన్ హిజామ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "కొనేవారు, అమ్మేవారు పరస్పరం విడిపోనంతవరకు వారిద్దరికి (వ్యాపార వ్యవహారాన్ని రద్దు పరచడానికి లేదా ఖాయపరచడానికి) హక్కుంటుంది. వ్యాపార వ్యవహారంలో వారిద్దరు నిజం చెప్పి, ఏ విషయాన్నీ దాచకుండా పరస్పరం స్పష్టంగా మసలుకుంటే అలాంటి వ్యాపారంలో ఇద్దరికీ శుభం కలుగుతుంది. దానికి భిన్నంగా వారిద్దరు అబద్ధమాడి పరస్పరం (సరుకు) లోపాలను దాచినట్లయితే ఆ వ్యాపారంలో వారిద్దరికీ ఎలాంటి శుభం చేకూరదు."

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 19వ అధ్యాయం - ఇజా బయ్యనల్ బైఆని వకమ్ యక్తుమా]

## 12వ అధ్యాయం - వ్యాపారంలో మోసపోయినవాడు ఏం చేయాలి?

981. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- వ్యాపారంలో నిరంతరం మోసానికి గురవుతున్న ఒక వ్యక్తిని గురించి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావన వచ్చింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నీవు ఏదైనా కొనేటప్పుడు గాని లేదా అమ్మేటప్పుడు గాని మోసం చేయకూడదని ముందే చెప్పేయాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 48వ అధ్యాయం - మాయక్రహు మినల్ ఖిదాయి ఫిల్‌బై]

## 13వ అధ్యాయం - పండ్లు వాడేందుకు యోగ్యమయినవి కానంత వరకు వాటిని చెట్ల మీద ఉండగానే అమ్మడం నిషిద్ధం

982. హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) కథనం:- పండ్లు వాడేందుకు యోగ్యమైనవని స్పష్టం కానంతవరకు వాటిని అమ్మకూడదని దైవప్రవక్త(సల్లం) వారించారు. ఆయన కొనేవాడిని, అమ్మేవాడిని కూడా వారించారు.★

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 85వ అధ్యాయం - బైయిష్షిమారి ఖబ్ల అన్‌య్యబ్దు సలాహిహా]

---

★ పండ్లు, కాయలు కోయనివ్వకుండా చెట్లకే ఉండనివ్వాలని షరతు పెట్టి వ్యాపారం చేయకూడదు. వ్యాపారం జరిగిన తరువాత అవి చీడపట్టి చెడిపోవచ్చు లేదా మరేదైనా కారణం వల్ల పంటకు నష్టం కలగవచ్చు. అప్పుడు అమ్మకందారుడు తన సోదరుని డబ్బు అప్పనంగా ఎగరేసుకున్న వాడవుతాడు. అదే విధంగా ఎలాంటి షరతు లేకుండా అమ్మడం కూడా ధర్మసమ్మతం కాదు. కాకపోతే పండ్లు బాగా పలకమారి పంటకు వచ్చినప్పుడు అమ్మడం, కొనడం ధర్మసమ్మతమే.

983. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- పండ్లు బాగా పెరిగి పంటకు రానంతవరకూ వాటిని అమ్మకూడదని దైవప్రవక్త (సల్లం) వారించారు. అలాగే ఆ పండ్లను అరాయా[1] (నగదు చేతిలో లేని నిరుపేద కొనుగోలుదారుల) విషయంలో తప్ప దిర్హం, దీనార్‌లకు (అంటే నగదు పైకానికి) మాత్రమే అమ్మాలని ఆయన (సల్లం) ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 83వ అధ్యాయం -బైయిస్సమరి అలా రూసిన్నఖ్లి బిజ్జహబి వల్ ఫిజ్జహ్]

984. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ఖర్జూరపండ్లు తినడానికి యోగ్యమవనంతవరకు లేదా బరువయినవి కానంత వరకు వాటిని అమ్మకూడదని దైవప్రవక్త(సల్లం) వారించారు. అప్పుడు "బరువైనవి అంటే ఏమిటీ?" అని ఎవరో అడిగితే (సమావేశంలో కూర్చొన్న) ఒక వ్యక్తి, "అంటే నిల్వ చేయడానికి వీలయినవి (బాగా పండి పంటకు వచ్చినవి) అని అర్థం" అన్నారు.

[సహీహ్ బుఖారీ : 35వ ప్రకరణం - సల్మ్, 4వ అధ్యాయం - అస్సలమి ఫిన్నఖ్ల్]

## 14వ అధ్యాయం - పచ్చి ఖర్జూర పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్మడం నిషిద్ధం

985. హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) కథనం:- నగదు డబ్బు చేతిలో లేని నిరుపేద అమ్మకందారులు తమ (తోటలోని పచ్చి) ఖర్జూర పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్ముకోవచ్చని దైవప్రవక్త (సల్లం) అనుమతినిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 82వ అధ్యాయం - బైఇల్ ముజాబినతి వహియయబైవుస్సమరి బిత్తమర్]

986. హజ్రత్ సహెల్ బిన్ అబీ హస్మా (రజి) కథనం:- చెట్టు మీది ఖర్జూర పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్మకూడదని దైవప్రవక్త(సల్లం) వారించారు. అయితే నగదు డబ్బు చెల్లించలేని నిరుపేదలు తాజాపండ్లు తినడానికి వీలుగా వారు (తమ చెట్లమీది పండ్లను) అంచనా[2] వేసుకొని ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్ముకోవచ్చని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 83వ అధ్యాయం - బైయిస్సమరి అలా రూసిన్నఖ్లి బిజ్జహబి వల్ఫిజ్జ]

987. హజ్రత్ రాఫె బిన్ ఖుదీజ్ (రజి), హజ్రత్ సహెల్ బిన్ అబీ హస్మ (రజి)ల కథనం:- చెట్ల మీది తాజా ఖర్జూర పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్మకూడదని దైవప్రవక్త (సల్లం) వారించారు. అయితే నగదు డబ్బు చెల్లించలేని నిరుపేదలకు మాత్రమే అలా అమ్మేందుకు అనుమతి ఉంది.

[సహీహ్ బుఖారీ : 42వ ప్రకరణం - ముసాఖాత్, 17వ అధ్యాయం - అర్రజులు యకూనులహూ మమ్రావు....]

---

(1) తోట యజమాని తన తోటలో నుండి పండ్లు కోసి ఉన్న కొన్ని చెట్లను ఎవరైనా పేదవాడికి దానం చేసిన పక్షంలో ఆ పేదవాడు తన దగ్గర నగదు పైకం, వెండి బంగారాలు ఉండవు కనుక వాటిని ఇతరులకు లేదా స్వయంగా తోట యజమానికి ఎండు (ఖర్జూర) ఫలాలకు అమ్ముకోవచ్చు. ఈ అనుమతి నిరుపేదలకు మాత్రమే ఉంది, ఇతరులకు లేదు. దీన్నే "అరాయా" అంటారు. ఇతరులు నగదు పైకం చెల్లించి కొనుక్కోవలసి ఉంటుంది.

(2) అంచనా అంటే, చెట్టుకున్న తాజా పండ్లు ఎండిన తరువాత ఎంత ఉంటాయో ఆ మేరకు ఎండు ఖర్జూరాలు లెక్క కట్టి ఇవ్వాలి.

988. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అయిదు వసఖ్ (దాదాపు ఆరున్నర క్వింటాళ్ళ)ల వరకు లేదా అయిదు వసఖ్‌ల లోపు అరాయా వ్యాపారం చేసుకోవడానికి అనుమతినిచ్చారు.(1)
[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 83వ అధ్యాయం - బైయిస్సమరి అలా రూసిన్నఖ్లి బిజ్జహబి వల్ ఫిజ్జ]

989. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) 'ముజాబనా' వ్యాపారం చేయకూడదని వారించారు. ముజాబనా వ్యాపారం అంటే (చెట్టు మీది) పచ్చి ఖర్జూర పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు తూచి అమ్మడం లేదా కొనడం లేక పచ్చి ద్రాక్షా పండ్లను ఎండు ద్రాక్షా పండ్లకు బదులు తూచి అమ్మడం లేదా కొనడం అని అర్థం.
[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 75వ అధ్యాయం - బైయిజ్జబీబ్ బిజ్జబీబి వత్తఆమిబిత్తఆమ్]

990. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) 'ముజాబనా' వ్యాపారం చేయకూడదని వారించారు. ముజాబనా వ్యాపారమంటే ఒక వ్యక్తి తన తోటలోని తాజా ఖర్జూర పండ్లను తూనికతో ఎండు ఖర్జూరపండ్లకు బదులు అమ్మడం; లేదా తాజా ద్రాక్ష పండ్లను తూనికతో ఎండు ద్రాక్ష పండ్లకు బదులు అమ్మడం; లేదా పొలంలోని పంటను తూనికతో అమ్మడం. ఇలాంటి ఏ పద్ధతి కూడా అవలంబించకూడదని ఆయన (సల్లం) వారించారు.(2)
[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 91వ అధ్యాయం - బైయిజ్జరయి బిత్తఆమి కీలా]

## 15వ అధ్యాయం - ఎవరైనా పండ్లున్న ఖర్జూర చెట్టునమ్మితే.....

991. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా ఖర్జూర చెట్టును అంటుకట్టిన(3) తర్వాత అమ్మితే ఆ చెట్టు పండ్లు కొనుగోలుదారునికి చెందుతాయి. అయితే అమ్మేవాడు దాన్ని అమ్మేటపుడు (పండ్లు ఇవ్వనని) షరతు విధించిన పక్షంలో ఆ పండ్లు అమ్మకందారునికి చెందుతాయి."
[సహీహ్ బుఖారీ :34వ ప్రకరణం - బుయూ, 90వ అధ్యాయం - మన్ బాఅనఖ్లన్ ఖద్ ఉబిరత్ ఔరజన్ మజ్రూఅ]

## 16వ అధ్యాయం - ముహాఖలా, ముజాబనా, ముఖాబరా పద్ధతులు నిషిద్ధం

992. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ముఖాబరా, ముహాఖలా, ముజాబనా(4) (వంటి)

(1) బరువురీత్యా ఒక వసఖ్ అరవై 'సా'లకు సమానం. ఒక 'సా' అయిదు సేర్లకు సమానం. ఒక 'సేరు' ఎనభై తులాలకు సమానం. ఒక 'తులం' దాదాపు పదకొండున్నర 'గ్రాముల'కు సమానం. 567 పాద సూచిక చూడండి. పేదలకు అయిదు వసఖ్‌ల వరకు అమ్ముకోవడానికి అనుమతి ఉంది. ఇతరులకు ఈ అనుమతి లేదు. "అయిదు వసఖ్‌ల వరకు లేదా అయిదు వసఖ్‌ల లోపు" అనే విషయంలో దైవప్రవక్త (సల్లం) కచ్చితంగా ఏం చెప్పారో ఉల్లేఖకునికి గుర్తులేదు.

(2) కొలచి అమ్మడం, కొనడం అనేది ఇక్కడ ముఖ్యమైన విషయం కాదు. 'ముజాబనా' అనే ఈ వ్యాపార పద్ధతిలో మోసం, పొరపాట్లు ఉండే ప్రమాదం ఉన్నందున దీన్ని దైవప్రవక్త(సల్లం) నిషేధించారు.

(3) 'అంటుకట్టు' పద్ధతిలో ఖర్జూరాలు ఎక్కువగా ఉత్పత్తి అయ్యే అవకాశం ఉంది.

(4) "ముఖాబరా" అనేది ఒక విధమైన వ్యవసాయ ఒప్పందం. దీని ప్రకారం సేద్య భూమి ఒకరిదయి ఉంటే విత్తనం, శ్రమ మరొకరివయి ఉంటాయి. లేదా నిర్ణీత భాగంలో వ్యవసాయ ఒప్పందం ఉంటుంది. ఉదా:- 1/3 భాగం లేదా 1/4 భాగం. (దీన్నే మన తెలుగు నాట పాలికివ్వడం అంటారు.)
"ముహాఖలా" అంటే, కొందరి అభిప్రాయం ప్రకారం సేద్యపు భూమిని గోధుమలకు బదులుగా అమ్మడం, మరికొందరి అభిప్రాయం ప్రకారం సేద్యపు భూమిని గోధుమలకు బదులుగా అద్దెకు ఇవ్వడం. అయితే కొందరు ముఖాబరా, ముహాఖలాల్లో ఎలాంటి భేదం లేదంటారు. అంటే 1/3 లేక 1/4 వాటా చొప్పున సేద్య భూమిని పాలికివ్వడమే 'ముహాఖలా' అంటారు. మరికొందరు ధాన్యాన్ని వెన్నులలోనే ఉంచి గోధుమలకు బదులుగా అమ్మడం అని అర్థం తీసుకున్నారు. మరి కొందరు వ్యవసాయోత్పత్తులు పంటకు రాకముందే అమ్మడం అని అర్థం తీసుకున్నారు.
"ముజాబనా" గురించి 989, 990 హదీసుల్లో వచ్చింది.

వ్యాపార పద్ధతుల్ని దైవప్రవక్త (సల్లం) నిషేధించారు. అలాగే పండ్లు పూర్తిగా పంటకు వచ్చినట్లు స్పష్టం కానంత వరకు వాటిని అమ్మకూడదని, నగదు డబ్బుకు మాత్రమే పండ్లను అమ్మాలని కూడా ఆయన (సల్లం) ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 42వ ప్రకరణం - ముసాఖా, 17వ అధ్యాయం - అర్రజులు యకూనులహూ మమరావు....]

## 17వ అధ్యాయం - భూములు అద్దెకు ఇవ్వడం గురించి

993. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మాలో కొందరి దగ్గర బీడు భూములు వృధాగా పడి వున్నాయి. అలాంటి భూములను వారు అర్ధపంట, పావుపంట లేదా మూడోవంతు పంట షరతుపై పాలికివ్వాలని భావించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు. "భూమి ఉన్నవాడు అందులో స్వయంగా సేద్యం చేయాలి లేదా తన తోటి ముస్లిం సోదరునికి ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా సేద్యం చేసుకోవడానికి ఇచ్చేయాలి. ఇలా (ఈ రెండింటిలో ఏదీ) చేయకపోతే ఆ భూమిని అలాగే పడి ఉండనివ్వాలి".

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 35వ అధ్యాయం - ఫజ్లిల్ మనీహా]

994. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:-

"ఎవరి దగ్గరయినా భూమి ఉంటే అతనా భూమిలో స్వయంగా సేద్యం చేసుకోవాలి లేదా తోటి ముస్లిం సోదరునికెవరికైనా దాన్ని ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా సేద్యం చేసుకోవడానికి ఇచ్చి వేయాలి. అలా చేయకపోతే ఆ భూమిని అలాగే ఆపి ఉంచాలి."

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - ముజారా, 18వ అధ్యాయం - మాకాన మిన్ అస్హాబిన్నబీ (సల్లం)]

995. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ముజాబనా, ముహాఖలా★ (వంటి) వ్యాపార పద్ధతుల్ని దైవప్రవక్త (సల్లం) నిషేధించారు. ముజాబనా అంటే ఖర్జూర చెట్ల మీది తాజా పండ్లను ఎండు ఖర్జూర పండ్లకు బదులు అమ్మడం అన్నమాట.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 82వ అధ్యాయం - బైయిల్ ముజాబినతి వహియ బైఉస్సమరి బిస్సమర్]

996. హజ్రత్ నాఫె (రహ్మాలై) కథనం:- దైవప్రవక్త(సల్లం) కాలంలో, ఖలీఫాలు అబూబకర్, ఉమర్, ఉస్మాన్ (రజి)ల కాలంలో హజ్రత్ ముఆవియా (రజి) పాలన ప్రారంభ కాలంలో కూడా హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) తన వ్యవసాయ భూమిని (అద్దెకు) పాలికిచ్చేవారు. అయితే వ్యవసాయ భూములను పాలికివ్వరాదని దైవప్రవక్త (సల్లం) వారించినట్లు హజ్రత్ రాఫె (రజి) తెలిపారని విని ఆయన హజ్రత్ రాఫె (రజి) దగ్గరకు వెళ్ళారు. అప్పుడు ఆయనతో పాటు నేనూ వెళ్ళాను. హజ్రత్ రాఫె (రజి)ని విచారిస్తే, దైవప్రవక్త(స) వ్యవసాయ భూముల్ని పాలికివ్వడాన్ని వారించారని ఆయన అన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఈ మాట విని "మీకు తెలుసో లేదో, దైవప్రవక్త (స) కాలంలో

---

★ "ముహాఖలా" గురించి 992వ హదీసులో వచ్చింది.

మేము మా వ్యవసాయ భూముల్ని పిల్లకాలువలపై పెరిగే పంటకు, కొంత గడ్డికి బదులు అద్దెపై ఇచ్చేవాళ్ళము'' అని అన్నారు. ★

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - ముజారా, 18వ అధ్యాయం - మాకాన మిన్ అస్హాబిన్నబీ (స) యువాసి బాజుహుమ్....]

## 18వ అధ్యాయం - ధాన్యానికి బదులు భూమిని అద్దెకివ్వడం గురించి

997. హజ్రత్ జుహైర్ బిన్ రాఫె (రజి) కథనం:- "దైవప్రవక్త (స) మమ్మల్ని మాకు ప్రయోజనం చేకూర్చే ఒక పని నుండి వారించారు.'' (ఈ హదీసును ఉల్లేఖించిన రాఫె బిన్ ఖుదైజ్ మాట్లాడుతూ) "దైవప్రవక్త (స) చెప్పినది వాస్తవం, సత్యంతో కూడినది'' అని అన్నాను నేను. తిరిగి జుహైర్ (రజి) మాట్లాడుతూ "దైవప్రవక్త (స) నన్ను పిలిచి "నీవు నీ వ్యవసాయ భూముల విషయంలో ఎలా చేస్తున్నావు?'' అని అడిగారు. దానికి నేను 'అద్దెకు ఇస్తున్నాను లేదా నాల్గవ భాగం పంటకై పాలికిస్తున్నాను లేదా కొన్ని వసఖ్‌ల ఎత్తు ఖర్జూరపండ్లు, గోధుమలకు బదులుగా ఇస్తున్నాను' అని చెప్పాను. అప్పుడు దైవప్రవక్త (స) "అలా చేయకు. నువ్వు స్వయంగా సేద్యం చెయ్యి లేదా (ప్రతిఫలం

---

★ ఈ హదీసులో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) హజ్రత్ రాఫె (రజి) చెప్పిన విషయంతో ఏకీభవించలేదని తెలుస్తోంది. కాని 'సహీహ్ ముస్లిం'లో వచ్చిన ఉల్లేఖనాలు దీనికి భిన్నంగా ఉన్నాయి. వాటి ప్రకారం హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) హజ్రత్ రాఫె (రజి)ని విచారించిన తరువాత (సేద్య) భూములను అద్దెకివ్వడాన్ని మానేశారు. ఈ మార్పుకు కారణం ఏమిటని ఎవరైనా అడిగితే, "దైవప్రవక్త(సల్లం) భూములను అద్దెకివ్వరాదని వారించినట్లు రాఫె (రజి) తెలియజేశారు అని సమాధానమిచ్చేవారు. అదీగాక దైవప్రవక్త (సల్లం) ఆ తరువాత ఇలా చేయడాన్ని వారించి ఉండవచ్చని కూడా ఆయన భావించారు.

ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ సమస్యను గురించి చర్చిస్తూ ఇలా వ్రాశారు. వ్యవసాయ భూముల్ని అద్దెకిచ్చే (అంటే కౌలుకిచ్చే) విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. హజ్రత్ తావుస్ (రహ్మాలై), హసన్ బస్రీ (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం ధాన్యానికి బదులుగా గాని, వెండీ బంగారాలకు బదులుగా గానీ, లేదా వ్యవసాయోత్పత్తుల భాగానికి బదులుగా గానీ వ్యవసాయ భూముల్ని అద్దెకివ్వడం ఏ మాత్రం ధర్మసమ్మతం కాదు.

ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం వెండి, బంగారాలు, వస్త్రాలు, ఇతర వస్తువులకు బదులుగా సేద్యభూమిని అద్దెకు (కౌలుకు) ఇవ్వడం ధర్మసమ్మతమే. కాకపోతే వ్యవసాయోత్పత్తుల భాగానికి బదులుగా మాత్రం అద్దెకివ్వడం సరయిన పద్ధతి కాదు. ఇమామ్ మాలిక్ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం వెండి బంగారాలకు బదులుగా అద్దెకివ్వడం సమంజసమే కాని, ధాన్యానికి బదులుగా అద్దెకివ్వడం మాత్రం సరికాదు. పోతే ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై), ఇమామ్ అబూయూసుఫ్ (రహ్మాలై), ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలై), మాలికీ ధర్మవేత్తల్లోని ఒక వర్గం అభిప్రాయం ప్రకారం ధాన్యం, పంటల భాగం, వెండి బంగారాలకు బదులుగా, మరే విధంగానైనా సేద్యపు భూమిని అద్దెకివ్వడం సమంజసమే. ఇబ్నె షరీహ్ (రహ్మాలై), ఇబ్నె ఖుజీమా (రహ్మాలై), ఖతాబి (రహ్మాలై), సలఫీ ధర్మవేత్తలలోని పరిశోధకులు కూడా ఈ అభిప్రాయాన్నే సమర్థించారు; దీనికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. అయితే హదీసుల్లో వచ్చిన నిషేధానికి వీరు వివరణ ఇస్తూ ఇది కొంత అయిష్టకరమైన విషయం అని అన్నారు. అంటే ఎలాంటి ప్రతిఫలం తీసుకోకుండా వ్యవసాయం చేసుకోవడానికి తోటి ముస్లింకు భూమిని ఉచితంగా ఇవ్వాలని, సేద్యపుభూమిని ఉచితంగా ఇచ్చే విషయాన్ని ప్రోత్సహించడానికి మాత్రమే అద్దెకివ్వరాదని వారించడం జరిగిందని వారి అభిప్రాయం. నిజం దేవునికే తెలుసు.

[ఇమామ్ నవవీ (రహ్మాలై)]

తీసుకోకుండా) ఇతరులకు సేద్యం చేసుకోవడానికి ఇచ్చెయ్యి, లేదా దాన్ని అలాగే పడి ఉండనివ్వు" అని అన్నారు. హజ్రత్ రాఫె మాట్లాడుతూ "నేనీ ఆదేశం విని, మీ ఆజ్ఞ విన్నాను, దానికి కట్టుబడి ఉంటాను" అని అన్నాను.

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - మజారా, 18వ అధ్యాయం - మాకాన మిన్ అస్హాబిన్నబీ (స)]

## 21వ అధ్యాయం-భూమిని ఉచితంగా ఇవ్వడం గురించి

998. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (స) వ్యవసాయ భూమిని పాలికివ్వకూడదని మమ్మల్ని వారించలేదు. నిర్ణీత పైకంతో భూమిని అద్దెకు ఇవ్వడంకంటే ఎలాంటి ప్రతిఫలం తీసుకోకుండా దాన్ని తోటి ముస్లిం సోదరునికి ఉచితంగా ఇవ్వడం ఎంతో మంచిదని మాత్రమే ఆయన అన్నారు.

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - మజారా, 10వ అధ్యాయం - హద్దసనా అలీ బిన్ అబ్దుల్లా]

# లావాదేవీల ప్రకరణం

## 1వ అధ్యాయం - పండ్లు, పంటల వాటా వ్యవహారం

999. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఖైబర్ భూముల వ్యవహారంలో (యూదుల నుండి) పండ్లు, ధాన్యం వంటి ఇతర పంటలు అర్ధభాగం వసూలయ్యేలా నిర్ణయించారు. అందులో వంద వసఖ్‌ల ఎత్తు రాబడిని ఆయన తన భార్యలకు ఇస్తుండేవారు. ఎనభై వసఖ్‌ల ఎత్తు ఖర్జూరపండ్లు, ఇరవై వసఖ్‌ల ఎత్తు జవలు ఇస్తుండేవారు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) (తన పరిపాలనా కాలంలో యూదుల్ని బహిష్కరించి) ఖైబర్ భూముల్ని పంపిణీ చేశారు. ఆ సందర్భంలో ఆయన విశ్వాసుల మాతృమూర్తుల (రజి)కు వారి కిష్టమైన విధంగా నీటి వసతి గల భూముల్ని గాని లేదా ప్రవక్త కాలంలో వారికి లభిస్తూ ఉండే నిర్ణీత పంటల వాటా గాని తీసుకోవచ్చని అధికారమిచ్చారు. దాని ప్రకారం విశ్వాసుల మాతృమూర్తులలో కొందరు భూముల్ని తీసుకోవడానికి ఇష్టపడ్డారు. మరికొందరు వ్యవసాయోత్పత్తుల్లో నిర్ణీత వాటాలను తీసుకోదలిచారు. హజ్రత్ ఆయిషా (రజి) పొలం తీసుకోవడానికి ఇష్టపడ్డారు.

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - మజారా, 8వ అధ్యాయం - అల్ మజార అతు బిష్షత్రి వ నహ్విహీ]

1000. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) (తన పాలనా కాలంలో) హిజాజ్ (సౌదీ అరేబియా) నుండి యూదుల్ని, క్రైస్తవుల్ని బహిష్కరించారు. ఖైబర్ జయించబడినప్పుడు దైవప్రవక్త (స) కూడా యూదుల్ని, క్రైస్తవుల్ని ఖైబర్ నుండి బహిష్కరించారు. ఆ ప్రాంతం (ముస్లింలకు) స్వాధీనమైపోయిన తరువాత అది చట్ట ప్రకారం దేవునికి, దైవప్రవక్త(స)కు, ముస్లింలకు చెందుతుంది. అందువల్ల దైవప్రవక్త(స) వారిని అక్కడ్నుంచి తీసివేయదలిచారు. అయితే యూదులు దైవప్రవక్త (స)ను విన్నవించుకుంటూ "మమ్మల్ని మా భూముల్లో ఉండనిస్తే మేమక్కడ (మీ తరఫున) కాయకష్టం చేస్తాము. ప్రతిఫలంగా మాకు అర్ధభాగం (పంట) ఇప్పించండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (స) "సరే, మేము కోరినంత కాలం మిమ్మల్నిక్కడ ఉండనిస్తాము" అని అన్నారు. ఈ విధంగా వారు తమ భూముల్లో యథాప్రకారం ఉండసాగారు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) (తన పాలనా కాలంలో) వారిని (ఖైబర్ నుండి తీసి) తైమా, అరిహా ప్రాంతాలకు పంపివేశారు.

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - మజారా, 17వ అధ్యాయం - ఇజాఖాల రబ్బుల్ అర్జి ఉఖిరుక.....]

## 2వ అధ్యాయం - చెట్లను నాటడం, సేద్యం చేయడం గొప్ప పుణ్యకార్యాలు

1001. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా ముస్లిం ఏదైనా ఒక (పండ్ల) చెట్టు నాటి లేదా పొలంలో ఏదైనా పంట వేస్తే అందులో పక్షులుగాని, పశువులు గాని లేదా మనుషులు గాని (పండ్లు, పంట) తిన్న పక్షంలో అది అతని తరఫున సదఖా (దానం) అవుతుంది, అతనికి దాని పుణ్యం లభిస్తుంది".

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - మజారా, 1వ అధ్యాయం - ఫజ్లిజ్జరయి వల్ గర్సి ఇజా ఉకిల మిన్హు ]

## 3వ అధ్యాయం - ప్రకృతి వైపరీత్యం వల్ల నష్టం వస్తే నష్ట పరిహారం ఇవ్వాలి

1002. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- పండ్ల మీద రంగు స్పష్టంగా వ్యక్తం కానంతవరకు వాటిని అమ్మకూడదని దైవప్రవక్త(స) ఆదేశించారు. అప్పుడు "రంగు స్పష్టంగా వ్యక్తమవడమంటే ఏమిటీ?" అడిగారు ఒకరు. దానికి దైవప్రవక్త (స) "పండి దానిపై ఎరుపుదనం రానంతవరకు" అని అన్నారు. ఆ తరువాత ఆయన "కాస్త మీరే ఆలోచించండి. (కాపుకు రాకముందే లావాదేవీలు జరిగిన పక్షంలో) ఒకవేళ దేవుడు పండ్లను ఆపి ఉంచితే అమ్మకందారు తన సోదరుని పైకం ఏ వస్తువులకు బదులుగా తీసుకుంటాడు?" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 87వ అధ్యాయం - ఇజాబా అస్సిమార ఖబ్ల అ(యబ్దు సలాహిహా]

## 4వ అధ్యాయం - రుణగ్రస్తుని పట్ల మృదువైఖరి అభిలషణీయం

1003. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఇంటిముందు ఎవరో తగాదాలాడుకోవడం విన్నారు. ఇద్దరు వ్యక్తులు బిగ్గరగా తగాదాపడ్డారు. వారిలో ఒకరు రెండవ వ్యక్తిని బ్రతిమాలుతూ "కొంత వదిలేయండి, కాస్త (నా పట్ల) మృదువుగా వ్యవహరించండి" అని అన్నాడు. దానికి రెండవ వ్యక్తి "దైవసాక్షి! నేనిలా ఎన్నటికీ చేయను" అని అన్నాడు. అంతలో దైవప్రవక్త (సల్లం) బయటికి వెళ్ళి "ఎవరతను, దేవుని మీద ప్రమాణం చేసి మరీ తాను పుణ్యకార్యం చేయనంటున్నాడు?" అని అడిగారు. అప్పుడు వారిలో ఒకతను (ముందుకు వచ్చి) దైవప్రవక్తా! ఆ వ్యక్తి నేనే. నేనితనికి (ఇప్పుడు) తాను కోరిన వస్తువుని అతనే ఉంచుకోవచ్చని అనుమతిస్తున్నాను" అని అన్నాడు.

[సహీహ్ బుఖారీ : 53వ ప్రకరణం - సులహ్, 10వ అధ్యాయం - హల్ యుషీరుల్ ఇమామి బిస్సుల్హ్]

1004. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం:- నేనొక రోజు మస్జిదులో అబ్దుల్లా బిన్ అబీ హద్రద్ (రజి)ని నాకివ్వాల్సిన బాకీ ఇవ్వమని నిలదీశాను. మేమిద్దరం (అరచుకుంటూ) బిగ్గరగా మాట్లాడుకోసాగాము. మా అరుపులు ఆ సమయంలో ఇంట్లోనే ఉన్న దైవప్రవక్త (సల్లం)కు విన్పించాయి. ఆయన వెంటనే లేచి తమ కుటీరం తెరను పైకెత్తి "కాబ్!" అని పిలిచారు. నేను "వస్తున్నానండీ" అన్నాను. అప్పుడాయన "నీకు రావలసిన అప్పులో కొంచెం తగ్గించుకో" అని చెప్పారు. చేత్తో సూచిస్తూ 'సగం తగ్గించుకో' అన్నారు. "మీరెలా ఆజ్ఞాపిస్తే అలా చేస్తా"నన్నాను నేను. "మరయితే

---

★ ఇలాంటి లావాదేవీలు జరిగిన పక్షంలో ఆ తరువాత వచ్చే నష్టాన్ని అమ్మకందారుడే భరించాలి. నిర్ణీత పైకం పూర్తిగా తీసుకోవడం అన్యాయం, అధర్మం.

ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా వ్రాస్తున్నారు:- అమ్మకందారుడు పండ్లు కాపుకు రాకముందే అమ్మి వాటిని కొనుగోలుదారునికి అప్పగించడం జరిగిన పక్షంలో ఆ తరువాత పంటకు రాకముందే ఏదైనా ఉపద్రవం వల్ల పండ్లు వృధా అయిపోతే ఆ నష్టాన్ని భరించే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి -

ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం నష్టాన్ని కొనుగోలుదారుడే భరించాలి. అయితే అమ్మకందారుడు ఆ నష్టపరిహారాన్ని కొనుగోలుదారునికి చెల్లించడం అభిలషణీయం. ఇమామ్ షాఫయి (రహ్మాలై)గారి ఒక ప్రకటన ప్రకారం, మరియు కొందరు ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం నష్టపరిహారం చెల్లించే బాధ్యత అమ్మకందారునిపైనే ఉంటుంది. ఇమామ్ మాలిక్ (రహ్మాలై) ప్రకారం ఆ నష్టం 1/3 వంతుకు ఎక్కువగా ఉంటే అమ్మకందారుడు నష్టపరిహారం చెల్లించనవసరం లేదు. నష్టం 1/4 వంతుగాని లేదా అంతకంటే తక్కువగాని ఉంటే నష్టపరిహారం తప్పకుండా ఇచ్చుకోవాలి.

లే వెంటనే అతని హక్కు నెరవేర్చు" (అంటే తాత్సారం చేయకుండా జరిగిన తీర్పు ప్రకారం ఆచరించు) అని ఆదేశించారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 71వ అధ్యాయం - అత్తఖాజీ వల్ ములాజిమతి ఫిల్ మస్జిద్]

## 5వ అధ్యాయం - కొనుగోలుదారు పేదవాడయిపోయినపుడు

1005. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "వస్తువును కొన్న వ్యక్తి పేదవాడయి పోయి దాని (ధర చెల్లించలేని పరిస్థితిలో) ఉంటే, ఆ వస్తువు ఇంకా అతని దగ్గర ఉన్న పక్షంలో దాన్ని తిరిగి తీసుకునే హక్కు (ఇతర రుణదాతల కన్నా) అమ్మినవాడికే ఎక్కువ ఉంటుంది.[1]

[సహీహ్ బుఖారీ : 43వ ప్రకరణం - ఇస్తిఖ్రాజ్, 14వ అధ్యాయం - ఇజా వజద మాలహూ ఇన్దముఫ్లిస్]

## 6వ అధ్యాయం - పేద రుణగ్రస్తుడికి తగిన వ్యవధి నివ్వడం పుణ్యప్రదం

1006. హజ్రత్ హుజైఫా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మీ పూర్వీకులలో ఒక వ్యక్తి ఆత్మకు దైవదూతలు ముందుకు వచ్చి స్వాగతం చెప్పారు "(నిన్నింతగా స్వాగతించాలని మాకు ఆజ్ఞ జారీ కావడానికి కారణం) నువ్వేమయినా పుణ్యకార్యం చేసి ఉన్నావా?" అని అడిగారు ఆ దైవదూతలు అతడ్ని. దానికా వ్యక్తి "నేను నా సేవకుల్ని నిరుపేద (రుణగ్రస్తు)లకు తగిన వ్యవధి నివ్వమని, ధనికుల్ని క్షమించమని ఆజ్ఞాపించేవాడ్ని"[2] అని అన్నాడు. అందువల్లనే దేవుడు అతని తప్పుల్ని క్షమించి అతని పట్ల మంచిగా వ్యవహరించమని దైవదూతలను ఆజ్ఞాపించాడు".

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 17వ అధ్యాయం - మన్ అన్జర మూసిరా]

1007. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "(పూర్వం) ఒక వర్తకుడు ప్రజలకు అప్పులిస్తుండేవాడు. వారిలో ఎవరయినా పేదవాడు ఉన్నాడని తెలిస్తే, 'అతడ్ని క్షమించండి. అప్పు తీర్చమని వత్తిడి చేయకండి. దీని వల్ల దేవుడు మన పాపాలను

(1) అంటే వస్తువుల్ని అరువుగా కొన్న వ్యక్తి ధర చెల్లించక ముందే పేదవాడయిపోయిన పక్షంలో (లేదా చనిపోయిన పక్షంలో) అతని ఆస్తి పంపిణీ జరుగుతున్నప్పుడు గాని, లేదా అప్పులు తీర్చే సమయంలో గాని ఆ వస్తువులు ఇంకా అలాగే సురక్షితంగా ఉంటే వాటిని వాటి అసలు యజమానులకు తిరిగి అప్పగించాలి. అంతేగాని ఆ వస్తువుల్ని ఇతర రుణదాతలకు గాని, వారసులకు గాని ఇవ్వకూడదు.

అయితే ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) అభిప్రాయం ప్రకారం అమ్మినవాడికి తన వస్తువుల్ని తిరిగి తీసుకునే హక్కులేదు. అతను కూడా ఇతర రుణదాతలకు మాదిరిగానే ఆస్తి పంపిణీలో (తానమ్మిన వస్తువుల విలువ మేరకు) వాటాదారుడు అవుతాడు. ఇమామ్ మాలిక్(రహ్మలై) అభిప్రాయం ప్రకారం వస్తువు కొన్నవాడు (రుణగ్రస్తుడు) పేదవాడయిపోయిన పక్షంలో అమ్మకందారుడు ఆస్తి పంపిణీ సమయంలో తన వస్తువును తిరిగి తీసుకోవచ్చు. వస్తువు కొన్నవాడు చనిపోతే మాత్రం దాన్ని అమ్మినవాడు ఇతర రుణదాతలకు మాదిరిగానే ఆస్తి పంపిణీలో (తానమ్మిన వస్తువు విలువ మేరకు) వాటాదారుడు అవుతాడు.

\- నవవీ (రహ్మలై)

(2) ఇక్కడ 'నిరుపేదలకు' అనే పదం 'సహీహ్ ముస్లిం' గ్రంథంలోనే ఉంది. 'సహీహ్ బుఖారీ'లో ఈ పదం లేదు, పొరపాటున వదిలివేయబడి వుంటుంది.

క్షమించవచ్చు' అని సేవకులతో అంటుండేవాడు. అందుకే దేవుడు ఆ సత్కార్యం కారణంగానే అతడి (తప్పుల్ని) పాపాలను, పొరపాట్లను క్షమించాడు."

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం – బుయూ, 18వ అధ్యాయం - మన్ అన్జర మూఅసిరా]

## 7వ అధ్యాయం - ధనికుడు అప్పు తీర్చడంలో ఆలస్యం చేయకూడదు

1008. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- "ధనికుడు అప్పు తీర్చడంలో ఆలస్యం చేయడం అన్యాయం. రుణగ్రస్తుడు తన రుణబాధ్యతను, దాన్ని తీర్చే స్తోమత గల వ్యక్తికి అప్పగించినపుడు రుణదాత (అందుకు అంగీకరించి), తన అప్పు గురించి ఆ బాధ్యత తీసుకున్న వ్యక్తినే అడగాలి".

[సహీహ్ బుఖారీ : 38వ ప్రకరణం - అల్ హవాల, 1వ అధ్యాయం - అల్‌హవాలతు వహల్ యర్జివు ఫిల్ హవాలా]

## 8వ అధ్యాయం - అదనపు నీరు అమ్మడం నిషిద్ధం

1009. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "అవసరానికి మించిన మేతను ఆపి వుంచే ఉద్దేశ్యంతో అవసరానికి మించిన నీటిని ఆపి ఉంచకండి."(1)

[సహీహ్ బుఖారీ : 42వ ప్రకరణం - అల్ ముసాఖా, 2వ అధ్యాయం - మన్ ఖాల ఇన్న సాహిబుల్‌మాయి అహఖ్ఖు బిల్ మాయి]

## 9వ అధ్యాయం - కుక్క ధర, జోస్యుని వేతనం, వ్యభిచార సంపాదన నిషిద్ధం

1010. హజ్రత్ అబూ మస్‌వూద్ అన్సారీ (రజి) కథనం:- కుక్క ధరను, వ్యభిచార సంపాదనను, జ్యోతిష్కుని వేతనాన్ని దైవప్రవక్త (సల్లం) నిషేధించారు.(2)

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 113వ అధ్యాయం - సమనిల్ కల్బ్]

---

(1) ఎవరైనా ఒక చోట బావి త్రవ్వుకొని ఉన్నప్పుడు అక్కడ దగ్గర్లో పచ్చిక కూడా ఉంటే, ఆ బావి యజమాని తాను వాడుకోగా మిగిలిపోయిన నీళ్ళను ఇతరుల పశువులకు త్రాగడానికి వదిలెయ్యాలి. పశువుల కాపర్లు తమ పశువుల్ని అక్కడ మేపుకుంటున్నప్పుడు పశువులు నీరు త్రాగడానికి ఆ బావి తప్ప దరిదాపుల్లో మరెలాంటి నీటి వసతి లేనపుడు ఆ బావి యజమాని వృధా నీటిని పశువులు త్రాగకుండా నిరోధించడం ధర్మసమ్మతం కాదు. నీటిని త్రాగనీయకుండా నిరోధించడం అంటే గడ్డిని మేయనీయకుండా నిరోధించడమే అవుతుంది. గడ్డిని మేయనీయకుండా నిరోధించడం నిషిద్ధం (హరాం). అందువల్ల వృధా నీటిని త్రాగకుండా నిరోధించడం కూడా అధర్మమే (హరాం) అవుతుంది.

(2) అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం కుక్కలను అమ్మడం, కొనడం ధర్మసమ్మతం కాదు. వేట కుక్కయినా, పెంపుడు కుక్కయినా మరెలాంటి కుక్కయినా సరే ఎవరైనా చంపితే దానికి నష్ట పరిహారం కూడా ఇవ్వనవసరం లేదు. కాని ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం ప్రయోజనకరమైన కుక్కలను కొనడం, అమ్మడం ధర్మసమ్మతమే. వాటికి నష్టం కలిగిస్తే యజమానికి నష్టపరిహారం చెల్లించాలి.

వ్యభిచార సంపాదన పూర్తిగా అధర్మ సంపాదన అని స్పష్టంగా తెలుస్తూనే ఉంది, అలాగే జ్యోతిష్యం, హస్త సాముద్రికం, సోది, జాతకం, వారఫలాలు చెప్పేవారి సంపాదన కూడా అధర్మ సంపాదనే. జ్యోతిష్కుల, హస్త సాముద్రికుల, భూతవైద్యుల సంపాదనలను అరికట్టడం పాలకుల కర్తవ్యమని, అవసరమయితే అలాంటి వారికి శిక్షలు కూడా విధించాలని హజ్రత్ ఖతాబీ (రహ్మాలై) తన గ్రంథం "అహ్కాముస్సుల్తానియా"లో పేర్కొన్నారు.

## 10వ అధ్యాయం - కుక్కలను చంపడం గురించి

1011. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం:- కుక్కలను చంపవలసినదిగా దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఆదేశించారు.(1)

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాయిల్ ఖల్ఖ్, 17వ అధ్యాయం - ఇజా వఖయిజ్జు బాబి ఫిష్షరాబ్ అహదికుమ్]

1012. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "ఎవరైనా వేట కోసం లేదా పశు రక్షణ కోసం తప్ప ఇతరత్రా ఉద్దేశ్యాలతో కుక్కను పెంచితే అతని సత్కర్మల నుండి ప్రతి రోజూ రెండు యూనిట్ల చొప్పున పుణ్యం తగ్గుతూ ఉంటుంది."

[సహీహ్ బుఖారీ : 72వ ప్రకరణం - అజ్జిబాయి వస్సైద్, 6వ అధ్యాయం - మనిఖునా కల్బన్ లైసబికల్బ్....]

1013. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా కుక్కను పెంచితే అతని సత్కర్మల నుండి ప్రతి రోజూ ఒక యూనిట్ చొప్పున పుణ్యం తగ్గుతూ ఉంటుంది. అయితే పొలాన్ని పశువుల్ని కాపాడుకునేందుకు మాత్రం కుక్కను పెంచుకోవచ్చు."(2)

[సహీహ్ బుఖారీ: 41వ ప్రకరణం - మజారా, 3వ అధ్యాయం - ఇఖ్తినాయిల్ కల్బిల్ హర్స్]

1014. హజ్రత్ సుఫ్యాన్ బిన్ అబీ జహీర్ (రహ్మాలై) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "ఎవరైనా కుక్కను పెంచి దాన్ని ఇటు పొలం కాపలా కోసం గాని, అటు (పశువుల) పాదుగు రక్షణ కోసం గాని ఉపయోగించకపోతే అతని సత్కర్మల నుండి రోజూ ఒక యూనిట్ చొప్పున పుణ్యం తరిగిపోతూ ఉంటుంది."(3)

[సహీహ్ బుఖారీ : 41వ ప్రకరణం - అల్ మజారా, 3వ అధ్యాయం - ఇఖ్తినాయిల్ కల్బిల్ హర్స్]

---

(1) ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు : కరిచే కుక్కలను చంపవచ్చు అన్న విషయంలో ధర్మవేత్తల మధ్య ఎలాంటి భేదాభిప్రాయం లేదు. కరవని, నష్టపరచని కుక్కల విషయంలోనే కొంచెం భిన్నాభిప్రాయం ఉంది. ప్రారంభంలో దైవప్రవక్త (సల్లం) అన్ని రకాల కుక్కలను చంపవచ్చని ఉత్తర్వు జారీ చేశారు. కాని ఆ తర్వాత ఈ ఉత్తర్వు రద్దయిపోయి, హానికరమైన కుక్కలను మాత్రమే చంపవచ్చని తెలియజేయబడింది. వేట కుక్కలను, కాపలా కుక్కలను చంపడం నిషిద్ధమయిపోయింది.

(2) వేటకోసం, ఆస్తుల రక్షణ కోసం కుక్కలను పెంచడం ధర్మసమ్మతమే. అలాంటి లక్ష్యం ఏదీ లేకుండా అనవసరంగా కుక్కలను పెంచడం ధర్మ సమ్మతం కాదని ధర్మవేత్తల ఏకాభిప్రాయం.

(3) ఇక్కడ మూలభాషలో "ఖీరాత్" (యూనిట్) అనే పదం వాడబడింది. అయిదు గోధుమ గింజల ఎత్తును ఒక ఖీరాత్ అంటారు. పుణ్యం తగ్గి పోయే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. గత కర్మల నుండి తగ్గుతుందని, భావి కర్మల నుండి తగ్గుతుందని, పగటి కర్మల నుండి, రాత్రి కర్మల నుండి, ఫరజ్ కర్మల నుండి, నఫిల్ కర్మల నుండి అని మొదలయిన అభిప్రాయాలున్నాయి. అసలు పుణ్యం తగ్గడానికి కారణం కుక్కల మూలంగా దైవదూతలు రారన్నదే. కుక్కలు మొరగడం వల్ల వచ్చే వారికి బాధ కలుగుతుంది. అదీ గాక పెంచేవారి బట్టలు కుక్కల వల్ల మలినమయ్యే ప్రమాదం కూడా ఉంది. ఇంట్లో వస్తువులు కూడా మలినమయిపోతాయి. అలాగే ఎంత పుణ్యం తగ్గుతుందనే విషయంలోనూ భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరి అభిప్రాయం ప్రకారం; మదీనా పవిత్ర భూమి గనక అక్కడ కుక్కలను పెంచితే రోజుకు రెండు ఖీరాత్‌ల చొప్పున పుణ్యం తగ్గిపోతుంది. మదీనా వెలుపల పెంచితే రోజుకు ఒక ఖీరాత్ పుణ్యం తగ్గుతుంది. మరి కొందరి అభిప్రాయం ప్రకారం ఈ పుణ్యం తగ్గుదల కుక్కల రకాలను బట్టి ఉంటుంది. ఎక్కువ నష్టం కలిగించే కుక్కను పెంచితే రోజుకు రెండు ఖీరాత్‌లు, తక్కువ నష్టం కలిగించే కుక్కను పెంచితే ఒక ఖీరాత్ పుణ్యం తగ్గుతుంది. మొత్తం మీద ఈ హెచ్చరికలన్నీ అనవసరంగా కుక్కలను పెంచడం పై ఆధారపడి ఉన్నాయి. అవసరం రీత్యా కుక్కలను పెంచడంలో తప్పు లేదు.

## 11వ అధ్యాయం - చెడు రక్తం తొలగింపు వేతనం ధర్మసమ్మతమైనదే

1015. హజ్రత్ అనస్ (రజి) కథనం:- (చెడు రక్తం తొలగించే) మంగలికి వేతనమివ్వడం గురించి విచారించగా హజ్రత్ అనస్ (రజి) ఇలా సమాధానమిచ్చారు: "దైవప్రవక్త (సల్లం) చెడు రక్తం తొలగింపు వైద్యం చేయించుకున్నారు. హజ్రత్ అబూతయ్యిబా (రజి) ఆయనకు ఈ వైద్యం చేశారు. దానికి ప్రతిఫలంగా దైవప్రవక్త (సల్లం) ఆయనకు రెండు 'సా'ల ఎత్తు ధాన్యం ఇచ్చారు. ఆయన యజమానులతో మాట్లాడి వారాయన నుండి (ప్రతిరోజూ) వసూలు చేసే రాబడిని తగ్గింపజేశారు. దైవప్రవక్త (సల్లం) (మందు, వైద్యరంగం గురించి ప్రస్తావిస్తూ) "అన్నిటికంటే మంచి వైద్యం చెడు రక్తం తొలగింపు వైద్యమే. అలాగే అన్నిటికంటే మంచి మందు 'ఖుస్త్'★ మందే" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 76వ ప్రకరణం - తిబ్, 13వ అధ్యాయం - అల్‌హజామతి మినద్దాయి]

1016. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త(సల్లం) చెడు రక్తం తొలగింపు వైద్యం చేయించుకొని, మంగలికి దాని ప్రతిఫలం ముట్టచెప్పారు. ఆయన (మరోసారి వెల్లకిలా పండుకొని) ముక్కులో మందు కూడా వేయించుకున్నారు.

[సహీహ్ బుఖారీ : 76వ ప్రకరణం - తిబ్, 9వ అధ్యాయం - అస్సవూత్]

## 12వ అధ్యాయం - సారా అమ్మకం, కొనుగోళ్ళు నిషిద్ధం

1017. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- వడ్డీ (నిషేధం) గురించి బఖర సూరా (చివరి) సూక్తులు అవతరించినపుడు దైవప్రవక్త(సల్లం) మస్జిదుకెళ్ళి ప్రజలకు ఆ సూక్తుల్ని వినిపించారు. ఆ తర్వాత ఆయన సారా అమ్మకం, కొనుగోళ్ళు కూడా నిషిద్ధమని ప్రకటించారు.

[సహీహ్ బుఖారీ : 8వ ప్రకరణం - సలాత్, 73వ అధ్యాయం - తహ్రీమి తిజారతిల్ ఖమ్రి ఫిల్ మస్జిద్]

## 13వ అధ్యాయం - సారా, మృత పశుపక్షులు, పంది, విగ్రహ వ్యాపారం నిషిద్ధం

1018. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మక్కా జయించబడిన సంవత్సరం దైవప్రవక్త (సల్లం) మక్కాలోనే ఉన్నప్పుడు (ప్రజల్ని సంబోధిస్తూ) "సారాయిని, మృతపశువుని, పందిని, విగ్రహాల అమ్మకం, కొనుగోళ్ళను దేవుడు, దైవప్రవక్త (సల్లం) నిస్సందేహంగా నిషేధించారు" అని అన్నారు. (అప్పుడు ఒక వ్యక్తి) "దైవప్రవక్తా! మృతపశువు క్రొవ్వును మేము నౌకలకు పూతగా వాడతాము, దాంతో చర్మాన్ని పదునుపెడ్తాము; ప్రజలు దాన్ని దీపాలు వెలిగించుకోవడానికి (నూనెగా) వాడుకుంటారు. మరి ఇలాంటి క్రొవ్వు విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త

---

★ 'ఖుస్త్' అంటే అరేబియాలో లభించే ఒక రకమైన మందు.

(సల్లం) "కాదు, అది నిషిద్ధం" ★ అన్నారు. ఈ సందర్భంలో ఆయన (యూదుల్ని శపిస్తూ) "దేవుడు యూదుల్ని నాశనం చేయుగాక! మృత పశువు క్రొవ్వును దేవుడు నిషేధిస్తే, వారు దాన్ని కరగబెట్టి అమ్ముకొని తినడం మొదలెట్టారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 112వ అధ్యాయం - బైయిల్ మైతతి వల్ అస్నామ్]

1019. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) కు 'ఫలానా వ్యక్తి సారా అమ్మివేశాడు' అని సమాచారం అందింది. అప్పుడాయన (ఆగ్రహం వ్యక్తపరుస్తూ) "అతనికి దేవుని దెబ్బ తగులు గాక. దైవప్రవక్త (స) (యూదుల్ని శపిస్తూ) 'దేవుడు యూదుల్ని నాశనం చేయుగాక! (మృత) పశువుల క్రొవ్వు నిషేధించబడితే, వారు దాన్ని కరగబెట్టి అమ్ముకోసాగారు' అని తెలిపారు. అతనికీ సంగతి తెలియదా?" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 103వ అధ్యాయం - లా యజాబు షహముల్ మైతతు వలా యుబావు వదక్కుహూ]

1020. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "దేవుడు యూదుల్ని నాశనం చేయుగాక! వారికి పశువుల క్రొవ్వు నిషేధించబడితే వారు దాన్ని అమ్ముకొని తినడం మొదలెట్టారు."

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 103వ అధ్యాయం - లాయజాబు షహముల్ మైతతు వలా యుబావు వదక్కుహూ]

---

★ "కాదు" అది నిషిద్ధం అంటే కొవ్వును అమ్మడం ఎట్టి పరిస్థితిలోనూ మంచిది కాదని అర్థం అన్నారు ఇమామ్ నవవీ (రహ్మలై). అంటే దాని వ్యాపారం మాత్రమే నిషిద్ధం గాని దాన్నుండి ప్రయోజనం పొందడం నిషిద్ధం కాదన్న మాట. ఇమామ్ షాఫయి (రహ్మలై), ఆయన అనుచరులు కూడా మృత పశువు కొవ్వు నుండి ప్రయోజనం పొందడం ధర్మ సమ్మతమేనని తీర్పిచ్చారు. అంటే దాంతో ఓడలకు లేపనం పూయడం, దీపాలు వెలిగించుకోవడం వంటి పనులు ధర్మ సమ్మతమే. ఈ కొవ్వును ఆహారంగా వాడటం, మానవ శరీరానికి రాయడం మాత్రమే నిషిద్ధం. అతాబిన్ రబాహ్ (రహ్మలై), ముహమ్మద్ బిన్ జరీర్ తబ్రీ (రహ్మలై)ల అభిప్రాయం కూడా అదే.

అత్యధిక మంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం కొన్ని ప్రత్యేక వస్తువులు తప్ప మృత పశువుల కొవ్వు ద్వారా ప్రయోజనం పొందడం ఎంత మాత్రం ధర్మసమ్మతం కాదు. ఉదాహరణకు పదును పెట్టిన చర్మం వగైరా నూనె లేక నెయ్యి మలినంతో కలుషితమయిపోతే దాని ఆజ్ఞలు వేరుగా ఉన్నాయి. దీపాలు వెలిగించడానికి, ఆహారంగా ఉపయోగించడానికి, మానవ దేహానికి రాయడానికి తప్ప ఇతర పనుల కోసం కొవ్వును ఉపయోగించడం ధర్మ సమ్మతమే. సబ్బుల తయారీ, పశువుల దాణా కోసం కొవ్వు వాడకం విషయంలో సల్ఫ్ ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

కాని ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ధర్మసమ్మతమే. ఖాజీ అయాజ్ (రహ్మలై) తెలియజేస్తున్నట్లు ఇమామ్ మాలిక్ (రహ్మలై), ఇమామ్ షాఫయి (రహ్మలై), సుఫియాన్ సూరీ (రహ్మలై), ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై), ప్రవక్త ప్రత్యక్ష అనుచరుల్లో అనేక మంది అభిప్రాయం కూడా అదే. హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి), హజ్రత్ అబూ మూసా (రజి) మొదలైన వారి అభిప్రాయం కూడా అదే. అపరిశుద్ధమైన నూనె అని ముందుగా తెలియజేసి దాన్ని అమ్మడం వారి దృష్టిలో ధర్మసమ్మతమే. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై), అబ్దుల్ మాలిక్ బిన్ మాజు షూన్ (రహ్మలై)ల దృష్టిలో ఏ విధంగానైనా సరే కొవ్వు వాడకం ధర్మ సమ్మతం కాదు. నిజం దేవునికే ఎరుక!

ఎలాంటి అపరిశుద్ధ వస్తువునయినా అమ్మడం ధర్మ సమ్మతం కాదని పండితుల అభిప్రాయం. యుద్ధంలో చనిపోయిన అవిశ్వాసి మృత దేహం, విగ్రహాలను అమ్మడం కూడా నిషిద్ధమే. అయితే విగ్రహాల ముక్కలను అమ్మే విషయంలో భేదాభిప్రాయం ఉంది. కొందరు అమ్మవచ్చని, మరి కొందరు అమ్మ కూడదని అన్నారు. కాని మృత జంతువు, మద్యం, పంది - వీటి అమ్మకం పూర్తిగా హరాం (నిషిద్ధం) అనే విషయంలో ఎలాంటి భేదాభిప్రాయం లేదు.

## 14వ అధ్యాయం - వడ్డీ వ్యవస్థ గురించి

1021. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు:- "బంగారానికి బంగారం సరి సమానంగా తప్ప (ఎక్కువ తక్కువలు చేసి) అమ్మకండి. ఆ రెండింటిలో ఒకదానికి ఎక్కువ విలువ కట్టకండి. అలాగే వెండికి వెండి సరి సమానంగా తప్ప (ఎక్కువ తక్కువలు చేసి) అమ్మకండి. ఆ రెండిటిలో ఒక వెండికి ఎక్కువ మరొక దానికి తక్కువ విలువ కట్టకండి. ఈ రెండు వస్తువుల విషయంలో అమ్మకం కొనుగోళ్ళు రుణం రూపేణా జరపకండి" ★

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 78వ అధ్యాయం - బైయిల్ ఫిజ్జతి బిల్ ఫిజ్జా]

## 16వ అధ్యాయం - వెండిని బంగారానికి బదులు అప్పుపై అమ్మడం నిషిద్ధం

1022. హజ్రత్ అబుల్ మిన్హాల్ (రహ్మలై) కథనం:- నేను 'మారకం' (అంటే బంగారానికి బదులు వెండి, వెండికి బదులు బంగారం అమ్మడం) గురించి హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి)ని, హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి)ని విచారించగా వాళ్ళిద్దరు తనకంటే ఆయనకే బాగా తెలుసని అన్నారు. చివరికి వారుభయులు బంగారాన్ని వెండికి బదులుగా అప్పుపై అమ్మడాన్ని దైవప్రవక్త(స) నిషేధించారని తెలిపారు. (అంటే చేబదులుగా ఇచ్చి పుచ్చుకుంటే అందులో దోషం లేదన్నమాట!)

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 80వ అధ్యాయం - బైయిల్ వరిఖి బిజ్జహబి నసీఅ]

1023. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- సరిసమానంగా తప్ప వెండిని వెండికి బదులుగా, బంగారాన్ని బంగారానికి బదులుగా అమ్మడాన్ని దైవప్రవక్త (స) నిషేధించారు. అయితే వెండిని బంగారానికి బదులుగా, బంగారాన్ని వెండికి బదులుగా మేము కోరిన విధంగా అమ్ముకోవడానికి దైవప్రవక్త (స) మాకు అనుమతిచ్చారు. (కాని అప్పుగా అమ్మడానికి మాత్రం వీల్లేదు).

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 81వ అధ్యాయం - బైయిజ్జహబి బిల్ వరఖి యదన్ బియదన్]

## 18వ అధ్యాయం - ఒకే విధమైన ఆహార వస్తువులు సరిసమానంగా అమ్మవచ్చు

1024. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి), హజ్రత్ అబూ హురైరా (రజి)ల కథనం:- దైవప్రవక్త (స) ఖైబర్ ప్రాంతపు శిస్తు వసూలు చేయడానికి ఒక వ్యక్తిని నియమించారు. అతను వెళ్ళి (శిస్తుక్రింద) మేలుజాతి ఖర్జూరపండ్లను (వసూలు చేసి) తీసుకువచ్చాడు. అప్పుడు దైవప్రవక్త(స) "ఖైబర్‌లో లభించే ఖర్జూర పండ్లన్నీ ఇలాగే ఉంటాయా?" అని అడిగారు. దానికావ్యక్తి సమాధానమిస్తూ "లేదు దైవప్రవక్తా! దైవసాక్షిగా చెబుతున్నాను. అన్నీ ఇలా ఉండవు. మేము ఇలాంటి ఒక 'సా' ఎత్తు

---

★ షరీఅత్ పరిభాషలో 'రిబా' అనేది అసలు పదం. 'రిబా' నిషేధం గురించి ఉన్న ఇతర హదీసుల్లో ఆరు వస్తువుల ప్రస్తావన వచ్చింది. (1) బంగారం, (2) వెండి, (3) గోధుమలు, (4) శిష్ట గోధుమలు, (5) ఖర్జూరపండ్లు, (6) ఉప్పు. బాహ్యార్థ గ్రాహుల దృష్టిలో ఈ ఆరు వస్తువులకే 'రిబా' నిషేధం వర్తిస్తుంది. వారు విషయం లోతుపాతుల్లోకి పోయి తరచి చూడకుండా బాహ్యార్థాన్ని మాత్రమే గ్రహించే వారయినందున ఇతర వస్తువుల్ని రిబా నిషేధం పరిధిలోకి తీసుకోరు. మిగిలిన ధర్మవేత్తలందరూ ఈ ఆరు వస్తువులనే గాక నిషేధ కారణముండే ప్రతి వస్తువునూ రిబా నిషేధం క్రిందికి తీసుకున్నారు. కాకపోతే నిషేధ కారణం విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి.

(మేలురకం) ఖర్జూరపండ్లను రెండు 'సా'ల ఎత్తు రెండవ రకం ఖర్జూర పండ్లకు బదులుగా కొంటాము లేదా ఇలాంటి రెండు 'సా'ల ఎత్తు ఖర్జూరపండ్లను మూడు 'సా'ల ఎత్తు నాసిరకం ఖర్జూర పండ్లకు బదులుగా కొంటాము'' అని అన్నాడు. దైవప్రవక్త (స) ఈ మాట విని ''అలా చేయకండి. మొదట (నాసిరకం) ఖర్జూర పండ్లన్నీ దిర్హంలకు (అంటే నగదు పైకానికి) అమ్మివేయండి. ఆ తరువాత ఆ దిర్హంల (నగదు పైకం)తో మేలురకం ఖర్జూర పండ్లను కొనండి'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 89వ అధ్యాయం - ఇజా అరాద బైయి తమరిన్ బితమరిన్ ......]

1025. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- హజ్రత్ బిలాల్ (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి బర్నీ (అత్యంత మేలైన) జాతికి చెందిన ఖర్జూర పండ్లను తెచ్చారు. దైవప్రవక్త (సల్లం) వాటిని చూసి '' ఇవి ఎక్కడ్నుంచి వచ్చాయి?'' అని అడిగారు. దానికి హజ్రత్ బిలాల్ (రజి) సమాధానమిస్తూ ''మా దగ్గర మొదట్లో కొన్ని నాసిరకం ఖర్జూరపండ్లు ఉండేవి. మేము వాటిలో రెండు 'సా'ల ఎత్తు ఇచ్చి ఈ ఖర్జూరపండు ఒక 'సా' ఎత్తు చొప్పున తీసుకున్నాము, మీకు సమర్పించడానికి'' అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని, 'చాలా విచారకరమైన విషయం. ఇది పూర్తిగా వడ్డీ క్రింద వస్తుంది. (ఇక ముందు) అలా చేయకండి. ఇలాంటి (వస్తు మార్పిడి) వ్యాపారం చేయాలనుకున్నప్పుడు ముందుగా మీ దగ్గర ఉండే ఖర్జూర పండ్లను పైకానికి అమ్మివేయండి. ఆ తర్వాత ఆ పైకంతో మరో రకం ఖర్జూర పండ్లను కొనుక్కోండి'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 40వ ప్రకరణం - వకాలా, 11వ అధ్యాయం - ఇజాబా అల్ వకీలు షైఅన్ ఫాసిదన్ ఫబైహు మర్దూద్]

1026. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- మాకు అన్ని రకాలు కలిసిన నాసిరకం ఖర్జూర పండ్లు లభించేవి. మేము అలాంటి రెండు 'సా'ల ఎత్తు ఖర్జూర పండ్లను ఒక 'సా' ఎత్తు మేలుజాతి ఖర్జూర పండ్లకు బదులుగా అమ్మేవాళ్ళము. అయితే దైవప్రవక్త (సల్లం) (ఇలాంటి వస్తు మార్పిడి వ్యాపారాన్ని నిషేధిస్తూ) ''ఒక 'సా' ఎత్తు ఖర్జూర పండ్లకు బదులుగా రెండు 'సా'ల ఎత్తు ఖర్జూర పండ్లను గాని, ఒక దిర్హానికి బదులుగా రెండు దిర్హంలు గాని ఏదీ అమ్మడం ధర్మసమ్మతం కాదు'' అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 20వ అధ్యాయం - బైయిల్ ఖిల్తి, మినత్తమర్]

1027. హజ్రత్ అబూ సాలెహ్ జియాత్ (రహ్మాలై) కథనం:- ''దీనార్‌కు బదులుగా దీనార్, దిర్హంకు బదులుగా దిర్హం (ఎక్కువ తక్కువ లేకుండా సరిసమానంగా అమ్మాలి)'' అని హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) చెబుతుండగా నేను విని ''కాని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా చెప్పలేదే!'' అన్నాను. దానికి హజ్రత్ అబూ సయీద్ (రజి) ఇలా అన్నారు: ''నేనీ విషయం గురించి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ముందు ప్రస్తావిస్తూ, ఈ విషయంలో మీరు దైవప్రవక్త (సల్లం) నుండి ఏదైనా విన్నారా? లేక దివ్యఖుర్‌ఆన్‌లో దీన్ని గురించి ఏదైనా ఆజ్ఞ ఉందా?'' అని అడిగాను.

దానికి ఇబ్నె అబ్బాస్ (రజి) సమాధానమిస్తూ, ''నేను అలాంటి మాటేదీ అనడం లేదు. దైవప్రవక్త (సల్లం) ప్రవచనాలు నాకంటే మీకు బాగా తెలుసు.★ హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) నాకు

★ ''నాకంటే మీకే బాగా తెలుసు'' అంటే ఇక్కడ ''ఆనాడు మీరంతా దైవప్రవక్త (సల్లం) కొలువులో ఈ ప్రవచనాలు వింటున్నప్పుడు యుక్తవయస్సులో ఉన్నారు. నేనింకా మైనర్ తీరని బాలుడిగానే ఉన్నాను'' అని అర్థం. అప్పటికి ఇబ్నె అబ్బాస్ (రజి) వయస్సు 13 ఏండ్లు మాత్రమే. - సంకలనకర్త

చెప్పిన దాని ప్రకారం, వడ్డీ, రుణ వ్యవహారానికి మాత్రమే వర్తిస్తుందని దైవప్రవక్త (సల్లం) చెప్పారు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 79వ అధ్యాయం - బైయిద్దీనారి బిద్దీనారి నస్అ]

## 20వ అధ్యాయం - ధర్మసమ్మతమైనవి స్వీకరించి అనుమానాస్పదమైనవి మానెయ్యాలి

1028. హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ధర్మసమ్మతమైన (హలాల్ ) విషయాలేవో స్పష్టంగా తెలియజేయబడ్డాయి. నిషిద్ధ (హరామ్) విషయాలేమిటో స్పష్టంగా తెలియజేయబడ్డాయి. అయితే ఈ రెండింటికి మధ్య కొన్ని అనుమానాస్పదమైన విషయాలున్నాయి. వీటిని గురించిన ఆజ్ఞలు చాలా మందికి తెలియవు. కనుక అనుమానాస్పదమైన ఈ విషయాలకు దూరంగా ఉండేవాడు తన ధర్మాన్ని, గౌరవాన్ని కాపాడుకున్నవాడవుతాడు.

దీనికి భిన్నంగా అనుమానాస్పదమైన విషయాల్లో చిక్కుకున్నవాడు (ఎప్పుడో ఒకప్పుడు నిషిద్ధ విషయాల్లో పడిపోయే ప్రమాదం ఉంది) అతడు రక్షణ గట్టుపై పశువుల్ని మేపుకునే పశుకాపరి లాంటివాడని చెప్పవచ్చు. అతని పశువులు (ఏక్షణం లోనైనా) గట్టుదాటి (పొలం) లోపలికి చొచ్చుకొచ్చే ప్రమాదం ఉంటుంది. వినండి! ప్రతి రాజు (రాజ్యాని)కీ ఒక రక్షణ (కవచం లాంటి) సరిహద్దు ఉంటుంది. దేవుని పుడమి (సామ్రాజ్యాని)కి రక్షణ సరిహద్దులు ఆయన నిషేధించిన విషయాలే.

ప్రతి వ్యక్తీ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. మానవ శరీరంలో ఓ (విచిత్ర) మాంసపు ముద్ద ఉంది. అది సవ్యంగా ఉంటే మొత్తం శరీరం సవ్యంగానే ఉంటుంది. ఒకవేళ అందులో ఏదైనా చెడుగు ఏర్పడితే యావత్తు మానవ దేహమే చెడి పోతుంది. గుర్తుంచుకోండి! ఆ మాంసపు ముద్ద మానవ హృదయమే."★

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 39వ అధ్యాయం - ఫజ్లిమనిస్తబ్రా అద్దీనా]

---

★ ఈ హదీసులో నిబద్ధమానవుడ్ని పశువుల కాపరితో, అతని పాశవిక వాంఛలను పశువులతో పోల్చడం జరిగింది. అలాగే నిషిద్ధ విషయాలను రక్షణ గట్టుతో, అనుమానాస్పద విషయాలను గట్టుకు ఇరుప్రక్కల ఉండే స్థలంతో పోల్చడం జరిగింది. అనుమానాస్పద విషయాల్లోకి చిక్కుకుపోవడం అంటే గట్టుకు ఇరుప్రక్కలాపోయి మేయడం అన్నమాట. గట్టుదాటిమేస్తున్న పశువు పంట పొలంలోకి చొచ్చుకుపోయి మేయదన్న నమ్మకం ఉండదు. కాపరి అప్రమత్తంగా ఉండకపోతే అది ఏక్షణంలోనైనా పొలంలో పడి పంటను నాశనం చేసే ప్రమాదం ఉంది. దానికే కాపరి శిక్షార్హుడవుతాడు. అదే విధంగా నిబద్ధ మానవుడు అప్రమత్తంగా ఉండకపోతే అతని పాశవిక వాంఛలు దేవుడు నిర్ణయించిన హద్దుల్ని అతిక్రమిస్తాయి. తద్వారా అతను కూడా శిక్షార్హుడవుతాడు. అందువల్ల వీలయినంతవరకు అనుమానాస్పద విషయాల జోలికి పోకూడదని ఈ హదీసు బోధిస్తోంది.

ఈ హదీసు ఎంతో ముఖ్యమైనది, ఇందులో అనేక ప్రయోజనాలున్నాయని ఇమామ్ నవవీ (రహ్మాలై) వ్యాఖ్యానించారు. అసలిది ఇస్లాంకు ఆధారభూతమయిన కొన్ని హదీసుల్లో ఒకటని ఆయన అన్నారు. కొందరు ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఇస్లాం బోధనలు మొత్తంలో ఈ హదీసు 1/3 వంతు ఆక్రమిస్తుంది. మిగిలిన మూడింట రెండు వంతులకు సంబంధించిన రెండు హదీసులు ఇలా ఉన్నాయి. (1) కర్మల పర్యవసానం మనోసంకల్పంపై ఆధారపడి ఉంటుంది; (2) ఇస్లాంలో పనికిమాలిన విషయాలను విడనాడటంలో మనిషి శ్రేయస్సు ఉంది. అబూదావూద్ సజస్తానీ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం, ఇస్లాం ముఖ్యమైన నాలుగు హదీసులపై ఆధారపడి ఉంది. మూడు పైన పేర్కొనబడిన హదీసులు. నాలగవ హదీసు ఈ విధంగా

## 21వ అధ్యాయం - ఒంటె క్రయవిక్రయాలకు సంబంధించిన షరతులు

1029. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- నేను బాగా అలసిపోయిన ఒక ఒంటెమీద ప్రయాణం చేస్తున్నాను. దైవప్రవక్త (సల్లం) నా దగ్గరికి వచ్చి ఒంటె (శక్తి) కోసం దైవాన్ని ప్రార్థించారు. తర్వాత ఆయన దాన్ని కొట్టి అదలించగానే ఇది వరకెన్నడూ లేనంత వేగంగా నడవసాగింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దాన్ని నాకు ఒక ఊఖియా ఎత్తు వెండికి అమ్మెయ్యి" అని అన్నారు. అంచేత నేనా ఒంటెను దైవప్రవక్త (సల్లం)కు అమ్మివేశాను. అయితే నేను "దీనిపై ఎక్కి ఇంటిదాకా వెళ్తాను" అని షరతు పెట్టాను. ఇలా మేము మదీనా చేరుకున్నాక నేను ఒంటెను తీసుకొని ఆయన సన్నిధికి వెళ్ళాను. అక్కడ ఆయన ఒంటె ధర ఇప్పించారు. అయితే నేను (పైకం తీసుకొని) వెనక్కి తిరిగి వెళ్ళబోతుంటే దైవప్రవక్త (సల్లం) నన్ను పిలిపించారు. (నేను తిరిగొచ్చిన తరువాత) "నీ ఒంటె తీసుకోవడం నా అభిమతం కాదు. ఇదిగో నీ ఒంటెను కూడా తీసికెళ్ళు, ఇదిప్పుడు నీదే"★అని అన్నారు ఆయన.

**[సహీహ్ బుఖారీ : 54వ ప్రకరణం - అష్షురూత్, 4వ అధ్యాయం - ఇజాఅష్తరతల్ బైవుజ్జప్రొద్దాబ్బతి]**

---

ఉంది. "మీరు మీ కోసం ఇష్టపడినదే మీ సోదరుని కోసం ఇష్టపడనంతవరకు మీలో ఏ ఒక్కరూ (పరిపూర్ణ) విశ్వాసి కాజాలడు" (బుఖారీ - ఈమాన్ ప్రకరణం 7:12). మరి కొందరు నాల్గవ హదీసును ఈ విధంగా పేర్కొన్నారు. "మీరు ఇహలోక వ్యామోహాన్ని వదలిపెట్టండి. దేవుడు మీకు ఎవరి మీదా ఆధారపడకుండా సహాయం చేస్తాడు."

కొందరు ధర్మవేత్తలు ఈ హదీసు ఔన్నత్యానికి కారణం చెబుతూ, దైవప్రవక్త (సల్లం) ఇందులో ఆహార పానీయాలు, వస్త్రధారణ మొదలయిన సమస్త విషయాల మంచీ చెడులను గురించి చెప్పి అనుమానాస్పదమైన విషయాలను విడనాడాలని ఆదేశించారని అన్నారు. ధర్మం దృష్ట్యా, గౌరవం దృష్ట్యా అందులోనే మనిషి శ్రేయస్సు ఉంది. పైగా అనుమానాస్పద విషయాలను గురించి హెచ్చరించడానికి సురక్షితమైన గరిక గట్టు గురించిన ఉదాహరణ ఇచ్చారు. అంటే గరిక గట్టుపై పశువుల్ని మేపుతూ వాటిని నిర్లక్ష్యంగా పొలంలోనికి పోనిస్తే శిక్ష అనుభవించాల్సి వస్తుందని హెచ్చరించారు. ఆ తర్వాత మానవుని శరీరంలో ఉండే అతి ముఖ్యమైన భాగం, హృదయం గురించి ప్రస్తావిస్తూ హృదయం చెడిపోతే మొత్తం దేహమే చెడిపోతుందని అన్నారు. అది ఆరోగ్యంగా, పరిశుద్ధంగా ఉంటే మొత్తం శరీరం ఆరోగ్యంగా, పరిశుద్ధంగా ఉంటుందని తెలిపారు.

ధర్మసమ్మతమైన (హలాల్) విషయాలేవో, నిషిద్ధ (హరామ్) విషయాలేవో స్పష్టంగా తెలియజేయబడ్డాయి. అంటే - పండ్లు, పాలు, తేనె, కోడిగ్రుడ్లు మొదలైనవి ధర్మసమ్మతమైన పదార్థాలనీ; మద్యం, పంది, మృతపశువు, మూత్రం, పారుడు నెత్తురు, వ్యభిచారం, అసత్యం, పరోక్ష నింద, చాడీలు, పర స్త్రీని దురుద్దేశ్యంతో చూడటం మొదలైనవి నిషిద్ధ విషయాలని అందరికీ తెలుసన్నమాట. ఇవిగాక మరో రకానికి చెందిన విషయాలు కూడా ఉన్నాయి. ఇవి స్పష్టంగా ధర్మ సమ్మతమైనవి గాని, నిషిద్ధమైనవి గాని అని తెలియజేయబడలేదు. వీటిని గురించి జన సామాన్యానికి తెలియదు. అనుభవజ్ఞులైన ధర్మవేత్తలు, ధర్మ సంస్కర్తలు మాత్రమే పరిశోధన ద్వారా వాటి గూడార్థాన్ని వివరించగలరు. అందువల్ల జన సామాన్యం అలాంటి అనుమానాస్పద విషయాల జోలికి పోకుండా ఉండటంలోనే వారి శ్రేయస్సు ఇమిడి ఉంది.

★ ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై), ఆయన అనుచరులు ఈ హదీసుని ఆధారంగా చేసుకొని, జంతువుని అమ్మేవాడు తాను తలచిన చోటు వరకు దానిపై ఎక్కి ప్రయాణం చేస్తానన్న....... షరతు విధించి జంతువును అమ్మడం ధర్మసమ్మతమేనని తీర్పిచ్చారు. ప్రయాణ దూరం తక్కువగా ఉంటే ఇలాంటి షరతు పెట్టి అమ్మవచ్చని ఇమామ్ మాలిక్ (రహ్మాలై) అన్నారు. అయితే ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై), ఇతర ధర్మవేత్తలు మాత్రం ప్రయాణ దూరం ఎక్కువగా ఉన్నా, తక్కువగా ఉన్నా ఇలా షరతు పెట్టి అమ్మడం ధర్మసమ్మతం కాదన్నారు. వీరీ హదీసుకు భాష్యం చెబుతూ, అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఉద్దేశ్యం హజ్రత్ జాబిర్ (రజి) గారి ఒంటెను కొనడం కాదు, ఆయనకు మేలు చేయాలన్నదే ప్రవక్త (సల్లం) ఉద్దేశ్యం అని అభిప్రాయపడ్డారు.

1030. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- నేనొక యుద్ధంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాను. తర్వాత నేను, అలసిపోయి నడవలేని ఒక ఒంటెపై ఎక్కి బయలుదేరాను. (కాస్సేపటికి) దైవప్రవక్త (సల్లం) నా దగ్గరకు వచ్చి "ఏమయింది నీ ఒంటెకు?" అని అడిగారు. నేనిది అలసిపోయిందని చెప్పాను. తర్వాత ఆయన వెనక్కి జరిగి ఒంటెను అదలించి దాని (శక్తి) కోసం దైవాన్ని ప్రార్థించారు. ఆ తర్వాత అది దారి పొడుగూతూ మిగిలిన ఒంటెలన్నిటికన్నా ముందు ముందుగానే నడుస్తూపోయింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఇప్పుడు నీ ఒంటె ఎలా ఉంది?" అని అడిగారు. నేను మీ "ప్రార్థన ఫలితంగా చాలా బాగుంద"న్నాను. "సరే. నీవు దీన్ని నాకు అమ్ముతావా?" అని అడిగారు ఆయన. నేనీ మాట విని సిగ్గుపడ్డాను. ఎందుకంటే నా దగ్గర నీళ్ళు మోసుకురావడానికి ఇది తప్ప మరో ఒంటె లేదు. అయినప్పటికీ నేను "మీ ఇష్టప్రకారమే కానివ్వండి" అన్నాను. "అయితే దాన్ని నాకు అమ్మెయ్యి" అన్నారు ఆయన. నేను ఆయనకు అమ్మేశాను. అయితే "నేను దీనిపై ఎక్కి మదీనా చేరుకునే దాకా నా అధీనంలో ఉండాలి" అని షరతు పెట్టాను.

నేను (నడుస్తూ) "దైవప్రవక్తా! నేను కొత్తగా పెళ్ళి చేసుకున్నాను. కాస్త నాకు (త్వరగా) వెళ్ళనివ్వండి" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) నాకు వెళ్ళేందుకు అనుమతినిచ్చారు. నేను దారంతా అందరికంటే ముందు ముందు నడుస్తూ మదీనా చేరుకున్నాను. మదీనా చేరుకున్నాక మా మామయ్య నన్ను కలుసుకొని ఒంటె విషయం విచారించాడు. నేను జరిగిన వృత్తాంతమంతా తెలిపి ఒంటెను అమ్మేశానని చెప్పాను. ఇది విని ఆయన నాపై కోపగించుకున్నాడు - (ఉన్న) ఒక్క ఒంటెను ఎందుకు అమ్మేశావని.

నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర అనుమతి తీసుకొని వెళ్ళబోతుంటే "నీవు పెళ్ళి చేసు కున్నావా?" (చేసుకుంటే) కన్యను చేసుకున్నావా? పునర్వివాహితను చేసుకున్నావా" అని అడిగారు ఆయన. పునర్వివాహితను చేసుకున్నానని నేను చెప్పాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నీవు కన్యను ఎందుకు చేసుకోలేదు? కన్యను చేసుకుని ఉంటే నీవు ఆమెతో, ఆమె నీతో ఎంచక్కా ఆడుకుంటూ హాయిగా జీవితం గడపవచ్చుకదా!" అని అన్నారు. "దైవప్రవక్తా! మా నాన్నగారు చనిపోయారు (లేక అమరగతులయ్యారు). నాకు (చాలామంది) పిన్న వయస్కులయిన చెల్లెళ్ళు ఉన్నారు. వాళ్ళ బాగోగులు చూస్తూ వారికి విద్యాబుద్ధులు గరపలేని అమ్మాయిని చేసుకోవడం బాగుండదని నాకు అన్పించింది, అందువల్ల వాళ్ళ బాగోగులు చూస్తూ వారికి విద్యాబుద్ధులు గరపగలిగే అనుభవజ్ఞురాలైన మహిళను చేసుకున్నాను" అని అన్నాను నేను.

దైవప్రవక్త (సల్లం) మదీనా చేరుకున్న తరువాత నేనొక రోజు ఉదయం ఒంటెను తీసుకొని ఆయన సన్నిధికి వెళ్ళాను. అప్పుడు నాకాయన ఒంటె ధరను ఇప్పించారు. తర్వాత నా ఒంటెను కూడా నాకు తిరిగి ఇచ్చేశారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 113వ అధ్యాయం - అస్తయిజాన్, అర్రజులిల్ ఇమామ్]

1031. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రెండు ఊఖియాల ఎత్తు వెండి,

ఒకటి లేక రెండు దిర్హంలకు నా ఒంటెను కొన్నారు. తర్వాత ఆయన సిరార్[1] ప్రాంతానికి చేరుకొని ఒక ఆవును జిబా చేయమని ఆదేశించారు. ఆవును జిబా చేసిన తరువాత అందరూ దాని మాంసం తిన్నారు. ఆ తర్వాత ఆయన మదీనా చేరుకున్నారు. మదీనా చేరుకొని, నన్ను ముందుగా మస్జిదుకెళ్ళి రెండు రకాతులు నఫిల్ నమాజు చేసుకోమని ఆజ్ఞాపించారు. ఆయన నాకు (నా) ఒంటె ధరను తూచి ఇచ్చారు.[2]

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 199వ అధ్యాయం - అత్తఆము ఇన్దల్ ఖుదూమ్]

## 22వ అధ్యాయం - అప్పు తీసుకోవడం మంచిదే కాని దాన్ని తిరిగి చెల్లించడం అంతకంటే మంచి విషయం

1032. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవ ప్రవక్త (సల్లం) దగ్గరికొచ్చి తన అప్పు తిరిగిచ్చేయమని ఒత్తిడి చేయసాగాడు. ఆ సందర్భంలో అతను పరుష పదజాలాన్ని ఉపయోగించాడు. ప్రవక్త సహచరులు (రజి) ఈ మాటలు విని అతడ్ని దూషించడానికి ఉపక్రమించారు. అయితే దైవప్రవక్త (సల్లం) (వాళ్ళను వారిస్తూ) "అతడ్ని ఏమీ అనకండి, వదిలేయండి. తన సొమ్ము తీసుకోవలసిన వ్యక్తికి ఇలా (కఠినంగా) మాట్లాడే హక్కుంది" అని అన్నారు. ఆ తర్వాత ఆయన "అతను నాకిచ్చిన ఒంటె వయస్సు ఎంత ఉందో అంతే వయస్సు గల ఒంటెను అతనికి ఇచ్చి వేయండి" అని అన్నారు. అప్పుడు ప్రవక్త సహచరులు (రజి) "దైవప్రవక్తా! అతని ఒంటెలాంటి ఒంటె లేదు. మా దగ్గర ఉన్నవన్నీ అంతకంటే మంచి ఒంటెలే" అని అన్నారు. "ఆ మంచి ఒంటె ఇవ్వండతనికి. అప్పు తీర్చడంలో ఉత్తముడే మీలో ఉత్తముడు" అన్నారు ఆయన.

[సహీహ్ బుఖారీ : 40వ ప్రకరణం - అల్ వకాల్తా, 6వ అధ్యాయం - అల్‌వకాలతి ఫీ ఖజాయిద్దుయూన్]

1033. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక యూదుని దగ్గర ఒక ఉక్కు కవచం

---

(1) 'సిరార్' అన్నది మదీనా నుండి తూర్పు దిక్కుగా మూడు మైళ్ళ దూరంలో ఉన్న ఒక గ్రామం.

(2) ఈ హదీసు ద్వారా అనేక విషయాలు తెలుస్తున్నాయని ఇమామ్ నవవీ (రహ్మలై) రాస్తున్నారు. ఉదాహరణకు:- (1) ఒంటెను జిబా చేయడం (కోయడం) ధర్మసమ్మతమైన విషయమయినప్పటికీ దానికంటే ఆవును జిబా చేయడం ఉత్తమం. (2) ప్రయాణం నుండి తిరిగొచ్చిన తర్వాత ముందుగా మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతులు నఫిల్ నమాజు చేయడం అభిలషణీయం. (3) రాత్రి వేళలాగే పగటి వేళ కూడా నఫిల్ నమాజు రెండు రకాతులు చేయాలి. (4) నీరసించిన ఒంటె క్షణంలో బలం పుంజుకొని చలాకీగా నడవడం దైవప్రవక్త (సల్లం) మహిమ. (5) ఏదైనా వస్తువును అమ్మే విషయంలో యజమానిని సంప్రదించడంలో ఎలాంటి తప్పులేదు. (6) వ్యాపార నిర్ణయం జరగడం, ధర నిర్ణయించడం అవసరం. (7) తన క్రింది ఉద్యోగుల బాగోగులను గురించి విచారించడం సున్నత్ (సంప్రదాయం), (8) మంచి సలహా ఇవ్వాలి (9) కన్యను వివాహమాడటం అభిలషణీయం (10) భార్యతో ఆడుకోవడం, ఆమె మనస్సుని రంజింపజేయడం అభిలషణీయం (11) [హజ్రత్ జాబిర్ (రజి)]గారు సొంత సుఖాల కన్నా ఇంటి పరిస్థితులకు, చెల్లెళ్ళ విద్యా శిక్షణలకు ప్రాధాన్యత నివ్వటం గమనార్హం. (12) వ్యాపార నిర్ణయం జరిగిన తర్వాత ధర చెల్లించే సమయంలో కొంచెం ఎక్కువ ఇవ్వడం సున్నత్ (13) వస్తువు ధరను తూకం వేయించడం, తూకం వేసినందుకు ప్రతిఫలం ఇవ్వడం వర్తకుని బాధ్యత. (14) సైన్యం నుండి వెళ్ళిపోవడానికి అనుమతి కోరడం ధర్మసమ్మతం. (15) బాధ్యతల నిర్వహణకై ప్రాతినిధ్యం వహించడం ధర్మసమ్మతం. (16) సజ్జనుల అడుగుజాడల నుండి శుభశ్రేయాలను పొందజూడటం ధర్మసమ్మతమే.

--అనువాదకుడు

కుదువపెట్టి, కొంత ధాన్యం తీసుకున్నారు. గడువులోపు అప్పు తీర్చుతానని కూడా అతనికి వాగ్దానం చేశారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 14వ అధ్యాయం - షరాఅన్నబీ (సల్లం) బిన్నసియ్యా]

## 25వ అధ్యాయం - అడ్వాన్సు చెల్లింపు వ్యాపారం

1034. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మదీనా తరలి వచ్చిన తర్వాత (చూస్తే ఇక్కడ) మదీనావాసులు రెండు మూడేండ్ల అడ్వాన్సు చెల్లింపు ప్రాతిపదికపై వ్యాపారం చేస్తుండేవారు. అప్పుడు దైవప్రవక్త (స) "ఏదైనా సరుకు విషయంలో అడ్వాన్సు చెల్లింపు ప్రాతిపదికపై వ్యాపారం చేయదలచుకుంటే ఆ సరుకు బరువు, కొలత, పరిమాణాలతోపాటు గడువు కూడా (తెలిసి ఉండాలి) నిర్ణయించబడాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 35వ ప్రకరణం - సల్మ్, 2వ అధ్యాయం - అస్సల్మి ఫీ వజ్నిమ్మాలూమ్]

## 27వ అధ్యాయం - అమ్మకం, కొనుగోళ్ళలో (అసత్య) ప్రమాణం చేయడం నిషిద్ధం

1035. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "(అసత్య) ప్రమాణం చేయడం వల్ల సరుకు అమ్ముడుపోతుంది గాని, వ్యాపారంలోని శుభం తరిగి పోతుంది."

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - బుయూ, 26వ అధ్యాయం - యమ్ హఖ్ఖుల్లాహుర్రిబా వయుర్బిస్సదఖాత్]

## 28వ అధ్యాయం - షుఫా (సన్నిహితుడి కొనుగోలు హక్కు)

1036. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- విభజించబడని ఉమ్మడి భూమి (స్థిరాస్తి) విషయంలో దైవప్రవక్త (స) షుఫా ఆజ్ఞ (సన్నిహితుడి కొనుగోలు అధికారం) జారీ చేశారు. అయితే ఆ భూమిలో గట్లు, హద్దులు వేసి, వేర్వేరు దారులు ఏర్పరచడం జరిగితే ఇక షుఫా హక్కు ఉండదు.

[సహీహ్ బుఖారీ : 36వ ప్రకరణం - అష్షుఫా, 1వ అధ్యాయం - అష్షుఫ్ అతి మాలమ్ యుఖ్సిమ్ ఫయిజా....]

## 29వ అధ్యాయం - పొరుగువాని గోడకు మేకు (గుంజ) దిగకొట్టవచ్చా?

1037. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) "ఏ ఒక్కరూ తన గోడకు తన పొరుగువాడు మేకు (లేక గూటం) కొట్టే దానికి అభ్యంతరం పెట్టకూడదు" అని అన్నారు.

హజ్రత్ అబూహురైరా (రజి) ఇలా అనేవారు: కాని మీరీ హదీసుని ఆచరించడానికి వెనుకాడుతున్నారు. దైవసాక్షి! నేను దీన్ని ఏ మాత్రం వదలకుండా మీ ముందు మరింత గట్టిగా ప్రకటిస్తాను.

[సహీహ్ బుఖారీ : 46వ ప్రకరణం - మజాలిమ్, 20వ అధ్యాయం - లాయమ్నవు జారున్ జారహ్]

## 30వ అధ్యాయం - బల ప్రయోగాలతో ఇతరుల భూముల్ని ఆక్రమించుకోవడం నిషిద్ధం

1038. హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి) హదీసు:- అర్వా బిన్తె అవేస్ (అనే స్త్రీ) ఒక స్థలం విషయంలో తన యజమాన్య హక్కును చాటుకుంటూ హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి)కు వ్యతిరేకంగా మర్వాన్ బిన్ హకమ్ న్యాయస్థానంలో ఒక దావా వేసింది. తన స్థలాన్ని హజ్రత్ సయీద్ (రజి) అన్యాయంగా ఆక్రమించుకున్నారని ఆమె వాదించింది. అప్పుడు (పది మంది స్వర్గవాసులవుతారని ప్రకటించబడిన వారిలో ఒకరైన ప్రముఖ సహాబి) హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి) మాట్లాడుతూ "ఎవరైనా ఇతరులకు చెందిన ఒక జానెడు స్థలాన్ని కూడా ఆక్రమించుకుంటే ప్రళయ దినాన భూమికి ఏడు రెట్ల పరిమాణం గల హారంగా చేసి అతని మెడలో (గుదిబండగా) వేయడం జరుగుతుందని దైవప్రవక్త (స) తెలిపారు. స్వయంగా నేనందుకు సాక్ష్యమిస్తున్నాను?" అలాంటప్పుడు నేనామె హక్కును ఎలా కాజేయ గలను?" అని అన్నారు.[1]

[సహీహ్ బుఖారీ : 59వ ప్రకరణం - బదాయిల్ ఖల్ఖ్, 2వ అధ్యాయం - మాజా ఫీసబ్'యి అర్జీన్]

1039. హజ్రత్ అబూ సల్మా (రజి) కథనం:- (ఒక స్థలం విషయంలో) కొందరితో నాకు తగాదా వచ్చింది. నేనీ వ్యవహారాన్ని హజ్రత్ ఆయిషా (రజి) గారి ముందు ప్రస్తావించాను. ఆమె విని ఇలా అన్నారు: "అబూ సల్మా! స్థలాల వ్యవహారానికి దూరంగా ఉండు. 'ఎవరైనా ఇతరులకు చెందిన స్థలాన్ని అన్యాయంగా ఒక జానెడు ఆక్రమించుకున్నా సరే (ప్రళయదినాన) అతని మెడలో ఏడింతల భూపరిమాణం గల హారం వేయబడుతుంద'ని దైవప్రవక్త(స) సెలవిచ్చారు."

[సహీహ్ బుఖారీ : 46వ ప్రకరణం - మజాలిమ్, 13వ అధ్యాయం - ఇస్మిమన్ జలమ షయ్అన్ మినల్ అర్జ్]

## 31వ అధ్యాయం - దారి వెడల్పు తగాదా

1040. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దారి విషయంలో తగాదా వచ్చినప్పుడు దైవప్రవక్త (స) ఏడు బారలు (వెడల్పు) దారి వదలాలని తీర్పిచ్చేవారు.[2]

[సహీహ్ బుఖారీ : 46వ ప్రకరణం - మజాలిమ్, 29వ అధ్యాయం - ఇజా ఇఖ్తెలాఫూ ఫిత్తరీఖిల్ మీతాయి]

---

(1) ఈ హదీసు సహీహ్ ముస్లిం గ్రంథంలో మరింత వివరంగా వచ్చింది. హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి) ప్రవక్త ప్రవచనం విన్పించిన తర్వాత న్యాయమూర్తి మర్వాన్ మాట్లాడుతూ, "నేను మీ నుండి మరెలాంటి సాక్ష్యాన్నీ అడగబోను" అని అన్నాడు. అదీగాక హజ్రత్ సయీద్ (రజి) ఆ స్థలాన్ని అర్వాకు వదిలేశారు. అయితే ఆయన ఆ స్త్రీని శపిస్తూ "దేవా! ఈ స్త్రీ మాటలు అబద్ధమయితే ఈమె కళ్ళు పోగొట్టు. ఈ స్థలమే ఈమెకు సమాధి అవుగాక" అని ప్రార్థించారు. ఉల్లేఖకుడు ఇలా తెలియజేస్తున్నాడు:- "ఆ తర్వాత ఆమె నిజంగానే అంధురాలయిపోయింది. గోడలు వెతుక్కుంటూ నడుస్తూ "నాకు సయీద్ బిన్ జైద్ (రజి) గారి శాపం తగిలింది" అని చెబుతుండేది. చివరికి ఒక రోజు ఆమె అదే స్థలంలో కట్టుకున్న తన ఇంట్లో నడుస్తూ నూతిలో పడి చనిపోయింది. ఈ విధంగా ఆ ఇల్లే ఆమెకు సమాధి అయిపోయింది." - సంకలనకర్త.

(2) మనుషులు, పశువులు తిరగడానికి ఏడు బారల (గజాల) వెడల్పు దారి సరిపోతుంది. ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా వ్యాఖ్యానిస్తున్నారు :- "వివాదం తలెత్తినప్పుడే ఇలా (వెడల్పు) నిర్ణయించబడింది. వివాదం లేకుండా దారి యజమానులు ఏకాభిప్రాయంతో తలచినంత వెడల్పు దారి వదలి పెట్టవచ్చు. దారి వెడల్పుకు ఎలాంటి ఆంక్షలు లేవు".

# విధుల ప్రకరణం

# (ఆస్తి పంపకం ఆజ్ఞలు)

## 1వ అధ్యాయం - వారసులకు వారి నిర్ణీత వాటాలను ఇచ్చాక మిగిలితే దగ్గరి బంధువులకివ్వండి

1041. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "వారసుల కోసం (ఖుర్ఆన్‌లో) నిర్ణయించబడిన (ఆస్తి) వాటాలను ఆయా వారసులకు ఇచ్చేయండి. ఆ తర్వాత ఏదయినా మిగిలితే మృతునికి అతి సన్నిహితులయిన పురుష బంధువులకు ఇవ్వాలి."★

[సహీహ్ బుఖారీ : 85వ ప్రకరణం - ఫరాయజ్, 5వ అధ్యాయం - మీరాసుల్ వలది మిన్ అబీహి వ ఉమ్మిహీ]

## 2వ అధ్యాయం - వారసులు లేని వ్యక్తి ఆస్తి గురించిన ఆజ్ఞలు

1042. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఒకసారి నేను జబ్బుపడితే, దైవప్రవక్త (సల్లం), హజ్రత్ అబూబకర్ (రజి)లు నన్ను పరామర్శించడానికి కాలినడకన వచ్చారు. ఆ సమయంలో నేను స్పృహ తప్పి ఉన్నాను. దైవప్రవక్త (సల్లం) నా పరిస్థితి చూసి, వుజూ చేసి, ఆ వుజూ నీటిని నాపై చిలికించారు. దాంతో నాకు స్పృహ వచ్చింది. చూస్తే ఎదురుగా దైవప్రవక్త (సల్లం) కన్పించారు. నేనాయన్ని చూసి "దైవప్రవక్తా! నేను నా ఆస్తిని ఏం చెయ్యమంటారు? దాన్ని ఎలా పంపకం చేయాలి?" అని అడిగాను. దైవప్రవక్త (సల్లం) వెంటనే నా కెలాంటి సమాధానమివ్వలేదు. తర్వాత ఆస్తి పంపిణీ సూక్తి అవతరించింది.

[సహీహ్ బుఖారీ : 75వ ప్రకరణం - అల్‌మర్జా, 5వ అధ్యాయం - ఇయాదతిల్ ముగ్మా అలైహి]

## 3వ అధ్యాయం - అన్నిటికన్నా చివర్లో అవతరించిన (దైవ) సూక్తి "కలాలా"

1043. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- ఖుర్ఆన్ సూరాలన్నిటిలోకి చివర్లో బరాత్ సూరా అవతరించింది. అన్నిటికంటే చివర్లో ఈ సూక్తి అవతరించింది - యస్తఫ్ తూనక్ ఖులిల్లాహు యుఫ్తీకుమ్ ఫిల్ కలాలా. (సూరె నిసా: 176)

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, 4 - నిసా సూరా, 27వ అధ్యాయం - యస్తఫ్ తూనక్ ఖులిల్లాహు యుఫ్తీకుమ్]

---

★ వారసుల నిర్ణీత వాటాలను వారసులకు ఇచ్చివేసిన తరువాత, ఏదైనా మిగిలితే దాన్ని మృతునికి అతి సన్నిహితులయిన పురుష బంధువులకు ఇచ్చివేయాలి. అంటే తండ్రి లేదా కొడుకులని అర్థం. దగ్గరి బంధువులు ఉండగా వారిని కాదని దూరపు బంధువులకు ఇవ్వకూడదు.

## 4వ అధ్యాయం - మృతుడు వదిలిన ఆస్తి అతని వారసులకు దక్కాలి

1044. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- రుణగ్రస్తుడయి ఉన్న వ్యక్తి చనిపోయి అతని జనాజా (శవం) దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకురావడం జరిగితే, దైవప్రవక్త (సల్లం) (శవాన్ని తీసుకు వచ్చిన వారినీ) "ఇతను తన అప్పు తీర్చడానికి ఆస్తి ఏదైనా వదలిపెట్టాడా?" అని అడిగేవారు. అతను తన అప్పు తీర్చడానికి సరిపడే అంత ఆస్తి వదలిపెట్టాడని సమాధానం వస్తే దైవప్రవక్త (సల్లం) అతని కోసం జనాజా నమాజు చేసేవారు.★ అలాంటి సమాధానం రాకపోతే "మీరే మీ సహచరుని కోసం జనాజా నమాజ్ చేసుకోండి" అని చెప్పేవారు.

కొంత కాలానికి దేవుడు తన ప్రవక్త కోసం విజయ ద్వారాలు తెరుస్తాడు (అంటే పెద్ద ఎత్తున యుద్ధ సొత్తు రావడం మొదలవుతుంది.) అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు; "నేను ముస్లింలకు వారి ప్రాణాల కన్నా అతి సన్నిహితుడ్ని; వారి దగ్గరి బంధువుల కన్నా దయామయుడ్ని; ఆత్మబంధువుని, సంరక్షకుడ్ని, అందువల్ల ఎవరైనా ముస్లిం చనిపోతే, అతను ఎవరికైనా బాకీ పడి ఉంటే, నేనా బాకీ తీర్చుతాను. మృతుడు వదిలిపెట్టిన ఆస్తి అతని వారసులకు లభిస్తుంది."

**[సహీహ్ బుఖారీ: 39వ ప్రకరణం - కిఫాలత్, 5వ అధ్యాయం - అద్దీన్]**

★ అప్పు తీర్చడం ఎంత ముఖ్యమైన బాధ్యతో ఈ హదీసు నొక్కి చెబుతోంది. మనిషి తాను జీవించి ఉండగానే అప్పు తీర్చవలసిన అవసరాన్ని కూడా ఈ హదీసు సూచిస్తోంది. ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ హదీసుపై వ్యాఖ్యానిస్తూ "రుణగ్రస్తుడు చనిపోయినప్పుడు అతని జనాజా నమాజ్ చేయడానికి దైవప్రవక్త (సల్లం) అంగీకరించలేదంటే, తద్వారా బ్రతికి ఉన్నవారు దైవానికి భయపడి తమ అప్పులను తీర్చివేయడానికి ప్రయత్నిస్తారని ఆయన ఆశించడమేనని అన్నారు. చనిపోయిన వ్యక్తి అప్పులు ప్రభుత్వ ధనాగారం (బైతుల్ మాల్) నుండి తీర్చే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

- సంకలనకర్త

# హిబా (స్వయం సమర్పణ) ప్రకరణం

## 1వ అధ్యాయం - ఒకరికి దానం చేసిన వస్తువుని తిరిగి అతని నుండి కొనరాదు

1045. హజ్రత్ ఉమర్ (రజి) కథనం:- నేనొక గుర్రాన్ని దైవమార్గంలో స్వారీ కోసం ఒకతనికి ఇచ్చి వేశాను. అయితే అతనా గుర్రాన్ని దుర్భరస్థితికి చేర్చాడు. అందువల్ల నేను ఆ గుర్రాన్ని తిరిగి అతని నుండి కొని తీసుకుందామని భావించాను. పైగా అతనా గుర్రాన్ని తక్కువ ధరకు అమ్ముతాడని కూడా నేను భావించాను. ముందుగా దీన్ని గురించి దైవప్రవక్త (సల్లం)ను తెలుసుకుందామని అడిగాను. కాని ఆయన (దాన్ని వ్యతిరేకిస్తూ) "అతనా గుర్రాన్ని ఒక దిర్హంకు అమ్మదలచినా సరే నీవు దాన్ని కొనకు. దానం చేసిన దాన్ని తిరిగి తీసుకోకూడదు. దానం చేసిన దాన్ని తిరిగి తీసుకోవడం అంటే కక్కినదాన్ని నాకటమే అవుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 34వ ప్రకరణం - జకాత్; 59వ అధ్యాయం - హల్ యష్తరీ సదఖతహు]

1046. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) దైవమార్గంలో ఒక గుర్రాన్ని స్వారీ కోసం ఒక యోధునికి దానం చేశారు. ఆ తర్వాత ఆ గుర్రాన్ని (ఆ వ్యక్తి) అమ్ముతుంటే హజ్రత్ ఉమర్ (రజి) దాన్ని కావాలనుకొని దైవప్రవక్త (సల్లం)ను విచారించారు. అప్పుడు దైవప్రవక్త(సల్లం) "దాన్ని కొనకు. దానం చేసిన దాన్ని తిరిగి తీసుకోకు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 119వ అధ్యాయం - అల్‌జఆయిల్ వల్ హమలాన్ ఫిస్సబీల్]

## 2వ అధ్యాయం - దానం, కానుకలు ఇచ్చి తిరిగి తీసుకోవడం నిషిద్ధం. అయితే తండ్రి గాని, తాతగాని సంతానానికి తామిచ్చిన దాన్ని తిరిగి తీసుకుంటే తప్పు లేదు

1047. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరికైనా దానంగా గాని, కానుకగా గాని ఏదైనా ఇచ్చి, తిరిగి తీసుకునేవాడు కక్కిదాన్ని నాక్కునే కుక్కలాంటివాడు."

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - అల్‌హిబా, 14వ అధ్యాయం - హిబతిర్రజులిల్ ఇమ్రాతి హీవల్ మరాతిల్ జౌజహా]

## 3వ అధ్యాయం - సంతానానికి హిబా చేస్తున్నప్పుడు వివక్ష చూపకూడదు

1048. హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) కథనం:- మా నాన్నగారు నన్ను వెంటబెట్టుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికెళ్ళి "దైవప్రవక్తా! నేను నా కొడుక్కు ఒక బానిసను హిబా (అంకితం) చేశాను" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) అది విని "మరి నీవు నీ కొడుకులందరికీ ఇలాగే హిబా చేశావా?" అని అడిగారు. దానికి నేను లేదన్నాను. "అయితే అతని నుండి కూడా వాపసు తీసుకో" అన్నారు దైవప్రవక్త (సల్లం).

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 12వ అధ్యాయం - అల్‌హిబతిల్ వలద్]

1049. హజ్రత్ ఆమిర్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) వేదిక ఎక్కి ఇలా అనడం నేను విన్నాను - "మా నాన్నగారు నాకొక కానుక ఇచ్చారు. అయితే (నా తల్లి) హజ్రత్ ఉమ్రా బిన్తె రవాహ (రజి) దీనిపై తన అభిప్రాయం వెలిబుచ్చుతూ "మీరీ కానుక ఇవ్వడంపై దైవప్రవక్త (సల్లం) ను సాక్షిగా నిలబెట్టనంతవరకు నేను సంతోషించలేను" అని అన్నారు. అందువల్ల మా నాన్నగారు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! నేను ఉమ్రా బిన్తె రవాహ (రజి) కడుపున బుట్టిన నా కొడుక్కు ఒక కానుక ఇస్తే దానికి మిమ్మల్ని సాక్షిగా నిలబెట్టాలని అన్నది ఆమె" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "మరి నీవు నీ కొడుకులందరికీ ఇలాగే కానుకలిచ్చావా?" అని అడిగారు. దానికి మా నాన్న లేదన్నారు. అప్పుడు దైవప్రవక్త "దేవునికి భయపడి, నీ కొడుకుల మధ్య న్యాయాన్ని పాటించు' ' అని బోధించారు. దాంతో మా నాన్నగారు (ఇంటికి) తిరిగొచ్చి తానిచ్చిన కానుకను నా దగ్గర్నుండి వాపసు తీసుకున్నారు".

[సహీహ్ బుఖారీ:51వ ప్రకరణం - హిబా, 13వ అధ్యాయం - లా షహాద ఫిల్ హిబా ]

## 4వ అధ్యాయం - శాశ్వతంగా హిబా (అంకితం) చేయడం

1050. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఉమ్రా[1] (శాశ్వత కానుక) విషయంలో మాట్లాడుతూ "ఒకరికి ఇవ్వబడిన వస్తువు ఇక (శాశ్వతంగా) అతనిదే అవుతుంది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 32వ అధ్యాయం - మాఖీల ఫిల్ ఉమ్రా వర్రిఖ్బా]

1051. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఉమ్రా (కానుకను శాశ్వతంగా ఇచ్చివేయడం) ధర్మసమ్మతమే"[2]

[సహీహ్ బుఖారీ : 51వ ప్రకరణం - హిబా, 32వ అధ్యాయం - మాఖీల ఫిల్ ఉమ్రా వర్రిఖ్బా]

---

(1) ఎవరికైనా ఏదైనా కానుక లేదా పారితోషికం ఇచ్చేటప్పుడు నీవు బ్రతికున్నంత కాలం దీన్ని నీవు వాడుకోవచ్చు, అనుభవించవచ్చు అని చెప్పి ఇచ్చే వస్తువును 'ఉమ్రా' అంటారు. ఈ పారితోషికం విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, ఆ పారితోషికం దాన్ని స్వీకరించిన వాడిదే శాశ్వతమైన సొత్తు అవుతుందన్నదే సరయిన విషయం. నీ తదనంతరం నేను దాన్ని తిరిగి తీసుకుంటానని ఎవరైనా షరతు విధిస్తే అది దుర్మార్గంతో కూడిన, పనికి మాలిన షరతుగా పరిగణించబడుతుంది.

(2) అంటే శాశ్వతంగా ఇచ్చిన పారితోషికం లేదా కానుక అన్నమాట. అది ఎవరి కివ్వబడుతుందో ఇక అతనిదే అవుతుంది. అతను చనిపోయిన తరువాత ఆ కానుక అతని వారసులకు పోతుంది. దానిపై ఇచ్చిన వ్యక్తికి ఇక ఎలాంటి హక్కుండదు.

# వీలునామా ప్రకరణం

## వీలునామా ఆజ్ఞలు, నియమాలు.

1052. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఒక ముస్లిం ఏదైనా వస్తువు కలిగి ఉండి దాని విషయంలో వీలునామా వ్రాయదలచినపుడు (వెంటనే వ్రాయాలి), రెండు రాత్రులు గడచిపోయినా వీలునామా వ్రాయకుండా దాన్ని అట్లే ఉంచడం అతనికి వాంఛనీయం కాదు".

[సహీహ్ బుఖారీ : 55వ ప్రకరణం - వసాయా, 1వ అధ్యాయం - అల్ వసాయా]

## 1వ అధ్యాయం - వీలునామా మొత్తం ఆస్తిలో మూడోవంతుకు మాత్రమే వర్తిస్తుంది

1053. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి) కథనం:- వీడ్కోలు హజ్ జరిగిన యేడు నేను వ్యాధితో తీవ్రంగా బాధపడుతుంటే దైవప్రవక్త (సల్లం) నన్ను పరామర్శించడానికి వచ్చారు. అప్పుడు నేను ఆయనతో మాట్లాడుతూ "దైవప్రవక్తా! నా జబ్బు బాగా ముదిరిపోయింది. నేను ధనవంతుడ్ని. నాకు ఒక్క కూతురు తప్ప వారసులు లేరు. ఈ స్థితిలో నేను మూడింట రెండొంతులు ఆస్తిని దానం చేయవచ్చా?" అని అడిగేను నేను. "లేదు, అర్ధభాగం కూడా చేయకూడదు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

ఆ తర్వాత ఆయన ఇలా ప్రవచించారు; "మూడింట ఒక వంతు ఆస్తిని దానం చెయ్యి. నిజానికి ఇది కూడా ఎక్కువే. నీ వారసులు ప్రజల ముందు చేతులు జాపి దేబరించేలా వారిని నిరుపేదలుగా, నిరాధారులుగా చేసి వెళ్ళడం కంటే స్థితిపరులుగా చేసి వెళ్ళడం ఎంతో ఉత్తమం. నీవు ఏది ఖర్చు పెట్టినా ఖర్చు పెట్టేటప్పుడు దైవప్రసన్నత పొందడం నీ ఉద్దేశ్యమయి ఉంటే నీకు దాని పుణ్యఫలం తప్పకుండా లభిస్తుంది. చివరికి నీ భార్య కోసం వెచ్చించే ధనం కూడా నీకు పుణ్యం ఆర్జించి పెడుతుంది."

ఆ తర్వాత నేను "(సరే) దైవప్రవక్తా! నా స్నేహితులంతా మదీనా వెళ్ళిపోతే, నేను వెనకబడిపోయి ఇక్కడ మక్కాలోనే ఉండిపోవలసి వస్తుందా?" ★అని అడిగాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు. "ఎంత మాత్రం లేదు. నీవు ఎవరి వెనుకా ఉండిపోవు. నీ హోదా అంతస్తులు పెరిగే విధంగా

---

★ "నేను వెనుకపడిపోయి ఇక్కడే ఉండిపోవలసి వస్తుందా?" అంటే నాకు మక్కాలోనే చావచ్చి అంత్యక్రియలు జరిగిపోతాయా? అన్నది అంతరార్థం. మక్కా నుండి మదీనా వలసపోయిన ముస్లింలకు మక్కాలో చనిపోవడం ఇష్టం లేదు. పోతే "నీ వల్ల అనేక మందికి ప్రయోజనం చేకూరి, ఇతరులకు నష్టం వాటిల్లుతుంది" అన్న దైవ ప్రవక్త (సల్లం) పలుకుల్లో భవిష్యత్ ప్రకటన తొంగి చూస్తోంది. అది నిజం అని తేలింది కూడా. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి) మూలంగానే ముస్లిం యోధులు ఈరాన్, ఇరాఖ్‌లలో విజయపతాకాలు ఎగరవేశారు. ఈ యుద్ధాలలో ముస్లింలకు ఎంతో ప్రయోజనం చేకూరగా అవిశ్వాసులకు ఎంతో నష్టం వాటిల్లింది.

(భవిష్యత్తులో) నీవు ఎన్నో ఘనకార్యాలు చేయవలసి ఉంది. అదీగాక నీ వలన అనేకమందికి ప్రయోజనం చేకూరి, అనేక మందికి నష్టం వాటిల్లే వరకు నీవు బహుశా జీవించి ఉంటావు. దేవా! నా అనుచరుల హిజ్రత్ (వలస) కార్యాన్ని పూర్తిగా నెరవేరనివ్వు. వారిని వెనక్కి పంపివేయకు. అయితే పాపం సాద్ బిన్ ఖౌలా (రజి) మాత్రం దురదృష్టవంతుడు". దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పడం ద్వారా సాద్‌బిన్ ఖౌలా (రజి) మక్కాలో చనిపోయి అక్కడే ఖననం కావడం పట్ల తన విచారాన్ని, బాధను వ్యక్తం చేశారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 37వ అధ్యాయం - రిసాయిన్నబీ (సల్లం) సాద్ బిన్ ఖౌలా]

1054. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇలా అంటున్నారు:- అయ్యో! ప్రజలు (మూడింట ఒక వంతును ఇంకా తగ్గించి) నాల్గింట ఒక వంతుకు వీలును మారిస్తే ఎంత బాగుండు!! ఎందుకంటే దైవప్రవక్త (సల్లం) "మూడింట ఒక వంతు కూడా చాలా ఎక్కువే" ★ అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 55వ ప్రకరణం - వసాయా, 3వ అధ్యాయం - అల్ వసీయతి బిస్సుల్స్]

## 2వ అధ్యాయం - మృతునికి దానధర్మాల పుణ్యం చేరుతుంది

1055. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒకతను దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి "నా తల్లి అకస్మాత్తుగా చనిపోయింది. (చనిపోయేముందు) ఆమె మాట్లాడగలిగి ఉంటే దైవమార్గంలో దానం చేసి ఉండేదని నేను భావిస్తున్నాను. మరి నేనిప్పుడు ఆమె తరపున దానం చేస్తే దాని పుణ్యం ఆమెకు చేరుతుందా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) చేరుతుందని చెప్పారు.

[సహీహ్ బుఖారీ : 23వ ప్రకరణం - జనాయెజ్, 95వ అధ్యాయం - మౌతిల్ ఫుజా అతి బగ్‌తత]

## 4వ అధ్యాయం - వక్ఫ్ ఆస్తులకు సంబంధించిన ఆజ్ఞలు

1056. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)కు ఖైబర్ (ప్రాంతం)లో కొంత (వ్యవసాయ) భూమి లభించింది. దాని వినియోగం గురించి విచారించడానికి ఆయన దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! నాకు ఖైబర్‌లో కొంత భూమి దొరికింది. ఇది ఎంతో మంచి భూమి (సారవంతమైన నేల). ఇలాంటి భూమి నాకు ఇదివరకెప్పుడూ లభించలేదు. మరి దీన్ని గురించి మీ హితోపదేశం ఏమిటో సెలవియ్యండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం)

---

★ అత్యధిక మంది ధర్మవేత్తల ఏకాభిప్రాయం ప్రకారం వారసులు కలిగి ఉన్న వ్యక్తి మూడింట ఒక వంతు కంటే ఎక్కువ ఆస్తికి వీలునామా రాసిపోయినప్పటికీ అది చెల్లదు. వారసులు అనుమతిస్తే మాత్రం చెల్లుతుంది. ఏమయినప్పటికీ మూడింట ఒక వంతుకు కొంచెం తక్కువ ఆస్తికి వీలునామా వ్రాయడమే మంచిది.

హజ్రత్ అబూబకర్ (రజి) అయిదింట ఒక వంతుకు మాత్రమే వీలునామా రాశారు. హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి), హజ్రత్ ఇస్‌హాఖ్ (రజి)లు నాల్గింట ఒక వంతుకు వీలునామా రాశారు. మరికొందరు సహాబీలు (రజి) ఆరింట ఒక వంతుకు, ఇంకా కొందరు సహాబీలు పదింట ఒక వంతుకు వీలునామా రాశారు. హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి), హజ్రత్ ఆయిషా (రజి)ల అభిప్రాయం ప్రకారం, వారసులు ఎక్కువ మంది ఉండి ఆస్తి తక్కువగా ఉన్నప్పుడు అసలు వీలునామా రాయకపోవడమే మంచిది.

సమాధానమిస్తూ "నీవు కావాలనుకుంటే భూమి యాజమాన్య హక్కును నీ కోసం ఉంచుకొని దానికి (రాబడి)ని దానం చెయ్యి" అని అన్నారు.

హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్త (సల్లం) ఆదేశాన్ని శిరసావహిస్తూ, భూమి ఒకవైపు అమ్ముడుపోకుండా మరొకవైపు ఎవరికీ దాన్ని ఇనాముగా ఇవ్వడానికి వీలు లేకుండా, వేరొక వైపు వారసులకు పంపకం కాకుండా ఉంచి, దాని రాబడిని నిరుపేదలు, బంధువులు, బానిసల దాస్య విముక్తి, రుణగ్రస్తుల రుణ విముక్తి, బాటసారులు, అతిథులు, ఇతర సత్కార్యాల కోసం వినియోగమయ్యేలా దానం చేశారు. అయితే దాని రక్షణ కోసం నియమించబడిన ధర్మకర్తకు దాని రాబడిలో కొంత భాగాన్ని సముచితమైన రీతిలో తాను, తన భార్యాపిల్లలు అనుభవించడానికి అనుమతి ఉంది. కాని (తద్వారా) ఆస్తి కూడ బెట్టుకోవడానికి అతనికి ఎలాంటి అధికారం లేదు.

హదీసు ఉల్లేఖకుని కథనం:- నేనీ హదీసుని ఇబ్నె సైరీన్ (రహ్మాలై) ముందు ప్రస్తావించినపుడు ఆయన ఇలా అన్నారు; "ధర్మకర్త ఈ వఖ్ఫ్ ఆస్తిని ధనికుడయిపోవాలన్న కాంక్షతో, స్వప్రయోజనాలు ఆశించి ఖర్చు చేయడానికి వీల్లేదు".

[సహీహ్ బుఖారీ : 54వ ప్రకరణం - అష్షురూత్, 19వ అధ్యాయం - అష్షురూతి ఫిల్ వఖ్ఫ్]

## 5వ అధ్యాయం - వీలునామా రాయడానికి విషయమేదీ లేనపుడు వీలునామా రాయకపోవడంలో తప్పులేదు

1057. హజ్రత్ తల్హా బిన్ మసర్రఫ్ (రహ్మాలై) కథనం:- నేనొకసారి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీఔఫా (రజి) గారిని "దైవప్రవక్త (సల్లం) వీలునామా రాశారా?" అని అడిగాను. దానికాయన లేదన్నారు. "మరి ప్రజలకు వీలునామా (ఆజ్ఞ)ను ఎలా విధించారు? లేక ప్రజలకు వీలునామా ఆజ్ఞ ఎలా ఇచ్చారు?" అని అడిగాను నేను.( హజ్రత్ తల్హా (రజి) ఇక్కడ ఎలాంటి పదాలు వాడారో ఉల్లేఖకునికి సరిగా గుర్తులేదు) అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) "దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకొని దాని ప్రకారం నడచుకోవాలని దైవప్రవక్త (సల్లం) ఉపదేశించారు కదా!" అని అన్నారు. ★

[సహీహ్ బుఖారీ : 55వ ప్రకరణం - అల్‌వసాయా, 1వ అధ్యాయం - అల్‌వసాయా వఖౌలిన్నబీ (సల్లం)]

1058. హజ్రత్ అస్వద్ బిన్ యజీద్ (రహ్మాలై) కథనం:- ప్రజలు హజ్రత్ ఆయిషా (రజి) ముందు "హజ్రత్ అలీ (రజి) దైవప్రవక్త (సల్లం) నుండి (ఆయన) వీలునామా అమలు పరచడానికి అధికారం పొందిన వ్యక్తి" అని ప్రస్తావించారు. హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాట విని ఇలా అన్నారు: "దైవప్రవక్త (సల్లం) ఆయనకు వీలునామా గురించి ఎప్పుడు ఉపదేశించారు? నేను దైవప్రవక్త (సల్లం)ను అక్కున

---

★ దైవప్రవక్త (సల్లం) ఎలాంటి ఆస్తి వదలి పెట్టిపోలేదు గనక ఆయన ధన వ్యవహారంలో వీలునామా రాయలేదు. కాని దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకొని దాని ప్రకారం నడచుకోవాలని మాత్రం వీలునామా రాసిపోయారు. వారసులకు ఆస్తి పంపకం విషయంలో వీలునామా విధి గురించి ఖుర్‌ఆన్‌లో ఉంది. అయితే కొంత కాలానికి వారసుల వాటాలు స్వయంగా దేవుడు (నిసా సూరాలో) నిర్ణయించినందున, ఈ వీలునామా విధి రద్దయిపోయింది.

చేర్చుకొని కూర్చున్నాను (లేదా ఆమె ఇలా అన్నారు). దైవప్రవక్త (సల్లం) నా వడిలో (పడుకొని) ఉన్నారు. ఆ సమయంలో ఆయన ఒక పళ్ళెం తెప్పించారు. ఆయన (లేవడానికి ప్రయత్నించి) నా వడిలో పడిపోయారు. నాకప్పుడు ఆయన తుదిశ్వాస విడిచి పెట్టారన్న సంగతి కూడా తెలియదు. అలాంటప్పుడు ఆయన అలీ (రజి)కి వీలునామా ఉపదేశం ఎప్పుడు చేసినట్లు?''

[సహీహ్ బుఖారీ : 55వ ప్రకరణం - అల్‌వసాయా, 1వ అధ్యాయం - అల్‌వసాయా ఖౌలిన్నబీ (సల్లం)]

1059. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) గురువారం గురించి ప్రస్తావిస్తూ "గురువారం గురించి మీకేమైనా తెలుసా?'' అని అడిగారు. అలా చెప్పిన వెంటనే ఆయన కళ్ళు అశ్రుపూరితాలయి ప్రవహించసాగాయి. నేలమీది కంకర సయితం కన్నీటితో తడిసిపోయే అంతగా దుఃఖించారు ఆయన. ఆ తర్వాత ఇలా అన్నారు -

"గురువారం దైవప్రవక్త (సల్లం) వ్యాధి తీవ్రరూపం దాల్చడంతో ఆయన (స) "నేను మీకొక దస్తావీజు రాసిస్తాను. వ్రాత సామగ్రి తీసుకురండి, ఈ దస్తావీజు ఉంటే ఇక మీరెన్నడూ దారి తప్పరు'' అని అన్నారు. ప్రజలు ఈ మాట విని పరస్పరం భేదాభిప్రాయాల్లో పడిపోయారు. దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఇలా వాదులాడుకోవడం మంచి పని కాదు. వారిలో కొందరు "(దైవప్రవక్తా!) మీరు మమ్మల్ని వదలిపెడ్తున్నారా?'' అని అడిగారు. (ఈ మాటల్లో 'మీరు బోధించిన బోధనలు అస్పష్టంగా ఉన్నాయా?' అనే అర్థం కూడా ఇమిడి ఉంది) దైవప్రవక్త (సల్లం) ఈ పరిస్థితి చూసి "(మీరంతా) నా దగ్గర్నుంచి వెళ్ళిపొండి. మీరు నన్ను (పరస్పరం జగడమాడుకుంటూ) ఇరికించిన స్థితి కంటే ప్రస్తుతం నేనున్న స్థితే మంచిది. అందువల్ల నన్ను నా మానాన వదలిపెట్టండి'' అని అన్నారు.

ఆ తర్వాత హజ్రత్ అబ్దుల్లాబిన్ అబ్బాస్ (రజి) మాట్లాడుతూ ఇలా అన్నారు :- "దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోతూ మూడు ఉపదేశాలు చేశారు. ఒకటి: బహుదైవారాధకుల్ని అరేబియా ద్వీపం నుండి తీసివేయడం. రెండు: మీరు ఇక ముందు వచ్చే ప్రతినిధి వర్గాలకు కూడా నేను గౌరవించినట్లే బాగా గౌరవించి ఆతిథ్యమివ్వాలి. మూడో విషయం నేను మరచిపోయాను.''★

[సహీహ్ బుఖారీ : 56వ ప్రకరణం - జిహాద్, 176వ అధ్యాయం - హల్ యుస్తష్ ఫవు ఇలా అహ్లిజ్జిమ]

1060. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు మరణ ఘడియ ఆసన్నమయినపుడు ఆయన ఇంట్లో చాలా మంది జనం గుమిగూడారు. దైవప్రవక్త (సల్లం) వారిని ఉద్దేశించి "రాత సామగ్రి తీసుకు రండి. నేను మీకు మీరెన్నటికీ దారి తప్పని విధంగా ఒక దస్తావేజు రాసిస్తాను'' అని అన్నారు. అప్పుడు కొందరు పరస్పరం (మాట్లాడుకుంటూ) "దైవప్రవక్త (సల్లం)

★ మూడో విషయం గురించి ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ సమస్యపై సహాబీలలో భేదాభిప్రాయాలు వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) తన అంత్య దశలో హజ్రత్ ఉసామా (రజి)ని (సేనాపతిగా నియమించి) సైన్యాన్ని తీసుకొని (యుద్ధానికి) బయలుదేరవలసిందిగా ఆదేశించారని హజ్రత్ అబూబకర్ (రజి) తెలిపారు. అందువల్ల కొందరు ధర్మవేత్తలు మూడో విషయం ఇదే అయి ఉంటుందని భావించారు. మరి కొందరు ధర్మవేత్తల ప్రకారం, దైవప్రవక్త (సల్లం) మూడవ ఉపదేశంగా తన సమాధిని విగ్రహాలయంగా చేసుకొని పూజించకూడదని అన్నారు. వాస్తవం దేవునికే తెలుసు.

పరిస్థితి ఇప్పుడు విషమించింది. (ఈ స్థితిలో ఆయన్ని మరింత బాధపెట్టకూడదు) మన దగ్గర దివ్యఖుర్‌ఆన్ ఉంది. మనకీ దైవగ్రంథం చాలు" అని అన్నారు. దాంతో ఇంటి ముందు గుమిగూడిన జనంలో పరస్పరం విభేదాలు పొడసూపాయి. వారు పరస్పరం పోట్లాటకు దిగారు. కొందరు తమ అభిప్రాయం వ్యక్తపరుస్తూ "రాత సామగ్రి తీసుకొస్తే, దైవప్రవక్త (స) మన కోసం ఇక ముందు మనం ఎన్నడూ దారి తప్పడానికి ఆస్కారం లేకుండా దస్తావీజు రాస్తారు కదా!" అని అన్నారు. మరి కొందరు వారితో విభేదించారు. ఈ విధంగా వ్యర్థ సంభాషణ, భేదాభిప్రాయాలు, పోట్లాటలు మితిమీరిపోవడంతో దైవప్రవక్త (స) (విసుగెత్తిపోయి) "ఇక్కడ్నుంచి మీరంతా వెళ్ళిపోండి" అని అన్నారు.

ముస్లింలపై వచ్చి పడిన ఈ ఆపద పెద్ద ఆపదే. అప్పుడు ప్రజల్లో విభేదాలు వచ్చి పరిస్థితి గందరగోళంగా మారడం వల్లనే దైవప్రవక్త (స) వీలునామా రాయించడం మానేశారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజీ, 53వ అధ్యాయం - మరజున్నబీ (స) వవఫాతిహీ]

# మొక్కుబడుల ప్రకరణం
# (మొక్కుబడి చేసుకునే విధానాలు)

## 1వ అధ్యాయం - మొక్కుబడి చెల్లించుకునే ఆజ్ఞ

1061. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) దైవప్రవక్త (స) ముందు ఒక సమస్యను గురించి ప్రస్తావిస్తూ "(దైవప్రవక్తా!) నా తల్లి చనిపోయింది. (జీవించి ఉన్నప్పుడు) ఆమె ఒక మొక్కుబడి చేసుకుంది. దాన్ని తీర్చే బాధ్యత ఆమెపై ఉండిపోయింది" అని అన్నారు. దైవప్రవక్త (స) ఈ మాట విని "ఆమె తరపున నీవా మొక్కుబడి తీర్చు" అని సెలవిచ్చారు.

[సహీహ్ బుఖారీ : 55వ ప్రకరణం - అల్‌వసాయా, 19వ అధ్యాయం - మాయస్తహిబ్బులిమన్ యుతవఫ్ఫాపుజాఅత్]

## 2వ అధ్యాయం - మొక్కుబడి చేసుకోరాదు. మొక్కుబడి జరగవలసిన దాన్ని నివారించజాలదు

1062. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- మొక్కుబడులు చేసుకోవద్దని దైవప్రవక్త (స) మమ్మల్ని వారించారు. మొక్కుబడి జరగవలసిన ఏ సంఘటననూ ఏ కాస్త కూడా నివారించజాలదని, కాకపోతే మొక్కుబడి మూలంగా పిసినారి సయితం డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తుందని ఆయన అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 82వ ప్రకరణం - అల్‌ఖద్ర్, 6వ అధ్యాయం - ఇల్ ఖాయిన్నజ్రిల్ అబ్ద్ ఇలల్ ఖదర్]

1063. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:- "మొక్కుబడి మనిషికి అతని అదృష్టంలో లేని ఏ ప్రయోజనమూ చేకూర్చదు. కాకపోతే మొక్కుబడి అతడ్ని అతని అదృష్టంలో రాసి ఉన్న దాని వైపుకు తీసికెళ్ళి కలుపుతుంది. మొక్కుబడి ద్వారా దేవుడు

---

★ ఈ హదీసు మొక్కుబడులను వ్యతిరేకిస్తున్నట్లు పైకి అనిపిస్తోంది. కాని ధర్మసమ్మతమైన వ్యవహారంలో దైవప్రసన్నత కోసం మొక్కుబడి చేసుకోవడంలో తప్పులేదని ధర్మవేత్తల ఏకాభిప్రాయం. మొక్కుబడి పాప వ్యవహారానికి సంబంధించినదయితే దాన్ని తీర్చకపోవడమే గాక, తీర్చనందున పరిహారం (కప్ఫారా) కూడా చెల్లించనవసరం లేదని వారి అభిప్రాయం. అయితే ఇమామ్ అహ్మద్ (రహ్మలై), మరికొందరు ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం, మొక్కుబడి తీర్చకూడదు కాని ప్రమాణ భంగం అయినందుకు కప్ఫారా (పరిహారం) మాత్రం విధిగా చెల్లించాలి.

ఈ హదీసు ద్వారా మరొక విషయం కూడా తెలుస్తోంది. ధర్మసమ్మతమైన మొక్కుబడి చేసుకొన్నప్పుడు దాన్ని తప్పకుండా తీర్చాలి. లాభనష్టాలు, కష్టసుఖాలతో సహా సమస్త కార్యాలు నిర్వహించేవాడు దేవుడు మాత్రమేనని నమ్మాలి. కార్యసాధన కోసం మానవుడు చేసే వివిధ ప్రయత్నాలలో మొక్కుబడి కూడా ఒకటని గ్రహించాలి. కేవలం మొక్కుబడి చేసుకొని ప్రయత్నం చేయకపోవడం అవివేకమనిపించుకుంటుంది. అలాగే మొక్కుబడి మన విధి వ్రాతను మార్చి వేస్తుందని భావించడం కూడా అవివేకమే.

పిసినారి చేత కూడా డబ్బు ఖర్చు చేయిస్తాడు. ఆ పిసినారి మొక్కుబడికి పూర్వం ఇవ్వనిది మొక్కుబడి కారణంగా ఇచ్చివేస్తాడు."

[సహీహ్ బుఖారీ : 83వ ప్రకరణం - అల్ ఈమాన్ వ న్నజూర్, 26వ అధ్యాయం - అల్‌వఫా బిన్నజ్రి వఖౌలిహీ - యఫూన బిన్నజరి]

## 4వ అధ్యాయం - కాలినడకన కాబా గృహానికి వెళ్తానని మొక్కుబడి చేసుకోవడం

1064. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (స) ఓ సారి ఒక వృద్ధుణ్ణి చూశారు. అతను తన కొడుకు లిద్దరి మధ్య వారిచ్చిన ఊతంతో నడుస్తున్నాడు. దైవప్రవక్త (స) అక్కడి జనాన్ని ఉద్దేశించి "ఏమయింది ఇతనికి? ఎందుకిలా నడుస్తున్నాడు?" అని అడిగారు. "అతను కాలి నడకన కాబా గృహానికి వెళ్తానని మొక్కుబడి చేసుకున్నాడు" అన్నారు ప్రజలు. "ఈ మనిషి తనకు తాను విధించుకున్న ఈ శిక్షను దేవుడు లెక్కలోనికి తీసుకోడు. వాహనమెక్కి వెళ్ళమని చెప్పండతనికి" ★ అన్నారు దైవప్రవక్త (స).

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 27వ అధ్యాయం - మన్నజరల్ మషీఇలల్ కాబా]

1065. హజ్రత్ అఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం:- ఓ సారి నా సోదరి కాలినడకన కాబా గృహానికి వెళ్తానని మొక్కుబడి చేసుకొని, దాని గురించి దైవప్రవక్త (సల్లం)ను విచారించి రమ్మని నన్ను పురమాయించింది. నేను వెళ్ళి దైవప్రవక్త (సల్లం) ముందు ఈ విషయం ప్రస్తావించాను. ఆయన (స) విని "కాలినడకతో పాటు ఆమె వాహనం కూడా ఎక్కి ప్రయాణం చేయాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 28వ ప్రకరణం - జజావుస్సైద్, 27వ అధ్యాయం - మన్నజరల్ మషీఇలల్ కాబా]

★ దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తిని అతని మొక్కుబడిని తీర్చుకోవాలని ఆదేశించలేదు. పైగా ఆ మొక్కుబడికి వ్యతిరేకంగా నడచుకోవాలని అన్నారు. దానిక్కారణం, హజ్ యాత్ర కోసం వాహనం ద్వారా ప్రయాణమవడం కాలినడకన ప్రయాణం కన్నా శ్రేష్ఠమైనదై ఉండవచ్చు. శ్రేష్ఠమైనదానికి ప్రాధాన్యత నివ్వాలి గనక, ఆ మొక్కుబడిని తీర్చనవసరం లేదని దైవప్రవక్త (సల్లం) ఉపదేశించి ఉంటారు. లేదా ఆ వ్యక్తికి మొక్కుబడి తీర్చే (శారీరక) శక్తి లేనందున ఆ విధంగా ఉపదేశించి ఉంటారు దైవప్రవక్త (సల్లం). దేవుడు ఏ మనిషి పైనా అతను మోయలేని భారాన్ని వేయడు. అందువల్ల అతణ్ణి వాహనమెక్కి ప్రయాణం సాగించమని ఆదేశించి ఉంటారు.

# విశ్వాస ప్రకరణం

# (ప్రతిజ్ఞలు, ప్రమాణాలు - వాటి ఆజ్ఞలు)

## 1వ అధ్యాయం - దేవుని మీద కాకుండా మరెవరి మీదా ప్రమాణం చేయకూడదు

1066. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం:- "ఎవరూ తన తాత ముత్తాతల మీద ప్రమాణం చేయకూడదని దేవుడు గట్టిగా వారించాడ"ని దైవప్రవక్త (సల్లం) నాకు తెలియజేశారు. దైవసాక్షిగా చెబుతున్నాను ఈ ఉపదేశం విన్న తర్వాత నేనెప్పుడూ నా తాత ముత్తాతల మీద ప్రమాణం చేయలేదు. నా తరఫునా ఇలా చేయలేదు; మరెవరి తరఫునా చేయలేదు.

[సహీహ్ బుఖారీ : 83వ ప్రకరణం - ఈమాన్, 4వ అధ్యాయం - లాతహ్‌లిఫూ బిఆబాయికుమ్]

1067. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)ని కొందరు రౌతులతో కలసి వెళ్తూ తన తండ్రి పేరుతో ప్రమాణం చేస్తూ ఉండటం చూశారు. అప్పుడాయన హజ్రత్ ఉమర్ (రజి)ని పిలిచి "జాగ్రత్త! మీరు మీ తాతముత్తాతల మీద ప్రమాణం చేయకూడదని దేవుడు గట్టిగా తాకీదు చేశాడు. అందువల్ల ఎవరైనా ప్రమాణం చేయదలచుకుంటే దేవుని పేరుతో ప్రమాణం చేయాలి. లేకపోతే ఊరుకోవాలి" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 74వ అధ్యాయం -.మన్‌లమ్‌యర ఇక్ఫార మన్ ఖాలజాలిక్...]

## 2వ అధ్యాయం - ఎవరైనా లాత్, ఉజ్జాల పేర్లతో ప్రమాణం చేస్తే వారు సద్వచనం (కలిమా) పఠించాలి

1068. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా లాత్, ఉజ్జాల పేర్లతో ప్రమాణం చేస్తే (దానికి ప్రాయశ్చిత్తంగా) అతను 'లా యిలాహ ఇల్లల్లాహ్' (అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు) అని పఠించాలి. అలాగే ఎవరైనా ఒకరితో 'నేను నీతో జూదం ఆడ్తాను' అని అంటే (దానికి ప్రాయశ్చిత్తంగా) అతను దానం చేయాలి".

[సహీహ్ బుఖారీ : 65వ ప్రకరణం - తఫ్సీర్, 53 - నజ్మ్‌సూరా, 2వ అధ్యాయం - అఫర అయితు ముల్లాత్]

## 3వ అధ్యాయం - ఒకపని చేస్తానని ప్రమాణం చేశాక దాని కంటే మెరుగైనది మరోపని ఉందని తెలిస్తే

1069. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వెంట తబూక్ పోరాటానికి వెళ్ళబోతున్న నా స్నేహితులు వాహనాల కోసం విజ్ఞప్తి చేయమని చెప్పి నన్ను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి పంపారు. నేను వెళ్ళి "దైవప్రవక్తా! నా స్నేహితులు తమకు వాహనాలు ప్రసాదించమని అభ్యర్థించడానికి నన్ను మీ దగ్గరికి పంపించారు" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "దైవసాక్షి! నేను మీకు ఎలాంటి వాహనాన్ని ఏర్పాటు చేయను" అని అన్నారు.

నేను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళినపుడు ఆయన చాలా కోపంలో ఉన్నారు. నాకా సంగతి తెలియదు. అందువల్ల ఆయన అలా నిరాకరించడంతో నన్ను కూడా కోప్పడతారేమో నన్న భయంతో నేను చాలా బాధపడుతూ తిరిగొచ్చాను. నా మిత్రుల దగ్గరికి వచ్చి దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారని తెలియజేశాను. ఆ తర్వాత కాస్సేపు గడిచిందో లేదో హజ్రత్ బిలాల్ (రజి) గారి పిలుపు విన్పించింది. "అబ్దుల్లా బిన్ ఖైస్ ఎక్కడున్నాడు?" ★ అంటూ ఆయన బిగ్గరగా అన్నారు. నేనాయన కంఠం విని దగ్గరికెళ్ళాను. ఆయన నన్ను చూడగానే "దైవప్రవక్త (సల్లం) నిన్ను పిలుస్తున్నారు, పద" అన్నారు. నేను వెంటనే దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "ఇదిగో, ఈ ఒంటెల జతను తీసికెళ్ళు. ఈ జతను కూడా తీసికెళ్ళు. ఇలా మొత్తం ఆరు ఒంటెలు ప్రసాదించారు. వీటిని ఆయన అప్పుడే హజ్రత్ సాద్ (రజి) దగ్గర కొన్నారు - వీటిని నీ స్నేహితుల దగ్గరకు తీసుకెళ్ళి దేవుడు (లేక దైవప్రవక్త అని అన్నారు) ఈ ఒంటెలను మీ స్వారీ కోసం ప్రసాదించాడు. కనుక మీరీ ఒంటెలు ఎక్కి యుద్ధానికి బయలు దేరండి".

నేను ఒంటెలను తీసుకొని నా స్నేహితుల దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాను: "దేవుడు మీ స్వారీ కోసం ఈ ఒంటెలను ప్రసాదించాడు. ఇక మీరు వీటినెక్కి యుద్ధానికి బయలుదేరండి. అయితే మీలో కొందరు నా వెంట బయలుదేరి దైవప్రవక్త(సల్లం)నాతో అన్న మాటలు విన్న వారి దగ్గరకు నడవాలి. నేను మీ దగ్గరకు వచ్చి దైవప్రవక్త (సల్లం) చెప్పని మాటలు మీకు చెబుతున్నానేమోనని మీరు అనుమానించవచ్చు. అందువల్ల మీరిలా చేయాలి, అప్పటి దాకా నాకు తృప్తి ఉండదు; ఈ వ్యవహారం కూడా ముగిసిపోదు."

దీనికి వారు సమాధానమిస్తూ "నీవు చెప్పింది నిజమేనని మాకు నమ్మకం ఉంది (దాన్ని ధృవపరచుకోనవసరం లేదు). సరే కానివ్వు (నువ్వు అడుగుతున్నావు కాబట్టి) నీ కోర్కె ప్రకారమే చేస్తాము" అని అన్నారు. తర్వాత హజ్రత్ అబూమూసా (రజి) వారిలో కొందరిని వెంట బెట్టుకొని దైవప్రవక్త (సల్లం)తో జరిగిన సంభాషణ విన్నవారి దగ్గరకు వెళ్ళారు. దైవప్రవక్త (సల్లం) మొదట

---

★ ఇది హజ్రత్ అబూ మూసా అష్అరి (రజి) గారి మరొక పేరు.

నిరాకరించడం, తర్వాత ఇవ్వడం వగైరా జరిగిన వృత్తాంతమంతా వారికి తెలుసు. కనుక వారు కూడా హజ్రత్ అబూ మూసా (రజి) చెప్పిన విషయాలే తెలియజేశారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 78వ అధ్యాయం - గజ్వతి తబూక్]

1070. హజ్రత్ జహ్‌దమ్ (రజి) కథనం:- మేము హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) దగ్గర కూర్చొని ఉండగా, ఆయన ముందు (కోడిమాంసం ఉన్న) కంచం వచ్చింది. ఆయన దగ్గర బనీ తైముల్లా తెగకు చెందిన ఒక తెల్లవాడు కూర్చొని ఉన్నాడు. చూడటానికి అతను బానిసలా ఉన్నాడు. హజ్రత్ అబూమూసా (రజి) అతడ్ని కూడా తినమని పిలిచారు. అయితే అతను (తినడానికి వెనకాడుతూ) "నేనీ కోడి ఏదో (మాలిన్యం) తింటుంటే చూశాను. అప్పటి నుండి నాకు (కోడిమాంసం అంటే) రోత పుట్టింది. నేను కోడి మాంసం తిననని ప్రమాణం చేశాను" అని అన్నాడు. అప్పుడు హజ్రత్ అబూమూసా ఇలా అన్నారు :

"ప్రమాణం గురించి నీకొక హదీసు విన్పిస్తాను. (ముందు) ఇది తిందువుగాని రా. నేను అష్ అరీ తెగకు చెందిన కొందరు వ్యక్తులతో కలసి ఓ సారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. మేము స్వారీ జంతువులు ఇప్పించమని ఆయన్ని విన్నవించుకున్నాము. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "దైవసాక్షి! నేను మీకు స్వారీ కోసం జంతువుల్ని ఇవ్వలేను. మీ కివ్వడానికి అసలు నా దగ్గర అలాంటి జంతువులే లేవు" అని అన్నారు. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) దగ్గరకు, యుద్ధ సొత్తుకు సంబంధించిన కొన్ని ఒంటెలు వచ్చాయి. అప్పుడు ఆయన "అష్అరీ తెగ మనుషులేరి?" అని మమ్మల్ని గురించి అడిగారు. ఆయన మాకు తెల్లమూపురాలున్న అయిదు ఒంటెలు ఇచ్చేయమని ఆజ్ఞాపించారు. మేము వాటిని తీసుకొని వెళ్తూ 'ఏమిటీ మనం ఇలా చేశాం (ఆయన ప్రమాణం చేశాక కూడా మనం ఆయన దగ్గర ఈ ఒంటెల్ని తీసుకున్నాం)? ఇవి మనకు శుభాల్ని కలిగించవు' అని చెప్పుకున్నాం పరస్పరం. దాంతో మేము ఆయన దగ్గరకు తిరిగి వెళ్ళి "దైవప్రవక్తా! మేము స్వారీ కోసం పశువుల్ని అడిగినపుడు మీరు మొదట్లో ఇవ్వనని ప్రమాణం చేశారు కదా! మీకా విషయం ఆ తర్వాత బహుశా జ్ఞాపకం రాలేదేమో!" అని అన్నాము. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు; "నిజానికి మీకీ స్వారీ జంతువుల్ని నేనివ్వలేదు; దేవుడు ప్రసాదించాడు. పోతే దైవసాక్షిగా చెబుతున్నాను. నేనేదయినా పని చేస్తానని లేదా చేయనని ప్రమాణం చేసినప్పుడల్లా ఆ తర్వాత దానికి వ్యతిరేకంగా చేయడంలో ప్రయోజనం ఉందని భావిస్తే మాత్రం దైవ చిత్తమయితే నేను తప్పకుండా ప్రమాణ భంగం చేసి ఆ పని చేస్తాను. కాకపోతే ప్రమాణ భంగానికి పరిహారం చెల్లించుకుంటాను".★

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖమ్స్, 15వ అధ్యాయం - వమినద్దలీలి అనిల్ ఖుమ్స్ లినవాయ బిల్ ముస్లిమీన్ ]

---

★ ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ హదీసుపై ఇలా వ్యాఖ్యానించారు:- ప్రమాణం చేసిన తరువాత దాన్ని భంగపరచడంలోనే శ్రేయస్సు ఉందని తెలిస్తే భంగపరచాలి. కాకపోతే ప్రమాణ భంగానికి పరిహారం చెల్లించుకోవలసి ఉంటుంది. ప్రమాణ భంగానికి పరిహారం తప్పకుండా చెల్లించాలన్న విషయంలో ధర్మవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది.

1071. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురహ (రజి) కథనం:- ఓ రోజు దైవప్రవక్త (సల్లం) నాకు హితబోధ చేస్తూ ఇలా అన్నారు: "అబ్దుర్రహ్మాన్ బిన్ సమురహ! నీవు ఎన్నడూ పదవిని, నాయకత్వాన్ని కోరుకోకు. నీ కోరిక ప్రకారం పదవీ పాలానాధికారాలు గనక ఇవ్వడం జరిగితే ఆ బాధ్యత పూర్తిగా నీదే అవుతుంది. (దైవ సహాయం పొందే అర్హతను కోల్పోతావు). ఒకవేళ నీవు కోరకుండానే ఆ బాధ్యతా భారం నీపై మోపబడితే మటుకు ఆ బాధ్యతా నిర్వహణలో నీకు దైవ సహాయం లభిస్తుంది. అలాగే నీవు ఏదైనా పని చేస్తానని ప్రమాణం చేసినపుడు ఆ తర్వాత ఆ పనికి వ్యతిరేకంగా మరోపని చేయడంలో శ్రేయస్సు ఉందని భావిస్తే ప్రమాణ భంగం చేసి శ్రేయస్సు ఉన్న ఆ పని చెయ్యి. అయితే ప్రమాణ భంగం చేసినందుకు పరిహారం ఇచ్చుకోవాలి."

[సహీహ్ బుఖారీ : 83వ ప్రకరణం - ఈమాన్ వన్నుజూర్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా, లాయు అఖిజు కుముల్లాహు బిల్లగ్వి ఫీ ఈమానికుమ్]

## 5వ అధ్యాయం - ప్రమాణం చేస్తున్నప్పుడు ఇన్షాఅల్లాహ్ (దైవ చిత్తమయితే) అనాలి

1072. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- హజ్రత్ సులైమాన్ బిన్ దావూద్ (అలైహి) ఓ రోజు (ఒక నిర్ణయం తీసుకుంటూ) "ఈ రోజు రాత్రి నా భార్యలు వంద మందినీ కలుసుకుంటాను. వారందరికీ ఒక్కొక్క పిల్లవాడు పుడ్తాడు. వీరు (పెద్దవారయి) దైవమార్గంలో యుద్ధం చేస్తారు, అవిశ్వాసులతో పోరాడతారు" అని అన్నారు. ఆ సమయంలో ఒక దైవదూత (అశరీరవాణి) "ఇన్షాఅల్లాహ్ (దైవ చిత్తమయితే) అని చెప్పు" అన్నారు. కాని హజ్రత్ సులైమాన్ (అలైహి) ఇన్షాఅల్లాహ్ అని చెప్పడం మరచిపోయారు. తర్వాత ఆయన ఆ రాత్రి తన భార్యలందర్నీ కలుసుకున్నారు. కాని వారిలో ఒక్క భార్యకు తప్ప ఎవరికీ సంతానం కలగలేదు. ఆ భార్య అయినా అర్ధబాలుడ్ని (అసంపూర్ణ పిండాన్ని) మాత్రమే కన్నది.

(ఈ సంఘటనపై) దైవప్రవక్త (సల్లం) (వ్యాఖ్యానిస్తూ) "హజ్రత్ సులైమాన్ (అలైహి) 'ఇన్షాఅల్లాహ్' అని చెప్పి ఉంటే ఆయన కోరిక ఈడేరి ఉండేది. ఆయన లక్ష్యం నెరవేరే అవకాశం ఎక్కువగా ఉండేది" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 67వ ప్రకరణం - నికాహ్, 119వ అధ్యాయం - ఖౌలిర్రజులి లఅతూఫన్నల్లైలత అలానిసాయి]

1073. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- "హజ్రత్ సులైమాన్ బిన్ దావూద్ (అలైహి) ఇలా అన్నారు - "ఈ రోజు రాత్రి నేను నా డెబ్బైమంది భార్యల్ని తప్పకుండా కలుస్తాను. ప్రతి భార్యా ఒక పిల్లవాడ్ని కంటుంది. అతను అశ్వరూఢుడయి దైవమార్గంలో యుద్ధం చేస్తాడు". ఆ సమయంలో ఆయన సహచరుడు "ఇన్షా అల్లాహ్"అని చెప్పు అని అన్నాడు. కాని ఆయన చెప్పలేకపోయారు. తత్ఫలితంగా ఒక భార్య తప్ప ఎవరూ గర్భం దాల్చలేదు. ఆ గర్భిణీ

భార్య అయినా అర్ధ శరీరం అవిటిగా ఉన్న బిడ్డను మాత్రమే కన్నది... సులైమాన్ (అలైహి) గనక ఇన్షాఅల్లాహ్ అని ఉంటే అందరూ దైవమార్గంలో పోరాడేవాళ్ళు (జన్మించి ఉండేవాళ్ళు)" (1)

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 40వ అధ్యాయం - ఖౌలిల్లాహిత ఆలా వ వహబ్నా లిదావూద సులైమాన్]

## 6వ అధ్యాయం - భార్యాపిల్లలకు బాధకలిగే ప్రమాదముంటే ప్రమాణం కోసం పట్టుపట్టరాదు

1074. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "దైవసాక్షిగా చెబుతున్నాను. భార్యాపిల్లల వ్యవహారంలో (వారి బాగోగులు ఖాతరు చేయకుండా) చేసిన ప్రమాణం పట్ల మొండి వైఖరి అవలంబించడం ఘోరమైన పాపం. అలాంటి ప్రమాణాన్ని భంగపరచి దేవుడు నిర్ణయించిన పాప పరిహారం చెల్లించడం కంటే ఆ ప్రమాణాన్ని భంగపరచకుండా దానిపై స్థిరంగా ఉండటమే దేవుని దగ్గర ఎక్కువ పాపానికి కారణభూతమవుతుంది."(2)

[సహీహ్ బుఖారీ : 83వ ప్రకరణం - ఈమాన్ వ నజూర్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహిత ఆలా లా యూఖజుకుమ్]

---

(1) ఈ హదీసు ద్వారా రెండు విషయాలు స్పష్టంగా తెలుస్తున్నాయి. ఒకటి; ముస్లింలు ఏ పని చేయాలనుకున్నా 'ఇన్షాఅల్లాహ్' (దైవచిత్తమయితే) చేస్తానని తప్పకుండా అనాలి. రెండు: ప్రమాణం, ప్రతిజ్ఞలు చేయదలచినపుడు కూడా 'ఇన్షా అల్లాహ్' అని అంటే, ఆ పని నెరవేరకపోయినా ప్రమాణ భంగం కాదు. ప్రమాణం చేసిన తర్వాత 'ఇన్షాఅల్లాహ్' అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

హజ్రత్ తావుస్ (రహ్మాలై), హజ్రత్ హసన్ బస్రీ (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం ప్రమాణం చేసిన సమావేశంలోనే ఇన్షాఅల్లాహ్ అనాలి. హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం ప్రమాణం చేసిన నాలుగు నెలలలోగా ఇన్షాఅల్లాహ్ అనవచ్చు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) అభిప్రాయం ప్రకారం ప్రమాణం చేసిన తర్వాత గుర్తొచ్చినప్పుడు ఎప్పుడైనా ఇన్షాఅల్లాహ్ అనవచ్చు. అదే విధంగా తలాఖ్ (విడాకులు) విషయంలో 'ఇన్షాఅల్లాహ్' తలాఖ్ ఇస్తాను అని అంటే అది తలాఖ్ క్రిందకు రాదు. ఏమైనప్పటికీ భవిష్యత్తుకు సంబంధించిన ఏ వ్యవహారంలో నయినా ఇన్షాఅల్లాహ్ అని నోటితో పలకడం చాలా అవసరం. ఇమామ్ మాలిక్ (రహ్మాలై) దృష్టిలో మాత్రం అలా మనస్సులో సంకల్పించుకుంటే సరిపోతుంది.

(2) సాధారణంగా చేసిన ప్రమాణాన్ని ఎట్టి పరిస్థితుల్లో కూడా భంగపరచకూడదు. అయితే భార్యా పిల్లలకు (బంధుమిత్రులకు కూడా) నష్టం కలిగించే, వారిని కష్టాల్లో పడవేసే ప్రమాణం చేసి ఉంటే మాత్రం దాన్ని భంగపరచడం చాలా అవసరం. అలాంటి ప్రమాణాన్ని భంగపరచకపోతే మనిషి పాపాత్ముడవుతాడు. ఉదాహరణకు, ఎవరైనా తన భార్యతో కలిసి భోజనం చేయనని, ఆమెతో మాట్లాడనని లేక ఇంట్లో వెచ్చాలు తీసుకురానని ప్రమాణం చేసి ఉంటే అలాంటి ప్రమాణాన్ని భంగపరచాలి. కాకపోతే ప్రమాణ భంగానికి పరిహారం మాత్రం చెల్లించుకోవలసి ఉంటుంది. ప్రమాణాన్ని భంగపరిస్తే పాపానికి పాల్పడిన వారయ్యే ప్రమాదం ఉంటే అలాంటి ప్రమాణాన్ని భంగపరచకూడదు. ఉదాహరణకు, ఎవరైనా తన భార్యతో కలసి మద్యం సేవించనని, లేదా జూదమాడనని ప్రమాణం చేసి ఉంటే దాని మీదే స్థిరంగా ఉండాలి. [ఇమామ్ నవవీ (రహ్మాలై)]

## 7వ అధ్యాయం - అవిశ్వాసిగా ఉన్నప్పుడు చేసుకున్న మొక్కుబడిని ముస్లింగా మారిన తర్వాత ఏం చేయాలి?

1075. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం :- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) ఓసారి దైవప్రవక్త (సల్లం)ను "దైవప్రవక్తా! నేను అవిశ్వాసిగా ఉన్నప్పుడు ఓ రోజు 'ఏతెకాఫ్' [1]చేస్తానని మొక్కుబడి చేసుకున్నాను" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "నీ మొక్కుబడిని తీర్చుకో" అని ఆదేశించారు.

హజ్రత్ ఉమర్ (రజి)కు 'హునైన్ యుద్ధ ఖైదీలలో ఇద్దరు మహిళా బానిసలు లభించారు. వాళ్ళిద్దర్ని ఆయన మక్కాలోని ఒక ఇంట్లో వదలిపెట్టారు. తర్వాత దైవప్రవక్త (సల్లం) హునైన్ యుద్ధ ఖైదీలకు ఒక మేలు చేశారు (అంటే వారిని బానిసత్వం నుంచి విముక్తి కలిగించారు). అప్పుడు వారు మక్కా వీధుల్లో పరుగెత్తసాగారు. హజ్రత్ ఉమర్ (రజి) అది చూసి తన కుమారునితో "అబ్దుల్లా! అటు చూడు ఏమిటీ విశేషం?" అని అన్నారు. దానికాయన సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) ఖైదీలకు మేలు చేశారు (వారికి స్వేచ్ఛ ప్రసాదించారు)" అని అన్నారు. "అయితే నువ్వు కూడా వెళ్ళి ఆ ఇద్దరు మహిళా బానిసల్ని కూడా విడుదల చేసెయ్యి" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి).

[సహీహ్ బుఖారీ : 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖమ్స్, 19వ అధ్యాయం - మాకానన్నబీయ్యి (సల్లం) యాతిల్]

## 9వ అధ్యాయం - తన బానిసపై వ్యభిచార నింద మోపిన వాడికి పరలోక శిక్ష

1076. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "తన యాజమాన్యంలో ఉండే అమాయకులయిన (బానిస స్త్రీ లేక పురుషుని)పై వ్యభిచార నింద మోపే వ్యక్తికి ప్రళయ దినాన కొరడా దెబ్బల శిక్ష విధించబడుతుంది. అయితే ఆ బానిసలు వారి యజమాని చెప్పినటువంటివారే అయితే మాత్రం (అతనికి ప్రళయ దినాన శిక్ష పడదు)"[2]

[సహీహ్ బుఖారీ : 86వ ప్రకరణం - హుదూద్, 45వ అధ్యాయం - ఖజ్ఫిల్ అబీద్]

## 10వ అధ్యాయం - బానిసలకు తాను తినేదే పెట్టాలి. వారిపై ఎక్కువ భారం వేయకూడదు

1077. హజ్రత్ మారూర్ బిన్ సువైద్ (రహ్మాలై) కథనం:- ఓ రోజు నాకు హజ్రత్ అబూజర్ (రజి)గారు

(1) దీన్ని గురించి 'సహీహ్ ముస్లిం'లో ఈ విధంగా ఉంది:- హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) అజ్ఞాన కాలంలో కాబా గృహంలో ఒక రోజు ఏతెకాఫ్ (తపోనిష్ఠ) పాటిస్తానని మొక్కుబడి చేసుకున్నారు. మక్కా విజయానంతరం హునైన్ పోరాటం నుండి తిరిగి వస్తూ జారానా అనే ప్రాంతంలో ఆయన దైవప్రవక్త (సల్లం) దగ్గర ఈ విషయాన్ని ప్రస్తావిస్తే, నీ మొక్కుబడిని తీర్చుకో అన్నారు దైవప్రవక్త (సల్లం).

(2) బానిసలపై వ్యభిచార నింద మోపిన యజమానికి ఇహలోకంలో చట్టపరంగా ఎలాంటి శిక్ష లేదు. వ్యభిచార నిందారోపణ తప్పని రుజువయితే న్యాయస్థానం అతడ్ని కేవలం మందలించి వదిలిపెడ్తుంది. పరలోకంలో మాత్రం అతనికి పూర్తి శిక్ష పడుతుంది.

'రబ్జా' అనే ప్రదేశంలో తారసపడ్డారు. అప్పుడాయన, ఆయన బానిస ఒకే విధమైన దుస్తులు ధరించి ఉన్నారు. నేను దానికి కారణం ఏమిటని అడిగితే హజ్రత్ అబూజర్ (రజి) ఇలా సమాధానమిచ్చారు.

"నేనొకసారి ఒక (బానిస) వ్యక్తిని దూషించాను. అతని తల్లి గురించి ప్రస్తావించి సిగ్గు చేటయిన విషయమని అన్నాను. (అతను దీన్ని గురించి దైవప్రవక్త (సల్లం)కు ఫిర్యాదు చేశాడు) అప్పుడు దైవప్రవక్త (సల్లం) నాతో ఇలా అన్నారు:- "అబూజర్! నీవు ఇతడ్ని ఇతని తల్లి పేరెత్తి దూషించావా? నీలో అజ్ఞాన కాలం నాటి అనాగరిక ఛాయలు ఇంకా తొంగి చూస్తున్నాయి. (గుర్తుంచుకో) నీ బానిసలు, సేవకులు కూడా నీ సోదరుల వంటి వారే. కాకపోతే వారిని దేవుడు నీ స్వాధీనంలో ఉంచాడు. మనిషి తన చేతి క్రింద పని చేసే తన సోదరునికి తను తినేటటువంటి తిండే పెట్టాలి. తను ధరించేటటువంటి దుస్తులే ఇవ్వాలి. తన సేవకులపై అతను మోయలేని బరువును వేయకూడదు. అలాంటి కఠినమైన పనేదయినా అప్పగిస్తే ఆ పనిలో అతనికి సహాయపడాలి."

[సహీహ్ బుఖారీ : 2వ ప్రకరణం - ఈమాన్, 22వ అధ్యాయం - అల్ మఆసి మిన్ అమ్రిల్ జాహిలియ్యా]

1078. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "మీలో ఎవరి దగ్గరికైనా అతని సేవకుడు భోజనం తీసుకువస్తే, అతను సేవకుడ్ని తనతో పాటు భోజనానికి కూర్చోబెట్టుకోలేని స్థితిలో ఉంటే (అంటే భోజనం తక్కువగా ఉంటే) అందులో నుంచి రెండు మూడు ముద్దలయినా అతనికి తప్పకుండా పెట్టాలి. ఎందుకంటే అతను అన్నం వండే శ్రమ, పొయ్యి వేడీ భరించాడు".

[సహీహ్ బుఖారీ : 70వ ప్రకరణం - అత్ఇమా, 55వ అధ్యాయం - అల్ అకుల్ మఅల్ ఖాదిమ్]

## 11వ అధ్యాయం - యజమాని శ్రేయస్సు కోరడంతో పాటు ఉత్తమరీతిలో దైవారాధన చేసే బానిస

1079. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "యజమాని శ్రేయస్సు కోరడంతో పాటు, తన (నిజ) ప్రభువుని ఉత్తమ రీతిలో ఆరాధించే బానిసకు రెట్టింపు పుణ్యం లభిస్తుంది."

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 16వ అధ్యాయం - అల్ అబ్ది ఇజా అహ్సన ఇబాదతి రబ్బిహీ]

1080. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "సజ్జనుడు, విశ్వాసపాత్రుడయిన బానిసకు రెండింతలు పుణ్యం లభిస్తుంది. నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను. దైవమార్గంలో జిహాద్, హజ్‌యాత్ర, తల్లిసేవ లాంటి సత్కార్యాలు గనక లేకపోయి ఉంటే నేను బానిసగా చనిపోవడాన్ని కోరుకుంటాను."

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 16వ అధ్యాయం - అల్ అబ్ది ఇజా అహ్సన ఇబాదతి రబ్బిహీ]

1081. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "తన (నిజ) ప్రభువును ఉత్తమరీతిలో ఆరాధించడంతో పాటు, తన యజమాని పట్ల విశ్వాసపాత్రుడయి అతనికి సేవ చేసే వ్యక్తి ఎంత (అదృష్టవంతుడు) ధన్యుడు!"

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ ఇత్ఖ్, 16వ అధ్యాయం - అల్అబ్ది ఇజా అహ్సను ఇబాదతి రబ్బిహీ]

## 12వ అధ్యాయం - ఉమ్మడి బానిసలో తన భాగానికి స్వేచ్ఛ నివ్వడం గురించి

1082. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఎవరైనా ఉమ్మడి యాజమాన్యం క్రింద ఉన్న బానిసకు తన భాగం మేరకు స్వేచ్ఛ నివ్వదలచినపుడు అతని దగ్గర బానిస విమోచనానికి కావలసిన మిగతా ధర అంతపైకం గనక ఉంటే, బానిస ధరను న్యాయవంతంగా నిర్ణయించి ఇతర భాగస్వాములకు రావలసిన మొత్తాన్ని అతనే తన పైకం నుండి చెల్లించి ఆ బానిసకు పూర్తిగా విముక్తి కలిగించాలి. అలా చేయలేకపోతే అతను బానిసకు ఏ మేరకు స్వాతంత్ర్యం ఇస్తాడో ఆ మేరకే ఆ బానిస స్వేచ్ఛాపరుడవుతాడు".

[సహీహ్ బుఖారీ : 49వ ప్రకరణం - అల్ఇత్ఖ్, 4వ అధ్యాయం - ఇజాఇత్ఖి అబ్దమ్ బైనస్ నైన్]

1083. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా అన్నారు:- "ఒకవేళ ఎవరైనా ఉమ్మడి యాజమాన్యం క్రింద ఉన్న బానిసకు తన భాగం మేరకు స్వేచ్ఛనివ్వదలిస్తే అతను తన సంపద నుండి మిగతా ధర కూడా (ఇతర వాటాదారులకు) చెల్లించి ఆ బానిసకు పూర్తిగా విముక్తి కలిగించాలి. అతని దగ్గర అంత పైకం లేకపోతే, బానిస ధరను న్యాయవంతంగా నిర్ణయించి, కూలీనాలీ ద్వారా సంపాదించి మిగతా పైకాన్ని చెల్లించి పూర్తిగా స్వేచ్ఛాపరుడయ్యేందుకు బానిసకు వీలు కల్పించాలి. అయితే ఈ విషయంలో బానిసపై ఎలాంటి ఒత్తిడి తీసుకురాకూడదు."

[సహీహ్ బుఖారీ : 47వ ప్రకరణం - అష్షిరికా - 5వ అధ్యాయం - తఖ్వీముల్ అష్యాయి బైన షుర్కా అబి ఖీమతుల్ అదల్]

## 13వ అధ్యాయం - 'ముదబ్బిర్' బానిసను అమ్మడం ధర్మసమ్మతమే

1084. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- అన్సార్ తెగకు చెందిన ఒక వ్యక్తి తన బానిసను 'ముదబ్బిర్' చేశాడు. (అంటే మరణానంతరం తన బానిసకు స్వేచ్ఛ లభిస్తుందని ప్రకటించాడు) ఆ వ్యక్తి దగ్గర ఆ బానిస తప్ప మరో ఆస్తి లేదు. దైవప్రవక్త (సల్లం)కు ఈ సమాచారం అందగానే ఆయన తన అనుచరులతో "ఈ బానిసను నా నుండి కొనేవారెవరైనా ఉన్నారా మీలో?" అని అన్నారు. అప్పుడు నయీమ్ బిన్ నిహామ్ (రజి) ముందుకు వచ్చి ఆ బానిసను ఎనిమిది వందల దిర్హంలకు కొన్నారు.★

[సహీహ్ బుఖారీ : 84వ ప్రకరణం - కప్ఫారాత్, 7వ అధ్యాయం - ఇత్ఖిల్ ముదబ్బిర్]

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఈ ఉల్లేఖనంలో 'నయీమ్ బిన్ నిహామ్' అని ప్రస్తావించబడిన పేరు తప్పు. సరయిన పేరు నయీమ్ నిహాం. నిహాం అనేది ఆయన బిరుదు, ఆయన తండ్రి పేరు కాదు. ఆయన తండ్రి పేరు అబ్దుల్లా. దీనిక్కారణం మరో ఉల్లేఖనంలో దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు. "నేను స్వర్గంలో ప్రవేశించాను (మేరాజ్ సంఘటన సందర్భంగా) అక్కడ నాకు నయీమ్ స్వరం (నహ్మ) వినిపించింది".

ఇమామ్ షాఫయి (రహ్మలై) దృక్పథం ప్రకారం, యజమాని చనిపోకముందు, ముదబ్బిర్ బానిసలను అమ్మడం ధర్మసమ్మతమే. కాని ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), ఇమామ్ మాలిక్ (రహ్మలై)ల దృక్పథం ప్రకారం ఇలా అమ్మడం సరయిన పద్ధతి కాదు.

# సాక్ష్యాధార ప్రమాణ ప్రకరణం

## 1వ అధ్యాయం - సాక్ష్యాధార ప్రమాణం (ఖసామా) గురించి

1085. అన్సారుల స్వతంత్ర బానిస హజ్రత్ బషీర్ బిన్ యసార్ (రహ్మాలై) కథనం ప్రకారం హజ్రత్ రాఫె బిన్ ఖదీజ్ (రజి), హజ్రత్ సహెల్ బిన్ అబీహష్మ (రజి) ఇలా తెలిపారు:- అబ్దుల్లా బిన్ సహెల్ (రజి), ముహయ్యి బిన్ మస్వూద్ (రజి) కలిసి ( ఓ రోజు) ఖైబర్‌కు వెళ్ళారు. అక్కడ ఒక ఖర్జూరం తోటలో ప్రవేశించి ఇద్దరూ విడిపోయారు (చెరో దిక్కుకుపోయారు). కాస్సేపటికి అబ్దుల్లా బిన్ సహెల్ (రజి)ని ఎవరో హత్య చేశారు. దాంతో అబ్దుర్రహ్మాన్ బిన్ సహల్ (రజి), హువైసా బిన్ మస్వూద్ (రజి), ముహయ్యసా బిన్ మస్వూద్ (రజి)లు కలసి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళారు. అక్కడ తమ సహచరుని (హత్య) గురించి మాట్లాడటం ప్రారంభించారు. వారిలో అందరికన్నా చిన్నవాడైన అబ్దుర్రహ్మాన్ (రజి) సంభాషణ ప్రారంభించారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) "పెద్దవాళ్ళకు పెద్దరికాన్నివ్వు" అని అన్నారు.

(హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన యహ్యా (రహ్మాలై) దైవప్రవక్త (సల్లం) అన్న మాటను వివరిస్తూ "మీలో పెద్దవాడ్ని మాట్లాడనివ్వు అనేదే దైవప్రవక్త (సల్లం) మాటకు అర్థం" అని అన్నారు)

మొత్తానికి వారు తమ సహచరుని గురించి మాట్లాడారు. దైవప్రవక్త (సల్లం) వారి మాటలు విని "సరే మీరు మీ హతుడి విషయంలో (లేక ఆయన (సల్లం) మీ సహచరుని విషయంలో అన్నారు) నష్ట పరిహారం పొందడానికి యాభైసార్లు ప్రమాణం చేయడానికి సిద్ధంగా ఉన్నారా?" అని అడిగారు. దానికి వారు "దైవప్రవక్తా! మేము (ఈ హత్యను) మా కళ్ళతో చూడలేదు కదా! (ప్రమాణం ఎలా చేయగలం?)" అని అన్నారు. "అయితే యూదులే యాభైసార్లు ప్రమాణం చేసి హత్యానింద నుండి బయటపడతారు మరి" అన్నారు దైవప్రవక్త (సల్లం). దానికి వారు "దైవప్రవక్తా! వారు అవిశ్వాసులు (అసత్య ప్రమాణం ఎన్నిసార్లయినా చేస్తారు. వారిని మనం ఎలా నమ్మగలం?)" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తన తరపున వారికి నష్ట పరిహారం చెల్లించారు.★

---

★ ఈ హదీసుపై ఇమామ్ నవవీ (రహ్మాలై) వ్యాఖ్యానిస్తూ ఇలా వ్రాశారు:- ఈ హదీసే 'ఖసామా' అధ్యాయానికి పునాది వంటిది. ఖసామా అనుకూలురైన ధర్మవేత్తలు ఈ హదీసునే ప్రమాణంగా పేర్కొంటారు. ఖసామా (లేక ఖసామత్) వ్యవహారంలో ధర్మవేత్తల మధ్య విభిన్న దృక్పథాలున్నాయి. ఉదాహరణకు, దాని పరిస్థితి ఏమిటి? ఖసామత్ వల్ల ప్రతీకారం (ఖిసాస్) ఉంటుందా లేదా వగైరా. ఇమామ్ మాలిక్ (రహ్మాలై), ఔజాయి (రహ్మాలై), లైస్ (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం ఖసామత్ వల్ల ఖిసాస్ ఉంటుంది. కూఫా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఖసామత్ వల్ల ఖిసాస్ ఉండదు గాని రక్త పరిహారం (దీత్) విధిగా ఉంటుంది. ఇమామ్ షాఫయి (రహ్మాలై) అభిప్రాయం కూడా ఇదే.

సహెల్ (రజి) ఇలా తెలియజేశారు "నేను (నష్ట పరిహారానికి సంబంధించిన) ఆ ఒంటెలలో ఒక్క దాన్ని పట్టుకున్నాను. అయితే అది నన్ను తన్ని పశుశాలలోకి పోయింది".

[సహీహ్ బుఖారీ : 78వ ప్రకరణం - అదబ్, 89వ అధ్యాయం - ఇక్రాముల్ కబీర్]

## 2వ అధ్యాయం - మతభ్రష్టులు, సాయుధ శత్రువుల గురించిన ఆజ్ఞలు

1086. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఉకల్ తెగకు చెందిన ఎనిమిది మంది వ్యక్తులు దైవప్రవక్త (సల్లం) దగ్గరకొచ్చి ఇస్లాం స్వీకరించారు. అయితే ఆ తర్వాత వారికి ఇక్కడి (మదీనా) వాతావరణం అనుకూలించక వ్యాధిగ్రస్తులయిపోయారు. దాంతో వారు దైవప్రవక్త (సల్లం) దగ్గర తమ వ్యాధి గురించిన గోడు వెళ్ళబోసుకున్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ సంగతి విని "మీరు మా పశువుల కాపరి ఉండే చోటుకెళ్ళి, అక్కడ ఒంటెల పాలు, మూత్రం కలిపి త్రాగుతూ★ ఎందుకు ఉండ కూడదు?" అని అన్నారు. దానికి వారు "ఎందుకు ఉండము? మేమందుకు సిద్ధంగా ఉన్నాం" అని అన్నారు.

దాని ప్రకారం వారు ఒంటెల మంద ఉన్న చోటికి వెళ్ళారు. అక్కడ ఒంటెల పాలు, మూత్రం కలిపి త్రాగుతూ ఆరోగ్యవంతులయిపోయారు. అయితే ఆ తర్వాత వారు ఉన్నట్టుండి ఓ రోజు ప్రవక్త పశువుల కాపరిని హతమార్చి ఒంటెలను తోలుకొని పరారైపోయారు. దైవప్రవక్త (సల్లం) ఈ సమాచారం తెలుసుకొని వెంటనే వారిని వెంబడించడానికి ఒక సైనిక దళాన్ని పంపించారు. సైనికులు వాళ్ళను బంధించి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రవేశపెట్టారు. దైవప్రవక్త (సల్లం) (వాళ్ళను శిక్షించమని)

---

పోతే ప్రమాణం ఎవరు చేయాలి? అనే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ మాలిక్ (రహ్మాలై) మరియు అత్యధిక ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం మొదట హతుని వారసులు యాభైసార్లు ప్రమాణం చేయాలి. వారు చేయకపోతే అనుమానమున్న వారి చేత చేయించాలి. కూఫా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం 'ప్రతివాది' ప్రమాణం చేయాలి. ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై), సుఫ్యాన్ సూరీ (రహ్మాలై)ల అభిప్రాయం ప్రకారం శవం ఏదైనా ఊరిలో లేక వాడలో లభించి దానిపై గాయం లేక దెబ్బల గుర్తులు ఉంటే ఖసామత్ ఉంటుంది. శవం మస్జిదులో దొరికితే ఆ పేట ప్రజల మీద అనుమానముంటే వారి చేత ప్రమాణం చేయించాలి. రక్త పరిహారం మాత్రం బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగారం) నుండి ఇప్పించాలి. ఇమామ్ ఔజాయి (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం శవం మీద గాయాలు లేదా దెబ్బల తాలూకు గుర్తులు ఉన్నా లేకపోయినా అది ఏ పేటలో దొరికితే ఆ పేట ప్రజల చేత ప్రమాణం చేయించాలి. ఈ కేసులో హతుని వారసులుగాని, యూదులుగాని ప్రమాణం చేయడానికి ముందుకు రానందువల్ల దైవప్రవక్త (సల్లం) రక్త పరిహారం తన వైపు నుండి చెల్లించారు. ఒక ఉల్లేఖనం ప్రకారం దానంగా వచ్చిన ఒంటెలలో వంద ఒంటెలను రక్త పరిహారం క్రింద ఇచ్చేశారు. ఇలాంటి వ్యవహారంలో డబ్బు ఖర్చుపెట్టే అధికారం ఇమామ్‌కు (నాయకునికి) ఉంటుంది.

★ హలాల్ (ధర్మసమ్మత) పశువుల పేడ మూత్రాలు పరిశుద్ధాలేనని ఇమామ్ మాలిక్, ఇమామ్ అహ్మద్‌లు ఈ హదీసు ద్వారా భావం తీశారు. అయితే ఇతర ఇమాములు మరియు సలఫీ ధర్మవేత్తల దృష్టిలో ఈ ఆజ్ఞ కేవలం వ్యాధి నివారణకే పరిమితం. అయితే వారి దృష్టిలో మత్తు పదార్థాలు తప్ప అపరిశుద్ధ వస్తువులు కూడా అవసరమయితే మందుగా వాడటం ధర్మసమ్మతమే.

ఆజ్ఞ జారీ చేశారు. వారి కాళ్ళు చేతులు నరికి, కళ్ళలో సూదులు కాల్చిపొడవడం జరిగింది. ఆ తరువాత వాళ్ళను చచ్చే దాకా ఎండలో వదిలెయ్యడం జరిగింది.[1]

[సహీహ్ బుఖారీ : 87వ ప్రకరణం - అద్రియాత్, 22వ అధ్యాయం - అల్ ఖసామా]

## 3వ అధ్యాయం - రాళ్ళు, పదునైన పరికరాలు, ఘరేదైనా వస్తువుతో హత్య చేస్తే ప్రతీకారం (ఖిసాస్) ఉంది

1087. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఒక యూదుడు ఒక యువతిపై దౌర్జన్యం చేశాడు. ఆమె నగలు దోచుకొని, (ఒక రాతితో) ఆమె తలను చితగ్గొట్టాడు. యువతి బంధువులు వెంటనే ఆమెను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసికెళ్ళారు. ఆమె కొన ఊపిరితో కొట్టుకుంటూ మాట్లాడలేని స్థితిలో ఉంది. దైవప్రవక్త (సల్లం) (ఆమె వైపు చూస్తూ) "నిన్నెవరు హతమార్చబోయారు?" అని అడిగారు. ఆయన హంతకుడి పేరు కాకుండా మరొకడి పేరు ప్రస్తావించి అడిగారు. దానికి ఆ యువతి అతను కాదని తల అడ్డంగా ఊపింది. దైవప్రవక్త (సల్లం) హంతకుడి పేరు వదిలి వేరొకడి పేరు ప్రస్తావించి మళ్ళీ అడిగారు. దానికీ ఆ యువతి తల అడ్డంగా ఊపుతూ అతను కూడా కాదని చెప్పింది. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) హంతకుడి పేరు ప్రస్తావించి, 'అతను నీపై హత్యాయత్నం చేశాడా?' అని అడిగారు. ఆమె 'ఔనని' తలూపింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞతో ఆ యూదుడి తల రెండు రాళ్ళ మధ్య ఉంచి చితగ్గొట్టడం జరిగింది.[2]

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - తలాఖ్, 24వ అధ్యాయం - అల్ ఇషారతి ఫిత్తలాఖి వల్ ఉమూర్]

---

(1) ఈ హదీసు ఖుర్‌ఆన్‌లో మాయిదా సూరాలోని 33వ సూక్తికి క్రియాత్మక వ్యాఖ్యానం. ఇమామ్ మాలిక్ (రహ్మలై) దృష్టిలో ఈ సూక్తిలో పేర్కొన్న మరణశిక్ష, ఉరిశిక్ష, కాళ్ళు చేతులు నరకడం, జైల్లో వేయడం వంటి శిక్షల్లో ఏదైనా అమలు చేయవచ్చు. అంటే పరిస్థితులు గమనించి వాటి ప్రకారం న్యాయమూర్తి తాను సముచితమని భావించిన శిక్షను వేయవచ్చు. అతనికాధికారం ఉంది. అయితే హత్య జరిగినపుడు మాత్రం హంతకుడ్ని హతమార్చవలసినదే. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), అబూ ముస్అబ్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం అన్ని పరిస్థితుల్లోనూ న్యాయమూర్తికి అధికారాలు ఉన్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇతర ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం, నిందితుడు ధనం దోపిడి చేయకుండా హత్య మాత్రమే చేస్తే, అతడ్ని హతమార్చాలి. హత్యతో పాటు దోపిడీ కూడా చేస్తే అతడ్ని హతమార్చి ఉరితీయాలి. ధనం మాత్రమే దోపిడీ చేస్తే అతని కాళ్ళు చేతులు నరికివేయాలి. బెదిరించడం మాత్రమే చేస్తే అతడ్ని మందలించి వదిలిపెట్టాలి.

ఈ హదీసులో కళ్ళు పొడవడం గురించి కూడా ఉంది. అవయవాలు కోయడం నిషేధించక ముందు ఈ సంఘటన జరిగిందని కొందరు ధర్మవేత్తల అభిప్రాయం. ఇప్పుడు ఇలా శిక్షించడానికి వీల్లేదు. కాని మరికొందరు ధర్మవేత్తలు ఈ శిక్ష రద్దుకాలేదని, పశువుల కాపరిని వాళ్ళు ఈ విధంగానే హింసించి హత్య చేయడం వల్ల దైవప్రవక్త (సల్లం) కావాలనే వారికి ఇలాంటి శిక్ష విధించారని చెబుతారు.

(2) ఈ హదీసు ద్వారా అనేక విషయాలు తెలుస్తున్నాయి.

(1) స్త్రీని హత్య చేసినది పురుష హంతకుడైనా అతడ్ని హతమార్చవచ్చు. (2) హంతకుడు ఏ విధంగా హత్య చేస్తే అతడ్ని ఆ విధంగానే హతమార్చాలి. ఉదాహరణకు - హంతకుడు కత్తితో హత్య చేస్తే అతడ్ని కత్తితో, కర్రతో కొట్టి చంపితే కర్రతో, రాతితో హత్య చేస్తే రాతితోనే హతమార్చాలి. ఈ విషయంలో ఇమామ్ అబూహనీఫా (రహ్మలై) దృక్పథం వేరుగా ఉంది. హత్యా ప్రతీకారం (ఖిసాస్) కత్తితోనే చేయాలన్నది ఆయన దృక్పథం. (3) బండరాయి, దుడ్డు కర్ర వంటి బరువైన వస్తువులతో కూడా హంతకుడ్ని

## 4వ అధ్యాయం - దాడి జరిగినపుడు ఆత్మరక్షణ కోసం ప్రత్యర్థిని చంపడం నేరం కాదు

1088. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హసీన్ (రజి) కథనం:- ఒక వ్యక్తి మరొక వ్యక్తి చేతిని (పట్టుకొని) పళ్ళతో కొరికాడు. ఆ సందర్భంలో రెండవ వ్యక్తి తన చేతిని అతని నోటి నుండి విడిపించుకోవడానికి వెనక్కి లాక్కున్నాడు. అప్పుడు అతని (కొరికిన వ్యక్తి) ముందరి పళ్ళు నాలుగు ఊడి క్రింద పడిపోయాయి. ఆ తరువాత వాళ్ళిద్దరూ ఈ తగాదాను దైవప్రవక్త (సల్లం) దగ్గరకు తీసికెళ్ళారు. దైవప్రవక్త (సల్లం) (వారి ఫిర్యాదులు విని) "ఎవరైనా తన సోదరుడ్ని ఒంటె కొరికినట్లు పళ్ళతో కొరుకుతాడా?" అని అన్నారు. (తరువాత ఆయన కొరికిన వ్యక్తిని ఉద్దేశించి) "నీకు నష్టపరిహారం దొరకదు" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 87వ ప్రకరణం - దియాత్, 18వ అధ్యాయం - ఇజా అజ్జరజులన్ ఫవఖాత్ సనాయా]

1089. హజ్రత్ యాలా బిన్ ఉమయ్యా (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో కలసి తబూక్ పోరాటంలో పాల్గొన్నాను. నేనిప్పటివరకు చేసిన సత్కార్యాలన్నిటికంటే ఈ యాత్రలో పాల్గొనడం నాకెంతో తృప్తికి కారణభూతమయింది - సరే, నాకొక సేవకుడుండేవాడు. అతను మరొక వ్యక్తితో పోట్లాటకు దిగాడు. వారిలో ఒకతను మరొకని చేతి వ్రేలిని లాక్కొని కొరికాడు. రెండవతను తన చేతిని విడిపించుకోవడానికి వెనక్కి లాక్కున్నాడు. అప్పుడు కొరికినవాడి ముందరి పళ్ళు నాలుగు ఊడి వచ్చాయి. తర్వాత వాళ్ళిద్దరూ (ఫిర్యాదు చేయడానికి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళారు. దైవప్రవక్త (సల్లం) అతని ఊడివచ్చిన పళ్ళకు ఎలాంటి నష్టపరిహారం ఇప్పించలేదు. "నీ నోట్లో అతను తన చేతి వ్రేలిని ఉంచనిస్తే నీవు దాన్ని నములాదమనుకుంటున్నావా?" అని అన్నారు ఆయన.

---

హతమార్చవచ్చు. ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇమామ్ అహ్మద్ (రహ్మలై), ఇమామ్ మాలిక్ (రహ్మలై), ఇతర అత్యధిక ధర్మవేత్తల అభిప్రాయం ఇదే. అయితే ఇమామ్ అబూహనీఫా (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఆయుధం ఇనుపదయినా, రాతిదయినా, కట్టెదయినా పదునైనదయినదిగా ఉండాలి. లేదా హతమార్చడానికి తయారు చేయబడిన ఆయుధంతో హతమార్చాలి. హంతకుడు హత్య చేసే ఉద్దేశ్యంతో చిన్న కర్రతో గాని, కొరడాతో గాని, చేతిదెబ్బలతో గాని, లేక మరేదైనా చిన్న వస్తువుతో చంపినా అది ఉద్దేశ్యపూర్వక హత్య క్రిందకే వస్తుంది. ఇమామ్ మాలిక్ (రహ్మలై), లైస్ (రహ్మలై)ల అభిప్రాయం ప్రకారం ఇలాంటి హంతకుడికి ప్రతీకారం (ఖిసాస్) చేయడం విధి (వాజిబ్) అవుతుంది. కాని ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), ఇమామ్ అహ్మద్ (రహ్మలై), ఔజాయి (రహ్మలై), సుఫ్యాన్ సూరి (రహ్మలై), ఇస్హాఖ్ (రహ్మలై), అబూసౌర్ (రహ్మలై)ల అభిప్రాయం ప్రకారం ఇలాంటి హత్యకు ప్రతీకారం లేదు. (4) ముస్లింను ఎవరు హత్య చేసినా అతడ్ని హతమార్చవలసిందే. (5) కొన ఊపిరితో కొట్టుమిట్టాడే హతుని నుండి వాంగ్మూలం తీసుకోవడం, హంతకుడి విషయాన్ని అడిగి రాబట్టడం చాలా అవసరం. హంతకుడు కూడా నేరాన్ని ఒప్పుకుంటే హత్య రుజువయిపోతుంది. ఒకవేళ అతను నిరాకరిస్తే అతని చేత ప్రమాణం చేయించాలి. ప్రమాణం చేస్తే అతని బాధ్యత తీరిపోతుంది. కొన ఊపిరితో ఉన్న హతుడు చెప్పినంత మాత్రాన హత్య రుజువు కాదు. అత్యధిక మంది ధర్మవేత్తలు ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. అయితే ఇమామ్ మాలిక్ (రహ్మలై) ఈ హదీసును ఆధారంగా చూపుతూ, కేవలం హతుడి వాంగ్మూలం వల్ల హత్య రుజువవుతుందని అభిప్రాయపడ్డారు. కాని ఈ హదీసుకు సంబంధించిన మరొక ఉల్లేఖనంలో ఆ యూదుడు హత్యానేరాన్ని అంగీకరించినట్లు ఉంది గనక ఇమామ్ మాలిక్ (రహ్మలై) గారి ప్రమాణం సమంజసంగా లేదు. - ఇమామ్ నవవీ (రహ్మలై)

హదీసు ఉల్లేఖకుడు ఈ సందర్భంలో "దైవప్రవక్త(సల్లం) 'ఒంటె నమిలినట్లు' అని కూడా అన్నారనుకుంటాను" అని అభిప్రాయపడ్డారు.

[సహీహ్ బుఖారీ : 37వ ప్రకరణం - ఇజారా, 5వ అధ్యాయం - అల్ అజీరి ఫిల్‌గజ్వి]

## 5వ అధ్యాయం - పళ్ళు, అలాంటివే ఇతర అవయవాలకు సంబంధించిన ప్రతీకారం (ఖిసాస్)

1090. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ రబీ (రజి) అనే మహిళ ఒక అన్సారీ యువతి ముందరి పళ్ళు నాల్గింటిని ఊడగొట్టారు. ఆ స్త్రీ తరపు వాళ్ళు ఖిసాస్ (ప్రతీకారం) జరగాలని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి ఫిర్యాదు చేశారు. దైవప్రవక్త (సల్లం) ఖిసాస్ ఆజ్ఞ జారీ చేశారు. అప్పుడు హజ్రత్ అనస్ బిన్ నజర్ (రజి) జోక్యం చేసుకుంటూ "దైవసాక్షిగా చెబుతున్నాను, దైవప్రవక్తా! ఈమె పళ్ళను ఊడగొట్టడం జరగదు" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) (ఆశ్చర్యం వెలిబుచ్చుతూ) "అనస్! ఖిసాస్ నిర్ణయం దైవగ్రంథంలోనిది. (నువ్వలా అంటావేమిటి?)" అని అన్నారు. ఆ తర్వాత వారు (పీడితురాలి బంధువులు) నిందితురాలిని క్షమించి నష్టపరిహారం తీసుకోవడానికి ఒప్పుకున్నారు. దీనిపై దైవప్రవక్త (సల్లం) వ్యాఖ్యానిస్తూ "నిస్సందేహంగా దేవుని దాసుల్లో కొందరు ప్రత్యేక దాసులు ఉన్నారు. వారు దేవుని (అనుగ్రహాన్ని) నమ్ముకొని ప్రమాణం చేసినపుడు దేవుడు వారి ప్రమాణాన్ని నిజం చేస్తాడు" అని అన్నారు.★

[సహీహ్ బుఖారీ : 68వ ప్రకరణం - అత్తఫ్సీర్, 6వ అధ్యాయం - అల్‌మాయిదా సూరా]

## 6వ అధ్యాయం - ముస్లిం రక్తాన్ని (మరణశిక్షను) ధర్మసమ్మతం చేసే విషయాలు

1091. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- 'లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్' (అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ముహమ్మద్ (సల్లం) దేవుని ప్రవక్త) అని సాక్ష్యమిచ్చిన ఏ ముస్లింని కూడా చంపడం ధర్మసమ్మతం కాదు. అయితే మూడు కారణాలలో ఏదైనా ఒక కారణం మీద చంపవచ్చు. (ఒకటి) (అతను ఎవరినైనా హత్య చేస్తే) ప్రాణానికి బదులు ప్రాణం తీసే చట్టాన్ని అతని విషయంలో అమలు పరచడం జరుగుతుంది. (రెండు) లేదా వివాహితుడై ఉండి కూడా వ్యభిచారానికి పాల్పడినపుడు. (మూడు)

---

★ హజ్రత్ అనస్ బిన్ నజర్ (రజి) ప్రమాణం చేసి అలా అన్నారంటే దానర్థం దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞను త్రోసిపుచ్చడం ఎంత మాత్రం కాదు. క్షతగాత్రురాలి బంధువులు నష్టపరిహారం తీసుకొని వదిలిపెట్టేందుకు మీరు సిఫారసు చేయండని ఆయన బహుశా దైవప్రవక్త (సల్లం)ను కోరి ఉండవచ్చు. ఆయన దేవుని సహాయం మీద నమ్మకముంచి ప్రమాణం చేశారు గనుక దేవుడు దాన్ని నిజపరచి చూపాడు.

లేదా ధర్మాన్ని వదిలిపెట్టి (మతభ్రష్టుడయిపోయి) ముస్లిం సమాజం నుండి విడిపోయినపుడు."★

[సహీహ్ బుఖారీ : 87వ ప్రకరణం - దియాత్, 6వ అధ్యాయం - ఖౌలిల్లాహిత ఆలా ఇన్ననన్నఫ్స బిన్నఫ్సి]

## 7వ అధ్యాయం - మానవ హత్యకు శ్రీకారం చుట్టినవాడి పాపం తీవ్రత

1092. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఏ మనిషయినా హత్య చేయబడినప్పుడల్లా అతని రక్తానికి (హత్యకు) వహించబడే బాధ్యతలో ఒక భాగం ఆదం తొలిపుత్రుని (ఖాబీల్) పై పడుతుంది. దానిక్కారణం ఇతను (మానవ) హత్యను ప్రారంభించిన తొలి వ్యక్తి కావడమే".

[సహీహ్ బుఖారీ : 60వ ప్రకరణం - అంబియా, 1వ అధ్యాయం -ఖల్ఖి ఆదమ సలవాతుల్లాహి అలైహి వ జుర్రియ్యతిహీ]

## 8వ అధ్యాయం - ప్రళయదినాన మొట్టమొదట హత్యా కేసుల గురించే తీర్పు జరుగుతుంది

1093. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- "ప్రళయ దినాన మొట్ట మొదట ప్రజల మధ్య హత్యా వ్యాజ్యాలను గురించే తీర్పు జరుగు తుంది".

[సహీహ్ బుఖారీ : 81వ ప్రకరణం - రిఖాఖ్, 48వ అధ్యాయం - అల్ ఖిసాసి యౌముల్ ఖియామా]

## 9వ అధ్యాయం - మానవుని ధనమానప్రాణాల గౌరవాన్ని కాపాడాలి

1094. హజ్రత్ అబూ బక్రా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి ఈ విధంగా ప్రవచించారు - "కాలచక్రం తిరుగుతూ తిరుగుతూ చివరికి దేవుడు భూమ్యాకాశాలను సృష్టించిన నాటి స్థితికే ఈనాడు చేరుకుంది. సంవత్సరంలోని పన్నెండు నెలల్లో నాలుగు నెలలు నిషిద్ధ (పవిత్ర) మాసాలు. మూడు

---

★ ఈ హదీసుపై ఇమామ్ నవవీ (రహ్మాలై) వ్యాఖ్యానిస్తూ ఇలా రాశారు:- హనఫీ ధర్మవేత్తలు ఈ హదీసును ప్రమాణంగా తీసుకొని, జిమ్మీ (ఇస్లామీయ రాజ్యంలోని ముస్లిమేతర పౌరుడు)కి బదులుగా ముస్లిం హంతకుడికి మరణశిక్ష విధించవచ్చని, అలాగే బానిసకు బదులుగా స్వతంత్రుడ్ని హతమార్చవచ్చని అభిప్రాయపడ్డారు. అయితే ఇమామ్ మాలిక్ (రహ్మాలై), ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ అహ్మద్ (రహ్మాలై), లైస్ (రహ్మాలై)లు ఈ అభిప్రాయంతో విభేదించారు. వీరి అభిప్రాయం ప్రకారం, ధర్మాన్ని వదిలివెళ్ళడం అంటే ధర్మభ్రష్టుడయిపోవడం అని అర్థం. మతభ్రష్టుడు పశ్చాత్తాపం చెంది సన్మార్గంలోకి తిరిగి రాకపోతే మరణశిక్ష విధించాలి. అలాగే రాజవిద్రోహానికి పాల్పడినవారు, ధర్మంలో లేని విషయాలను ధర్మాంశాలుగా పరిగణించి అవలంబించినవారు కూడా ఈ ఆజ్ఞా పరిధిలోకే వస్తారు. 'ప్రాణానికి బదులు ప్రాణం' అనే చట్టాన్ని అనుసరించి హతుని వారసులకు మాత్రమే హంతకుడ్ని హతమార్చే అధికారం ఉంది. వేరే వ్యక్తి హంతకుడ్ని చంపితే అతడ్ని ప్రతీకారంగా చంపవలసి ఉంటుంది. వివాహిత అంటే వివాహమైన పురుషుడు కావచ్చు, స్త్రీ కావచ్చు. వ్యభిచార నేరానికి శిలాశిక్ష ఉంటుంది. అలాంటి వ్యభిచారిని రాజ్యాధిపతి మాత్రమే హతమార్చవలసి ఉంటుంది.

నెలలు ఒకదాని తర్వాత మరొకటి వరుసగా వచ్చే మాసాలు. (1) జీఖఅద, (2) జిల్‌హజ్, (3) ముహర్రం, నాల్గవది ముజర్ తెగ వారి రజబ్ నెల. ఇది జమాదివుల్ ఆఖిర్, షాబాన్‌లకు మధ్య వస్తుంది".

ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) "ఇది ఏ నెలా?" అని అడిగారు. మేము "దేవునికి, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అన్నాము. ఇది విని దైవప్రవక్త (సల్లం) చాలా సేపు మౌనంగా ఉండిపోయారు. చివరికి మాకు ఆయన ఈ నెలకు కొత్త పేరేదయినా పెడ్తారేమోనని అనుమానం వచ్చింది. తర్వాత ఆయన "ఇది జిల్‌హజ్ నెల కదూ?" అని అన్నారు. మేము "ఔను ఇది జిల్‌హజ్ నెలే" అన్నాము. "సరే, ఇది ఏ పట్టణం?" అని అడిగారు ఆయన మళ్ళీ. మేము "దేవునికి, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అన్నాము. ఆయన తిరిగి చాలా సేపు మౌనం వహించారు. ఆయన మౌనం చూసి ఈ పట్టణానికి ఆయన కొత్త పేరేదయినా ప్రతిపాదిస్తారేమోనని మాకు అనుమానం వచ్చింది. చివరికి దైవప్రవక్త (సల్లం) "ఇది బలదతుల్ అమీన్ (మక్కా పట్టణం) కాదా?" అని అన్నారు. మేము "ఔను, నిజమే" అన్నాము. ఆ తరువాత ఆయన "ఈ రోజు ఏం వారం?" అని అడిగారు మళ్ళీ. మేము "దేవునికి, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అన్నాము. ఇది విని తిరిగి ఆయన మౌనముద్ర దాల్చారు. అలా ఆయన చాలాసేపు మౌనంగా ఉండిపోవడం చూసి ఈనాటి రోజుకు ఆయన మరేదైనా పేరు పెడ్తారేమోనని మాకు అనుమానం కలిగింది. అయితే ఆయన "ఈ రోజు యౌమున్నహ్ర్ (బలిదినం) కాదా?" అన్నారు. మేము "ఔను, నిజమే" అన్నాము.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు: "అయితే గుర్తుంచుకోండి! ఈ రోజు, ఈ పట్టణం పవిత్రమైన ఈ నెలలో ఎంత పునీతం, గౌరవ ప్రదమయినదో మీ రక్తం (ప్రాణం), మీ ధనసంపద, (మరో ఉల్లేఖకుని కథనం ప్రకారం) మీ మానమర్యాదలు కూడా అంతే పునీతం, గౌరవప్రదమయినవి. వినండి! త్వరలోనే మీరు మీ ప్రభువు సమక్షంలో హాజరు కావలసి ఉంది. ఆయన మిమ్మల్ని మీ కర్మలను గురించి నిలదీస్తాడు. కనుక గుర్తుంచుకోండి. నా (మరణం) తరువాత మీరు పరస్పరం పోట్లాడుకొని, ఒకరి మెడలు ఒకరు నరుక్కుంటూ మార్గభ్రష్టులు కాకండి. వినండి, ఇక్కడ హాజరయిన వాళ్ళు ఈ ఆజ్ఞలను ఇక్కడకు రానివారికి తప్పకుండా అందజేయాలి. ఎందుకంటే ఇక్కడకు రానివారిలో ఎవరైనా (ఒకరిద్దరు) ఈ ఆజ్ఞల్ని ఇక్కడకు వచ్చి నా మాటలు వింటున్న వారికంటే ఎక్కువ జ్ఞాపక శక్తి కలవారు, విషయం అర్థం చేసుకోగలిగేవారు ఉండవచ్చు. (ఈ హదీసు ఉల్లేఖకులలో ఒకరైన ముహమ్మద్ (రహ్మాలై) గారు ఈ సంగతి ప్రస్తావించినప్పుడల్లా "ముహమ్మద్ ప్రవక్త (సల్లం) నిజం చెప్పారు" అని అనేవారు) - సరే, నేను మీకు దైవాజ్ఞలను (పూర్తిగా) అంద జేశానా?"★

---

★ ఈ నాలుగు నిషిద్ధమాసాలు అనాగరిక (అజ్ఞాన) కాలంలో కూడా పవిత్రమైన నెలలుగా పరిగణించబడుతుండేవి. అయితే మక్కా బహు దైవారాధకులు యుద్ధం చేయవలసి వచ్చినపుడు ఏదో వంకతో ఈ మాసాలను మార్చివేసేవారు. ఉదాహరణకు, ముహర్రం నెలలో యుద్ధం చేయవలసివస్తే ఆ తర్వాత వచ్చే సఫర్ నెలనో లేదా మరో నెలనో నిషిద్ధ (పవిత్ర) మాసంగా నిర్ణయించేవారు.

దైవప్రవక్త (సల్లం) ఈ చివరి పలుకుల్ని రెండుసార్లు ఉచ్ఛరించారు.

[సహీహ్ బుఖారీ : 64వ ప్రకరణం - మగాజి, 77వ అధ్యాయం - హజ్జతుల్ విదా]

## 11వ అధ్యాయం - గర్భస్థ శిశువుకు సంబంధించిన రక్త పరిహారం చెల్లింపు గురించి

1095. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- హుజైల్ తెగకు చెందిన ఇద్దరు స్త్రీలు పరస్పరం పోట్లాడుకున్నారు. వారిద్దరిలో ఒకామె (గర్భవతి అయిన) రెండో ఆమెపైకి ఒక రాయి విసిరికొట్టింది. అది కాస్తా ఆమె కడుపుకు తగిలి, కడుపులోని పిల్లవాడు చచ్చిపోయాడు. ఈ వ్యవహారం దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చింది. దైవప్రవక్త (సల్లం) దానిపై తీర్పిస్తూ "పిల్లో, పిల్లాడో ఏదైనా సరే ఈ శిశువుకు సంబంధించి రక్తపరిహారంగా ఒక బానిసను గాని లేదా బానిసరాలిని గాని (హంతకురాలి తరపున) ఇచ్చుకోవాలి" అని అన్నారు.

నిందితురాలి భర్త ఈ తీర్పు విని "దైవప్రవక్తా! ఈ శిశువు ఇంకా ఏదీ తిననయినా తినలేదు, త్రాగనయినా త్రాగలేదు, మాట్లాడే, కేరింతలు పెట్టే శక్తి కూడా పుంజుకోలేదు. ఇలాంటి శిశువు విషయంలో నేను రక్తపరిహారం ఎలా చెల్లించను? అసలిలాంటి రక్త పరిహారమే వ్యర్థం" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) అతని మాటలు విని "ఇతను తప్పకుండా ఏ జ్యోతిష్కుడో అయి ఉంటాడు".★ అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 76వ ప్రకరణం - తిబ్, 46వ అధ్యాయం - అల్ కహానా]

---

ఈ విధంగా వారు అసలు నిషిద్ధమాసమేదో తెలియకుండా కలగాపులగం చేస్తూ దేవుని ఆజ్ఞలను అవహేళన చేసేవారు. దైవప్రవక్త (సల్లం) 'వీడ్కోలు హజ్' యాత్ర జరిపినపుడు 'జిల్‌హజ్' నెల రెండు లెక్కల ప్రకారం, అంటే అసలు లెక్క ప్రకారం, బహుదైవారాధకుల బూటకపు లెక్క ప్రకారం కూడా కచ్చితంగా, సరిగ్గా ఉండింది. అందువల్లనే దైవప్రవక్త (సల్లం) హజ్ సీజన్‌లో అర్ఫాదినాన (పదో తేదీన) వేలాది జనం ముందు ప్రసంగిస్తూ, కాలచక్రం తిరుగుతూ తిరుగుతూ తన అసలు స్థానానికి (లెక్కకు) చేరుకుందని, ఇకముందు ఎవరూ ఈ గణిత క్రమాన్ని మార్చకూడదని అన్నారు.

అయన ఈ సందర్భంలో 'ముజర్ తెగవారి రజబ్ నెల' అనడానికి కారణం, పూర్వకాలం బూటకపు లెక్క ప్రకారం ఆ తెగవారి 'రజబ్‌నెల' జమాదివుస్సాని, షాబాన్ నెలల మధ్య వస్తుండేది. అలాగే మరో తెగవారి 'రజబ్‌నెల' రమజాన్ నెలలో వస్తుండేది. అంటే వారు రమజాన్ నెలను రజబ్ నెలగా పరిగణిస్తుండేవారు. అందువల్ల ముజర్ తెగవారి రజబ్ నెలే అసలైన రజబ్‌నెల అని చెప్పి దైవప్రవక్త (సల్లం) నెలల అసలు క్రమాన్ని నిర్ణయించారు.

★ ఈ హదీసులో నిందితురాలి భర్త ధర్మశాస్త్ర ఆదేశాన్ని అధర్మమైనదిగా, అన్యాయమైనదిగా పరిగణిస్తూ మాట్లాడినందువల్లనే దైవప్రవక్త (సల్లం) అతడ్ని ఆక్షేపించారని ధర్మవేత్తలు వ్యాఖ్యానించారు. అతను ఎంతో చాతుర్యంతో నిర్భయంగా నిస్సంకోచంగా అసత్య విషయాన్ని సత్య విషయమనిపించేలా మాట్లాడగలిగాడంటే అతను తప్పకుండా జ్యోతిష్కుడే అయి ఉంటాడు. జోస్యులు తప్ప మరెవరూ ఈ విధంగా మాట్లాడలేరు. గనక దైవప్రవక్త (సల్లం) అతడ్ని తీవ్రంగా ఆక్షేపించారని మరికొందరు ధర్మవేత్తలు అభిప్రాయపడ్డారు.

ఇస్లామీయ ధర్మశాస్త్రం ప్రకారం ఇలాంటి అభూత కల్పనలు, అసహజమైన మాటలు నిషిద్ధం, పాప పంకిలంలో పడవేసే విషయాలు. అయితే ప్రవక్త ప్రవచనాల్లో ప్రస్తావించబడిన విధంగా నేర్పుతో వాక్చాతుర్యంతో మాట్లాడడంలో ఎలాంటి తప్పులేదు.

1096. హజ్రత్ ముగైరా బిన్ షాబా(రజి), హజ్రత్ ముహమ్మద్ బిన్ ముస్లమా(రజి)ల కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) వీరిద్దరు మహనీయుల్ని సంప్రదిస్తూ స్త్రీ కడుపులోని పిల్లవాడు(ఎవరైనా కొట్టడం వల్ల) గర్భస్రావమై చచ్చిపోతే దానికి సంబంధించిన రక్త పరిహారం ఏమిటి? అని అడిగారు. హజ్రత్ ముగైరా (రజి) దానికి సమాధానమిస్తూ "ఒక బానిసను గాని లేదా బానిసరాలిని గాని ఇచ్చుకోవాలని దైవప్రవక్త (సల్లం) తీర్పిచ్చారు" అని చెప్పారు. దానికి హజ్రత్ ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) సాక్ష్యమిస్తూ "దైవప్రవక్త (సల్లం) ఈ తీర్పిచ్చేటప్పుడు నేను అక్కడ ఉన్నాను" అని అన్నారు.

[సహీహ్ బుఖారీ : 87వ ప్రకరణం - దియాత్, 25వ అధ్యాయం - జనీనుల్ మర్అత్ ]

---

★ ఈ హదీసు గురించి ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా వ్యాఖ్యానించారు:- ఆడపిల్లయినా, మగపిల్లోడయినా మాతృగర్భంలో ప్రాణం కోల్పోయి బయటికి వస్తే దోషి రక్తపరిహారం చెల్లించుకోవలసి ఉంటుంది. సజీవంగా బయటికి వచ్చి ఆ తర్వాత (అదే దెబ్బ వల్ల) చనిపోయిన పక్షంలో మగదోషి నుండి పూర్తి రక్తపరిహారం, అంటే వంద ఒంటెలు, ఆడదోషి నుండి అర్ధరక్తపరిహారం, అంటే యాభై ఒంటెలు తప్పనిసరిగా వసూలు చేయాలి.

అయితే ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), కూఫా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఈ రక్తపరిహారం నేరస్తుడి నుండి గాకుండా అతని తండ్రి వైపు బంధువుల నుండి వసూలు చేయాలి. ఇమామ్ మాలిక్ (రహ్మలై), బస్రా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం రక్తపరిహారం నేరస్తుడి నుండే వసూలు చేయాలి. ఇమామ్ షాఫయి (రహ్మలై) ప్రకారం నేరస్తుడు రక్త పరిహారంతో పాటు పాపపరిహారం కూడా చెల్లించాలి. అయితే ఇమామ్ మాలిక్ (రహ్మలై), ఇమామ్ అబూహనీఫా (రహ్మలై)ల అభిప్రాయం ప్రకారం పాపపరిహారం చెల్లించనవసరం లేదు.

